# ఇండియాలోని నర్సులకొఱకైన పాఠపుస్తకము

మద్రాసు, 1945

Record no. 82

## Bibliographic Record Target

ఇండియాలోని నర్సులకొఱకైన పాఠపుస్తకము / ఎడిటర్ మిస్ సిగ్రెడ్ జాన్ సన్ ; అనువాదము ఎం. జె. ప్రకాశము. - మద్రాసు : Society for Christian Literature, 1945.

viii, 538 p. ;20 cm.

Record no. 82

Iṃḍiyālōni Narsulakoṟakaina Pāṭhapustakamu / eḍiṭar Mis Sigreḍ Jān san ; anuvādamu Eṃ. Je. Prakāśamu. - Madrāsu : Society for Christian Literature, 1945.

viii, 538 p. ;20 cm.

Record no. 82

# ఇండియాలోని నర్సులకొఱకైన పాఠపుస్తకము

# A TEXT-BOOK FOR NURSES IN INDIA

ఇండియాలోని క్రిస్టియన్ మెడికల్ అసోసియేషన్,
దక్షిణ యిండియాశాఖ, నర్సుల ఆక్సిలరీకమిటీవారి అధిపత్యమున
ప్రచురింపబడినది.

ఎడిటర్
మిస్. సిగ్రిడ్ సి. జాక్సన్

అనువాదము

**TRANSLATION**

ఈ గ్రంథము నాంగ్లమునుండి ఆంధ్రమునకు, మద్రాసు క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీలో తెలుగు ఎడిటర్ గానున్న రెవ. ఎం. జె. ప్రకాశముగారు, బి. ఏ., బియిడి, నూ చేసిరి. మిస్ సిగ్రిడ్ సి. జాక్సన్, ఎం. ఏ. ఆర్. ఎన్. గారును, మిసెస్ జి. కేటి ల్, ఆర్. ఎన్. గారును, డి. శేషయ్యశాస్త్రులుగారును, ఆ యనువాదప్రతిని సవరించి ప్రూఫులు [illegible]టకు సహాయముచేసిరి. రెవ. టి. వాత్స్ గారును, రెవ. పట్టాభి ప్రసంగి ను తగు సలహాలనిచ్చియు ప్రూఫులు దిద్దియు తోడ్పడిరి. కాన వీరలందరికి మా వందనములు చెల్లించుచున్నాము.



Rs 1 6P 00

LITERATURE SOCIETY FOR INDIA
(SOCIETY FOR CHRISTIAN LITERATURE)
MADRAS BANGALORE BEZWADA COLOMBO

## అంకితము

## DEDICATION

ఇండియాలో నర్సింగ్ కళను ఉచ్ఛస్థితికి తెచ్చుటకు
ప్రయాసముతో పునాదివేసిన నర్సులందరికీ
ఈ పుస్తకము అంకితము చేయబడినది

## గీతములు

ఆశ్రయముకన్న, నాహార - మంతికన్న,
ద్రాక్ష రసపాన మునకన్న - ధాత్రినీదు
ప్రీతి నెద దూర్చు మృదులంపు - చేతి తాఁకు
మదికి ధృతి గూర్చు మధురంపు - మాటసొంపు
రేయి గడచెనా యాశ్రయ - హాయి నాయు
అన్న మొక్కొక్క నాటికే - యనువు పడును
నీదు హస్తంబు స్పర్శయు - నీదు వాక్కు
గీతి యై హృదయమునందుఁ - గెరలు నెపుడు

—స్పెన్సర్ ప్రీ.

## మొదటి కూర్పునకు తొలిపలుకు

## PREFACE TO FIRST EDITION

ఈ క్రొత్త నర్సింగ్ పాఠపుస్తకముయొక్క పేరును, పై వేషమును మారినను, వాస్తవముగ నిది ప్రాతపుస్తకమే. మొదటి పుస్తకమును మిగుల ప్రయాసతోను, శ్రద్ధతోను సిద్ధము చేసియుండిరి. ఇందులకై తత్ గ్రంథకర్తలు శ్లాఘనీయులు. వారు వ్రాసిన పుస్తకము దాని యుద్దేశమును నెరవేర్చి గొప్పసేవ చేసినది. కాని యిండియాలో నర్సింగ్ కళయందు గొప్పమార్పులు తీవ్రగతిని కలుగుచున్నందునను నూతన విషయములును నూతన చికిత్సలు కనుగొనబడుచున్నందునను మొదటి పుస్తకమును తిరిగి వ్రాయుటకును, అనేక క్రొత్తసంగతులు చేర్చుటకును అవకాశమేర్పడినది. ఈ క్రొత్త పాఠపుస్తకమును వ్రాసినది ఒకరుకాదు, అనేకమంది కలిసి వ్రాసిరి. వీరందరు బహు శ్రద్ధతో దీనిని సిద్ధముచేసిరి. నర్సింగునకు సంబంధించిన వెవ్వేరు గొప్ప విషయములన్నిటిని ఒక్క గ్రంథములో నిమిడ్చి వ్రాయుట ఎంత కష్టసాధ్యమో, ఎడిటర్‌కంటె యితరులు బాగుగ గ్రహించలేరు. ప్రతి విషయమును వ్రాయవలసి వచ్చినందున, వాటిని క్లుప్తపరచవలసిన అవసర మేర్పడినది.

మా నూతన పుస్తకమును మిస్ పియర్స్‌గారి జనరల్ టెక్స్టు బుక్ ఆఫ్ నర్సింగ్ (General Text-Book of Nursing) అను పుస్తకము ననుసరించి వ్రాసితిమి. అక్కడక్కడ ఆ పుస్తకమునుండి కొన్ని సంగతులు ఎత్తి వ్రాసితిమి. ఇట్లు తన పుస్తకము నుపయోగించుట కనుమతి నిచ్చిన మిస్ ఎవిలిన్ పియర్స్‌గారికిని, దానిని ప్రచురించిన ఫేబర్ అండ్ ఫేబర్ కంపెనీవారికిని మా వందనములు. **చనిపోవుచున్నవారికి చేయవలసిన నర్సింగ్ పరిచర్య** (Nursing of the Dying)—అను విషయమును సంపూర్ణముగా ఎత్తి వ్రాయుటకు మాకు ప్రత్యేకముగా సెలవను గ్రహింపబడెను. ఇంత మంచి పుస్తకము నర్సింగ్ పాఠశాలల లైబ్రరిలో రెఫరెన్సుకొఱకుంచబడి యుండునని నమ్ముచున్నాము.

ఎడిటర్‌కంటె బాగుగ వ్రాయగలిగిన వారినందరిని సహాయముకొఱకు అడిగినందున, బహుమంది ఈ పుస్తకము వ్రాయుటకు తోడ్పడిరి. మిస్ హెలెన్ బెయిలీగారు వ్రాతప్రతిని టైపు చేయించి, దానిని, ప్రూఫ్‌నుకూడ సవరించినందుకు ఆమెకు మా వందనములు. మిస్ ఎల్సి లార్సన్, మిస్ హెలెన్ బెంజెమెన్—వీరిద్దరు సహాయకరమైన సలహాలనిచ్చి, వ్రాతప్రతిని క్రమపరచి, దానిని చదివినందుకు వారికిని మా వందనములు. డాక్టర్ ఏ. జి. బాగ్స్‌గారు శస్త్రశాస్త్రభాగమునకు సలహాలతో చేసిన సహాయమునకై వారికి మా వందనములు. ప్రచురణకర్తలు చూపిన శ్రద్ధకును, ఇచ్చిన మంచి సలహాలకొఱకును వారికి మా కృతజ్ఞత పూర్వకమైన వందనములు చెల్లించుచున్నాము.

## రెండవ కూర్పునకు తొలిపలుకు

## PREFACE TO SECOND EDITION

ఇండియాలోని నర్సులకొఱకైన నర్సింగ్ పాఠపుస్తకము (A Text-Book for Nurses in India) యొక్క మొదటి కూర్పును పుస్తకపు కమిటీ సభ్యులును, దానికి పాఠములు వ్రాసి, అనేకవిధములుగా సహాయముచేసిన యితరులును దానిని చాల శ్లాఘించి, సంతోషముతో అంగీకరించి వాడుకొనిరి. ఇప్పుడు దానిని యిండియాలోని కొన్ని ఇతరభాషలలోనికి తర్జుమాచేయుచున్నారు. కాగితపు కఱవునుబట్టి రెండవ కూర్పు ప్రచురించుట ఆలస్యమైనది. పుస్తకములోని సంగతులు దగ్గర దగ్గర అచ్చువేసినందుకు విచారించుచున్నాముగాని, యెట్లయినను పుస్తకమునంతయు ముద్రించగలుగుట అదృష్టమనుకొనుచున్నాము. ఈ కూర్పునకు సవరణలు, సలహాలు పంపిన నర్సింగ్ సూపరింటెండెంటులకు వందనములు. స్వల్పమైన సవరణలు, మార్పులు మాత్రమే కాక, ఈ దిగువ మార్పులు కూర్పులును, విశేషాంశములును ఈ పుస్తకమున చేర్చియున్నాము: **ఆహారశాస్త్రము** (Dietetics) అను అధ్యాయములో ఇండియాదేశమునందు లభించు ఆహారపదార్థములయొక్క విలువను సూచించుచు ఒక క్రొత్తచార్టును డాక్టర్ డబ్ల్యు. ఆర్. ఆ. క్రాయిడ్ గారి సహాయముతో కూనూరులోని న్యుట్రిషన్ లెబొరటోరీలవారిచే సిద్ధము చేయబడెను. కుష్ఠరోగమునుగూర్చి ప్రస్తుతదినములవరకు కనుగొనబడిన నూతన విషయములన్నిటిని చేర్చి వ్రాసియున్నారు. **ఔషధపదార్థ తత్వప్రారంభ శాస్త్రము** (Materia medica) అను అధ్యాయమును బ్రిటిష్ ఫార్మాకోపియ (British Pharmacopœia) ననుసరించి తిరిగి క్రమపరచితిమి. గైనకాలజి (Gynecological chapter) అను 24-వ అధ్యాయమునకు **రేడియం, ఎక్స్‌రే** (Radium and X-ray) చికిత్స వివరణములు మరల సవరించి వ్రాసితిమి. సల్ఫొనమైడ్స్‌ను గూర్చి నూతనవిషయములు చేర్చబడినవి; అంటువ్యాధుల అధ్యాయములో యెల్లోఫీవర్ టైఫస్‌ఫీవర్—వీనియొక్క వివరములును, ఆంటీరియర్ పోలియోమైఏలైటిస్ (Anterior poliomyelitis) అను వ్యాధినిగూర్చిన చికిత్సయు క్లుప్తముగా వ్రాయబడినవి; కాలుటవలన గలిగిన గాయముల (Burns)—విషయమునుగూర్చిన భాగము క్రొత్తగా వ్రాయబడినది. ఈ ప్రస్తుతయుద్ధములో ప్రవేశపెట్టబడిన నూతన చికిత్సలు దీనిలో చేర్చబడినవి. నర్సింగ్ కోర్సును ఇంగ్లీషులో తీసికొను విద్యార్థుల సహాయార్థమై ఒక్కొక్క అధ్యాయము చివరను విషయసూచక సహాయము లియ్యబడినవి. వానిని చూచి చదువుకొని యొక్కవసంగతులు తెలిసికొనవచ్చును. ఈ రెండవ కూర్పు సిద్ధముచేయుటకు సంతోషముతో సహాయమొసగిన వైద్యశాఖసభ్యులందరికి మా నిండు కృతజ్ఞత తెలుపుచున్నాము. ముఖ్యముగా ప్రూఫులు చదివి దిద్దిన మిస్ హెలెన్ బెయిలీగారికిని, వ్రాతప్రతిలో కొన్నిభాగములు తిరిగి వ్రాసిన డాక్టర్ ఏ. జి. బాగ్స్ గారికిని, విషయసూచక (Index) సవరించి మరల సిద్ధముచేసిన మిస్ ఇ. లార్సన్‌గారికిని మా కృతజ్ఞతా వందనములు.

## మొదటి కూర్పునకు తొలిపలుకు

## PREFACE TO FIRST EDITION

ఈ క్రొత్త నర్సింగ్ పాఠపుస్తకముయొక్క పేరును, పై వేషమును మారినను, వాస్తవముగ నిది ప్రాతపుస్తకమే. మొదటి పుస్తకమును మిగుల ప్రయాసతోను, శ్రద్ధతోను సిద్ధము చేసియుండిరి. ఇందులకై తత్ గ్రంథకర్తలు శ్లాఘనీయులు. వారు వ్రాసిన పుస్తకము దాని యుద్దేశమును నెరవేర్చి గొప్పసేవ చేసినది. కాని యిండియాలో నర్సింగ్ కళయందు గొప్పమార్పులు తీవ్రగతిని కలుగుచున్నందునను నూతన విషయములును నూతన చికిత్సలు కనుగొనబడుచున్నందునను మొదటి పుస్తకమును తిరిగి వ్రాయుటకును, అనేక క్రొత్తసంగతులు చేర్చుటకును అవకాశమేర్పడినది. ఈ క్రొత్త పాఠపుస్తకమును వ్రాసినది ఒకరుకాదు, అనేకమంది కలిసి వ్రాసిరి. వీరందరు బహు శ్రద్ధతో దీనిని సిద్ధముచేసిరి. నర్సింగునకు సంబంధించిన వెవ్వేరు గొప్ప విషయములన్నిటిని ఒక్క గ్రంథములో నిమిడ్చి వ్రాయుట ఎంత కష్టసాధ్యమో, ఎడిటర్‌కంటె యితరులు బాగుగ గ్రహించలేరు. ప్రతి విషయమును వ్రాయవలసి వచ్చినందున, వాటిని క్లుప్తపరచవలసిన అవసర మేర్పడినది.

మా నూతన పుస్తకమును మిస్ పియర్స్‌గారి జనరల్ టెక్స్ట్ బుక్ ఆఫ్ నర్సింగ్ (General Text-Book of Nursing) అను పుస్తకము ననుసరించి వ్రాసితిమి. అక్కడక్కడ ఆ పుస్తకమునుండి కొన్ని సంగతులు ఎత్తి వ్రాసితిమి. ఇట్లు తన పుస్తకము నుపయోగించుట కనుమతి నిచ్చిన మిస్ ఎవిలిన్ పియర్స్‌గారికిని, దానిని ప్రచురించిన ఫేబర్ అండ్ ఫేబర్ కంపెనీవారికిని మా వందనములు. **చనిపోవుచున్నవారికి చేయవలసిన నర్సింగ్ పరిచర్య** (Nursing of the Dying)—అను విషయమును సంపూర్ణముగా ఎత్తి వ్రాయుటకు మాకు ప్రత్యేకముగా సెలవనుగ్రహింపబడెను. ఇంత మంచి పుస్తకము నర్సింగ్ పాఠశాలల లైబ్రరిలో రెఫరెన్సుకొఱకుంచబడి యుండునని నమ్ముచున్నాము.

ఎడిటర్‌కంటె బాగుగ వ్రాయగలిగిన వారినందరిని సహాయముకొఱకు అడిగినందున, బహుమంది ఈ పుస్తకము వ్రాయుటకు తోడ్పడిరి. మిస్ హెలెన్ బెయిలీగారు వ్రాతప్రతిని టైపు చేయించి, దానిని, ప్రూఫ్‌నుకూడ సవరించినందుకు ఆమెకు మా వందనములు. మిస్ ఎల్సి లార్సన్, మిస్ హెలెన్ బెంజెమెన్—వీరిద్దరు సహాయకరమైన సలహాలనిచ్చి, వ్రాతప్రతిని క్రమపరచి, దానిని చదివినందుకు వారికిని మా వంద[illegible]. డాక్టర్ ఏ. జి. బాగ్స్‌గారు శస్త్రశాస్త్రభాగమునకు సలహాలతో చేసిన సహా[illegible]వారికి మా వందనములు. ప్రచురణకర్తలు చూపిన శ్రద్ధకును, ఇచ్చిన మంచి సలహాలకొఱకును వారికి మా కృతజ్ఞత పూర్వకమైన వందనములు చెల్లించుచున్నాము.

## రెండవకూర్పునకు తొలిపలుకు

## PREFACE TO SECOND EDITION

**ఇండియాలోని నర్సులకొఱకైన నర్సింగ్ పాఠపుస్తకము** (A Text-Book for Nurses in India) యొక్క మొదటి కూర్పును పుస్తకపు కమిటీ సభ్యులును, దానికి పాఠములువ్రాసి, అనేకవిధములుగా సహాయముచేసిన యితరులును దానిని చాల శ్లాఘించి, సంతోషముతో అంగీకరించి వాడుకొనిరి. ఇప్పుడు దానిని యిండియాలోని కొన్ని ఇతరభాషలలోనికి తర్జుమాచేయుచున్నారు. కాగితపు కఱవునుబట్టి రెండవ కూర్పు ప్రచురించుట ఆలస్యమైనది. పుస్తకములోని సంగతులు దగ్గర దగ్గర అచ్చువేసినందుకు విచారించుచున్నాముగాని, యెట్లనైనను పుస్తకమునంతయు ముద్రించగలుగుట అదృష్టమనుకొనుచున్నాము. ఈ కూర్పునకు సవరణలు, సలహాలు పంపిన నర్సింగ్ సూపరింటెండెంటులకు వందనస్థులము. స్వల్పమైన సవరణలు, మార్పులు మాత్రమేకాక, ఈ దిగువ మార్పులు కూర్పులును, విశేషాంశములును ఈ పుస్తకమున చేర్చియున్నాము: **ఆహార శాస్త్రము** (Dietetics) అను అధ్యాయములో ఇండియాదేశమునందు లభించు ఆహార పదార్థములయొక్క విలువను సూచించుచు ఒక క్రొత్తచార్టును డాక్టర్ డబ్ల్యు. ఆర్. ఆ. క్రాయిడ్ గారి సహాయముతో కూనూరులోని న్యుట్రిషన్ లెబొరటొరీలవారిచే సిద్ధము చేయబడెను. కుష్ఠరోగమునుగూర్చి ప్రస్తుతదినములవరకు కనుగొనబడిన నూతన విషయములన్నిటిని చేర్చి వ్రాసియున్నారు. **ఔషధపదార్థ తత్వప్రారంభ శాస్త్రము** (Materia medica) అను అధ్యాయమును బ్రిటిష్ ఫార్మకోపియ (British Pharmacopœia) ననుసరించి తిరిగి క్రమపరచితిమి. గైనొకాలజి (Gynecological chapter) అను 24-వ అధ్యాయమునకు రేడియం, ఎక్స్‌రే (Radium and X-ray) చికిత్స వివరణములు మరల సవరించి వ్రాసితిమి. సల్ఫొనమైడ్స్‌నుగూర్చి నూతనవిషయములు చేర్చబడినవి; అంటు వ్యాధుల అధ్యాయములో యెల్లొఫీవర్ టైపస్‌ఫీవర్—వీనియొక్క వివరములును, ఆంటీరియర్ పోలియోమైఏలైటిస్ (Anterior poliomyelitis) అను వ్యాధినిగూర్చిన చికిత్సయు క్లుప్తముగా వ్రాయబడినవి; కాలుటవలన గలిగిన గాయముల (Burns)—విషయమును గూర్చిన భాగము క్రొత్తగా వ్రాయబడినది. ఈ ప్రస్తుతయుద్ధములో ప్రవేశపెట్టబడిన నూతన చికిత్సలు దీనిలో చేర్చబడినవి. నర్సింగ్ కోర్సును ఇంగ్లీషులో తీసికొను విద్యార్థుల సహాయార్థమై ఒక్కొక్క అధ్యాయము చివరను విషయసూచక సహాయము లియ్యబడినవి. వానిని చూచి చదువుకొని యొక్కువసంగతులు తెలిసికొనవచ్చును. ఈ రెండవ కూర్[illegible] సిద్ధముచేయుటకు సంతోషముతో సహాయమొసగిన వైద్యశాఖసభ్యులందరికి మా నిండు కృతజ్ఞత తెలుపుచున్నాము. ముఖ్యముగా ప్రూఫులుచదివి దిద్దిన మిస్ హెలెన్ బెయిలీగారికిని, వ్రాతప్రతిలో కొన్నిభాగములు తిరిగివ్రాసిన డాక్టర్ ఏ. జి. బాగ్స్‌గారికిని, విషయసూచక (Index) సవరించి మరల సిద్ధముచేసిన మిస్ ఇ. లార్సన్‌గారికిని మా కృతజ్ఞతా వందనములు.

# ఉపోద్ఘాతము

# FOREWORD

ఇండియాదేశములోకంటె నర్సింగ్ కళ అభివృద్ధి చెందియున్న యితరదేశములలోని ఆస్పత్రులయందు పనిచేసియుండినవారికే ఈ పాఠ పుస్తకముయొక్క విలువ బాగుగ తెలియగలదు. ఈ దేశములో నర్సింగ్ తర్బీతు పొందుచున్నవారు తరగతులలో నేర్చుకొను పాఠములు, వార్డులలో సంపాదించుకొను అనుభవము మాత్రమేగాక, తమ జ్ఞానమును వృద్ధిచేసికొనుటకు ఈ పాఠ పుస్తకము ఎంత అవసరమో గ్రహించగలరు. జయకరమైన నర్సుగనుండగోరు నర్సు, ఎల్లప్పుడు తన్నుతాను విద్యార్థిగా భావించుకొని పుస్తకములు చదువుచుండవలెను. ఇండియాలోని ఆస్పత్రులయందు నేను గమనించిన దేమనగా, ఎక్కువమంది నర్సులు తమ పరీక్షలలో కృతార్థులై, యోగ్యతాపత్రములు పొందగనే చదువుట మానివేయుదురు. దీనిని చూడగా, నాకు గొప్ప నిరాశకలిగినది.

ఈ పాఠ పుస్తకమును చదువు అదృష్టముగలిగిన వారందరు, పరీక్షానంతరము దీనిని మూసివేసి నేర్చుకొనిన విషయములను మరచిపోక, ఎల్లప్పుడు దీనిని చదువుచు నేర్చుకొనిన విషయములను జ్ఞప్తికి తెచ్చుకొనుచు నుండవలెనని కోరుచున్నాను. ఇది మీచేతులలో నుంచబడిన దేవుని గొప్పవరమని గ్రహించుడి. ఇది రోగులను స్వస్థపరుచువరము. దీనిని పలుమారు పఠించుట మూలముననే రోగులకు శ్రేష్ఠమైన పరిచర్య చేయగలరు. నేడు నర్సులుగ పని చేయుచుండువారే, రేపు మేట్రనులుగను, సిస్టర్లుగను పనిచేయుదురన్న సత్యము మరువకుడి. దక్షిణయిండియాలోని నర్సెస్ ఆగ్జిలియర్ ఆఫ్ ది క్రిస్టియన్ మెడికల్ అసోసియేషన్ పక్షమున నేను అనేకసంవత్సరములు మెడ్రాసు నర్సెస్ అండ్ మిడ్‌వైవ్స్ కౌన్సిల్ (Madras Nurses and Midwives Council) సభ్యురాలనుగానుండు తరుణము లభించినది. ఈ కౌన్సిల్ సమావేశములలో జరిగిన సంవాదమునుబట్టి, ఇండియాలోని మిషన్ ఆస్పత్రులలో నేమి, గవర్నమెంట్ ఆస్పత్రులలో నేమి తటస్థించు కష్టమైన సంగతులను గ్రహించుటకు వీలైనది. కౌన్సిల్ సభ్యుల మధ్య గొప్ప స్నేహభావముకూడా యేర్పడినది.

ఈ పాఠ పుస్తకమును ఎంత శ్రద్ధతో సిద్ధము చేయుచుండిరో నేను గమనించుచుంటిని. ఇండియాలోని నర్సులకు ఇదియొక సహాయగ్రంథముగా నుండవలెననియే గ్రంథకర్తల ఉద్దేశము. ఇట్టి విలువైన గ్రంథమునకు నన్ను ఉపోద్ఘాతము వ్రాయుమని యడుగుట గొప్ప ఆధిక్యతయని భావించి, పాఠ పుస్తకకమిటీవారు నాకు చూపిన గౌరవమునకుగాను వారికి నా మనఃపూర్తియైన వందనము లాచరించుచున్నాను. నర్సింగ్ పరిచర్య ముందుకు సాగిపోవుటకును, విద్యార్థి ధర్మమును ముగించిన నర్సులకు ప్రేరేపణ కలుగుటకును, ఈ పాఠ పుస్తకము సహాయకరముగనుండునని నేను నమ్ముచున్నాను.

డి. చాడ్విక్,

ప్రిన్సిపల్ మేట్రన్.

మద్రాసు రాజధాని,
ఆగస్టు, 16, 1941.

# విషయసూచిక

# TABLE OF CONTENTS

## మొదటి భాగము

### నర్సింగుకళను పీఠిక



## రెండవ భాగము

### పరిచర్యయందు కౌశలము



## మూడవ భాగము

### ఆహారశాస్త్రముయొక్క సిద్ధాంతములు



## నాల్గవ భాగము

కాలములోగూడ పరిశుభ్రమైనట్టి అనగా, విషప్రయోగముచేత చెడిపోని యేదో యొక చికిత్స వారికి తెలిసియుండెనని తలంచగలము. ఆ కాలములో మూఢభక్తియు, భయమును సర్వసాధారణమై యుండెను. కావున రోగముచేత బాధపడుచుండినవానియొక్క దేహములో చేరి, వాసము చేయుచుండిన యేదో ఒక దయ్యము లేక దుష్టపిశాచివలన ఆ రోగము వానికి సంభవించినదని ఆదిమమానవుడు తలంచెను. పుఱ్ఱెకు తొల్లలు లేక రంధ్రములు చేయుటవలన, వానిగుండ పిశాచములు బయటికి వెళ్లిపోవునని ఆ కాలపువారి నమ్మకమని కొందరు శాస్త్రవేత్తలు తలంచుచున్నారు. మంత్రప్రయోగములు, బలియర్పణలు, వికారము కలిగించు నిషిద్ధపదార్థములను తినిపించుటయు, ఆ కాలపువారు చేసిన మరికొన్ని చికిత్సలు. తరువాత కాలములో మానవుడు తనకు సహాయపడగల శక్తులను పూజించి దుష్టపిశాచములను శాంతిపరచుచుండెను.

ఆదిమజనులయందువలెనే పురాతన నాగరికతగలిగిన ఈజిప్టు, బబులోను, అస్సిరియా, ఇండియా, గ్రీసు మున్నగు దేశములలోను రోగుల పరిచర్యను, ఇంచుమించు ఒక మతాచారముగా భావించి, జ్యోతిశ్శాస్త్రము, మంత్ర, తంత్ర, శాస్త్రములతో జతపర్చుచుండిరి. మత గురువే వైద్యుడుగానుండి మందు లిచ్చుచుండినందున, రోగులు దేవాలయములలోనికి గుంపులుగుంపులుగ వచ్చుచుండిరి. బైబిలుచరిత్రలో యూదా ప్రజలు ఈజిప్టునుండి పాలస్తీనాకు తరలిపోయిన సందర్భములో వారి నాయకుడైన మోషే, పారిశుద్ధ్యనియమములను జనులు గమనించునట్లును, రోగులను ప్రత్యేకించునట్లును నిర్బంధించెను. ఈ నియమములనే ఇప్పటికిని ఆచరించుచున్నారు.

ఆరోగ్యమార్గము, వైద్యము, రోగుల పరిచర్య (నర్సింగు) పూర్వకాలము గొప్పవృద్ధి చెందియుండెనని తెలుపునట్టి ఋజువులు ప్రాచీన వేదములలోను, ఇతర హిందూ గ్రంథములలోను గలవు. అప్పటి హిందూదేశములో మంచి పరికరములు (పనిముట్లు) గలిగి, చాల ప్రఖ్యాతిగాంచిన పెద్ద వైద్యశాలలుండినవని తెలియవచ్చుచున్నది. అప్పుడు రోగుల పరిచర్య యౌవనపురుషులచే జరుపబడుచుండెను. ప్రత్యేక సందర్భములలో పెద్ద వయస్సుగల స్త్రీలు చేయుచుండిరి. నర్సింగును గూర్చి ఆ కాలములో కొన్ని నియమములుండెను. వీనివలన ఆ పురా



తనకాలములోకూడ ఏదో ఒక విధమైన తర్బీతు ఇయ్యబడుచుండెనని గ్రహించగలము. రాజైన అశోకుడు కనీసము 20 వైద్యశాలలైనను కట్టించియుండినట్లు చరిత్ర ఋజువులున్నవి. ఈ వైద్యశాలలకు సంబంధించిన కొన్ని వైద్యపాఠశాలలును ఆయన స్థాపించియుండెను. హిందూదేశములో [1]'శస్త్రవిద్యకు మూలపురుషుడు' అని పిలువబడిన [2]సుశ్రుతుడు క్రీ. పూ. 600 సం॥లో నొక ప్రఖ్యాతగ్రంథము వ్రాసియుండెను. [3]చరకుడు వ్యాధులచికిత్సవిషయమై మరియొక గ్రంథము వ్రాసెను. ఈ యిద్దరు గ్రంథకర్తలు అక్కాలపు చికిత్సాపరిచర్యలనుగురించి విశదీకరించిరి. "మనము అస్వస్థతగా నున్నప్పుడు వైద్యుడు మన తండ్రి; బాగుపడుచున్నప్పుడు ఆయన మన స్నేహితుడు; సంపూర్ణముగా స్వస్థులమైనప్పుడు ఆయన మన కాపుకర్త" అను నొక పురాతన హిందూసామెత గలదు.

పూర్వకాలపు గ్రీకులు, రోమీయులు తమ రోగుల నెట్లు పరామర్శించిరో తెలిసికొనుటయు ఉత్సాహకరముగా నుండును. క్రీ. పూ. 460-వ సం॥న వైద్యమునకు మూలపురుషుడైన [4]హిపాక్రటీస్ అను నతడు రోగమునకు కారణము అస్వాభావిక శక్తులు గావనియు, మానవుడేయనియు వక్కాణించెను. అతనికి సహాయకులుగానుండిన స్త్రీ పురుషులు నేటికిని నర్సింగులో అభ్యసింపబడుచున్న అనేక విధానములను ఉపయోగించి యుండిరి.

క్రీస్తు రాకతో సర్వ మానవ ప్రేమతత్వము లోకములో బయలుదేరినది. 'నిన్నువలె నీ పొరుగువానిని ప్రేమించుము.' 'పరిచర్య చేయించుకొనుటకు కాదుగాని, పరిచర్య చేయుటకే వచ్చితిని.' 'నేను రోగినై యుండగా మీరు నన్ను చూడవచ్చితిరి'. అను తదితర క్రీస్తు బోధనా వాక్యములు, ఇతరులకొరకు జీవించి, వారికి పరిచర్య చేయవలెననెడి కోరికను జనులలో కలిగించెను. ఇట్లు సిద్ధమైన పరిస్థితులలో నర్సింగు వృద్ధిపొందుటకు తగిన అవకాశమేర్పడినది. ఆరంభ సంఘములో స్త్రీ పురుషులు సమానధర్మములు గలిగి పనిచేసిరి. వివాహముకాని కన్యలకు సాంఘిక సేవ చేయుటకు ముందెన్నడులేని తరుణములు లభించెను. వీరు చేయగలిగిన కార్యములలో రోగుల పరిచర్య ప్రాముఖ్యమైనది. [5]ఫాబ్రియోల

[1] The father of surgery in India. [2] Susruta. [3] Charaka.
[4] Hippocrates, the father of medicine. [5] Fabriola.

అను పేరుగల ఒక రోమీయ ధనికురాలు తన నగరములో అధికముగ చెడిపోయిన భాగములనుండి వచ్చిన పేదరోగులను పరామర్శించుటకుగాను, తన భవనమును వైద్యశాలగా మార్చివేసెను. కుష్ఠరోగులకుగూడ కట్లు కట్టుచుండెను; పాలస్తీనానుండి వచ్చుచు, పోవుచుండిన యాత్రికులనేకులు ఈమె యింటికివచ్చి పరిచర్య పొందిరి. వీరికి ఈమె యిల్లు ఒక ఆశ్రయ దుర్గమై వెలసెను. [1]పౌల యను మరియొక రోమీయ స్త్రీ, మొట్టమొదట తర్బీతుపొందిన నర్సు అని గణించబడెను. ఆమె నర్సింగులో తర్బీతు నిచ్చుటయందును మొదటివారిలో ఒకర్తెయైయుండెను. ఇదియునుగాక ఆమె పాలస్తీనాలో సన్యాసి మఠములను, వైద్యశాలలను నెలకొల్పెను. క్రైస్తవ సంఘముయొక్క యాజమాన్యమున స్త్రీలును, పురుషులును నర్సింగు, గృహములు దర్శించుట మొదలగు పనులుచేసి [2]పరిచారకులు, పరిచారికలు అను పేరులతో పిలువబడుచుండిరి. వీరిలో ముఖ్యురాలు, [3]సెంక్రియదేశపు స్త్రీయైన ఫీబి. ఈమె ప్రపంచములో [4]మొదటి గృహసందర్శక నర్సు అని పిలువబడెను. అనేక క్రైస్తవ గృహములు, వైద్యశాలలుగాను, శిశుగృహములుగాను, యాత్రికులకు ఆశ్రయస్థానములుగాను ఉపయోగించబడెను. సంఘములు భాగ్యవంతములైన కొలది, అవి వైద్యశాలలను వాటికి తోడు ఇండ్లను సత్రములను ధర్మకార్యములకు కట్టించినవి.

క్రీ. శ. 476-వ సం॥న రోమారాజ్యము పడిపోయిన తరువాత, మధ్యయుగము ఆరంభమయినది. అప్పుడు నాశనమగుచుండిన నాగరికతను పునరుద్ధరించుటకు క్రైస్తవసంఘము పాటుపడెను. ఈ శకముయొక్క ఆరంభకాలములో నర్సింగుపనిని ముఖ్యముగా మతస్థులైన సిస్టర్సు (సహోదరీయులు) బ్రదర్సు (సహోదరులు), బిషపులు, మతగురువులు చేసిరి. తరువాత మతస్థులును, మతస్థులు కానివారును సంఘములుగాచేరి రోగుల పరిచర్య చేయసాగిరి. ఇదేసమయములో అరబ్బులుకూడ అన్ని పరికరములుగలిగిన మంచి వైద్యశాలలను గలిగియుండిరి. క్రైస్తవదేశములలో నున్నవానికంటె ఇవి మేలైన వైద్యశాలలైయుండెను.

పండ్రెండవ శతాబ్దములో సివిలు ఆస్పత్రులు ఆరంభమయినవి. ఇవి సాధారణముగా నర్సింగునుగూర్చి యేమియు తెలియని పురుషులచేత

[1] Paula. [2] Deacons and Deaconesses. [3] Phœbe of Cencrea.
[4] First visiting nurse.



నడుపబడుచుండెను. క్రమేణ రోగుల పరిచర్య ఘనమైన కార్యముగాక, నీచమైన వృత్తిగా భావించబడెను. గవర్నమెంటువారు అనేక మతశాలలను మూయుటవలన, నర్సింగుపని మిక్కిలి దుష్టస్త్రీలచేతులలోపడి పాడయినది. ఈ స్త్రీలు కఠినహృదయులును, క్రూరులునైయుండిరి. అంటురోగులను, ఇతర సాధారణమైన రోగులను ఒకటిగాచేర్చి పరిచర్యచేయుచుండిరి. ఒక్కొక్కప్పుడు సజీవులైన రోగులు మృతులైనవారి ప్రక్కలో పరుండి నిద్రించవలసివచ్చెను. కావున 'నిజమైన రోగుల పరిచర్య' అను ధర్మము అంతరించెను. ఇక వైద్యచికిత్స అతి క్రూరమైనదిగా నుండినందున జనులు వైద్యశాలలకు పోవుటకే వెరచిరి.

ఈ పరిస్థితులను చక్కబెట్టుటకు సెయింటు విన్‌సెంటు డి పౌలు అనునతడు 1632-వ సం॥లో సాంఘికసేవ చేయనారంభించెను. పనివారు, గృహములకుపోయి రోగులకు పరిచర్య చేయుటయేకాక, అవసరమైన యితర సహాయము చేయుటకును తర్బీతు ఇయ్యబడెను. దీనినుండియే క్రమపరచబడిన సాంఘిక సేవ ఆరంభమై, [1]సిస్టర్సు ఆఫ్ చారిటీ అనగా 'ధర్మపరిచారక అక్కలు' అను సంఘముగా వృద్ధియైనది. ఇదియే ప్రపంచమంతటిలో పెద్దదియైన నర్సింగు సంస్థ.

పందొమ్మిదవ శతాబ్దములో ఇరువదియేండ్లు అయిన పిమ్మటనే, నర్సింగుయొక్క నూతన శకము ఆరంభమయినది. 1831-వ సం॥న అమేలియ స్పైవేకింగ్ అను చదువుకొనిన యౌవన జర్మను స్త్రీ ఒకతె, హాంబర్గు పట్టణములో వ్యాపించిన కలరా అను అంటువ్యాధికి పాలైన రోగులకు స్వయముగా పరిచర్యచేయుచు, తనకు సహాయముచేయుమని ఇతరులనుగూడ ప్రోత్సహించెను. ఈ కాలమునకు చెందిన మార్గదర్శకులలో ఇంగ్లాండుదేశపు వాస్తవ్యురాలైన (మిసెస్) ఎలిజబెతుఫ్రై అమ్మగారు ఒకరు. ఈమె [2]స్త్రీ ఖైదీలమధ్య గొప్ప సాంఘిక సేవచేసి, మొదటి ప్రయివేటు నర్సింగ్ అసొసియేషనును ఇంగ్లాండులో స్థాపించెను. డీకనెసు సంస్థల యేర్పాటుతోపాటు నర్సింగు తిరిగి క్రైస్తవ ఆదర్శములతో వృద్ధి చెందెను. మొదటి డీకనెసు పాఠశాల జర్మనీలో కైజెరువర్తు అను స్థలమున స్థాపించబడెను. దీనిని 1836-వ సం॥ [3]రెవరెండు తియొడోరు

[1] The Order of Sisters of Charity. [2] Women prisoners.
[3] Rev. Theodore Fliedner.

ఫ్లీడ్నరుగారును, వారి సతీమణియు స్థాపించిరి. ఇది ఆరంభమున స్వల్పమయినదిగ కనబడినను నర్సులకు తర్బీతు నిచ్చు ఒక విద్యావిషయక సంస్థగా త్వరలో పరిణమించెను. డీకనెసులు రోగులకు పరిచర్య చేయుటయే కాక, ఆర్ఫనేజీలు (అనాథాశ్రయములు), అనాథశిశు పోషణశాలలు, రక్షక గృహములు మొదలగువానిలో పనిచేసి బీదలను, అక్కర గలిగిన వారిని పరామర్శించిరి. ఈ యుద్యమము బహు త్వరగా పెరిగి, ఫ్లీడ్నరుగారు చనిపోకముందే అనేక దేశములకు వ్యాపించినది.

పాస్టరు ఫ్లీడ్నరుగారి విద్యార్థులలో మిక్కిలి ప్రసిద్ధిగాంచినది [1]ఫ్లారెన్సు నైటింగేలు అను కన్య. ఈమెయే ఆధునిక అనగా ప్రస్తుతకాలపు నర్సింగు పనిని ఆరంభించి ప్రఖ్యాతిగాంచిన వ్యక్తి. ఫ్లారెన్సు నైటింగేలు 1820-వ సం॥ మేనెల 12-వ తేదీన బుట్టి, 1910-వ సం॥ ఆగస్టునెల 13-వ తేదీన చనిపోయినది. ఈమె తన జీవితకాలమంతయు మిక్కిలి పని గలిగి, చాల ఉపయోగకరమైన సేవచేసి తన జీవితమును సార్థకపరచుకొనెను. గొప్ప భాగ్యము, సాంఘికస్థితి గలిగిన కుటుంబమున ఈమె జన్మించి సరాసరిన యితర ఇంగ్లీషు బాలికలకంటె మరియెక్కువ విద్య నభ్యసించెను. అయినను ఆమె సంతోషములేనిదై, యితరులకు సేవచేయగల మార్గము నన్వేషించుచుండెను. ఆమెకు నర్సింగు నేర్చుకొనవలెనని యిష్టమున్నను, ఆమె తలిదండ్రులు, ఇతర కుటుంబికులు ఆ మాట వినుటకైనను ఇష్టపడకుండిరి. విద్యాభ్యాసము చేసిన యే కన్యయు అట్టి పనిచేయుటకు ఒప్పుకొనదని వారు భావించియుండిరి. ఇట్టి కాలములోనే ఆమె జబ్బుపడెను. స్వస్థురాలైన తర్వాత బలము, ఆరోగ్యము చేకూరుటకును, నర్సింగు విషయమై మరచిపోవుటకును ఈమె ఇటలీదేశమునకు పంపబడెను. కాని ఇటలీలో కథోలికు సిస్టరులు చేయుచుండిన పని ఆమె మనస్సునకు నచ్చెను. దీని ఫలితార్థముగా ఇంతకుముందే ఆమెయందు నర్సింగు నేర్చుకొనుటకుండిన ఆశ అధికమయ్యెను. 1848-వ సంవత్సరములో ఆమెకు ఎట్లో [2]కైజెరువర్తు పాఠశాల వార్షిక నివేదిక చేరినది. తుదకు ఆమె వెదకుచుండినది దొరకినది. అనగా, విద్యాధికులైన యౌవనస్త్రీలు నర్సింగు తర్బీతు పొందగల ప్రొటస్టాంటు పాఠశాల ఆమెకు దొరకినది. ఈజిప్టు, గ్రీసు

[1] Florence Nightingale. [2] Kaiserwerth.



దేశములగుండ ప్రయాణముచేసి కైజెరువర్తు పాఠశాలను దర్శించుటకు తుదకు దలిదండ్రుల అనుమతి బొందెను. అక్కడ ఆమె [1]నర్సింగ్ స్థాపన, ప్రాక్టికల్ నర్సింగ్ పద్ధతులను నేర్చుకొనెను. లండను పట్టణముననుండిన కింగ్స్ కాలేజి ఆస్పత్రికి నర్సింగ్ సూపరింటెండెంటు కావలెనని సిద్ధపడుచుండగా, 1854-వ సం॥లో క్రిమియను యుద్ధము ఆరంభమైనందున ఆమె సేవకు గొప్ప తరుణము దొరకెను. యుద్ధకార్యదర్శియు, ఫ్లారెన్సు నైటింగేలు స్వంత స్నేహితుడునైన సర్ సిడ్నీ హెర్బర్టు అనుసతడు [2]స్కుటారియను స్థలముననుండిన సైన్యములోని రోగులకు పరిచర్య చేయుటకును, అక్కడ పని జరిపించుటకును నైటింగేలు కన్య మాత్రమే ఇంగ్లాండు అంతటిలోను అన్నివిధముల తగిన స్త్రీయని తలంచి, ఆమెను ఆ పనిచేయుటకు కోరెను. మూడు దినములైన తరువాత నైటింగేలుకన్య అధికారరీత్యా ఉద్యోగపు టుత్తరువు, అవసరమైన సలహాలను బొందెను. పది దినములలో అంతయు సిద్ధము చేసికొని, 1854-వ సం॥ అక్టోబరునెల 21-వ తేదీన ఫ్లారెన్సు నైటింగేలును, ఆమెతోకూడ యెన్నుకొనబడిన యితర 38 మంది నర్సులును తూర్పు యుద్ధరంగమునకు దీర్ఘప్రయాణము చేయుటకు బయలుదేరిరి. గమ్యస్థానము చేరగనే పరిస్థితులు భయంకరముగా తారుమారైయున్నట్టు కనుగొనిరి. ఆదరించువారు లేక యుద్ధసైనికులు మిక్కిలి పరితాపకరమైన స్థితియందుండిరి. కాని కొలదికాలములోనే ఫ్లారెన్సు నైటింగేలు అన్నిటిని క్రమపరచి చక్కపెట్టినందున గాయపడి చనిపోవుచుండిన వేలకొలది సైనికులు సహాయమును ఆదరణయు పొందిరి. ఈ స్థలమందే ఆమెకు [3]లేడి ఆఫ్ ఏ లాంఫ్ (దీపపు కన్య) యను పేరు కలిగెను. ఈమె తన చిన్న దీపము పట్టుకొని ఒక్కొక్క రోగిపడక యొద్దకుపోయి, గాయపడినవారికి చికిత్స చేయుచు, చనిపోవుచుండిన సైనికుల ఆఖరి సందేశములు వ్రాయుచుండుటయేకాక, ఆమె హృదయమందుండిన లోతైన, నిజమైన ప్రేమచేత లోకమును క్రమ్మియుండిన చీకటిని బారదోలగల వెలుగును ప్రకాశింపజేయుచుండెను. క్రిమియను యుద్ధము అంతమైన తరువాత, సైన్యములన్నియు స్కుటారిని విడిచి పోయినందున నైటింగేలు కన్యయు పోవుటకు సిద్ధపడెను. ఒక యుద్ధనావను బంపి

[1] Organization and practical nursing methods. [2] Scutari.
[3] The Lady of the Lamp.

నైటింగేలు కన్యను ఇంగ్లాండునకు రప్పించగోరిరిగాని, ఆమె యేవిధమైన ఆడంబరములేకుండ పోవగోరెను. ఆమె ఇంగ్లాండు చేరిన దినమున గుడులలో కృతజ్ఞతారాధనలు జరిగెను. బ్రిటిషు ప్రజలందరు ఆమెను ప్రేమించి మెచ్చుకొనిరి. వారి కృతజ్ఞతను దెలుపుటకుగాను జనులు గొప్ప ధననిధిని ఏర్పాటుచేయగా, ఆమె దానితో ఒక నర్సును ట్రైనింగు పాఠశాల నారంభించెను.

1860-వ సం॥ లండనులో సెయింటు తామసు ఆస్పత్రి సంబంధముగా [1]ఫ్లారెన్సు నైటింగేలు నర్సస్ హోమ్, నర్సస్ ట్రెయినింగ్‌స్కూల్ తెరువబడెను. ఇంగ్లాండులోనే కాక, యావత్తు ప్రపంచమంతటిలోను ఈ పాఠశాల మాదిరి పాఠశాలగానుండెను. అనేక సంవత్సరములవరకు నైటింగేలు కన్య వైద్యశాలలు, నర్సింగు, ఆరోగ్యము, వ్యాధులు మొదలగు విషయములందు మంచి పలుకుబడి గడించెను. హాస్పిటల్ ఆర్గానిజేషను (ఆస్పత్రులను స్థాపించుట), నర్సింగు మున్నగు విషయములపైన యీమె పెక్కుగ్రంథములను రచియించెను. ఆమె వ్రాసిన గ్రంథములలో ఇండియాలోని బ్రిటిషు సైన్యపు ఆరోగ్యమునుగూర్చియు, ఈ దేశములోని పారిశుద్ధ్యమును అభివృద్ధిపరచుటనుగూర్చియు వ్రాసినవి చాల విలువైనవి. ఆమె జీవితకాలమంతయు ఇండియా పరిస్థితులనుగూర్చి కడుశ్రద్ధతో విచారించుచుండెను.

ఆమె 1910-వ సంవత్సరమున చనిపోగా, ఆమె యిష్టప్రకారము [2]ఈస్టు వెల్లో అను స్థలములోని చిన్న సమాధులతోటలో నెమ్మదిగా సమాధిచేయబడెను. ఆమె కోరియుండినయెడల, [3]వెస్టు మిన్‌స్టర్ ఆబీ అను గొప్ప భవనములో ప్రఖ్యాతిగలిగిన యితరులతోకూడ ఆమె దేహము పాతిపెట్టబడి యుండెడిది. ఆమె మరణముకొరకు నాగరికతా ప్రపంచమంతయు విచార మగ్నులయిరి. ఇంగ్లీషు సైనికులు ఆమె శవపేటికను సమాధికి మోసికొనిపోయిరి.

ఫ్లారెన్సు నైటింగేలు కన్యయే ఆధునిక రోగుల పరిచర్యకు పునాది వేసినది. ఆమె కాలమునుండి నేటివరకు నర్సులను తర్బీతుచేయుపని దిన దినాభివృద్ధి నొందుచున్నది. ఆస్పత్రి నర్సింగు డిపార్టుమెంటు, తర్బీతు

[1] The Florence Nightingale Nurses' Home and Training School for Nurses. [2] East Wellow. [3] Westminster Abbey.



పొంది, మంచి యోగ్యతార్హతలు గల ఒక నర్సు చేతిక్రింద నుండవలెనని నైటింగేలు కన్య యేర్పాటుచేయగా, ఆ కాలపువారికి అది [1]తిరుగుబాటు చేయునంతటి దిద్దుబాటుగానుండెను. వ్యవహార జీవితములో నర్సింగు ఉద్యోగమునందుండగల గొప్ప ప్రత్యేకపు మేలులనుగూర్చి ఆమె నొక్కి చెప్పుచుండెను. ఆమె అధిక మతభక్తి గలిగినదిగాని, క్రియాపూర్వకమైన జీవితమే నిజమైన మతముయొక్క శ్రేష్ఠమైన లక్షణమని ఆమె భావించెను. నైటింగేలుకన్య చేసిన తిరుగుబాటు దిద్దుబాటులతోకూడ, వైద్య, శస్త్రశాస్త్రములయందును ఇట్టి తిరుగుబాటు దిద్దుబాటులు చేయబడెను. లూయి పాశ్చురు, సెమల్‌వైస్, రాబర్టుకోక్, లైస్టర్ మున్నగు శాస్త్రజ్ఞులు క్రొత్తగా కనిపెట్టిన గొప్ప విషయములనంతరము పైజెప్పిన దిద్దుబాటులు జరుగుట సహజమే. ఈ దిద్దుబాటులు, మార్పులవలన నర్సింగుయొక్క విలువ, ప్రమాణములు హెచ్చినవి. అందువలన ఉన్నత విద్య నభ్యసించిన స్త్రీలు ఈ పనికి ఆకర్షించబడిరి.

బహుశః 1854-వ సం॥లో మద్రాసు ఆస్పత్రిలో ఇండియాలోని నర్సులను తర్బీతుచేయుటకు ప్రథమ ప్రయత్నముచేయబడెను. సక్రమమైన నర్సుల ట్రెయినింగు పాఠశాల మొదట 1886-వ సం॥ బొంబాయిలోని 'కామా' ఆస్పత్రిలో తెరువబడెను. నర్సులను తర్బీతుచేయుటలో మిషను ఆస్పత్రులు మొదటమార్గము చూపినవి. ఇప్పుడు గవర్నమెంటు ఆస్పత్రులకు సంబంధించిన కొన్ని ట్రెయినింగు పాఠశాలలును గలవు. కులకట్టుబాట్లు, విద్యావిహీనత, మంచి కుటుంబములలో బుట్టిన స్త్రీలు చేయతగదని భావించిన నీచమయిన యీ పనిని చేయుటకు అయిష్టము, అను కారణములు ఇండియాలో నర్సింగు అభివృద్ధిపొందుటకు ఆటంకములుగా నుండెను. మాతృభాషలో సరియైన పాఠపుస్తకములు లేకపోవుట, దీనికితోడు తర్బీతుపొందిన తరువాత, చదివి జ్ఞానమును వృద్ధిచేసికొని పట్టభద్రులగుటకు అవకాశములు లేకపోవుటయు, నర్సింగు వృద్ధిపొందుటకు ఆటంకములైయుండెను.

[2]ట్రెయిండ్‌నర్సస్ అసోసియేషన్ అనునది 1908-వ సంవత్సరములోను, [3]నర్సస్ ఆక్జిలరి ఆఫ్ ది క్రిస్టియన్ మెడికల్ అసోసియేషన్ ఆఫ్

[1] Revolutionary feature.
[2] The Trained Nurses' Association of India.
[3] The Nurses' Auxiliary of the Christian Medical Association of India.

ఇండియా అనునది 1930-వ సంవత్సరములోను ఏర్పాటుచేయబడినవి. ఈ రెండు సంఘములును నర్సింగు ప్రమాణమును హెచ్చించుటకు చాల పాటుపడినవి. ఇప్పుడు కొన్ని రాష్ట్రములలో నర్సులకు గవర్నమెంటు రిజిస్ట్రేషను ఉన్నది. ట్రెయిండ్ నర్సస్ ఆఫ్ ఇండియా అను సంఘము [1]ఇంటర్ నేషనల్ కౌన్సిల్ ఆఫ్ నర్సస్ అను సంఘముతో చేర్చబడినది. ఈ రెండవది, అన్ని దేశములలోనున్న నర్సులు ఒండొరులతో సహకారముకలిగి పనిచేయుట మంచిదని భావించిన (మిసెస్) ఎతెల్ బెడ్‌ఫోర్డు-ఫెన్‌విక్ అమ్మగారివలన 1899-వ సం॥లో స్థాపించబడినది.

రోగులకును, బాధితులకును సహాయము, పరిచర్య చేయు మరియొక అంతర్జాతీయ సంస్థ, రెడ్ క్రాస్ సొసైటి యనునది. దీనిని యుద్ధముయొక్క భయంకరమైన ఫలితములను స్వయముగా అనుభవించిన [2]హెన్రి డునాంటు అను జీవకారుణ్యుడైన ఒక స్విజరులండు దేశీయుడు 1863-వ సం॥లో స్థాపించెను. మొదట ఈ సంఘము, యుద్ధకాలములో బాధపడువారికి సహాయము చేయుటకుమాత్రమే యేర్పడెనుగాని, క్రమేణ దాని ప్రభావము హెచ్చినకొలది సమాధానకాలములోకూడ పనిచేయుటకు పూనుకొనెను. నర్సింగువిషయములో ఈ సంఘము విశాలమైన ప్రభావము గలిగియుండెను. ఇప్పుడు ఇది ముఖ్యముగా, గ్రామాదులలో ప్రజారోగ్యమును గూర్చిన నర్సింగు, విపత్తుకాలములలో బాధనివారణకొరకు చేయవలసిన నర్సింగు, [3]సైన్యము, నౌకాదళములలో మొదటి రిజర్వు ఆరోగ్యమార్గము, గృహపరిచర్యలను బోధించుట మొదలగు విషయములనుగూడ నిర్వర్తించుచున్నది.

ప్రస్తుతకాలములో ఈ నర్సింగుయొక్క విశేషమేమనగా [4]"ప్రత్యేక ప్రావీణ్యత" సంపాదించుటయే. అంటురోగములు కాని వ్యాధులకు జనరల్ ఆస్పత్రులను స్థాపించుటయేకాక, ఒక్కొక్క అంటువ్యాధికి ఒక్కొక్క ప్రత్యేకమైన వైద్యశాలయు నేర్పాటుచేసియున్నారు. పురుషులకు, స్త్రీలకు, బిడ్డలకు [5]పురాణ దీర్ఘరోగములకు, కంటికి, చెవికి, ముక్కుకు, గొంతుకు అనగా ఈ యవయవములకు కలుగు రోగములకును కాన్సరు అను కొరకుపుండుగల రోగులకును, క్షయరోగులకును ప్రత్యేక వైద్యశాలలు గలవు.

[1] International Council of Nurses. [2] Henry Dunant.
[3] First reserve in army and navy. [4] Specialization. [5] Chronics.



ప్రస్తుతపు నర్సింగుకళలో [1]ప్రజారోగ్యమును గూర్చిన నర్సింగు ప్రాముఖ్యత వహించినది. ఎందుకనగా, ఇది వైద్య, పారిశుద్ధ్యశాస్త్రములతోపాటు సమానముగా లెక్కించబడుచున్నది. ఇకముందు మంచి సాంఘికక్రమము ఏర్పడుటకు ఇది యుపయోగపడవచ్చును.

## నర్సింగుయొక్క నైతికధర్మము

[2]నర్సింగుయొక్క నైతికధర్మములో నర్సింగువృత్తియొక్క ఆదర్శములు, భావములు, అంతస్థులు ఇమిడియున్నవని చెప్పవచ్చును. ఈ నీతి నియమములు సంవత్సరములకొలది సంపాదించిన అనుభవముమీద ఏర్పడినవిగాన, ఇవి నర్సులకును, రోగికిని రక్షణగానుండి, నర్సింగుపని ఒడుదుడుకులు లేకుండగను, సుఖముగను నిర్వహించుటకు తోడ్పడును.

నర్సింగుపని చేయగోరువారు ప్రజలయెడల గాఢమైన ప్రేమయు, వారికి సేవచేయుటయందు నిజమైన ఇచ్ఛయుగలిగినవారై యుండవలెను. దృఢమైన శరీరము, విద్యావిజ్ఞానములుగల మనస్సు, ఉన్నతమైన నీతి, శీలము ఈ పనిచేయువారికి ఉండవలసిన సులక్షణములు.

నర్సు తన ఉద్యోగధర్మమునుబట్టి నిరంతరము రోగములను, నిస్సహాయకరమగు స్థితిగతులను జూచుచుండును. కావున ఆమెకు దేహబలము, అధికమైన ఓర్పు ఉండుటయేకాక, దృఢమైన మనోశక్తి, నీతిశక్తియునుండుట ముఖ్యావసరము. వ్యాధివలన రోగి అసాధారణప్రవర్తనగలిగి వర్తించునని నర్సు త్వరలోనే తెలిసికొనును. అనేకమంది రోగులు విసుగుపుట్టించుటయు, పనులుచేయుటయందు అసహ్యము కలుగుటయు సహజము. నర్సింగు చాల కష్టమైనపనియైనందున తెలివిగలిగి పనిచేయుట అవసరము. కండ్లుమూసికొని లోబడుటకాదుగాని, అందరితో కలిసిమెలసి సమిష్టిగా పనిచేయుటయే వైద్యశాల క్రమశిక్షలో గమనించవలసిన ముఖ్యవిషయము.

బలమైన దేహమనగా, మంచి ఆరోగ్యము, జీవశక్తి కలిగియుండుట. ప్రకాశించు ఆరోగ్యము, ధైర్యము, జాలితోకూడిన శ్రద్ధ, అనుతాపము మొదలగు లక్షణములు ఒక నర్సునందు కనబడుచుండినయెడల, ఆమె రోగియందు నిరీక్షణ, నమ్మకము, ఆత్మయందు తృప్తి పుట్టించగలదు. నర్సు

[1] Public health. [2] Ethics of Nursing.

నకు తెలుపును. వారు దానిని అంగీకరించి తక్కిన నర్సులందరికి సమానముగా ఆ బహుమతిని పంచిపెట్టనచ్చును. ఏదైన ఒక బహుమతిని పుచ్చుకొనుటలో తప్పేమిలేదని నర్సు అనుకొనవచ్చునుగాని, అట్టి బహుమతినిచ్చు రోగి తనకు ప్రత్యేకముగా ఎక్కువ సేవచేయుమని, బహుమతి పొందిన నర్సును గోరును. కాని ఆమె అట్లు చేయకూడదు. ఎందుకనగా రోగులందరిని పక్షపాతములేక సమదృష్టితో పరామర్శించుటయే నర్సుయొక్క విధియు, ధర్మమునై యున్నది. లంచము పుచ్చుకొనుట వలన క్రమేణ నర్సుయొక్క మనస్సు కఠినపడి, బహుమతు లిచ్చిననేకాని, పరిచర్య చేయకపోవచ్చును. ఈ యలవాటును ఎంత గట్టిగనైనను ఖండించనచ్చును. ఎక్కడచేసినను లంచమువలన తుదకు శీలము చెడిపోవును. కావున అందరికంటె ముఖ్యముగా నర్సులు ఈ శోధనకు లోబడకూడదు. పుచ్చుకొనుటకాదు గాని, ఇచ్చుటయే నర్సులయొక్క గురియై యుండవలెను.

నర్సుకు ఆత్మీయబలమును అవసరమైయుండును. రోగులు బలహీనులు గనుక, ముందు ఏమి జరుగనైయున్నదో యెరుగక భయపడి, కలవరము చెందియుందురు. దేవుడు సహాయముచేయగలడు; చేయునని అట్టి రోగులకు బోధించి, వారికి ధైర్యము, దేవునియందు విశ్వాసము కలిగించగలిగిన యెడల, ఆమె శాశ్వతమైన సేవచేసిన దగును. బలమైన మతవిశ్వాసము వలన, రోగనివారణము కాగలదని వైద్యులు ఇదివరకంటె ఇప్పుడు ఎక్కువగా నమ్ముచున్నారు. నర్సుకు స్వంతమైన లోతైన ఆత్మీయ అనుభవము ఉండిననే కాని, బాధయు, దుఃఖమును గల అనేక సమస్యలు ప్రతిదినము కలుగుచుండునపుడు, ఆమె వానిని ఎదుర్కొని సాధించగల శక్తిలేనిదై యుండును.

**ప్రొబేషను అనగా జూనియర్ స్టూడెంటు నర్సు**

క్రొత్తగా నర్సింగులోచేరు అభ్యర్థి తాను చేయవలసిన విధులు ఎటువంటివో తెలిసికొనుటకును, నర్సింగు సూపరింటెండెంటు ఆ పనులు చేయుటకు అభ్యర్థియొక్క అర్హతను నిరూపించుకొనుటకును పెక్కు వైద్యశాలలలో తాత్కాలిక కాలము కొంతయుండును. ఈ కాలమునకు తరువాత అభ్యర్థి అర్హురాలనిగాని, అర్హుడనిగాని నిర్ణయించబడినయెడల, ఆమెను లేక ఆయనను వైద్యశాల పనివారి పట్టీ క్రిందచేర్చి, జూనియరు స్టూడెంటు



నర్సుగా భావింతురు. అప్పటినుండి నర్సు ఆస్పత్రి దుస్తులుధరించి, తరగతులకు హాజరై వైద్యశాలయొక్క విధ్యుక్తమైన పనులు చేయుచుండును. మానసికాభ్యాసములను వృద్ధిచేసికొనుటవలన నర్సు త్వరలోనే అనేక ముఖ్యవిషయములయొక్క మూలసూత్రములను గ్రహించును. తాను నేర్చుకొనినవానిని అభ్యాసముచేయుటవలన, రోగుల పరిచర్యచేయుటకు ఆమె చెయ్యి నేర్పుగలదై, పనిని నిదానముగాను, నిలకడగాను చేయుటకు అలవాటుపడును. నర్సు తన పనులను ఎప్పుడైనను తొందరపడి వణకుతో చేయకూడదు ఆమె స్వరము మెల్లగను, నిదానముగను నుండవలెను. అనగా, ఎప్పుడైనను పెద్దగా వాదించినట్టుగాని, చాడీలు చెప్పినట్టుగాని అరువకూడదు. అన్ని స్థితిగతులయందును ఒక విధమైన నిలకడయు, [1]ఆత్మవశమునుగలిగి పనిచేయును. ఇట్లుండుటవలన ఆమెకు జాలిలేదనిగాని, బుద్ధిసూక్ష్మతలేదనిగాని తలంచకూడదు. ఆమె తనలో పుట్టుచున్న భావోద్రేకములను క్రమపరచుకొని, అత్యవసర సమయములలో ఆమె రోగికి మరి యెక్కువ సహాయము చేయుచున్నదని మనము గ్రహించవలెను.

**సీనియరు స్టూడెంటు నర్సు**

జూనియరు నర్సుకంటె సీనియరు నర్సుకు పనులు, బాధ్యతలు ఎక్కువయుండును. కావున ఆమె లేక ఆయన పనిలో తన్ను తాను మరచిపోయి, ధైర్యమును ఆత్మ నమ్మకమును గలిగియుండవలెను. తనకంటె చిన్న నర్సులకు పని నేర్పుటయందును, వారిపనులు తిరిగిచూచుట, పై విచారణ చేయుటయందును, పనులను క్రమపరచి చేయించుటయందును సీనియరు నర్సు హెడ్ నర్సునకుగాని, నర్సింగ్ సూపరింటెండెంటునకుగాని సహాయపడుచుండవలెను. వైద్యశాల పనులన్నిటిలో సమాధానము, ఐక్యత యుండునట్లును, రోగులను సంతోషపెట్టగల అనేక చిన్న సంగతులను జూచుటయందును సీనియరు నర్సు పాటుపడుచుండవలెను. పనిచేయించుచుండగా అధికారము చెలాయించుటవలన ఇతరులను నొప్పించకుండ నుండుటకును, సూపరింటెండెంటుగారి పనులలో జోక్యము కలిగించుకొనకుండ నుండుటకును సీనియరు నర్సుకు మంచి నేర్పు, బుద్ధికుశలత యుండవలెను. సీనియరు నర్సు రోగిని పరామర్శించు పనిమీదనుండగా, రోగియందు కనబడుచుండు ప్రత్యేక రోగచిహ్నములను శ్రద్ధతో గమనించి,

[1] Self-control.

పనినుండి వెళ్లిపోవునపుడు తాను గమనించిన విషయములన్నిటిని జాగ్రత్తగా వ్రాసి, అధికారులకు తెలుపవలెను.

### స్టాఫ నర్సు లేక సిస్టర్

స్టూడెంట్ నర్సులను తర్ఫీతుచేయుటయే స్టాఫ్ నర్సు పనులలో ముఖ్యమైనది. స్టాఫ్ నర్సుగా పనిచేయుచున్న ఆయన లేక ఆమె, డాక్టరుగారి ఆజ్ఞల ప్రకారము పనులన్నియు ఆలస్యము లేకుండ సకాలములో జాగ్రత్తగా చేయబడినవో లేదో యని విచారించవలెను. మరియు రోగులకు మంచి పరిచర్య జరుగునట్లును చూడవలెను. స్టూడెంట్ నర్సుల పట్ల స్టాఫ్ నర్సు దయతోను స్నేహభావముతోను మెలగవచ్చునుగాని, పక్షపాతము మాత్రము చూపకూడదు. కొన్ని నిమిషములవరకైనను పనినుండి పిలువబడినయెడల, తనకు తరువాతనుండు సీనియరు నర్సును తన బదులు పనిలోపెట్టి పోవలెను. షెడ్యూలు అనగా కాలనిర్ణయపట్టీ ప్రకారము పనిని ఏర్పాటుచేసి అంతయు సక్రమముగా జరుగునట్లు ప్రయత్నించవలెను.

### రాత్రిపని

నర్సుయొక్క పనులలో [1]రాత్రిపని పెక్కు బాధ్యతలతోగూడినట్టి పనియైయున్నది. నర్సు తన ఆత్మవశమును, మంచి తీర్మానముచేయు శక్తిని పరీక్షించుకొనుటకును, వృద్ధిచేసికొనుటకును ఈ రాత్రిపని మంచి అవకాశము నిచ్చును. రాత్రులలో పై విచారణ యేమియునుండదు; ఉన్నను బహు కొద్దిగానుండును గాన, డాక్టరుగారి ఉత్తర్వుల ప్రకారము చేయుటలోను, రోగులకు సరిగా పరిచర్య చేయుటలోను నర్సుయొక్క బాధ్యత పగటి కాలముకంటె రాత్రికాలము ఎక్కువైయుండును. నర్సు పనిలోనికి రాగానే మొదట ఏవైన ప్రత్యేకమైన ఉత్తర్వులున్నవేమో చూచుకొని, మందుల యందుగాని, చికిత్సలయందుగాని చేయబడిన మార్పులను గుర్తించిన పిమ్మట ఒక్కొక్క రోగిని దర్శించవలెను. ఇట్లు చేయుటవలన ఏ పనినికూడ అలక్ష్యము చేయకుండుటయేకాక, మిక్కిలి తక్కువకాలములో, చేయవలసిన పని అంతయు చేయుటకును వీలగును. రాత్రిపనిలో నిద్రపోవుట గొప్ప తప్పు గాన, పనినుండి విరమించినతరువాత విశ్రాంతి తీసికొనవలసిన

[1] Night duty.



కాలములో చాలినంత నిద్రపోయి, విశ్రాంతి తీసికొని, రాత్రులలో నిద్రపోవు శోధన జయించవలెను. రాత్రులలో రోగులయొక్క స్థితి యెట్లున్నదో యని నర్సు జాగ్రత్తగా గమనించవలెను. ఇట్లు చేయుటవలన చార్టులు సరిగా, తప్పులులేకుండ వ్రాయుటకును ఉదయమున నియ్యవలసిన రిపోర్టులు తప్పులులేకుండ ఇచ్చుటకును వీలగును. దీపముల వెలుగు రోగుల కండ్లమీద పడకుండ, అనగా, వాని వెలుగు రోగుల కండ్లకు తగలకుండ నర్సు జాగ్రత్తగా చూడవలెను. రోగికిచేయు చికిత్సలో నిద్రయు, విశ్రాంతియు చాల ముఖ్యమైనవి గనుక ఒక్కొక్క రోగి బాగుగా నిద్రించునట్లును, విశ్రాంతి తీసికొనునట్లును నర్సు తన శక్తియున్నంతవరకు ప్రయాసపడవలెను. వేకువజామున చలిగాలి తగులకుండ మంచి జాగ్రత్త తీసికొని రోగులకు దుప్పట్లు కప్పవలెను. నర్సింగుపనిచేయుటకు అవసరమైన సామానులు అన్నిటిని జాగ్రత్తగా వాడి, నష్టముకాకుండ వానిని ఉపయోగించవలెను. ఉదయమున నర్సు తన పనినుండి విరమించునప్పుడు వార్డులన్నియు శుభ్రముగాను, క్రమపరచబడియు నుండవలెను.

నర్సింగు పని చేయునంతకాలము యోగ్యుడైన, లేక యోగ్యురాలైన నర్సుకును, ఆయన లేక ఆమె పనికిని గల సంబంధము 'భక్తి విశ్వాసములు, గలిగియుండుట' అను మాటలయందు ఇమిడియున్నదని చెప్పవచ్చును. ఇదియే ఆమె లేక ఆయన పనియొక్క ఉన్నతమైన ఆదర్శమై యుండును. వైద్యశాలయొక్కయు, ట్రెయినింగ్ పాఠశాలయొక్కయు ఆజ్ఞలకు లోబడి, వానియొక్క మంచి పేరును గౌరవమును కాపాడి, వానియందు భక్తి విశ్వాసములు గలిగియుండవలెను. సహనర్సులు తమ జీవితోద్యోగముగా కోరుకొనిన ఈ నర్సింగు పనిని తమ శక్తి వంచనలేక చేయునట్లు వారికి సహాయము చేయవలెను. తన పైనున్న పెద్దల అధికారమునుగూడ పైకెత్తిపట్టి, వారి శక్తి యుక్తులయందును, వారు జాగ్రత్తగా చేయు చికిత్సల యందును రోగులకు నమ్మకము పుట్టించవలెను. రోగులు తమ్మును గూర్చియు, తమ కుటుంబములనుగూర్చియు తెలియజేయు రహస్య విషయములను గుప్తముగా నుంచవలెను. తన స్వంతకార్యములు అనగా, దినదినము చేయవలసిన పనులయందు తన శక్తి యున్నంతవరకు ప్రయాసపడుచుండవలెను. ఇట్లు చేసి ఒక్కొక్కరియెడలను, తన పనియందును గల భక్తి విశ్వాసములను జూపుచుండవలెను. యేసు ప్రభువు ఈ లోకములో

కొద్దికాలము (కొన్ని సంవత్సరములు) మాత్రమే జీవించెనుగాని, దానిలో ఎక్కువకాలము రోగులను స్వస్థపరచుచు, మరణము వరకు తన పని యందు తనకుగల భక్తి విశ్వాసములు జూపెను. ఇట్టి ఆదర్శప్రాయుడైన ప్రభువుపట్ల ఎల్లప్పుడు భక్తి విశ్వాసములు కలిగియుండుటకు నర్సు ఎప్పుడును మరువకూడదు. ఈ యధ్యాయమును ముగించుచున్న యీ క్రింది ప్రమాణమును నమ్మకముగా గైకొని ఆచరించుట ప్రతి నర్సుయొక్క గుఱియై యుండవలెను.

### ఫ్లారెన్సు నైటింగేలు ఒప్పందము

'దేవునియెదుటను, ఈ సమూహము ఎదుటను, నా జీవితమును పవిత్రముగ నుంచుకొనుటకును, నా వృత్తియందు విశ్వాసముగ నుండుటకును, నేను భక్తి పూర్వకముగ ఒప్పందపడుచున్నాను. హానికరమైనట్టియు, దుర్మార్గమైనట్టియు, దేనినైనను నేను విసర్జించుదును. అపాయకరమైన యే మందు దినుసునైనను నేను పుచ్చుకొనను. దానిని బుద్ధి పూర్వకముగా రోగులకైనను వాడను. నా వృత్తికి సంబంధించిన యంతస్థును గొప్పజేయుటకు నా శాయశక్తుల పాటుబడుదును. నా యుద్యోగధర్మములో నాకు తెలియవచ్చు వ్యక్తిగతమైన విషయములు, కుటుంబ వ్యవహారములను అతిగూఢముగా నుంచగలదానను. వైద్యునకు భక్తి విశ్వాసములతో సహాయమొనర్చుటకు పాటుపడుదును. నా సంరక్షణకు నొప్పగింపబడిన వారి క్షేమముకొరకు నన్ను నేను సమర్పించుకొనుచున్నాను.'

## అధ్యాయము 2

# శరీరారోగ్యము—ప్రజారోగ్యము

### శరీరారోగ్యము

ఆధునికకాలపు నర్సులు తమ శరీరారోగ్యము లేక ఆరోగ్యశాస్త్రమునుగూర్చి ప్రత్యేక శ్రద్ధ వహించవలెను. ఎందుకనగా వారు తమ ఆరోగ్యమును మంచి స్థితియందుంచుకొనుటయేకాక, ఇతరుల కారోగ్యము చేకూర్చుటయు, ఆరోగ్యవిధులు నేర్పుటయు వారి గుఱియై యున్నది. ఈ గుఱి సక్రమముగా నెరవేరుటకు నర్సులు మంచి ఆరోగ్యవంతులుగాను ఉత్సాహభరితులుగాను నుండవలెను. అట్లుండినచో ఇతరులు వారి ననుకరింప నభిలషింతురు.



ప్రజలు ఆరోగ్యముగా నెట్లు జీవించగలరో వారికి తెలియజేయుటకుగాను, ప్రస్తుతకాలపు నర్సుకు బాహ్యారోగ్యము మాత్రముండిన చాలదు; మానసికారోగ్యముగూడ ఉండుట చాల అవసరము. [1]మానసికారోగ్య శాస్త్రము, మన స్వంతజీవిత సమస్యల నెదుర్కొని సమర్థించుకొనుటకు మనకు సహాయపడుటయేకాక, ఇతరుల కష్టములు గ్రహించుటకుగూడ తోడ్పడును.

తర్ఫీతుపొందుచున్న నర్సులు, జీవితములో కొద్ది యనుభవమే కలిగినవారైనను, వెవ్వేరు వయస్సులుగల బాలబాలికలను, వయసుకు వచ్చుచున్న యౌవనులను, పెద్దవారిని, వృద్ధులనుగూడ పరామర్శించవలసి యుండును. తమ స్వంత ఆరోగ్యమును చురుకుదనమును కాపాడుకొనుట యందు అనుసరించిన నియమములనే, తాము పరిచర్య చేయవలసిన ప్రతివిధమైన రోగికిని అన్వయించి పనిచేయవచ్చును. భోజనము, శరీర శుభ్రత, దుస్తులు, శరీరవ్యాయామము, పరిశుభ్రమైనగాలి, విశ్రాంతి, ఆరోగ్యకరమైన [2]వ్యక్తిత్వము అను విషయములనుగూర్చి ప్రతిదినము అభ్యాసము చేయవలసిన నియమములను గ్రహించి, యితరులకు వానిని అన్వయింపచేయుటమీదనే నర్సుయొక్క స్వంత ఆరోగ్యమును, ఆమె పరిచర్యచేయు రోగియొక్క ఆరోగ్యమును ఆధారపడియుండును.

### ఆహారము

ప్రతి మానవుడు మంచి మిశ్రమ ఆహారమును భుజించుట అవసరము. దానిని నియమితకాలములో సంతోషకరమైన పరిస్థితులలో, సరసముగా ముచ్చటించుచు తినుటకు తగినంత సమయముండవలెను. భోజన కాలముల మధ్య తినుటవలన జీర్ణశక్తికి అధిక శ్రమ నియ్యరాదు. పెద్దలు దినమునకు మూడుపూటలు భుజించిన చాలును గాని, పిల్లలు, ముసలివారు, ఆరోగ్యహీనులు కొద్దికొద్దిగా పెక్కుసారులు భుజించ వలసియుండును. మూత్రపిండములు, చర్మము, మలము మొదలగువాని మూలమున దేహమునుండి బయటికి విసర్జింపబడు నీటికి సరిసమానముగా తూగునంత నీటిని మనము త్రాగుచుండవలెను. మరియు శరీరములోని ప్రతి [3]జీవకణమునందు జరుగుచున్న రసాయనిక మార్పులకు చాలినంత

[1] Mental hygiene. [2] Personality. [3] Cell.

నీటినిగూడ మనము త్రాగుచుండవలెను. ఉష్ణదేశమునందు దినమునకు అధమపక్షము 4 పైంట్ల నీరైనను త్రాగుట అవసరము.

బిడ్డలు పుట్టిన మొదటి తొమ్మిదిమాసములవరకు తల్లిపాలే వారికి అతి శ్రేష్ఠమైన ఆహారమైయుండును. ఈ దేశములో తల్లిపాలకు బదులు, ఆవుపాల నుపయోగించుటకు చాలమందికి శక్తిలేదు గనుక, బిడ్డకు 18 మాసముల వయస్సు వచ్చువరకు తల్లిపాలు మరిపించుటకు వీలుకాక పోవుచున్నది. అయినను 9 నెలలనుండియే బిడ్డకు పాలకు తోడు మిశ్రమ ఆహారమును కొద్దికొద్ది కొలతలుగా, పలుమారులు ఇచ్చుట అవసరము. వివిధ రకములైన గంజి, సూపు, అనగా ఎముకలు, మాంసము, కూరలు మొదలగువానితో చేయబడిన చారు, బాగుగా వండిన అన్నము, బాగుగా ఉడకబెట్టి నలుగగొట్టిన కూరగాయలు, గ్రుడ్లు, చేపలు, కోళ్లు, తాజా లేక ఉడికించిన పండ్లు—వీనిని క్రమక్రమముగా వారి భోజనమునకు చేర్చుచుండవలెను. బిడ్డ పెరుగుకొలది, బలమువచ్చి యెక్కువ బరువు తూగునట్లు చేయగల ఆహారమును బిడ్డకు ఇచ్చుచుండవలెను. బిడ్డ పెద్దదగుచుండుకొలది, భోజనమును క్రమేణ హెచ్చించుచు నిచ్చుచుండవలెను.

పెరుగుచున్న బాలుడుగాని, బాలికగాని యుక్తవయస్సునకు వచ్చుచుండు సంవత్సరములలో, మాంసకృత్తులు, విటమినులు విస్తారముగాగల ఆహారపదార్థములు తినుట అవసరము. ఎందుకనగా ఈ కాలములో [1]పునరుత్పత్తిచేయు, వారి యవయవములు వృద్ధిపొందుచు చురుకుగ పనిచేయుటకు ఆరంభించును. కావున ఒక యౌవనుని బలమంతయు పై చెప్పిన అవయవముల పెంపునకు చాలవరకు వినియోగపడుచుండును గాన, అతడు లేక ఆమె అధికముగా భుజించి, పోయిన బలమును తిరిగి చేకూర్చుకొనుచుండవలెను. ఈ కారణములనుబట్టి తరచుగ యౌవనునికి పెద్దవానికంటె ఎక్కువ భోజనము అవసరము.

ఆరోగ్యముగలిగిన ఒక పెద్దవాని భోజనము అతడుచేయు పనినిబట్టి యుండును. చాల పనిగలిగి, బహిరంగ స్థలములలో దేహపరిశ్రమ చేయువారు, వీరు ఉపయోగించునంత బలము నుపయోగించి పనిచేయని వారికంటె, ఎక్కువ ఆహారము భుజించుట అవసరము.

[1] Organs of generation.



నర్సులు చాలినంత భోజనము, ముఖ్యముగా చాలినన్ని [1]మాంసకృత్తులు, విటమినులుగల ఆహారము భుజించుట అవసరము. తమ జాగ్రత్తలోనున్న రోగులు చేయగల దేహపరిశ్రమనుబట్టి వారి యాహారముగూడ క్రమపరచబడునట్లు నర్సు చూడవలెను. పెద్దవారగుచున్న యౌవనులు పుచ్చుకొనునంత ఆహారము మధ్యవయస్సుగలవారికి అవసరములేదు. వయస్సులోనున్నవారికంటె, వృద్ధాప్యములోనున్నవారికి తక్కువ మాంసకృత్తులు, పిండిపదార్థములు అవసరమని నర్సు తెలిసికొనవలెను. ముసలివారైన రోగులకు జీర్ణము కాగలిగినవిధముగా కొద్ది కొలతలుగల భోజనము పలుమారు పెట్టుచుండవలెను. భోజనము వారికి ఆకర్షణీయముగాను, వేళకు క్రమముగాను వడ్డించుచుండవలెను.

[2]బహిష్కార్యమండలముయొక్క ఆరోగ్యశాస్త్రము

బహిష్కార్య అవయవములనుగూర్చిన ఆరోగ్యశాస్త్రములో బాహ్య, అంతరావయవములనుగూర్చిన పరిశుభ్రత ఇమిడియున్నది. ఎవరి స్వంత ఆరోగ్యమునకైనను బాహ్యశుద్ధి యెల్లప్పుడు అవసరమే; కాని వైద్యశాలలలో పనిచేయువారికి ఇది మరి యెక్కువ అవసరము. ఎందుకనగా, అక్కడ అశుభ్రముగా నుండుటవలన వ్యాధి బీజములు పుట్టుచుండును. ఇట్టిదానితో ప్రతిదినము పోరాడుట నర్సుయొక్క ప్రథమకర్తవ్యము. దాని వలన ఆమెకును లేక ఆయనకును, రోగికిని మేలుకలుగును.

ప్రతిదినము సబ్బు, వెచ్చని నీళ్లతో స్నానముచేసి చర్మమును బాగుగాకడిగి శుభ్రముగా నుంచవలెను. మరియే యితరమార్గముల వలననైనను చెమట గ్రంధుల ద్వారములు తెరువబడి, వానిద్వారా మలిన పదార్థము విసర్జించబడుటకు వీలుకాదు. చర్మములోని పగుళ్లమూలమున గాని పెదవులు, పురీషనాళము, యోని—వీనితో కలిసికొను [3]అమత్వచగల తడి చర్మము మూలమునగాని వ్యాధి బీజములు దేహములోనికి ప్రవేశించ వచ్చును. కావున ఈ భాగములను ముఖ్యముగా శుభ్రము చేయవలెను. అట్లే [4]చంకలు, [5]గజ్జలు, స్తనములక్రిందనుండు చర్మపు ముడతలనుగూడ శుభ్రము చేయుచుండవలెను. చర్మము ముడతలుపడు భాగములను జాగ్రత్తగాకడిగి, తుడిచి, యెండనియ్యవలెను. తడియంతయు ఆ[illegible]వ

[1] Protein and Vitamins. [2] Hygiene of the excretory system.
[3] Mucous membrane. [4] Axilla. [5] Groin.

తరువాత చెమట విస్తారముగా పోయునప్పుడు, తడి నార్పునటువంటి మంచి డస్టింగ్ పౌడరు కొట్టవలెను. అట్టిభాగములను బాగుగాకడిగి, తుడిచి, ఆరనిచ్చినవెనుక, కొంచెము నూనె బాగుగ పూయుటయు మంచిది.

వ్రేలిగోళ్ల సందులు, వ్యాధిబీజములు శరీరములో ప్రవేశించుటకు అనుకూలమైన స్థలములు. గోళ్ల సందునున్న చర్మము పొడుగుగా పెరగకుండ దానిని గోళ్లదగ్గరకు కత్తిరించవలెను. వ్రేలి చివరి యాకారమువలెనే గోటిని కత్తిరించవలెను. వ్రేలిచుట్టునున్న తోలుపొర, లోపలికి పోయియుండునట్లు అభ్యాసము చేయవలెను. కాలిగోళ్లు పెరిగి ముందుకు రాకుండ వానిని వ్రేలిచుట్టు మట్టమునకు కత్తిరించవలెను. పాదములను ఎల్లప్పుడు శుభ్రముగా నుంచుకొనవలెను. కాలివ్రేళ్లమధ్య చర్మము పొడిగా నుండునట్లు చూడవలెను. మడిమలలోగాని, పాదముయొక్క మరియేభాగమునగాని పగుల్లుండినట్లయిన వానిని వెంటనే గమనించి, చికిత్సచేయవలెను. లేనియెడల వీనివలన నెక్కువ బాధకలుగుటయే కాక, [1]కొంకిపురుగులు ఇతర సూక్ష్మజీవులు శరీరములోనికి ప్రవేశించుటకు ఇవి తగినమార్గములగును. అంటువ్యాధులు సోకకుండ నుండుటకు నర్సు పనిమీదనున్నంతకాలము పాదరక్షలు వేసికొనవలెను.

వారమున కొకసారి శిరస్నానముచేసి పుర్రెను వెండ్రుకలను శుభ్రముగ నుంచుకొనవలెను. ప్రతిదినము వెండ్రుకలను చక్కగ దువ్వుకొనవలెను. రోగియొక్క వెండ్రుకలను నర్సు ప్రతిదినము దువ్వుచుండినయెడల, ఆమెకు అప్పుడప్పుడు స్నానము చేయించిన చాలును. వెండ్రుకలలో పేలుచేరి యుండినయెడల [2]బైక్లోరైడ్ ప్యాక్‌గాని, కిరసనాయిలుగాని తలకు వేయుటవలన ఈ పేలను వెంటనే చంపివేయవచ్చును. ఈపిని వేడికాడి పూసి, సన్నని పండ్లుగల ఒక మంచి దువ్వెనతో దువ్వుటవలన తీసివేయవచ్చును.

దేహములోని మలినపదార్థములు, మలమూత్రములద్వారా బయటికి విసర్జింపబడవలెనని జ్ఞాపకముంచుకొనవలెను. అంతవరకు బాహ్యాశుచినిగూర్చి యెంత ఆలోచించినను ప్రయోజనముండదు. మూత్రావయవములును, ప్రేగులును, తమపనిని సరిగచేయవలసియుండినయెడల, మన ఆహారములో ముడిపదార్థములును, విస్తారమైన ద్రవపదార్థములును కలిసియుండవలెను. అప్పుడే ప్రేగులును, మూత్రపిండములును తమ

[1] Hookworms. [2] Bichloride pack.



ముఖ్యమైన పనిని చేయుటకు ఈ పదార్థములు తోడ్పడును. దేహపరిశ్రమ చురుకుగా చేయుటవలనగూడ ఈ అవయవములు తమపనిని చక్కగ చేయుటకు ప్రేరేపించబడును. మలమూత్రాదులను విసర్జించుటకు చిన్నపిల్లలకు క్రమమైన అలవాట్లు కలుగజేయుట చాల ముఖ్యమైన విషయము. ఒక బిడ్డ ఈ పనులను క్రమముగా చేయుటకుగాను భోజనమైన తరువాత, ఆ బిడ్డను ఒక చట్టిమీద కూర్చుండబెట్టవలెను. ఈ అలవాట్లు బాల్యములోనే అలవడినయెడల, పెద్దవారైనప్పుడును అవి నిలిచియుండును. అప్పుడు మలబద్ధకము, దానితో చేరిన అనారోగ్యము నివారించబడును. ప్రతిదినము మామూలుకాలమున మలవిసర్జనము చేయుట చాల ముఖ్యమైన విషయమని గమనించవలెను.

### నోటినిగూర్చిన ఆరోగ్యశాస్త్రము

నోటినిగూర్చిన జాగ్రత్తయు, పండ్లనుగూర్చిన జాగ్రత్తయు పండ్లు పుట్టుకముందే ఆరంభమగును. పసిబిడ్డయొక్క పండ్లు బలముగానుండి బాగుగ వృద్ధిపొందవలెననిన, తల్లి తన ఆహారముతో [1]సున్నముగలిగిన పదార్థములను విస్తారముగా పుచ్చుకొనవలెను. పసిబిడ్డలు కొన్ని నెలల వయస్సునకు రాగానే వారికి ఎముకగాని, రబ్బరు ఉంగరముగాని, గట్టి రొట్టెముక్కనుగాని కొరుకుటకు ఇయ్యవలెను. అప్పుడు దవుడలు త్వరగా పెరిగి, పండ్లు పెరుగునప్పుడు వానికి చాలినంత స్థలము నియ్యగలవు. బిడ్డల నోళ్లు ఉప్పునీటివలన శుభ్రపరచబడుచుండును. పాలు పోసినతరువాత కొంచెము పాలు నోటిలో మిగిలియుండినయెడల, కొన్ని గరిటెల కాచిన నీళ్లు త్రాగించుటవలన ఆ పాలను నోటినుండి తీసివేయవచ్చును. బిడ్డల పండ్లు మొలచినప్పటినుండి వానిని శుభ్రముగా తోమవలెను. సాధ్యమైనంత త్వరలో బిడ్డలు తామే తమ పండ్లను తోముకొనుటకు నేర్చుకొనవలెను. శుభ్రపరచబడని పండ్లు పుచ్చిపోవును. ఆ పుచ్చిపోయిన పండ్లలోని రంధ్రములు రోగక్రిములు పుట్టుటకు అనుకూలమైన స్థలములైయుండును. భుజించిన తరువాత అప్పుడప్పుడు క్రొత్తగా చివ్విన వేపపుల్లతో పండ్లను తోముకొనినయెడల, పండ్లును, నోరును శుభ్రపడుటయే కాక, [2]లాలాజలముగూడ విస్తారముగా ఊరును. ప్రతిసారి భోజనమైన పిమ్మట పండ్లను అన్నిప్రక్కలను కుంచెతో తోమి, బాగుగా కడుగవలెను.

[1] Calcium. [2] Saliva.

పండ్లతోము కుంచెను తడిచేసి ఉప్పు, సోడియంబైకార్బొనేట్, లేక బొగ్గు పొడిలో ముంచి దానితో పండ్లు తోమవలెను. పిమ్మట మంచినీటితో నోటిని బాగుగా పుక్కిలించి కడుగవలెను.

గట్టిదైన భోజనము తినకూడదని నిర్ణయించబడిన రోగుల నోటిని గూర్చి మిక్కిలి జాగ్రత్తగానుండవలెను. మామూలుగా తీసికొనవలసిన జాగ్రత్తకు తోడు ప్రతిసారి భోజనమునకు ముందును వెనుకను వారి నోటిని [1]క్రిమినాశని, అనగా, రోగక్రిములను చంపగల ద్రవముతో బాగుగా కడుగవలెను. చప్పరించి నమలుటకు బంక, మైనమువంటి మెత్తని, తియ్యని వస్తువులను ఇచ్చినట్లయిన, వానివలన లాలాజలము బాగుగా ఊరి నోటిని శుభ్రముచేయుటయేకాక, దప్పియుకాకుండ జేయును.

**వస్త్రములు**

దేహములోని శీతోష్ణములు సరిసమానముగానుండునట్లును, అతివేడిగాని అతిచలిగాని తగలకుండ దేహమును కాపాడుకొనుటకును దుస్తులు ధరించుదురు. దేహమునుండి బయటికిపోవు మొత్తము ఉష్ణములో నూటికి 77 పాళ్లు, చర్మముద్వారా [2]ఉష్ణవాహము, [3]కిరణప్రసరణము, ఆవిరియగుట అను మూడు వ్యాపారములమూలమున బయటికి వెడలుచుండును. వేడివాహకములు కొన్ని మంచివియు, కొన్ని మంచివి కానివియు గలవు. ఇట్టి వేడివాహకములనుగూర్చి మనమెరిగిన సంగతులు వేడిచలనమునుగూర్చి తెలిసికొనుటకు మనకు సహాయపడును. దేహమునకు త్వరగా ఉష్ణమెక్కుటగాని దేహమునుండి ఉష్ణము త్వరగా పోవుటగాని మంచిదికాదు. ఉన్ని మంచి వేడివాహకముకాదు; మరియు చెమటను బాగుగా పీల్చుకొనును. కావున శీతలదేశములలో తేలికయైన ఉన్నిబట్టలు చర్మమును తాకునట్టు ధరించుకొనుట క్షేమము. చర్మమును తాకునట్లు ఉన్నిని ధరించుటకు ఇష్టపడనివారు పట్టును ధరింపవచ్చును. నూలుగుడ్డలు దేహము బయట ధరించుటకు అనుకూలమైనవి. ఎందుకనగా, వీని పైభాగము మెత్తగనుండును గాన ఉన్నిదుస్తులవలె వీనిలో వ్యాధిబీజములుగాని, దుమ్ముగాని నిలిచియుండవు. మరియు ఈ దుస్తులను సులభముగా ఉదుకవచ్చును. అతిశీతల దేశములలో చలిగాలి దేహములో చొరకుండునట్టు, పైదుస్తులను జంతువుల చర్మములతో చేసి

[1] Antiseptic mouth-washes. [2] Conduction. [3] Radiation.



కొని ధరింతురు. ఉష్ణదేశములలో సందులున్న నూలుగుడ్డలు ధరించుట ఉత్తమము. ఈ గుడ్డల పోగులమధ్య చాలినన్ని సందులను విడిచి నేయుటవలన, ఈ సందులగుండ చెమట వెడలిపోవును. గాలి, మంచి వేడివాహకముకానందున, దేహమునుండి వేడిమి త్వరగ పోనూపోదు, దేహమునకు వేడిమి త్వరగ రానూరాదు. ఇట్టి గుడ్డలను గజము ఒకటి 6 నుండి 8 అణాల ధరకు బజారులో కొనవచ్చును. నల్లరంగులు వేడిని ఆకర్షించుకొని తమయందే ఇముడ్చుకొనునుగాని, తెల్లరంగులు సూర్యకిరణములను ప్రతిఫలింపచేయును. అయినను గుడ్డలయొక్క రంగుభేదము అంత విశేషమైన సంగతి కాదు.

లోపల వేసికొను గుడ్డలను మాత్రము పలుమారు మార్చి బాగుగా ఉదికి, పిండి, యెండబెట్టవలెను. పగలు, రాత్రి వెవ్వేరు దుస్తులను ప్రతివారు ధరించవలెను. అప్పుడు వానిలో ఒక్కొక్క జత దుస్తులకు మంచిగాలి తగులును. పరుపుగుడ్డలు తేలికగను, వెచ్చగను, అన్ని దిక్కుల బరువు సమానము గలిగియు నుండవలెను.

మంచి ఆరోగ్యస్థితిలోలేని రోగులకు పలుమారు చలి పుట్టుచుండునుగాన వారికి ఎక్కువ దుప్పట్లు కప్పి, అవసరముండిన, వేడినీటి బుడ్లు పెట్టవలెను. పిల్లలు, ముసలివారు వెచ్చని దుస్తులు ధరించుట అవసరము. శిశువులలో రక్త ప్రసరణము వేగముగానుండును గాన వారి దేహములోని వేడి త్వరగా పై భాగమునకు కొనిరాబడును. ముసలివారిలో రక్త ప్రసరణము చాల నిదానముగా జరుగుచుండుటవలన, వారి కాళ్లుచేతులు పలుమారు చల్లగానుండును.

**ఎముకలు, కండరముల ఆరోగ్య శాస్త్రము**

దీనిలో ఈ యవయవము లుండవలసిన తీరును దేహ పరిశ్రమయు ఇమిడియున్నవి. తల నిట్రాయిగను గడ్డములోపలికిని, భుజములు క్రిందికిని లోపలికిని, పొత్తికడుపు లోపలికి లాగుకొని, మడిమలు కలిపి, కాలివ్రేళ్లు కొంచెము బయటికి తిరిగియుండునట్లు నిలువబడినయెడల, చక్కగ సరియైన తీరున నిలుచున్నట్లు భావించవలెను. కూర్చున్నప్పుడు మొండెము నిట్రాయిగ నుంచుకొని కూర్చుండవలెను.

పనివలన కలుగు దేహపరిశ్రమకు తోడు ఇతర సమయములలోను శరీరపరిశ్రమ ప్రతిదినము క్రమముగా చేయవలెను. మంచిగాలి, సూర్యుని

వెలుగుగల ప్రదేశములలో వివిధమైన ఆటలు, పందెములయందు పాల్గొనవలెను. దేహపరిశ్రమవలన ఎట్టి ఫలితము కలుగునో మనము తెలిసికొనినయెడల, దేహపరిశ్రమ ఆరోగ్యమునకు ఎంత ముఖ్యావసరమో సులభముగా గ్రహించగలము. దానివలన శ్వాసము, అనగా గాలి నెక్కువగా పీల్చుకొందుము. ఊపిరితిత్తులుకూడ ఎక్కువ ప్రాణవాయువును లోపలికి తీసికొనును. మన దేహములోని ప్రతి జీవాణువునందు జరుగు పనికి ఈ ప్రాణవాయువు చాల అవసరమైయుండును. ఈ జీవాణువులలో జరుగు పనియొక్క ఫలితార్థముగా ఏర్పడు బొగ్గుపులుసువాయువు బయటికి త్వరగా వెడలిపోవుటకును దేహపరిశ్రమ తోడ్పడును. ప్రాణవాయువును జీవాణువులకు గొనిపోయి, రక్త ప్రవాహమునుండి బొగ్గుపులుసువాయువును వెడలగొట్టుటవలన రక్త ప్రసరణమును ఎక్కువగ వృద్ధిచేయును. అది కండరములను బలపరచి, శరీరస్థితిని బాగుచేసి, దేహమునకు ఉష్ణము కలిగించును. చర్మము, మూత్రపిండములు, ప్రేగులు చురుకుగ పనిచేయునట్లుచేసి, వానిద్వారా దేహములోని పనికిరాని మలిన పదార్థములను బయటికి త్రోసివేయును. పిల్లలకు బాల్యములోనే దేహపరిశ్రమ చాల అవసరము. ప్రతిదినము కొన్ని గంటలు స్వేచ్ఛగా తిరిగి, ఆడి, కాళ్లు, చేతులు జాడించి తన్నుటకు వారికి అవకాశమియ్యవలెను. ఆరోగ్యవంతులకు అవసరమైనంత దేహపరిశ్రమ, రోగులకును వయస్సు చెల్లినవారికిని అవసరములేదు. పడకమీదనే పరుండియుండు రోగులు, తమ అవయవములను కదిలించి, పరిశ్రమ చేయునట్లు వారికి అవకాశము కలిగించనచ్చును. అవయవములను పిసుకుటవలనను కొంత దేహపరిశ్రమ కలిగించవచ్చును.

### విశ్రాంతి

దేహముచేయు అనేక పనులవలన అది అలసి, జీర్ణించిపోవును. ఇట్లు జీర్ణించినభాగములు తిరిగి బాగుపడుటకును, చురుకుగ పనిచేయుటకును విశ్రాంతియు, నిద్రయు చాల అవసరము. వయస్సునుబట్టియు, వ్యక్తినిబట్టియు అనగా, ఒక్కొక్కని దేహస్థితినిబట్టియు, వానికి ఎంత నిద్ర అవసరమో, నిర్ణయించవచ్చును. శిశువునకు 16, చిన్న బిడ్డకు 12, పెద్దవానికి 8 గంటల నిద్ర ప్రతిదినము అవసరము. ఉష్ణదేశములలో మధ్యాహ్నము కనీసము ఒకగంట సేపైనను విశ్రాంతి తీసికొనుట మంచిది. మన దేహ



ములు సంపూర్ణముగా విశ్రాంతినొంది, మనస్సుకు సమాధానము, శాంతి యుండిననేకాని, విశ్రాంతివలన మనకు లాభముండదు. మనము తలక్రింద తగ్గుగనుండు దిండు పెట్టుకొని వెల్లికిలపరుండి, కండరములను చాచి, విశ్రమింపవలెను.

### నాడిమండల ఆరోగ్య శాస్త్రము

స్వంత ఆరోగ్యము అను విషయముక్రింద మనము చదివిన విషయములన్నియు దేహారోగ్యమునకు సంబంధించినవియే. మానసిక, ఆత్మీయ ఆరోగ్యమునుగురించి కొద్దిగమాత్రమే విచారించితిమి.

మనము రోగులకు నిజముగా సహాయము చేయగోరినయెడల, వారిని కేవలము రోగులనిమాత్రమే భావించక, వారు దేవుని బిడ్డలయిన మానవులనియు భావించుట చాల ముఖ్యమైన విషయము. ఇతరుల సంగతి గ్రహించుటకు ముందు మొదట మనలను మనమే గ్రహించుకొనవలెను. నర్సు పసుచువారిని, ముసలివారినికూడ పరామర్శించవలసియుండును గాన, మనము పెరుగుచుండగా, మన శరీరాభివృద్ధికి సంబంధించిన అవస్థలను గూర్చి నర్సు తెలిసికొనియుండవలెను.

### బాల్యము

శుక్ల శోణితముల సమ్మేళనమువలన తల్లియొక్క గర్భాశయములో బిడ్డ యెట్లు పెరుగుచున్నదో ప్రసవశాస్త్రము చదువుటవలన నేర్చుకొనుచున్నాము. మానవ అండము పిండముగా మారి సమస్తావయవములేర్పడి ప్రత్యేకముగా జీవించుటకు తొమ్మిదినెలలు పట్టును. అప్పుడు బిడ్డ ఆశ్చర్యకరమైన దేహముతో పుట్టును. ఈ దేహము జననమునుండి చురుకుగ పనిచేయుటకు శక్తి గలిగియుండును. అయినను ఆ శిశువు విషయమై తల్లి యెక్కువ జాగ్రత, శ్రద్ధ పుచ్చుకొనుట అత్యావసరము. ఇట్టి శ్రద్ధ లేనియెడల దైవ సంకల్పమునకు అనువగు ఆరోగ్యకరమైన వ్యక్తిత్వమును ఆ శిశువు పొందజాలదు. శిశువులకు దేహము చాల ప్రాముఖ్యమైనది. తలిదండ్రులయొక్క వివేచనా సంపత్తి, ఆత్మీయ జ్ఞానసంపత్తుల నాధారముచేసికొని, శిశువుయొక్క దేహము దినదినాభివృద్ధి గాంచుచుండును. బిడ్డయొక్క గుండె, ఊపిరితిత్తులు పుట్టుకనుండియే సంపూర్ణముగా పనిచేయును. మెదడు పెరిగి యితరావయవములను పనిచేయించు కండరములను వశపరచుకొనువరకు అవి పనిచేయజాలవు.

అప్పటికైనను బిడ్డ వెవ్వేరుపనులు బుద్ధి పూర్వకముగా చేయవలెనని కోరిననేకాని, ఆ పనులు జరుగనేరవు. బిడ్డ తన కాళ్లతో తన్న వచ్చును; చేతులతో నీ వ్రేళ్లు పట్టుకొననచ్చును గాని, నడచుటకు తన కాళ్లనుగాని, భుజించుటకు తన చేతులనుగాని ఉపయోగించుట లేదు. బిడ్డపుట్టిన క్షణమునుండియు తన స్వరమును ఉపయోగించును గాని, మనతో మాటలాడలేదు. నడుచుటకును, చేతులను ఉపయోగించుటకును, మాట్లాడుటకును ముందు మానసిక శక్తులు వృద్ధిపొందుట అవసరము. బాల్యమునుండియే మంచి మానసికాభ్యాసములు అలవడుట మేలు. ఎందుకనగా చిన్న బిడ్డయొక్క మనస్సు బహు త్వరితముగా పెరుగును. తలిదండ్రులు నేర్పించినట్లయిన, చిన్నతనములో నుండినప్పటికిని పిల్లలు, తప్పు ఒప్పులను విమర్శించు వివేచనాశక్తి గలిగియుందురు. మానవహృదయములోనుండు దేవుని యాత్మచేత నడిపించబడునట్టి మానవ మనస్సుయొక్క హేతువాదన (కారణ) శక్తి దేహమును వశపరచుకొని పని చేయించవలెను. నిష్కపటము, నిర్మలమునైన మనస్సు, నమ్మకము, నిరీక్షణ, ఇతరుల క్షేమమునుగూర్చిన శ్రద్ధ, దేవునియందలి నిజమైన విశ్వాసము—ఇత్యాది సుగుణములను చిన్నతనమునందే పెంపొంద చేయవచ్చును. కోరదగిన సుగుణములను ప్రోత్సహించుటవలన దుర్గుణములు అంతరించును. మనము భయము, బెదురుపెట్టి పనిచేయించుటకంటె, ప్రేమ, శ్రద్ధ, ఉత్సాహములతో పనిచేయించుట చాల మంచిది. ఆరంభమునుండియు సద్భావములను పోషించి, వృద్ధిపొందించుటవలన, సంతోషకరమైనట్టియు, అన్నివిధముల సరిపోయినట్టియు సుఖజీవితమునకు పునాదివేయుదుము. ఇట్టి జీవితములో స్వార్థాపేక్షకు తావులేదు. దానిని ఇతరులకు సేవచేయవలెననెడి మనస్సుతో అణచివేయుదుము. ఇప్పుడు క్రమము మారినది. ఇకమీదట ఆత్మ, మనస్సు దేహములను వశపరచుకొని నడుపును.

**యౌవనము**

ఒక బాలుడుగాని బాలికగాని 12 నుండి 18 సంవత్సరముల లోపల యౌవనదశకు వచ్చును. కాని యీ వయస్సులో సంఘర్షణ లేకుండ సక్రమమైన ఆరోగ్యమును ఒక వ్యక్తి పొందుట దుర్లభము. బాల్యదశలో పరిపక్వము నొందక పనిచేయకుండిన జననావయవములు, ఈ కాలములో



పరిపక్వము నొంది పనిచేయ నారంభించును. ఈ మార్పు బాలికలలో ఋతుస్రావము మూలముననను, బాలునియందు కొన్ని పురుషలక్షణములు, శక్తుల మూలముననను కనబడును. సాధారణముగా, ఈ సమయమును బాలుడు, బాలిక యుక్తవయస్సునకు వచ్చిన సమయమందుముగాని, ఒక విధముగా క్రొత్తజీవమును పుట్టించగల శక్తి వీరి దేహములో కలిగినను, ఆత్మ, మనస్సు దేహములను వశపరచుకొనుటకు సమయము ఇంకను దొరకలేదు గాన, అట్టి సమయము వచ్చువరకు వారికి యుక్తవయస్సు వచ్చినదనుట సరికాదు. యౌవన కాలారంభములో దేహము అతి త్వరితముగా వృద్ధిపొందుచుండుటవలన, దానిని వశపరచుకొనుటకు ఆత్మకును, మనస్సునకును చాల కష్టమగును. కొన్ని గుర్తులవలన దేహములో జరుగు ఈ సంఘర్షణ తెలిసికొనగలము. దీనిని సరిగా గ్రహించకపోవుటవలన పలుమారు చాల కష్టములు, అనర్థములు, ప్రాప్తించవచ్చును.

యుక్తవయస్సునకు వచ్చిన బాలిక ఈ సమయములో బిడియముతోను, ఇతరులతో కలిసి మెలిసి యుండనట్టును ప్రవర్తించును. పలుమారు నిలకడలేక విసుగుగాను కోపస్వభావముతోను నుండును. తన స్వంత వేషమునందు అధిక శ్రద్ధగలిగి, అందమైన దుస్తులను ప్రేమించుచుండును. స్నేహముకొరకును, ఇతరులు తన్ను గ్రహించవలెననియు కోరుచుండును. మొదట తండ్రియొక్క స్నేహమును, తరువాత ఇతరపురుషుల స్నేహమును ఆమెకు గావలసియుండును.

బాలుడు, త్వరితముగా పెరుగుచున్న తన దేహమును ఇతరులు గమనించవలెనని, విపరీతముగా దుస్తులు ధరించి, స్వంతవేషమును గూర్చి అధిక శ్రద్ధపుచ్చుకొనును. బాలుడును పలుమారు నిలకడలేక దిగులుగానుండును. తనకంటె పెద్దవారిని, గొప్పవారిని వీరులుగా భావించి వీరపూజ చేయును.

ఇట్టి లక్షణములు సహజముగాను, ఆరోగ్యముగాను పెరుగుచున్న దేహముయొక్క మార్పులకు సూచనలైయున్నవని యౌవనులు తెలిసికొనుట వారికి చాల సహాయకరముగా నుండును. నర్సుకూడ ఈ సంగతులు గ్రహించినట్లయిన, తన స్వంతమునకును, ఇతరులకును సహాయము చేయుటకు వీలగును.

నిస్సహాయులైన ప్రజలకు పిల్లలకు సహాయముచేయుట, చేతి పనులు, కుట్టుట, నేయుట, రంగులువేయుట, బుట్టలు తట్టలు అల్లుట, వడ్రంగి పని చేయుట, బహిరంగస్థలములలో తిరిగి, బాలికాభటులుగా పని చేయుట, తోటపనిచేయుట, మకాములుచేయుట, చురుకుగానడుచుట, ఈదుట, మొదలగు పరిశ్రమకార్యములు ఈ కాలములో యౌవనుల శక్తులు బైటికి వచ్చుటకు సహాయపడును. ఈ కార్యములు యౌవనుల యొక్క శరీర మానసిక శక్తులను ఉపయోగించునవిగా నుండవలెను. బాలురు కాలిబంతి, ముష్టియుద్ధము, కుస్తీపట్టుట మొదలగు చురుకైన పనులు చేయుచుండవలెను.

ఈ వయస్సులో ఇతరులకు సేవచేయుటయు సహాయకరమైన పనియైయుండును. మనచుట్టు బాధ, దుఃఖము, నిరుద్యోగము, పేదరికము, అజ్ఞానము, లంచగొండితనము, అన్యాయము మున్నగు వానిని చూచుచుందుము. ఈ కీడులను నివారించుటకు సహాయపడుట తన విధియని బాధ్యతగల ప్రతి మానవుడు గ్రహించవలెను. ఈ కార్యములు చేయుటకు బాధ్యత వహించిన మానవుడు వాని నలక్ష్యముచేసి తనపని ముగించితినని తలంచుట వెర్రితనము.

మన జీవితకాలమంతయు మనకు సహాయము చేయునట్టిగాని, అభ్యంతరము కలిగించునట్టిగాని గుణములు మనయందు వృద్ధిపొందుచుండును. వీనిలో యోగ్యమైనట్టియు, విలువగలిగినట్టియు గుణము, స్నేహగుణము. రోగులు స్నేహగుణమును చాల మెచ్చుకొందురు. వారికి ఇచ్చు మందుకంటె, వారియెడల చూపు స్నేహపూరితమైన శ్రద్ధ, ఎక్కువ మేలుచేయును. కొన్నిసారులు నిజమైనట్టియు లోతైనట్టియు స్నేహము ఏర్పడుటవలన శీలము బలపడును. ఈ వయస్సులో ఇంద్రియనిగ్రహము చాల అవసరము. ఎందుకనగా మనము ఒకనితో స్నేహముచేసి అతడు మరి ఎవరితోను స్నేహముగా ఉండకూడదని కోరుటవలన కీడుకలుగును. ప్రజాకార్య నిర్వహణార్థమై ఇతరులకు సహాయము చేయవలెనను ఒకే కోరికగల స్నేహితులు తమకును సహాయము చేసికొందురు. నర్సులు స్త్రీపురుషులందరితో కలిసిమెలిసి పనిచేయవలసియుండును గాన అందరి యెడల దయగాను స్నేహముగాను ఉండుటకు నేర్చుకొనవలెను. అయినను తమమట్టుకు తాము నెమ్మదిగాను ఇతరుల జోక్యములేకయు ఆత్మ గౌర



వముగలిగియు ప్రవర్తించవలెను. నిజమైన స్నేహితులు ఇతరులయందలి మంచితనమునుజూచి మర్యాదచేసి, గౌరవింతురనియు నర్సులు తెలిసికొనవలెను. యౌవనులు తమ విషయమై వేరుగా భావింతురు. అది గొప్ప పొరపాటు. ఒక్కొక్కరు ఒక గుంపంతటి మేలుకొరకు తమ కార్యములను చేయవలెను. లేనియెడల చేసిన వ్యక్తియేకాక, ఇతరులుగూడ బాధపడవలసివచ్చును.

## యుక్తవయస్సు

మన ఇంద్రియములను వశపరచుకొనుటలో మనము చేయు ఈ పోరాటము మనకు పూర్ణవయస్సు రాగానే, నిలిచిపోవునని తలంచుట గొప్ప తప్పు. ఎందుకనగా, ఈ పోరాటము జీవితాంతమువరకు నుండును. మనము పెద్దవారమైనపుడు ప్రపంచములో జరుగుచున్న మొత్తము పనికి మన భాగపుపనియు చేయవలసియున్నాము. రోగపీడితులైనవారును, కష్టపరిస్థితులలో నున్నవారును వారికి నిజమైన శ్రద్ధయున్న కార్యములను గూడ చేయలేకపోవుచున్నారను సంగతి మనము జ్ఞాపకము పెట్టుకొనవలెను.

ఆరోగ్యకరమైన జీవితములో పనియు, ఆటలు, ఇతర వినోదకార్యములును వేరుచేయబడి నియమితకాలములో నిర్వర్తించబడును. నూతన యత్నములనుచేయుటకు పురికొల్పు ఆదర్శజీవితమే ఆరోగ్యకరమైన జీవితము. తర్బీతుకాలము ముగిసినది గనుక, యిక నేర్చుకొనవలసినదేమియులేదని తలంచువాడు వృద్ధిపొందినవాడు కాడు. ఇతరులకు సహాయముచేయుటకై యెల్లప్పుడు క్రొత్త జ్ఞానము, అనుభవము సంపాదించుకొనుటకు, ఆశగలిగి యుండవలెను.

## వృద్ధాప్యము

జీవితకాలమంతయు విజయోత్సాహములతోను మంచి ఆరోగ్యముతోను గడిపి, ఆత్మను వశపరచుకొనువారి వృద్ధాప్యదశ యుచ్చస్థితిలో నుండి, పరిపూర్ణసుఖములనుభవించుచుండును. కాని జీవితారంభములో ఆత్మ నడుపుదలయొక్క జ్ఞానమును దెలిసికొననివారు, జీవితాంతమున ఆఖరు సంవత్సరములలో చాల దుఃఖముతో కాలము గడుపుచుందురు. తగ్గిపోవుచున్న తమ శరీరశక్తులు తిరిగి తమకు కలుగవలెనని కోరుచు, తమకు రానైయున్న మరణమును తలంచుకొని భయపడుచుందురు. దేవుని

కనుగొని ఆయనయందు విశ్వాసముంచిన నర్సు, పై చెప్పినవారికి సహాయము చేయగలుగును. ఈమె సహాయమువలన వారు తమ మిగత జీవితమును ఆత్మవశము చేసికొనుటకు నేర్చుకొనవచ్చును. ఈ యాత్మ యెన్నడును ముసలితనము చెందదు సరేగదా, తన వశమైనవారిని మరణమునుండి సంపూర్ణ జీవితమునకు నడిపించగలదని మనము నమ్ముచున్నాము.

## ప్రజారోగ్యము

సామాన్యమైన నర్సింగు తర్బీతు పొందుకాలములో నర్సుయొక్క ప్రథమకర్తవ్యము, రోగులకు చికిత్సచేయుటయైయున్నది. రోగులు స్వస్థత జెందినతరువాత వారు వైద్యశాలలను విడిచిపోవుదురు. వారి భావికాలమునుగూర్చిన క్షేమము నర్సుయొక్క పూచీ కాదు. వారినిగూర్చి యిక నర్సు ఏమియు చేయనక్కరలేదు. .కాని ఇటీవల కొన్ని సంవత్సరముల నుండి నూతనభావము ఏర్పడినది. ప్రజలలో వ్యాపించు రోగనివారణోపాయములనుగురించి వైద్య, నర్సింగుశాఖలవారు ఎక్కువ తెలిసికొని పని చేయవలెననెడి భావము వృద్ధియైనది. దీనినే ‘ప్రజారోగ్యమునుగూర్చిన సేవ’ యందురు. ప్రజలు సరియైన పద్ధతుల ననుసరించి జీవించుట, శరీర ఆరోగ్యము, సరియైన భోజనము, అంటువ్యాధులకు కారణము, రోగనివారణ ఇత్యాది విషయములలో వారికి బోధచేయుట చాల ప్రాముఖ్యమైన విషయమైనది. ఆరోగ్యసూత్రములను తెలియనివారు, నివారించగల రోగములను నివారించకపోవుటచే ననుభవించు బాధను, రోగనివారణోపాయములను బాగుగా గ్రహించినవారు తొలగించగలరు. ఆరోగ్యమును కాపాడుటకు ఏర్పడిన ప్రతి యుద్యమమునుగూర్చి ప్రస్తుతకాలపు నర్సు శ్రద్ధవహించి పనిచేయుచుండవలెను.

[1]‘స్వస్థపరచు సేవ’ అను విషయమును ఆలోచించునప్పుడు, 1938-వ సంవత్సరము తాంబరములో సమావేశమైన [2]అంతర్జాతీయ మిషనెరి కౌన్సిలువారు పై పేరును [3]‘ఆరోగ్యము, స్వస్థపరచు సేవ’ యని మార్చిరి. వారి రిపోర్టులో ఈ క్రిందివిధముగా వ్రాయబడియున్నది:—“వ్యాధులు రాకుండ శ్రద్ధవహించవలసిన అవసరము చాల ఉన్నది. అన్నివిధములైన

The Ministry of Healing. [2] The International Missionary Council.
[3] The Ministry of Health and Healing.



ఆరోగ్యము, ప్రజాక్షేమమునుగూర్చిన పనిలో పాల్గొని పాఠశాలలలో ఆరోగ్యమార్గమును ప్రవేశపెట్టి బోధించవలెనని దీనియొక్క అర్థము. ఊరక మందులిచ్చుటయేకాక, ఒక్కొక్క వ్యాధియొక్క మూలకారణములను కనుగొని, ఆ వ్యాధిని సంపూర్ణముగా నిర్మూలముచేయుట ఎక్కువ ప్రాముఖ్యమైన విషయము. ప్రతి క్రైస్తవ వైద్యశాల, తాను సేవచేయుచున్న ప్రజాసంఘమునకు ఆరోగ్యవిధానము బోధించు నిజమైన ఆరోగ్యకేంద్రమై యుండవలెను.”

ఒక నర్సు సంపూర్ణముగా ప్రజారోగ్య సంబంధమైన పనినే చేయవచ్చును. అనగా, హెల్తు విజిటరుగా గాని, పాఠశాల నర్సుగా గాని, పనిచేయవచ్చును; లేక ఒకే నర్సు ఈ రెండు పనులు చేయుటకుగాని కోరబడవచ్చును. గృహములను దర్శించుచుండగా, తప్పు పరిస్థితులను నర్సు గమనించి వానిని దిద్దుకొనవలసిన ప్రాముఖ్యతను ప్రజలకు తెలియ చెప్పును. ముఖ్యముగా పిల్లలవిషయమై తీసికొనవలసిన శ్రద్ధ, జాగ్రత్తలనుగురించి తల్లులకు నేర్పవలెను. అనేక పట్టణములలో ఒక వైద్యుని విచారణక్రింద ఒక ఆరోగ్యశాఖ ([1]పబ్లిక్ హెల్తు డిపార్టుమెంటు) ఉండును. జనన మరణములన్నిటిని, అన్నివిధములైన అంటువ్యాధులను ఈ శాఖ వారికి తెలుపవలెను. తన రాష్ట్రములో అమలునందున్న ప్రతి ఆరోగ్య చట్టము నర్సుకు తెలిసియుండవలెను. ఇండియాలో అంటురోగులను ప్రత్యేకించు విషయమునుగూర్చి జనసామాన్యము గ్రహించునట్లు చేయుట చాల కష్టము. అట్లు ప్రత్యేకించబడిన స్థలములలోని నియమముల ప్రకారము వారు నడుచుకొనునట్లు చేయుట మరి యెక్కువ కష్టము. కావున తర్బీతుపొందిన నర్సు, వైద్యశాలలో పనిచేసినను, ఇతరవిధమైన ప్రజారోగ్య సంబంధమైన పనిచేసినను, తన స్వంతమాదిరి బ్రతుకువలన, అంటువ్యాధి వ్యాపించకుండ చేయుపద్ధతులు, రోగులను ప్రత్యేకించుట, [2]క్వారన్టైను అను ప్రత్యేకస్థలము మున్నగువానినిగూర్చి ప్రజలకు నేర్పుట ఆమెయొక్క విధియైయుండును. టీకాలువేయుటలో గల మేలులనుగూర్చియు, టైఫాయిడు (విషజ్వరము) కలరా (వాంతిభేది) ప్లేగు (బొబ్బలరోగము లేక మహామ్మారి) మొదలగు అంటుజాడ్యములు చెలరేగి వ్యాపించుచుండగా,

[1] Public Health department. [2] Quarantine.

ఆ వ్యాధులు తగలకుండ సూదిమందులు వేయించుకొనుటయొక్క విలువనుగూర్చియు ప్రజలకు తెలియచేయవలెను.

ఈ పనియంతయు చాల కష్టమైనది. ఆచారములు, సాంప్రదాయములు ఒకప్రక్కన విరోధించి పనిచేయుచుండగా, ఈ పని మరింత కష్టమై యుండును. అయినను సంతోషముగాను, నిర్మాణ విధానమునను నర్సు తాను చెప్పుచున్న సత్యములను ప్రజలు నమ్మునట్లు చేయగలిగినట్లయిన, ఆమె సంఘమునకుచేయు సేవ అమోఘమైనదైయుండును. మానవ స్వభావమును గ్రహించక, దయాదాక్షిణ్యములు లేక పనిచేయ నారంభించు నర్సు తాను చేయుచున్న సంస్కరణలకు ప్రజలు విముఖులై తిరుగుబాటు చేయునట్లు వారిని ప్రేరేపించినదగును.

ఇదివరకే, నివారించగలిగిన రోగములను నిర్మూలించుటనుగూర్చి యెక్కువపని చేయబడినది. కాని ఓపికతోను, ఎడతెగని కృషితోను ప్రజలమధ్య సేవచేయు నర్సు, ఈ కార్యాభివృద్ధికి మరి యెక్కువ తోడ్పడగలదు. వైద్యశాలలలో రోగులును వారి స్నేహితులును నర్సులనుజూచి అనేకసంగతులు నేర్చుకొనగలరు. నర్సు తనకు ఆరోగ్య శాఖోద్యోగము దొరికినంతవరకు వేచియుండక, దానికి ముందే ప్రజలు ఆరోగ్యముగా జీవించువిధమును వారికి నేర్పవచ్చును.

### ఇల్లు

క్రొత్త యిల్లు ఒకటి కట్టకముందు అనేక విషయములను ఆలోచించవలెను. వేసవికాలములో పరిశుభ్రమైన గాలి, మందమారుతము ధారాళముగా వీచునట్టును, ఋతుపవనములు (గాలులు), వర్షము, తగలకుండ కాపుదల యుండునట్టును ఇంటిని గట్టవలెను. చెమ్మలేకుండుటకు దానిని కొంచెము ఎత్తుగ గట్టవలెను. అవసరమైనయెడల నేలమీద నీరు నిలువకుండ, పారిపోవునట్లుగాని, యెండిపోవునట్లుగాని చేయవలెను.

గ్రామములో కట్టు స్వల్ప గృహమునకైనను, దాని కుపయోగించు కలప, దొరకగలిగినదానిలో శ్రేష్ఠమైనదై యుండవలెను. ఇంటికి టేకు కలప చాల మంచిది; యెందుకనగా, దానికి చెదలుపట్టదు. టేకు కలపమీద ఖర్చుపెట్టిన డబ్బు నష్టముకాదు. పూరిగుడిసెయైనను, దాని తలుపులు కిటికీలు టేకుతో చేసినవైనయెడల, మనదేశపు కలపతో



కట్టిన అదేవిధమైన యిండ్లు పాడైన తరువాతగూడ, టేకు నుపయోగించి కట్టినయిండ్లు చాల సంవత్సరములు నిలిచియుండును. తాళ్లముక్కలు, పగిలిన యిటికముక్కలు నేలమీదపరచి, కంకరువేసి, గ్రామ యింటి నేలను గట్టిచేయవచ్చును. దీనివలన చెమ్మ ఊరి పైకి రాకుండును. ఇట్లు తాళ్లుపరచుటకు వీలుకాకపోయినను, నేల చెమ్మగానుండినను, పరుండుటకు మంచములు, పరుపులు లేకపోయినను, నిద్రించు చాపలక్రింద, వరిగడ్డి వేసికొనినట్లయిన, జబ్బులు రాకుండ చేయవచ్చును. చలిపుట్టుచున్నదని చెప్పుటకు నోరులేని చంటిబిడ్డలకును పిల్లలకును ఇట్టి వరిగడ్డి పడకలు వేయవలెను. ఇటిక, సిమెంటులతో కట్టిన యిండ్లలో వర్షముల వలన గోడలుతడిసి నెరియలుపడినవేమో, లేక కప్పు, పగుళ్లు బారినదేమోయని గమనించి, సకాలములో తగిన మరామతు చేయించవలెను. వేసవి మాసములలో పగుళ్లను గమనించక అలక్ష్యముచేసినందున, ఋతుపవనములవలన వర్షములు కురిసినప్పుడు గోడలు తడిసి కూలిపోవచ్చును. గాలి ధారాళముగా ఇంటిలోనికి, గదులలోనికి వచ్చునట్లు కిటికీలను అమర్చవలెను. గోడల పైభాగమున గాలి ధారాళముగా ప్రసరించుటకు సందులు పెట్టినయెడల, ఇల్లు చల్లగానుండును.

వంటగదిలో పొగపోవుటకు మంచి సందుగాని, మార్గముగాని యుండవలెను. ఇండియాదేశములో అనేకుల వంటగదులయందు ఈ యవసరమైన యేర్పాటు ఉండదు. స్నానముచేయుటకును మలమూత్రాదులు విసర్జించుటకు లెట్రిన్ (మరుగుదొడ్డి) సదుపాయములు ఉండవలెను. స్నానపు గదినుండి నీళ్లు బయటికి దూరముగా పారునట్లు ఏర్పాటుచేయవలెను. గ్రామాదులలో ఒక గుంటత్రవ్వి యీ నీళ్లను పట్టియుంచి, అరటితోటను ఇంటికి కొంచెము దూరమునవేసి, దానికి ఈ నీరు వాడవచ్చును.

పశువులను ఇంటికి వీలైనంతదూరమున ప్రత్యేకముగా నుంచవలెను. పొగ, పశువులను దగ్గరకట్టియుంచుట, కర్మాగారములు, ఫాక్టరీలు సమీపమునయుండుట, ఎక్కువమంది యింటిలో కాపురముండుట—ఈ కారణములవలన గాలి అపరిశుభ్రము కావచ్చును. అపరిశుభ్రమైన గాలిలో సూక్ష్మజీవులు విస్తారముగా నుండుటవలన, రోగము త్వరగా వ్యాపించవచ్చును. ఇంటిలో ఎవరికైన క్షయ, కుష్ఠు మొదలగు అంటువ్యాధులున్నట్లయిన, వారు ఇతరులనుండి, ముఖ్యముగా పిల్లలనుండి దూరముగా పరుండ

వలెను. వీలయిన, బయట వసారాలోనో, దూరముగావేసిన పందిరిలోనో లేక మిద్దెమీదనో పరుండుట మంచిది. చాలినంత సూర్యుని వెలుగు ఇంటిలోనికి ప్రసరించుచుండవలెనుగాని, యెండ అధికముగా నున్నప్పుడు, అది యింటిలోనికి రాకుండ చేయుటకు కిటికీలకు [1]షట్టరులు అనగా, మూతలుండవలెను. వాని నప్పుడు మూయవలెను.

కల్పితవెలుగు వీలైనంత మంచిదిగాను, క్షేమకరమైనదిగాను ఉండవలెను. విద్యుద్దీపములు శ్రేష్ఠమును, క్షేమకరమునైనవి. లాంతరులు, పెట్రోమాక్సు దీపములు వెలిగించునప్పుడు అతి జాగ్రత్తగానుండవలెను. లేనియెడల, వాని నుపయోగించువారు తమ్మును తాము కాల్చుకొనవచ్చును. విద్యార్థులును, పనివారును చీకటిలో పనిచేసి, కండ్లకు శ్రమ కలిగించకుండ, మంచివెలుగు నుపయోగించవలెను. చాలసారులు దీపముల చిమ్నీలు చాల పొగబారియుండుటవలన, ఎక్కువ వెలుగు నష్టమగుచుండును. తక్కువరకముకంటె మేలురకము కిరసనాయిలు మంచి వెలుగునిచ్చును.

ఇంటిని వెచ్చగానుంచవలసిన బాధ దక్షిణ ఇండియాలో అంతగా లేకపోయినను దానిని చేయువిధానము మనము ఎరిగియుండవలెను. శీతల దేశములలో నిప్పు ఎల్లప్పుడు మండుచుండుటకు ఇంటిలోనే వసతికలిగించి కట్టుదురు. ఇట్టి పొయ్యిలలో కట్టెలు లేక బొగ్గులు మండుచుండగా, పొగ పైకిలేచి బయటికిపోవుటకు గొట్టములుండును. ఒక స్టౌవ్‌ను, అనగా ఇనుపకుంపటిని నూనెతోగాని, బొగ్గుతోగాని మండించినయెడల, పొగ జ్వాలలు బయటికిపోవు మార్గములు చేయవలెను. మంచి గాలి, వెలుగు ప్రసరించని ఒక గదిలో స్టౌవ్‌ను వెలిగించి పొగ, విషవాయువు బయటికి పోవు ఏర్పాట్లుచేయనందున ఊపిరి ఆడక నిద్రించుచుండిన పెద్దవారనేకులు ముఖ్యముగా పిల్లలనేకులు చనిపోయిరి.

**నీటివసతి**

నీటివసతి చాల ముఖ్యమైనది గనుక ప్రతియింటికి సాధ్యమైనంతవరకు నీటిసదుపాయము కలిగించవలెను. పట్టణములలో ఈ కష్టము లేదుగాని వేసవిమాసములలో జలాశయములలోని నీరు తగ్గిపోవుచుండుట

[1] Shutters.



వలన, కొళాయిల నీళ్లు అప్పుడప్పుడు నిలిపివేయుచుందురు. గ్రామాదులలో [1]మరుగుదొడ్లు, పశువుల మలమూత్రాదులవలన చెడిపోకుండునట్లు బాగుగా కట్టబడిన బావులనుండి నీటిని చేదుకొనుట మంచిది. తెరచి యుంచబడిన తొట్లు, సరస్సులు, చెఱువులనుండి త్రాగెడునీరు తెచ్చుకొనుటవలన ఆరోగ్యమునకు కీడు కలుగవచ్చును. పశువులు, మనుష్యులు స్నానముచేసి, గుడ్డలుదికిన తరువాత అదే చెఱువునీరు త్రాగుటకుగాని, వంటచేసికొనుటకుగాని బొత్తుగా పనికిరాకుండును. అయినను స్త్రీలు తమ కుండలతో ఇంటి యుపయోగము నిమిత్తము చెడిపోయిన చెఱువు నీటిని తీసికొని పోవుచుండుట సాధారణముగా చూచుచుందుము. త్రాగక ముందు నీటిని పొంగబెట్టవలెను. మనకు లభించునీరు ఎంత శుభ్రమైనదైనను టైఫాయిడు, కలరా మొదలగు వ్యాధులు ఈ నీటిద్వారా వ్యాపించగల అపాయము ఎల్లప్పుడు ఉండును. ఉప్పునీటిని బాగుగా పొంగించి చల్లబడుటకు కొంతకాలము ఒకకుండలో నిలిచి యుండనిచ్చి తరువాత వడయగట్టినయెడల, ఆ నీరు త్రాగుటకు ఎక్కువ రుచిగానుండును. రక్షణార్థమును, బావి శుభ్రముగానుండుటకును దాని చుట్టు పిట్టగోడయుండుట మంచిది. నీటిని తోడుటకు పంపు (గొట్టము)లను ఉపయోగించనియెడల నీరుతోడు బక్కెటులు శుభ్రముగా నుండవలెను. వానిని ఆ పనికిమాత్రమే ఉపయోగించవలెను. మురికి నీరు ఇనుకకుండ బావిచుట్టు సిమెంటు చేసిన గచ్చు అరుగు ఉండవలెను. కనీసము 100 అడుగుల లోతుగల బావులలోని నీరు అతిశ్రేష్ఠమయినది. పట్టణములలో మునిసిపలు సంఘమువారు సప్లయిచేయు నీటిని పలువిధముల అనగా వడయగట్టుట, క్లోరైను అను మందు కలుపుటవలన శుద్ధిచేయుచుందురు. గ్రామములలో వేసవికాలమందు నీరు తగ్గియున్నప్పుడు బావులలో నెలకొకసారి పొటాసియము పర్మాంగనేటు అను మందు కలుపుచుండవలెను. లోకలుబోర్డులు లేక గ్రామములలోని హెల్తు ఆఫీసరుగారు ఈ మందు సప్లయిచేయగలరు.

**చెత్త చెదారమును ఎత్తి పారవేయుట**

చెత్త చెదారమును, కసవును ఎత్తి పారవేయుట ఇండియాలో ఒక పెద్ద సమస్యయైనది. ఇల్లు ఊడ్చి కసవును చెత్తను కశ్మలమును సాధారణముగా

[1] Latrines.

వీధిలోనే పారబోయుచుందురు. వీధులూడ్చు పాకీవాడు ఉండినయెడల కొంత చెత్తను ఊడ్చి యెత్తుకొనిపోవునుగాని, దానికిముందే చాల చెత్త గాలికి కొట్టుకొనిపోయి, ఇతరుల ఇండ్లలోను ఊరిబయటను చెదరిపడును. ఈ కశ్మలమువలన ఇతర ప్రజలకు బాధ, కష్టము కలుగుటయేకాక దీనిలో నుండగల వ్యాధి బీజములవలన అంటువ్యాధులు కలుగుటకు అవకాశము గలదు. కావున ఇంటి కశ్మలమును కాల్చివేయుటయొక్క ప్రాముఖ్యతను అందరికి నచ్చచెప్పవలెను. ఈ సంగతిని విద్యార్థులు త్వరగా గ్రహించి, కశ్మలమును గాల్చివేయుటకు సహాయముచేయ సిద్ధపడుదురు.

### మురికి నీరు

మునిసిపాలిటివారు ఏర్పాటుచేసిన [1]మురికినీటి కాలువలుండిన స్థలములలో, ఈ మలినజలమును సులభముగానే పారదోలవచ్చును. కాని ఈ నీరు బాగుగా పారిపోవుటకు జనులు మరుగుదొడ్ల తొట్లలోను, నీటి గొట్టములలోను చెత్త చెదారము వేసి, వానిని మూసివేయకుండ ఉండవలెను. ఈ గొట్టములలో నీళ్లు విస్తారముగా పోసి, యేదైన దుర్వాసనగాని ఆటంకముగాని యుండినయెడల, వెంటనే దానిని గమనించి తీసివేయవలెను. గ్రామాదులలో [2]సెప్టిక్ టాంకులు, [3]బోరు హోలు మరుగుదొడ్లు, గుంటలు ఏర్పాటుచేసి ఉపయోగించవచ్చును. ఈ సెప్టిక్ టాంకులలోను బోరుహోలు మరుగుదొడ్లలోను [4]డిస్ యిన్ ఫెక్టెంట్ (క్రిమినాశని) మందు పోయకుండ అతిజాగ్రత్తగలిగి యుండవలెను. లేనియెడల మలవిసర్జనము సహజరీతిగా కుళ్లిపోవుపని చెడిపోవును. గుంటలను వాడినయెడల మలమును కప్పుటకు మట్టి సమీపమున నుండవలెను. బోరుహోలు మరుగుదొడ్లలో ఊరు నీరు, ఏ బావిలోనికైన యినుకక యుండునట్లు, వానిని త్రవ్వు స్థలము నేర్పాటుచేయవలెను. ఈ రకము మరుగుదొడ్లలోని గుంటలు 20 అడుగులలోతు ఉండవలెను. పైనుండి కొన్ని అడుగులు మాత్రమే యుండువరకు ఈ గుంటలు నిండిన తరువాత, వానిని మట్టితో కప్పి 3 లేక 4 నెలలు విడిచిపెట్టవలెను. పిమ్మట గుంటలుత్రవ్వు సాధనములతో ఈ గుంటలు తిరుగ ద్రవ్వి, వానిలోని యెరువును పొలములకు వాడవచ్చును.

[1] Drainage system. [2] Septic tanks. [3] Bore-hole latrines.
[4] Disinfectant.



ఇది చాల విలువగల యెరువు. గ్రామములలో రోగుల మలమును, ఎంగిలిని, ఉమ్మిని బూడిదతో కలిపి లోతుగుంటలో పూడ్చివేయవలెను, లేక రంపపుపొట్టుతో కలిపి కాల్చివేయవచ్చును.

ఏవిధమైన మరుగుదొడ్ల యేర్పాటైనను ప్రతియింటికి ఒక్కొక్కటి యుండవలెను. మరుగుదొడ్ల వసతి లేనందుననే, హిందూస్త్రీలు అవసరమైనప్పుడెల్ల మలమూత్రములను విసర్జించుటకు వీలులేక వారికి తఱచుగా మలబద్ధకము కలుగుచుండును. బయటి పొలములకుగాని, బహిరంగ స్థలములకుగాని పోవలసియుంటే, వేకువజామునగాని, చీకటిపడినతరువాత గాని పోదురు.

### అనారోగ్యపు అలవాట్లు

తల్లులు తమబిడ్డల కడుపు శుభ్రముకావలెనని వారమునకు రెండు మూడుసారులు ఆముదము పోయుచుందురు. దీని కీడులనుగూర్చి నర్సు తల్లులకు, అవ్వలకు ముందుగా తెలుపవలెను. ఇట్లు చేయుటవలన ప్రేగులు బలహీనపడి, తిరిగి ఒక మోతాదు ఆముదము ఇచ్చిననేకాని, భేదికాకయుండును. రానురాను ప్రేగులు స్వయముగా పనిచేయలేకపోవును. జ్వరము వచ్చినవారికి ద్రవాహారమునేయిచ్చుట, నీరు త్రాగనిచ్చుట, యెంత ప్రాముఖ్యమైనదో ఆ సంగతినికూడ తల్లులకునేర్పవలెను. ముఖ్యముగా, ప్రసవమైన తరువాత నీళ్లు త్రాగినట్లయిన చీము ఏర్పడునను సామాన్య దురభిప్రాయము గలదు. జ్వరము ఒక నిప్పువంటిదని భావించగలవారు దాని నార్పుటకు నీళ్లు అవసరమనియు గ్రహించగలరు. నారింజపండ్లరసము ఇచ్చినట్లయిన జలుబుచేయునని జనులు భయపడుదురుగాని, నిజముగా ఈ సమయములో దానిని మించిన పథ్యములేదు. అదియే విలువైన ఆహారమగును. మూఢభక్తి, అజ్ఞానమువలన జ్వరపీడితులకు స్పంజి స్నానమియ్యకూడదనియు, వారి వెండ్రుకలకు నూనెపూసి దువ్వకూడదనియు పిచ్చి తలంపులు గలిగి యుందురుగాని, నిజముగా ఇట్లు చేయుటవలన రోగులదేహము చల్లబడి వారికి ఎక్కువ సౌఖ్యముగానుండును. అధిక చీకటికలిగి, గాలి బొత్తుగా దూరని గదిని, హిందూదేశస్థులు సరియైన రోగులగదిగా భావింతురు. ఇట్టి గదిలో రోగుల నుంచెదరు. కావున మంచి గాలి, సూర్యుని వెలుగు రోగులకు ఎంత అవసరమో నర్సు వారికి తెలియజేయవలెను. అంటువ్యాధులు

వ్యాపించు విధమునుగూర్చి గ్రహించుటకు బదులుగా, మశూచి, ఆట్లమ్మ, (తట్టమ్మ) తదితర అంటురోగములు 'అమ్మవారు' అను దేవత కోపమువలన కలిగినవని భ్రమించి, కొన్ని జీవుల ప్రాణములు బలియిచ్చుటచేత ఆ దేవత కోపము చల్లారునని తలంచుదురు. అంటురోగులను ప్రత్యేకించి, వ్యాధి వ్యాపించకుండ చేయుటకు బదులుగా, వేపాకులు, కొబ్బెరకాయలు, మొదలగువానిని కట్టుకొని పసుపు, కుంకుమబొట్లు పెట్టుకొని తప్పెటలు కొట్టుచు నృత్యము చేయుచుందురు. నాటువైద్యులను, తర్ఫీతులేని మోటు మంత్రసానులను పనికి పిలువకుండ జనులను వారించవలెను. ఆలోచన లేకుండ కండ్లకు పాదరసము, అపాయకరమగు ఇతర వస్తువులను పూయకుండ, వేమారక జనులకు బోధించుచుండవలెను. తర్ఫీతుపొందిన నర్సులమైన మనము వైద్యశాలపనిగాని, గృహములలోని పనిగాని, ప్రజారోగ్యపు పనిగాని, యేపనిని చేయుచున్నను, మన పరిసరములలోని ప్రజలు ఆరోగ్యవిషయములను బాగుగా గ్రహించి, రోగమును ఒక అవమానముగా భావించునంతటి మనసు వారికి కలుగునట్లు వారికి నేర్పుట, మన పనిలో ఒక ముఖ్యధర్మమైయున్నది.

అధ్యాయము 3

# సూక్ష్మజీవుల శాస్త్రము

(బాక్ట్రియాలజి)

1671—1673-వ సంవత్సరములలో కనిపెట్టబడిన మైక్రాస్కోపు అనెడు సూక్ష్మదర్శిని యంత్రముతో సూక్ష్మజీవులనుగూర్చిన శాస్త్రము (బాక్ట్రియాలజి) ప్రారంభమైనది. దీనికిముందు మానవుడు చూచిన సైన్యములన్నిటిని మించిన, యెక్కువ అపాయకరమైన, కంటికి కనబడని మరియొక గొప్పసైన్యము తనలోను, తనచుట్టును ఉన్నదని, మానవుడు తన కలలో సహితము తలంచలేదు. [1]లూవెన్‌హాక్ అను నతడు ఒక వాన బొట్టునుబట్టి సూక్ష్మదర్శిని క్రిందపెట్టిచూడగా, అతడు కనుగొనిన సంగతి చదివినంతనే ఒళ్లు జలదరించును. ఆయన మొదటిసారి ఆ వానబొట్టులో

[1] Leeuwenhoek



జీవించుచు, చలించుచున్న సూక్ష్మజీవులను జూచి, ఉద్రేకపూరితుడై కుమార్తెనుబిలిచి "రమ్ము, రమ్ము. త్వరగా రమ్ము. ఈ వాననీటిలో సూక్ష్మజీవులున్నవి, చూడుము. అవి యీదుచున్నవి; చుట్టుతిరిగి ఆడుచున్నవి. ఇంతకుముందు మనము మన స్వంతకండ్లతో చూచిన జీవులన్నిటికంటె ఇవి వేయిరెట్లు చిన్నవిమైయున్నవి. నేను ఏమి కనుగొన్నానో చూడుము" అని యరచెను. (పాల్ డిక్రుఫ్ అను నతడు వ్రాసిన 'మైక్రోబ్ హంటర్సు' అను పుస్తకము 9-వ పుట చూడుము.)

అయినను పందొమ్మిదవ శతాబ్దము సగము గతించిన తరువాతనే, యీ సూక్ష్మజీవులకును రోగమునకునుగల సంబంధమును శాస్త్రజ్ఞులు కనుగొనగలిగిరి. ఈ క్రింద పేర్కొనబడిన శాస్త్రవేత్తల పరిశోధనాఫలితములే లేనియెడల, సూక్ష్మజీవుల శాస్త్రమునుగూర్చిన యీ యధ్యాయము ఎన్నటికిని వ్రాసియే యుండబడదు.

[2]జోసఫ్ లైస్టర్ అను నతడు శస్త్రము చేయబడిన రోగులు అధిక సంఖ్యాకులుగా చనిపోవుటను విచారించి 1865-వ సం॥లో లూయీ పాశ్చురుయొక్క నూతన యత్నమునుగూర్చి చదివి ఒక క్రొత్త విశేషమును గ్రహించెను. పాశ్చురు, సూక్ష్మజీవులు పాలను పులుపుగను ద్రాక్షరసము పొంగునట్లును చేయుచున్నవని కనుగొనెను. లైస్టర్ ఈ సంగతి గ్రహించి, యికమీదట [3]కర్బాలిక్ సొల్యూషనును శస్త్రాయుధములకు, డ్రెస్సింగు గుడ్డలకేకాక, ఆపరేషను గదియంతటికి చల్లుటకు తీర్మానించుకొనెను. ఇదియే ఆధునిక శస్త్ర చికిత్సాశాస్త్రమునకు నిజమైన పునాదియైనది.

రాబర్టుకోక్ అను నతడు 1876-వ సం॥లో [4]ఆంత్రక్సు అను అంటువ్యాధిని గలిగించెడు సూక్ష్మజీవియొక్క జీవితచరిత్రను లోకమునకు వెల్లడిచేసెను. ఈ క్రిమి ఆంత్రక్సు యను రోగమును పశువులలోను మనుష్యులలోను పుట్టించును. ఆరు సంవత్సరములకుపిమ్మట ఈయన క్షయరోగమును గలిగించెడి క్రిమిని వర్ణించెను.

1877-వ సం॥లో పాశ్చురు కోళ్లకు తగిలెడు కలరాను నివారించెడు వాక్సీన్ (రసిని) కనుగొనెను. 1881-వ సం॥లో ఆంత్రక్సు అనెడు వ్యాధిని

[1] See page 9, 'Microbe Hunters' by Paul de Kruif. [2] Joseph Lister. [3] Carbolic solution. [4] Anthrax bacillus.

నివారించుటకు మరియొక రసిని కనుగొనెను. 1885-వ సం॥లో పిచ్చి కుక్క-కాటునకు విరుగుడుగా ఒక రసిని (వాక్సీనును) వాడెను.

1893-వ సం॥న హెర్మను మైకల్‌బిగ్సు అను నతడు [1]డిఫ్తీరియా (కంఠ రోహిణి) యను వ్యాధియొక్క కారణములను పరిశోధించుటకు [2]నూతన పరిశోధనాలయ (లాబరేటరి) పద్ధతులను అమలులోనికి దెచ్చెను. మఱు నటి సంవత్సరము ఈ రోగమునకు విరుగుడుగా [3]ఆంటిటాక్సీనును కనుగొని బెర్లిను పట్టణములో ఉపయోగించి, చికిత్స ఫలితములు తెలిసిన తరువాత, దీనిని వెంటనే యుపయోగించుడని న్యూయార్కు వైద్యులను ప్రేరేపించెను. తరువాత కాలములో [4]టాక్సీను - ఆంటి టాక్సీను నుపయోగించుటచే డిఫ్తీరియావ్యాధి పిల్లలకు రాకుండ నివారించవచ్చునని ఋజువు చేయబడెను.

1899-వ సం॥లో వాల్టర్‌రీడ్ అను నతడు చాలకాలము అపాయకరమైన పరిశోధనచేసి [5]యెల్లోఫీవర్ అనెడు పసుపుజ్వరము, అంతకు ముందు అట్టి రోగముగలవానిని కుట్టిన దోమకాటువలన కలుగుచున్నదని కనుగొనెను.

సర్ రోనాల్డ్‌రాస్ అను నతడు తన జీవితములో నెక్కువకాలము ఇండియాలోని సికింద్రాబాదు అను పట్టణమున పనిచేసి, అనేక పరిశోధనలు గావించి, 1897-వ సం॥న అనేక రంగుచుక్కల రెక్కలుగల [6]అనోఫిలైన్ అను దోమ మలేరియా అనబడిన రోగమును వ్యాపింపచేయుచున్నదని కనుగొనెను. కోక్ అను నతడు పశువులయందు వ్యాపించు మలేరియావంటి అంటువ్యాధులకును, మనుష్యులయందు వ్యాపించు మలేరియా జ్వరమునకును సంబంధములేదనియు, ఈ రెండవ రకము మలేరియా పరాన్నక్రిములు, మనుష్యులమధ్యను ఒక విధమగు దోమలమధ్యను మాత్రమే తిరిగి మలేరియాను వ్యాపింపజేయుననియు 1898-వ సం॥న తెలియజేసి గొప్ప కార్యసిద్ధి పొందెను.

ఇంకను అనేకమంది శాస్త్రజ్ఞులనుగూర్చి చెప్పవచ్చునుగాని, ఇప్పటికి చెప్పిన ఈ కొద్దిమంది ప్రస్తుతపు సూక్ష్మజీవుల శాస్త్రమునకు పునాది వేసిరని తెలిసికొనిన చాలును.

[1] Diphtheria. [2] New laboratory methods. [3] Antitoxin. [4] Toxin-antitoxin. [5] Yellow fever. [6] Anopheline.



బాక్టీరియాలజి అనగా బాక్టీరియా అనబడు అతి సూక్ష్మమైన ఉద్భిజ్జములనుగూర్చిన పఠనము. అతి సూక్ష్మజీవులలో బాక్టీరియా అను సూక్ష్మజీవులు తక్కినవానికంటె ఎక్కువగనున్నను రోగమును కలుగజేయు [1]ఫంగై, ప్రోటోజోన, ఫిల్ట్రబుల్ వైరుసెస్ అను ఇతర సూక్ష్మజీవులను గూర్చియు దీనిలో చదువవలసియున్నాము. ఈ సూక్ష్మజీవులకు [2]క్రిములు, [3]సూక్ష్మప్రాణులు అను నామాంతరములును గలవు.

అంటురోగములను వ్యాపింపచేయు అతి సూక్ష్మజీవి, వ్యాధిగల ఒకనిని కుట్టి వ్యాధిలేని మరియొకనిలో ప్రవేశించుటవలన ఈ వ్యాధి ఒకనినుండి మరియొకనికి వ్యాపించుచున్నది. ఇట్లు వ్యాపించు వ్యాధులకు జలుబులు, న్యూమోనియా, రక్తభేది, విషజ్వరము, కలరా ఉదాహరణములు. ఇవిగాక అంటుతగిలిన గాయములు, చీముగడ్డలు, [4]సెప్టిసిమియా (రక్తమును చెఱిపెడు విషము) అను మరికొన్ని వ్యాధులును గలవు.

క్రొత్తగా తర్బీతుపొంద నారంభించిన నర్సు బాక్టీరియాలజికిని నర్సింగునకునుగల సంబంధమును గ్రహించకపోవచ్చునుగాని, తన పనియందు ముందుకు సాగిపోవుచుండగా, నర్సింగు అనగా రోగికి పరిచర్యచేయుటయే కాక రోగమునుండి తన్నుతాను రక్షించుకొనుటయు, ఇతరులను రక్షించుటయుగూడ తన కర్తవ్యమని గ్రహించును. ఈ నియమములనుబట్టి పని చేయుచుండగా నర్సింగునకును, మైక్రోబ్స్ అనెడి సూక్ష్మజీవులకును ఎన్ని విధముల సంబంధముకలదో తెలిసికొనును. నర్సు ఈ విషయములను గ్రహించినదనుటకు క్రింద పేర్కొనినవి కొన్ని ఉదాహరణములు: నర్సు ఒక రోగికి పరిచర్యచేసి, మరియొకరోగికి పరిచర్య చేయకముందు తన చేతులను జాగ్రత్తగా కడుగుకొనును. థెర్మామీటర్ అను జ్వరమానిని ఒక రోగికి ఉపయోగించి, రెండవరోగికి ఉపయోగించకముందు దానిని ఆంటిసెప్టిక్ సొల్యూషను (క్రిమిఘ్నము)లో ముంచును. ఒక గాయమును కట్టుటకు ముందు దానికి కావలసిన పరికరములను పొంగించును. ఒక ఇంజెక్షను ఇయ్యకముందు మందుచిమ్మెడు సూదిని జాగ్రత్తగా పొంగించును. ఇంజెక్షను వేయవలసిన భాగమునుకూడ ఆంటిసెప్టిక్ సొల్యూషనుతో శుభ్రముచేయును. [5]క్యాతిటర్ అను సామానును బాగుగ పొంగించి

[1] Fungi, Protozoa, and filtrable viruses. [2] Germs. [3] Microbes. [4] Septicaemia. [5] Catheter.

ఉపయోగించును. [1]మలవిసర్జనపాత్రలను (పడకచేట్లను) ఖాళీచేసి, కడిగిన తర్వాత వానిని ఆంటిసెప్టిక్ మందులో ముంచును.

వానివాని పునరుత్పత్తివిధమునుబట్టి, అతి సూక్ష్మజీవులు బాక్టీరియా, ఫంగై, ప్రోటోజోవ అను తరగతులుగా విభజింపబడినవి. మొదటి రెండుగుంపులు ఉద్భిజ్జతరగతికిని, మూడవది జంతువర్గమునకును చెందినవి. ఈ తరగతులన్నిటికి తినుటకును, బహిష్కరించుటకును, చలించుటకును, పునరుత్పత్తి (సంతానాభివృద్ధి) చేయుటకును శక్తిగలదు.

బాక్టీరియాలలో ఒక జీవి రెండుసగములుగా చీలి పునరుత్పత్తియగుచుండును. ఇట్లు ఇవి అనుకూలమైన పరిస్థితులలో అతివేగముగను అసంఖ్యాకములుగను వృద్ధియగును. ఒక [2]జీవాణువు గంటకు ఒకసారి రెండుగ విభజింపబడినయెడల, రెండు దినములలో దానివంశము 2,81,500,000 జీవులుగా వృద్ధియగునని లెక్కచేయబడినది. అనుకూల పరిస్థితులలో ఒక బాక్టీరియా జీవి 20 నిమిషముల కొకసారి విభాగము కావచ్చును. పరిస్థితులు ప్రతికూలముగ నుండినయెడల కొన్ని సూక్ష్మజీవులు [3]స్పోర్సు అనెడు సూక్ష్మమైన అండములను బెట్టును. వీనిని నాశనముచేయుట చాల కష్టము. అదృష్టవశాన ఇట్టి గ్రుడ్లుపెట్టు సూక్ష్మజీవులు కొన్నిమాత్రమే మానవునికి హానిచేయగలవు. వీనిలో ఆంత్రక్స్, టెటనస్ (ధనుర్వాతము) అనెడు రోగములను కలిగించు రోగక్రిములు అందరికి బాగుగ తెలిసినవి. ఒత్తిడిక్రింద తయారగు ఆవిరిని ప్రయోగించుటవలనగాని, మూడుదినములు వరుసగా కొంతకాలము ఉడికించుటవలనగాని ఈ క్రిములను నాశనము చేయవచ్చును.

సూక్ష్మజీవులను వాని ఆకారములనుబట్టి విభజించి, ఆకారములకు తగిన పేరులనే వానికి పెట్టియున్నారు.

1. కాక్కై.—దీని యేకవచనము కాకస్. ఇది ఆకారమున గుండ్రముగ నుండును. వీనిని రెండేసి చేర్చినపుడు [4]డిప్లొకాక్కై అనియు, గొలుసులుగా చేర్చినపుడు [5]స్ట్రెప్టొకాక్కై అనియు పిలువబడును. అవి పెద్దవిగనైనను చిన్నవిగనైనను ఉండవచ్చును.

[1] Bed-pans. [2] Cell. [3] Spores.
[4] Diplococci. [5] Streptococci.



2. బాసిల్లై.—దీని యేకవచనము బాసిలస్. ఇవి కఱ్ఱపుల్ల ఆకారముగానుండును. అవి పొడుగుగనైనను, పొట్టిగనైనను లావుగనైనను, సన్నముగనైనను ఉండును. చివర గుండ్రముగగాని, మొన తేలిగాని యుండును. ఈ గుంపు జీవులు సూక్ష్మమైన అండములు ([1]స్పోర్సు) పెట్టును.




1. బాక్టీరియా

3. స్పైరిల్ల.—దీని యేకవచనము స్పైరిల్లం. ఇవి వంకరగగాని మెలికలు తిరిగిగాని, శంఖాకారము గలిగిగాని యుండును.

సూక్ష్మజీవులన్నియు మిక్కిలి చిన్నవి. ఒక మిలియను (పదిలక్షలు) జీవులు కలిసి ఒకటి, రెండు అంగుళముల పొడుగు ఉండవచ్చును. వీనిలో ఒక్కొక్కదాని పరిమాణము భేదించియుండును. కాక్కైరకము జీవులు 1/5,000 నుండి 1/1,25,000 అంగుళాంశము (అనగా అంగుళములో అన్నిపాళ్లు) వ్యాసము (అడ్డకొలత) గలిగియుండును.

ఫంగై అను ఉద్భిజ్జములు బాక్టీరియాకంటె పెద్దవై, ఏ పదార్థమునైనను పొంగునట్లు చేయగలవు. అవి మొగ్గలువేసి, సంతానాభివృద్ధి జేసికొనును. అంటుమొగ్గ సంపూర్ణముగా పెరిగినప్పుడు తల్లిమొగ్గ (జీవాణువు)నుండి వేరుపడి, స్వంతముగా జీవించుటకు మొదలుబెట్టును. తామర, [2]మైసిటోమ అను చర్మవ్యాధులు ఫంగైవలన కలుగును.

ప్రోటోజోవ యనెడు ఏక జీవాణువుగల జీవులు సంపర్కసహితముగాగాని, సంపర్కరహితముగాగాని సంతానాభివృద్ధి కాగలవు. ఇవి ప్రాణులలో అధమజాతికి చేరినవి. వీనివలన కలుగు కొన్ని వ్యాధులేవనగా, [3]అమీబిక్ రక్తభేదులు, మలేరియా జ్వరము, [4]కాల-అజార్ మొదలైనవి.

ఈ సూక్ష్మ జీవులుగాక, అత్యధిక శక్తిగల సూక్ష్మదర్శిని (భూతదర్పణము)తోనైనను చూడజాలనట్టి అతి సూక్ష్మజీవులును గలవు. పెరుగుటకు అనుకూలమైన ఒక [5]పదార్థము (మీడియ) నందు వీనిని పెంచి, రోగము

[1] Spores. [2] Mycetoma. [3] Amebic. [4] Kala-azar. [5] Media.

నను లోంగెడు కొన్ని జంతువులలోనికి టీకాలమూలమున వీనిని ప్రవేశపెట్టినట్లయిన, ఈ ప్రాణులవలన కలుగు వ్యాధి చిహ్నముల వ్యాధియే, ఆ జంతువులలోను పుట్టును. దీనినిబట్టి యీ యతిసూక్ష్మజీవులున్నవని గ్రహించగలుగుచున్నాము. ఇవి యెంత సూక్ష్మ రంధ్రములగుండనైనను దూరిపోగలవు. అనగా [1]వడగట్టు సాధనములలోని అతి సూక్ష్మరంధ్రములలో నుండియు దూరిపోగలుగుటవలన వీనికి [2]ఫిల్ట్రబుల్ వైరుసెస్ అను పేరుగలిగినది. వీనివలన మశూచి, [3]రేబీస్ (పిచ్చికుక్కల వ్యాధి), [4]ట్రకోమ, ఇన్ఫ్లుయాంజె మొదలగు వ్యాధులు సంభవించును.

నీరు, గాలి, ఆహారకణములు తదితర వస్తువులన్నిటిలోను మైక్రోబ్సని అనెడు క్రిములుండవచ్చును. ఇవి చాలవరకు మానవుల, జంతువుల చర్మముపైనను [5]అమత్వచలపైననుండును. నోరు, ముక్కు, జీర్ణావయవముల దారులు, ఈ క్రిములు పెరుగుటకు మిక్కిలి అనుకూలమైన తావులైయున్నవి. మలము నిండ సూక్ష్మజీవులు, ముఖ్యముగా [6]కోలన్ అను క్రిములున్నట్లు తెలిసికొనబడినది. వివిధప్రాణులు వృద్ధిపొందుటకు వివిధ అనుకూల పరిస్థితులుండవలెను. అనగా, ఈ ప్రాణులనుబట్టి యవి అభివృద్ధిపొందు పరిస్థితులు మారుచుండును. 95°—102° F. ఉష్ణమునందు అవి చురుకుగ నుండును. చల్లదనము వానివృద్ధి కాటంకముగానుండునుగాని, వానిని చంపదు. వేడిమి, చెమ్మ, చీకటి, మృతకళేబరములుగాని, కుళ్లిన కూరగాయలు, జంతుదేహములు మొదలగునవిగాని యీ సూక్ష్మజీవుల వృద్ధికి మిక్కిలి అనుకూల పరిస్థితులు కలిగించును. అనగా వీనియందు ఈ సూక్ష్మజీవులు బాగుగా వృద్ధియగును. కావున ప్రతి వైద్యశాల ధారాళముగా వెలుగు, గాలి వచ్చునదిగాను, పరిశుభ్రమైనదిగాను, నేల పొడిగాను నుండవలెను. ఈ సూక్ష్మజీవులలో ననేకజీవులు నిరపాయకరమైనవే కాక, కుళ్లిన పదార్థములను చెట్లకు ఉపయోగపడునట్టి ఆహారపదార్థములుగా మార్చి మనకు సహాయపడు సూక్ష్మజీవులునై యుండవచ్చును. కొన్ని జీవులు పాలను పెరుగుగా మార్చును. [7]కాడినంటి సూక్ష్మజీవులు రొట్టె చేయుటయందును, [8]ఆల్కహాలు అనెడు సారాయిని పొంగచేయుటయందును తోడ్పడుచున్నవి.

[1] Filters. [2] Filtrable viruses. [3] Rabies. [4] Trachoma.
[5] Mucous membranes. [6] Colon bacillus. [7] Yeast. [8] Alcohol.



రోగములు కలుగజేయు క్రిములకు రోగసహిత క్రిములు ([1]పాతోజెనిక్ క్రిములు) అనియు, మానవదేహమునకు హానిచేయని సూక్ష్మజీవులకు రోగరహిత క్రిములు ([2]నాన్‌పాతోజెనిక్ క్రిములు) అనియు పిలువబడుచున్నవి. పాతోజెనిక్ క్రిములు మానవదేహములో ప్రవేశించినపుడు టాక్సీన్ యనెడు విషమువలన హానికరమగు వ్యాధులను బుట్టించును. ఈ వ్యాధులు చీముగడ్డలవంటి స్థానిక (ఒకేస్థలమున కలిగెడు) రోగములైగాని, ధనుర్వాతము ([3]టెటనస్)వలె దేహమంతట వ్యాపించు రోగములైగాని యుండవచ్చును.

అతి సూక్ష్మజీవులను సూక్ష్మదర్శిని (భూతదర్పణము) క్రిందపెట్టి పరిశోధించి చూడవచ్చును. కొన్నిటిని ఉన్నవి ఉన్నట్టుగానే చూడవచ్చును; మరికొన్నిటికి రంగుబూసి ప్రత్యేకించి చూడవచ్చును. మరికొన్నిటిని పెరుగుటకు అనుకూలమైన (కల్చర్ మీడియ)యను పదార్థములో అసంఖ్యాకములుగా పెంచిననే తప్ప, కంటికి కనబడనంత సూక్ష్మములైయుండును. ఇట్లు పెంచి చూచినప్పుడే వానిని సరిగా పరీక్షించుటకు వీలగును.

సూర్యునివెలుగు, ఎండ, ఉష్ణము, కొన్ని రసాయనములు—ఇవి అతి సూక్ష్మజీవులను నాశనముచేయగల కొన్నివస్తువులు. సూర్యరశ్మి యొక్క వెలుగువలనను వేడిమివలనను సూక్ష్మప్రాణులు నశించును. ఎండ విస్తారముగాకాయు ఈ దేశములో ఈ విషయము చాల ప్రాముఖ్యమైనది. ఈ ఎండవలన అధికలాభము పొందవచ్చును. సెగరోగమును కలుగజేయు [4]గనొకాకై క్రిములును, క్షయరోగ క్రిములైన [5]ట్యుబర్కిల్ బాసిల్లైయు కొన్నిగంటలు మంచి యెండతగులుటవలన చనిపోగలవు. ఎండ బెట్టుటవలన సూక్ష్మజీవులు పెరుగుటమాత్రమే ఆటంకపరచబడును. ఉష్ణమువలన సూక్ష్మజీవులను జంపుపద్ధతి [6]స్టెరలైజేషన్ అనబడును. చెత్త చెదారము మొదలగువానిని కాల్చుటవలనను, పొయ్యిమీద చేసినట్టు వేడిచేయుటవలనను, వైద్యపరికరములను ఉడికించినట్టు నీటియుష్ణతలో ఉడికించుటవలనను [7]ఆటోక్లేవులో డ్రెసింగులు, పింగాణిసామానులు పొంగించినట్టు, పొంగించుటవలనను ఒత్తిడిక్రింద తయారగు ఆవిరివలనను సూక్ష్మజీవులను జంపగలము. పొంగించుటవలన ఉద్భిజ్జరకములైన సూక్ష్మజీవులను

[1] Pathogenic. [2] Non-pathogenic. [3] Tetanus. [4] Gonococci.
[5] Tubercle bacilli. [6] Sterilisation. [7] Autoclave.

5 నిమిషములలో నాశనముచేయవచ్చును. రెండు గంటలలో స్పోర్సు అనెడు సూక్ష్మాండజములను చాలవరకు నాశనముచేయవచ్చును. 15 పౌండ్ల బరువుగల ఒత్తిడిక్రింద తయారైన ఆవిరి నుపయోగించి అన్నిరకముల సూక్ష్మజీవులను, సూక్ష్మాండజముల (స్పోర్సు) తో సహా 20 నిమిషములలో నాశనముచేయవచ్చునుగాని యావిరి, వస్తువులగుండ తృప్తికరముగా దూరుకొనిపోవునంత బలముగా నుండవలెను.

సూక్ష్మజీవులను రసాయనపద్ధతుల ననుసరించి నాశనముచేయుటకు అంటురోగ క్రిమినాశము ([1]డిస్ యిన్ ఫెక్షను) అందురు. రోగక్రిములు వృద్ధికాకుండ మాత్రముచేయు రసాయనములకు ఆంటిసెప్టిక్స్ (క్రిమిఘ్నములు) అనియు, వానిని సంపూర్ణముగా నాశనముచేయువానికి [2]డిస్ యిన్ ఫెక్టెంట్ (క్రిమినాశని) యనియు పేరులు. డిస్ యిన్ ఫెక్టెంటులను వాడునప్పుడు బ్యాక్టీరియాను జంపుటకై వాడెడు డిస్ యిన్ ఫెక్టెంటు నియమితఘాటుగలిగి, బ్యాక్టీరియాకు అందుబాటులోను నియమితకాలము వరకు వాటితో సంబంధముకలిగియు నుండునట్లు నర్సు జ్ఞప్తియుంచుకొనుట అవసరము. అనగా స్టెరిలైజరును అతి బిరుగ్రగ అమర్చకూడదు. సామానులను డిస్ యిన్ ఫెక్టెంటు మందులో పెట్టునప్పుడు వానిమీాద నూనె, చీము, రక్తము మొదలగునవిగాని, వాని జాడకాని యుండకూడదు. ఈ సామానులను స్టెరలైజు చేయునప్పుడు అవి సంపూర్ణముగా పొంగుచున్న నీటిలో మునిగియుండవలెను. వివిధ ఘాటు (బలము) గలిగిన ఆంటిసెప్టికుల పేరులు, వాని యుపయోగములు, డిస్ యిన్ ఫెక్టెంటుల పేరులు, వాని యుపయోగములు 14-వ అధ్యాయములో 12-వ సెక్షనులో వ్రాయబడి యున్నవి.

కొన్ని డిస్ యిన్ ఫెక్టెంటులు కొన్ని సూక్ష్మ ప్రాణులమీాద బాగుగా పనిచేయును. ఉదాహరణముగా, సవామేహము అనెడు రోగమునకు [3]ఆర్సెనిక్ను, మలేరియావ్యాధికి [4]క్వైనైన్ మందును, గనోరియా అను సెగరోగమునకును స్ట్రెప్టోకాకస్ అను అంటురోగములకును [5]సల్ఫనిలమైడ్ అను మందును, అమీాబిక్ రక్తభేదులకు [6]ఎమెటిన్ అను మందును ఉపయోగించినచో మంచి ఫలితమునిచ్చును.

[1] Disinfection. [2] Disinfectant. [3] Arsenic. [4] Quinine.
[5] Sulphanilamide. [6] Emetin.



[1]సెప్సిస్ అనగా, క్రిమి సహితమైనదనియు, [2]అసెప్సిస్ అనగా, క్రిమి రహితమైనదనియు అర్థము. క్రిమి సహితమైననీరు, పొంగించుట వలన క్రిమి రహితమై, అట్లేయుండి, తిరిగి సూక్ష్మజీవులు దానిలో ప్రవేశించినప్పుడు ఆ నీరు క్రిమి సహితమైనది (సెప్టిక్) అగును. స్టెరైల్ (శుద్ధి) చేసిన నీళ్లు అట్లే ఉండుటకును రోగక్రిమి రహితమై యుండుటకును ఆ నీటిని మూతవేసిన పాత్రలోపోసి యుంచవలెను. అట్లే స్టెరైల్ డ్రెసింగు గుడ్డలను రెండు చుట్లు కవరులు చుట్టిగాని, [3]డ్రమ్సులో పెట్టిగాని యుంచవలెను.

[1] Sepsis. [2] Asepsis. [3] Drums.

రెండవ భాగము

# పరిచర్యయందు కౌశలము

## అధ్యాయము 4

# వార్డు, ప్రవేశము, రోగినిగూర్చిన సామాన్య జాగ్రత

### వార్డును గూర్చిన జాగ్రత

బాగుగా నుంచబడినవార్డు పరిశుభ్రముగాను, క్రమముగా నుండుటయేకాక, ఇంటివలెను, స్నేహస్వభావముగలిగియు నుండవలెను. వీలైనంత చల్లగను, గాలి వీచునట్లును, వార్డు నుంచవలెను. నేలమీద రాళ్లు పరుపవచ్చును; లేక గచ్చుచేయవచ్చును. ఎట్లుచేసినను దానిని ప్రతియుదయము కడుగవలెను. గోడలు తుడిచెడి కుంచెతోగాని, పొడుగైన బొంగుకు చీపురుకట్టి, దానిని గుడ్డతో కప్పిగాని, వార్డుగోడలను వారమునకొకసారి బూజు, దుమ్ము, తుడిచివేయవలెను. రంగుపూసిన గోడలకు మరకలు, మైలతగిలినప్పుడు వానిని కడుగవలెను. తెల్లగోడలకు పలుమారు సున్నము కొట్టుచుండవలెను. వార్డు సామానులను ప్రతిదినము తడిగుడ్డతో తుడువవలెను; వారమునకు ఒకసారి శుభ్రముగా కడుగవలెను. శుభ్రత, అందము, క్రమము అను విషయములను జాగ్రత్తగా గమనించుటవలన మొత్తముమీద వార్డు అందముగా కనబడును. చింపిరిగుడ్డలు, డ్రెసింగు గుడ్డలు, మాసినబట్టలను ఎక్కడివక్కడ వేయక, వానివాని స్థలములలో పెట్టవలెను. పడకలు క్రమమైనవరుసలో నుండవలెను; బల్లలు, కుర్చీలు వానివాని స్థలములలో నుండవలెను; పరదాలన్నిటిని సమానముగాదించి యుంచవలెను. ఉమ్మిపాత్రలు శుభ్రపరచబడియు, డిస్‌యిన్‌ఫెక్టెంటుమందు పోయబడియు నుండవలెను. మూత్రపాత్రలను (యూరినల్సు) మలవిసర్జన పాత్రలను (బెడ్‌పానులను) అట్లే పడకలక్రింద నిలిచియుండనీయక, వెంటనే వానిని తీసికొనిపోవలసిన స్థలములకు తీసికొనిపోవలెను.



### పక్కనుగూర్చిన జాగ్రత

పక్కలను ప్రతియుదయము క్రమపరచి, చక్కగా వేసియుంచుటయేగాక, దినమంతయు అవి సరిగాను అందముగాను శుభ్రముగాను నుండునట్లు చేయవలెను. మంచము గోడకు తగులునట్లు వేయకూడదు; ఎందుకనగా, నర్సు రెండు ప్రక్కలనుండి రోగి యొద్దకు రావలసియుండును. పక్క వేయునప్పుడు, పక్క గుడ్డలను ఎన్నడును నేలమీదగాని, స్త్రీనుమీదగాని వేయకుండ, మంచము కాళ్ల ప్రక్కనుండెడు కుర్చీమీదగాని, స్టూలుపైనగాని యుంచవలెను. మాట్రెసు అనెడు దూదిపరుపు నుపయోగించినయెడల, దాని వరను తీసివేసి, ఉదుకుటకు వీలైనదిగా నుంచవలెను. ఈ పరుపుమీద పొడుగైన మాకింటాష్ అను రబ్బరుగుడ్డను కొన్నిసారులు పరిచెదరు. దానిమీద అడుగునవేయు దుప్పటిని పరచి దాని పొడుగుకొనలను పడకమధ్యకు పోనిచ్చెదరు. ఇట్లు పోనిచ్చి, తల, పాదముల తట్టునున్న దుప్పటి మూలలను పోస్టుకవరు (లకోటా)వలె మడచి, పరుపుక్రింద దోపుదురు. తరువాత దుప్పటిని గట్టిగా లాగి పరుపును మెత్తగాచేసి ప్రక్కలలో పరుపుక్రింద దోపుదురు. చిన్న మాకింటాషు షీటును, డ్రాషీటును దిండు దగ్గరనుండి రోగి మోకాళ్లు ఉండు స్థలమువరకు లాగి, సరియైన తీరున వేయుదురు. మొదట డ్రాషీటును ఒకప్రక్క దోపి, గట్టిగా లాగి, రెండవప్రక్కకూడ పడకక్రింద దోపవలెను. పిదప పైనకప్పు దుప్పటిని పరచునపుడు దాని క్రిందిభాగము పైకిపెట్టి, పైభాగమును పడక తలవరకు లాగవలెను. కాని పాదముల యొద్ద పరుపుక్రింద బాగుగా దోపుటకు చాలినంత దుప్పటిగుడ్డను విడువవలెను. తరువాత పై యంచును రోగి భుజములవరకు అందునట్లు వెనుకకు మడువవలెను. శీతోష్ణస్థితినిబట్టియు, వైద్యశాలయొక్క వాడుకనుబట్టియు ఒక కంబళినిగాని [1]కౌంటర్‌పేన్‌గాని పరుపుపై వేయబడును. దీనిని మడవకముందు పై దుప్పటిమీద వేయుదురు. తరువాత ఆ కంబళియొక్క అంచులు పడకపాదములయొద్ద పరుపుక్రిందికి దోపబడును. పరుపులేని నవారు మంచముమీదగాని, స్ప్రింగ్ మంచముమీదగాని సాధారణముగా మొదట ఒక తుంగచాపవేసి, దానిమీద [2]డురీ యను పరుపు వేసి, దానిమీద దుప్పటి పరచెదరు. దుప్పటిమీద మాకింటాషును,

[1] Counterpane. [2] Dur[illegible]e.

డ్రాషీటును వేయుదురుగాని పరుపు లేనందున వానిని ముందటివలెనే పరుపు క్రింద దోపుటకు వీలులేదు. డూరీలకు, దుప్పట్లకు నాలుగు మూలలలో సాధారణముగా టేపులను కుట్టుదురు. టేపులన్ని వాని వాని స్థలములలో నుండునట్లు జాగ్రత తీసికొనవలెను. టేపులు తెగియుండిన డూరీలుగాని, దుప్పట్లుగాని ఉపయోగించకూడదు. పడకలు వేయునప్పుడు దిండ్లను బాగుగ కుదిలించి, సులభముగా తీసి ఉదుకగల దిండువరలు వానికి వేయవలెను. ఒక రోగి వైద్యశాల విడిచిపోగానే మరియొకనికొరకు పడకను శుభ్రముచేసి సిద్ధముగా నుంచవలెను. గుడ్డలన్ని తీసి చాకలికివేసి చలువ చేయించవలెను. ముఱికికానియెడల కంబళ్లను ఎండలోవేయవలెను. పరుపును రెండుప్రక్కల బ్రష్‌చేసి యెండవేయవలెను. మాకింటాష్‌నుగాని, రబ్బరుషీటునుగాని, డ్రాషీటునుగాని సబ్బునీటితో శుభ్రముగకడిగి, తడి లేకుండ జాగ్రత్తగా తుడిచి, పగలకుండ ఉండునట్లు దానిని ఒక కఱ్ఱకు (రోలరుకు) చుట్టవలెను. మంచమును క్రిమినాశని (డిస్‌యిన్‌ఫెక్టెంటు) అను మందుతో కడుగవలెను; అవసరమైనయెడల ఎండలో వేయకముందు సబ్బునీటితోతోమి కడుగవలెను. ఇనుపమంచమునకు నల్లులు పట్టినయెడల, వానిని [1]బ్లోదీపముతో కాల్చవలెను. కొయ్య మంచములకు నల్లు లెక్కిన యెడల, [2]అసెటిక్ ఆసిడ్‌గాని, కిరోసినాయిలుగాని [3]హైపోడర్‌మిక్ సిరంజితో పగుళ్లకు పట్టించవలెను. టేపు, అనగా నవారు మంచములకు నల్లులు చేరినట్లయిన, నవారు నూడదీసి చాకలికివేసి, క్రొత్తనవారు నల్లవలెను.

### చికిత్స, స్నానపు గదుల జాగ్రత

వార్డులలోవలెనే యీ గదులలోను శుభ్రత, క్రమము ఉండవలెను. ఈ గదులలోని సామానులు, అనగా బేసినులు, ఉమ్మిపాత్రలు, మల విసర్జన పాత్రలు (పడకచట్లు) తదితర సామానులను ఉపయోగించిన వెంటనే వానిని బాగుగా శుభ్రముచేయవలెను. వాని నెప్పుడైనను మైలగా ఉంచకూడదు. లోషనులు, డ్రెసింగులు, తదితర ఉపకరణములను వాని వాని స్థలములలో పెట్టి యుంచుటవలన కోరినప్పుడు వానిని సులభముగా అందుకొనవచ్చును. మలినమైన డ్రెసింగులను వెంటనే పారవేయవలెను; లేక కాల్చివేయవలెను. మైలపడిన గుడ్డలు, మైల డ్రెసింగు గుడ్డలు, ఇతర ముఱికివస్తువులను వేయునట్టి టిన్ను డబ్బాలకు మూతలుండవలెను.

[1] Blow lamp. [2] Acetic acid. [3] Hypodermic syringe.



లేనియెడల వానిమీద ముసురు ఈగలవలన అంటువ్యాధులు వ్యాపించవచ్చును. చీము, రక్తముకారి మలినపడిన [1]గాజ్ గుడ్డలను (స్పంజీలను) తువాళ్లను ఆలస్యములేకుండ చన్నీటిలో నానవేసి ఉదుకవలెను; సెప్టిక్ సంబంధమైన చీము, రక్తముకారిన వానిని మందునీళ్లలో వేసి డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవలెను. ఉమ్మిపాత్రలను ప్రతిదినము కడిగి పొంగించవలెను. పింగాణి గిన్నెలు మరకలుపడి రంగు చెడినట్లయిన, వానిని [2]సోడియం కార్బొనేట్ సొల్యూషన్‌లో ఒక గంటసేపు ముంచియుంచి, మరకలు తీసివేయవలెను. ఇరిగేటరులు, వాని ట్యూబింగులను ఉపయోగించిన వెంటనే బాగుగా శుభ్రముచేసి, యెండుటకుగాను ఎక్కడనైన తగిలించవలెను. ఇరిగేటరులు, రబ్బరు ట్యూబింగు, క్యాతిటరులు—ఇవి శుభ్రమైన పనికి ఉపయోగించబడునవైనయెడల, వానిని ప్రత్యేకముగా నుంచవలెను. వీనిని ఎనీమాకొరకు ఉపయోగించు సామానులతో కలుపకూడదు. రెక్టల్ ట్యూబ్స్, క్యాతిటరులు, ఎనీమాలకొరకు ఉపయోగించెడు ట్యూబులు—వీనిగుండ మంచి నీళ్లుపోసి, సబ్బు నీళ్లతోకడిగి కొన్ని నిమిషములు పొంగించవలెను. ఎక్కువసేపు పొంగించుటవలన రబ్బరు చెడిపోవును.

### క్రొత్తరోగిని చేర్చుకొనుట

ఒక క్రొత్తరోగి వైద్యశాలకు వచ్చినవెంటనే, నర్సు ఆమెను తన ఇంటికివచ్చిన దర్శకురాలివలె ఆహ్వానించి, ఆమెను చూచినందుకు సంతోషమును వెలిబుచ్చుచు, వార్డునకుగాని ప్రవేశపుగదికిగాని నడవగలదో లేక మోసికొనిపోవలెనో, త్వరగా గమనించవలెను. రోగి చాల జబ్బుతోనుండి పరుండవలసినయెడల పరుపు పైబట్టలు త్వరగ తీసివేసి మ్యాకింటాషు, స్నానపు కంబళ్లను, క్రింది దుప్పటి, డ్రాషీటులమీద పరువవలెను. రోగియొక్క పేరు, కులము, విలాసము, బంధుమిత్రాదుల విలాసము, అడిగి తెలిసికొని వ్రాసికొనవలెను. బంధువులు రోగితో నుండువారైననే కాని లేనియెడల రోగిని దర్శించుట, అన్నము తెచ్చుట అను విషయములను గూర్చి వారికి తెలియజెప్పవలెను. కొంచెము విశ్రాంతి తీసికొననిచ్చిన తరువాత రోగియొక్క ఉష్ణోగ్రత (టెంపరేచరు), నాడి (పల్స్), శ్వాసము (రెస్పిరేషన్), మొదలగువానిని తీసి చార్టుమీద వ్రాయవలెను. ఒక రోగి క్రొత్తగా ప్రవేశించినప్పుడు సాధ్యమైనంత త్వరలో ఆ సంగతి వైద్యునికి

[1] Gauze sponges. [2] Sodium carbonate.

తెలియజేసి అత్యవసరమైన లేక ప్రత్యేకమైన చిహ్నములు రోగియందు కనబడినయెడల వానినికూడ వైద్యునికి తెలుపవలెను. సాధ్యమైనయెడల రోగి మూత్రము పట్టి పరిశోధనాశాలకు (లాబరేటరికి) పంపవలెను.

రోగి వార్డులో ప్రవేశించినది మొదలు డిస్‌చార్జియై పోవువరకు నర్సు రోగిని అమేష గమనించుచుండుట అవసరము. ఇది సార్థకమగుటకు నర్సు దేనిని గమనించవలెనో, ఎట్లు గమనించవలెనో తెలిసికొనియుండవలెను. ఒక రోగిని చేర్చుకొనిన తరువాత ఆమెతీరు, దేహస్థితి, మనోస్థితి గమనించి, సంతోషముగ నున్నదో, మనస్సు కృంగియున్నదో, సౌఖ్యముగనున్నదో లేక నొప్పితో బాధపడుచున్నదో, దేహము ఉడుకుగనున్నదో లేక చల్లగ నున్నదో యని నర్సు గమనించుట చాల ప్రాముఖ్యమైన విషయము. ఇట్లు చేయుటవలన రోగిని పడకలో పరుండబెట్టక మునుపే అవసరమైన అనేక సంగతులు గ్రహించి తెలిసికొనవచ్చును. రోగి ఏడ్చుచున్నదా, మూల్గుచున్నదా, లేక నిట్టూర్పు విడుచుచున్నదా? ఆమె శ్వాస యెట్లున్నది? పెద్దగనున్నదా, ఒకవిధమైన శబ్దముతో గసపెట్టుచున్నదా? మెల్లగ లేక తగ్గురకములోనున్నదా? ఆమెకు ఏమైన దగ్గు ఉన్నదా? యని గమనించవలెను. నోటినుండిగాని, దేహమునుండిగాని ఏదైన దుర్వాసనకొట్టుచుండినయెడల, దానినికూడ గుర్తించవలెను. అనేక వైద్యశాలలలో, వచ్చిన క్రొత్తరోగుల స్థితిని గమనించుటకై మొదట పడకస్నాన మిచ్చెదరు. ముఖవైఖరిని తెలిసికొనుట, కండ్లను గమనించుట చాల ప్రాముఖ్యము. కనుపాపలు అసమానముగగాని, వికసించిగాని, ముడుచుకొనిగాని, లేక సహజ స్థితియందుగాని ఉన్నవా? కండ్లు ప్రాముఖ్యముగగాని లేక గుంటలు పడిగాని, [1]పసిరికలైగాని, రక్తముతోనిండిగాని యున్నవా? కనురెప్పలు వాపుగలిగిగాని, అసాధారణముగగాని కనబడుచున్నవా? వానిమీద పుండ్లులేచినట్లుగగాని లేక అవి రక్తహీనముగగాని ఉన్నవా? అని నర్సు గమనించవలెను. శ్వాసించునపుడు నాసికారంధ్రములు కదలుచుండినయెడల [2]శ్వాసావరోధము (డిస్‌పెనియ) అను రోగమును తెలియజేయును. పెదవులు పాలిపోయినరంగు లేక ఊదారంగుగలిగి యెండినట్టుగగాని తడిగగాని యుండును; పుండ్లు లేక పగుళ్లుకూడ వానియందు ఉన్నట్టు కనబడవచ్చును. నోటిని జాగ్రతగా పరీక్షించి పండ్లను శుభ్రముచేసి వాని

[1] Jaundiced. [2] Dyspnoea.



స్థితిని గమనించవలెను. నాలుక పొడిగానైనను లేక తడిగానైనను, పాచిపేరుకొనియైనను, పగుళ్లుగలిగియైనను, వాచియైనను ఉండవచ్చును. చూపునందుగాని, వినికిడియందుగాని ఏదైన లోపముండినయెడల దానిని గమనించవలెను. చర్మమును పరీక్షించి దానిమీద ఎఱ్ఱని పొక్కులు, గజ్జి, కురుపులు, మచ్చలు ఏవైన ఉండినయెడల వానిని తెలియజేయవలెను. రోగి పడకలో పరుండిన తరువాత ఏతీరున కుదురుకొని పరుండునో గమనించవలెను. రోగి దేహమందెచటనైనను, లేక దేహమంతటను ఈడ్పుగాని, వణకుగాని, వాని చిహ్నములుగాని యున్నవేమోయని నర్సు కనిపెట్టుటకు ఎల్లప్పుడు సిద్ధముగా నుండవలెను. ఏ భాగమునందైన ఇంద్రియజ్ఞానము [1](హైపరెస్తీషియ) హెచ్చుగనున్నదా లేక మందముగా [2](అనెస్తీషియ) నున్నదా యనియు గమనించుచుండవలెను. రోగికి ఆఖరిసారి యెప్పుడు విరేచనము (భేది)యైనదో కనుగొనవలెను; విరేచనము క్రమముగా అగుచున్నదా, అసాధారణముగానున్నదా, మలబద్ధకముచేసినదా, అతి విరేచనము (డైయేరియా) లగుచున్నవాయని గమనించవలెను. ఈ విషయములన్నియు వైద్యుడు చికిత్సచెయుటకు చాల సహాయకరముగానుండును. అప్పుడు ఆయన పథ్యము, చికిత్సనుగూర్చి తగు హెచ్చరిక లియ్యగలడు.

### దేహ పరీక్ష

వైద్యుడు వచ్చినవెంటనే నర్సు, రోగిని సామాన్యపరీక్షకొరకు సిద్ధము చేసి యుంచవలెను. డాక్టరుగారు ఏమిచేయునో నర్సు రోగికి ముందుగా నెఱిగించుట మంచిది.

పడకప్రక్కనున్న పరీక్షట్రేలో కొలతటేపు, రక్తపు ఒత్తిడిని తెలియజేయు సాధనము, [3]నోటిబద్దలు, దీపము, [4]కిడ్నీ బేసిను, గ్లాసు, లూబ్రికెంటు (నూనె), ఆంటిసెప్టిక్ లోషను, దూదియుండలు, [5]ట్రాన్స్‌ఫర్ ఫార్సెప్స్, తువాలు మొదలగునవి యుండవలెను. మరియొక బేసినులో నీళ్లు, సబ్బు, వైద్యుని చేతులు తుడుచుకొనుటకు తువాలును పెట్టి యుంచవలెను.

ఈ పరీక్షలో మంచి వెలుతురుండుట, రోగిని, వానిదుస్తులను క్రమపరచియుండుట, అవసరమైన పరికరములు సిద్ధముగా పెట్టియుంచుట తన భారమని నర్సు జ్ఞాపకముంచుకొనవలెను.

[1] Hyperesthesia. [2] Anesthesia. [3] Tongue blades. [4] Kidney basin. [5] Transfer forceps.

వైద్యుడు మొదట రోగియొక్క చర్మము, కండ్లు, చెవులు, ముక్కు, నోరు, మెడ మొదలగు అవయవములను చూచును.

[1]రొమ్ము పరీక్షచేయుటకు రోగియొక్క కోటు, షర్టు లేక గౌను తీసి, రోగిని వెల్లకిలపరుండబెట్టి, తలక్రింద ఒక దిండు పెట్టి, రోగి తన మోకాళ్లు ముడుచుకొనిగాని చాచుకొనిగాని యుండునట్లు చేయవలెను. దీనినే [2]డోర్సల్ రికంబెంటు పొజిషనందురు. పడకగుడ్డలను నడుమువరకు తీసి రోగి రొమ్మును తువాలుతో కప్పవలెను. వైద్యుడు పరీక్షించుచుండగా, రోగి తన ముఖమును అవలిప్రక్కకు త్రిప్పుకొనునట్లు చేయుము. పరీక్ష చేయవలసిన రొమ్ము భాగముమీద మాత్రము తువాలు తీసివేయుము. వీపును పరీక్షించుటకు, దాదాపు బోర్లపరుండుటకు వీలైనంత ప్రక్కకు రోగిని త్రిప్పుము. రోగి కూర్చుండియున్నయెడల, అతని రెండుచేతులను ఎదురు భుజములమీద పెట్టి, తువాలును రొమ్ముకడ్డముగాపట్టుకొని, తలను ముందుకు వంచుమని చెప్పుము. దిండును రోగి వీపుకు ఆనించిపెట్టుము. రోగి బలహీనముగా నున్నయెడల, నర్సు తనచేతులను రోగి రొమ్మునకు అడ్డముగాపెట్టి ఆపుగ నుంచవలెను.

[3]కడుపును పరీక్షించుటకు, రొమ్మును పరీక్షించినప్పటివలె డోర్సల్ రికంబెంటు పొజిషనులో రోగియుండవలెను గాని, చేతులుమాత్రము ప్రక్కలయందుండును. మూత్రకోశము ఖాళీగానుండవలెను. ఎదురొమ్మున తువాలుకప్పి, కంబళిని మోకాళ్లవరకు వెనుకకు మడువుము. పైదుప్పటిని పొత్తికడుపుక్రిందికి లాగి, దానిని తుంట్లవద్ద దోపి, సరియైన తీరున నుంచుము.

ఒక కాలును లేక రెండుకాళ్లను, పాదములను పరీక్షించుటకు వాని మీద కప్పిన దుప్పటిని ఒకప్రక్కగా తొలిగించి, కాలి లోపలి భాగము పొడుగున నుంచవలెను.

[4]వెన్నెముకను, రోగిని పడకలో పరుండబెట్టిగాని, నిలువబెట్టిగాని, పరీక్షించవచ్చును. రోగి నిలుచున్నయెడల, చొక్కాను వేసికొని వీపున తెరచియుంచునట్లు చేయుము. అప్పుడు దుప్పటిని రెండు మడతలుగా మడిచి, రోగి తుంట్లకును, కాళ్లకును చుట్టుము (కట్టుము).

[1] Chest examination. [2] Dorsal recumbent position.
[3] Abdominal examination. [4] Spine.



సామాన్యపరీక్ష సందర్భములో [1]భగమును పరీక్షించునప్పుడు, రోగిని డోర్సెల్ రికంబెంటు పొజిషనులో అనగా వెల్లకిల పరుండబెట్టి, మోకాళ్లు, తొడలు పైకివంచి దూరముగా తెరచిపెట్టుము. పిరుదులక్రింద తువాలు, మాకింటాషు వేయుము. బాహ్యజననేంద్రియములను పైనుండి క్రిందికి శుభ్రముగా కడుగుముగాని డూష్‌మాత్ర మియ్యకూడదు. పై దుప్పటిని పొత్తికడుపు క్రింది [2]శష్పములవరకు దించవలెను. చొక్కాను నడుము వరకు మడువవలెను. క్రిందిదుప్పటి మధ్యభాగమును [3]యోనిపైకి తెమ్ము. పిమ్మట దాని క్రిందిమూలలలో ఒకదానిని ఒక అడుగువరకు మడువుము. వైద్యుడు పరీక్ష నారంభించువరకు [3]యోనిని తువాలుతో కప్పియుంచవలెను. గ్లౌసు, లూబ్రికెంటులను సిద్ధముగా పెట్టియుంచవలెను. రోగి మూత్రకోశము, పురీషనాళము ఖాళీగానున్నవని నర్సు నిశ్చయముగా ఎరిగియుండవలెను. దీనికన్న విపులముగా భగమును పరీక్షించుటను గూర్చి 34-వ అధ్యాయము చూడుము.

పడకలోనే పురీషనాళము పరీక్షించుటకు, రోగిని డోర్సల్ రికంబెంటు పొజిషనులో పరుండబెట్టి, తొడలు, మోకాళ్లు పైకివంచిగాని, లేక యెడమప్రక్కకు ఒదిగించిగాని, కుడికాలు ముడుచుకొనునట్లును చేయుము. దీనికిముందు మూత్రకోశము, ప్రేగులు ఖాళీచేయించుము. పురీషనాళ ప్రదేశము శుభ్రముగానున్నదని నిశ్చయముగా తెలిసికొనుము. [4]గ్లౌ, [5]లూబ్రికెంటు సిద్ధముగా పెట్టుకొనుము. దీనికన్న విపులముగా పరీక్ష చేయుటనుగూర్చి 38-వ అధ్యాయము [6]ప్రొక్టొస్కోపి, [7]సిగ్‌మయిడొస్కోపియను విషయముల క్రింద చూడుము.

కండ్లు పరీక్షించుటకు రోగి నెట్లు సిద్ధపరచవలెనో 35-వ అధ్యాయమున, చెవులనుగూర్చిన పరీక్ష, ముక్కు, నోరు, గొంతులనుగూర్చిన పరీక్షనుగూడ 36-వ అధ్యాయము చూడుము.

### రోగినిగూర్చిన సామాన్య జాగ్రత

రోగులు శుభ్రముగాను, సౌఖ్యముగాను నుండునట్లు చూచుట నర్సుయొక్క ముఖ్యమైన విధియైయున్నది. రోగి శరీరము, రోగి గుడ్డలు

[1] Vagina. [2] Pubes. [3] Vulva. [4] Glove.
[5] Lubricant. [6] Proctoscopy. [7] Sigmoidoscopy.

కూడ శుభ్రముగా నుంచవలెను. ఈ కారణములనుబట్టి రోగికి ఆహారము నిచ్చునపుడుగాని, పండ్లు తోమునపుడుగాని, ఇతర చికిత్స సమయమందు గాని, వాని పడకయు, దుస్తులును పరిశుభ్రముగానుండునట్లు నర్సు శ్రద్ధ తీసికొనవలెను. [1]మలవిసర్జన పాత్రలను వాడుకొనుటకు ఇయ్యకముందు అవి శుభ్రముగానుండునట్లు చూడవలెను. ఈ పాత్రల నిచ్చుటకుగాని తీసివేయుటకుగాని తోటి లేక పాకివాడుగాని, రోగిబంధువులుగాని దగ్గరకు రాకూడదు. రోగిని శుభ్రముగా నుంచినయెడల, ముఖ్యముగా రోగియొక్క చేతులు, కాళ్లు శుభ్రముగా నున్నయెడల పడకగుడ్డలు చాలకాలము వరకు శుభ్రముగానుండునుగాని, పరిపూర్ణ శుభ్రతయుండుటకు ఈ గుడ్డలను అవసరమైనంత తరుచుగా మార్చుచుండవలెను. రోగి మొదట ప్రవేశించినప్పుడు, ఆమెకు స్నానముచేయించి, వైద్యశాల దుస్తులు తొడిగించవలెను. రోగి స్వంత గుడ్డలను వీలైనయెడల ఆమె స్నేహితులు ఇంటికి తీసికొనిపోవలెను. ఆస్పత్రిలో విడిచిపెట్టినయెడల, అవసరమును బట్టి వానిని ఉదికించి, రోగియొక్క పేరును వానిమీద గుర్తించి, భద్రముగా దాచియుంచవలెను. కొన్ని వైద్యశాలలలో రోగులను తమ స్వంతగుడ్డలనే వేసికొననిచ్చెదరు.

**రోగియొక్క సౌఖ్యము**

మంచి ఓర్పు, శ్రద్ధాభక్తులతో నర్సు కనిపెట్టుకొనియుండినపక్షమున, రోగులకు ఏవిధమైన కోపము, మనోవ్యాకులత లేక, శమనము బొంది, సుఖముగానుండునట్లు నర్సు సహాయపడగలదు. రోగియొక్క ఆశలను సాధ్యమైనంత త్వరగా తీర్చవలెను. రోగికి చికిత్సచేయునపుడును, వైద్యుని పరీక్షకు సిద్ధముచేయునపుడును, నర్సు కావలసినవానినన్నిటిని సిద్ధముచేసి దగ్గరనుంచుకొనవలెను. చికిత్సకుముందు రోగిని సరిగా కప్పియుంచవలెను. రోగి పడకమీద కూర్చుండుటయు, దానిని తగులుటయు నర్సుకు తగదు. రోగిని ఒకేతీరున చాలకాలముంచక, నొప్పిగానుండు అవయవములకు శమనముగలుగుటకుగాను దిండ్లుపెట్టవలెను. వెనుక ఒక దిండు, రోగిప్రక్కకు ఒదిగిపరుండినపుడు మోకాళ్లమధ్య ఒకదిండు, లేక వీపుక్రింద ఒక చిన్నదిండు పెట్టినయెడల, రోగిబాధ చాలవరకు తగ్గిపోవును.

[1] Bed pans.



**దర్శకులు**

దర్శకులుండుటవలన రోగికి ఆయాసము, విసుగుగానుండినయెడల, వారిని రానియ్యకూడదు. నియమితకాలములో దర్శకులు పెక్కుమంది వార్డులోనికి వచ్చుసమయమున చాల జబ్బుతోనున్న రోగి పడకచుట్టు పరదాలువేసి మఱుగుగానుంచవలెను.

## అధ్యాయము 5

# పడకలువేయు విధానము, పండుకొను తీరులు, స్నానము, ఆహారము రోగులకు ఇచ్చు పద్ధతులు

నర్సులు తాము వైద్యశాలలోచేరి పనిచేయు మొదటి కొన్ని వారములలోనే ఒండొరులు కలసికొని, తమలో నొకరు రోగిగను మరియొకరు నర్సుగను భావించుకొని, ఆ రోగికి పడకవేయుట, మున్నగు స్వల్పకార్యములను అభ్యాసము చేసికొనుచుండవలెను. 'ఈ రోగి నా స్వంతకుటుంబమునకు చేరినపురుషుడు లేక స్త్రీయైనయెడల, ఆయన లేక ఆమె ఏ విధముగా చికిత్స చేయబడగోరును?' అను ప్రశ్న వేసికొని పనిచేయుచుండినట్లయిన, వారు నర్సింగుయొక్క నిజమైన భావమును గ్రహించగలుగుటయే కాక, మిక్కిలి శీఘ్రకాలములోనే, యోగ్యమైన నర్సులు కాగలరు.

**పడకలువేయు విధానము**

పడకలువేయు విధానము అభ్యాసవశమువలన నలవడును. తరుచుగ పడకలు వేయుచుండుటవలన, వానిని నేర్పుగవేయు విధమును నర్సులు స్వయముగా నేర్చుకొందురు. పడకలువేయుటలో సొంపు, పరిశుభ్రతలను గమనించుటయేకాక, రోగియొక్క సౌఖ్యమునుగూడ నర్సు మనస్సునందుంచుకొనవలెను. ఆయాసముగను, అసౌఖ్యముగనునున్న రోగికంటె సంతోషముగను సౌఖ్యముగనున్న రోగి త్వరగ నెమ్మదిబొందును. అవసరమైన వస్తువులన్నిటిని మొదటనే సంపాదించి పెట్టుకొనవలెను. అవసరమైన శుభ్రమైన గుడ్డలు, మాసిపోయిన గుడ్డలకొరకు ఒకతట్ట, పడకను శుభ్రము చేయుటకు ఒక బ్రష్ (లేక కుంచె) మొదలగువానిని సిద్ధముగా పెట్టుకొనవలెను.

తనకు తాను సహాయము చేసికొనలేని రోగియొక్క పడక వేయుటకు ఇద్దరు నర్సులు కావలెను. వారు ఎదురెదురుగా పడకకు ఇరుప్రక్కల నిలుచుండవలెను. రోగి లేవలేనప్పుడు క్రింది దుప్పటిని, డ్రాషీటును ఒక ప్రక్కనుండి యింకొకప్రక్కకు తీసి మార్చవచ్చును. రోగిని త్రిప్పలేక పోయినను, ఎత్త గలిగినప్పుడు పై చెప్పినవానిని పడక పాదము దగ్గర నుండి తీయవచ్చును. పడకను తీసివేయకముందు పడక గుడ్డలన్నిటిని, క్రింది దుప్పటినిగూడ, అన్ని ప్రక్కల వదులుచేయవలెను; అట్లే టేపులన్నిటిని ముందుగనే అన్నిప్రక్కల ఊడదీయవలెను. రోగిని మెల్లగా ఒక ప్రక్కకు పొర్లించి, క్రింది దుప్పటిని, డ్రాషీటును, రోగి దగ్గరకు మడిచి చుట్టవలెను. ఇట్లు ఖాళీపడిన స్థలములో శుభ్రమైన దుప్పటులను పొడుగుగా పరచి, వీలైనంతవరకు వానిని మాసిన దుప్పటుల దగ్గరకు మడువవలెను. పిదప ఆవలి ప్రక్కనగూడ వెనుకటివలెనే పడక వేయనలెను. మాసిపోతేనే కాని, మాకింటాష్‌ను తీసివేయవలసిన అవసరము లేదు. కాని ముడతలులేకుండ దానిని నునుపుచేయవలెను. తరువాత రోగిని మెల్లగా ఒక ప్రక్కకు క్రొత్తగావేసిన పరుపుమీదికి పొర్లించి, మాసిన దుప్పట్లను దీసివేయవలెను. పిమ్మట క్రొత్తదుప్పట్లను పడకమీదికి లాగి, బిగువుగా పరచి, కొనలను పరుపుక్రింద దోపకమునుపు, ముడుతలు బొత్తుగాలేకుండ చేయవలెను. పరుపులేనియెడల, టేపులను గట్టిగా బిగించి కట్టవలెను. పై దుప్పటినిమాత్రమే మార్చవలసినప్పుడు, మొదట కంబళిని తీసివేయవలెను. పిమ్మట పడక పాదముతట్టునుండి దుప్పటిని వదలుచేసి, శుభ్రమైన దుప్పటిని మాసినదానిమీదవేసి, ఒక చేతితో దీనిని పట్టుకొని, మరియొక చేతితో క్రింది దుప్పటిని లాగివేయవలెను. పడకవేయుచుండగా, దుప్పటితో, రోగిముఖము కప్పకుండ చూడవలెను. పడక గుడ్డలను రోగిదేహముమీదగాని, పాదములమీదగాని గట్టిగా లాగి బిగించకూడదు. అవి రోగికి సుఖకరముగా నుండవలెను. అనగా, రోగి తన పాదములను సులభముగా ముడుచుకొనుటకును, ఇష్టమువచ్చినట్లు త్రిప్పుకొనుటకును అనుకూలముగా నుండవలెను. దిండ్లను తిరిగి [1]వరలలో పెట్టకముందు, వానిని బాగుగా విదిలించవలెను. గలీబులు (వరలు) మాసినయెడల వానిని మార్చివేయువలెను.

[1] Pillow cases or slips.



రోగులను పడకలో లేవనెత్తుట

ఈపనిచేయుటకు ఇద్దరు నర్సులు కావలెను. వారిలో ఒకరు ఈ పని క్రమముగా జరుగునట్లు చివరివరకు సలహాల నిచ్చుచుండవలెను. పడకగుడ్డలు బరువులేకుండునట్లు వానిని అమర్చవలెను. నర్సులు నడుములువంచి రోగిని ఎత్తుచుండగా వారి మోచేతులు వీలైనంతమట్టుకు వారిప్రక్కల దగ్గరనుండవలెను. సాధ్యమైనంతవరకు వారి చేతులను రోగిక్రిందికి దూర్చవలెను. ఒక బరువైన రోగిని ఎత్తునప్పుడు వాని నడుములక్రిందను వీపుక్రిందను చేతులువేసి, నర్సులు ఒకరిచేతి నొకరు పట్టుకొనుటవలన వారికి ఎక్కువ బలము చేకూరును. తమకు అలవికానంత బరువు ఉన్న రోగిని ఎత్తుటకు నర్సులు ఎప్పుడును ప్రయత్నించకూడదు. వారికి కావలసిన అదనపు సహాయము తెచ్చుకొనవలెను. అనగా ఇతరులను సహాయముకొరకు పిలువవలెను. లేనియెడల రోగికి చాల అసౌఖ్యమును నర్సులకు చాల శ్రమయు కలుగును.

ప్రత్యేకపుమాదిరి పడకలు

వివిధ రకములైన రోగులను పరామర్శించుటకుగాను వారి పడకలను గూడ వివిధరకములుగా మార్చుచుండవచ్చును.

**కంబళ్లతో వేసిన పడక:**—రోగి కంబళ్లలో పరుండియుండును. సాధారణముగా ఉపయోగించెడు డ్రాషీటుకు బదులుగా, ఒక చిన్న మాకింటాష్‌తో మడిచిన దుప్పటిగాని తువాలుగాని చేర్చి కంబళి మైలకాకుండ రోగి పిరుదులక్రింద వేయుదురు. వాతరోగముగలవారిని కంబళ్లనడుమ పరుండబెట్టి చేయవలసిన ఉపచారములు చేయుదురు. గుండె, మూత్రపిండముల వ్యాధులలో మామూలుకంటె ఎక్కువ వేడిమి కావలసివచ్చినప్పుడును, ఇట్లు చేయుదురు. ఎక్కువవేడిమివలన చర్మముద్వారా చెమట ఎక్కువగవచ్చుటచేత మూత్రపిండములకు చాలవరకు పనిభారము తగ్గును. అందువలననే యిట్టి రోగులకు ఈ పడక వేయుదురు.

**గుండె జబ్బుగల రోగులకొరకైన పడక:**—గుండెవ్యాధిగల అనేక రోగులను వెల్లకిల పరుండబెట్టి చికిత్సచేయుదురు. వారికి ఈ తీరులో నెక్కువ విశ్రాంతికలుగును. కాని రోగికి [1]శ్వాసావరోధ లక్షణములు కనబడినయెడల, రోగి సులభముగా శ్వాసించుటకు బెడ్ రెస్టు (రోగి పడకపై నానుకొనెడు సాధనము) పెట్టి [2]ఫౌలర్స్ పొజిషనులో నుంచవలెను. ఈ

[1] Dyspnoea. [2] Fowler's position.

పనికొరకు బెడ్ రెస్టు, కొన్ని దిండ్లు అవసరమై యుండును. వెన్నెముక చివర ఒత్తిడి తగ్గించుటకుగాను గాలి దిండు పెట్టవలెను. రోగి పడకలోనికి జారకుండ పాదములకు ఆధారముగాని, కాళ్లక్రింద దిండ్లుగాని యుంచ వలెను. [1]మంచముపై ఒక పడకబల్లవేసి, దిండునుంచి, రోగిని ముందుకు ఆనుకొనునట్లు చేసినయెడల, కష్టములేకుండ శ్వాసించగలదు.

ఆపరేషను పడక:—ఈ పడకను సాధారణముగానే సిద్ధముచేయుదురు గాని, దిండుకుబదులు, తువాలు కప్పిన ఒక మాకింటాషు నుపయోగించు దురు. శస్త్రముచేయబడవలసిన భాగముండుచోట, ఒక చిన్న మాకింటాషు తుండును, డ్రాషీటును పడకమీద వేయుదురు. రోగిని తిరిగి వార్డునకు తీసికొనివచ్చినప్పుడు సులభముగా తీసివేయగలుగునట్లు కప్పు గుడ్డలను పరుపుక్రింద దోపక, మడిచి యుంచుదురు. ఉడుకునీటి బుడ్లను ఫ్లానలు గుడ్డలలో పెట్టుటవలన పడకను ఉడుకుగానుంచవలెను. రోగి మత్తు నుండి తెలివిపొందువరకు బాగుగా ఉష్ణముకలిగియుండునట్లు, ఆమెమీద, అనగా ఆమెకు కప్పిన పై దుప్పటిక్రింద సాధారణముగా ఒక కంబళి



2. ఆపరేషను పడక

కప్పుదురు. శస్త్రముచేయబడిన అవయవమును ఆనించుటకు ఎక్కువదిండ్లు అవసరమైయుండవచ్చును. లేక రోగి మత్తునుండి తెప్పరిల్లిన తరువాత, ఆమె ఆధారమునకైనను ఈ దిండ్లు అవసరమైయుండును. శస్త్రము చేయ బడిన భాగము నుంచుటకు ఉపయోగించు దిండ్లను మాకింటాషు కప్పి, మైలకాకుండ కాపాడవలెను. ఒక అవయవము [2]కోసివేయబడినప్పుడు, మొండిభాగము కనబడునట్లు, దానిని ఒక దిండుమీద పైకెత్తి పెట్టవలెను.

[1] A bed table. [2] Amputated.



పరుపు బరువుకూడ దానికి తగలకుండ, దానిని ఒక [1]బెడ్ క్రేడల్‌లో నుంచ వలెను. రక్తస్రావమును ఆపుటకు తలప్రక్క ఒక [2]టర్నికేట్‌ను కట్టి యుంచవలెను. ఒక [3]కిడ్ని బేసినును, రోగి నోరు తుడుచుకొనుటకు ఒక తువాలు మొదలగువానిని ప్రక్కనున్న [4]లాకర్‌పై నుంచవలెను. పరదా లను సిద్ధముగా దగ్గరపెట్టుకొనియుండి, రోగిని తిరిగి తీసికొని రాగానే, వానిని పడకచుట్టు త్వరగా వేయవచ్చును. శరీరమునకు కలిగిన [5]అదురు (షాక్)వలన రోగి బాధపడుచుండినప్పుడు పడకకాళ్లను ఎత్తిపెట్టుటకు [6]పడక దిమ్మెలు (ఎత్తులు) సిద్ధముగా నుండవలెను. [7]పురీషనాళముద్వారా సేలైను నెక్కించుటకు కావలసిన పరికరములన్నియు సిద్ధముగా నుండవలెను.

[8]ఫ్రాక్చరు పడక:—అనగా ఎముక విరిగినప్పుడు రోగికి ఉపయోగించెడు పడక. విరిగినయెముక ఆనుకొను పడకభాగము దిట్టముగను, జారిపోకుండ గను నుండవలెను. ఇందుకొరకు పరుపుక్రింద, మంచము చట్టముమీద గట్టిచెక్కలు వేయుదురు. కొన్నివిధములైన విరిగిన యెముకల చికిత్సకు మరి యెక్కువ పరికరములు, అనగా [9]లాగిపట్టి యుంచుటకు తగిన సాధనములు, పడకదిమ్మెలు, ఇసుకసంచులు, బద్దలు మొదలైనవి అవసరమై యుండును. వీనినిగూర్చి 28-వ అధ్యాయములో చదువవచ్చును.

[10]వివిధమైన తీరులు

నర్సింగులో ఉపయోగించుతీరులు రోగియొక్క అవసరమునుబట్టియుం డును. సాధారణముగా రోగిని [11]డోర్సల్ రకంబెంటు, [12]సెమిరికంబెంటు తీరు లలోగాని తిన్నగాకూర్చుండు తీరులోగాని యుండనిచ్చి చికిత్స చేయుదురు.

[13]డోర్సలురికంబెంటు లేక సూపైన్ పొజిషను:—ఈ తీరులో రోగి యొక్క మెత్తని దిండుమీద తలవాల్చి, వెల్లకిల పరుండి, మోకాళ్లు కొద్దిగా ముడుచుకొనును. ఇట్లు ముడుచుకొనిన మోకాళ్లను మరియొక దిండు మీద మోపును. ఈ తీరులో రోగి సంపూర్ణ విశ్రాంతి పొందుటకు వీలగును గాన, చాల జబ్బుగానున్న రోగుల ననేకులను ఈ తీరులో బెట్టి చికిత్సచేయుదురు. అయినను ఈ తీరు వృద్ధులకుగాని, [14]బ్రాంకైటీసు అను శ్వాసనాళ రోగమున్న వారికిగాని పనికిరాదు.

[1] Bed cradle. [2] Tourniquet. [3] Kidney basin. [4] On the locker. [5] Shock. [6] Bed blocks. [7] Rectal saline. [8] Fracture bed. [9] Extension apparatus. [10] Various positions. [11] Dorsal recumbent. [12] Semi-recumbent. [13] Dorsal recumbent or supine position. [14] Bronchitis.

[1]ప్రోన్ రికంబెంటు పొజిషను:—ఈ తీరులో రోగి బోర్లగిలి పరుండును. వక్షముక్రింద సాధారణముగా ఒక దిండు పెట్టుదురు. దీని క్రింద నున్న ఖాళీస్థలములో రోగి చెయ్యి యొకటి యుండును. క్రిందితట్టుకు త్రిప్పిన ముఖము పెట్టుకొనుటకు రెండవ దిండు ఉండును. ముఖము త్రిప్పిన తట్టు నున్న చెయ్యిని ముడుచుకొని దిండుప్రక్కన పెట్టుకొనును. ఈ తీరును సాధారణముగా ఉపయోగించరుగాని, చాలకాలము పడకలో పరుండి నందున వీపున పుండ్లు లేచినపుడుగాని, [2]గర్భకోశము స్థానము తప్పి, వెనుకకు జరిగినవుడుగాని దీని నుపయోగింతురు.

[3]డోర్సెలు ఎలివేటెడ్ లేక సెమిరికంబెంటు పొజిషను:—ఈ తీరులో రోగియొక్క తల, వక్షము, భుజము కొన్ని దిండ్లమీద మోపబడి యెత్తు చేయబడియుండును. రోగి వెల్లకిలనే పరుండును. పడక తలను దిమ్మెల మీద ఎత్తుటవలనను ఈ తీరు కుదురునుగాని రోగి యేటవాలుగా పరుండి యుండును. మెడికలు (వైద్య) సర్జికలు (శస్త్ర) నర్సింగులో ఈ తీరు నెక్కువగా నుపయోగింతురు. అనగా వైద్య చికిత్స, శస్త్ర చికిత్స పొందు రోగులకు దీని నుపయోగింతురు. ఒక దిండును మోకాళ్లక్రింద పెట్టి దానిని పడకప్రక్కలకు కట్టివేయుదురు. లేదా, ఒక డ్రాషీటులో చుట్టి, దాని కొనలను గట్టిగా పరుపుక్రింద దోపుదురు. లేదా దానికొనలను టేపులతో బిగించి ఆ టేపులను పడక తలకు కట్టుదురు. కొన్నిసార్లు రోగి జారిపోకుండ కాళ్లక్రింద ఏదైన ఒక యెత్తును పెట్టుదురు.

[4]ఫౌలర్స్ పొజిషన్:—దీనిని ఒక అమెరికను సర్జను వాడుకలోనికి తెచ్చెను. దీనివలన పడకయొక్క తలవైపును 24 అంగుళముల యెత్తుగల దిమ్మెలమీద లేపిపెట్టెను. కాని ఇప్పుడు ఫౌలర్స్ తీరులో ఒక రోగిని దాదాపు తిన్నగా కూర్చుండనిచ్చెదరు. ప్రత్యేకమైన సర్జికల్ పడకల మూలమునగాని [5]ఒక పడకయెత్తు, దిండ్లమూలమునగాని లేక కేవలము దిండ్లు ఎత్తుపెట్టుట మూలముననే కాని ఈ తీరును ఏర్పాటు చేయ వచ్చును. చేతులను దిండ్లమీద మోపవలెను. రోగికి పడకపుండ్లు లేవకుండ ఆమె గాలినింపిన ఒక దిండుమీదగాని ఉంగరముమీదగాని కూర్చుండ

[1] Prone recumbent position. [2] Retroverted uterus.
[3] Dorsal elevated or semi-recumbent position.
[4] Fowler's position. [5] A bed rest.



వలెను. ప్రత్యేకమైన సర్జికల్ పడక లేనప్పుడు మోకాటిదిండును ఉపయోగించవలెను. [1]అబ్డామినల్ క్యావిటి (ఉదరగుహ) నుండి డ్రెయినేజ్



3. ఫౌలర్స్ పొజిషను

(ద్రవము) తీయవలసినప్పుడును, అంటు పైకివ్యాపించకుండ చేయుటకును, శ్వాసించుటకు కష్టముగ నున్నప్పుడు సులభము చేయుటకును, ఈ తీరును వాడుదురు.

పరీక్షచేయుటకును, చికిత్సచేయుటకును ఉపయోగించెడు వివిధములైన తీరులు

[2]ఎడమప్రక్కకు ఒదిగియుండు తీరు:—ఈ పాటులో రోగిని యెడమ ప్రక్కకు త్రిప్పి, కుడికాలును మోకాలుదగ్గర బాగుగ పైకి ముడుచుకొనునట్లు చేయవలెను. తలదిండును సాధారణముగ తీసివేయుదురు. ఎనీమాలు ఇచ్చునప్పుడుగాని, సపాజిటరీలు అను సాధనముల నుపయోగించునప్పుడుగాని, పురీషనాళముద్వారా టెంపరేచరు (ఉష్ణోగ్రత) తీయునప్పుడుగాని పురీషనాళమును పరీక్షించునప్పుడుగాని ఈ తీరు నుపయోగించుదురు.

సిమ్స్ పొజిషన్:—ఈ తీరులో రోగి యెడమప్రక్కకు కొద్దిగా బోర్ల పరుండును. ఆమె కుడిచేయి ముందుతట్టు పడకమీద మోపబడియుండునుగాని, యెడమచేయి వెనుకతట్టు పడకక్రిందికి చాపబడియుండును. రెండు మోకాళ్లు పైకి ముడుచుకొని యుండునుగాని యెడమదానికంటె

[1] Drainage of the abdominal cavity. [2] Left lateral position.

కుడిమోకాలు ఎక్కువగ ముడుచుకొనియుండును. పిరుదులు మంచము అంచుదగ్గిర ఉండవలెను. ముఖముయొక్క యెడమతట్టుచెంప, క్రింద



4. సిమ్స్ పొజిషన్

వేయబడిన ఒక చిన్నదిండుమీద ఆనుకొనియుండును. [1]భగమును పరీక్షించునపుడుగాని ప్రసవసమయమునగాని రోగి ఈ తీరులోనుండును.

లిథాటమి పొజిషన్:—దీనిని 38-వ అధ్యాయములో చూడుము.

ట్రెండెలెన్‌బర్గ్ పొజిషన్: — దీనినికూడ 38-వ అధ్యాయములో చూడుము.

[2]మోకాటి, ఎదుఱొమ్ము తీరు:— ఈ తీరులో రోగి పడకమీదగాని, బల్లమీదగాని మోకరించియుండును. అప్పుడు ఆమె తొడలు కాళ్లకు [3]సమకోణములుగా నుండును. వక్షము ఒక దిండుమీద ఆనుకొని



5. మోకాటి, ఎదుఱొమ్ముతీరు

యుండును. రోగి తన చేతులు ముడుచుకొని తలకును, దేహమునకును ఆధారముగా నుంచుకొనును. ఈ తీరులో రోగియొక్క మూత్రకోశమును, పురీషనాళమును పరీక్షించుటకు వీలగును. [4]కూపకమునందలి అవయవ

[1] Vagina. [2] Knee chest position. [3] At right angles. [4] Pelvic organs.



ములు స్థానము తప్పియున్నప్పుడుగాని, లేక బలహీనముగానున్నప్పుడుగాని, మరి ముఖ్యముగా ప్రసవించినతరువాత తల్లికి మంచి దేహాభ్యాసము కలుగుటకుగాని, దినమునకు కొన్నిసారులు 10—15 నిమిషముల వరకు రోగిని యీ తీరులో నుంచెదరు.

[1]మోకాళ్లు ముడుచుకొనిన డోర్సల్ రికంబెంటు పొజిషన్ లేక మాడిఫైడ్ డోర్సల్ రికంబెంటు పొజిషన్:—ఈ తీరు, 57-వ పుటలో భగమును పరీక్షించుట అను దానిక్రింద వివరించబడినది. దీనిని పురీషనాళమును



6. మోకాళ్లు ముడుచుకొనిన డోర్సలు రికంబెంటు లేక మాడిఫైడ్ డోర్సలు రికంబెంటు పొజిషన్

కూపకమును పరీక్షించునపుడును, పురీషనాళము, భగము, మూత్రకోశములకు చికిత్సచేయునపుడును ఉపయోగించుదురు.

## [2]రోగికి స్నానముచేయించుట

**పడకస్నానము:**—రోగికి పడకలోనే స్నానముచేయించుట అను విషయములో సహాయపడుట స్టూడెంట్ నర్సు చేయవలసిన మొదటి పనులలో ఒకటియైయుండును. 4-వ అధ్యాయములో 'రోగినిగూర్చిన సామాన్య జాగ్రత' అను విషయముక్రింద చెప్పబడిన నియమములను ఈ సమయములో కూడ జాగ్రత్తగ అనుసరించవలెను.

**పరికరములు:**— రెండు స్నానపుకంబళ్లు, ఒక పొడుగు మాకింటాషు, సబ్బు, గోళ్లు శుభ్రముచేయు బ్రష్, వాష్‌క్లాత్ (స్నాపుగుడ్డ), గోళ్లు కత్తిరించు కత్తెర, వెండ్రుకల బ్రష్, దువ్వెన, రెండు తువాళ్లు, (చేతులు, ముఖము తుడుచుటకు ఒక మెత్తని తువాలు, దేహము తుడుచుటకు ఇంకొక తువాలు) గోళ్లు శుభ్రముచేయుటకు ఒక ఆరింజి కఱ్ఱపుడక, జననేంద్రియ

[1] Dorsal recumbent position with knees flexed, or modified dorsal recumbent position. [2] Toilet of patient.

ములు కడుగుటకు ¹ఒక ముతుకపీచు, చాలినంత పెద్ద బేసినును, రెండు జగ్గులు (ఒకదానిలో ఉడుకునీళ్లు, ఇంకొకదానిలో చన్నీళ్లు); మైలనీళ్లు పట్టుటకు ఒక బక్కెట్టు, కత్తిరించిన గోళ్లను, వాడిన గుడ్డముక్కలను వేయుటకు ఏదైన ఒక పాత్ర, వీపునకును, భుజములకును గొట్టుటకు డస్టింగుపౌడరు, శుభ్రమైన దుస్తులు, పడకగుడ్డలు, నోటిని శుభ్రముచేయు ట్రే, మాసిన గుడ్డలను వేయుటకు ఒక తట్టకావలెను.

**పద్ధతి:**—మొదట రోగి మంచముచుట్టు పరదాలువేసి, స్నానము చేయకముందు రోగి పడకచట్టిలో భేదిచేయగోరునేమోయని నర్సు అడిగి తెలిసికొనవలెను. తరువాత పడకగుడ్డలను చక్కగమడిచి ఒక స్టూలుమీద గాని కుర్చీమీదగాని పెట్టవలెను. పిమ్మట పొడుగైన మాకింటాషు, కంబళ్లను పడక మార్చునప్పుడు ఉపయోగించునట్లే ఉపయోగించవలెను. రోగి దుస్తులు తీసివేసి, యీ క్రిందివిధముగా ఆమెకు స్నానము చేయించవలెను:—మొదట ముఖమును శుభ్రమైన నీటితో కడుగవలెను. రోగికి యిష్టమున్నయెడల సబ్బు నుపయోగించవచ్చును. పిమ్మట సబ్బును విశేషముగా వాడి, మెడను, చెవులను గడుగవలెను. తరువాత ఒక్కొక్క చేతిని, మొదట దూరముగానున్న దానిని, వక్షమును కడుగవలెను. ²చంకలు శుభ్రముగానున్నవా లేవాయనిచూచి, వానిని తప్పక శుభ్రముచేయవలెను. అవసరమైనప్పుడెల్ల నీళ్లనుమార్చవలెను; రోగి మురికిగానుండిన, మూడు నాలుగుసార్లుకూడ మార్చవలెను. కడుపు, ప్రక్కలను కంబళ్లక్రిందనే కడుగవలెను. ³బొడ్డును శుభ్రముగాకడిగి, జాగ్రత్తగా తుడిచి, ఆరనియ్యవలెను. పిమ్మట రోగిని ఒక ప్రక్కకుత్రిప్పి, వీపును భుజములను కడుగవలెను. ఈ పనిని బాగుగాచేయుటకుగాను, నర్సు మొదట తన స్వంతచేతులకుగాని స్నానపుగుడ్డ (వాష్‌క్లాత్)కుగాని సబ్బు పూసికొని, రోగి దేహమును బాగుగా రుద్దవలెను. చేతులను చుట్టుత్రిప్పి చురుకుగా ఆడించి యీ పని చేయవలెను. ఇట్లు చేయుటవలన చర్మమునకు చురుకుపుట్టుటయేకాక, ఒత్తిడివలన నేర్పడు పుండ్లుకూడ రాకుండును. దేహమును తుడుచునప్పుడు మొదట వీపును బాగుగా రుద్ది తుడిచి, పౌడరు కొట్టవలెను. జననేంద్రియముల ప్రాంతమును ఇప్పుడు సులభముగా కడుగవచ్చును. ముతుకపీచును బాగుగా నీటిలోముంచి,

¹ Tow for washing the genitals. ² Axillae. ³ Umbilicus.



సబ్బుపూసి, దానితో రోగిని కడిగినపిమ్మట దానిని పారవేయవలెను. తిరిగి క్రొత్తపీచు కొంచెము తీసికొని సబ్బునీటిని తుడిచివేసి, కడిగినభాగమును ఆరనియ్యవలెను. పెక్కుమంది రోగులు ఈ భాగములను తామే కడుగుకొనగోరుదురు. తరువాత ఒక్కొక్క కాలును కడుగవలెను. కడుగుచుండగా వీలైనంతవరకు గాలి తగులకుండునట్లు కడుగవలెను. ఒక కాలు కడిగిన తరువాత రోగి తన మోకాటిని ముడుచుకొని, పాదమును బేసినులో పెట్టవచ్చును. పిమ్మట చేతి కాలిగోళ్లను శుభ్రముచేసి కత్తిరించవలెను. తరువాత నోటిని, వెండ్రుకలను శుభ్రముచేయవలెను. అవసరమైనయెడల శుభ్రమైన గుడ్డలువేసి, పొడుగైన మాకింటాషు, స్నానపు కంబళిని తీసివేయవలెను. పిమ్మట ముందువలెనే పడకను చక్కబెట్టవలెను. స్నానమైన తరువాత రోగికి చలిపుట్టుచున్నయెడల, ఉడుకునీళ్లబుడ్డిని పడకలోపెట్టి, త్రాగుటకుకూడ వేడిపానీయము నియ్యవలెను.

### బిడ్డ స్నానము

**పరికరములు:**—తొట్టి, ¹స్నానపు తెర్మామీటరు, సబ్బు, వాష్‌క్లాత్ స్నానపుతువాలు, బోరిక్‌లోషను, కొబ్బెరనూనె, ²దూది ఉండలు, బిడ్డ దుస్తులు, సేఫ్టీపిన్నులు, వెండ్రుకలబ్రష్.

**స్నానవిధానము:**—తొట్టిని కుర్చీమీదగాని, బల్లమీదగాని పెట్టుము. దానికి సగము నిండుగ నీళ్లుపోసి, తెర్మామీటరు (ఉష్ణమాని)వేసి వేడి పరీక్షించుము. (బిడ్డకు స్నానముచేయు నీళ్లు 90°—98° F. వేడిగా నుండవచ్చును.) బిడ్డ గుడ్డలుతీసి, బిడ్డను మెత్తవేసికట్టిన బల్లమీద పరుండబెట్టుము. పిమ్మట వానిముఖమును వాష్‌క్లాత్‌తోను శుభ్రమైన నీటితోను కడుగుము. పిమ్మట మెత్తని తువాలుతో వానిని అద్ది తుడువుము. వాష్‌క్లాత్ మీద సబ్బు నురుగుకట్టునట్టు రుద్ది, దానితో బిడ్డ తలను, దేహమును రుద్దుము. పిమ్మట పిరుదులక్రింద కుడిచేతిని యెడమచేంకక్రింద యెడమచేతినుంచి, ముంజేతిని బిడ్డ తలకు, భుజములకు ఆధారముగాపెట్టి, బిడ్డ దేహమును నీటిలోముంచుము. ఎడమచేతితో అట్లే బిడ్డను పట్టుకొని, కుడిచేతితో వాష్‌క్లాత్ నుపయోగించి కడుగుము. వాష్‌క్లాత్‌తో దేహమునంతయు కడుగుము; ముఖ్యముగా మడతలు, బొడ్డును గమనించి కడుగుము. బిడ్డను స్నానపుబల్లమీద పరుండబెట్టి,

¹ Bath thermometer. ² Cotton wool swabs.

అద్ది, ఆరనిచ్చి, నూనెగాని, పౌడరుగాని పూయుము. దూది ఉండలను బోరిక్‌లోషనులో ముంచి జాగ్రతగా కండ్లు తుడువుము. దూదిచుట్టిన పుల్లలను నూనెలోముంచి, ముక్కును చెవులను శుభ్రముచేయుము. ఈ దూదిపుల్లను, నాసికారంధ్రముల లోపలికిగాని చెవుల రంధ్రములలోనికిగాని పోనియ్యకుము. జననేంద్రియములను శుభ్రముచేయుటకు దూది యుండలను నూనెలోగాని, బోరిక్‌లోషనులోగాని ముంచి వాడుము. ఆడుబిడ్డ అయినయెడల [1]జననేంద్రియపు పెదవులను తెరచి, దానిలోని [2]బంకవంటి పదార్థమును క్రిందిముఖముగా తుడువుము. మగబిడ్డ అయినట్లయిన, పురుషాంగపు ముందోలును వెనుకకుతీసి జాగ్రతగా శుభ్రము చేసి, తిరిగి దానిపాటునకు దానిని లాగిపెట్టుము.

బిడ్డను మెత్తవేసిన బల్లమీద పరుండబెట్టి స్పంజిస్నానముకూడ చేయవచ్చును. బిడ్డ గుడ్డలు తీసివేసి, వానిని ఒక మెత్తని తువాలుమీద పరుండబెట్టి, వాని ముఖము, చేతులు, ఎదుఱొమ్ము, కడుపు కడుగుము గాని చెవులను, మెడను, బొడ్డును, కాలి చేతివ్రేళ్ల మధ్యనున్న చర్మమును జాగ్రత్తగా గమనించి కడుగుము. ఒక్కొక్క భాగమును బాగుగా తుడిచి ఆరనిచ్చి, తొట్టిస్నానముచేసి ముగించినట్టే ముగించుము.

నోరు, ముక్కునుగూర్చిన జాగ్రత:—పెక్కుమంది రోగులయొక్క నోళ్లు రోతగను, ఎండియునుండును గాన నర్సు, రోగి నోటియొక్క ఆరోగ్యమునుగూర్చి విచారించి జాగ్రత తీసికొనుట ఆమెయొక్క ముఖ్యమైన విధియైయున్నది. ముఖ్యముగా చిన్నపిల్లలు, స్మారకము లేని రోగులు, జ్వరముతోనున్న రోగులు, తమ పండ్లను తామేశుభ్రము చేసికొనలేని యితర రోగుల నోళ్లనుగూర్చి నర్సు మరి యెక్కువ గమనించి శుభ్రము చేయవలెను. కొన్ని విధములైన జ్వరములు గల రోగులనోటిలో దుర్వాసన కొట్టును. పండ్లకు, పెదవులకు త్వరగా పాచిపట్టవచ్చును; నోటిప్రక్కలలోని [3]అమత్వచమీద పుండ్లుకూడ లేవవచ్చును. రోగి చాల జ్వరముతో నున్నప్పుడు ప్రతిసారి భోజనమునకు ముందును తరువాతను వాని నోటిని తడిపిన దూది ఉండలతో శుభ్రముచేయవలెను.

పనికి అవసరమైన సామానులను ఒక చిన్నట్రేలో పెట్టియుంచుట శ్రేష్ఠము. ఒకే రోగికి అనేకసార్లు చికిత్సచేయవలసియుండిన, ఈ ట్రేను

[1] Labia. [2] Smegma. [3] Mucous membrane.



కప్పి పడకప్రక్కన ఉపయోగముకొరకు సిద్ధముగా ఉంచవలెను. ఈ పని కొరకు కావలసిన సామానులేవనగా, దూది ఉండలు, దూది పుల్లలు, ఫారసెప్స్, నోటిని శుభ్రముచేయుమందు, ఉమ్మి ఊయుట కొక పాత్ర, తువాలు, మలాము, పాచి మొదలగు పొరలను కరిగించి తీసివేయగల సోడియం బైకార్బొనేటు సొల్యూషన్‌గాని, బోరాక్సు సొల్యూషన్‌గాని అవసరమైయుండును. గ్లిసరీను, లైమ్‌జూసువంటి లూబ్రికెంటు తైలములు నోటిని తడిపి పక్కులు మెత్తపడునట్లుచేయును. నోరు మరి యెక్కువ దుర్వాసన కొట్టుచుండినయెడల హైడ్రొజన్ పెరాక్సైడ్ అను మందును వాడి, నోటిని శుభ్రముచేయవలెను. కొన్నిసార్లు చిగుళ్లకు ఐయొడిన్ (పాటలకము) పూయవలసివచ్చును. పెదవులకు పుండ్లు లేచినయెడల [1]వాసిలిను, బోరిక్ ఆయింట్‌మెంటు, [2]లనోలైన్ మొదలగు మృదువైన మలాములను పెదవులమీద పూయవలెను. రోగులు పిచ్చివారైనను, కలవరముతో బాధపడువారైనను అయినయెడల వారి నోటిని శుభ్రముచేయుచుండగ అది తెరవబడియుండునట్లు [3]వాకట్టు వాడవలెను. రోగికి శక్తియుండిన, తానే స్వయముగా పండ్లు తోముకొనవచ్చును. శక్తిలేనియెడల, నర్సు రోగి మెడచుట్టు ఒక తువాలనుపరచి, చంపదగ్గర యొక కిడ్నీ బేసిన్ పెట్టి, దూదిపుల్లను నోరుకడిగెడు మందునీటిలో (మౌత్ వాష్‌లో) ముంచి, పండ్లను, చిగుళ్లను, నోటి పైభాగమును, నాలుకను, చిగుళ్లు చెంపల మధ్యను పైకి క్రిందికి రుద్దుచు, శుభ్రము చేయవలెను. దూదిపుల్లకు బదులు నర్సు తన చిటికెనవ్రేలి కొనకు మెత్తని గుడ్డముక్కను చుట్టుకొని కడిగినయెడల, ఇంకను ఎక్కువ సహాయకరముగ నుండును. తరువాత నోరు శుభ్రముగనుండునట్లు మందునీటితో నోటిని నెమ్మదిగ శుభ్రపర్చవలెను.

నోటిని శుభ్రముచేయునప్పుడే ముక్కునుగూడ శుభ్రముచేయవలెను. ఎందుకనగా, ఈ సమయములో ముక్కునందు తఱుచుగా చీమిడి యెండి పక్కులు కట్టియుండును. ముక్కు పుటముల అంచులలో పుండ్లులేచినట్లు కనబడినయెడల వానికి ఏదైన ఒక ఆయింటుమెంటు పూయవలెను.

వీపునుగూర్చిన జాగ్రత:—చాలకాలము జ్వరముతోగాని, పక్షవాతముతోగాని, ముసలితనమువలనగాని బాధపడు రోగి బలహీనపడుటవలన

[1] Vaseline. [2] Lanoline. [3] Mouth gag.

వానికి లేక ఆమెకు పడకపుండ్లు లేచుట సహజము. సాధారణముగ వెన్నెముక క్రిందిభాగమున తొంటి యెముకలమీద ఈ పుండ్లు లేవ వచ్చును. అప్పుడప్పుడు తల వెనుకభాగమునను, భుజపు టెముకలమీదను, మడిమలమీదను, మోచేతులమీదను లేక ఒకేతీరున ఒత్తిడి కలిగియుండు ఏ భాగముమీందనైనను ఈ పుండ్లు లేవవచ్చును. ఈ పుండ్లు లేచుటకు ముఖ్యమైనకారణము లేవనగా—ఒక రోగిని చాలకాలము మురికియైన లేక తడిసిన పడకలో పరుండనిచ్చుట, పడక గట్టిదియైయుండుట, డ్రాషీటు ముడతలు పడియుండుట, రోగిని ఒకేతీరులో చాలకాలము పరుండ నిచ్చుట, పడకచట్టిని అజాగ్రతగా పెట్టుట, లేక దానిని తీసివేయకుండ చాలకాలము ఉండనిచ్చుట మొదలైనవి. రోగి చర్మము తడిగాను అశు భ్రముగా నుండుటవలనను, పిరుదల మడతలలోగాని, చంకల మడతలలో గాని, దేహము లావుగానుండు స్త్రీల స్తనములక్రింది మడతలలోగాని ఈ పుండ్లు లేచుటకు వీలగును. ఈ పుండ్లు చాలకాలము పడకలో పరుండి యుండు ఏ రోగికైనను లేవకుండచేయుట చాల ప్రాముఖ్యమైన పని. రోగిని మిక్కిలి శుభ్రముగానుంచి, ఒకేరీతిగా దేహమునకు ఒత్తిడి తగుల కుండచేసి, పుండ్లులేచుటకు వీలైనభాగములలో రక్తప్రసరణము క్రమముగ జరుగునట్లు చేసినయెడల ఈ పుండ్లు లేచుటను నివారించవచ్చును. ఈ కారణమునుబట్టియే రోగిపడక శుభ్రముగాను చెమ్మలేకుండను నుండ వలెను; డ్రాషీటును ముడతలులేకుండ గట్టిగా లాగి దోపవలెను. గుడ్డ లను పలుమారు మార్చి జాగ్రత్తగా సరుదుచుండవలెను. ఒత్తిడి తగులు చుండు శరీరభాగములను దినమునకు కనీసము రెండుసారులైనను కడుగు చుండవలెను. రోగి స్మారకములేక మూత్రించినను మలబాధచేసినయెడ లను విసర్జనమైనప్పుడెల్ల వీపును కడిగి శుభ్రము చేయుచుండవలెను. రోగియొక్క తీరును పలుమారు మార్చుచు, అధిక ఒత్తిడితగిలిన భాగము లకు గాలిదిండ్లను వేసి బాధ తగ్గించవలెను. ఈ గాలిదిండ్లు రబ్బరుతో చేయబడినవైనయెడల, ఒత్తిడికలిగిన భాగములు పడకకు తగలకుండ చేయ గలుగునట్లుమాత్రమే వీనిలోనికి గాలి యూదవలెను. అధికముగా గాలి యూది గట్టిగా చేయుటవలన ఈ గాలిసంచులే ఒత్తుకొని పుండు ఏర్పడు టకు కారణముకావచ్చును. గుండ్రని గాలిదిండ్లైనట్టయిన, వానిని ఎల్ల ప్పుడు దిండువరలలో పెట్టి యుపయోగించవలెను. మెత్తని దూదిని వల



యములుగచేసి వానిచుట్టు బ్యాండేజిగుడ్డచుట్టి, మోచేతులు, మడిమలకు సరిపోవునంతవిగాచేసి వాడవచ్చును. వీపునుగూర్చిన జాగ్రతలో, దానిని తోముట, యెంత ప్రాముఖ్యమైనసంగతియో, చెప్పుటకు వీలుకాదు. ప్రతిసారి స్నానముచేసినతరువాత ఆ భాగమును మెల్లగ తుడువవలెను. నర్సు తన అరచేతిలో కొంచెము [1]మిథిలేటెడ్ స్పిరిటుగాని, రోగి చర్మము ఎండియుండినయెడల, చెరిసగము [1]మిథిలేటెడ్ స్పిరిటును నూనెను గలిపి గాని వీపున బాగుగా రుద్దవలెను. పిమ్మట ఆ భాగమునకు మెల్లగా పౌడరు కొట్టవలెను. పడకచట్టిని (బెడ్పాను) మొరటుగా పెట్టకుండ జాగ్రతగా పెట్టుటయేకాక, వెనుకభాగమున వీలైనయెడల ఏదైన ఒక మెత్తను పెట్ట వలెను. అనవసరముగ బెడ్పానును రోగిక్రింద చాలకాల ముంచ కూడదు.

రాపిడి పుండ్లు:—రాపిడి పుండ్లకు మొదటి గుర్తు ఎఱ్ఱబారుట. పిమ్మట ఆ భాగము పుండై, తాకుటకు నొప్పిగానుండును. అది వృద్ధిపొందుకొలది పొంగి, పైతోలు సమసిపోయి, పుండు బాగుగా కనబడును. పుండు పైభాగము చెమ్మగానుండి, అది యింకా పెరుగుకొలది రసికార నారంభిం చును. పుండులోతుగపోయి, మధ్యభాగము కుళ్లి యొక మామూలు రకమైన పుండుగామారి, దానికుండవలసిన లక్షణములన్ని కనుపించును. తీసికొనవలసినంత జాగ్రతతీసికొన్నను, ఒక రాపిడిపుండు ఏర్పడినట్లయిన, ఆ సంగతిని వెంటనే వైద్యునికి తెలుపవలెను. ఇటువంటి పుండుమీద స్పిరి టును పట్టించకూడదు. చర్మముమాత్రము పగిలినవెంటనే మలాము పట్టించ వచ్చును. పుండు ముమ్మరముగనుండి, కుళ్లినప్పుడు దానిని హైడ్రొజన్ పెరాక్సైడుతో శుభ్రముచేసి, [2]బోరిక్ లోషనుతోగాని, [3]లోషన్ రూబ్రతో గాని, లేక బ్లాక్వాష్తోగాని తడి డ్రెస్సింగ్ పెట్టవచ్చును. డ్రెస్సింగు గుడ్డ, పుండు అంత పరిమాణము, ఆకారము గలిగియుండవలెను. దానిపైన ఒక రబ్బరు టిస్యూ ముక్కను దూదిమెత్తనువేసి బ్యాండేజి కట్టవచ్చును. అది జారిపోకుండ, ప్లాస్టరు నుపయోగించవచ్చును. రాపిడిపుండును నాలుగుగంటల కొకసారి డ్రెసింగ్ చేసి కట్టవలెను. మలమూత్రములతో మైలయైనయెడల మధ్య మధ్య మార్చవచ్చును. పుండును పలుమారు

[1] Methylated spirit. [2] Boric lotion. [3] Lotion rubra or black wash.

డ్రెసింగ్ చేయ నవసరములేకుండ [1]ఇలాస్టొప్లాస్టు ఎక్కువ ఉపయోగపడును. చర్మము కందినట్లు గుర్తులు కనబడినప్పుడు ఉపయోగించతగిన యితర మందులు:—ఆముదము కలిపిన [2]ఫ్రయర్సు బాల్సం, కోడిగ్రుడ్డు తెల్లజనతో కలిపిన ఆముదము, [3]పెరూవియన్ బాల్సం [4]కాడ్ లివర్ ఆయిల్ తో చేసిన మలాము మొదలైనవి.

**సాయంకాలము రోగినిగురించిన జాగ్రత:**—రోగి అలసటతీర్చుకొని రాత్రి సౌఖ్యముగానుండుటకై దీనిని చేయుదురు.

పరికరములు:—బేసినులో నీళ్లు, సబ్బు, వాష్ క్లాత్, తువాలు, వీపు తోముటకు లోషను, పౌడరు; నోరు, పండ్లు శుభ్రముచేయు సామానులు కూడ నుండవలెను.

పద్ధతి:—మొదట ఇంతకుముందు చెప్పినట్టు నోటిని శుభ్రము చేయుము. పిమ్మట తువాలును రోగివక్షముమీద పరచి ముఖమును, మెడనుకడిగి తుడువుము. చంకలను ముఖ్యముగా గమనించుచు, అనగా శుభ్రముచేయుచు, చేతులను బాగుగాకడిగి తుడువవలెను. ఈ పనిచేయు చుండగా పడక తడవకుండ, దానిమీద ఒక తువాలు తప్పక వేయుము. చేతులను కడిగి తుడిచినతరువాత, రోగిని ప్రక్కకుత్రిప్పి, వీపునుకడిగి, తుడిచి, లోషనుతో రుద్ది, మర్దనచేసి, పౌడరుకొట్టవలెను. [5]వెన్నుకొనభాగమును, [6]భుజపుటెముకలను ముఖ్యముగా గమనించవలెను. పడకమీదపడిన పక్కలను ఇతర మైలవస్తువులను దులిపివేయుము. డ్రాషీటును వదులుచేసి, అది మాసినను, తడిసినను, మార్చివేయుము. పై దుప్పట్లు క్రిందిదుప్పట్లు పొడుగుగాలాగి చక్కచేసి, దిండునుగూడ కుదిలించి, పడకనంతయు బాగుగావేసి, రోగిని విడిచిపోకముందు పడకచేట్టిగాని, త్రాగుటకు నీళ్లుగాని అవసరమేమో అడిగి, కావలసినవానినిచ్చి, రోగి సౌఖ్యముగానుండునట్లు చూడవలెను.

**తల, వెండ్రుకలవిషయమైన జాగ్రత:**—వెండ్రుకలను దువ్వుటకు తల క్రింద దిండుపైన, తువాలును అడ్డముగపరచి, వెండ్రుకలనువిప్పి, కొనల నుండి మెల్లగ కుదుళ్లవరకు దువ్వవలెను. నూనెగాని, స్పిరిట్ గాని పూసి చిక్కుతీయవలెను. ఎక్కువ చిక్కున్నయెడల, వెండ్రుకలను కత్తిరించ

[1] Elastoplast. [2] Friar's Balsam. [3] Peruvian Balsam.
[4] Codliver oil ointment. [5] Coccyx. [6] Shoulder blades.



వచ్చును; లేదా, దినమునకు కొంచెముకొంచెము విప్పి దువ్వవచ్చును. పొడుగుగను లావుగనున్న వెండ్రుకలను తల కిరుప్రక్కల రెండు జడలు వేసినయెడల రోగి వానిపై పరుండ నవసరముండదు.

**రోగి వెండ్రుకలను పడకలోనే కడుగుట**

పరికరములు:—రోగి భుజములను, పడకను కాపాడుటకు ఒక మాకింటాషు, 3 తువాళ్లు, సబ్బునీరు, తొట్టిగాని, ఒక పెద్ద బేసినుగాని, 2 జగ్గుల వేడినీళ్లు, దువ్వెన కావలెను.

పద్ధతి:—తొట్టినిగాని, బేసినునుగాని పడకప్రక్కన ఒక కుర్చీమీద పెట్టుము. రోగి వీపు నీతట్టుకు ఉండునట్లు ఆమెను పడక అంచునకు లాగుకొనుము. మాకింటాషును దిండుమీదనుండి టబ్బువరకు వ్రేలాడ వేసి, రోగి తలను దిండుమీద పెట్టుము. దిండునుండి టబ్బువరకు ఒక కాలువ యేర్పడునట్టు మాకింటాషు పొడుగు అంచులను పైకి మడువుము. రోగి ముఖమునకును, మాకింటాషుకును మధ్య తువాలు ఒకటి పరువుము. వెండ్రుకలను విప్పి, సబ్బునీటిని బాగుగా పట్టించి తడిపి, వెండ్రుకలను పుఱ్ఱెను అంట రుద్దుము. అవసరమైనంతమట్టుకు ఉడుకునీళ్లు పోయుచు, సబ్బు పోవునంతవరకు పుఱ్ఱెను వెండ్రుకలను కడుగవలెను. పిమ్మట రోగిని పైకెత్తి, ముఖమును, మెడను, చెవులను బాగుగాతుడిచి వెండ్రుకలలోని నీటిని బాగుగా పిండివేసి, మాకింటాషును తీసివేయుము. దిండుమీద ఒక స్నానపు తువాలుపరచి, ఇంకొకతువాలుతో వెండ్రుకలను రుద్ది, దిండుమీదపరచి తుడువవచ్చును. బాగుగా ఆరిన తరువాత, వెండ్రుకలను చిక్కుతీసి రెండు జడలు వేయుము. సామానులన్ని తీసివేసి, పడకను చక్కపెట్టుము. పేలవిషయమైన చికిత్సను 25-వ అధ్యాయములో చదువవచ్చును.

**పడకచేట్టిని మూత్రపాత్రను ఇచ్చుట, తీసివేయుట:**—పడకచట్లు, మూత్రపాత్రలు విరేచనము, మూత్రవ్యాధియుండువారి తప్ప, మిగతవారికి నియమిత వేళలలో నిచ్చుట మంచిది. పగటియందు 6, 10, 2, 6 గంటలకును, రాత్రులందు అవసరమైనప్పుడెల్ల నియ్యవచ్చును. ఏదో ఒక గొప్ప అవసరమైనప్పుడుమాత్రమే [1]వైద్యుని నియమిత పరీక్షసమయము లోను, భోజన వేళలోను, దర్శకులు వచ్చుసమయములోను ఇయ్యవచ్చును.

[1] Doctor's rounds.

మొదట పడకచేట్టి శుభ్రముగానున్నదో లేదో చూచి, దానిని కప్పి రోగి పడకప్రక్కకు తీసికొనిరమ్ము. పడకచుట్టు పరదాలువేయుము. పడకచేట్టిని కుడిచేతితో పట్టుకొని, యెడమచేతితో పడకగుడ్డలను ఒకప్రక్క నుండి తొలగించి, పడకచట్టిని పడకమీదపెట్టుము. పడకచేట్టి మూత తీసి పడక పాదములదగ్గర పెట్టుము. రోగి మోకాళ్లు ముడిచి, ఆమె దేహము అనవసరముగా బయటికి కనబడకుండ బట్టలను చక్కగా అమర్చుము. రోగి పిరుదులమీది ఎముక క్రింద ఒక చేతినుంచి, పిరుదులను లేపి, పడకచేట్టి చాల యెత్తుగాగాని, తగ్గుగాగాని లేకుండ, దానిని సరియైనపాటులో పెట్టుము. రోగి చాల జబ్బుగా నుండినయెడల, ఈ పని చేయుటకు ఇద్దరు నర్సులు కావలెను. కొంతసేపు రోగికి గుడ్డకప్పి విడువుము. పడకచేట్టిని తీసివేయుటకు వచ్చినప్పుడు ఒక బేసినునిండ ఉడుకునీళ్లు, చదరముగా చించిన కొన్ని గుడ్డపేలికలో లేక పీచు తీసికొనిరమ్ము. పడకచేట్టిని తీసివేసి దానిమీద మూతవేయుము. పిమ్మట దానిని పడకప్రక్క ఒక స్టూలుమీద పెట్టుము. రోగిని ప్రక్కకు త్రిప్పి, కడిగి తడిలేకుండతుడువుము. రోగి గుడ్డలు చక్కచేసి, పడకను మెత్తగా చేసి, రోగి సుఖముగానుండునట్లు చేయుము. రోగి తన్నుతాను శుభ్రము చేసికొనగోరినయెడల, ఆ పనియైనతరువాత, ఆమె తనచేతులు శుభ్రము చేసికొనుటకు నీళ్లును సబ్బును ఇమ్ము. పడకచేట్టిని [1]లెట్రినుకు తీసికొనిపోయి దానిని ఖాళీచేయకముందు మలమూత్రాదులను పరీక్షింపవచ్చును. పడకచేట్టిని ఖాళీచేసినపిమ్మట, దానిమీద నీళ్లు పాఱనిచ్చి, [2]కుఱుచపిడిగల పీచుచుట్టనుగాని, బ్రష్షునుగాని డిస్‌యిన్‌ఫెక్టెంటులో ముంచి, దానితో శుభ్రముచేయవలెను. పడకచేట్టిని ప్రతిదినము ఒక గంటసేపు ఆంటిసెప్టిక్ మందులో ముంచి యుంచుట చాల మంచిది. మలములో యేదైన అసాధారణ చిహ్నము కనబడినయెడల, దానిని వెంటనే చార్టులో వ్రాయవలెను.

మూత్రపాత్రను ఇయ్యవలసియుండిన, దానిమీద మూతవేసి రోగి పడకప్రక్కకు తీసికొనిరమ్ము. పడకచుట్టు పరదాలువేసి, పరుపు గుడ్డలను ఒకప్రక్కగా తొలగించి, రోగిచేతికి అందునట్లు ఆ పాత్రను పెట్టుము. పనియైన తరువాత దానినికప్పి లెట్రినుకు తీసికొనిపొమ్ము. దానిలోని

[1] Toilet room. [2] A short handled mop or brush.



మూత్రమును పారబోసి, పాత్రను నీళ్లతోను, బ్రష్‌తోను కడిగి, ఆంటిసెప్టిక్ లోషనులో ముంచి, యెండనిమ్ము. మూత్రపాత్రను ప్రతిదినము ఇసుకతోగాని, శుభ్రముచేయు పౌడరుతోగాని శుభ్రముచేయుటవలన అది మంచి స్థితిలోను శుభ్రముగాను నుండును.

ఉడుకునీళ్ల సంచులు:—వీని నుపయోగించునప్పుడు, రోగి దేహము కాలకుండ, ఈ సంచులను జాగ్రతగా గుడ్డలతో కప్పవలెను. ముఖ్యముగా స్మారకములేని రోగుల దేహము కాలకుండ అతిజాగ్రతగా వారిని కాపాడవలెను. పొంగెడు నీళ్లను రబ్బరు సంచులలో పోయకూడదు. ఎందుకనగా, సంచి మూతి చెడిపోవును; ఆ నీళ్లు బుడకలులేచి, నర్సు చేతులు కాలవచ్చును. 120°—150° F. వరకు వేడిగల నీళ్లు మొదట జగ్గులో పోసి, పిమ్మట సంచులలో పోయవలెను. సంచులలో సగమువరకే నీళ్లు పోసి, మూత బిగించకముందు దానిలోని గాలి బయటికిపోవునట్లు చూడవలెను. లోహపుబుడ్లను వాడుచున్నయెడల, వానిని నిండుగానింపవలెను. లేనియెడల వానిలోని నీరు, ఆవిరి చల్లబడుచుండగా, బయటిగాలి యొత్తిడివలన, ఆ బుడ్లు సొట్టబడిపోవచ్చును. ప్రతివిధమైన ఉడుకునీటి సంచి కారుచున్నదేమోయని దానిని రోగి పడకలోపెట్టక ముందుగనే పరీక్షించవలెను. సంచులు వేడి ఆరిపోయి, చల్లబడి, నిష్ప్రయోజనమైనప్పుడు వానిని తీసివేయవలెను.

### రోగికి భోజనము ఇచ్చు విధము

భోజనమునకు ఉపయోగించు పాత్రలు, గరిటెలు, ట్యూబులు, ఇతర సామానులు ఏ విధమైనమైలలేకుండ శుభ్రముచేయవలెను. అన్నమును బాగుగావండి, ఇంపుగ వడ్డించవలెను. ప్లేటు, లేక గిన్నె యెక్కువ నిండుగ నింపకూడదు; రోగి తినుటకు ఆరంభించకముందు, అతని గడ్డము క్రింద ఒక తువాలు కట్టవలెను. రోగికి ద్రవరూపమున ఆహారమిచ్చునపుడు నర్సు రోగియొక్క తలను కొంచెము ఎత్తి కుడిప్రక్కన నిలువబడి, తన కుడిచేతితో త్రాగించవచ్చును. గంటెనిండ ముంచుటగాని, గంటెనంత రోగినోటిలోనికి పోనిచ్చుటగాని మంచిదికాదు. మధ్యమధ్య అలసట తీర్చుకొని, శ్వాసించుటకు రోగికి అవకాశమియ్యవలెను. ఎందుకనగా, రోగి ఒకేసారి అన్నము మ్రింగుచు, శ్వాసించుట కష్టమగును. ప్రతి రోగికి మధ్యమధ్య ఎక్కువ విరామసమయము ఇచ్చుట మంచిది. ముఖ్య

ముగా రోగి మ్రింగునప్పుడు కష్టమునుగాని, బాధనుగాని అనుభవించునపుడును, శ్వాసావరోధము, అనగా సరిగా శ్వాసించలేని జబ్బు ఉన్నపుడును ఇట్లు ఎక్కువకాలము వ్యవధినిచ్చుట చాల అవసరము. నిస్సహాయులైన రోగులకు గంజి త్రాగించునపుడు కోపలనుగాని, వాని మూతికి బిగించు రబ్బరు ట్యూబులగాని ఉపయోగించవచ్చును. ఒక్కొక్కసారి కొద్దికొద్దిగ ఆహారము ఇచ్చుసట్లును దానిని సరిగ మ్రింగునట్లును, నర్సు ఎక్కువ జాగ్రత తీసికొనవలెను.

నియమితకాలములో రోగికి ఆహారమిచ్చుట ముఖ్యము. ద్రవాహారము లిచ్చునప్పుడును ప్రత్యేక పథ్యము లిచ్చునప్పుడును నర్సు ఎక్కువ క్రమముగా నుండవలెను. చార్టుండిన, రోగి కచ్చితముగా ఎంత ఆహారము తినినది, ఈ పట్టీయందు వ్రాయవలెను.

కొన్నిసారులు రోగులకు [1]ద్రవపదార్థములు 'ఆడ్ లిబ్' అని ఉత్తరువియ్యబడుదురు. కాని యిది రోగి యిష్టప్రకారము కావలసినంతయని అర్థముకాదుగాని ఒక మంచినర్సు రోగి యెంతతీసికొనగలడో అంత తీసికొనునట్లు అతనిని పురికొల్పుటయని అర్థము. ఇట్టి రోగులకు రెండు గంటలకు ఒకసారి ఏదైన త్రాగించుట మామూలు. మరియెప్పుడైనను దీనికితోడుగా ఏమైన త్రాగించుటకు వీలగునాయని నర్సు తరుణముకొరకు కనిపెట్టుచుండవలెను. రోగి త్రాగుటకు గంజి మొదలైనవానిని గిన్నెలో పోసి పడకప్రక్క బల్లపై బెట్టినంతమాత్రముననే నర్సు తనపనిని చేసితినని తృప్తిపడక, త్రాగవలసిన కాలములో రోగి దానిని త్రాగునట్లు చేయుటయు తన విధియని ఆమె తలంచవలెను.

త్రాగెడు గిన్నెలు, ట్యూబులు ఉపయోగించినవెంటనే వానినికడిగి శుభ్రముచేయవలెను. ట్యూబులను తిరిగి ఉపయోగించకముందు వానిని పొంగించవలెను.

పసిబిడ్డలకు పాలు మొదలైనవి త్రాగించుచుండగా, వారిని ఎత్తుకొనవలెను. బుడ్డిని 45° ల కోణములో పట్టుకొని త్రాగించవలెను. బిడ్డకు పాలు త్రాగించినతరువాత, త్రాగుటలో మ్రింగిన గాలి బైటకు పోవుటకుగాను నర్సు బిడ్డను భుజములమీద ఎత్తి పట్టుకొని యుంచవలెను. బిడ్డ నోరు తెరుచుటకు వాని ముక్కు నెన్నడును పట్టుకొనిమూయకూడదు.

[1] 'Fluids ad libitum'.



చేయవలసిన ప్రయత్నములన్ని వ్యర్థమయ్యేవరకు, తినుటకు బిడ్డను బలవంతపరచకూడదు. తినుటకు బిడ్డను ప్రేరేపించునప్పుడు ఆహారమును చక్కని గిన్నెలలో వేయుము. బిడ్డకు అన్నముమీద ఇష్టముపుట్టునట్లు దానిని గిన్నెలో అమర్చుము (నడ్డించుము). వీలైనంతవరకు బిడ్డ తనకుతానే తినునట్లు అతనిని ప్రోత్సహించుము. బిడ్డకుకూడ స్వతంత్రముగా పని చేయుట ఇష్టము. నోరు తెరిపించుటకు చేసిన ప్రయత్నములన్ని వ్యర్థములయినప్పుడు, వానిబుగ్గలు అదిమి నోరు తెరిపించవచ్చును. నోరు తెరచినప్పుడు గరిటెతో పోయవలసిన ద్రవాహారమును అంగిటిలోపోసి, మ్రింగువరకు బుగ్గలను నొక్కిపట్టియే యుంచవలెను.

అధ్యాయము 6

# రోగలక్షణముల సామాన్య పరిశీలన

[1]దృశ్య లేక విషయాత్మక లక్షణములనగా నర్సు తానే రోగియందు పరిశీలించగలిగినవి. [2]అదృశ్య లేక విషయిగత లక్షణములనగా, రోగి చెప్పగా నర్సు తెలిసికొనగలిగినవి. అనగా నొప్పి, డోకు, తలతిరుగుట, చెడ్డకలలు, చూచుటలోను వినికిడిలోను రుచిచూచుటలోను లోపము గలిగియుండుట మొదలైనవి. రోగలక్షణములు బాగుగ గమనించి, గమనించిన సంగతులను సరిగ వైద్యునికి తెలుపగలనర్సు చాల ఉపయోగకారి. ఆమె ముఖ్యముగ గమనించి వైద్యునికి తెలుపవలసిన సంగతులేవనగా:—

1. టెంపరేచర్ (ఉష్ణోగ్రత), నాడి, ఉచ్ఛ్వాస నిశ్వాసములు.
2. చలి, వణకు, ఈడ్పు.
3. ఆయాసము, కలవరింతలు, గాఢమూర్ఛ, అసాధారణమైన అరుపులు.
4. నోరు, నోటిశ్వాస.
5. వెక్కిళ్లు, దగ్గు.
6. కడుపులోగాలి, కడుపు ఉబ్బరము.
7. ఆకలి.

[1] Objective symptoms. [2] Subjective symptoms.

8. దేహమునుండి స్రవించునవి, అనగా కఫము (కళ్లె), వాంతి, ఋతుస్రావము; కండ్లు, ముక్కు, చెవులు, భగము, మూత్రకోశము, ఆసనము మొదలగు అవయవములనుండి స్రవించునవి.
9. బహిష్కరింపబడునవి అనగా మూత్రము, మలము, చెమట.
10. [1]తీరు, ముఖవర్చస్సు, కండ్లు.
11. నిద్ర, బలము.
12. బరువు, తగ్గినదా లేక హెచ్చినదా?
13. చర్మముయొక్క స్థితి అనగా చర్మముమీద పుండ్లు, పొక్కులు, వాపులు, మొదలైనవి ఉన్నవా?

## చార్టు వ్రాయుట

ఒక్కొక్క రోగికి ఒక చార్టు వ్రాసిపెట్టవలెను. ఈ చార్టులో రోగియొక్క టెంపరేచరు, నాడి, ఉచ్ఛ్వాసనిశ్వాసములు, మలవిసర్జనము, మూత్రము, తూనిక అవసరమైన ఇతరవిషయములను వ్రాయుచుండవలెను. రోగియందు కనబడు నొప్పి దగ్గు, వాపు, తలనొప్పి, రోగి ఎంతకాలము నిద్రపోయినది, మొదలగు సంగతులుకూడ వ్రాయవలెను. మరియు రోగియొక్క మలమూత్రాదులలో కనబడు విపరీతమైన లక్షణములనుగాని, ఋతుకాలములో కనబడు లక్షణములనుగాని, రోగికి సంబంధించిన ఇతర విశేషమైన లక్షణములనుగాని వ్రాయుచుండవలెను. రోగికి చేయబడిన చికిత్సలన్నిటిని, వాని ఫలితములనుగూడ వ్రాయవలెను. ఉదాహరణముగ, రోగికి ఏదైన నిద్రమందును ఇచ్చినపుడు దాని ఫలితముగ రోగి నిద్రపోయినది, లేనిది వ్రాయవలెను. రోగికి చుఱుకు పుట్టించుమందు ఇచ్చినపుడు దానివలన నాడియందు కనబడు ఫలితము వ్రాయవలెను. రోగికి ఎనీమా ఇచ్చినపుడుగాని, ఆసనముద్వారా సెలైన్ ఎక్కించినపుడు దానిలో ఎంతనీరు లోపలనిలిచినదో ఆ సంగతినిగాని బహు జాగ్రతగా వ్రాసిపెట్టవలెను. ఈ విషయములన్నిటిని వ్రాసిపెట్టుట నర్సుయొక్క ముఖ్యవిధియైయున్నదిగాన, ఆమె వానిని చక్కగను, స్పష్టముగను వ్రాయవలెను. ఈ చార్టులను రోగిగాని దర్శకులుగాని చదువకుండునట్లు వానిని జాగ్రతగ భద్రముచేసియుంచవలెను.

[1] Position.



## టెంపరేచర్ (దేహముయొక్క ఉష్ణోగ్రత)

టెంపరేచరు, ఉచ్ఛ్వాస నిశ్వాసములు, నాడి—వీనిలో కనబడు మార్పులు రోగముయొక్క ముఖ్యమైన లక్షణములైయుండును. ఈ మూడింటిలో దేనియందు మార్పుకలిగినను దాదాపుగా తక్కిన రెంటియందును మార్పు కనబడును. దేహముయొక్క సాధారణమైన ఉష్ణోగ్రత 98·4° F. వివిధరోగములలో టెంపరేచరుకూడ వేరు వేరుగ మారుచుండును. కొన్ని రోగములలో టెంపరేచరు క్రమేణ హెచ్చుచుండును. మరికొన్నిటిలో అది అకస్మాత్తుగా హెచ్చును. ఇట్లే టెంపరేచరు తగ్గుటయందునుగూడ జరుగును. టెంపరేచరు అకస్మాత్తుగా తగ్గిపోయినప్పుడు జ్వరము [1]క్రైసిస్ వలన ఆగినదనియు, క్రమముగా తగ్గిన యెడల [2]లైసిస్ వలన టెంపరేచరు దిగిపోయినదనియు చెప్పుదురు. జ్వరములలో కలుగు మార్పులనుబట్టి అవి విభాగించబడియున్నవి.

రోగి ఉపవసించినపుడుగాని, దేహమునకు చలిగాలి తగిలిన తరువాతగాని నిద్రించుచున్నప్పుడుగాని ఉష్ణోగ్రత కొంచెము తక్కువగానుండును. వాంతి, అతివిరేచనములు; అధిక రక్తస్రావము, బలమైన విషమువలన కలుగు ఫలితము, దేహము అదరుట, మూర్ఛపోవుట ([3]కొలాప్స్) అను పరిస్థితులవలన ఒక రోగి కేవలము కృంగిపోయినప్పుడు వాని ఉష్ణోగ్రతయు తగ్గియుండును. కండరముల చురుకుదనమువలనను, మనోద్రేకమువలనను, నరములలో ఏ కారణముచేతనైనను కలుగు ఉద్రేకమువలనను టెంపరేచరు కొంచెము హెచ్చును. ఉడుకునీళ్ల స్నానమువలన టెంపరేచరు హెచ్చును. జ్వర స్వభావమువలనను దేహోష్ణోగ్రత హెచ్చును. దేహమునందలి సాధారణమైన ఉష్ణోగ్రత ఉదయముకంటె సాయంకాలము కొంచెము హెచ్చుగనుండును.

### ఉష్ణోగ్రతయొక్క డిగ్రీలు

| | | |
|---|---|---|
| హైపర్ పైరెక్సియ | | 105° F. పైన |
| పైరెక్సియ | (హెచ్చుస్థితిలో) | 103°—105° F. |
| | (మధ్యస్థితిలో) | 101°—103° F. |
| | (తక్కువస్థితిలో) | 99°—101° F. |
| సాధారణస్థితిలో (నార్మల్) | | 98·4° F. |

[1] Crisis. [2] Lysis. [3] Collapse.

(ఇది 97·4° నుండి 99° F. వరకు హెచ్చుచు తగ్గుచు నుండవచ్చును.)

| | |
|---|---|
| సబ్ నార్మల్ | 95°—97° F. |
| [1]కొలాప్స్ | 95° F క్రింద |

జ్వరముల రకములు

జ్వరము హెచ్చుగానుండి, రాత్రి, ఉదయకాలముల మధ్య రెండు డిగ్రీలకంటె హెచ్చుక మారుచుండినయెడల, దానిని [2]అస్థిగత జ్వరమందురు.

రాత్రి, ఉదయకాలముల మధ్య టెంపరేచరు రెండు డిగ్రీలకన్న హెచ్చుచు, 24 గంటలలో నార్మలుకు రానటువంటి జ్వరమును [3]సంతత జ్వరమందురు.

టెంపరేచరు నార్మలు లేక సబ్ నార్మలునుండి హెచ్చుస్థితికిపోయి, జ్వరము తీవ్రముగానుండినయెడల, దానిని [4]ఆహిక జ్వరమందురు.




Intermittent

అస్థిగత జ్వరము | ఆహిక జ్వరము | సంతత జ్వరము

Constant | Remittent

7. వివిధమైన జ్వరములు

పై రకములలో దేనికిని చేరని జ్వరమును [5]అక్రమమైన జ్వరమందురు.

[6]ఇన్వర్సు అను జ్వరములో ఉదయమున అధికోష్ణము, సాయంకాలమున అధమోష్ణము రికార్డు చేయబడును.

[1] Collapse. [2] Constant. [3] Remittent. [4] Intermittent. [5] Irregular. [6] Inverse.



టెంపరేచరును నోటిలోగాని, చంకలలోగాని, గజ్జలలోగాని, ఆసనములోగాని తీయవచ్చును. నోటిలో తీయు టెంపరేచరు, చంక, గజ్జలలోనుండి తీయుదానికంటె సాధారణముగా ఒక డిగ్రీ హెచ్చుగా నుండును. అట్లే ఆసనమునుండి తీయు టెంపరేచరు నోటి టెంపరేచరుకంటె సాధారణముగా ఒక డిగ్రీయు, చర్మమునుండి తీయుదానికంటె బహుశ రెండు డిగ్రీలును హెచ్చుగా నుండును.

క్లినికల్ తెర్మామీటరులో సరియైన టెంపరేచరు తీసికొనవలసిన కాలము, దేహములో టెంపరేచరు తీయుస్థలమునుబట్టియు, ఉపయోగించు తెర్మామీటరుయొక్క రకమునుబట్టియు మారుచుండును. తెర్మామీటరులు కొన్ని అర్థ, ఒకటి, రెండు నిమిషములలో టెంపరేచరు కొలతను చూపగలవు. చర్మము పైభాగముకంటె ఆసనములో పాదరసము అతి త్వరగా ఎక్కును. తరువాత నోటిలో మిక్కిలి త్వరగ టెంపరేచరు రికార్డు చేయబడును. అర్థనిమిషములో టెంపరేచరును రికార్డుచేయగల తెర్మామీటరు, జ్వరము కొంచెము హెచ్చుగానున్న రోగియందే ఆ పనిచేయగలదు. టెంపరేచరు దాదాపు నార్మలుగనున్నప్పుడు, మూడునిమిషములకు తక్కువకాలములో సరియైన టెంపరేచరు రికార్డుచేయబడుట దుర్లభమని అనుభవ పూర్వకముగా తెలిసికొనియున్నారు. నర్సు ఒకసారి టెంపరేచరు తీసికొన్నతరువాత, రోగి స్థితినిబట్టి ఆమె అనుకొన్నంత టెంపరేచరు లేదని సందేహము కలిగినయెడల, వేరొకవిధమైన తెర్మామీటరు నుపయోగించి మరల టెంపరేచరు తీయవలెను. అంతకుముందే రోగికి ఉడుకు పానీయము నిచ్చియుండినయెడల, దానినిబట్టి నోటినుండి తీయు టెంపరేచరు కొంచెము తప్పు అను సంగతి నర్సు జ్ఞాపకము పెట్టుకొనవలెను. అట్లే పడకలో స్పంజిస్నానము చేసినతరువాత చర్మముమీద నుండి తీయు టెంపరేచరుకూడ కొంచెము తగ్గియుండును.

ఫారన్‌హైటు, సెంటిగ్రేడు (డిగ్రీలలో) స్కేలులను సరిపోల్చుట

| | ఫా. హై. (F.) | సెం. గ్రే. (C.) |
|---|---|---|
| సాధారణ వాయుపీడనములో నీళ్లు పొంగెడు స్థితి | 212° | 100° |
| సాధారణ వాయుపీడనములో నీళ్లు గడ్డకట్టు స్థితి | 32° | 0° |
| మానవుని సామాన్య దేహోష్ణోగ్రత | 98·4° | 36·8° |

ఫారన్‌హైటు స్కేలును సెంటిగ్రేడు స్కేలుగా మార్చుటకు 32 ను తీసివేసి, 5 తో గుణించి, 9 తో భాగించుము.

ఉదా. $212-32=180\times5=900\div9=100^\circ$ అట్లే సెంటిగ్రేడు స్కేలును, ఫారన్‌హైటు స్కేలుగా మార్చవలెననిన, 9 తో గుణించి, 5 తో భాగించి, 32 ను కలుపుము (కూడుము).

ఉదా. $50\times9=450\div5=90+32=122^\circ$.

**టెంపరేచరు తీయుట**

పరికరములు:—ఒక ట్రేలో ఒకగ్లాసు జారునందు [1]మెర్క్యురీ పెర్‌క్లోరైడు సొల్యూషను 1—1000; లేక దానితో సమానశక్తిగల మరియే యితర డిస్‌యిన్‌ఫెక్టెంట్‌గాని; ఇంకొక గ్లాసు జారునందు శుభ్రమైన నీరు; ఒక రంగు గ్లాసు జారులో ఆసనమునందుంచు తెర్మామీటరుకు ఉపయోగించుటకుగాను మెర్క్యురీ పెర్‌క్లోరైడు సొల్యూషను 1—1000; వ్యాజిలిను పాత్ర; ఒక గ్లాసు జారులో [2]గాజ్ లేక మెత్తనిదూది పీచులు; ఉపయోగించిన గాజ్ గుడ్డలను వేయుటకు ఇంకొక గ్లాసు జారు; ఒక కాగితముల కట్ట (పాడ్); పెన్సిలు మొదలైనవి సిద్ధముగనుంచవలెను. నీళ్లు, పెర్‌క్లోరైడ్ సొల్యూషనున్న గ్లాసు జారుల అడుగున, తెర్మామీటరు భద్రముకొరకు దూది వేసియుంచవలెను.

నోటినుండి టెంపరేచరును తీయుటకుగాను, పైనుండి ఒక అంగుళము ఆంటిసెప్టిక్ సొల్యూషనులో మునిగియుండిన తెర్మామీటరును బైటికి తీసి, శుభ్రమైన నీటిలో బాగుగా ముంచి కడిగి, విదిలించి, గాజ్‌తోగాని, దూది పీచులతోగాని బుడుపు (బల్బు) నుండి మీదికి తుడువుము. పాదరసము $95^\circ$ F. కు పడునట్లు తెర్మామీటరును బాగుగా విదిలించుము. ఈ పనిని బాగుగాచేయుటకు తెర్మామీటరును కుడిచేతి బొటనవ్రేలు, దాని తరువాతనున్న రెండువ్రేళ్ల మధ్య పట్టుకొని, బల్బు క్రిందికి యుండునట్లు పెట్టి, చేతిని బాగుగా త్వరత్వరగా జాడించుము. తరువాత తెర్మామీటరును రోగి నాలుక క్రిందపెట్టి, నోరు మూసికొనుమని రోగితో చెప్పుము. అట్లు మూడునిమిషము లుండనిచ్చి, తెర్మామీటరును బయటికి తీసి, టెంపరేచరు కొలతను చదివి తెలిసికొని పాడ్ కాగితముమీద రికార్డుచేయుము. ఇప్పుడు తెర్మామీటరును బల్బు తట్టుకు గాజ్‌తోగాని,

[1] Mercury perchloride. [2] Gauze.



దూది పీచులతోగాని తుడిచి ఒక నిమిషము దానిని ఆంటిసెప్టిక్ సొల్యూషనులో ముంచియుంచి, పిదప పైన చెప్పినట్లే మరియొక రోగికొరకు దానిని సిద్ధముచేయుము. ఒక్కొక్క రోగికి ఒక్కొక్క తెర్మామీటరు నుపయోగించుట మంచి పద్ధతి.

పదిసంవత్సరముల లోపు వయస్సుగల చిన్నపిల్లలకును, కలవరింతలు, స్మారకము తప్పియున్న రోగులకును, నోటి జబ్బుతోనున్న రోగికిని, శ్వాసావరోధము (ఊపిరాడని) వ్యాధిగల రోగికిని, క్షయరోగమున్న రోగికిని ఆసనముద్వారా టెంపరేచరు తీయవలెను. ఈ పనికిగాను రంగుగల పెద్ద బల్బు ఉన్న ఒక తెర్మామీటరును వాడుదురు. ఆసనముద్వారా టెంపరేచరును ఈ క్రిందివిధముగా తీయుదురు:—తెర్మామీటరును పెర్‌క్లోరైడ్ సొల్యూషనులోనుండి తీసి, బల్బునుండి పైవరకు తుడిచి, వ్యాజిలిను పూసి, వీలైనయెడల, రోగిని ప్రక్కకు త్రిప్పి, తెర్మామీటరును మెల్లగా ఆసనములో నుంచవలెను. రోగి పసిబిడ్డయైగాని, చిన్నబిడ్డయైగాని యుండినయెడల, తెర్మామీటరును దాని స్థానములో మూడు నిమిషములుంచి బిడ్డకాళ్లను గూడ పట్టుకొనవలెను. బయటికి తీసినపిమ్మట తెర్మామీటరును బల్బు తట్టు తుడిచి, దానిని తిరిగి పెర్‌క్లోరైడు సొల్యూషనులో ముంచవలెను.

నోటిద్వారాగాని, ఆసనముద్వారాగాని టెంపరేచరును తీయుటకు వీలుకానప్పుడు, చంకలనుండిగాని, గజ్జలనుండిగాని తీయుదురు. చంకలనుండిగాని, గజ్జలనుండిగాని యీ క్రిందిరీతిగా టెంపరేచరు తీయుదురు:—మొదట చంకనుగాని, గజ్జనుగాని తడిలేకుండ తుడిచి, ఆరనిచ్చి, తెర్మామీటరు బల్బును ఉంచవలసిన స్థానములో అనగా, గుంటగానున్న స్థలములో పెట్టి, చేతినిగాని, కాలినిగాని దేహము దగ్గరకు ముడిచి, తెర్మామీటరును ఐదునిమిషము లుండనిమ్ము. పిమ్మట దానిని తీసి, తుడిచి, ఆంటిసెప్టిక్ సొల్యూషనులో ముంచుము. నోటిపద్ధతిని తప్ప, మరే పద్ధతి ప్రకారము తీసినను దానిని చార్టుపై గుర్తించవలెను.

**నాడి**

గుండె రక్తముతోనిండి, ముడుచుకొనినప్పుడు, దానినుండి ప్రవహించు రక్తము, ఒక అలవలె ధమనులగుండ చిమ్మబడును. అప్పుడు ధమనులు ఉబ్బును. ఇట్లు ఉబ్బుటనే నాడి కొట్టుకొనుట అందురు. రక్తనాళము చర్మమునకు దగ్గర యెముకమీద పోవుచున్నప్పుడు, నాడిని మనము సులభ

ముగాపట్టి చూడవచ్చును. బొటనవ్రేలు క్రిందనున్న [1]మణికట్టు నాడినిగాని, ముఖము ప్రక్కన, చెవి ముందునున్న [2]కణతనాడినిగాని పట్టిచూచి, నాడిని సులభముగా కనుగొనవచ్చును. రోగి కూర్చుండియున్నప్పుడుగాని, పరుండియున్నప్పుడుగాని నాడిని తీయవలెను. చూపుడు, మధ్య వ్రేళ్లను నరముమీదపెట్టి, మెల్లగా కొంచెము ఒత్తి పట్టుకొనుట వలన నాడికొట్టుకొనుటను గ్రహించి, ఒక నిమిషమువరకు దాని పోటులను లెక్కించవలెను. గుండె యెంత త్వరగా కొట్టుకొనుచున్నదో చెప్పగలుగుటయేకాక, కొంచెము అనుభవము పొందియున్నయెడల, అది ముడుచుకొనినప్పుడెల్ల, రక్తమును ధారాళముగా బైటికి నెట్టుచున్నదో లేదో, గుండె సరిగా పనిచేయుచున్నదో లేదో అదియును చెప్పగలుగుదుము. తఱచుగా, గుండె కొట్టుకొనుట నిలిచిపోవుటవలన మరణము తటస్థించును గాన, అనేక విషయములలో ఈ గుండె స్థితి యెట్లున్నదో తెలిసికొనుట చాల ప్రాముఖ్యమైన సంగతియైయుండును. కావున నర్సులు నాడి యొక్క మార్పులను గ్రహించుటకు నేర్చుకొని, నాడి బాగుగానున్నదో, బలహీనముగానున్నదో తెలిసికొనుచుండవలెను.

సాధారణమైన (నార్మలు) నాడియొక్క పోటు రోగియొక్క వయస్సు, స్త్రీ పురుషభేదము, రోగి పరుండినతీరునుబట్టి యుండును. కూర్చున్నప్పటికంటె, నిలుచున్నప్పుడు నాడిపోటు హెచ్చుగానుండును. అవయవములను చాపుకొని విశ్రాంతిగా పరుండినప్పుడు నాడిపోటు నిదానముగా కొట్టుకొనుచుండును. రోగి ఉద్రేకము పొందినప్పుడును కోపము, భయము, ఆతురత కలిగియున్నప్పుడును నాడిపోటు హెచ్చియుండును. నిద్రపోవుచున్నప్పుడు తగ్గియుండును. విపరీతముగను మెల్లగనునున్న నాడిని [3]బ్రేడికార్డియ అనియు, విపరీతముగను వేగముగనున్న నాడిని [4]టాకికార్డియ అనియు చెప్పుదురు.

### నాడి కొట్టుకొనురీతి

| | | | | |
|---|---|---|---|---|
| క్రొత్తగాపుట్టిన బిడ్డయొక్క | నాడి | 1 నిమిషమునకు | 140 | సార్లు |
| 1 సంవత్సరము వయస్సప్పుడు | | ,, | 120 | ,, |
| 2—5 సం॥ల | ,, | ,, | 100 | ,, |
| 5—10 సం॥ల | ,, | ,, | 90 | ,, |
| పెద్దవారికి | ,, | ,, | 70—80 | వరకు |

[1] Radial artery. [2] Temporal artery. [3] Bradycardia. [4] Tachycardia.



పురుషునికంటె స్త్రీనాడి ఐదుపోట్లు ఎక్కువ వేగముగా కొట్టుకొనును. ముసలితనములో నాడి నిదానముగా కొట్టుకొనుట మామూలేకాని, ఎక్కువ వృద్ధాప్యములో అది తిరిగి యెక్కువ వేగము కావచ్చును. సాధారణముగా నాడి కొట్టుకొనురీతియు శ్వాసించురీతియు 4: 1 [1]నిష్పత్తిలోనుండును. అనగా ప్రతి శ్వాస నిశ్వాసకు నాలుగు నాడిపోట్లు ఉండును. తక్కిన సంగతులన్ని సరిగానున్నప్పుడు 100° F. జ్వరమునకంటె పైన హెచ్చు ప్రతి డిగ్రీజ్వరమునకు 10 నాడిపోట్లు అధికమగును. నాడి కొట్టుకొనురీతిని టెంపరేచరుతో పోల్చి యీ నిష్పత్తి కనుగొనిరి.

నాడి [2]బలముగాను నిండుగాను దుముకుచున్నట్టును కొట్టుకొనవచ్చును. లేదా, బలహీనముగాను, పలుచగాను దారమువలె సన్నముగా కొట్టుకొనునట్లును, కొట్టికొట్టనట్టును కొట్టుకొనవచ్చును. నాడియొక్క లయ క్రమముగాగాని క్రమముతప్పిగాని, [3]వరుసమారిగాని, [4]రెండు పర్యాయములు కొట్టునట్టి ద్విత్వనాడిగాగాని యుండవచ్చును. క్రమము తప్పిన నాడిలో పోటుకు పోటుకు మధ్యకాలము, అసమానముగానుండును. వరుసమారిన నాడిలోకొన్ని పోట్లు ఉండవు. అనగా, ప్రతి మూడవ, ఐదవ పోటు తప్పిపోయి యుండవచ్చును. లేక, క్రమము తప్పినవరుసలో నాడి కొట్టుకొనుచుండవచ్చును. ఇట్టి నాడిని పరీక్షించుటకు నర్సు తన చేతివ్రేళ్లను గుండెకొనకు దగ్గరగ ఱొమ్ముమీదనుంచి, గుండె యెన్నిసారులు కొట్టుకొనుచున్నదో గమనించవలెను. దీనిని కనుగొనుటకు ఱొమ్ముమొన గీతకు కొంచెము ఎడమవైపు క్రిందుగ చేయిబెట్టి చూచుటవలనగాని, నిస్సందేహముగ తెలిసికొనుటకు [5]స్టెతెస్కోపుతో వినుటవలనగాని తెలిసికొనవచ్చును. ద్విత్వనాడిలో మొదటినాడి పోటునకు తరువాత ఒక బలహీనమైన పోటువచ్చుటవలన, మొదటిపోటే రెండుసార్లు కొట్టుకొనినట్లుండును. రోగియొక్క నాడిని పరీక్షించుచుండగా ఆమెచేయి దేనిమీదనైనను ఆనుకొని, కండరములు సళ్లుగానుండవలెను. కావున రోగిచేతిని ఆమె కడుపుమీదగాని ఱొమ్ముమీదగాని యుంచవచ్చును. ఇట్లు చేయుటకు వీలు కానప్పుడు చేతిని ఒక దిండుమీద పెట్టవచ్చును.

[1] Ratio. [2] Strong, full and bounding. [3] Intermittent. [4] Dicrotic. [5] Stethoscope.

నాడిపోటు సులభముగా అణిగిపోకుండునంత బలముగలదై యుండవలెను. ధమనిలోనుండు రక్తముయొక్క మొత్తము, దాని [1]పరిమాణము అని చెప్పబడును. ఈ పరిమాణమునుబట్టియే, నాడి నిండుగాగాని, చిన్నగాగాని యున్నదని నిర్ణయించబడును. గుండెపోటుయొక్క శక్తికి, దాని [2]బిగువు అని పేరు. బిగువు హెచ్చుగానున్న నాడి అణిగిపోవుట కష్టమే కాని, బిగువు తక్కువగానున్న, నాడి అణిగిపోవుట సులభము. దారమువలె సన్నగానుండు నాడి వేగముగాను, బలహీనముగాను కొట్టుకొనును. ఇది సులభముగా అణిచివేయబడగలదు. పరుగెత్తుచున్నట్టున్న నాడిపోటు చాల బలహీనముగా నుండుటచేత, దానిలో ఒక్కొక్క నాడిపోటును లెక్కించుట కష్టమగును.

[3]రక్తపోటు

రక్తపోటు అనగా, ధమనుల గోడలకు బలముగా తగులు రక్తముయొక్క ఒత్తిడి. ఈ యొత్తిడి గుండెపోటుయొక్క బలముమీదను, ధమనులయొక్క గోడలు సాగగల శక్తిమీదను, రక్తపరిమాణము, చిక్కదనముమీదను ఆధారపడియుండును. గుండె ముడుచుకొన్నప్పుడు అధిక ఒత్తిడి కలుగును. దీనిని [4]సిస్టాలిక్ పోటు అందురు. అధమపక్షము ఒత్తిడి గుండెపోటుల మధ్య మధ్య జరుగుచుండును. దీనిని [5]డయస్టాలిక్ పోటు అందురు.

ఒక్కొక్కప్పుడు రోగియొక్క రక్తపోటుతీసి వ్రాయవలసి యుండును. ఒక ప్రత్యేకమైన సాధనము నుపయోగించి దీనిని తీయుదురు. ఈ సాధనమునకు [6]స్ఫిగ్మోమేనోమీటరు అని పేరు. (8-వ పటము చూడుము.) చేతిపట్టిని గుండె మట్టమునకు సరిగా చేతికి కట్టెదరు. D అను స్టెతెస్కోపు డిస్కు, రబ్బరు పట్టి క్రిందనున్న [7]ప్రాగండధమని (బ్రేకియల్ ఆర్టరి) మీద పెట్టబడును. B అను బల్బు మూలమున నాడి శబ్దమాగు వరకు చేతికట్టులోనికి గాలి బలవంతముగా పంపబడును. తరువాత నాడి శబ్దము వినబడునంతవరకు లోపలికి పంపిన గాలిని మెల్లగ వదలవలెను. స్టెతెస్కోపులో మొదటి శబ్దము తిరిగి వినబడకముందే A అను పాదరసపు

[1] Volume. [2] Tension.
[3] Blood pressure. [4] Systolic pressure. [5] Diastolic pressure.
[6] Sphygmomanometer. [7] Brachial artery.



స్కేలులో చదువగల స్థానము, సిస్టాలిక్ రక్తపోటును సూచించును. తరువాత నాడి శబ్దము ఆగిపోవు ఒక స్థానమువరకు గాలి నెక్కించుచునే యుండవలెను. ఇప్పుడు పాదరసపు స్కేలులో చదువగలస్థానము డయస్టాలిక్ రక్తపోటును సూచించును. పురుషులలో 110—130 mm. సిస్టాలిక్ రక్తపోటుల మధ్యను, 60—90 mm. డైయస్టోలిక్ రక్తపోటుల మధ్యను,




8. రక్తపోటు తీయుట

A. పాదరసము స్కేలు. B. ఇన్‌ఫ్లేషను బల్బు (ఉబ్బించేతిత్తి). C. చేతికి చుట్టెడు రబ్బరుపట్టీ. D. స్టెతెస్కోపు డిస్కు.

A. Mercury Scale. B. Inflation bulb. C. Armlet.
D. Disc of stethoscope.

నార్మలు రక్తపోటు మారుచుండును. స్త్రీలలో సిస్టాలిక్ పోటు పురుషులలో కంటె 5—10 mm. తక్కువగానుండును. అధిక రక్తపోటుగల మనిషినాడి గట్టిది; నిండు పరిమాణముగలది; అణుచుటకు కష్టమయినదిగ నుండును.

తగ్గు పోటుగల మనిషియొక్క నాడి, పరిమాణమునందును ఇతర గుణములయందును మెత్తనిదని చెప్పబడును. దీనిని అణిచివేయుట సులభము.

**ఉచ్ఛ్వాస నిశ్వాసములు**

కొంతవరకు ఈ శ్వాసనిశ్వాసము రోగి స్వాధీనములోనే యుండును. కావున దీనిని రోగికి తెలియకుండగనే లెక్కించుట మంచిది. ఈ పని చేయుటకు నర్సు రోగి నాడిని పరీక్షించుచున్నట్టు ఇంకను అక్కడనే తన వ్రేళ్లుంచి, మనికట్టుపట్టుకొని, రోగికి తెలియనిరీతిగా, ఒక్కొక్క శ్వాసకు అతని లేక ఆమె ఱొమ్ము పాటుపోటు (పడుట లేచుట) లను గమనించవలెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములను (ఊపిరి పీల్చుట, విడుచుట అను) రెంటిని కలిపి ఒక శ్వాసగా గణింపవలెను.

నార్మలు (సాధారణమైన) శ్వాస లయ యుక్తముగాను, నెమ్మదిగాను, క్రమముగాను, సుఖముగాను ఉండును. వయసు, స్త్రీ పురుష భేదమును బట్టి దాని లెక్క మారుచుండును.

| | | | |
|---|---|---|---|
| క్రొత్తగా పుట్టిన బిడ్డ శ్వాస నిమిషమునకు దాదాపు | | 40 | సార్లు |
| 1 సంవత్సరము వయస్సప్పుడు | ,, | 30 | ,, |
| 2-9 సం॥ ముల ,, | ,, | 24-28 | ,, |
| పెద్దవారికి | ,, | 16-18 | ,, స్త్రీలో |

పురుషునికంటె కొంచెము వడిగా జరుగుచుండును.

సాధారణమైన (నార్మలు) ఆరోగ్యముగల మనిషి, దేహాభ్యాసము చేయుటవలనను, అతనికి కలిగిన ఏదైన ఉద్రేకము, మనోవికారమువలనను ఈ శ్వాస యెక్కువ కావచ్చును. విశ్రాంతి, నిద్ర, అలసట అను ఈ మూటిలో శ్వాస తగ్గియుండును. అసాధారణ పరిస్థితులలో, అనగా, జ్వరము తగిలిన అనేక స్థితులలోను, ఱొమ్ము జబ్బులలోను, విషప్రయోగముయొక్క వివిధ దశలలోను, శ్వాసను ఉద్రేకింపచేయుటకు మందు ఇచ్చిన తరువాతను శ్వాస అధికమైయుండును. మెదడునకు కలిగిన గాయములవలనను, గాఢమూర్ఛలో పడియున్న అనేక స్థితులలోను, మత్తు మందులు, ముఖ్యముగా నల్లమందు నిచ్చిన తరువాతను, శ్వాసతగ్గియుండవచ్చును. కొన్ని ఱొమ్ము జబ్బులలో, ముఖ్యముగా, న్యుమోనియా వ్యాధిలో నాడికిని శ్వాసకునుగల నిష్పత్తి చాలవరకు మారియుండవచ్చును. న్యుమోనియా వ్యాధిలో ఈ నిష్పత్తి 1—2 వరకును తగ్గియుండవచ్చును.



శ్వాస తీయునప్పుడు నర్సు, శ్వాసలెక్కను మాత్రము గణించిన చాలదు; దానితోకూడ, శ్వాసయొక్క గుణము, లోతు, క్రమము, లయ రోగియందు కనబడు అసౌఖ్యమైన యితర చిహ్నములనుగూడ గమనించవలెను.

శ్వాసము 40 కంటె హెచ్చినను, 8 కంటె తగ్గినను, అపాయకరమైన చిహ్నమును సూచించును. శ్వాసక్రమముగా గాని, క్రమము తప్పిగాని, నెమ్మదిగా గాని, శబ్దముతోగాని, ఆయాసముతోగాని, లోతుగా గాని, లోతులేకగాని యున్నదని చెప్పవచ్చును. అసాధారణమైన శ్వాసరకములలో ఒగర్పు, అనగా కష్టమైన శ్వాస, గురకతో ఊపిరి విడుచుట, [1]చేని - స్టోక్సు అను శ్వాసచేరియుండును. చేని - స్టోక్సు అను శ్వాసలో ఊపిరి బలమునందును, పొడుగునందును క్రమక్రమముగా హెచ్చుచు, పిమ్మట శ్వాస బొత్తుగా లేకుండునంతవరకు దిగిపోవును. ఈ యాకారి స్థితి మెదడు, గుండె జబ్బులలో కనబడును. ఇది మరణము ఆసన్నమగుచున్నదని సూచించును. కష్టముగా శ్వాసించుటకు ఒగర్పు అని పేరు. సాధారణముగా ఇది ఆయాసకరమైనదియు, శబ్దముతో కూడినదియునై యుండును. ఊపిరి పోవుమార్గములయందు ఒత్తిడిగాని, అడ్డుగాని యుండుటయు, ఊపిరితిత్తుల క్షయ ముదిరిన స్థితిలో నుండుట, న్యుమోనియా, గుండెజబ్బులలో ఊపిరితిత్తుల వైశాల్యము తగ్గియుండుటయు ఇందుకు కారణములు. గుండె జబ్బువలనను, లోపముగల శ్వాసవలనను రక్తములో ప్రాణవాయువు తక్కువైనపుడు, అనేకమంది రోగులు ఒగర్పువలన నీలివర్ణముగా మారిపోవుదురు. ఈ స్థితికి [2]సైనోసిస్ అని పేరు. ఈ చిహ్నమును పెదవులలోగాని, చేతి కాలివ్రేళ్ల కొనలలోగాని చూడవచ్చును.

**వణకు**

ఇది హఠాత్తుగా వణకుతో వచ్చెడి చలి. ఇది సాధారణముగా జ్వరమునకు ముందు వచ్చును. బిడ్డలకు జ్వరమునకు పూర్వము చలి, వణుకులు రావుగాని ఈడ్పులు తరుచుగ వచ్చును. దీనిలో మూడు దశలున్నవి. చలి, వేడి, చెమట పోయుదశలు. చలి పుట్టు దశలో వణకుండును. ఈ వణకు కొన్నిసారులు పడకను కదిలించునంతటి బలముగా నుండవచ్చును. ఈ వణకు వచ్చినపుడు రోగి దేహముయొక్క పైభాగము

[1] Cheyne-Stokes breathing. [2] Cyanosis.

చల్లగానుండును. చలిచేత పండ్లు కొణుకు పోవును. ముఖ వైఖరి బాధను సూచించును; నీలివర్ణముగా మారును. నాడి బలహీనముగాను వేగముగాను కొట్టుకొనును. ఈ జబ్బుయొక్క ఆరంభములో టెంపరేచరు సబ్ నార్మల్‌గ నుండవచ్చును గాని త్వరలోనే 103° F. లేక రోగి ఇంక వణకుచుండగ మరి ఎక్కువ డిగ్రీలుగాని హెచ్చవచ్చును. ఈ స్థితి కొన్ని నిమిషములు మొదలు అరగంటకు పైన నుండవచ్చును. చల్లగనున్న దశ దాటగానే రోగియందు [1]ప్రతిక్రియ జరుగుటవలన అతని దేహము అతి వేడిగనుండును. కావున టెంపరేచరు ఇంతకు ముందుకంటె హెచ్చును; నాడి నిండుగను దుముకుచున్నట్టును ఉండును; చర్మము వేడిగాను, ఎండినుండును. దాహము, తలనొప్పి, జ్వరముయొక్క యితర లక్షణములు కనబడును. ఇట్టి వేడిదశ గతించిన పిమ్మట రోగికి విస్తారమైన చెమటపోయును. అప్పుడతని టెంపరేచరు దిగిపోవును; నాడి నిదానముగ కొట్టుకొనును.

పరిచర్య:—పై మూడుదశలలోను నర్సు రోగియొక్క టెంపరేచరు తీసికొని చూడవలెను. మొదటిదశలో రోగికి వేడిద్రవములు త్రాగించవలెను. ఆమెను కంబళ్లతో వెచ్చగా కప్పి, వేడినీటిబుడ్లు పెట్టవలెను. ఈ జబ్బుచేత రోగి యెక్కువ ఉద్రేకముతోగాని, తీక్షణముగా గాని ఉన్నట్టు కనబడినయెడల ఆమెను అణిచిపెట్టుట అవసరమైయుండును. రెండవదశలో టెంపరేచరు హెచ్చుచుండగా, ఉడుకు నీటి బుడ్లను, కంబళ్లను క్రమేణ తీసివేయవలెను. మూడవదశలో చెమట విస్తారముగ పోసినపుడు పొడి తువాళ్లతో రోగి దేహమును రుద్ది, చెమట ఆరిన తరువాత పొడిగుడ్డలు వేసి రోగికి సుఖముగనుండునట్లు చేయవలెను. వణకు ఎప్పుడును అపాయకరమైన లక్షణము గాన, దీనినిగూర్చి వెంటనే వైద్యునికి తెలియజేయవలెను. దేహోష్ణము హెచ్చకుండను, చెమట పోయకుండను కలుగునట్టి మామూలు వణకుకును [2]రైగర్ అను వణకుకును గల భేదమును గుర్తించవలెను. సాధారణమైన వణకు రోగికి కలుగు ఉద్రేకమువలనను చలివలనను అమితమైన అలత, ఆయాసము వలనను, భయమువలనను కలుగవచ్చును. రైగర్ అను వణకు మలేరియా వ్యాధితో సంబంధపడి యుండవచ్చును. రోగి అట్టి వ్యాధివలన బాధపడుచున్నట్టు ఇంతకుముందే తెలియకుండినయెడల వాని [3]రక్తము గాజు అద్దము

[1] A period of reaction. [2] Rigor. [3] Blood film.



మీదికి తీసి పరీక్షించవలెను. (దీనిని రోగికి క్వినైన్ అను మందు నియ్యక ముందే తీసికొనవలెను.)

సన్నిపాతము

సన్నిపాతము మనస్సునకు కలుగు భ్రమ. ఇది కొద్దిపాటిదిగా నుండి, కఠినమగు [1]వెఱ్ఱివరకు మారవచ్చును. ఈ వ్యాధి బిడ్డలయందు వారిదేహ ఉష్ణోగ్రత కొద్దిగ హెచ్చుటవలనగాని, అజీర్ణమువలనగాని సులభముగ కలుగవచ్చును. పెద్దవారిలో, జ్వరము అధికముగా వచ్చినప్పుడును, విషముచే రక్తము చెడియున్నప్పుడును వచ్చును. మనోచాంచల్యము చేత రోగి తన చుట్టునున్నవానిని గుర్తించజాలదు. ఈ మనోవ్యాధి రెండురకములుగనుండును. మొదటి రకములో రోగి తనలో తానే మెల్లగా సణుగుచు గొణుగుచునుండును. రెండవ రకములో రోగి ఉద్రేకపూరితుడై తాను ఏమో విపరీతమైన ధ్వనులను వినుచున్నట్లును విపరీతమైన వస్తువులను జూచుచున్నట్లును భ్రమపడును. ఈ రెండవ రకములో రోగిని పడకలో అణిచియుంచుట కష్టమగును. ఆహారపానీయములు తిరస్కరించును. అల్లరి, దౌర్జన్యముచేయును. విశేష త్రాగుడువలన కలుగు సన్నిపాతము ఈ విధమైనది.

సన్నిపాతపు రోగులకు పరిచర్యచేయునపుడు, పడకనుండి లేచిపోవుటకు ప్రయత్నించు రోగికి, మలమూత్రాదులు విసర్జించనందువలన ఇట్టి ఆయాసము కలిగినదేమోయని గ్రహించి వానిని విసర్జించుటకు పడకచేట్టి నియ్యవలెను. ఒకవేళ అతనికి ఆకలిగ నున్నదేమోయని తెలిసికొని, ఏదైన భోజనముగాని, పానీయముగాని యియ్యవలెను. సన్నిపాతపు రోగినిజూచి తాను భయపడినట్టు నర్సు ఎన్నడును నటించకూడదు. రోగియెడల దయగానుండవలెను. కాని నిశ్చలముగ పనిచేయవలెను.

రోగులను కట్టుబాటులో నుంచుట:—రోగులు తమకు తామే హాని చేసికొనకుండను పడకలోనుండి లేచిపోకుండను వారిని కొన్నిసారులు అణిచిపెట్టుట అవసరమైయుండును.

[2]పడకపలకలను ఉపయోగించుట ఒకానొక మంచి సదుపాయము. పడకపొడుగును, దాదాపు 14 అంగుళముల వెడల్పునుగల రెండుపలకలను

[1] Mania. [2] Bed boards.

రోగికి ఇరువైపుల మంచముమీదపెట్టి, తల, పాదములవైపున కట్టవలెను. ఆయాసముతోను, కొద్దిగ సన్నిపాతముతోను బాధపడు రోగులను మంచములో అణిచియుంచుటకు ఈ సదుపాయము చాలును. దీనివలన రోగులకు ఏలాటి ఉద్రేకము కలుగదు.

ఒక దుప్పటిని పొడుగునమడిచి, పడకకు అడ్డముగావేసి, పడకక్రింద దాని రెండు కొనలనుగట్టి నేప్కిన్నులతో గ్రుచ్చియుంచుటయు, రోగిని అణిచియుంచుటకు మరియొక అనుకూలమైన సాధనము. ఇంతకంటె బలమైన సదుపాయము కావలసియుంటే, సరియైన పొడుగుగల క్యాన్వాసు పట్టతెచ్చి, నాలుగుమూలలకు ఉపులు (నాడాలు)కట్టి, పట్టను రోగిమీద పడకకు అడ్డముగ వేసికట్టి, ఉపులను మంచము స్ప్రింగులకుగాని, మంచము క్రిందగాని గట్టిగా కట్టవచ్చును.

కాళ్లను చేతులను [1]క్లోవ్‌హిచ్ అను ముడివలన అణిచియుంచవచ్చును. ఈ ముడిని యీ క్రిందివిధముగా వేయవచ్చును:—బాండేజిగుడ్డను రెండు ఉచ్చులువేసి 8 అను అంకెవలె అమర్చుము. పైన రెండు ఉచ్చుల కొనలు ఒకదానికొకటి యెదురెదురుగా నుండవలెను. రెండు ఉచ్చులను ఒకటిగాచేర్చి చేతులమీదగాని, కాళ్లమీదగాని పెట్టి, కాళ్లుచేతులు జారిపోకుండ గట్టిగ బిగించుము; పిమ్మట కొనలను పడకప్రక్కలకుగాని, పాదముల తట్టునగాని బిగువుగా కట్టుము.

పెద్దవారివలె పిల్లలనుగూడ కట్టి యుంచవచ్చునుగాని, పిల్లలకు దెబ్బలు తగులకుండ జాగ్రత్తగానుండవలెను. బిడ్డచేతులకు సంచులు కట్టినయెడల, బిడ్డ తన దేహమును గీరుకొనలేక యుండును. బిడ్డ తన ముఖమును తాకకుండవలసినప్పుడు, మోచేతి నాడించకుండ దండతెక్క మధ్యనుండి, మణికట్టువరకు గట్టి అట్టలను బిగించికట్టవలెను. లేక సుత్తెలు చుట్టిన సన్నని బద్దలను అవసరమైనయెడల కట్టవచ్చును. బిడ్డను అణిచియుంచుటకు మరియొక సులభమైన పద్ధతియేదనగా, దిండువరక్రింది భాగము మధ్య తలపట్టునంతగా కత్తిరించి, బిడ్డతలను దానిలో దూర్చి మిగత సంచిలో బిడ్డ దేహమంతయు, ముఖ్యముగా కాళ్లు చేరియుండునట్లు చేసి, గోతాము మూతిని చేర్చి కట్టినట్టు కట్టివేయవలెను.

[1] Clove hitch.



[1]గాఢమూర్ఛ

పూర్తిగా స్మారకము తప్పిన స్థితికి గాఢమూర్ఛ అందురు. ఇది వేవ్వేరు రకములుగనుండును. మలమూత్రములు విసర్జింపబడుటయైనను గ్రహించలేనంత తెలివితప్పి గాఢమైన మూర్ఛయందుండవచ్చును. లేక కొంత తెలివితోను, కొంత తెలివితప్పియు నుండవచ్చును. తెలివితో నున్నప్పుడు రోగిని లేపి కొంచెముసేపు సంగతులను గ్రహించునట్లు చేయవచ్చును. ఈ మూర్ఛవచ్చుటకు అనేకకారణములు ఉండవచ్చును. అవే వనగా, తల పుఱ్ఱెకు దెబ్బతగులుట, మెదడునందు రక్తస్రావము, కణుతులు, చీము గడ్డలు, [2]మెదడుని చుట్టియున్న పొరకందుట మొదలగువానివలన కలుగు ఒత్తిడి. ఇతరకారణములు ఏవనగా:—దేహములో విషముచేరి యుండుట, [3]మూత్రపిండము, నీరుడు తిత్తి సరిగా పనిచేయకుండుటవలన కలుగు స్థితి, అతిమూత్రము, విషప్రయోగము, ఎండదెబ్బ మొదలగునవి. రోగిని జాగ్రత్తగా గమనించుటయు, గమనించిన సంగతులన్నియు వ్రాసి తెలియజేయుటయు అవసరమైయుండును. ముఖ్యముగా ఈడ్పులు, తలవెనుకకు తిరుగుట, విపరీతమైన చలనములు గమనించి తెలుపవలెను.

[4]మహోదరము

దేహమునందు రక్తసారపు రంధ్రములలో రక్తసారము నిలిచియుండుట వలన మహోదరము అను వ్యాధికలుగును. ఇది పుఱ్ఱె రంధ్రములలో చేరియున్నప్పుడు దీనిని [5]జలశీర్షము అందురు. కడుపుగుహలో చేరియున్నప్పుడు దీనిని [6]జలోదరము అందురు. ఱొమ్ము (వక్షము)లో చేరియున్నప్పుడు దీనిని [7]జలోరోగ్రహము అందురు.

వాపు

శోషగ్రంధులలో రక్తసారము అధికముగా చేరినప్పుడు ఉబ్బువ్యాధి కలుగును. ఈ వాపు ఉన్నభాగమును నిలకడగా ఒత్తినయెడల, అక్కడ సులభముగా గుంటలుపడును. ఎక్కువ వాపు ఉన్నప్పుడు చర్మము సాగి నిగనిగలాడుచుండును. ఈ స్థితికి గుండె, కాలేయము, మూత్రపిండములకు సంబంధించిన వ్యాధులును, ట్యూమర్స్ అను గడ్డలవలన నరములమీద కలిగెడి ఒత్తిడియు కారణములగును.

[1] Coma. [2] Meningitis. [3] Uremia. [4] Dropsy. [5] Hydrocephalus. [6] Ascities. [7] Hydrothorax.

బోలుగనున్న సూదిని పల్లములోనికి దూర్చి తరుచుగ నీరును తీసి వేయుదురు. ఈ పద్ధతికి [1]ట్యాపింగ్ లేక ప్యారసెంటెసిస్ అని పేరు. నీరుడు, ఒత్తిడిక్రింద నుండుటచేత సులభముగా బయటికి స్రవించును. (ఈ పద్ధతి 10-వ అధ్యాయములో బాగుగా వివరించబడియున్నది.)

నోటివాసన

ఇందు గమనించవలసిన ముఖ్యలక్షణము లేవనగా—అతి మూత్రము నందు తీపివాసన, లేక యురీమియ అను వ్యాధిలో మూత్రపు వాసన. నోటియందలి దుర్గంధమువలన, పండ్లు పుచ్చినవనిగాని, నోటియందు అంటున్నదనిగాని గ్రహించవలెను.

వెక్కిళ్లు

[2]విభాజికము అకస్మాత్తుగ పట్టుకొనినందున, ఊపిరి తిత్తులలోనికి ఊపిరి బలముగా ఈడ్చుకొనబడును. [3]ఉపజిహ్వ దీనిని ఆపుటకు తటాలున మూసి కొనును. అందువలన వెక్కిళ్లు కలుగును. [4]విభాజికమునకు చలనము కలిగించు నరమునకు చురుకు కలుగుటవలనగాని, పై కడుపు కందుటవలన గాని వెక్కిళ్లు కలుగవచ్చును. రెండవదానివలన కలిగినయెడల, అది దుర్లక్షణము. ఇది అధిక అలసట సంబంధముగా గాని, మూర్ఛ సంబంధముగా గాని యుండవచ్చును.

దగ్గు

శ్వాసమార్గములో దురద (జిల) వంటి బాధకు ఇదియొక లక్షణము. ఈ దగ్గు, పొడి దగ్గుగానున్నదో, దగ్గినప్పుడు కళ్లె మొదలైనవి బయటికి వచుచ్చున్నవేమో, లేక బాధ, నొప్పియున్నదేమో యని నర్సు గమనించు చుండవలెను. చంటిపిల్లల దగ్గులో [5]కాకికూతవంటి దగ్గునుగాని, తటాలున ఆరంభమై దీర్ఘముగానుండెడు [6]కోరింత దగ్గునుగాని నర్సు గుర్తించ శక్తిగలదైయుండవలెను. [7]బ్రాంకైటిస్‌గాని, [8]ప్లూరసి అను రోగముగాని ఆరంభమగునప్పుడు ఈ దగ్గు పొడిగానుండును. శ్వాసకోశముల క్షయ యందును, ఊపిరితిత్తులలో చీము గడ్డ లేచినప్పుడును, న్యుమోనియా యొక్క చివరిదశలలోను దగ్గు సళ్లు (వదలు)గా నుండును.

---

[1] Tapping or paracentesis. [2] Diaphragm. [3] Glottis. [4] Phrenic nerve. [5] Crowing cough of croup. [6] Whooping cough. [7] Bronchitis. [8] Pleurisy.



ఆకలి

ఆకలియందు అనేకమైన విపరీతలక్షణములు కనబడవచ్చును. భోజనమునందు ఆశ తగ్గుటగాని, లేక బొత్తుగ ఇష్టము లేకపోవుటగాని, [1]ఎనొరెక్సియ అనబడును. ఈ లక్షణము అనేక రోగములయందును స్థితులయందును కనబడుచుండును. తృప్తిపరచబడలేని ఆకలికి [2]బులిమియ యని పేరు. ఈ లక్షణము మూర్ఛ, అతిమూత్రము, నరముల సంబంధమైన అజీర్ణము, మెదడు కణుతులు, కొన్ని మనోవ్యాధులయందు కనబడుచుండును. కొన్ని భోజనపదార్థములకొరకు దురాశకలిగినట్టి ఆకలి పుట్టుటకు [3]ప్యారొరెక్సియ అని పేరు. సీమసున్నము, మట్టి మొదలగు విపరీతమైన వస్తువులను తినుటకు గల ఆకలికి [4]పైక యని పేరు. ఈ అవలక్షణములు కొన్నిసార్లు గర్భము ధరించియున్నప్పుడును, మూర్ఛ, పిచ్చితనము, పురుగులు చేరియుండుట, కొన్నివిధములైన రక్తహీనత మున్నగు వ్యాధులందును కనబడుచుండును.

వమనము లేక వాంతి

ఈ లక్షణములు అనేక స్థితులలో కనబడుచుండును. ఆకు పచ్చని లేక పైత్యసంబంధమైన వాంతి, విడువకుండ వాంతియగు అనేక స్థితులలో కనబడుచుండును. దీని రంగు చిన్నప్రేగులనుండివచ్చెడు పైత్యపు రంగును పోలియుండును. ఆహార కోశమునందలి పుండువలనను, [5]క్యాన్సర్ (కొరుకుడు పుండు) వలనను, కార్జముయొక్క క్షీణతవలన రక్తనాళములు ఉబ్బుటవలనను, రక్తపువమనము కలుగవచ్చును. మరియు గాయము తగిలినందునను, అధికమైన [6]జఠరీయ రోగమువలనను, ఉబ్బిన రక్తనాడి పిగులుటవలనను, ముక్కు లేక గొంతునుండి రక్తము మ్రింగుటవలననుగూడ రక్తపు వమనము కలుగవచ్చును. వాంతియందు మలమున్నయెడల [7]కణితివల్లను [8]ఒరుబీజమువల్లను, పేగుయొక్క ఒక భాగము మరియొక భాగములోనికి జొచ్చుటవలనగాని, పేగులయందు అడ్డు ఏర్పడినది అని గురుతు. ఆహార కోశము నందలి పుండువలనను, క్యాన్సర్ వలనను ఈ వ్యాధి సంభవించవచ్చును. వాంతులు విస్తారముగ అగుటవలన ఆహారకోశము ఉబ్బినదని తెలిసికొనవచ్చును. మెదడు సంబంధమైన కొన్ని వ్యాధులయందు అనగా,

---

[1] Anorexia. [2] Bulimia. [3] Parorexia. [4] Pica. [5] Cancer. [6] Acute gastritis. [7] Tumor. [8] Hernia.

[1]మెనెంజైటిస్ అను వ్యాధియందును, [2]మెదటి కణుతులయందును [3]ఆంత్ర ముఖద్వారము ముడుచుకొనుటవలనను వాంతి భళ్లుభళ్లున అగుచుండును. [4]తేపులవలన ఆహారము తిరిగి నోటిలోనికివచ్చుట, వికారములేకయే వాంతి యగుట—ఇవి మనోసంబంధమైన కొన్ని వ్యాధుల లక్షణములు. ఇట్టి వాంతులు ఒక్కొక్కసారి యెంతెంత అగుచుండును? ఏ రంగు కలిగియుండును? దీనియొక్క రియాక్షన్ ఏమి? చిక్కదనమేమి? ఎట్టి వాసనగలది? ఎన్నిసారులు, ఎట్లు వాంతియగుచుండును? భోజనము, మందు పుచ్చుకొనిన యెంతకాలమునకు వమనమగుచుండును? అను విషయములను నర్సు ముఖ్యముగా గమనించుచుండవలెను.

కళ్లె

దగ్గువలన ఊపిరి తిత్తులనుండి కళ్లె బయటికి వచ్చుచుండును. అది తెల్లగగాని, నురుగుగగాని, బంకవలెగాని, బంక చీము కలిసిగాని, లేక కేవలము చీమువలెనేకాని, త్రుప్పుపట్టిన రంగుగగాని, కాఫీ మడ్డి రంగుగ గాని, కొద్దిగ రక్తవర్ణముగగాని యుండవచ్చును. దీని పరిమాణము చిక్కదనము, వాసన, రంగు మొదలగువానిని ఖచ్చితముగ గమనించ వలెను. బ్రాంకైటీస్, న్యుమోనియాయొక్క ఆఖరిదశయందును, క్షయ, [5]ఎంపయిమ, (పుప్పుస వేష్టములో చీముచేరియుండుట) ఊపిరి తిత్తులలో చీము గడ్డ యుండినప్పుడును కళ్లె, బంక, చీము కలిసియుండును. [6]బ్రాంకియక్టసిస్ అను రోగమందును, ముదిరిన క్షయయందును [7]ఊపిరి తిత్తుల యందు కుళ్లిన పుండుగాని, చీము గడ్డగాని, యుండినప్పుడును కళ్లె దుర్వాసన గొట్టును. న్యుమోనియావ్యాధియందు కళ్లె కొంచెము త్రుప్పురంగు గాను, ఊపిరితిత్తులవాపునందు నురుగుగాను నుండును.

భగమునుండివచ్చు విసర్జనములు

జననమార్గమందు ఏ భాగమైనను కందినప్పుడు బంకగాని, చీము గాని, లేక రెండు కలిసిగాని, భగమునుండి రావచ్చును. సెగరోగము నందు బంకవంటి చిక్కని ద్రవము స్రవించును. [8]గర్భసంచికిగాని దాని కంఠభాగమునకుగాని [9]కొరుకుడుపుండు ఉండినప్పుడు దుర్వాసనకొట్టునటు వంటి రక్తము విసర్జింపబడును.

[1] Meningitis. [2] Brain tumor. [3] Pyloric stenosis. [4] Regurgitation. [5] Empyema. [6] Bronchiectasis. [7] Gangrene. [8] Cervix or Uterus. [9] Carcinoma.



ఋతు స్రావము

దీని లక్షణము, పరిమాణము, క్రమము గమనించవలెను. రంగు లోను వాసనలోను మామూలుగానున్నదా, కొద్దిగా నగుచున్నదా, లేక విస్తారముగా నగుచున్నదా; నల్లగానున్నదా, లేక పాండువర్ణముగానున్నదా; దీనిలో నేవైన రక్తపు కుదపలు (గడ్డలు) లేక పొరల ముక్కలు ఉన్నవా యనియు గమనించవలెను. రోగి యీ కాలములో నొప్పి యున్నదని చెప్పినయెడల, ఆ నొప్పిగల స్థలము, కాలము గమనించవలెను.

మలము

సాధారణమైన మలము, రోగి పసిబిడ్డయా, చిన్నపిల్లయా, పెద్దదా యను దానినిబట్టియు, వారికిచ్చు ఆహారమునుబట్టియు, వారి యారోగ్య స్థితినిబట్టియు మారుచుండును. ద్రవాహారమువలన మలము పలుచ గను, గట్టియాహారమువలన మలము గట్టిగనగును. మాంసకృత్తులు విస్తారముగానున్న భోజనము తినుటవలన మలము దుర్వాసనకొట్టును; చెమ్మలేకయుండును. పాలుత్రాగుటవలన మలము గట్టిగను, కొంచెము తెల్లగనుండును. ఇనుము, బిస్మత్ వలన, మలము మట్టిరంగుగలిగి నల్లగా నుండును. విరేచనకాలమందు నొప్పియుండినయెడల, సాధారణముగా మలలవ్యాధియున్నదని గ్రహించవలెను. మలమునందు ఈ క్రింది విషయములను గమనించవలెను:—దాని చిక్కదనము, అది మెత్తగానున్నదా? దానికి ఆకారమున్నదా? మలబద్ధకము గలిగియున్నదా? లేక ద్రవరూపముననున్నదా? పులుసు లేక దుర్వాసన కొట్టుచున్నదా? దినమునకు ఎన్ని విరేచనములైనవి? రంగు—పసుపుపచ్చగా నున్నదా? గోదుమ వర్ణముగా నున్నదా? బూడిదరంగుగా నున్నదా? నలుపుగగాని, ఆకుపచ్చ రంగుగ గాని యున్నదా? బంక, రక్తము, జీర్ణముకాని ఆహారము, పురుగులు మొదలైన ఇతరపదార్థము లేవైన యున్నవా? యను విషయములు గమనించవలెను. మలమునందు సాధారణముగా, ఏటిక పాములు, నట్టలు, కొంకిపురుగులు, నులిపురుగులు నుండును. వాయువు విడుచుటనుగూడ గమనించవలెను.

విపరీత విషయములు:—రంగు విపరీతముగా మారుచుండవచ్చును. బంకమట్టి రంగుగల మలములో పైత్యరసములేదని గురుతు. దానివలన మలమునకు సాధారణముగా గోదుమవర్ణము కలుగును. మలము ఆకు

పచ్చగా నున్నప్పుడు జీర్ణశక్తి క్రమము తప్పినదని గ్రహించవచ్చును. కాని [1]క్యాలమల్ అను మందు పుచ్చుకొనుటవలనకూడ విరేచనము ఆకు పచ్చగా నుండవచ్చును. మలములో రక్తముండవచ్చును. ఈ రక్తము ఆసనమునుండి పడినయెడల మంచి యెరుపురంగు గలిగియుండును. ప్రేగు నుండి పడినయెడల, మలముయొక్క రంగు నలుపు, ఎరుపుగగాని, [2]చ్యాకొలెట్ రంగుగగాని యుండును. పై ప్రేగు లేక కడుపుపై చివరనుండి, అనగా ముందటి కంటెపైనుండి పడినయెడల, మలము నల్లగను తారువలెను నుండును. గంజినీళ్లవంటి విరేచనము కలరా వ్యాధికి సూచన. మలములో రక్తము, బంక పడినప్పుడు, [3]కొలైటిస్ అను ప్రేగుల వ్యాధినిగాని, రక్త విరేచనమునుగాని సూచించును. కేవలము రక్తమే యుండినయెడల, కొరుకుడుపుండున్నదని గ్రహించవలెను. టైఫాయిడ్ అను సన్ని పాతజ్వరము వచ్చినప్పుడు, మలము పసుపు పచ్చగాను, పలుచగాను పప్పు చారును బోలియుండును. పెద్ద, పలుచని, నురుగుగట్టి, దుర్వాసన గలిగిన విరేచనములు, ముఖ్యముగా ప్రొద్దుననే యిట్టివి అయినయెడల, జీర్ణావయవముల సంబంధమైన [4]స్ప్రూ అను వ్యాధి యుండవచ్చును.

క్రొత్తగాపుట్టిన బిడ్డయొక్క మలము కొంచెము నలుపు ఎరుపు కలిసి గోదుమరంగుగలిగి బంకవంటి ద్రవముగనుండును. ఇట్టిదానిని [5]మెకోనియం అందురు. బిడ్డ, తల్లిపాలు త్రాగుచుండగ విరేచనము పసుపురంగు, లేక ఆరంజిరంగుగ నుండును. మరియు అది పలుచగను, మెత్తగను ఉండును. ఆరునెలల వయసప్పుడు బిడ్డ విరేచనము కొంచెము రంగుమారి గోదుమవర్ణము కలిగియుండును. అది మెత్తగాను ఇంక సరిగ ఏర్పడకను ఉండును.

## మూత్రము

సాధారణమైన మూత్రము తేటగాను కొంచెము పసుపు పచ్చగాను ఉండును. దీని రియాక్షన్ కొంచెము [6]ఆసిడ్‌గనుండును. [7]స్పెసిఫిక్ గ్రావిటి 1010 నుండి 1020 వరకు మారుచుండును. ఒక గ్లాసులో తీసియుంచబడిన కొంచెము మాదిరి మూత్రమునందు మబ్బువంటి మ్యూకస్ అను ద్రవపదా

[1] Calomel. [2] Chocolate. [3] Colitis or dysentery. [4] Sprue. [5] Meconium. [6] Acid reaction. [7] Specific gravity.



ర్థము గ్లాసుమధ్య తేలియుండుట చూడగలము. ఒక పెద్దవాడు 24 గంటలలో సరాసరి 40—60 ఔన్సులు, ఒక చిన్నబిడ్డ షుమారు 6 ఔన్సులు మూత్రము విసర్జించును. మూత్రములో నీరు, [1]యూరియ, (మూత్రిక) [2]యూరిక్ ఆసిడ్ (మూత్రరసము) లవణములు కలిసియుండును.

ఆరోగ్యముగానున్నప్పుడు మూత్రములోని మార్పులు:—ఒకడు ఆరోగ్యముగానున్నప్పుడును, అతడు పుచ్చుకొను ద్రవపదార్థమును తగ్గించినయెడలను, దేహాభ్యాసమువలనను, వేడిగాలివలనను, చెమట విస్తారముగ పోయుటనుబట్టియు, మూత్రపుకొలత తగ్గియుండును. అనగా మూత్రము కొద్దిగ విసర్జించబడును. మూత్రపుకొలత చాల తగ్గినప్పుడు రంగు అధికమైయుండును. దాని స్పెసిఫిక్ గ్రావిటి హెచ్చుగనుండవచ్చును. చల్లారినతర్వాత కొన్ని యూరేట్స్ క్రిందికి తేరియుండవచ్చును. శీతకాలములో చర్మమునకు చురుకైన పనిలేనప్పుడును, భయము, నరముల తొందర కలిగినప్పుడును, దేహాభ్యాసము కొద్దిగ చేసినప్పుడును, ఎక్కువ ద్రవపదార్థమును లోనికి పుచ్చుకొన్నప్పుడును మూత్రపుకొలత హెచ్చును. ఈ పరిస్థితులలో మూత్రముయొక్క రంగు తెల్లబారియుండును, స్పెసిఫిక్ గ్రావిటి తగ్గియుండును. [3]పిండి పదార్థములు విరివిగ కలిసియున్న ఆహారము భుజించినతరువాత వచ్చెడు మూత్రము [4]ఆల్కలైనుగ నుండవచ్చును.

వ్యాధినిబట్టి మూత్రము విడుచుట:—జ్వరసంబంధమైన స్థితులయందును, గుండె వ్యాధులలోను, తీక్షణమైన [5]మూత్రపిండ రోగములందును దీర్ఘకాలముగనున్న మూత్రపిండముల వ్యాధి ఆఖరి దశలయందును, నల్లమందు, [6]ఎర్గటు, అను మందుల నిచ్చినప్పుడును మూత్రము తగ్గును. దేహము నుండి ద్రవముపోవు స్థితులయందుకూడ అనగా, రక్తస్రావమందును, వమనము, అతిసారమందును, విషముగలిగిన అనేక స్థితులయందును వాపుండినప్పుడును మూత్రము తగ్గును. అతి మూత్రమందును, నరముల పని సంబంధమైన కొన్ని పరిస్థితులలోను, దీర్ఘకాలముగనున్న కొన్ని మూత్రపిండముల వ్యాధులందును, పొటాసియం సిట్రేట్, డిజిటాలిస్ మొదలగు మందు లిచ్చినతరువాతను మూత్ర మెక్కువగును. మూత్రములో రక్తము, చీము, బంక, [7]ఫాస్ఫేట్స్‌గాని, యూరేట్స్‌గాని యుండి

[1] Urea. [2] Uric acid. [3] Carbohydrates. [4] Alkaline. [5] Chronic nephritis. [6] Ergot, [7] Phosphates and urates.

సప్పుడు అది మబ్బుగానుండును. వేడిచేయుటవలన యూరేట్స్‌ను, ఆసిడ్ కలుపుటవలన ఫాస్ఫేట్స్‌ను కరిగింపవచ్చును.

మూత్ర మెక్కువైనప్పుడు దానిలోని [1]స్పెసిఫిక్ గ్రావిటి తగ్గును. మూత్రము తగ్గినప్పుడు స్పెసిఫిక్ గ్రావిటి హెచ్చును. ఇదియొక సామాన్య సూత్రము. [2]డయబెటీస్ మెలైటస్ అను వ్యాధిలో మూత్రము హెచ్చుగ నుండినను చక్కెర అధికముగానుండుటచేత, మూత్రముయొక్క స్పెసిఫిక్ గ్రావిటియు హెచ్చుగనుండును. రోగి విసర్జించిన మూత్రముయొక్క పరిమాణము, మూత్రము తేటగానున్నదా, లేక మడ్డి కలిసియున్నదా, దాని రంగు, వాసన యెట్లున్నది, ఎన్నిసారులు విసర్జించినది నర్సు ఎల్లప్పుడు గమనించుచుండవలెను. ఇంకా యేదైన విపరీతలక్షణము అనగా, నొప్పి, మూత్రము నాపుకొనలేకపోవుట, మూత్రము నాపుకొనుట, మూత్రము నణచుకొనుట మొదలగు లక్షణములను గమనించవలెను.

**[3]పరిశోధనకొరకు మాదురులను సమకూర్చుట**

ఇట్టి మాదురులను చేర్చునప్పుడు, వానినుంచు పాత్రలు పరిశుభ్రముగానుండునట్లు నర్సు జాగ్రత్త తీసికొనవలెను. ఒక్కొక్క మాదిరిమీద, దానిని పట్టిన తేదీని, రోగియొక్క పూర్తిపేరును, పడక సంఖ్యను, వార్డు పేరును తప్పులేకుండ సరిగా వ్రాసిపెట్టవలెను. మూత్రముయొక్క మాదురులను ప్రోగుచేయుట ప్రతి ఉదయమున చేయవలసిన మొదటి పనియై యున్నది. సూక్ష్మజీవులు చేరకుండ మూత్రము మాదిరిని చేర్చిపెట్టుటకు, దానిని [4]క్యాథిటరుతో తీయవలెను. దానిని [5]పొంగించిన పాత్రలో పట్టి, పొంగించిన మూతవేసి యుంచవలెను. 24 గంటలకాలపు మూత్రము యొక్క మాదిరి కావలసియుండినయెడల, రోగి పోయు మూత్రమునంతయు ఒక పాత్రలోచేర్చి, మూతపెట్టి, దినమంతయు మొత్తముగా చేర్చియుంచిన దానిలోనుండి కొంత మాదిరికొరకు తీసిపెట్టవలెను. 24 గంటల కాలము ఎక్కువ తక్కువ కాకుండ మూత్రమును చేర్చియుంచుటకు జాగ్రత్త తీసికొనవలెను. ఈ పని తప్పులేకుండ చేయుటకు ఈ క్రింది రీతిగా చేయవచ్చును:—ఉదయముననే 6 గంటలకు రోగిని మూత్రము పోయించి పారబోయుము. అప్పటినుండి రోగి విసర్జించు మూత్ర

[1] Specific gravity. [2] Diabetes mellitus. [3] Collection of specimens. [4] Catheter. [5] Sterile vessel.



మును చేర్చి, కొలిచి పెట్టుచుండుము. తిరిగి మరుసటి ఉదయము 6 గంటలకు మూత్రపాత్రనిచ్చి రోగి మూత్రమును చేర్చి, యింతకు ముందు పాత్రలో చేర్చియుంచిన దానితో దీనిని కలుపుము. ఇట్లు చేర్చిన మొత్తమునుండి, కొంతమూత్రము మాదిరికొరకు తీసిపెట్టుము. ఇట్లు చేసినయెడల 24 గంటలలో మూత్రపిండమునుండి స్రవించు మూత్రము మాదిరి తప్పులేక సరిగానుండును. పరీక్షకొరకు మాదురులు చేర్చి పెట్టుచుండగా, చేర్చిపెట్టు పాత్రలలో అనగా, పడకచేట్లలోగాని, ఉమ్మిపాత్రలలోగాని డిస్‌యిన్‌ఫెక్టెంటు మందు ఉండకుండునట్లు నర్సు జాగ్రత్తగా గమనించవలెను. [1]అమీబిక్ రక్త విరేచనములో సూక్ష్మజీవులున్నట్లు అనుమానమున్నయెడల, ఆ మలమును చేర్చినవెంటనే పరీక్షకొరకు పంపవలెను. ఆ మలము వేడిగానుండునట్లు దానిని పెట్టవలెను. [2]కళ్లె మాదురులను ఉదయముననే మొదటిపనిగా తీయవలెను. కళ్లెయొక్క మాదిరిలో రోగి నోటినుండి యెక్కువ ఉమ్మి పడకుండ చూచుట చాల ముఖ్యమైన సంగతియని గ్రహించవలెను. వైద్యుడు చేయు ఏ పనియందైనను, ఏ ఆపరేషను నందైనను చేర్చిపెట్టిన మాదురులను వాని వివరములతో జాగ్రత్తగా వ్రాసి, పరీక్షకొరకు ఎత్తి పెట్టవలెను.

**పసిబిడ్డల మూత్రముల మాదురులు సమకూర్చుట:**— చంటిబిడ్డల మూత్రము మాదురులను సమకూర్చుటకు బిడ్డకు కట్టిన గుడ్డలో శుభ్రమైన పెద్ద దూదిముద్ద నొకదానిని పెట్టవలెను. బిడ్డ మూత్రము పోసిన తరువాత, దూదిని తీసివేసి, శుభ్రమైనట్టియు, పొడరుకొట్టినట్టియు [3]చేతితిత్తినివేసికొని శుభ్రమైన మాదిరి బుడ్డిలో ఆ దూదిని పిండి, మూత్రము తీయవలెను.

మగబిడ్డ యైనయెడల ఒక గాజుగొట్టము నుపయోగించి తీయవలెను. పురుషాంగమును ఈ గొట్టములో దూర్చి యా గొట్టమును సరియైన స్థలమందుంచి [4]అడ్‌హిసివ్ ప్లాస్టరు నంటించినసరే, లేదా గాజుగొట్టముచుట్టు బ్యాండేజిని చుట్టి బిడ్డమొలకు చుట్టి కట్టవలెను.

**మూత్రమును పరీక్షించుట**

ఈ క్రింది వస్తువులు ఉన్నవా లేవా యని తెలిసికొనుటకు మూత్రమును పరీక్షించవలెను:—ఆల్బ్యుమెన్ (శ్వేతధాతువు), చక్కెర, రక్తము,

[1] Amebic dysentery. [2] Sputum. [3] Glove. [4] Adhesive tape.

చీము, పిత్తము, శిరకామ్లము (అసిటోన్ ఆసిడ్) ద్వ్యామ్లము (డైయాసిటిక్ ఆసిడ్). దీర్ఘపరీక్షలు [1]పరిశోధనాలయములో జరుగును. పరీక్షకు ముందు ఏ మాదిరి మూత్రమునైనను కదిలించకూడదు.

[2]రియాక్షన్:–లిట్మసు కాగితము నుపయోగించుటద్వారా యీ పని చేయవచ్చును. మూత్రములో ఆసిడ్ ఉండినయెడల, ఊదా రంగు కాగితము ఎఱ్ఱగనగును; అట్లుకాక, మూత్రములో ఆల్కలైన్ యను పదార్థముండినయెడల, ఎఱ్ఱనికాగితము ఊదారంగుగా మారును. సిస్టైటిస్ వ్యాధియందును, సిట్రేట్ మొదలైన మందులు పుచ్చుకొనిన తరువాతను, గాలికి తెరచియుంచినను రియాక్షను ఆల్కలైన్‌గ నుండును. ఆల్కాలైన్‌గా నుండినట్లయిన, దానిని పరీక్షించక ముందు, దానిలో కొన్ని బొట్లు [3]డైల్యూట్ అసీటిక్ ఆసిడ్ కలిపి, ఆసిడ్‌గా మార్చవలెను.

స్పెసిఫిక్ గ్రావిటి:–దీనిని [4]మూత్రమాని యను ప్రత్యేకసాధనముతో కొలిచెదరు. ఈ సాధనము మూత్రపాత్ర అంచులకు తగలకుండ మూత్రము మధ్య తేలి నిలుచునట్లు జాగ్రత్తగా చూడవలెను. మూత్రపు పైభాగముయొక్క మట్టమునకు సమానముగా కంటినుంచి సంఖ్యను చదువుము.

ఆల్బ్యుమెన్

(*a*) **పొంగించి పరీక్షించుట:**–మూత్రమును పరీక్షించకముందు వడియ గట్టవలెను. ఒక గాజుగొట్టమును పైనుండి ఒక అంగుళమువరకు వదలి మిగతభాగమును మూత్రముతో నింపుము. పైభాగమును ఒక స్పిరిట్ దీపముతో పొంగించుము. పొంగించుటవలన, ఏదైన మసక ఏర్పడిన దేమో గమనించుము. మసక కనబడినయెడల, అది ఆల్బ్యుమెన్‌గగాని, ఫాస్‌ఫేట్సుగగాని యుండవచ్చును. దానిలో కొన్ని బొట్లు డైల్యూట్ అసెటిక్ ఆసిడ్ కలుపుము. మసక కనబడకపోయిన నది ఫాస్‌ఫేట్సు; మసకగనుండిన నది ఆల్బ్యుమెన్ అని గ్రహించవలెను.

(*b*) [5]**నైట్రిక్ ఆసిడ్ పరీక్ష:**–ఒక శుభ్రమైన గాజు గొట్టములో కొంచెము నైట్రిక్ ఆసిడ్ పోయుము. అంతే కొలతగల మూత్రము, గాజు గొట్టము అంచున బొట్లు బొట్లు నిలకడగా జారిపడునట్లు చేయుము.

[1] Laboratory. [2] Reaction. [3] Dilute acetic acid. [4] Urinometer, [5] Nitric Acid Test.



మూత్రములో ఆల్బ్యుమెన్ ఉండినట్లయిన, ఈ రెండు ద్రవములు కలియు చోట, తెల్లని వలయమేర్పడును.

చెక్కర

(*a*) [1]**ఫెలింగ్స్ పరీక్ష:**–ఒక గాజు గొట్టములో కొంచెము ఫెలింగు సొల్యూషనుపోసి పొంగించుము. పిమ్మట దానికి సరిసమానమగు మూత్రమును కలిపి తిరిగి పొంగించుము. అడుగున ఆరంజి యెరుపు రంగు ఏర్పడిన, చక్కెరయున్నదని నిశ్చయమగును. ఫెలింగ్స్ సొల్యూషనును, మూత్రమును వేరువేరు గొట్టములలో పొంగించి, మూత్రమును బొట్లు బొట్లుగ ఫెలింగ్స్ సొల్యూషనులో విడువవచ్చును.

(*b*) [2]**బెనిడిక్ట్స్ పరీక్ష:**–5 CC. ల బెనిడిక్ట్స్ సొల్యూషనును ఒక గాజు గొట్టములోపోసి దానితో 8 బొట్లు మూత్రమునుచేర్చి రెండు నిమిషములు పొంగించుము. పిమ్మట కొన్ని నిమిషములు గాజుగొట్టమును కదలకుండ యుంచుటవలన దానిలో ఎంత చెక్కెరయున్నది కనుగొనవచ్చును. ఆకుపచ్చని ద్రవము మడ్డిలేకుండ కనబడినయెడల దానిలో 0·1% చెక్కెర యున్నదనియు కొంచెము పసుపుపచ్చని మడ్డితేరి, పైన ఆకుపచ్చని ద్రవము కనబడినయెడల దానిలో 0·2% చెక్కెర యున్నదనియు ఆరంజి రంగుగల మడ్డితేరి, రంగులేని ద్రవముపైన కనబడినయెడల దానిలో 2% కంటె ఎక్కువ చెక్కెరయున్నదనియు రుజువగును.

రక్తము:–ఒక గాజు గొట్టములో ఒక అంగుళమువరకు మూత్రము పోసి, దానిని పొంగించి చల్లార్చుము. దానిలో సగము అంగుళమువరకు [3]గ్లేషియల్ అసీటిక్ ఆసిడ్‌ను కలుపుము. ఒక అంగుళమువరకు [4]ఈతర్‌ను పోసి పలుమారులు గొట్టమును తలక్రిందులు త్రిప్పుము. మరియొక గాజు గొట్టములో ½ CC. ల [5]టింక్చర్ గ్వాయకమ్‌ను, ⅔ CC. ల [6]ఒజోనిక్ ఈతర్‌ను పోయుము. ఒక [7]పిప్పెటుతో మొదటి గొట్టములోని మిశ్రమ ద్రవమును కొంచెము తీసికొని రెండవ దానిలో కలుపుము. రక్తమున్న యెడల ఊదారంగు కనబడును.

పిత్తము

(*a*) ఒక గొట్టమునిండ మూత్రమును నింపి బలముగా విదిలించుము. దానిలో పిత్తముండినయెడల పసుపు పచ్చని నురుగుకట్టును.

[1] Fehling's Test. [2] Benedict's Test. [3] Glacial acetic acid. [4] Ether. [5] Tincture of Guaiacum. [6] Ozonic ether. [7] Pipette.

(*b*) ఒక పిప్పెట్‌తో కొన్నిబొట్లు మూత్రమును ఒక తెల్లని పింగాణి గిన్నెమీద వేయుము. దానిప్రక్కలో కొన్నిచుక్కలు ఘాటైన నైట్రిక్ ఆసిడ్ వేయుము. ఈ రెండు ద్రవములు కలిసి పారునప్పుడు రంగులు రంగులు కనబడును. మూత్రములో పిత్తముండినయెడల ఆ రంగులలో ఆకుపచ్చ ఒకటిగనుండును.

**చీము**:–మూత్రము పోసిన స్పెసిమెన్ గ్లాసు అడుగున తేరిన మడ్డినుండి ఒక అంగుళమువరకు ఒక పిప్పెటులోనికి తీసికొని గాజుగొట్టములో నుంచుము. దీనికి సమానమైన [1]లైక్వార్ పొట్యాసె ఈ మడ్డితో చేర్చుము. దానిలో చీము కలిసియున్నయెడల త్రాడువంటి జిగట పదార్థము ఏర్పడును.

**[2]డైయసిటిక్ ఆసిడ్ (ద్వ్యమ్లము)**

ఒక గొట్టములో ఒక అంగుళము మూత్రముపట్టి, దానిలో 10% ఘాటుగల ఫెరిక్‌క్లోరైడ్ (లోహికహరిదము) కొన్ని బొట్లు విడువుము. మిశ్రమములో డైయసిటిక్ ఆసిడ్ ఉండినయెడల, దాని రంగు ద్రాక్షసారాయి (పోర్టువైన్) వలె ఎఱ్ఱగ నుండును.

**[3]అసిటోన్ (శిరకామ్లము)**: — ఒక గొట్టములో ఒక అంగుళము మూత్రము పట్టి, దానిలో సమానపరిమాణముగల అమ్మోనియం సల్ఫేట్ క్రిస్టల్స్ (క్షారినవాయు గంధకిత పలుకులు) వేసి, బాగుగ కుదిలించుము. దీనిలో 5% ఘాటుగల సోడియం నైట్రోప్రుసైడ్ సొల్యూషను మూడు బొట్లును, ఘాటైన అమ్మోనియా కొన్ని బొట్లును కలుపుము. మిశ్రమములో అసిటోనిక్ పదార్థములున్నయెడల, అది పర్మాంగనేట్ (పరిమాంగనితము) రంగుగా నుండును.

**[4]మూత్రపుమడ్డి**:- దీనిలో యూరేట్స్, ఫాస్‌ఫేట్స్, యూరిక్ ఆసిడ్, బంక (మ్యూకస్,) రక్తాణువులు, చీముయొక్క అణువులు చేరియుండవచ్చును. ఈ పదార్థములు ఒకొక్కదానిని సరిగ తెలిసికొనుటకు మూత్రపుమడ్డిని సూక్ష్మదర్శిని (భూతదర్పణము) క్రింద పరీక్షించవలెను.

[1] Liquor potassae. [2] Diacetic acid. [3] Acetone.
[4] The Deposit.



**రక్త పరీక్ష**

అనేక రోగనిర్ణయములకు రక్తపరీక్ష ప్రాముఖ్యమైనది. రక్తము కొద్దిగా కావలసివచ్చినప్పుడు సాధారణముగా [1]వ్రేలికొననుగాని, [2]చెవి తమ్మెనుగాని గ్రుచ్చి తీసెదరు. ఎక్కువ రక్తము కావలసివచ్చినప్పుడు, దానిని ఒక రక్త నాళమునుండి సూది, పిచికారు (సిరింజి) లతో తీయుదురు. సూది పొడిచెడుభాగమును, సూదినికూడ స్పిరిట్ (మద్యార్కము)తో గాని, ఆల్కహాల్ (మద్యసారము)తో గాని బాగుగతుడిచి నిర్మలముచేయవలెను. కొన్నిసారులు నర్సే బ్లడ్ స్మియర్ (రక్తపు పూత) తీయవలసివచ్చును. దీనిని తప్పులేకుండచేయుటకు ఒక రక్తపు బొట్టును [3]స్లైడ్ (గాజుపలక) యొక్క అంచునవేయవలెను. రెండవస్లైడును 45° కోణములో పట్టుకొని మెల్లగ మొదటిదానిమీదికి నెట్టవలెను. రెండవ స్లైడును మొదటిదానిమీద గట్టిగ ఈడ్చి లాగినయెడల రక్తాణువులు (రక్తపు కణములు) విరిగిపోవును.

**[4]సూక్ష్మజీవులను పెంచి వృద్ధిచేయుట**

సూక్ష్మజీవులను పెంచి వృద్ధిచేయుటలో నర్సు సహాయపడవచ్చును. ప్రత్యేకమైన సూక్ష్మజీవులను పెంచుటకు వానికి తగిన అనుకూలపదార్థమును ఉపయోగించుటవలన దీనిని చేయుదురు. ఈ అనుకూలపదార్థములు (మీడియమ్) [5]ఆగర్, బొవ్రిల్ మొదలగునవి. ఈ పనికి ఉపయోగించు గొట్టమును, మీడియమ్ అను అనుకూలపదార్థమును నిర్మలముగ నుండవలెను. సిద్ధముచేయవలసిన కల్చరు (సూక్ష్మజీవులను పెంచు పదార్థము)ను మీడియముమీద వేసి రంధ్రములు పడకుండ జాగ్రత్తగ పూయవలెను. దీనిని ఇప్పుడు 24 గంటలకాలము [6]ఇంక్యుబేటరులోనుంచి పెరుగనీయవలెను. వృద్ధియైన సూక్ష్మజీవుల సమూహములను భూతదర్పణముక్రింద పరీక్షించవలెను. ఇందుకు ఉదాహరణము సన్నిపాత జ్వరమును గలుగజేయు సూక్ష్మజీవులు. ఇవి 42° C. క్రిందగల ఉష్ణోగ్రతయందు బాగుగపెరిగి వృద్ధియగును.

[1] Ball of the finger. [2] Lobe of the ear. [3] Slide.
[4] Cultures. [5] Agar, Bovril, etc. [6] Incubator.

హిమొగ్లోబిన్ (రక్తగోళకము)

రక్తహీనత యెంతయున్నదో కనుగొనుటకు రక్తమును మరియొక రీతిగా పరీక్షచేయుదురు. రోగి రక్తమునందు [1]హిమొగ్లోబిను (రక్తగోళకమును) సరాసరి ఆరోగ్యవంతుని రక్తమందున్న హిమొగ్లోబినుతో సరిపోల్చెదరు. ఒక రక్తపుబొట్టును దీసి ఫిల్టరు కాగితముమీదవేసి, [2]టాల్క్విస్టు హిమొగ్లోబిను స్కేలుతో సరిపోల్చి చూచెదరు. [3]సాలిస్ పరీక్ష—ఇది నూతనమైనదియు మిక్కిలి ఖచ్చితమైనది (తప్పులేనిది) యునైయున్నది. దీనిలో తీసిన రక్తపుచుక్కను స్టాండర్డ్ సొల్యూషనుతో స్పష్టముగా సరిపోల్చి చూచెదరు.

ఎఱ్ఱకణములు ([4]ఎరిత్రోసైట్ కౌంట్):—పురుషులలో ప్రతిక్యూబిక్ మిలిమ్సురక్తమునకు సగటున 5,000,000 ను, స్త్రీలలో సగటున 4,500,000 ను ఉండుట మంచిది. కాని రక్తహీనత, [5]ల్యుకిమియ అను పాండురోగమున్నప్పుడు ఎఱ్ఱకణముల సంఖ్య తగ్గిపోవును.

తెల్లకణములు ([6]ల్యుకోసైట్ కౌంట్):—వీని సంఖ్య అనేక వ్యాధులందు ప్రాముఖ్యమైనవిషయముగ గణింపబడును. సాధారణస్థితిలో నిది యొక క్యూబిక్ మిలిమురక్తములో 5000—10,000 కణములవరకు భేదించుచుండును. తెల్లని కణములు హెచ్చియున్న స్థితికి [7]ల్యుకొసైటోసిస్ అని పేరు. దీనినిబట్టి వాపున్నదని గ్రహించనగును. ఈ వాపును దేహమెంతగా నెదిరించునో, తెల్లని కణముల సంఖ్య అంతగా హెచ్చును.

శస్త్రమునకు ముందు రక్తము గడ్డకట్టుకాలము కొంత అవసరమైయుండును. సాధారణస్థితిలో 2—8 నిమిషములలో రక్తము గడ్డకట్టును. కాలేయము, పిత్తాశయములకు సంభవించు వ్యాధులందును, ల్యుకిమియ, [8]హెమొఫిలియ అను వ్యాధులందును రక్తము గడ్డకట్టుకాలము అధికముగా హెచ్చును. అనగా, ఎక్కువకాలమునకు రక్తము గడ్డకట్టును. ఇందువలన శస్త్రము చేయుచుండగా, ఎక్కువ రక్తము కారిపోవచ్చును. ఈ స్థితిలో రక్తము గడ్డకట్టుకాలము తగ్గించుటకు, అనగా, రక్తము త్వరగా గడ్డకట్టుటకుగాను కాల్షియం, విటమిన్ K అను వాని నిచ్చెదరు.

[1] Hemoglobin. [2] Tallquist hemoglobin scale.
[3] Sahli's test. [4] Erythrocite count. [5] Leukemias.
[6] Leucocyte count. [7] Leucocytosis. [8] Hemophilia.



రక్తమును తేర్చెడు పరీక్ష:—ఒక అంటుయొక్క తీవ్రత యెంతవరకున్నదో కనుగొనుటకు రక్తమును తేర్చి పరీక్షించుదురు. తెల్లని కణముల సంఖ్యనుబట్టి చేయు పరీక్షకంటె, ఈ తేర్చెడు పరీక్షమూలమున అంటును నిర్దుష్టముగ కనుగొనవచ్చునని తలంచుచున్నారు. ఈ పరీక్షలో కణములు ఏదో ఒక మట్టమునకు దిగి, తేరుకొనుకాలమును సాధారణస్థితియందు రక్తము తేరుకొను కాలమునకు సరిపోల్చి చూచెదరు. ఎంత త్వరగా రక్తము తేరుకొనునో, అంటు అంత తీవ్రముగనున్నదని గ్రహింపనగును.

[1]కొరుకుడు రోగమును నిర్ణయించుటకు [2]వాసర్‌మెన్, కాన్ పరీక్షలు చేయుదురు. ఒక వైద్యుడుగాని లెబారటరి (పరిశోధనాలయ) టెక్నిషియన్‌గాని పరీక్షించు నిమిత్తము 5 CC. ల రక్తమును ఒక రక్తనాళమునుండి తీయుదురు.

## అధ్యాయము 7

# ఎనీమాలు, సప్పొజిటరీలు, రెక్టల్ ట్యూబ్

### ఎనీమాలు

ఎనీమా అనగా, ద్రవమును క్రింది ప్రేగులోనికి ఎక్కించుట. ఈ ఎనీమాలను రెండు పెద్ద తరగతులుగా విభాగించియున్నారు.

I. మొదటి రకమునందు ఎక్కించిన ద్రవము తిరిగి బయటి వచ్చును.

ఇట్టి ఎనీమాలను ఈ క్రిందిపనులకు ఇచ్చెదరు. (a) పురీషనాళమును శుభ్రముచేయుటకు (b) అపానవాయువు విడిపించుటకు (c) మూత్రము బంధించియున్నప్పుడు మూత్రకోశపు కండరములకు చురుకుపుట్టించుటకు.

II. రెండవ రకమునందు ఎనీమాద్వారా యెక్కించిన ద్రవము లోపలనే ఇమిడియుండును.

వానిని (a) [3]పోషణ కలిగించుటకు (b) [4]ద్రవము లిచ్చుటకు (c) [5]మందుల నెక్కించుట కిచ్చెదరు.

[1] Syphilis. [2] Wasserman and Kahn tests.
[3] Nutrition. [4] Fluids. [5] Medication.

### సామాన్య విధులు

నర్సు అవసరమైన వస్తువులన్నిటిని సిద్ధముచేసికొని రోగి పడక యొక్క కుడివైపున ఒక బల్లమీద వానిని తయారుగానుంచవలెను; పడక చేట్టి మూతవేసి, దానిని పడకప్రక్కన ఒక స్టూలుపై నుంచవలెను.

ఎక్కించిన ద్రవము తిరిగి బయటికి రావలసిన ఎనీమాను ఈ క్రింది మూడువిధములైన పరికరములలో దేనితోనైన నియ్యవచ్చును.

(1) నాజిల్, రబ్బరుగొట్టము, ఇరిగేటింగ్ క్యాన్ (పిచికారు డబ్బా).

(2) రబ్బరు క్యాథిటర్, రబ్బరుగొట్టము, ఫనలు.

(3) [1]హిగిన్సన్ సిరింజి—దీనికి తగిలించుటకు చిన్నరబ్బరు గొట్టము గాని, [2]రెక్టల్ క్యాథిటర్ గాని వాడుదురు.

హిగిన్సన్ సిరింజిని ఉపయోగించునప్పుడు లోపలికి యెక్కించు ద్రవము వీలైనంతవరకు ఒకేరీతిగా పోవునట్లు జాగ్రత్తగా చూడవలెను. దీనిని నిదానముగాను, తటాలున లాగినట్టు పోటులేకుండ నియ్యవలెను. లేనియెడల రోగికి చాలనొప్పి, అసౌఖ్యము కలుగును.

హిగిన్సన్ సిరింజిముక్కును లోపలపెట్టకముందు, దానిలోని గాలిని బయటికి తీసివేయుటకుగాను, సిరింజిని మొదట ద్రవముతోనింపి, దాని రెండు కొనలను నీటిలోముంచి, బల్బును పెక్కుసారులు ఒత్తవలెను. ముక్కును లోపలపెట్టినతరువాత ద్రవము నిదానముగాను నిలకడగా నెక్కించవలెను.

సిరింజి లేక రబ్బరుగొట్టము సరిగ పనిచేయుచున్నది లేనిది తెలిసికొనుటకు ఉడుకునీళ్లను చిమ్మవలెను. వేరువిధముగ నుండవలెనని యుత్తరువైననే తప్ప, లోపలికెక్కించు ద్రవము సరియైన ఉష్ణోగ్రత 98°—100° F. నుండవలెను. గాలిని లోపలికి ఎక్కించకుండ నర్సు జాగ్రత్త తీసికొనవలెను. గాలిలోపలికి పోవుటవలన రోగికి బాధకలుగును. కావలసినంత మాత్రమే లూబ్రికెంటును వ్యాజిలీనును ఒక చిన్నగుడ్డమీదగాని, కాగితముమీదగాని ఉంచవలెను. వీలైనంతవరకు రోగి దేహమును కప్పియుంచవలెను. మరుగుగనుండునట్లు పరదాలను వేయవలెను. పురీషనాళము ఖాళీచేయుటకు ఎనీమా నిచ్చునప్పుడు రోగిని లెఫ్ట్ ల్యాటరల్ పొజిషను (ఎడమప్రక్కకు ఒదిగియుండు తీరు)లో నుంచి యిచ్చెదరు.

[1] Higginson's syringe. [2] Rectal catheter.



అన్నిసమయములలో ఇట్లు చేయుటకు వీలుకాకపోవును. కాబట్టి రోగిని వీపుపైన వెల్లికిల పరుండనియ్యవచ్చును. లేక కుడిప్రక్కకు ఒదిగియుండు తీరునగాని, మోకాళ్లకు ఎదురొమ్ము నానించి కూర్చుండు తీరునగాని రోగి నుండనియ్యవచ్చును. చికిత్సచేయునప్పుడు రోగి శరీరము సళ్లుగ నుండునట్లు ఆమెను సాధ్యమైనంత సౌఖ్యముగ పరుండ నియ్యవలెను. రోగిక్రింద ఒక మాకిన్టాషు, డ్రాషీటు లేక ఒక తువాలు పరువవలెను. గొట్టమును పురీషనాళములోనికి దూర్చునప్పుడు నర్సు తన రెండుచేతుల నుపయోగించవలెను.

పురీషనాళ శుభ్రతనిమిత్తమైన ఎనీమా నిచ్చినప్పుడు ఎక్కించిన ద్రవమును 10—15 నిమిషములు బిగబట్టుకొనునట్లు రోగిని హెచ్చరించవలెను. భేదికి వచ్చుచున్నట్టుగ నున్నపుడు దానిని కొంచెముసేపు ఆపుటకుగాను రోగి ఆసనమును మడిచిన ఒక తువ్వాలుతో గట్టిగ అదిమి పట్టవచ్చును లేక రెండు పిరుదులను దగ్గరకు చేర్చిపట్టుకొనవచ్చును. ఎనీమా తిరిగి బైటికివచ్చునపుడు గాలి వచ్చుచున్నదా, వచ్చిన, ఎంత వచ్చుచున్నదని నర్సు గమనించవలెను. రోగి సొమ్మసిల్లినట్టుండినయెడల వేడి పానీయముల నియ్యవచ్చును.

### మొదటిరకము

(*a*) పురీషనాళమును ఖాళీచేయుట:–దీనికిగాను వట్టి వేడినీళ్ల ఎనీమాను, సబ్బుకలిపిగాని, సబ్బుకలుపకగాని వాడెదరు. (దీనిని [1]ఎనీమా సింప్లెక్స్ లేక ఎనీమా సపోనిస్ అందురు.) సబ్బంతయు పూర్తిగ కరుగునట్లు జాగ్రత్తగ కలుపవలెను. ఇందుకై 1—3 పైంట్లు ద్రవము అవసరమైయుండును. రెక్టల్ ట్యూబ్ లోపల పెట్టకముందు గొట్టమునకు నూనెపూసి, దానిలోని గాలి బయటికి పోవునట్లు దానినుండి కొంచెము నీళ్లు బయటికి కారనియ్యవలెను. క్యాన్గాని ఫనల్గాని రోగి మీద మూడడుగుల కంటె ఎక్కువ యెత్తకూడదు. ఎత్తినయెడల ద్రవము బలముగ ప్రవహించును. అందువలన ప్రేగు తటాలున ఉబ్బుట, రోగికి అధికబాధ కలుగుట, పోయిన ద్రవము వెంటనే తిరిగివచ్చుట సంభవించును. రోగి చిన్నబిడ్డయై యుండినయెడల, పిచికారుడబ్బాను 12—18 అంగుళముల యెత్తున మాత్రమే పెట్టవలెను.

[1] Enema simplex or enema saponis.

[1]హై ఎనీమా: — దీనియందు ప్రేగుయొక్క పై భాగములోనికి ద్రవము నెక్కించుదురు. మంచేము కాళ్లు ఎత్తిపెట్టి రెక్టల్‌ట్యూబ్‌ను 10—18 అంగుళములు లోపలికిపెట్టి ఎనీమా నిచ్చెదరు. ద్రవములోనికి పోనియెడల గొట్టమును కొంచెము దూరము బైటికి లాగవలెను. పైన వివరించిన సాధారణ ఎనీమాకు ½ నుండి 1 ఔన్సు వరకు ఆముదమునుగాని, ఒక ఔన్సు [2]సల్ఫేట్ ఆఫ్ మెగ్‌నీషియమునుగాని కలిపినయెడల ఎక్కువ ఫలితము కలుగును.

[3]ఆముదపు ఎనీమా:-2—4 ఔన్సులు ఆముదములో దీనికి రెండింతలు ఆలివ్‌నూనెగాని, నువ్వులనూనెగాని కలిపి తయారు చేయవలెను. ఒక గొట్టము, ఫనలు, పెద్ద క్యాథిటరుద్వారా దీని నియ్యవలెను.

[4]ఆలివ్‌నూనె ఎనీమా:-6—10 ఔన్సులు ఆలివ్ నూనెను వేడిచేసి, గొట్టము, ఫనలు, క్యాథిటరులతో ఎనీమా నియ్యవలెను. మలము ఆసనమునుండి మెత్తగా జారివచ్చుటకును, ఆసన శస్త్రచికిత్స చేయబడినప్పుడును ఆలివాయిలు ఎనీమా నిచ్చెదరు. కొన్నిసారులు పడకకాళ్లు ఎత్తి దిమ్మెల మీదపెట్టి, రోగి విరేచనము చేయుటకు పడకచట్టిని అడుగువరకు అట్లే యుంచెదరు. ఆలివ్‌నూనె ఎనీమానిచ్చి కొన్ని గంటలైన తరువాత సబ్బునీళ్ల ఎనీమా కొన్నిసార్లు ఇయ్యవలెనని ఉత్తరుకావచ్చును. నూనె సంబంధమైన ఎనీమాను ఇయ్యకముందు సామానులను వేడినీటిలో వేడి చేసి, వానిగుండ నూనె సాధ్యమైనంత సులభముగా పాఱునట్లు చేయవలెను. పనిమైనపిమ్మట సామానులను వేడి సబ్బునీళ్లలో కడుగవలెను. లేనియెడల లోపల నిలిచియున్న నూనె రబ్బరును చెడగొట్టవచ్చును.

[5]గ్లిసరీను ఎనీమా:—2 నుండి 8 డ్రాములు గ్లిసరీనును ఒక చిన్న [6]వల్కనైటు సిరింజితోగాని, రబ్బరు క్యాథిటరు తగిలించిన గాజు సిరింజితోగాని లోపలికి ఎక్కించవలెను. నీళ్లు, గ్లిసరీను కలిసిన మిశ్రమమును కూడ నియ్యవచ్చును. దీనిలో 2 నుండి 4 ఔన్సులు గ్లిసరీనును, దానికి సమాన పరిమాణముగల ఉడుకునీటిని కలుపవలెను. దీనిని దీర్ఘకాలమైన మలబద్ధకమును తొలగించుటకుగాను, క్యాథిటరు, ఫనలు నుపయోగించి యిచ్చెదరు.

[1] A high enema. [2] Sulphate of magnesium. [3] Castor oil enema. [4] Olive oil enema. [5] Glycerine enema. [6] Vulcanite syringe.



(b) [1]వాయువును పోగొట్టుటకు ఇచ్చెడు ఎనీమా:—దీనిని [2]వాయువును హరింపజేసెడి ఎనీమా అని కూడ అందురు.

[3]కర్పూరతైలపు ఎనీమా:—½ నుండి 1 ఔన్సువరకు కర్పూరతైలమును సబ్బునీళ్లలో బాగుగా కలియునట్లు ఎక్కువ జాగ్రత్తగ కలుపవలెను. కర్పూరతైలముయొక్క పరిమాణమును కలుపకముందు ఒక సీనియర్ నర్సుకుగాని సిస్టరుకుగాని చూపవలెను. మరియొక పద్ధతి—రెండు ఔన్సుల నూనెతోగాని, గ్రుడ్డుయొక్క పచ్చసొనతోగాని కర్పూరతైలమును గలుపవలెను. ఆ మిశ్రమమును బాగుగా కుదిలించవలెను; లేదా, రసాయన రూపముగ వచ్చునట్లు బాగుగకొట్టి తరువాత సబ్బు నీటిలో కలుపవలెను. కర్పూరతైలమును నాల్గు ఔన్సుల నూనెతోను నాల్గు ఔన్సుల బార్లి లేక మైదా పిండితో చేసిన గంజిలోకూడ కలిపి యియ్యవచ్చును.

ఇంగువ:—30 గ్రయినుల ఇంగువను సబ్బు, నీళ్ల ఎనీమాతోగాని, 4 నుండి 6 ఔన్సుల గంజితోగాని చేర్చి యిచ్చెదరు. గంజిని చేయుటకు ఒక చిన్నగరిటెడు బార్లి లేక మైదాపిండిని కొంచెము చన్నీళ్లలో అంబలి పక్వముగ కలిపి 2 నుండి 3 ఔన్సులు పొంగెడి నీళ్లనుపోసి చురుకుగ కలుపవలెను. కర్పూరతైలము, ఇంగువ-ఇవి రెండును కందజేయు పదార్థములు గనుక, వీనిని వాడినతరువాత రోగియొక్క వీపును జాగ్రత్తగా సబ్బునీటితో కడిగి పౌడర్ పట్టించేవలెను.

[4]పానకములు:—మూడు ఔన్సుల పానకమును 3 ఔన్సుల వేడి పాలతో బాగుగా కలుపవలెను. [5]నల్లనిబెల్లపు పానకమునుగూడ వాడవచ్చును. మరియొక పద్ధతి:—బెల్లమును 15 ఔన్సులు వేడినీళ్లతోగాని లేక గంజితోగాని కలుపవచ్చును. బెల్లపు పానకము దొరకనప్పుడు, బెల్లమును కరిగింప గలిగినంతమట్టుకు నీటిలో కరిగించగా వచ్చిన సొల్యూషను బాగుగా పనిచేయును.

(c) ప్రేగులలోని పురుగులను తీసి వేయుటకు ఇచ్చెడు ఎనీమా:—మొదట వట్టి నీళ్ల ఎనీమా నిచ్చి, పురీషనాళమును ఖాళీ చేయవలెను. తరువాత 6—8 ఔన్సుల [6]క్వాస్య ఇన్‌ఫ్యూషన్‌గాని 100°F. ఉష్ణోగ్రతగల ఒక

[1] For promoting the passage of Flatus. [2] A carminative enema. [3] Turpentine enema. [4] Molasses. [5] Black treacle. [6] Infusion of quassia.

పైంటు నీళ్లలో 4 డ్రాముల ఉప్పు కరగబెట్టిన ద్రావకముగాని మెల్లగ లోపలి కెక్కించవలెను. సాధ్యమైనంతసేపు రోగి దీనిని లోపల నిలుపుకొనునట్లు చేయవలెను.

(*d*) మూత్రమును బంధించినప్పుడు మూత్రాశయపుకండరములకు చురుకు పుట్టించుటకు సాధారణమైన ఎనీమా పనికివచ్చును.

రెండవరకము

లోపల యిమిడియుండు ఎనీమా నియ్యకముందు సాధారణ ఎనీమా నియ్యవలెను. దీనిని శరీర ఉష్ణోగ్రతతో సమానమైన ఉష్ణోగ్రతయందు చాలా నిదానముగా నియ్యవలెను. పురీషనాళములోనికిచ్చు ద్రవమంతయు 100°—105°F. ఉష్ణోగ్రతమధ్య నుండవలెను. సాధారణమైన రెక్టల్ క్యాతిటరు బదులు దానికంటె చిన్నది నెం. 8 లేక 10 Fr. ఉపయోగించవలెను. ద్రవప్రవాహమును స్వాధీనములో నుంచుకొనుటకై ఒక చిన్న [1]క్లాంపు (మరబందు) ను ఉపయోగించుట మేలు. బొట్లు బొట్లుగా ద్రవమును లోపలికి విడుచుపద్ధతి నవలంబించినయెడల, దీనికిగాను చేయబడిన ప్రత్యేకమైన సాధనమును ఉపయోగించి, నిమిషమునకు 40—60 బొట్లు పడునట్లు ఇయ్యవలెను. ఎనీమా నిచ్చినతరువాత, క్యాతిటరును బయటికి తీసివేయకముందు, రబ్బరుగొట్టమును క్లాంపుతో బాగుగా బిగించవలెను. ఎనీమా నిచ్చినతరువాత కొంతకాలమువరకు కదలకుండనుండు నిమిత్తము ముందే రోగి వెల్లికిలనో యెడమప్రక్కననో సాధ్యమైనంతవరకు సౌఖ్యమైన తీరులో పరుండియుండవలెను.

(*a*) [2]పోషణకొరకు ఇచ్చెడు ఎనీమా:—పూర్వము ఈ ఎనీమాను ముందే కొంత జీర్ణమయిన ద్రవాహారముల నుపయోగించి, కొంచెము కొంచెముగా, 4 నుండి 6 గంటలకొకసారి యిచ్చుచుండిరి. క్రిందిభాగపు ప్రేగునందలి అమత్వచకు కొద్దిగ ఉప్పుగాని లేక గ్లూకోస్‌గాని కలిపిన నీళ్లను మాత్రమే పీల్చుకొనుటకు శక్తిగలదు గాన ప్రస్తుతకాలములో పోషణకొరకైన ఎనీమాలను సాధారణముగా రోగివయస్సునకు తగినట్లు ఇచ్చెదరు. అనగా, 5 లేక 10% గ్లూకోస్ సొల్యూషనును 10 ఔన్సులవర కిచ్చెదరు.

(*b*) శరీరమునకు ద్రవము నెక్కించెడి ఎనీమా:—అనేక విషయములలో ప్రేగు ద్రవము నిముడ్చుకొనగల శక్తిని గమనించి ఈ ఎనీమా నిచ్చె

[1] Clamp. [2] Nutrient enema.



దరు. దాహమును దీర్చుటకు పట్టినీళ్లుగాని లేక [1]నార్మల్ సేలైన్‌గాని యిచ్చెదరు. ఏకారణముచేతనైన దేహమునుండి నీరుపోయినప్పుడు, దానికి చికిత్సగ నార్మల్ సేలైన్‌కూడ నిచ్చెదరు. దీనిలో గ్లూకోసుకూడ కలుపవచ్చును. ఆపరేషను అయినవెంటనేగాని, లేక అయినతరువాత కాలములోగాని కలుగు [2]ఆసిడోసిస్ (అనగా, రక్తములో క్షారము తక్కువగుటవలన నేర్పడు విషప్రయోగము) ను ఆపుటకుగాని లేదా, చికిత్సగాగాని సోడియం బైకార్బొనేట్ ను ఒక పైంట్‌నీళ్లలో కలిపి యిచ్చెదరు.

కొద్ది మోతాదుల నిచ్చునపుడు గొట్టము, ఘనలు నుపయోగించవచ్చును. ఆపరేషను అయినతరువాత పురీషనాళముగుండమాత్రమే చికిత్సగ రెక్టల్‌సేలైను నెక్కించవలెనని ఉత్తరు వియ్యవచ్చును. నియమితసమయమునకు మధ్య మధ్యకూడ ఇయ్యవచ్చును. రెక్టల్‌సేలైనును తెంపులేకుండ ఇయ్యవలసి వచ్చును. ఇందుకుగాను ఈ ద్రవముయొక్క ఉష్ణోగ్రత సరియైనస్థితిలో నుండునట్లు, దీనిని ప్రత్యేకమగు తర్మస్ ఫ్లాస్కు వంటి సాధనములోపెట్టి యుంచెదరు. ఈ రీతిగా ఇచ్చునప్పుడు నిమిషమునకు 60 నుండి 80 బొట్లు, అనగా, మూడుగంటలకు ఒక పైంటు సేలైను పడునట్లు ఇది క్రమపరచబడియుండును. పొడుగైన ఒక రబ్బరుగొట్టము; కలిపెడు గాజుగొట్టము, చిన్నరబ్బరు క్యాతిటరు, ధారను క్రమపరచుకొనగల క్లాంపు-ఇవన్నియు నమర్చబడియున్న ఒక పిచికారు డబ్బాతోనైనను పై జెప్పిన సేలైను నియ్యవచ్చును. [3]మర్ఫిడ్రిప్‌యను సాధనములో బొట్టు బొట్టుగా విడుచు గొట్టమును (పిప్పెట్టును) కలిపెడు గాజుగొట్టము (కనెక్టింగ్‌ట్యూబ్) నకు అమర్చెదరు. గాజుగొట్టముగుండ, నీరు బొట్టు బొట్టుగాపడుట చూడగలము. పిచికారుడబ్బాలోని నీరు వేడిగానుండవలెను. ఇట్లుండుటకు సాధారణమైన ఒక మందుబుడ్డిలో ఉడుకు నీళ్లు పోసి పిచికారుడబ్బాలో నిలువబెట్టినయెడల, సొల్యూషన్ సరియైన ఉష్ణోగ్రతగలిగియుండును. పిచికారుడబ్బాను రోగి చేతులున్నమట్టములో పడకపాదములదగ్గర యెత్తి కట్టియుంచినయెడల, మర్ఫిడ్రిప్ అను సాధనములేకుండనే తెంపులేకుండ సేలైనును రోగికి ఎక్కించుటకు వీలగును. ఈ పనికి సాధారణమైన కలిపెడు (కనెక్టింగ్) గాజు గొట్టము నుపయోగించవచ్చును. క్లిప్పుతగిలించకపోయిన, ఈ పద్ధతి యెక్కువ లాభకరము. ఎందు

[1] Normal saline. [2] Acidosis. [3] Murphy drip.

కనగా గాలి బయటికి విడుబడును. క్లిప్పు వాడినయెడల, గాలి క్యాథిట రును బలవంతముగా బయటికి నెట్టుట సహజము.

నర్సు ఈ క్రింది విషయములనుగూర్చి జాగ్రత్తగా నుండవలెను:— (1) ద్రవము మెల్లగా కారునట్లు చేయుట. (2) రెక్టల్‌ట్యూబ్ గుండ ద్రవముపోకుండ అభ్యంతరపరచున దేదియులేకుండ చూచుట. (3) లోపలికి పోయిన ద్రవము, లోపలనే యిమిడి తిరిగి పరుపుమీదికి రాకుండ చూచుట. (4) క్యాన్ ఖాళీకాకముందే దానిని నింపుట. (5) ద్రవ మెక్కించుటవలన రోగికి ఆయాసము కలుగకుండ చూచుట. (6) ద్రవమును వేడిగనుంచుట.

(c) [1]మందుల ఎనీమా

[2]ఉపశాంతకలిగించు ఎనీమా:—దీనిని అతివిరేచనములను నిలుపుటకు ఇచ్చెదరు. దాదాపుగ చల్లబడిన 2—4 ఔన్సుల గంజిలో 15—60 మిని ముల [3]టింక్చెర్ ఆఫ్ ఓపియము (నల్లమందుసారము) కలుపవలెను. రోగి నల్లమందుయొక్క ఫలితమును సంపూర్ణముగ పొందునట్లు దానిని మొదటి రెండు లేక మూడు ఔన్సుల గంజితోచేర్చి ఇయ్యవలెను. మిగత గంజిని ఫనలు ఖాళికాకముందే దానిలో పోయవలెను. ఈలాటి ఎనీమాను చాలా నిదానముగ 10 నుండి 15 నిమిషములవరకు ఇయ్యవలెను. బిస్మత్తు లేక సిల్వర్ నైట్రేటు సొల్యూషనును [4]కొలైటీస్ (పెద్దప్రేగు కందుట) అను వ్యాధులకు ఉపయోగించుదురు. దీనిని హై ఎనీమాగ (అనగా, పై ప్రేగులోనికి) ఇయ్యవలెను. 10 గ్రెయినుల ఆస్పిరినును 4 ఔన్సుల [5]నార్మల్ సేలైనులోకలిపి రోగికి నిద్ర కలిగించుటకుగాని, బాధ తగ్గించుటకు గాని ఇయ్యవచ్చును. దీనిని సాధారణముగ ఆపరేషను జరిగినతరువాత ఇచ్చెదరు. [6]పొటాసియమ్ బ్రోమైడు, [7]క్లోరల్ హైడ్రేటు అను మందు లనుకూడ తరుచుగ ఇచ్చుచుందురు. వీని ప్రమాణము, నోటిద్వారా ఇచ్చుదానికంటె పురీషనాళముద్వారా ఇచ్చునది రెండింత లుండవలెను.

చురుకుదనము పుట్టించు ఎనీమా:—దీనిని షాక్ (అదురు), కొలాప్స్ (చలువవాతము) కలిగినప్పుడు ఇచ్చెదరు. దీనిని 6—10 ఔన్సుల నార్మల్ సేలైను లేక నల్లని కాఫితో ¼ ఔన్సు బ్రాంది కలుపవచ్చును. ఈ ఎనీమాను 110°—115°F. డిగ్రీల వేడిలో నియ్యవలెను.

---

[1] Medicated enemas. [2] Sedative enema. [3] Tincture of opium. [4] Colitis. [5] Normal saline. [6] Potassium bromide. [7] Chloral hydrate.



ఇంద్రియములకు బాధకలుగకుండ జేయు ఎనీమాలనుగురించి 37-వ అధ్యాయములో చదువవచ్చును.

**ఒక చంటిబిడ్డకుగాని, చిన్నపిల్లకుగాని ఎనీమా నిచ్చువిధము**

పసిబిడ్డ లేక చిన్నపిల్ల—వీరు లోపలికెక్కించు ద్రవమును నిలుపు కొనశక్తిలేని వారుగాన, వీరికి ఎనీమా ఇచ్చుట అనగా, నిజముగా వీరి పురీషనాళమును కడుగుటయే అని అర్థము. వీరికి ఎనీమా నిచ్చుటకు గాను క్యాథిటరు, ఫనలు; లేక రబ్బరుగొట్టమునకు క్యాథిటరు తగిలించిన పిచికారుడబ్బాను వాడవచ్చును.

పద్ధతి:—పడకను కాపాడుటకు దానిమీద ఒక మాకింటాష్‌ను పరచి పడకచట్టిని సరియైన స్థలమందుంచి దానిమీద బిడ్డ కూర్చుండుభాగమును ఒక మెత్తనిగుడ్డతో కప్పవలెను. తరువాత బిడ్డను పడకచట్టిపై కూర్చుండ బెట్టి, బిడ్డయొక్క పైభాగము పడకచట్టి మట్టమునకుండునట్లు, చిన్నదిండు నుగాని దుప్పటిని మడిచిగాని బిడ్డక్రింద పెట్టవచ్చును. క్యాథిటరుకొనకు వ్యాజలీనుపూసి, క్యాథిటరునుండి గాలిపోవుటకును, క్యాథిటరు వేడియగుట కును మరబందును తీయవలెను. క్యాథిటరుగుండ నీరు కారుచుండగా దానికొనను పురీషనాళములో పెట్టుము. ఒక పైంట్ నీళ్లు వాడినతరువాత గాని, లేదా, తిరిగివచ్చు ద్రవము శుభ్రముగా నుండినప్పుడుగాని మర బందునుమూసి, క్యాథిటరును తీయవలెను. ఈపనిచేయుచుండగా క్యాన్ గాని, ఫనల్‌గాని బిడ్డకు పైన 1 లేక 1½ అడుగుకంటె ఎక్కువ యెత్తుండ కూడదు. క్యాథిటరును పసిబిడ్డయైన 2 అంగుళములు, చిన్నపిల్లయైన 3 అంగుళములు లోపల పెట్టవలెను. ద్రవము తిరిగి వచ్చినతరువాత బిడ్డను తడిలేకుండ జాగ్రత్తగా తుడిచి, పక్కను చక్కజేసి, సామానం తయు తీసివేయవలెను. వాడునట్టి ద్రవములు పలుచని సబ్బునీళ్లుగాని, వేడి బోరిక్‌గాని లేక నార్మల్ సేలైనుగాని అయియుండవచ్చును. 6 సం॥ల పై వయస్సుగల చిన్నపిల్లకు పెద్దవారికిచ్చినట్లే ఎనీమా ఇచ్చెదరు. నర్సు తన ఒడిలో, బిడ్డను పరుండబెట్టుకొనికూడ ఎనీమా ఇయ్యవచ్చును. ఒడి మైలకాకుండ, రబ్బర్‌షీట్‌తో తన ఒడిని కప్పుకొనవలెను. లేక పడక అంచున ఒక [1]కెల్లిప్యాడ్‌మీదకూడ ఎనీమా నియ్యవచ్చును.

---

[1] Kelly pad.

[1]సప్పాజిటరీస్

[2]టానిక్ ఆసిడ్, నల్లమందు—వీనిని [3]కోకో వెన్నతో కలిపి, [4]పొట్లము వలె ఒకకొన సన్నగనుండునట్లుచేసి రోగియొక్క ఆసనము, భగము, మూత్రద్వారములయందు సులభముగ ప్రవేశపెట్టుదురు. ఇట్టి సాధనములను సప్పాజిటరీ లందురు. గ్లిసరినును [5]జెలటిన్ అను మందుతో కలిపి వాడవచ్చును. ప్రేగులు కదిలి పనిచేయుటకును ఈ సదుపాయము ఉపయోగపడును. ఒక సప్పాజిటరును లోపలికి ప్రవేశపెట్టకముందు దాని కొనకు నూనెపూసి బలవంతముగ కాకుండ మెల్లగ దానిని పురీషనాళము లోనికి [6]ముద్రణిని (స్ఫింక్‌టర్‌ను) దాటి పోనియ్యవలెను. పిమ్మట రోగికి విరేచనము వచ్చుచున్నదను తలంపు మరచిపోవువరకు రోగియొక్క పిరుదులను దగ్గరకుచేర్చి పట్టుకొనవలెను. కాని విరేచనము అగుటకొరకే ఒక సప్పాజిటరును దూర్చియున్నపుడు పిరుదులను ఒకటిగచేర్చి పట్టుకొనకూడదు. ఈ పనినంతయు చేయునపుడు నర్సు తనచేతికి రబ్బరు [7]చేతితిత్తిని గాని, వ్రేలికి [8]వ్రేలిగూడుగాని తొడుగుకొనవలెను.

రెక్టల్ ట్యూబ్ నెక్కించు పద్ధతి

రోగికి ఆపరేషను చేసినతరువాత క్రింది ప్రేగులో గాలిచేరుటవలన కడుపు ఉబ్బియుండునపుడు ఈ గొట్టము నుపయోగింతురు. ఈ పని కొరకు ప్రత్యేకమైన రెక్టల్ ట్యూబునకు ప్రక్కనగాక కొనయందు రంధ్రముండును. ఈ పనిచేయునపుడు రోగి ఒక మాకింటాషు, ఒక చిన్న డ్రాషీటుమీద పరుండియుండును. గొట్టమును ఉపయోగించక ముందు దానిని వేడినీటిలో పెట్టి ఉడుకు చేయవలెను. పిమ్మట దానికి 8—10 అంగుళములవరకు నూనెపూసి దానిని మెల్లగ పురీషనాళములో ప్రవేశపెట్టవలెను. గొట్టముయొక్క రెండవకొనను నీరున్న ఒక పాత్రలో ముంచిన యెడల గాలి బైటికివచ్చుటను గమనించవచ్చును. గొట్టమును ఈ పాటులో 10 నిమిషములవరకు ఉండనియ్యవలెను.

[1] Suppositories. [2] Tannic acid. [3] Cocoa butter. [4] Conical shapes. [5] Gelatine. [6] Sphincter. [7] Glove. [8] Finger cot.

అధ్యాయము 8

# లవాజ్, సైఫన్ వలన ద్రవమును గాలిని పీల్చుట, గవాజ్, ఇరిగేషన్, క్యాతిటరైజేషన్, డూషులు, ప్రాణవాయువును ప్రయోగించుట

లవాజ్

ఆహారకోశము, మూత్రకోశమువంటి ఏదైన ఒక అవయవమును కడుగు పనికి లవాజ్ అని పేరు.

[1]గ్యాస్ట్రిక్ లవాజ్:—మ్రింగిన విషమును తీసివేయుటకును, శస్త్రచికిత్సకు ముందు ఆహారకోశమును శుభ్రముచేయుటకును, అతి వాంతిబాధను నివారించుటకును, [2]ఎక్లాంమ్సియ అను ఒక విధమైన ఈడ్పు వ్యాధియందు విషబాధను తగ్గించుటకును, ఆహారకోశమును శుభ్రము చేయుచుందురు. దీనినే గ్యాస్ట్రిక్ లవాజ్ (ఆహారకోశమును గడుగుట) అందురు.

పరికరములు:—రోగి చిన్నపిల్లగ నుండినయెడల క్యాతిటరు, ఘనలు నుపయోగించవచ్చును. ఆహారకోశపు గొట్టము, లూబ్రికెంటుకొరకు గ్లిసరీను, ఒక మాకింటాష్, ఒక తువాలు, తిరిగివచ్చెడు ద్రవముకొరకు ఒక పాత్ర, నిర్ణయించిన లోషను పోయుటకు ఒక పాత్ర, ద్రవమును పోయుటకు ఒక చిన్న జగ్గు లేక ఒక పైంటు కోప, మతితప్పినరోగికి లేక చిన్నపిల్లకు ఉపయోగించెడి వాకట్టు, నాలుకను లోపలికి ఒత్తిపెట్టెడు సాధనము (టంగ్ డిప్రెసర్), టంగ్ ఫార్సెప్స్, (నాలుకకుపయోగించెడు పట్టుకారు) నోటిని శుభ్రముచేయుటకుగాని లేక రోగి తనకుతానే నోటిని శుభ్రముచేసికొనగల సొల్యూషన్ గల ఒక ట్రే, మొదలైన పరికరములు అవసరమైయుండును. ఈ పనికి అవసరమైన లోషనులు ఏవనగా, ఒక పైంటునీటిలో ఒక డ్రాము [3]బైకార్బొనేట్ ఆఫ్ సోడియమ్ కలిపిన లోషను, పలుచగచేసిన [4]పొటాసియమ్ పర్మాంగనేటు సొల్యూషను, [5]మెగ్నీషియమ్ సల్ఫేటు లోషను, నీళ్లు మొదలైనవి.

[1] Gastric lavage. [2] Eclampsia. [3] Bicarbonate of sodium. [4] Potassium permanganate, [5] Magnesium sulphate.

పద్ధతి:—ఈ పనిచేయుచుండగ రోగియొక్క నమ్మకమును, సహాకారమును నర్సు సంపాదించుకొనవలెను. రోగి, పడకమీాద పరుండియైనను కూర్చుండియైనను ఉండవచ్చును. స్మారకములేని రోగులకు ఈ చికిత్స చేయుచుండగ ద్రవము శ్వాసనాళములోనికి పోకుండ జాగ్రత్తగ నుండవలెను. రోగికి [1]కృత్రిమపుపండ్లుండినయెడల వానిని తీసివేయవలెను. రోగి దుస్తులు, పడక తడిసి చెడిపోకుండునట్లు మాకింటాషును, తువాలును పరచవలెను. నర్సు రోగి కుడివైపున నిలుచుండి గొట్టమునకు గ్లిసరీను పూసినతరువాత దానిని నోటిలోనికి ప్రవేశ పెట్టవలెను. గొట్టము, లోపలికి పోవుచుండగ అది [2]సప్తపథముయొక్క వెనుకటిభాగమును చేరినపుడు దానిని కొంచెము ఒత్తుటవలన అది తిన్నగా [3]కంఠనాళములోనికి పోగలదు. అటుపిమ్మట గొట్టము సులభముగ లోపలికిపోవును. పెద్దవారికి గొట్టము మీాద నుండు 20 అంగుళముల గురుతును, చిన్నవారికి 10 అంగుళముల గురుతును పెదవుల మట్టముదగ్గర నిలిచియున్నపుడు గొట్టమును లోపలికి పోనిచ్చుట ఆపవలెను. కడుపునుండివచ్చు మైల పడకమీాద పడకుండ గొట్టమును ప్రవేశపెట్టుచుండగ దానికి సంబంధించిన ఫనలును ఒక పాత్రలో నుంచవలెను. లేదా ఫనలును ఎత్తిపట్టుకొనవలెను. ఈ పని జరుగుచుండగా రోగియొక్క రంగును, శ్వాసను గుర్తించుచుండవలెను. రోగి రంగు నీలముగ కనబడినయెడల గొట్టము శ్వాసనాళములోకి పోయినదని గ్రహించి వెంటనే తీసివేయవలెను. అట్లుకాక రోగి నెమ్మదిగ నుండి, అతని రంగు బాగున్నట్టు కనబడినయెడల గొట్టము కడుపులోనికి పోయినదని గ్రహించవలెను. గొట్టము తగినస్థానమునకు పోయినవెంటనే దానిలో ఒక అరపైంటు ద్రవమును పోసి లోపలికి పోనియ్యవలెను. గొట్టము ఎప్పుడును సంపూర్ణముగ ఖాళీయైయుండకుండునట్లు జాగ్రత్తగ నుండవలెను. గొట్టములోపలికి గాలి ప్రవేశించినయెడల [4]సైఫన్ (అంకుశనాళి) పనిచేయక ఆగిపోవును. గొట్టమును గట్టిగ నొక్కిపట్టి క్రిందికిదించి ఫనలును వంచి కడుపులోని మురికిద్రవమంతయు ఒక పాత్రలో పడునట్లు పట్టుకొనుము. మొదట బైటపడిన ద్రవము వైద్యుని పరీక్షకొరకు ఎత్తిపెట్టవలసివచ్చును. పిమ్మట ఫనలును పైకెత్తి ఒక పైంటు

[1] False teeth. [2] Posterior wall of the pharynx. [3] Esophagus.
[4] Siphonage.



లోషనును లోపలికి పోయవలెను. వెంటనే ఫనలును క్రిందికివంచి ద్రవము తిరిగి పాత్రలోపడునట్లు పట్టుకొనవలెను. లోపలి కియ్యబడిన లోషను శుభ్రముగ బైటికివచ్చునంతవరకు ఈ పనిచేయుచుండవలెను. ఈ పని అంతటికి రెండు గాలనుల సొల్యూషన్ అవసరమైయుండును. పిమ్మట గొట్టమును ఒత్తిపట్టి బైటికితీసివేసి రోగి నోటిని బాగుగ కడుగవలెను. గొట్టమును గోరు వెచ్చని నీటిలోకడిగి పొంగించవలెను. లోపలికిపోసిన ద్రవమును బైటికివచ్చిన ద్రవమును కొలిచి, వాని రికార్డు వ్రాసి యుంచవలెను. విపరీతమైన లక్షణములు ఏవైననున్నయెడల, వానిని వ్రాసి యుంచవలెను.

[1]సైఫనేజ్‌వలన ద్రవమును పీల్చుట

సైఫనేజ్ యొక్క నియమమును ఉపయోగించి ఆహారకోశము, మూత్రకోశము, మొదలైన బోలుగనుండు అవయవములనుండియు [2]ఎంపైయిమ అను బోలుగనుండు స్థలములనుండియు ద్రవము తెంపులేకుండ బైటికిపాఱునట్లు చేయుదురు. దీనిని తరుచుగ ఆహారకోశములోను, ప్రేగుయొక్క పైభాగమునను పెట్టి పనిచేయుదురు. ద్రవమును పీల్చెడి గొట్టముయొక్క మాదురులు పెక్కు గలవు. అనుకూలముగ నుండుటకుగాను ఈ గొట్టమును నోటిద్వారాకాకుండ ముక్కుద్వారా లోపలికి ప్రవేశ పెట్టుదురు.

సైఫనేజ్‌యొక్క ఉపయోగము ఈ క్రిందివానిలో నెక్కువగ కనబడును.

1. [3]పెరలిటిక్ ఇలియస్ (ప్రేగుల పక్షవాతము):—శస్త్రచికిత్స చేయబడినతరువాత ప్రేగులుబ్బినపుడును, [4]పెరిటోనైటీస్ (భిన్నాంత్రోదరము) లోను ఇది కలుగుచున్నది.

2. ప్రేగులలోగల ఆటంకము:—ప్రేగులలో అడ్డుపడిన ప్రతి వ్యాధియందును శస్త్రచికిత్సకు ముందు ద్రవమును పీల్చెడి గొట్టముయొక్క ప్రయోగము ఉపయోగపడును. ఈ ప్రయోగమువలన వాంతియగుటయు, కడుపు ఉబ్బుటయు తగ్గిపోవును. కొన్నిసమయములయందు ఈ ప్రయోగమువలన ఆపరేషను చేయవలసిన అవసరముకూడ లేకుండ పోవును.

[1] Suction-siphonage. [2] Empyema. [3] Paralytic Ileus. [4] Peritonitis.

**3. ఆహారకోశము ఉబ్బుట:**—ఏ కారణముచేతనైనను ప్రేగులయందు కలిగిన ఆటంకమువలననైనను ఆహారకోశము ఉబ్బవచ్చును. ఉదాహరణముగ, [1]ఆంత్రముఖ ద్వారములోగాని ద్యువోదినము (చిన్న ప్రేగుయొక్క పై భాగము) లోగాని పుండులేచి మాని [2]పుంటి మచ్చ ఏర్పడవచ్చును. దీనివలన కలిగిన ఆటంకమునుబట్టి కడుపు విస్తరించవచ్చును.

**పరికరములు:**—ఒక్కొక్కగాలను పరిమాణముగల రెండు బుడ్లు, రెండు ద్వారములుగల ఒక రబ్బరుబిరడా (ఇది ఒక గాలను బుడ్డి మూతికి సరిపోవునదై యుండవలెను), ఒక్కొక్కటి 6 అడుగుల పొడుగుగల రెండు రబ్బరు గొట్టములు, 6 అంగుళముల పొడుగుగల ఒక రబ్బరుగొట్టము, ద్యువోదినల్ రబ్బరుగొట్టము ఒకటి, గాజుగొట్టములు రెండు (వీనిలో ఒకటి 6 అంగుళములును, మరియొకటి 12 అంగుళములును పొడుగు ఉండవలెను), [3]Y ఆకారమున ఉన్న కలుపుడు (కనెక్టింగ్) గాజుగొట్టము ఒకటి, మూడు మరబందులు, ఒక మందుగ్లాసులో గ్లిసరీను లేక లోహపు నూనె, క్యాన్వాసుపట్టతో చేసిన బుడ్డివర, [4]అడ్‌హిసివ్ ప్లాస్టర్, ఒక కత్తెర, ఒక స్టాండ్, (వస్తువులు తగిలించుకొనెడు ఎత్తు చట్రము) ఒక [5]అసెప్టో సిరింజి.

**పద్ధతి:**—ఒక బుడ్డిలో 400 CC. ల నీళ్లు పోయుము. రెండవ బుడ్డిలో కూడ నీళ్లునింపి రబ్బరు మూతపెట్టుము. ఈ మూత లేక బిరడాలోనున్న రెండు రంధ్రములకు (పైనచెప్పిన 6, 12 అంగుళముల) రెండు గాజుగొట్టములు అమర్చియుంచవలెను. ఈ రెండు గాజుగొట్టములకు ఆరేసి అడుగుల పొడుగుగల రెండు రబ్బరు గొట్టములను తగిలించవలెను. Y ఆకారమున ఉన్న గొట్టమును 12 అంగుళముల గాజుగొట్టమునకు తగిలించిన రబ్బరు గొట్టమునకు తగిలించవలెను. 6 అంగుళముల పొడుగుగల రబ్బరు గొట్టమును Y యొక్క ఒక కొమ్మునకు తగిలించి ఒక మరబందుతో మూయుము. బుడ్డినుండి వచ్చు రెండు గొట్టములను కూడ మరబందులతో మూయుము. ఈ బుడ్డియొక్క మూత గట్టిగ పెట్టబడియుండునట్లు జాగ్రత్త తీసికొని, దీనిని క్యాన్వాస్‌వరలోపెట్టి బోర్లించి స్టాండునకు తగిలించుము. 6 అంగుళముల గాజుగొట్టమునుండి వచ్చు రబ్బరు గొట్టమును

---

[1] Cicatricial obstruction of the pylorus. [2] Peptic ulcer.
[3] Glass Y connector. [4] Adhesive tape. [5] Asepto syringe.



నేలమీద రోగిపడక ప్రక్కన పెట్టబడియున్న రెండవ బుడ్డికి అమర్చుము. దీనికొన నీటిలో మునిగి యుండవలెను.




9. కడుపు, ద్యువోదినమ్ అను అవయవములనుండి ద్రవమును బైటికి పీల్చెడు సైఫనేజి గొట్టము

ఈ పని చేయుచుండగ రోగి పరుండిన లేక కూర్చుండిన తీరులో నుండవచ్చును. ద్యువోదినల్ గొట్టమునకు నూనె రాసిన తరువాత వైద్యుడు దీనిని మెల్లగ రోగి ముక్కులో దూర్చుచు, దానిని లోపలికి మ్రింగుచు మధ్య మధ్య నోటితో ఊపిరి విడువవలెనని రోగికి చెప్పవలెను. ఒక్కొక్క గ్రుక్క నీళ్లు మ్రింగుటవలన ఈ గొట్టము లోపలికి పోవుటకు సహాయపడును. అవసరమైనంత లోతునకు ఈ గొట్టము పోయిన తరువాత అడ్‌హిసివ్ ప్లాస్టరుతో దీనిని రోగి బుగ్గకు అంటించవలెను. రెండు పొడుగైన గొట్టములకు తగిలించిన మరబందులను తీసివేయుము. గొట్టము

నందే దేని ఆటంకముండినయెడల Y గొట్టమునకు పైనున్న గొట్టమును మర బందుతో బిగించుము. ఇప్పుడు అసెప్టో సిరింజిని కుఱుచయైన రబ్బరు గొట్టమునకు తగిలించి గాలినిగాని నీటినిగాని లోపలికి పోనిచ్చి కడుగవలెను. ఈ సాధనమును ఆపివేయవలసినపుడు ద్యువోదినల్ గొట్టమును మరబందుతో బిగించి మెల్లగ బైటికి తీసివేయుము. ఈ పని అంతయు జరుగుచుండగ రోగికి ఒక్కొక్క గ్రుక్క నీరిచ్చుచు దాహము తీర్చుచు డవలెను.

ఈ సాధనము పనిచేయుచున్నంతకాలము రోగియందున్న జాఠరిక రసము ఊరుచున్నకొలది, అది బైటికి పీల్చివేయబడునుగాన రోగి దేహములోని ద్రవమును, ఉప్పులును తరిగిపోవుచున్నవని మనము తెలిసికొనవలెను. ద్యువోదినల్ అను పీల్చెడుగొట్టము పనిచేయునపుడు ద్రవము మరి యెక్కువ వేగముగ పీల్చివేయబడుచుండును. ఇట్లు నష్టమైన ద్రవమును తిరిగి పూర్తిచేయుటకుగాను 24 గంటలలో 800—1000 CC. ల మూత్రము విడువగలిగినంత నార్మల్ సేలైనును నోటిమార్గమునగాక మరియొకమార్గమున రోగికి ఇచ్చుచుండవలెను. జాఠరికరసమును పీల్చెడు గొట్టము పనిచేయునపుడు మొత్తము మీద 1500 CC. ల ద్రవమును, ద్యువోదినల్ పీల్చెడు గొట్టము పనిచేయుచుండగ దానికి రెండింతలు ద్రవమును రోగికిచ్చుట అవసరమై యుండును.

రోగి కడుపునుండి బైటికివచ్చిన వాయువును, ద్రవములను లెక్కించుటకై, B అనెడు క్రింది బుడ్డిలోని ద్రవమునుండి, ఈ చికిత్స ఆరంభమైనపుడు ఆ బుడ్డిలోనుండిన నీటి మొత్తమును తీసివేయుము. మరియు రోగినుండి A అను బుడ్డిలోనికి తీయబడిన వాయువునుకూడ B అను బుడ్డి మొత్తము వాయువునుండి తీసివేయవలెను. దీని ఫలితముగ B అను బుడ్డిలో రోగినుండి తీయబడిన ద్రవము మాత్రమే నిలిచియుండును.

ఈ సాధనముయొక్క పరికరములన్నిటిని ఊడదీసి ప్రతిదినము కడుగవలెను. చికిత్స ముగిసినపిమ్మట బుడ్లను, గొట్టములను సబ్బు నీటితో కడిగి, పొంగించి, ఆరబెట్టవలెను.

[1]కల్పితపోషణ

మిక్కిలి బలహీనులైన రోగులకును, సన్నిపాతము, గాఢ మూర్ఛ, [2]సప్తపథకు కలిగెడు పక్షవాతము, [3]ధనుర్వాయువు మొదలగు

[1] Artificial feeding. [2] Paralysis of the pharynx. [3] Tetanus.



వ్యాధులచేత బాధపడురోగులకును, నోటియందుగాని గొంతునందుగాని శస్త్రము చేయబడిన రోగులకును, ఆహారముగాని ఔషధముగాని ఇచ్చుటకు అనేక సదుపాయములను ఉపయోగించుచుందురు.

[1]అన్నవాహికగుండ ఆహారమిచ్చుట

పరికరములు:—కడుపును కడుగుటకు ఉపయోగించినట్టి స్టమక్ ట్యూబ్, గ్లిసరీను, నిమ్మరసముతో కలిపిన రుచిగల లూబ్రికెంటు, ఒక మాకింటాషు, తువాలు, ఒక వాకట్టు, మౌత్ వాష్, కొలతపాత్రలో ఆహారము (ఈ పాత్రను వేడినీటి చిప్పలో నుంచవలెను). ఒకవేళ రోగి కడుపులో త్రిప్పి, వాంతిచేసినయెడల దానిని పట్టుటకు అవసరమైన పాత్రలు మొదలైన పరికరములు కావలెను.

పద్ధతి:—వీలైనయెడల దిండ్లమీద ఆనుకొని రోగి కూర్చుండి యుండవలెను. మాకింటాషును, తువ్వాలును రెంటిని చక్కగ అమర్చి మెడ చుట్టు కట్టవలెను. నోటిని శుభ్రము చేసెడు మందునీటితో మొదట రోగియొక్క నోటిని బాగుగ శుభ్రము చేయవలెను. గొట్టమునకు లూబ్రికెంట్ పూసి, కడుపు శుభ్రము చేసినపుడు పెట్టినంతలోతునకే ఇప్పుడును ఈ గొట్టమును పెట్టవలెను. దీనిని పెట్టుచుండగ మ్రింగుచుండుమని రోగిని ప్రోత్సహించవలెను. గొట్టముమీదిగురుతు పండ్లను దాటిపోకూడదు. ఇంతవరకు గొట్టముపోయినయెడల అది కడుపులోనికి పోయినదని తలంచవలెను. ఇట్లు గొట్టమును ప్రవేశపెట్టిన తరువాత కడుపులోనిగాలి దానిగుండ బైటికి పోవునట్లు గొట్టమును కొన్నినిమిషములు పైకెత్తిపట్టుకొనవలెను. పిమ్మట ద్రవాహారమును మెల్లగ గొట్టములోనికి పోయవలెను; ఇట్లే ఏదైన మందునుగూడ పోయవలెను. ఆహారము ద్రవరూపమున నుండవలెను. అనగా పాలు, గ్రుడ్లు, గంజి మొదలగువాని నియ్యవలెను. గొట్టమును తీసివేయకముందు రోగి ఆహారముయొక్కయు మందుయొక్కయు ఫలితమును సంపూర్ణముగా పొందునట్లు కొంచెము మంచినీరు గొట్టములోనికి పోయవలెను. పిమ్మట గొట్టమును గట్టిగ ఒత్తిపట్టి త్వరగ బైటికి తీసివేయవలెను. దీనిని తీసివేయుటయందు ఆలస్యముగాని తప్పుగాని జరిగినట్లైన రోగి వాంతిచేయుటకు ప్రేరేపింప

[1] Esophageal feeding.

బడవచ్చును. ఈ పనియైనపిమ్మట రోగి నోటిని తిరిగి శుభ్రము చేయవలెను. రోగియొక్క వ్యాధినిబట్టియు, వయస్సునుబట్టియు ఆమెకు ఇయ్యవలసిన ఆహారపుకొలత అర్ధనుండి ఒక పైంటువరకు మారుచుండును. సాధారణముగా 4 నుండి 6 గంటల కొకసారి రోగికి భోజనమిచ్చుచుందురు.

రోగికి భోజనమిచ్చెడు మరియొక్కవ సులభమైన పద్ధతి యేదనగా:—ఒక గాజుసిరింజియొక్క [1]ముక్కునకు 4, 5 అంగుళముల పొడుగైన రబ్బరు గొట్టము నమర్చుదురు. పిమ్మట గొట్టమును నోటిలోపెట్టి గొంతువెనుక తట్టునకు పోవునట్లు దానిని మెల్లగా నెట్టుచుందురు. ఈ పనిచేయుచుండగా, రోగి తన దవుడలను బిగబట్టియే యుండినయెడల, పండ్లు, చెంపలమధ్యకు వచ్చునట్లు గొట్టమును వెనుకకు నెట్టవలెను. గొట్టము సరియైన స్థలములో నున్నప్పుడు సిరింజిలోనున్న ద్రవాహారము మెల్లగా లోపలికి పోవునట్లు ఒత్తవలెను. అప్పుడది తిన్నగా అంగిటిలో పడును. దీనికి బదులు పద్ధతి యేదనగా:—భోజనపు గిన్నెకు కుఱుచయైన రబ్బరు గొట్టమును తగిలించి త్రాగించుట.

ముక్కుద్వారా ఆహారమిచ్చుట

పరికరములు:—ఒక క్యాథిటరు (దీనిసైజు 7—8 Fr.)., ఈ క్యాథిటరును కుఱుచయైన ఒక రబ్బరు గొట్టమునకు తగిలించవలెను. ఈ గొట్టము ఒక గాజు ఫనలుకు సంబంధపడి యుండవలెను. వీని నన్నిటిని పొంగించి, ఒక పాత్రలోని ఉడుకు నీటిలోపెట్టి మూతవేసి యుంచవలెను. గొట్టమునకు అమర్చగలిగిన ఒక క్లిప్పు, [2]లిక్విడ్ పారఫిన్‌వంటి మంటపుట్టనట్టి తైలము, ఒక చిన్నపాత్రలో [3]సేలైను లోషను, దూదియుండలు, మాకింటాషు, తువాలు మొదలగు పరికరములుకూడ కావలెను. రోగికి నిచ్చెడు ఆహారమును వడయగట్టి, వేడిగా నుండునట్లు దానిని వేడినీటి పాత్రలో పెట్టి యుంచవలెను.

పద్ధతి:—రోగిని కూర్చుండబెట్టిగాని, పరుండబెట్టిగాని భోజనమియ్యవచ్చునుగాని, ఆమెను కూర్చుండబెట్టి యిచ్చుటయే శ్రేష్ఠము. రోగి పడక చెడకుండ దానిమీద మాకింటాషు, తువాలు పరిచెదరు. దూది ఉండలను లేక పుల్లలను సేలైను లోషనులో తడిపి ముక్కుపుటములను

[1] Nozzle. [2] Liquid paraffin. [3] Saline lotion.



(రంధ్రములను) శుభ్రము చేయుదురు. ఈ పనికి బోరిక్ లోషనుకంటె సేలైనునే ఉపయోగించుట మంచిది. ఎందుకనగా, బోరిక్ కొంచెము ఒగరుగాను, మంటపుట్టునదిగాను నుండును. గ్లిసరీనుగూడ మంటపుట్టునదేగాన, అదియు ఈ పనికంత శ్రేష్ఠమైనదికాదు. క్యాథిటరుకు లూబ్రికెంట్ పూసి, ఏ ముక్కురంధ్రము శుభ్రముగాను, గాలి ధారాళముగా పోవునదిగాను ఉన్నదో చూచి, దానిని ఏర్పర్చుకొనుము. క్యాథిటరును వెనుకకును, క్రిందికిని నెమ్మదిగా (మృదువుగా) ప్రవేశపెట్టుముగాని త్వరగా పనిచేయుము. అది సప్తపథవరకు పోయినప్పుడు కొంచెము అడ్డుపడినట్టుండును; మరియు రోగికి వాంతివచ్చినట్టును ఉండును. అప్పుడు రోగి తలను కొంచెము ముందుకువంచి గొట్టమును లోనికి పోనిచ్చుచుండవలెను. క్యాథిటరు అన్నవాహికలో నున్నప్పుడు సప్తపథలోని జిల ఆగిపోవును. నీవు ప్రవేశపెట్టుగొట్టము వెనుకకు తిరిగి చుట్టచుట్టుకొని నోటిలోనికి రాకుండను [1]శ్వాసనాళములోనికి దిగి పోకుండను జాగ్రత్తగా నుండవలెను. ఈ పని జరుగుచుండగా రోగి సుఖముగా నున్నదా, [2]నీలిరంగుగా మారినదా, దగ్గుచున్నదా యని గమనించుము. క్యాథిటరు శ్వాసనాళములోనికి దూరియుండినయెడల, ఈలవంటి శబ్దము వినవచ్చునుగాన, ఫనలునొద్ద చెవియుంచి ఆలకించుము. లేక ఫనలు మూతిని నీటిలో నుంచుము. గాలి బుడుగలు రాక నిలిచిపోయినట్లయిన, గొట్టము అన్నవాహికలోనికి దూరినదని గ్రహించవచ్చును. అప్పుడు రోగికియ్యవలసిన ఆహారముగాని, మందుగాని పోయుము. పైన గొట్టములో ఏమి మిగిలియుండకుండ కొంచెము నీళ్లుపోయుము. పిమ్మట ముక్కురంధ్రమునొద్ద గొట్టమును బాగుగా నొక్కి, త్వరగా బయటికి తీసివేయుము. ముక్కును తుడిచి, పుండుగా నుండినయెడల లూబ్రికెంటు తైలము పూయుము. కొన్నిసారులు క్యాథిటరును ముక్కులోపల విడిచియుంచెదరు. అప్పుడు దానిని భోజనము నిచ్చినతర్వాత శుభ్రముచేసి, అడ్‌హిసివ్ ప్లాస్టరుతో రోగి కణతప్రక్క నంటించవలెను.

[3]కల్పితమార్గములచే ఆహారమిచ్చుట:—కడుపుపైనున్న చర్మముగుండ ఆహార కోశములోనికి సేరుగ రంధ్రము చేయుదానికి [4]గ్యాస్ట్రాస్టోమి యని

[1] Trachea. [2] Cyanosed.
[3] Feeding through Artificial openings. [4] Gastrostomy.

పేరు. ఆపరేషను చేయు సమయములో చేసిన రంధ్రమందు ఒక గాజు గొట్టము లేక క్యాతిటరు పెట్టి దానికొనకు మరబందుపట్టించి, నిర్మలమైన దూదితో చుట్టి, గాయపు కట్టు పైభాగమునకు ఒక పిన్నుతో గుచ్చవలెను. ఈ గొట్టముగుండ అప్పుడప్పుడు ఆహారమును ఆహారకోశములోనికి ఎక్కించెదరు. ఈ యాపరేషను ఇసఫేగాస్టమి (అన్నవాహికలోనికి రంధ్రము చేయుట) లేక డుయాడినాస్టమి (ఆంత్రమూలములోనికి రంధ్రముచేయుట) గాని అయినయెడల ఈ యాహార మెక్కించుటను గ్యాస్ట్రాస్టోమిలో ఎక్కించినట్లే ఎక్కించవలెను.

పరికరములు:—కనెక్టింగ్ గాజుగొట్టము, ఒక రబ్బరు గొట్టపుముక్క, ఒక గాజుఘనలుగాని లేక ఒక గాజు సిరంజిగాని—వీనిని పొంగించి వెచ్చనినీళ్ల బేసినులో పెట్టి మూతవేసి యుంచవలెను. రోగికిచ్చెడు ద్రవాహారమును వడియగట్టి కొలతగ్లాసులో పోసి దీనినికూడ వెచ్చని నీటి పాత్రయందు ఉంచవలెను. రోగికిచ్చు ఆహారము, సంపూర్ణాహారమున కుండవలసిన లక్షణములన్నియు గలిగియుండవలెను. అనగా, పాలు, గ్రుడ్లు, గంజి, ఆరెంజిపండ్లరసము, గొడ్డుమాంసరసము, చక్కెర మొదలగునవి చేరియుండవలెను. క్యాతిటరులో అడ్డులేకుండ యుండునట్లును, ఆహారమిచ్చిన తరువాత దానిని శుభ్రము చేయుటకును దానిగుండ వట్టినీళ్లు కారనిచ్చుట అవసరము. రోగి గుడ్డలు, పడక చెడిపోకుండ ఒక తువ్వాలును వాడుటకూడ అవసరము.

పద్ధతి:—గాయపుకట్టు మీద తువాలునమర్చి, క్యాతిటరుకు గొట్టమును ఘనలును అంటించి, మరబందును తీయవలెను. తరువాత కొంచెము వట్టినీటిని గొట్టములోనికి పోయవలెను. క్యాతిటరులో అడ్డులేకపోయిన, ఆహారమియ్యవచ్చును. చివరకు వట్టినీటిని పోయవలెను. క్యాతిటరును మరబందుతో మూసి, గాజుగొట్టమును తీసివేయుము. గాయపు కట్టుమీద క్యాతిటరుండవలసిన స్థలమున దానిని బిగించి, ఆహారమిచ్చిన పరికరములన్నిటిని కడిగి, పొంగించి, మరియొకసారి ఆహారమిచ్చుటకు సిద్ధముగ నుంచవలెను. కొన్నిసారులు క్యాతిటరు గాయములోపలనే నిలిచి యుండుటకు వీలులేనిరీతిగా ఆపరేషను చేయుదురు. అప్పుడు భోజనమిచ్చునపుడెల్ల ఈ సాధనమును ప్రవేశపెట్టవలసియుండును. ఇట్లు చేయునపుడు కడుపులోని రంధ్రమును సాధారణమైన శస్త్రగాయముగ భావించి



దానికి చికిత్స చేయుచుండవలెను. ఆహారకోశములోని పదార్థములు చర్మముమీద పడినయెడల అది కందవచ్చును. ఈ స్థితి రాకుండ చేయుటకు ములాము పట్టించవచ్చును. [1]ల్యానొలిన్ లేక పందిక్రొవ్వు అనునవి జీర్ణరసములతో కలిసిపోవచ్చును గాన, వానికంటె లిక్విడ్ పారఫిను లేక వ్యాజలీనును ఉపయోగించుట శ్రేష్ఠము.



10. గ్యాస్ట్రాస్టోమి రోగికి ఆహారమిచ్చుట

## కోలన్ ఇరిగేషన్

[2]ఎక్లాంమ్సియ (ప్రసవసంబంధమైన ఈడ్పులు) వంటి వ్యాధులయందు ప్రేగులలో ఏర్పడు విషపదార్థములను, అతివిరేచనమువలన కలుగు బాధను తొలగించుటకు పెద్దప్రేగును కడుగుదురు. ఇట్లు కడుగుటకు ద్రవమును తెంపులేకుండ లోపలి కెక్కించి తిరిగి అది బైటికి వచ్చునట్లు చేయుదురు. ఈ పనికి [3]కోలన్ ఇరిగేషన్ లేక పెద్ద ప్రేగును కడుగుట అని పేరు. రక్తభేది బాధను, [4]అధోవాయువును తొలగించుటకు ఈ చికిత్స చేయుదురు. జ్వరమును తగ్గించుటకును ఈ పనిని చేయుదురుగాని దీనికి మంచునీళ్లను ఉపయోగించెదరు. ద్రవమువలన ప్రేగును వేడిచేయుటకును పెద్దప్రేగును కడిగెడు సదుపాయమునే చేయుదురు.

[1] Lanoline or lard. [2] Eclampsia. [3] Colon Irrigation. [4] Flatulence.

పరికరములు:—ఈ చికిత్స చేయుటకు ఫనలు, గొట్టము, క్యాతిటరు కావలెను. మునుపటివలె ఇప్పుడుకూడ క్యాతిటరు పెట్టకముందు లూబ్రికేంట్ను పూయవలెను. ఈ పనికి కొంచెము సబ్బుకలిపిన నీటినిగాని, నార్మల్ సేలైన్గాని, బోరిక్ లోషనునుగాని మరేదైన [1]ఒగరుగల ద్రవమునుగాని వాడవచ్చును.

పద్ధతి:—పిరుదులు వీలైనంతవరకు మంచము అంచున నుండునట్లు రోగిని లెఫ్ట్ ల్యాటరల్ పొజిషను (ఎడమతట్టునకు ఒదిగి పరుండు తీరు)లో నుంచవలెను. పడకఅంచును కాపాడుటకై రోగి తొంటిక్రింద కెల్లిప్యాడునుగాని, చిన్న మాకింటాషును, డ్రాషీటునుగాని వేయుదురు. రోగి లోపలినుండి తిరిగివచ్చెడు ద్రవమును పట్టుటకు ఒక చిన్న తెల్లనిపాత్రయు, ఒక తొట్టియు అవసరమైయుండును. అవసరమైనప్పుడెల్ల రెండవ నర్సు ద్రవమును ఫనలులోనికి పోయుచు, బయటికివచ్చు ద్రవమును తొట్టిలో పోయకముందు, చిన్నపాత్రలోనికి దానిని పట్టుకొనుటకు సహాయము చేయవలెను. దీనివలన ఏమైన విపరీతములున్న, వానిని గుర్తించవచ్చును. అవసరమైనను, విపరీతముగ కనబడినను, దానిని మాదిరికొరకు ఎత్తిపెట్టవచ్చును. గాలి యేమాత్రమును ప్రేగులోనికి పోకుండ నర్సు జాగ్రత్తగ చూడవలెను. మొట్టమొదట ఒక ఫనలు నిండెడు పరిమాణముగల ద్రవముమాత్రమే పోవునట్లు చూడవలెను. ఈ ద్రవమంతయు ఫనలుగుండ గొట్టముక్రిందికి పోవునప్పుడు ప్రేగులలోని పదార్థమంతయు సైఫను యొక్క నియమమును అనుసరించి బయటికివచ్చునట్లు ఫనలును త్వరగ మంచముక్రిందికి దించి పట్టుకొనవలెను. ద్రవము బైటికివచ్చుట నిలిచిపోగానే ఫనలును క్రిందికి దించియున్న తీరులోనే తిరిగి నింపవలెను. అట్లుకాకుండ నింపకముందే దానిని ఎత్తినయెడల గొట్టమునిండ గాలిచేరి, అది సైఫనువలె పనిచేయుట చెడిపోవును; పైగ దీనివలన రోగికి బాధయు కలుగవచ్చును. ఫనలును నింపినతరువాత దానిని పైకెత్తి ద్రవము నిదానముగా లోపలికిపోవునట్లు చేయవలెను. పిమ్మట ముందటివలెనే త్వరగ క్రిందికి దించవలెను. ఇట్లు అనేకసార్లు చేయుచు ఒక్కొక్కసారి ద్రవముయొక్క కొలతను ఒక పైంటు లేక కొంచెము ఎక్కువ ఉండునట్లు హెచ్చించుచుండవలెను. ఇట్లు ప్రేగును కడుగుచుండగా క్యాతిటరు

[1] Astringent solution.



పొడుగంతయు లోపలికిపోవువరకు దానిని నిదానముగ ప్రవేశపెట్టుచుండవలెను. నియమించబడిన ద్రవమంతయు అయిపోవువరకును లోపలినుండి వచ్చెడి ద్రవము శుభ్రముగ వచ్చువరకును ఈ పనిని చేయుచునే యుండవలెను. తరుచుగ ఈ పనికి 8—10 క్వార్టుల ద్రవము అవసరమై యుండును. 'ప్రేగును కడుగుట' యను పని ముగిసినతరువాత ప్రేగులోపల నిలిచియుండుటకుగాను [1]టానిక్ ఆసిడ్ ద్రవమువంటి ఒగరు ద్రవమును ఇయ్యవలెనని వైద్యుడు చెప్పవచ్చును.

కోలన్ (పెద్దప్రేగును) కడుగుటకు మరియొక సులభమైనమార్గము గలదు. దీనిని రెండు గొట్టముల పద్ధతియందురు. దీనివలన సైఫనేజ్ నుపయోగించవలసిన అవసరము లేకపోవుటయేగాక తెంపులేకుండ కడుగుటకును వీలగును.

పరికరములు:—కడిగెడు ద్రవము, 20 Fr. క్యాతిటరుకు రబ్బరుగొట్టము తగిలించియుండు ఒక పిచికారుడబ్బా (ఇరిగేటింగ్ క్యాన్), ఒక రెక్టల్ ట్యూబ్, వ్యాజిలీను, కెల్లిప్యాడు, తువాలు, అడ్హిసివ్ ప్లాస్టర్.

పద్ధతి:—రెండు గొట్టములలో క్యాతిటరుమీద మొదటనుండి 7 అంగుళములును, రెక్టల్ట్యూబ్ మీద 4 అంగుళములును గుర్తించి అంత దూరము సన్నని అడ్హిసివ్ ప్లాస్టరు అంటించవలెను. వీనిని ప్రవేశపెట్టకముందు క్యాతిటరు కొనను [2]రెక్టల్ట్యూబ్ కంటిద్వారములో ఇరికించవలెను. పిమ్మట రెంటిని ఒకే గొట్టమువలె ప్రవేశపెట్టవలెను. క్యాతిటరును దానిమీదనున్న గురుతువరకు ప్రవేశపెట్టినతరువాత దానిని గట్టిగపట్టుకొని రెక్టల్ట్యూబును దాని గురుతువరకు మెల్లగ లోపలికి త్రోయుము. ఇట్లు చేయుటవలన రెండు గొట్టములు వేరగును. ద్రవము లోపలికి పోనిచ్చెడు గొట్టముయొక్క మరబందును ఇప్పుడు తెరచి ద్రవమును నిదానముగ లోపలికి పోనియ్యవలెను. దాదాపు ఇదేసమయములో ప్రేగునుండి బైటికివచ్చు ద్రవముయొక్క గొట్టము పనిచేయనారంభించును. అప్పుడు ఆ ద్రవముయొక్క వాసన, దానిలో కలిసియున్న బంకకొలత, మలము, ఆహారపు ముక్కలు మొదలగువానిని గమనించి చూడవలెను. ఈ చికిత్స ముగిసినతరువాత రోగిని తుడిచి తడిలేకుండ చూడవలెను. పడకను చక్క చేయవలెను. పరికరములను తీసివేయవలెను.

[1] Tannic acid. [2] Eye of the rectal tube.

ఈ పనికిముందు రోగి మలవిసర్జనము చేసియుండనియెడల, సాధారణమైన ఎనీమానిచ్చి రోగికి విరేచనమగునట్లు చేయవలెను.

### మూత్రమును తీయు సదుపాయము (క్యాతిటరైజేషన్)

మూత్రకోశమునుండి మూత్రమును బైటికితీయుటకు మూత్రమును తీయు సదుపాయము లేక [1]క్యాతిటరైజేషను అని పేరు. ఇతరభాగముల కంటె మూత్రపుసంచికి మరి యెక్కువ త్వరగ అంటుతగులునుగాన ఈ పనిచేయుచుండగ సూక్ష్మజీవులవలన అంటువ్యాపించకుండ అధిక జాగ్రత గలిగియుండవలెను. సూక్ష్మజీవుల ప్రభావమువలన మూత్రము త్వరగ చెడిపోవును. కావున ఇట్టి సూక్ష్మజీవులు మూత్రపు సంచిలో ప్రవేశించిన యెడల ఆ సంచిచుట్టునుండు అమత్వచ కందవచ్చును. ఇట్లు కందిన దానికి [2]సిస్టైటిస్ అని పేరు. ఈ వ్యాధివచ్చినతరువాత దానిని మాన్పుట కష్టము. ఆరోగ్యమునకు దీనివలన కలుగు కీడు చాలా కాలముండును. క్యాతిటరైజేషన్ అను పనిని చేయుచుండగా అజాగ్రతగనుండుటవలన ఈ వ్యాధి సంభవించును. ఇట్టిది సంభవించినయెడల దానినిగూర్చిన నెపము నర్సుమీదనుండును. అనగా అది నర్సుయొక్క తప్పైయుండును. శస్త్రక్రియలనెంత జాగ్రత్తగచేసినను క్రమముగ క్యాతిటరైజేషను చేయుట వలన సిస్టైటిస్ రావచ్చును. మూత్రము పలుమారు నిలిచియుండుటవలన సంచి బలహీనపడుటచేతను, బహుశ ఈ వ్యాధి సంభవించుచుండును.

మూత్రమార్గపు (యూరిత్రల్) క్యాతిటరు నుపయోగించి క్యాతిటరైజేషన్ చేయుదురు. ఈ క్యాతిటరు మెత్తని రబ్బరు, గాజు, లోహము— వీనిలో ఏదైన ఒకదానితో చేయబడినదై యుండవచ్చును. పరిమాణ మందును (పొడుగునందు) ఆకారమందును ఈ క్యాతిటరులు వివిధముగ భేదించియుండును. స్త్రీల కుపయోగించునవి కుఱుచగాను చివర కొద్దిగ మాత్రమే వంగియు నుండును. ఇవి గాజుతోగాని, రబ్బరుతోగాని, లోహ ముతోగాని చేయబడి యుండవచ్చును. పురుషులకు ఉపయోగించునవి లోహపుసాధనములైనయెడల, అవి మరి యెక్కువ పొడుగుగాను, వంకర గాను ఉండును. లోహపు క్యాతిటరులను వైద్యులు ఎప్పుడో ఒకప్పుడు ఉపయోగించెదరు; కాని నర్సులు వానిని ఎన్నడును ఉపయోగించకూడదు.

[1] Catheterisation. [2] Cystitis.



మెత్తని రబ్బరు క్యాతిటరులను స్త్రీ పురుషులైన రోగులందరికి వాడుచుందురు. స్వయముగ లోపలనిలుచు క్యాతిటరులు మెత్తని రబ్బరుతో చేయబడి యుండును. [1]యోని, మూత్రకోశములమధ్య రంధ్రము పడినప్పుడు మూత్రకోశమును ఖాళిగ నుంచుటకు వీనిని ఉపయోగించెదరు. ఇట్టి సాధనముల కొనలయందు బుడుపులుండునుగాన ఈ రకము క్యాతిటరులు బైటికి జారి పోజాలవు. వీనిని [2]దారిచూపెడు సాధనము (ప్రోబ్) మూల మున లోపలికి ప్రవేశపెట్టుదురు. మూత్రనాళపు క్యాతిటరులను పొడుగు గాను సన్నగాను ఉండునట్లు చేయుదురు. వీనిని సాగెడు రబ్బరు బంకతో చేయుదురు. మూత్రాశయమునందలి మూత్రమును ఒక్కొక్క [3]మూత్ర పిండమునుండి ప్రత్యేకముగ తీయుటకుగాని లేక వీనిలోనికి ద్రవము నెక్కించుటకుగాని ఈ రకము క్యాతిటరుల నుపయోగించెదరు.

### స్త్రీలకు క్యాతిటరైజేషను చేయుట

పరికరములు:—ఈ పనికిగాను సూక్ష్మజీవి రహితమైన (స్టెరైల్) రెండు క్యాతిటరులు (ఇవి గాజు లేక రబ్బరుతో చేయబడినవై యుండవచ్చును), సూక్ష్మజీవి రహితమైన ఒక పాత్ర, మరియొక పాత్రలో వేడి బోరిక్ లోషన్, కొన్ని దూది ఉండలు, మూత్రమును పట్టుటకు సూక్ష్మజీవి రహితమైన మరియొకపాత్ర, [4]సూక్ష్మజీవి రహితమైన కొలతగురుతులుగల ఒక గాజు పాత్ర, వాడిన దూది ఉండలను, క్యాతిటరును వేయుటకు ఒక చిన్నపాత్ర, ఒక మాకింటాషు, స్టెరైల్ తువాలు అవసరమై యుండును.

పద్ధతి:—రోగి డార్సల్‌రికంబెంటు తీరులో మోకాళ్లు ముడుచు కొని ఒకదాని కొకటి దూరముగ పెట్టుకొని యుండవలెను. తొడల మీద గుడ్డకప్పబడి యుండవలెను. క్యాతిటరును ప్రవేశపెట్టకముందు శస్త్రగాయములను కట్టునప్పటివలె నర్సు తనచేతులను బాగుగ రుద్ది కడిగి సూక్ష్మజీవి రహితమైనవిగ చేసికొనవలెను. రెండవ నర్సు అవసర మైన వస్తువులను అందించుచుండవలెను. చేతులను బాగుగ రుద్ది కడుగుకొనిన మొదటినర్సు తనబొట్టనవ్రేలు, చూపుడు వ్రేలుతో [1]యోని యొక్క పెదవులను తెరచి క్యాతిటరైజేషను పనియంతయు ముగించు వరకు వానిని ఆ తీరునే యుంచవలెను. పిమ్మట పెదవుల మధ్యనున్న

[1] Vesico vaginal fistula. [2] Director or probe. [3] Kidney.
[4] A sterile graduated glass beaker.

స్థలమును బోరిక్ ద్రవముతో కడుగవలెను. ఒక దూది ఉండతో పైనుండి క్రిందికి యోనిని ఒకేసారి తుడిచి పారవేయవలెను. ఒకసారి ఉపయోగించిన దూది ఉండను మరల ఉపయోగించకూడదు. ఒకే ఉండతో క్రిందికి పైకి తుడువనుకూడదు. ఎందుకనగా అట్లు తుడిచినయెడల ఆసనభాగమునుండి ఏదైన రోగక్రిములవలనైన అంటు మూత్రద్వారమునొద్దకు రావచ్చును. అట్లు రాకుండ చేయవలెను. భగము నుండి స్రవించెడు మలినమువలన మూత్రద్వారము అంటుపడకుండ, ఆఖరి సారి తుడిచిన దూది యుండను భగమునందే విడిచి యుంచవచ్చును. పిమ్మట పొంగించి శుద్ధిచేసినపాత్రను రోగికాళ్లమధ్య పెట్టి మూత్రమును పట్టుటకు సిద్ధముగా నుండవలెను. క్యాతిటరును సాధ్యమైనంత తేలికగా, కంటిద్వారమునుండి రెండు అంగుళముల దూరములో పట్టుకొనవలెను. అనగా, క్యాతిటరు రబ్బరుదైన యెడల యిట్లు పట్టుకొనవలెను గాని గాజు, లేక ఇతర లోహములతో చేయబడినదై గట్టిగా నుండినట్లయిన, కొనదగ్గరపట్టుకొనవలెను. గాజు క్యాతిటరును ఉపయోగించునప్పుడు, అది పగిలియున్నదేమో లేక ఓడుబారి యున్నదేమో యని నర్సు ముందుగనే దానిని పరీక్షించవలెను. పగులలేదని నిశ్చయముగా తెలిసికొనిన తరువాత, దానిని యితరభాగములకు తగలనియ్యకుండ మెల్లగా మూత్రద్వారములో పైకి క్రిందికి జరుపుచు ప్రవేశపెట్టవలెను. అట్లు వేరొకభాగమునకు తగిలినయెడల, ఆ క్యాతిటరును వెంటనే తీసివేసి, మరియొక దానిని ఉపయోగించవలెను. రోగి తన్నుతాను బిగువుగా పట్టుకొనియుండినయెడల, నోరు తెరచి, లోతుగా శ్వాసించుటమూలమున దేహమును సళ్లువదలమని ఆమెకు చెప్పవచ్చును. సాధారణమైన రోగికి క్యాతిటరును సులభముగా ప్రవేశపెట్టవచ్చును. ఏదైన ఆటంకమున్నట్టు కనబడినయెడల, క్యాతిటరును బలవంతముగా లోపలికి నెట్టకూడదు. ప్రసవమునకు వచ్చినరోగులు, చిన్నపిల్లలు, సన్నిపాతపురోగులు, స్మారకము తప్పియున్న రోగులకు ఎన్నడును గాజు క్యాతిటరు నుపయోగించకూడదు. క్యాతిటరు మూత్రపు సంచిలోనికి పోగనే, మూత్రము వెలువడ నారంభించును. రబ్బరు క్యాతిటరు నుపయోగించుచుండినయెడల, దాని బయటికొనను పొంగించి శుద్ధిచేసిన పాత్రలోనికి వంచి, మూత్రము దానిలో పడునట్లు చేయవలెను. మొదటిపాత్ర నిండినయెడల, సహా



యము చేయుచున్న రెండవనర్సు, నిండిన మూత్రపాత్రను జాగ్రత్తగా తీసివేసి, దానిబదులు మరియొక పాత్రను బెట్టవలెను. మూత్రధార ఆగినప్పుడు, క్యాతిటరును కొంచెము వెనుకకులాగుటవలన, మూత్రపుసంచి అడుగున నిలిచియున్న ఆఖరిమూత్రము బయటపడవచ్చును. దీనితరువాత క్యాతిటరు బయటి కొననుండి మిగిలిన మూత్రపుబొట్లు పడకపై పడకుండ, నర్సు ఆ కొనను బిగించి పట్టుకొని, లేక వ్రేలితో మూసిపట్టి క్యాతిటరును బయటికి తీసివేయవలెను. ఎంతమూత్రము వచ్చినది కొలిచిచూచి, కోరబడినయెడల, పరీక్షకొరకు మాదిరిమూత్రము నెత్తి పెట్టవలెను. క్యాతిటరైజేషను పనియంతయు ముగించినతరువాత రోగిని బాగుగా తుడిచి, సౌఖ్యముగా నుండునట్లు ఆమెను విడువవలెను.

### పురుషునికి క్యాతిటరైజేషను చేయుట

**పరికరములు:**—స్త్రీకి ఉపయోగించినసామానులే పురుషునికిని ఉపయోగించవలెను. ఇవిగాక పొంగించి శుద్ధిచేసిన ఒక మరబందు, కొంతనూనె అవసరమైయుండును (గాజు క్యాతిటరులను ఎన్నడును ఉపయోగించకూడదు).

పద్ధతి:—శస్త్రమునకు సిద్ధపడినట్లు నర్సు తన చేతులను శుభ్రము చేసికొని, రోగియొక్క లింగమును దేహమునుండి $60^\circ$ ల కోణములో పట్టుకొనవలెను. పిమ్మట లింగముయొక్క ముందోలును వెనుకకుతీసి బుడుపును ఆంటిసెప్టిక్‌లోషనుతో శుభ్రముచేసి [1]కొరోన అనుదాని చుట్టు పొంగించి శుద్ధిచేసిన గాజ్‌గుడ్డను చుట్టవలెను. పిమ్మట (నర్సు) తన ఎడమచేతియొక్క రెండవ, మూడవ వ్రేళ్లతో లింగమును పట్టుకొని కొనయొద్ద పెదవులను బొట్టనవ్రేలు, చూపుడువ్రేలుతో తెరచి శుభ్రము చేయును. ఈ పని చేయుచుండగ క్యాతిటరునకు పొంగించిన మరబందును మొననుండి రెండంగుళములదూరమున బిగించి దానితో క్యాతిటరునుపట్టుకొని, కొనను నూనెలోముంచి మూత్రద్వారములోనికి దానిని మెల్లగ ప్రవేశపెట్టి మూత్రము బైటికివచ్చువరకు లోపలికి పోనిచ్చును. పెక్కుసమయములలో మూత్రమార్గమునందు అడ్డు ఉన్నట్టు కనబడుట సహజమే కాని, నర్సు కొంచెము ఓపికతో ఒక నిమిషముసేపు వేచియుండినయెడల,

[1] Corona.

కండరములు సడలి నొప్పిలేకుండ క్యాతిటరు లోపలికిపోవుటకు వీలగును. ఈ విషయములో బలవంత మెన్నడునుచేయరాదు. అట్లుచేయుటవలన రోగికి శాశ్వతమైన గాయము కలుగవచ్చును.

[1]మూత్రాశయమును కడుగుట: – సిస్టైటీస్ అను వ్యాధియందు మూత్రపుసంచిని కడుగుట, ముఖ్యముగా ఆపరేషనుకు ముందు కడుగుట అవసరమై యుండును. గాయము మాన్పు చికిత్సలో ఇట్లు కడుగుట ఒకపనియై యుండును. క్యాతిటరైజేషనుకు అవసరమైన పరికరములే దీనికిని అవసరమైయుండునుగాని [2]రెండు మొనల క్యాతిటరు ఈ పనికి కావలెను; లేదా, Y ఆకారముననున్న గాజు సంబంధపు గొట్టముయొక్క చిన్నకొనలలో ఒకదానికి అమర్చిన సాధారణమైన క్యాతిటరైనను అవసరమై యుండును. ఈ చికిత్సను సాధారణమైన రబ్బరు క్యాతిటరు, గాజు సిరింజితోకూడా చేయవచ్చును. ఇవిగాక, ఒక గొట్టము, ఫనలు, కొన్ని యెక్కువ రబ్బరు గొట్టపు ముక్కలు, రెండు క్లిప్పులు, ఒక తర్మామీటరు (ఉష్ణమానిని) ఒక తొట్టికూడ కావలసియుండును. తక్కువ ఘాటైన లోషను, అనగా, 100°—105° F. వేడిలోనున్న బోరిక్ లోషనును ఈ పనికి సాధారణముగా ఉపయోగించెదరు. ఈ లోషను ఖచ్చితముగా రోగక్రిమిరహితమైనదై యుండునట్లు చూడవలెను. రోగికి యీ చికిత్స చేయునప్పుడు చికిత్స గదిలోని బల్లమీద [3]లితాటమి తీరులో పరుండుట రోగికి చాల అనుకూలముగా నుండును. ఇది వీలుకానప్పుడు క్యాతిటరైజేషనుచేయుచున్నప్పుడున్న తీరులోనే రోగి పడకలో పరుండవచ్చును గాని పడకచెడిపోకుండ, దానిని చాలా జాగ్రత్తగా కాపాడవలెను. ఇరిగేషను చేయకముందే క్యాతిటరుపనిని (మూత్రము తీయుపనిని) చేసి ముగించవలెను. ఈ పనియైనతరువాత క్యాతిటరును అక్లే లోపలయుండనిచ్చి, దానికి గొట్టము తగిలించవలెను. గొట్టమును, ఫనలును లోషనుతో నింపి, రెండు మొనల క్యాతిటరునకుగాని, Y సంబంధపు గొట్టమునకుగాని తగిలించకముందు, వానిని మరబందుతో బిగించవలెను. లేనియెడల, గాలి, మూత్రకోశము లోనికిపోవుటవలన గోగికి బాధయు, అసౌఖ్యమును కలుగును. Y సంబంధపు మూడవకొనకు ఒక చిన్న రబ్బరుగొట్టపు

[1] Bladder Lavage. [2] Double way catheter. [3] Lithotomy position.



ముక్క తగిలించబడియుండును. తిరిగి వచ్చెడు ద్రవము ఈ గొట్టము గుండనే వచ్చునుగాన, ఇది పాత్రలోనికి పెట్టబడియుండును. చికిత్సారంభమున ఈ గొట్టమును మరబందుతో మూసియుందురు. (ఇరిగేషను అను కడిగెడుపనిని సులభమైన సైఫను పద్ధతివలనను చేయవచ్చునుగాని, దానివలన అంత తృప్తికరమైన ఫలితము కలుగదు.) మూత్రమునంతయు తీసినతరువాత, ఫనలు గొట్టమునకు తగిలించిన మరబందును తెరచి 6 నుండి 10 ఔన్సుల లోషనును మూత్రకోశములోనికి విడువవలెను. ఈ గొట్టపు మరబందును తిరిగి మూసి, చిన్న గొట్టముమీది మరబందును తెరచి, మూత్రకోశములోని ద్రవమంతయు పాత్రలోపడునట్లు దారి విడువవలెను. ఈ రీతిగా, నియమించబడిన మొత్తము లోషనంత అయిపోవువరకుగాని, తిరిగివచ్చెడు ద్రవము తేటగావచ్చువరకుగాని, యీ పని చేయుచుండవలెను. కొన్నిసారులు ఈ చికిత్సకు పిమ్మట మూత్రకోశములో [1]ఆర్జిరాల్‌గాని, ప్రొటార్గాల్‌గాని నిలిచియుండునట్లు చేయుదురు. ఈ చికిత్సను తెంపులేకుండ చేయవలసియుండినయెడల, క్యాతిటరును మూత్రకోశములోనే నిలిచియుండనిచ్చి, పిచికారుడబ్బాను రోగిప్రక్క అమర్చిపెట్టి, దారను మరబందులతో క్రమపరచి, పనిచేయుచుందురు.. మూత్రకోశము ఖాళీచేయుటకును, కడుగుటకును ఇతర రకములైన ప్రత్యేక సాధనములు (పరికరములును) గలవు.

**డూషులు**

నీటిప్రవాహమును దేహమునందలి యేదైన ఒక భాగమును శుద్ధి చేయుటకు పాఱనిచ్చినయెడల, అట్టి నీటి పాఱుదలకు డూషు అని పేరు. ముక్కు, చెవి, భగములవంటి అవయవముల గుహాలలోని మైలను శుభ్రముచేయుటకును, వాపు తగ్గించుటకును ఈ డూషు నిచ్చెదరు.

ముక్కు, చెవులకు ఇచ్చెడి డూషులను 36-వ అధ్యాయములోను, కంటికి యిచ్చెడు డూషును 35-వ అధ్యాయములోను చదువవచ్చును.

భగము, [2]గర్భాశయ కంఠభాగము, [3]అండాశయములు, [4]గొట్టములు—ఇవి కందిన పరిస్థితులయందు భగమును గడుగుటకును వాపును తగ్గించుటకును [5]భగమునకిచ్చెడు చికిత్సగ డూషు నిచ్చెదరు. ఏ జబ్బు

[1] Argyrol or protargol. [2] Cervix. [3] Ovaries. [4] Tubes.
[5] Vaginal douche.

నకు డూషు నిచ్చెదరో దానినిబట్టి డూషునకు ఉపయోగించెడు ద్రవములు అనేకములుండును. కందిన స్థితులకు ఇచ్చెడి డూషు 110°—115°F. వేడిగలిగియుండవలెను. వేడిద్రవమువలన అపాయము కలుగకుండ కాపాడుటకై బహిర్జనావయవములకు లూబ్రికెంటు రుద్దవలసిన అవసరముండవచ్చును.

పరికరములు:—పడకను గాపాడుటకు ఒక మాకింటాషు, తువాలు, రెండు గాజు డూషు ముక్కు-గొట్టములు, ఒక పిచికారుడబ్బా లేక ఒక డూషుడబ్బా. వీనికి రబ్బరు గొట్టము, మరబందు అమర్చియుండవలెను. చాలినంత లోషను, లోషనును కొలిచెడు తర్మామీటరు, యోనిని శుభ్రము చేయుటకు కొన్ని దూదియుండలు, మురికైయైన దూదియుండలు వేయుట కొకపాత్ర, ఉపయోగించిన తరువాత డూషు ముక్కు-గొట్టమును వేయుటకు మరియొకపాత్ర, డూషు చేయగా తిరిగి బైటికి వచ్చెడి ద్రవమును పట్టుటకు ఒకపాత్ర, దానికొక మూతకావలెను.

పద్ధతి:—రోగి పడకచుట్టు పరదాలు వేసి చికిత్స చేయవచ్చును. లేక చికిత్సగదికి తీసికొనిపోయి ఈ పని చేయుట మరి అనుకూలమై యుండును. రోగియొక్క మూత్రమును కొలువవలసినప్పుడుగాని, ఆమెకు ఇష్టమైన యెడలగాని ఈ చికిత్సకుముందు ఆమె మూత్రము విడుచునట్లు చేయవలెను. శస్త్రగాయములను కట్టునపుడు నర్సు తన చేతులను శుభ్రము చేసికొనునట్లే ఇప్పుడును శుభ్రము చేసికొనవలెను. [1]ముక్కు-గొట్టమును జాగ్రతగ పొంగించవలెను. సాధారణమైన డూషులకు పిచికారుడబ్బాను గాని, గొట్టమునుగాని పొంగించ నవసరము లేదుగాని అవి చాలా శుభ్రముగ నుండవలెను. నియమముప్రకారము రోగి మోకాళ్లు ముడుచుకొని డార్సల్ రికంబెంటు తీరులో పరుండియుండును. దుప్పటితో రోగియొక్క కాళ్లను, మోకాళ్లను కప్పి యోనిభాగమును మాత్రము కప్పక తెరచియుంచవలెను. తిరిగివచ్చెడు ద్రవముకొరకైన పాత్రను రోగిక్రింద పెట్టవలెను. ద్రవప్రవాహము పాఱనిచ్చుచు యోనిని కడుగవలెను. ఏదైన మలినమైన స్రావమున్న యెడల, దానిని పొంగించిన దూదియుండలతో తుడిచివేయవలెను. పిదప యోనిపెదవులను తెరచి డూషు ముక్కు-గొట్ట

[1] Nozzle.



మును భగములోనికి ప్రవేశపెట్టవలెను. దానిని క్రిందికిని, వెనుకకును ఆడించుచు, మెల్లగా ఒక ప్రక్కనుండి మరియొకప్రక్కకు జరుపుచుండవలెను. రోగికి దాదాపు రెండడుగుల యెత్తున పిచికారుడబ్బాను తగిలించి యుండవలెను. ముక్కు-గొట్టము తీయుచుండగా దానిలోని ద్రవము తిరిగి రబ్బరు గొట్టములోనికి పాఱకుండునట్లు దానిని క్రిందికి వంచవలెను, పిమ్మట రోగికి శక్తియుండినట్లయిన, భగములోని నీరంతయు కారునట్లు, ఆమె కూర్చుండుట మంచిది. యోనిని, దానికి సంబంధించిన బహిర్జనావయవములను తడిలేకుండ తుడువవలెను; పడకనుతిరిగి చక్కచేసి, రోగి సౌఖ్యముగా నుండునట్లు చేసిపోవలెను. బయటికి స్రవించిన ద్రవమును బాగుగా పరీక్షించి, విపరీతమైన సంగతులను గుర్తించి, చార్టులో వ్రాయవలెను.

స్టెరైల్ వ్యాజినల్ డూష్:—శస్త్రము చేయబడిన రోగులకును, ప్రసవించిన వారికిని, [1]గర్భస్రావమయిన రోగులకును శస్త్రచికిత్సకు ముందును వెనుకను ఈ డూషుల నిచ్చెదరు. వీని కుపయోగించు పాత్రలు, ద్రవములన్నియు స్టెరైల్ చేయబడి శుద్ధిగనుండవలెను. డూష్ నాజల్‌కు (ముక్కు-గొట్టమునకు) బదులు ఒక రబ్బరు క్యాతిటరు నుపయోగించవచ్చును.

### ప్రాణవాయువును నేసల్ (ముక్కు) క్యాతిటరు మూలమున నిచ్చుట

న్యుమోనియ, గుండె పనికి ఆటంకము కలిగినపుడు, ఊపిరితిత్తులవాపు, [2]కార్బన్ మొనాక్సైడ్ వలనవిషము, రక్తహీనత మొదలగు రోగములకును, [3]అనెస్తిటిక్స్, నార్కోటిక్స్ మొదలగు మందులను ప్రయోగించుటవలన శ్వాస ధారాళముగా విడువలేకపోయినప్పుడు ప్రాణవాయువు నిచ్చెదరు. దీనిని ముక్కు కుపయోగించెడు క్యాతిటరు (నేసల్ క్యాతిటర్) మూలమునగాని, రబ్బరు ముసుగు (మ్యాస్కు) మూలమునగాని, ఆక్సిజెన్ టెంట్ (గుడారము) మూలమునగాని యిచ్చెదరు. ఆక్సిజెన్ టెంట్‌వలన ఇతర పద్ధతులకంటె అతిశ్రేష్ఠమైన ఫలితము కలుగుననుట నిజమేకాని, దీనిలో అగ్నియుపద్రవము లుండునుగాన, ఈ పనిచేయువాడు నిపుణుడై యుండవలెను.

సులభమైన పద్ధతి, నేసల్ (ముక్కు) క్యాతిటర్ పద్ధతి. ఆవలి పుటలోని పటము చూడుము. క్యాతిటరుకు నూనెపూసి, దానిని నాసికా

[1] Abortion. [2] Carbon Monoxide. [3] Anesthetics and Narcotics.

రంధ్రములో ప్రవేశపెట్టి, వెనుకకు ముందుకు జరుపుము. అది [1]సప్తపథ (గళము) గోడవెనుకకు పోవువరకు లోపలికి పోనిమ్ము. ఈ క్యాథిటరు



11. నేసల్ క్యాథిటరుతో ప్రాణవాయువు నిచ్చుట

యొక్క వెలుపలికొనను రోగి బుగ్గకు అడ్హిసివ్ నాడాలతో అతికించుము. ప్రాణవాయువు పీపావంటి ఒక డబ్బాలో ఒత్తిడిక్రింద అణిచిపెట్టబడియుండును. దీనిని రోగికియ్యకముందు ఒక నీటి బుడ్డి ద్వారా దానిని పోనిచ్చెదరు. ఈ బుడ్డిని ప్రాణవాయువున్న పీపాకు అమర్చి ఒక రబ్బరు మరబందుతో బిగించియుందురు. ఈ మరబందు గుండ రెండు గాజుగొట్టములను దూర్చుదురు. ఒక గొట్టము నీటివరకు పోయి ప్రాణవాయువు పీపానుండి రోగికి అందునట్లు చేయును. రెండవ గొట్టము నీటికిపైన ఉండి, ఒక పొడుగైన రబ్బరుగొట్టముమూలమున తడి ప్రాణవాయువును క్యాథిటరులోనికి పోవునట్లు చేయును. ప్రాణవాయువు సరియైన వేగముగ పాఱునట్లును గొట్టములన్నియు సరిగ అమర్చబడియుండునట్లును, పనికి అవసరమైనంత ప్రాణవాయువు దగ్గరయుండునట్లు చూచుటయు నర్సుయొక్క విధి. రోగి [2]నీలిరంగుగానుండుట (సైనోసిస్) తగ్గువరకు ఈ చికిత్స చేయుచునే యుండవలెను.

[1] Pharynx. [2] Cyanosis.

అధ్యాయము 9

# వెచ్చదనము, చల్లదనముయొక్క ప్రయోగములు

## 1. సాధారణ ప్రయోగములు

### వేడిస్నానములు, ప్యాకులు

సాధారణముగ వేడిని దేహమునకు ప్రయోగించుటవలన దేహోష్ణము అధికమగును. దేహములోని వేడిమి బైటకుపోకుండ కాపాడి, చెమటపట్టునట్లు చేయును. ఈ విధముగ మూత్రపిండముల పని కొంత వరకు తగ్గును. చర్మము పైభాగముననున్న కొనసరములకు ఈ వేడివలన చురుకుపుట్టును. అందువలన కేంద్రనాడులును చురుకుగలిగి యెక్కువ పని చేయును. నాడి రేటును హెచ్చును. కొన్ని సందర్భములలో ఇట్లు వేడిని ప్రయోగించినప్పుడు ముఖ్యముగ మెదడువంటి లోపలి అవయవములలో [1]రక్తము అధికముగ చేరును. అందువలన తలనొప్పి, రక్తనాళములు కొట్టుకొనుట మొదలగు బాధలు కలుగకుండ చేయుటకు సామాన్య వేడి ప్రయోగమునందు తలకు చల్లనిగుడ్డ వేయవలెను. కొంతకాలమైన తరువాత దేహము కొంచెము సడలి రోగికి నిద్రపట్టినట్లుండును. అప్పుడు అతనికి కొంచెము హాయిగనుండును. ఇంతకుముందు చురుకుగలిగి పనిచేయు అవయవములు ఇప్పుడు కొంచెము మందగించును. కాబట్టి ఈ చికిత్స జరుగుసంతకాలము రోగి నాడిని గమనించుచుండవలెను. రోగికి చురుకుదనము పుట్టించు మందులు సిద్ధముగ దగ్గరనుండవలెను. ఏవైన అపాయకరమైన చిహ్నములు రోగియందు కనబడకముందే ఈ చికిత్సను ఆపుటకుకూడ సిద్ధముగనుండవలెను. వేడిప్రయోగములు పొడిగనైనను, తడిగనైనను ఉండవచ్చును. తడిప్రయోగములు పొడిప్రయోగములకంటె రోగికి ఎక్కువ సుఖమునిచ్చును. వానికంటె ఇవి యెక్కువ ఫలితము నిచ్చునవి యనియు అనేకులు తలంచుచున్నారు. ఏ చికిత్సవలన రోగికి

[1] Congestion.

అధమపక్షము బాధకలుగునో అనగా మిక్కిలి తక్కువ బాధకలుగునో అదియే శ్రేష్ఠమైన చికిత్స.

95°—100° F. ఉష్ణముగల వేడిస్నానములను వెవ్వేరు సందర్భములలో ఉపయోగించెదరు. ముఖ్యముగ [1]నిర్నిద్ర అను రోగమునందు ఈ స్నానములు ఎక్కువ ఉపయోగపడును. ఉడుకునీళ్లలో పరుండియుండుటవలన మొత్తనుమీద రక్తప్రసరణమునకు కొంత ఉపశమనము కలుగును; కండరములు సడలును. మెదడుయొక్క చురుకుతనము లేక పని కొంత తగ్గును. ఏడ్చి తొందరచేయు బిడ్డకు ఇది మంచి చికిత్సయై యుండును. చర్మవ్యాధులకు ఆంటిసెప్టిక్ మందులను కలిపి వేడినీళ్ల స్నానముచేయుట చాల లాభకరమైన చికిత్సయైయుండును.

110° F. ఉష్ణోగ్రతగల వేడిస్నానములు [2]నెఫ్రైటిస్, (మూత్రపిండదాహము) అను వ్యాధియందును [3]యురీమియ (రక్తక్షీవిసన్నిపాతము) అను వ్యాధియందును చెమటపట్టుటకును, ఈడ్పువంటి వ్యాధులలో కండరములు సడలుటకును చాల ఉపయోగపడును. అమితముగ చెమటపోసి ఆరిపోవుటవలనను, చలిపుట్టుటవలనను కలుగు వణకును తగ్గించుటకును, ఇట్టి బాధ హెచ్చకుండుటకును ఈ చికిత్స చాల ఉపయోగపడును. రోగికి స్నానముచేయ నారంభించినపుడు నీరు మొదట 100° F. ఉష్ణోగ్రతలో నుండవలెను. స్నానము చేయుచుండగ ఈ ఉష్ణోగ్రతను 110° F. వరకు క్రమేణ హెచ్చించవచ్చును. వేడినీటి ఆవిరి బైటకు పోకుండ ఒక కంబళి కప్పి ఈ స్నానము చేయించవలెను. రోగి తలకు ఒక చల్లని తడిగుడ్డ చుట్టవలెను. స్నానము జరుగుచుండగా గాని రోగిని పడకలో పరుండబెట్టిన వెంటనేగాని వేడి పానీయము నీయవలెను. ఈ స్నానము 10-15 నిమిషములవరకు చేయించవచ్చును.

[4]వేడి, తడిప్యాక్

పరికరములు:—వేడిప్యాక్‌కొరకు ఒక పొడుగైన మాకింటాషును ఒక పొడికంబళితో కప్పి, పడక చెడిపోకుండ దానిని రోగిక్రింద వేయవలెను. రెండవ పొడికంబళిని రోగిమీద కప్పవలెను. ఈ రెండు కంబళ్ల మధ్య రోగియొక్క స్వంత దుస్తులను ఊడదీసి వేయవలెను. తడిప్యాక్ కొరకు రెండు సన్నని పాతకంబళ్లు కావలెను. రెండు కొనలయందు

[1] Insomnia. [2] Nephritis. [3] Uremia. [4] Hot wet pack.



నీటిని పిండుటకు వీలగు కట్టులమర్చిన ఒక [1]పిండెడు సాధనము (రింగరు) కావలెను. ఇవిగాక వేడినీటిబుడ్లు, ఒక మంచుతిత్తి, ఉష్ణముగల 3 కంబళ్లు, వేడి, లేక చల్లని పానీయములును కావలెను.

పద్ధతి:—ప్యాక్‌పని నారంభించకముందు రోగికి పడకచేట్టి నియ్యవలెను. పిండెడు సాధనములో కంబళ్లను బెట్టి మడువవలెను. పిమ్మట వానిని ఒక చిన్నస్నానపు తొట్టిలో పెట్టవలెను. 180°—200° F. ఉష్ణోగ్రతగల వేడినీటిని ఆ కంబళ్లమీద పోయవలెను. వీనిని పిండినప్పుడు, వీనియందలి యుష్ణోగ్రత 120° F. ఉండును. ఈ పనికి అవసరమైన ఉష్ణోగ్రత యిదియే. పిండెడు సాధనములోనుండి ఒక కంబళిని తీసి, దానిలోని యావిరంతయు పోవునట్లు దానిని బాగుగా విదిలించవలెను. పిమ్మట రోగి పడకపై పరుండియుండగా, ఆమెప్రక్కన యీ కంబళిని పడకపొడుగున పెట్టవలెను. పిమ్మట రోగిని మెల్లగా అవతలికి పొర్లించి, ఆమెక్రింద ఈ కంబళిని పరిచి, తిరిగి మెల్లగా ఆమెను ఇవతలకి త్రిప్పవలెను. ఇట్లే రెండవ కంబళినిగూడ ఆవిరిపోవునట్లు బాగుగా విదిలించి (దులిపి) రోగి ముందరిభాగమున కప్పవలెను. ఈ వేడి తడికంబళ్లను రోగి చంకలక్రింద, చేతులు, కాళ్లచుట్టు బాగుగా దోపి, చుట్టవలెను. ఇట్లు తడికంబళ్లు రోగికి చుట్టినతరువాత, ఆమెమీద పొడి కంబళ్లు బాగుగా కప్పి, దానిమీద వేడినీటిబుడ్లుపెట్టి యుంచవలెను. ఒక గుడ్డను చన్నీటిలో తడిపిగాని, మంచుసంచినిగాని, రోగి తలపైన పెట్టవలెను. ఇట్లు ఈ ప్యాక్ 20—30 నిమిషములు నిలిచియుండవలెను.

ఈ చికిత్స జరుగునంతకాలము రోగిని జాగ్రత్తగా కనిపెట్టుచు, కణతదగ్గర నాడితీయవలెను. రోగి నొసలుమీద చెమటపోసినయెడల, చికిత్స బాగుగా పనిచేయుచున్నదని యర్థమగును. చెమట రోగికి అసౌఖ్యముగా నుండునుగాన, ఆ చెమటను తుడిచివేయవలెను. రోగికి వేడి పానీయము లీయవచ్చునుగాని, వానివలన తనకు సుఖము కలుగలేదని రోగి అనినయెడల వానిబదులు చల్లని పానీయము లియ్యవలెను. వాపు సంబంధమైన రోగములకు తప్ప, ఈ చికిత్సచేయు ఇతర సమయములలో రోగికి ద్రవాహారములు త్రాపుట యనునది చాల ముఖ్యమైన విషయము. వాపు ఉన్నప్పుడు ద్రవములను రోగికి యియ్యనియ్యరు. ఈ చికిత్సయైన

[1] Wringer.

తరువాత, తడికంబళ్లను నెమ్మదిగా తీసివేసి, రోగిని కదలకుండ పొడికంబళ్లలో గంట లేక దానికంటె కొంచెము ఎక్కువసేపు పరుండియుండనీయవలెను. ఇట్లు చేయుటవలన మరి యెక్కువ చెమట పోయును. దీనితరువాత రోగి దేహమును బాగుగా తుడువవలెను. వీపును ముఖ్యముగా గమనించి తుడువవలెను. పిమ్మట ఆమెకు గుడ్డలువేసి, పడకను, కంబళిపడకవలె తిరిగి చెక్క చేయవలెను. అనగా మాకింటాషు, డ్రాషీటుక్రింద ఒక కంబళిని పరచి, రోగిమీాద మరియొక కంబళి కప్పవలెను. రోగి పాదములయొద్ద ఒక ఉడుకునీటి బుడ్డిని పెట్టవచ్చును.

[1]వేడి, పొడిప్యాక్ ×

పరికరములు:—రెండు వేడి పొడికంబళ్లు, కొన్ని వేడినీటిబుడ్లు, మంచు తిత్తి, లేక చల్లని తడిగుడ్డ, వేడి, లేక చల్లని పానీయములు, కిడ్నీ ట్రే, క్రొత్తిగాను, స్నానపుతువాలు, కొన్ని కంబళ్లు. (అనగా అవసరమైన వాటికన్న మరికొన్ని యెక్కువ కంబళ్లు కావలెను.)

పద్ధతి:—దీనిలో కంబళ్లు పొడిగా నుండుటతప్ప, తక్కిన విషయములో దీని పనియంతయు వేడి, తడిప్యాక్ వలెనే చేయనలెను. రోగిని పొడికంబళ్లలో చుట్టి, వేడినీటిబుడ్లు చుట్టు పెట్టవలెను. పిమ్మట చెమటను పట్టించునట్టి, యెక్కువ ఘాటులేని పానీయములను అనగా [2]స్పిరిటస్ ఈతరిస్, నైట్రోసిస్ లేక, వేడియైన నిమ్మకాయరసము నియ్యవలెను. ఇది సాధారణమైన జలుబు చేసిన ఆరంభకాలములోగాని, రోగి బాగుగా తడిసియున్నప్పుడు అతనికి జలుబు, చలి పుట్టకుండ చేయుటకుగాని, నర్సు సులభముగా చేయగల చికిత్సయైయున్నది. మూత్రము రాకుండ నిలిచిపోయినప్పుడు వైద్యుడు [3]పైలోకార్పిన్ అనుమందు నియ్యవలెనని యుత్తరు వియ్యవచ్చును. పైలోకార్పిన్ ఇచ్చిన 10 నిమిషములైన తరువాత చెమట పోయుటకొరకు రోగికి వేడిపానీయము నియ్యవలెను. పైలోకార్పిన్ ఇచ్చుటవలన ఉమ్మి విస్తారముగా ఊరుచుండునుగాన రోగిక్కి చిన్నకిడ్నీ ట్రే అవసరమై యుండును. ఒక్కొక్కసారి రోగి అరపైంటువరకు ఉమ్మి ఊయవచ్చును. పైలోకార్పిన్ కనుపాప ముడుచుకొనునట్లును, గుండె క్రుంగిపోవునట్లును చేయును. కావున రోగి నాడిని పరీక్షించుచు,

[1] Hot dry pack. [2] Spiritus etheris nitrosis. [3] Pilocarpine.



కంటిలో ఏదైన నొప్పి కలిగినవెంటనే దానిని తెలుపవలెను. దానికి విరుగుడుగా [1]అట్రొపిన్ అవసరమై యుండవచ్చును. ఈ చికిత్సయైన పిమ్మట వేడి, తడిప్యాక్ చికిత్సకు చేసినట్లే రోగికి ఉపచర్య చేయవలెను.

ఆవిరి స్నానము ×

పరికరములు:—దీనికొక ప్రత్యేకమైన సాధనము (పరికరము) నుపయోగించెదరు. దీనిలో ఒక స్పిరిట్ దీపముతోగాని, విద్యుద్దీపముతోగాని ఒక డేక్షనిండ నీరు పొంగించుచుందురు. ఈ డేక్ష రోగిపడక పాదములయొద్ద ఒక స్టూలుమీాద పెట్టుదురు. పడక పాదములయొద్ద రోగిమీాద ఒక విధమైన [2]పేము చత్రము అమర్చబడియుండును. తెరువబడియుండు దీనికొనకు [3]ఒక లోహపు సాధనము వ్రేలాడించి యుంచుదురు. ఈ సాధనము ఆవిరిని వ్యాపింప చేయునది. ఈ ఆవిరి వ్యాపనమునుండి ఒక లోహపుగొట్టము మూలమున ఆవిరిని పడకలోనికి రానిచ్చెదరు. ఆవిరి వ్యాపనము (చత్రము) చుట్టు మాకింటాషులు, కంబళ్లువేసి, దానిచుట్టును, రోగి మెడచుట్టును వానిని నేర్పుతో చుట్టుటవలన ఆవిరి పడకలోనికి వచ్చుచునే యుండునట్లు చేయుదురు. ఈ పనికి కావలసిన యితర పరికరము లేవనగా:—ఒక స్నానపు తర్మామీాటరు—దీనిని సులభముగా చదువుటకు అనుకూలమైన చోట పెట్టుదురు. (లోపల వ్రేలాడగట్టుదురు.) స్పిరిట్ దీపమును ఉపయోగించుచుండినయెడల, అగ్నిప్రమాద రక్షణార్థము ఒక బక్కెట్టునిండ ఇసుక; తలకు ఒక చల్లని తడిగుడ్డ లేక మంచుసంచి, ముఖమునుండి చెమటతుడిచి వేయుటకుగాను ఒక తువాలు, వేడిపానీయము, రోగిస్మారకము తప్పిపోయినయెడల నిచ్చుటకు ఏదైన చురుకును పుట్టించు ఒక మందు అవసరమై యుండును.

పద్ధతి:—ఒక పొడుగైన మాకింటాషును, వేడిపొడి కంబళిని రోగిక్రింద పరిచి మరియొక వేడికంబళిని రోగిమీాద కప్పి, ఆమె సొంతదుస్తులను దీసివేయవలెను. ఒక కంబళి ముక్కను రోగిపాదములచుట్టు చుట్టుదురు. పైనచెప్పినట్టి చత్రమువంటి ఉష్ణవ్యాపన సాధనమును రోగిమీాద నమర్చుదురు. దానిమీాద రెండు పొడుగైన మాకింటాషులను వేసి, ఆవిరి బయటకు పోకుండ వానిని అన్నిప్రక్కల దోపుదురు. వానిపైనకూడ మరి

[1] Atropine. [2] Wicker cradle. [3] A metal spreader.

కొన్ని వేడిపాడి కంబళ్లు కప్పుదురు. జేకు పొంగుచున్న నీటితో నింపి దీపము ముట్టించి ఉష్ణోగ్రత 105°F. వరకు హెచ్చినప్పుడు రోగిమీద కప్పబడిన కంబళ్లను తీసివేసి, ఆమె చర్మమునకు ఆవిరి తగులనిచ్చెదరు. ఉష్ణోగ్రత 110°—115°F. వరకు హెచ్చినప్పుడు ఒక చల్లని తడిగుడ్డను రోగితలమీదవేసి, పలుమారు మార్చుచుందురు. రోగియందు ఈ చికిత్సఫలిత మెట్లున్నదో, రోగికి ఏదైన బాధయున్నదేమో యని చూచుచు ఒక నర్సు సమయమంత రోగిచెంత నిలుచుండి, కనిపెట్టుచుండవలెను. రోగి నోరు తడిగా నుండునట్లు చూచుచు, పలుమారు త్రాగుటకు ఏమైన యిచ్చుచుండవలెను. రోగి స్మారకము తప్పిన గుర్తులు కనబడినట్టయిన, వెంటనే చికిత్సనాపి, రోగి తెప్పరిల్లుకొనుటకు తగిన మందు లియ్యవలెను. పడకయొక్క ఉష్ణోగ్రత 120°—125°F. వరకు హెచ్చినప్పుడు మంటను తగ్గించి, యిదే యుష్ణోగ్రత 10—15 నిమిషములు సమానముగా నిలిచియుండునట్లు చూడవలెను. పిమ్మట దీపము నార్పివేసి, పడక పాదముదగ్గరనుండి ఆ పరికరము లన్నిటిని తీసివేయవలెను. నర్సుమాత్రము ఇంకను రోగిని కనిపెట్టుచుండవలెను. అరగంట అయినపిమ్మట, పడక కొంచెము చల్లబడి యుండవచ్చును. అప్పుడు చత్రమువంటి సాధనముమీద నున్న మాకింటాషులను తీసివేసి, పిమ్మట చత్రమునుగూడ మెల్లగా తీసి, వేడికంబళ్లుమాత్రము రోగిమీదనే యుండునట్లు చూడవలెను. ఉడుకునీటి బుడ్లను కంబళ్లమధ్య పెట్టవచ్చును. రోగికి అసౌఖ్యములేకుండ నుండినయెడల, అదేపాటులో ఇంకొక గంటసేపు ఉండనిచ్చి, పిమ్మట తీసివేసి, రోగిదేహమును మెల్లగ తుడిచి, దుస్తులు తొడిగి, పడకను కంబళ్లె పడకవలె చక్కపెట్టవలెను. ఎంత చెమట పోసినదో, రోగినాడి యే స్థితిలో నుండినదో జాగ్రత్తగా గమనించి రిపోర్టు చేయవలెను. చికిత్సకాలములోను, తరువాతను రోగి యెంతమూత్రము విడిచినదో దానినికూడ తెలియజేయవలెను.

[1]ప్రసరించెడు వేడిస్నానము:— రోగిని దిగంబరినిజేసి, కంబళ్లలో పరుండబెట్టి చత్రములకు విద్యుత్తుబల్బులను తగిలించి, రోగిమీద అమర్చిపెట్టవలెను. వీనిమీద కంబళ్లుకప్పి, అన్నిప్రక్కల దోపవలెను. సులభముగా చదువగలుగునట్టు ఏదైన ఒక చత్రమునకు తర్మామీటరును తగి

[1] Radiant Heat Bath.



లించవలెను. ఈ చికిత్స చేయుటకు పెక్కు మార్గములున్నవి. చికిత్సకాలములో రోగికి కప్పిన కంబళ్లు తీసివేసి, [1]తగులబడుటకు వీలుకాని కంబళిని ఉపయోగించవలెనని వైద్యుడు కోరునేమో, నర్సు ముందుగనే కనుగొనవలెను. పిమ్మట విద్యుత్ప్రవాహమును పాటించి, యెక్కుచున్న పడకయొక్క ఉష్ణోగ్రతను జాగ్రత్తగా గమనించుచుండవలెను. 120° F. కంటె కొంచెము ఎక్కువ ఉష్ణోగ్రతలో ప్రసరణ వేడిని సహించుటకు వీలుకాదు. రోగి చర్మమును జాగ్రత్తగా గమనించి, చెమట పోయుచున్నయెడల, తుడిచివేయవలెను. చెమట పోయుటవలన రోగియొక్క దేహము చాల ప్రమాదకరముగా కాలవచ్చును. ఈ చికిత్స జరుగుచుండగా, రోగి తనకు సౌఖ్యములేనట్టును, వెవ్వేరు భాగములయందు వేడి భరింపనలవిగాక యున్నదనియు చెప్పవచ్చును. చర్మముమీద చెమటపోసి, నిలిచియుండినయెడల, రోగి యిట్లు అసౌఖ్యముగా నున్నదనును. చెమట పోయుటవలన వేడికిరణములు తడిచేత లాగుకొనబడి, యిట్టి మంటపుట్టినట్టు బాధ కలుగుచుండును. ఈ తడియంతయు ఆవిరియై, చర్మముతిరిగి యెండువరకు ఈ బాధ తగ్గదు. రోగికి సామాన్యముగా చెమట పట్టునట్లు చేయుటకు ఈ వేడిప్రసరణ చికిత్స అంత మంచిదికాదు. కాని కీళ్లవాతమునకు, కందుటవలన గలుగు జబ్బులకు, దేహమునందు ఏదైన ఒక భాగమునందు చేయుచికిత్సకు ఇది చాలమంచిది. ఈ చికిత్సయందు ఉష్ణోగ్రత 115°—120°F. ఉండవలెను. ఈ చికిత్స 20 నిమిషములవరకు జరుగవలెను.

### ఎండ స్నానములు

హీలియోతెరపి అనగా ఎండస్నానము. సూర్యుని వెలుగువలన వ్యాధికిచేయు చికిత్స. సమశీతోష్ణమండలములలోగాని, దుమ్ము, లేక మబ్బులు గల ప్రాంతములయందుగాని [2]కల్పితవెలుగును వాడుదురు. వివిధములైన దీపములను ఉపయోగించి ఈ వెలుగును సంపాదించుదురు.

హీలియోతెరపి సూర్యునియొక్క వేడి ప్రసరణశక్తిని ఉపయోగించును. లోకమంతటను వ్యాపించియున్నట్టి ఈతర్ అనుదానిమూలమున యీ పనిచేయుటకు వీలగుచున్నది. సూర్యరశ్మియొక్క శక్తిని ఈతర్

[1] Non-inflammable blanket. [2] Artificial sunlight.

యొక్క అలలగుండ ప్రపంచమునకు ప్రసరింప జేయవచ్చును. ఈ అలలను కొలుచుటకుకూడ వీలగును. వీని స్వభావము, వీని పొడుగునుబట్టి మారుచుండును. మిక్కిలి కుఱుచవైనవియు, దృశ్యమగునవియు ఏవనగా, [1]ఊదారంగు అలలు; మిక్కిలి పొడుగైనవి, యెఱ్ఱని అలలు. ఊదారంగు, అనగా, వయొలెట్ రంగు అలలకంటె ఎక్కువ చిన్నవి, అదృశ్యమైనవి, అల్ట్రవయొలెట్ అలలు అనునవి. ఎఱ్ఱని అలలకంటె పొడుగైనవి ఇన్ఫ్రరెడ్ అలలు అనునవి. [2]అల్ట్రవయొలెట్ కిరణములే హిలియో తెరపియను చికిత్సకు మిక్కిలి అవసరమైన అలలు. ఈ యలలశక్తివలన చెట్లలో క్లోరోఫిల్ అను ఆకుపచ్చరంగును, విటమిన్ డి (D) యను ధాతుపదార్థమును ఏర్పడుచున్నవి. చర్మమునందలి ఒక పదార్థముమీద ఈ కిరణములు పడి పనిచేయుటవలన, దేహమునందును D అను విటమిన్ ఏర్పడును. ఇన్ఫ్రరెడ్ అల వేడిని పుట్టించును.

క్షయరోగము వచ్చునను సందేహముగల పిల్లలకు, గ్రంథులు [3]ఆంత్రవేష్టనము, ప్రేగులు, ఎముకలు, కీళ్లు చర్మము—వీనియందు సంభవించు క్షయకు హిలియో తెరపి చికిత్స చాల ఉపయోగపడును. దేహములో కాల్సియం (సున్నము) తక్కువగానుండుటవలన ఏర్పడు జబ్బులు, అనగా ఎముకలు వంగుట (రికెట్సు), [4]ఆస్టియొమలేష్య (ఎముకల సంబంధమైన జబ్బు), [5]టెటని—వీనికి హిలియో తెరపి చికిత్స చాల ప్రయోజనకరమైనది. దీనివలన ఆకలి యెక్కువ అగును. జలుబు సంబంధమైన జబ్బులను ఎదిరించుశక్తి దేహమునకు పుట్టును. కొన్ని చర్మవ్యాధులకు చాల బాగుగా పని చేయును. [6]శ్వాసావయవముల క్షయకుగాని, నరముల జబ్బులకుగాని యీ చికిత్స చేయకూడదు.

హెచ్చరికలు

1. వేసవికాలములో ఉదయసాయంకాలములయందు రోగికి సూర్యరశ్మి తగులునట్లు చేయవలెను.

2. ఈ చికిత్స చేయుచుండగా, తల, కండ్లు ఎల్లప్పుడు మూసియుంచవలెను.

---

[1] Violet rays. [2] Ultraviolet rays. [3] Peritoneum.
[4] Osteomalacia. [5] Tetany. [6] Pulmonary tuberculosis.



3. చలికాలములో ఈ చికిత్స చేయునప్పుడు రోగికి చలిపుట్టకుండ కంబళ్లు కప్పవలెను.

4. రోగి చర్మముకాలకుండ జాగ్రత్త తీసికొనవలెను. నలుపు దేహములకంటె, ఎఱుపు దేహములు త్వరగా కాలిపోవును.

5. సూర్యరశ్మిని సహించుటకు దానిని క్రమక్రమముగా హెచ్చించుచు పోవలెను. ఒక్కొక్కదినము ఇయ్యవలసిన చికిత్సను, కాలమును దినములవేరట హెచ్చించుచుపోయి, తుదకు దినమునకు రోగి మూడునుండి, నాలుగుగంటలవరకు ఈ చికిత్స పొందగలుగునట్లు చేయవలెను.

6. చంటిపిల్లలు, చిన్నబిడ్డలయొక్క చర్మము చాల మృదువైనదిగాన, వీరి దేహము కాలకుండ, పెద్దవారికి చేయునప్పటికంటె ఎక్కువ జాగ్రత, హెచ్చరిక కలిగియుండవలెను.

పరికరములు:—కండ్లకు ఉపయోగించుటకుగాను నల్లని కంటి అద్దములు, మొలగుడ్డ, దుప్పటి, పరదాలు.

పద్ధతి:—రోగి పడకను వరండామీద వేయుము. రోగికి మరుగుగానుండునట్లు పడకచుట్టు పరదాలు వేయుము. రోగి దుస్తులుతీసి, మొలచుట్టుగుడ్డ చుట్టుము. కండ్లకు నల్లని యద్దములను సరిగా నమర్చి, రోగి పడకను వరండాలోనుండి క్రిందికి ఎండలోనికిలాగి, చికిత్స ఆరంభము చేయుము. వైద్యుడు చెప్పిన శరీరభాగమునకే యెండ తగలనిమ్ము. దాహము ఏర్పడకుండ, చికిత్సకాలములో రోగి విస్తారముగా నీళ్లు త్రాగునట్లు చేయుము.

ఎంతకాలము రోగి యెండలోనుండినదో, గంటచూచి లెక్క చేయుము. ఈ చికిత్స ఉదయకాలము స్నానము చేయించకముందు ఇచ్చుట మంచిది. ఎక్కువ యెండ తగిలినందున, రోగి దేహము కాలినట్లయిన, గాయములు మానువరకు చికిత్సను ఆపివేయవలెను.

ఎండ యెక్కువగా తగిలినదనుటకు తలనొప్పి, జ్వరము, నాడి యెక్కువగా కొట్టుకొనుట గుర్తులైయుండును. ఈ లక్షణములనుబట్టి చికిత్స చేయవలెను.

దుమ్ము, ధూళివలన ఇండియాలో తగ్గు స్థలములయందు 2% కంటె తక్కువ అల్ట్రవయొలెటు కిరణములు మాత్రమే లభించుచుండును. ఈ కారణముచేత [1]కల్పితసూర్యుని వెలుగును ఉపయోగించుదురు.

దీనికి సాధారణముగా ఉపయోగపడు దీపములు—[2]కార్బన్ ఆర్క్ దీపము, [3]మెర్క్యూరీ వేపరు దీపము, [4]ఫిన్సెన్ దీపము మొదలైనవి. నిపుణత గలిగినవారు చూచుచున్నప్పుడే యీ చికిత్స నియ్యవలెను. కండ్లకు రంగు అద్దములు వేసి, కాపాడవలెను. మొదటిదినము రెండు నిమిషములతో చికిత్స నారంభించి, రానురాను, పదినిమిషములవరకు హెచ్చించవలెను. అధికపక్షము ఈ చికిత్స నియ్యవలసిన కాలపరిమితి ఇదియే. రోగి దీపముల దగ్గరనుండి యెంతెంత దూరముననున్నదో ప్రతిదినము తప్పలేకుండ చూడవలెను, లేనియెడల ప్రమాదకరముగా రోగి శరీరము కాలవచ్చును.

**చల్లని ప్యాక్‌లు, స్నానములు**

సాధారణముగా, చల్లని ప్రయోగములను, దేహోష్ణోగ్రత తగ్గించుటకు ఇచ్చెదరుగాని, అప్పుడప్పుడు రోగిని శాంతిపరచుటకును, గుండెకును రక్తప్రసరణమునకును చురుకుదనము కలిగించుటకును ఇచ్చెదరు. చన్నీటి తొట్టె స్నానముచేయించినయెడల, దేహములోని యుష్ణోగ్రత లాగివేయబడి, దేహము చల్లబడును. చల్లని ప్యాక్, స్పంజిప్రయోగములవలన, నీరు ఆవిరి యగుటచేత ఉష్ణోగ్రత తగ్గును. చల్లచేసెడు ఆల్కొహాల్‌వంటి ద్రవములను ఉపయోగించుటమూలమున ఆవిరియగు పని మరి త్వరగా జరుగును.

**స్పంజి చేయుట:**—ఎక్కువ ఉష్ణోగ్రతను తగ్గించుటకు 75°—80°F. ఉష్ణోగ్రతగల నులివెచ్చన నీటితోగాని, లేక అధికజ్వరమున తగ్గించుటకు 70°F. ఉష్ణోగ్రతగల చల్లనీటితోగాని స్పంజి చేయుదురు.

**పరికరములు:**—గోరువెచ్చని, లేక చన్నీళ్లుగల ఒక బేసిను, చన్నీళ్లుగల ఒక జగ్గు (వీలైనయెడల దీనిలో మంచువేయవలెను) కొన్ని వాష్ క్లాతులు, కొన్ని చిన్న తువాళ్లు, [5]ద్రవమును గొలిచెడు తర్మామీటరు,

[1]Artificial sunlight. [2]Carbon Arc Lamp. [3]Mercury Vapour Lamp. [4]Finsen Lamp. [5]Lotion thermometer.



2 పలుచని స్నానపుదుప్పట్లు, పొడుగైన ఒక మాకింటాషు, ఒక పాత్ర, ఒక పళ్లెములో సాధారణముగా రోగివీపునకు చికిత్సచేయు సామానులు, ఒక [1]క్లినికల్ తర్మామీటరు, చురుకుదనము కలిగించు కొన్ని పానీయములు.

**పద్ధతి:**—చికిత్సారంభమునకు ముందు రోగి ఉష్ణోగ్రత తీసికొనవలెను. పడకచుట్టు పరదాలువేసి, పడకమీద పొడుగైన మాకింటాషును పరచి, దానిమీద రోగిని పరుండనియ్యవలెను. ఆమె గుడ్డలు తీసివేసి, ఒక దుప్పటి కప్పవలెను. మొదట ఆమె ముఖమును స్పంజితో కడిగి, తుడువవలెను. రెండు స్పంజిగుడ్డలను నీటిలోముంచి, ఒకదానితరువాత మరియొకదానిని వాడుచుండవలెను. చికిత్స జరుగుచుండగా, జగ్గులో నీళ్లు బేసినులోపోసి, చల్లచేయవచ్చును. రోగి తలకు ఒక తడిగుడ్డవేసి, పలుమారు మార్చుచుండవలెను. చికిత్సకాలమంతయు రోగి నాడిని, సామాన్యస్థితిని గమనించుచుండవలెను. మొదట అవయవములను స్పంజితో కడుగవలెను. వీలైనంతవరకు వాష్‌క్లాత్ నిండ నీరుపట్టి, ఒక చేతిని భుజమునుండి, వ్రేళ్ల కొనలవరకు మెల్లగా రుద్దవలెను. దీనివెనుక నీటిబొట్లు చర్మముమీద నిలిచియుండునట్లు చేయుము. పైనుండి క్రిందికి తుడిచిన వాష్‌క్లాత్‌ను బేసినిలో వేయుము. ఈసారి రెండవ గుడ్డను ఉపయోగించుము. ఇట్లు ఎనిమిది, పదిసారులు చేయవలెను. ఇట్లు కడిగిన చేతిని రోగి ప్రక్కనుంచి, రెండవచేతిని ఈ రీతిగనే స్పంజితో కడుగుము. ఇట్లు చేతులను పైనుండి క్రిందికి కడిగినపిమ్మట, రోగి తన చేతులను బేసిను నీళ్లలో పెట్టుకొనవచ్చును. రెండు తువాళ్లను స్పంజి నీళ్లలోముంచి, పిండి, ఒక్కొక్క చేతికి (మణికట్టునుండి భుజమువరకు) చుట్టవలెను.

పిమ్మట ముందటివలెనే రోగి శరీరముయొక్క ముందరిభాగమును వాష్‌క్లాతుతో కడుగవలెను. కాని యీసారి వాష్‌క్లాతును దేహముపైన గిరగిర[illegible]చు పనిచేయవలెను. పిమ్మట చేతులను స్పంజిచేసినట్లే, కాళ్లు మొదలగు అవయవములను స్పంజిచేయవలెను. ఇప్పుడు మరి కొన్ని తువాళ్లు నీటిలో ముంచి, పిండి, ఒక్కొక్క కాలికి చుట్టవలెను. గజ్జలను, చంకలను ఎక్కువ గమనముతో స్పంజి చేయవలెను. అక్కడ తడి వాష్‌క్లాతులను వేసి పలుమారు మార్చుచుండవలెను. వైద్యుని

[1] Clinical thermometer.

సెలవైనయెడల, రోగిని ప్రక్కకు దొర్లించి, చేతిని అటుఇటు ధారాళముగా ఆడించుచు, వీపును స్పంజిచేయవలెను. వీపును కనీసము ఐదునిమిషము లైనను స్పంజి చేయవలెను. తిరిగి రోగిని త్రిప్పవలసిన అవసరములేకుండ, పడక ఒత్తుడుపుండ్లు రాకుండ యిప్పుడే చికిత్సచేయవలెను. రోగి పై భాగముననున్న చేతి, కాలుయొక్క తువాళ్లను విప్పివేసి, స్నానపుదుప్పటిని, మాకింటాషును రోగిదగ్గరకు చుట్టివేయవలెను. పిమ్మట రోగిని మెల్లగా ఇవతలితట్టునకు త్రిప్పి, తక్కిన రెండు తడితువాళ్లను విప్పివేసి, స్నానపుదుప్పట్లను, మాకింటాషును పడకమీదనుండి తీసివేయవలెను. రోగికి సొంతగుడ్డలనువేసి, పడకను చక్కచేసి, రోగిమీద ఒక దుప్పటి మాత్రము కప్పిన చాలును. స్పంజిచేసిన 10 నుండి 30 నిమిషములలో రోగి టెంపరేచరు తీసి, చార్టులో వ్రాయవలెను. ఈ చికిత్స అంతటి వలన టెంపరేచరు 2 లేక 3 డిగ్రీలు తగ్గినయెడల, తృప్తికరమైన ఫలితము కలిగినట్టు భావించుకొనవలెను. రోగికి ఎక్కువ టెంపరేచరు ఉండినయెడల, ఆమె స్థితినిబట్టి, వైద్యుడు చెప్పినయెడల, టెంపరేచరు తగ్గునంతవరకు, తెంపులేకుండ స్పంజి చేయవలసియుండును.

**రోగిని దిగంబరినిగాచేసి స్పంజిచేయుట:**—ఈ చికిత్సయు పైన వివరించినట్టే చేయబడునుగాని, రోగికి మొలగుడ్డతప్ప తక్కిన దేహమంతయు వస్త్రహీనమై, రోగి దిగంబరిగా నుండును. ఇది మరి యెక్కువ తీవ్రమైన చికిత్స. చర్మమునకు గాలి తగలనిచ్చుటవలన, ఆవిరియగుట, చల్లబడుట యను పనులు మరి యెక్కువ త్వరగా జరుగును.

**చల్లని ప్యాక్**

**పరికరములు:**—ఈ పనికి 3 డ్రాషీటులు, ఒక పాత్రనిండ చన్నీళ్లు లేక మంచునీళ్లు రోగి పడకప్రక్కన సిద్ధముగా నుండవలెను. ఇంకా, ఒక పొడుగైన మాకింటాషు, తలకువేయుటకు తడిగుడ్డ, త్రాగుటకు పానీయములు, చురుకు పుట్టించు ద్రవములును కావలెను.

**పద్ధతి:**—రోగి పడకచుట్టు పరదాలువేసి, ఒక మాకింటాషు, స్నానపు కంబళిని పరచి, రోగిని వానిమీద పరుండబెట్టి, మరియొక స్నానపు కంబళిని పైన కప్పవలెను. ఒక తడిగుడ్డనుగాని, మంచు సంచినిగాని, నొసలు మీద వేయవలెను. ఒక దుప్పటిని నీటిలో ముంచి, పిండి, రోగిమీదచుట్టి, చంకల క్రిందికి దానిని రానీయవలెను. దీనిని ఒకటి లేక రెండు మడతలు



వేయవచ్చును. రెండవ దుప్పటిని గూడ నీటినుండి తీసి, పిండి, రోగిదేహము మీదకప్పి, చేతులక్రిందను, స్నానపు దుప్పటిక్రిందను దూర్చి, స్నానపు దుప్పటిని తీసివేయవలెను. చల్లనిదుప్పట్లను రోగి దేహముక్రిందను, మెడదగ్గరను సందులేకుండ దోపవలెను. ఈ తడిదుప్పట్లలో చేతులు, కాళ్లు చేర్చి చుట్టవలెను. శరీరపైభాగములు ఒకదానికి ఒకటి తాకకూడదు. పై దుప్పటి వేడియైనప్పుడు, దానినితీసి, చన్నీటిలోపెట్టి, దానిబదులు మూడవ తడిదుప్పటి కప్పవలెను. ఇట్లు ప్రతి మూడు నిమిషములకు మార్చుచు, దాదాపు 20 నిమిషములవరకు ఈ పని చేయుచుండవలెను. రోగిక్రింద పరచియున్న తడిదుప్పటిని, ఈ చికిత్స అంతటిలో ఒక్కసారి మాత్రమే మార్చివేయవలెను. పై దుప్పటిని పలుమారు తీసివేయుటకంటె, దానిమీద మంచునీళ్లుచల్లి, త్వరగా చల్లబడునట్లు విసురుచుండవలెను. ఈ చికిత్స అంతటిలోను రోగిస్థితిని సరిగా గమనించుచుండవలెను. పిమ్మట తడిదుప్పట్లను స్నానపు కంబళ్లను, మాకింటాషును తీసివేయవలెను. రోగి వీపునకు చేయవలసిన చికిత్స చేసినతరువాత, గుడ్డలువేసి, పడక చక్కచేసి యుంచవలెను. ఈ పనియైన 10–30 నిమిషములలో రోగి టెంపరేచరునెత్తి, చార్టులో వ్రాయవలెను.

**మంచు చట్రము నుపయోగించుట:**—జ్వరమును తగ్గించుటకు మంచు చట్రమును ఉపయోగించెదరు. రోగి దిగంబరియై పడకలో పరుండియుండగా, ఆమె మీద ఒక దుప్పటిని కప్పెదరు. ఉయ్యాలవంటి చట్రములను రోగిమీద అమర్చిన తరువాత, మంచు, ఉప్పు కలిసియున్న పాత్రలచుట్టు లింటుగుడ్డచుట్టి, చట్రములనుండి వ్రేలాడవేయుదురు. ఒక చట్రము మధ్యనుండి, స్నానపు తర్మామీటరు వ్రేలాడుచుండును. ఈ చట్రములను ఒక దుప్పటితో కప్పి, రోగి దేహమునకు ధారాళముగా గాలి తగులునట్లు చట్రపు ఒక్కొక్క ప్రక్కన సందు నుండనిచ్చెదరు. పాదములు చల్లబడకుండుటకై వానిని ఒక చిన్న కంబళితో చుట్టియుంచుదురు. పాత్రలలోని మంచు కరిగే కొలది, క్రొత్తమంచు వేయుచుండవలెను. పడకచుట్టు పరదాలు వేయవలెను.

**మందుల స్నానములు**

ఆవాలస్నానము చేయించుటకు 1 ఔన్సు ఆవాలపొడిని కొంచెము చన్నీటిలో కలిపి, 100°—105° F. ఉష్ణోగ్రతగల 5 గ్యాలనుల వేడినీటిలో

కలుపవలెను. చిన్నపిల్లలకు ఈడ్పు వచ్చినప్పుడును, కింకవాయువులోను వాడుదురు. జలుబు, తలనొప్పికి [1]పాదస్నానముగా వాడుదురు.

[2]గంధకపు స్నానమునకు 100°—110° F. ఉష్ణోగ్రతగల ఒక్కొక్క గ్యాలను వేడినీటికి ⅛-¼ ఔన్సుల గంధకపుపొడిని కలుపుదురు. కొన్ని చర్మవ్యాధులకును కీళ్లవాతపు బాధ తగ్గించుటకును ఈ స్నానము చేయింతురు.

[3]ఐయోడిను స్నానమునకుగాను, ఒక్కొక్క గ్యాలను నీటికి 1 డ్రాము టింక్చరు ఆఫ్ ఐయోడినును కలుపుదురు. నిదానముగా మానుచుండు పుండ్లకుగాని, యేదైన ఒకస్థలమున చేయవలసిన చికిత్సకుగాని, యీ స్నానము నిచ్చెదరు.

[4]ఆల్కలైన్ స్నానమును, ప్రతి 30 గ్యాలనుల నీటికి 1 పౌండు పరిమాణము చొప్పున సోడియం బైకార్బొనేట్ పొడిని కలిపి సిద్ధము చేయుదురు. దీర్ఘకాలము మొండిబారి పోయిన కీళ్లవాతమునకును, చర్మము మీది గుల్లల దురదను తగ్గించుటకును ఈ స్నానము చేయింతురు.

[5]మగ్నీషియం సల్ఫేటును వివిధములైన ఘాటుగల ద్రవములుగాచేసి, వాపును, నొప్పిని తగ్గించుటకు ఉపయోగించెదరు.

నూటికి 2½ పాళ్లు ద్రవముగాని, 30 గ్యాలనుల నీటిలో 2, 3 పౌండుల బోరిక్ ఆసిడ్ కలిపిన ద్రవమునుగాని, కాలుటవలనను, ఇతర రీతులుగను ఏర్పడిన పుండ్లమీద కట్టిన పక్కులను తీసివేయుటకు ఉపయోగించెదరు.

ఆంటి సెప్టిక్ స్నానములను 1, 2 డ్రాములు [6]క్రియొసోట్ అను మందును 30 గ్యాలనుల నీటితో కలిపిగాని; 15 ఔన్సుల స్వచ్ఛమైన కర్బాలిక్ ద్రవమును 30 గ్యాలనుల నీటితో కలిపిగాని చేయుదురు. (మొదట కర్బాలిక్‌ను 5 పైంట్ల పొంగుచున్న నీటిలో కలిపి, తరువాత స్నానపునీటితో చేర్చవలెను;) మెర్క్యూరీ స్నానము 80[illegible] 1 పాలు, అనగా, ఒక్కొక్క గ్యాలను నీటికి ఒక [7]బిళ్ల పెర్‌క్లోరైడ్ ఆఫ్ మెర్క్యూరి కలిపి పైజెప్పిన ఆంటి సెప్టిక్ స్నానము సిద్ధముచేయుదురు.

[1] Foot bath. [2] Sulphur bath. [3] Iodine bath. [4] Alkaline bath. [5] Magnesium sulphate. [6] Creosote. [7] Tablet of perchloride of mercury.



## II. స్థానిక ప్రయోగములు

స్థానిక ప్రయోగములను అనేకకార్యములకు అనేకవిధములుగా ఉపయోగించుదురు. ఈ ప్రయోగములు ఆంటి సెప్టిక్ పదార్థములుగగాని రోగికి ఉపశమనము కలిగించు పదార్థములుగగాని చురుకుకలిగించు పదార్థములుగగాని బాధను తొలగించి నెమ్మదినికలుగజేయు పదార్థములుగగాని ఉండవచ్చును. ఇవి కాపడములు, పట్టీలు, పిండికట్లుగ ప్రయోగింపబడుచుండును.

వేడిప్రయోగము తడిగగాని, పొడిగగాని ఉండవచ్చును. తడిప్రయోగము బాగుగ లోపలికిప్రవేశించి పనిచేయును. కాపుట (కాపడము) అనగా, [1]ఫ్లానెల్ లేక లింటు లేక ఇట్టివి మరికొన్ని గుడ్డలను పొంగుచున్న నీళ్లలోవేసి బాగుగ పిండి, దేహమునకు అద్దుట. కాపుట అనునది శరీరమునకు తడిగల వేడిని ఇచ్చుటకు చేయు వైద్యచికిత్సగగాని, శస్త్రగాయములకు రోగక్రిములు చేరకుండచేయు ఆంటి సెప్టిక్ చికిత్సగగాని ఉండవచ్చును.

### సాధారణ కాపడము

సామానులు:—ఒక బేసిను, ఏభాగమునకు చికిత్సచేయవలెనో ఆభాగమునకు సరిపోగల 3 లేక 4 మడతలున్న ఫ్లానెల్‌తుండు, మడిచినప్పుడు ఫ్లానెల్ తుండుకంటె పెద్దదిగనుండు [2]జాకొనెట్‌గుడ్డ (రవసెల్లగుడ్డ), ఒక మెత్తని దట్టమైన తువాలు, ఒక కట్టుగుడ్డ, దానికి గుచ్చుటకు కొన్ని సేఫ్టిపిన్నులు, పొంగుచున్న నీళ్లు, ఒక బలమైన తువాలు లేక పిండెడు సాధనము.

పనిచేయువిధము:—మడతవేసిన ఫ్లానెల్‌గుడ్డను బలమైన తువాలులో పెట్టి దానిని బేసినులో పెట్టవలెను గాని దాని రెండుకొనలు బేసిను బైట ఉండవలెను. ఫ్లానెలుగుడ్డ సంపూర్ణముగ మునుగువరకు పొంగుచున్న నీరుపోయుము. పిమ్మట తువాలయొక్క రెండుకొనలు పట్టుకొని మెలవేసి బాగుగ నీటిని పిండుము. పిండెడి సాధనముమీద జాకొనెట్‌గుడ్డను కప్పి దానిని పడకయొద్దకు తీసికొనిరమ్ము. ఇప్పుడు పిండెడు సాధనము లేక తువాలునుండి ఫ్లానెల్‌గుడ్డను బైటికి తీసి విదిలించి రోగి భరించగలిగినంత

[1] Flannel. [2] Jaconet.

వేడితో దానిని దేహముమీదవేసి దానిపైన జాకొనెట్ గుడ్డను లేక తువాలును కప్పి కట్టుగుడ్డతో బాగుగ బిగించికట్టుము. ప్రతి ఐదునిమిషముల కొకసారి ఈ కట్టును మార్చుచుండవలెనుగాని రెండవదానిని వేయుటకు సిద్ధముగ లేకముందే మొదటిదానిని తీసివేయకూడదు. ఈ పనిని 15—20 నిమిషములవరకు తెంపులేకుండ చేయుచుండవలెను. ఇట్లు ప్రతి నాలుగు గంటల కొకసారి చేయుమని వైద్యుడు చెప్పవచ్చును. కట్టుగుడ్డమీద ఒక వేడి నీటిబుడ్డిని పెట్టుటవలన కట్టునందు వేడి యెక్కువకాలము నిలిచి యుండునుగాన కాపెడుగుడ్డను పలుమారు మార్చుటకు అవసరము లేక పోవచ్చును.

స్తనములకు ఇట్టి కాపడమిచ్చునపుడు వేడి ఫ్లానెల్ గుడ్డను ఱొమ్ము మొన చుట్టువేయవచ్చునుగాని మొనమీదమాత్రము వేయకూడదు. ఎందుకనగ అది కమిలి లేక కాలి బొబ్బలు లేవవచ్చును.

మందుల కాపడములు

ఆల్కలైను కాపడము [1]సంధివాతము లేక కీళ్లవాతము సంబంధమైన వ్యాధులకు కొన్నిసార్లు ఉపయోగింతురు. దీనిలో ఫ్లానెల్ గుడ్డమీద వేడినీటిని పోయకముందు ఒక్కొక్క పైంటునీటికి 1—2 డ్రాములు సోడియమ్ బైకార్బొనేట్ పొడిని చల్లవలెను.

[2]హైపెర్టానిక్ సేలైన్ కాపడము:—సెల్యులైటీస్‌లోవలె దేహములో రక్తము ఒకచోట అధికముగా కూడుటవలనను, వాపువలన నొప్పి కలిగినప్పుడును, టిస్యూలలో బిగువు తగ్గించుటకు హైపెర్టానిక్ సేలైన్ కాపడ మిచ్చెదరు.

ఒక్కొక్క పైంటునీటికి 2 డ్రాముల ఉప్పు ఈ కాపెడు నీటికి కలుపవలెను. చర్మము బిగువుగా నుండును గాన, కాపడము నియ్యకముందు లిక్విడ్ ప్యారఫినునుగాని ఆలివ్ నూనెనుగాని చర్మమునకు పూసి రుద్దవలెను. కాపడమునకు శాంతిపరచెడు, లేక కందజేయునట్టి మందును కలిపినప్పుడు దానికి [3]స్టూప్ అని పేరు. కాపడమునకు కందజేయునట్టి మందులు చేర్చినప్పుడు, వానిని [4]కౌంటర్ ఇరిటెంటుల క్రింద చేర్చెదరు.

[1] Arthritic or rheumatic conditions. [2] Hypertonic saline.
[3] Stupe. [4] Counterirritants.



కర్పూరతైలపు స్టూప్:—ఫ్లానెల్ గుడ్డమీద పొంగుచున్ననీటిని పోయకముందు, 2—4 డ్రాముల కర్పూరతైలమును చల్లి యీ స్టూపును సిద్ధము చేయుదురు. దీనిలోని లోపమేమనగా—కర్పూరతైలము సరిగా నీటిలో కలువదు గనుక, 1—2 డ్రాముల కర్పూరతైలమును కొంచెము ఆలివ్ నూనెతో కలిపి, సాధారణమైన కాపడ మియ్యకముందు, చర్మమునకు పూయవచ్చును. [1]బ్రాంకైటీస్, [2]ప్లూరిసి, న్యుమోనియా మొదలగు వ్యాధులలో ఱొమ్మునందలి నొప్పి తగ్గించుటకు కర్పూరతైలపు స్టూపును కౌంటర్ ఇరిటెంటుగ వాడవచ్చును. కడుపుబ్బరమును దగ్గించుటకు దీనిని పలుమారు వాడెదరు.

[3]నల్లమందు స్టూప్:—ఫ్లానెల్ గుడ్డను పిండిన తరువాత దానిమీద అన్ని చోట్ల సమానముగా 20—60 మినిములు టింక్చర్ ఆఫ్ ఓపియం చల్లవలెను. బాధను తొలగించుటకే నల్లమందును వాడుదురు.

బెలడానా స్టూప్:—దీనిని నల్లమందు స్టూప్‌వలెనే సిద్ధముచేయుదురు. ఫ్లానెల్ గుడ్డమీద టింక్చర్ ఆఫ్ ఓపియమునకు బదులుగా టింక్చర్ ఆఫ్ బెలడానా చల్లుదురు. మరియొక పద్ధతి యేదనగా:—గ్లిసరీన్ ఆఫ్ బెలడానాను చర్మమునకు పూసి దానిమీద సాధారణమైన కాపడమునిచ్చుట. దీనిని ముఖ్యముగా నడుము[4]నొప్పి బాధను తొలగించుటకు ఇచ్చెదరు.

మెగ్నీషియం సల్ఫేట్ కాపడము:—కండ్లకును, రక్తనాళములోనికిని మందు నెక్కించినతరువాత కలిగెడి నొప్పికిని లేక వాపుకును, వేరువేరు స్థలములలో నొప్పి పుట్టినప్పుడును లేక కందినప్పుడును మెగ్నీషియం సల్ఫేట్‌ను కరిగించగలిగినంతమట్టుకు కరిగించిగాని, ఘాటు తక్కువచేసిగాని, తరుచుగా కాపడమిచ్చెదరు. కంటికి వాడునప్పుడు ఎక్కువ వేడిగ నుండకూడదు.

[5]శస్త్రగాయములకు కాపడములు ఇచ్చుట:—ఇవి గాయములపై వేసెడు అసెప్టిక్ డ్రస్సింగు గుడ్డలు. లింటుగుడ్డను రెండు మడతలుగా మడిచి, గుడ్డను పిండెడు సాధనములోపెట్టి స్టెరిలైజరు మీదగాని, సాస్పాన్ మీద

[1] Bronchitis. [2] Pleurisy. [3] Opium Stupe. [4] Lumbago.
[5] Surgical Fomentations.

స పెట్టి పొంగించవలెను. రింగరు అనగా పిండెడు సాధనముయొక్క కొనలనుమాత్రము బైట నుండనిచ్చి, వానిని మూతమీదికి త్రిప్పి యుంచవలెను. ఇట్లు 10 నిమిషములు బాగుగా పొంగించినతరువాత, కాపడమును బైటికితీసి, బాగుగా పిండి, దానిని ఆ రింగరునందే తెరచి యుంచి, చేతులు బాగుగా రుద్ది కడుగుకొని యీ డ్రెస్సింగుపని చేయుచున్న నర్సునకుగాని, వైద్యునికిగాని దీనిని అందించవలెను. దీనిలోని యావిరిపోవునట్లు దీనిని విదిలించి, గాయముమీదవేసి, నిర్మలమైనదూది లేక రవసెల్ల గుడ్డను, దూదినిమీదవేసి కట్టుకట్టవలెను.

ఆంటిసెప్టిక్ కాపడము:—80 పాళ్లలో 1 పాలు కార్బాలిక్‌పోసి చేసిన సొల్యూషన్‌గాని, ఘాటు తక్కువగల పెర్‌క్లోరైడ్ ఆఫ్ మెర్క్యూరి, లేక లైసాల్‌సొల్యూషన్‌గాని నీటికిబదులుగా ఉపయోగించి కాపడమియ్యవచ్చును.

శస్త్రగాయము చేయబడిన చెయ్యి, లేక పాదమును నానబెట్టుట:—ఏదైన ఒక స్థలమున అంటువ్యాపించుటవలన కలిగిన నొప్పిని, కందుటను తగ్గించుటకును, చీముపట్టియున్న గాయములను శుభ్రముచేయుటకును ఈ చికిత్స చేయుదురు.

పరికరములు:—చిన్నతొట్టి, మాకింటాషు, మాకింటాషు మీదికి ఒక గుడ్డ, వేడినీటిబుడ్డి, స్నానపు తర్మామీటరు, అవసరమైన సొల్యూషను, ద్రావణము కావలెను. సాధారణమైన సొల్యూషను లేవనగా:—బోరిక్, నార్మల్‌సెలైన్, బైక్లోరైడ్, పొటాసియం పర్మాంగనేట్ లేక [1]యుసాల్ మొదలైనవి.

పద్ధతి:—మాకింటాషు మీద గుడ్డవేసి పడకతడువకుండ, నానబెట్ట వలసిన భాగముక్రింద దానిని వేయుము. పడక ప్రక్కన ఒక స్టూలువేసి, దానిమీద తొట్టిని బెట్టుము. వేడినీటి బుడ్డినిండ గాలికొట్టి, నీటిలో ముంచవలసిన అవయవమును గాపాడునట్లు దానిని తొట్టియంచున బెట్టుము. రోగి సౌఖ్యముగా నుండునట్లుచేసి, ఆమెను పడక అంచుకు లాగుము. రోగి చెయ్యిని ముంచవలసియున్నయెడల, ఆమెను దిండ్లమీద పైకెత్తి పెట్టి ఏవిధమైన ఆయాసములేకుండ చేతిని సొల్యూషనులో ముంచునట్లు చేయుము. తొట్టిలో వైద్యుడుచెప్పిన సొల్యూషనుపోసి, చేతిని లేక

[1] Eusol.



పాదమును ముంచుము. ఈ సొల్యూషనుయొక్క ఉష్ణోగ్రత 110°—115°F. ఉండవలెను. ఈ గాయము తెరచుకొనియున్న గాయమైనట్లయిన, ఈ పనికి ఉపయోగించు పరికరములన్నియు, తొట్టియు, సొల్యూషనుగూడ నిర్మలముగ నుండవలెను. అవసరమైనప్పుడెల్ల తొట్టిలో క్రొత్తద్రవము పోయుచుండుముగాని, రోగి అవయవము కాలకుండ, దానిని పోయకముందు అవయవమును బయటికి తీయుము. ఈ చికిత్స జరిగిన తరువాత, అవయవమును చల్లగ బైటికితీసి, స్టెరైల్ తువాలు మీదపెట్టి డ్రెస్ చేయుము. అనగా కట్టుకట్టుము. సామానులన్నిటిని తీసి కడుగుము. ఈ చికిత్స యెంతకాలము చేయబడినది, ఏ సొల్యూషను వాడినది చార్టులో వ్రాయుము.

వేడిపొడి ప్రయోగములు

దీనిలో రబ్బరు వేడినీటి సంచులు, [1]విద్యుత్తు ప్యాడులు, విద్యుద్దీపములు, తౌడు లేక ఉప్పుసంచులు ఉపయోగపడును. ప్రతివిధమైన చికిత్స చేయుచుండగా, రోగి దేహము కాలకుండ జాగ్రత్తగా నుండవలెను. వేడినీటి బుడ్డిలోని నీరు 130°—150° F. కంటె అధిక ఉష్ణోగ్రత గలిగియుండ కూడదు.

చలిని ప్రయోగించుట

కందినప్పుడుగాని, లేదా, దెబ్బ తగిలినతరువాత (ముఖ్యముగ కీలు మీద) కారు స్రవమును మితముగ నుంచుటకు లేక రక్తస్రావము నిలుపుటకును లేదా నొప్పిని తగ్గించుటకును దీనిని వాడెదరు.

ఇందుకు మంచుగడ్డ మిక్కిలి ప్రయోజనకారి. ఒక పెద్ద మంచుముక్కను ఒక కంబళిలోగాని, గోనె సంచిలోగాని చుట్టి, సుత్తెతో పగులగొట్టి ముక్కలు చేయవచ్చును. ఈ ముక్కలను దిట్టమైన పెద్ద మేకుతో సులభముగా పగులగొట్టవచ్చును.

మంచుసంచి ప్రయోగమే అన్నిటిలో సాధారణమైన చలిప్రయోగము. ఈ సంచిని అనేక పరిమాణములలో రబ్బరుతో చేయుదురు. దీని నుపయోగించకముందు, ఇది సరియైన స్థితిలో నున్నదా, తిరుగుడు మూత సరిగా పట్టుచున్నదా, రబ్బరు ఉంగరము ఉన్నదాయని మొదటనే చూచి తెలిసికొనవలెను. ఈ సంచి సగము నిండునట్లు మంచుముక్క

[1] Electric pads.

లను వేయుము. దీనితోకూడ ఉప్పును లోపల చల్లి మంచుతో కలిసి కరుగనిచ్చెదరు. సంచిలోని గాలిని బైటికి పోనిచ్చి మూతను బిగించుదురు. సంచి పైభాగమును తుడిచి, గుడ్డసంచివేసి, యే భాగముమీద దానిని పెట్ట వలెనో, ఆ భాగముమీద పెట్టవలెను. చర్మముమీద అది ఆనుకొని మాత్రమే యుండవలెనుగాని, దాని సంపూర్ణమైన బరువు దేహభాగము మీద పడకూడదు. ఇట్లుండుటకు యేదైన ఒక చత్రమువంటి సాధనము నుండిగాని, పడకకు తలపైన నుండిగాని దానిని వ్రేలాడగట్టవచ్చును. వాడిన తరువాత సంచిని బాగుగా శుభ్రముచేసి, తుడిచి, ఆరనిచ్చి, దానిలో గాలి నింపవలెను. ఏదైన ఒక తడిగుడ్డను వేయుట అనగా, ఒకే పొరగల గుడ్డను చన్నీరు, మంచు, లేక ఆవిరియగు ఏదైన ఒక సొల్యూషనులో ముంచి, తీసి, పిండి అవసరమైన దేహభాగపు చర్మము మీద వేసి, దానిమీద ఏమి కప్పక విడిచియుంచవలెను. నీరు ఆవిరి యగుటవలన ఆ భాగము చల్లనగుచుండును. మడత వేయుటవలనగాని, పైన కప్పుటవలనగాని యీ తడిగుడ్డయొక్క ఫలితము నిరర్థకమగును. ఈ గుడ్డ వేడి కాగానే దానిని మార్చుచుండవలెను. దీనివలన తలనొప్పి తగ్గును; బెణికిన కీలుచుట్టు వాయకుండ సహాయపడును. మూడుపాళ్లు నీటిలో ఒక పాలు స్పిరిట్‌ను గలిపి ఉపయోగించినయెడల ఈ చికిత్స యెక్కువ పనికివచ్చును.

ఆవిరియగు లోషన్:—వివిధమైన లోషనులను వాడుదురు. నొప్పిని తగ్గించుటకు సాధారణముగా [1]సీసము, నల్లమందు లోషన్‌ను వాడుదురు. ఒక డ్రాము సీసము, నల్లమందు పొడిని ఒక పైంటు చన్నీటితో కలిపి, యీ లోషను తయారుచేయుదురు. ఈ లోషనుండు పాత్రమీద గాజు మూతగాని, మరేదైన మూతగాని వేయుదురు. ఇతర లోషనులలో ముంచి వేసిన తడిగుడ్డవలె, సీసపు లోషనులో ముంచి వేసిన గుడ్డనుకూడ అది వేడికాగానే దానిని మార్చివేయుచుండవలెను. ఏ భాగమునకు ఈ చికిత్స చేయబడుచున్నదో, ఆ భాగముక్రింద, ఒక మాకింటాషు ముక్కను వేసినయెడల పడక చెడకుండయుండును.

[2]లైటర్స్ కాయిల్:—ఇది సీసము, లేక రబ్బరుతో చేసిన వంగగల గొట్టము. దీనిగుండ మంచునీటిని పాఱించవచ్చును. ఈ తీగచుట్టను

[1] Lead and opium. [2] Leiter's Coil.



ప్రయోగించకముందు, చర్మముమీద లింటు, లేక ఫ్లానెల్ తుండును వేయుదురు. దీనికి కట్టియుండు నాడాల మూలమునగాని, తేలికగా కట్టిన కట్టుగుడ్డ మూలమునగాని, దీనిని దాని స్థానములో నుంచగలరు. ఈ కాయిల్ రబ్బరుతో చేయబడినదైనయెడల, దాని గొట్టముల మూలమున నీరు పాఱకుండ ఏదియు ఆటంకము కలుగచేయకుండ చూడవలెను. ఈ కాయిల్ ఒక్కొక్క కొనకు ఒక పొడుగైన రబ్బరు గొట్టము అమర్చబడి యుండును. వీనిలో ఒక కొన రోగిమీదుగా, మంచునీరున్న పాత్రలోనికిని, యింకొకటి, నేలమీదనున్న పాత్రలోనికిని పోయియుండును. సైఫన్ పద్ధతి మూలమున నీరు గొట్టములగుండ పాఱుచుండును. ఒక్కొక్క కొన నీటిలో మునిగియుండులాగున, వానికి బరువులు కట్టబడి యుండును.

[1]పిండి పట్టీలు

వేడి చాలకాలము నిలిచియుండగల ఏదైన ఒక పిండిపదార్థమునకు పొంగుచున్న నీటినికలిపి, యీ పిండిపట్టీ చేయుదురు. సాధారణముగా, ఇది వేడితడిగల పిండిపట్టీయైయుండును. దీనికొరకు సాధారణముగా ఉపయోగించు పదార్థములు—అవిసెపిండి, రాగిపిండి, నానవేసిన ఱొట్టె, మసి బొగ్గు.

**అవిసె లేక రాగిపిండి పట్టీ**

సామానులు:— ఒక పాత్ర, ఒక కూజా, [2]చదునైనకత్తి, పొంగుచున్న నీళ్లుగల డేక్ష, [3]క్యాలికోతుండు, గాజ్‌గుడ్డ, దూదియుండ, కట్టుగుడ్డ, [3]కట్టుకొరకైన పలక, అవిసెపిండి, కొంచెము వెచ్చని నూనె.

చేయువిధము: — పాత్రమీదను, కత్తిమీదను పొంగుచున్న నీరు పోసి వానిని వేడిచేయుము. క్యాలికోగుడ్డను పలకమీద పరువుము. వేడి చేసిన పాత్రను ఖాళీచేసి, అవసరమైనంత పట్టి చేయుటకు సరిపోవునంత పొంగెడు నీళ్లుపోయుము. దీనిలో అవిసెపిండిని కొంచెము, కొంచెము వేసి, కలుపుము. కాని యీ పిండిని స్పా... నె లేక వ్యాక్షి... త్వరగావేసి చదును గల కత్తితో తెంపులేకుండ త్రిప్పి, ... ఏదానముగను ... అంటుకొనకుండ శుభ్రముగా ఊడివచ్చువరకు కలు... కొనినయెడల వాని... కలిపినపిండిని, పాతికనుండి సగము అంగుళము ఎతు... మీద పరువుము.

[1] Poultice. [2] Spat... [3] Dissecting forceps. ...o.

ఈ గుడ్డ అంచుచుట్టు ఒక అంగుళము స్థలమువిడిచి, దీనిని కట్టు పిండి మీదికి త్రిప్పి మడువవలెను. తరువాత కత్తిపొడుగున ఒలీవనూనె పోసి, ఒక్కచుట్టులో ఈ కత్తిమీది నూనెను పట్టీమీద అడ్డముగా పూయవలెను. దీనికి బదులు రోగి దేహభాగము మీద ఈ నూనెనుపూసి దానిమీద పట్టీ వేయవచ్చును. పట్టీమీద గాజ్ గుడ్డనుకూడ వేయవచ్చును. ఈ పట్టీని రోగి పడకప్రక్కనే సిద్ధముచేసి, వెంటనే వేయవలెను. ఈ పట్టీ దేహముమీద అనగా, మొండెముమీద వేయవలసియుండిన యెడల, దానికి తగిన కట్టుగుడ్డను సరియైన స్థలములో సిద్ధముగా నుంచవలెను. మొదట నర్సు ఈ పట్టీని తన ముంజేతికి తాకించి, దాని వేడినిపరీక్షించి, పిమ్మట దానిని రోగి చర్మముమీద వేయవలెను. రోగి వేడిని భరించ గలిగినంతవరకు ఈ పట్టీని తగిలి తగులనట్టు వేయుచు తీయుచు నుండ వలెను. రోగికి వేసిన పట్టీకంటె వెడల్పయిని ఒక ఉన్ని మెత్తను ఆ పట్టీ మీద వేసి అది దాని స్థానములో నిలిచియుండునట్లు గుడ్డతో కట్టుము. ఈ పట్టీ ఎంతకాలము వేడిగ నుండునో అంతకాలము రోగిమీద నుండనియ్య వలెను. పెద్ద పట్టీ అయినయెడల 2-3 గంటలవరకును, చిన్నదియైన యెడల 1 గంటసేపును వేడిగనుండును. మరియొక పట్టీ వేయవలసి యుండినయెడల రెండవది సిద్ధమగువరకు మొదటి దానిని తీయకూడదు. పట్టీని ఊడతీసినప్పుడు అది వేసినచోట ఏవైన పక్కులు మిగిలియున్న వేమో చూచి వానిని ఒలీవనూనె లేక కొబ్బరినూనె పూసి దూది ఉం డతో తీసివేయవలెను. పిమ్మట చర్మమును బాగుగ ఆరనిచ్చి ఆ భాగ మున దూదిగాని, ఫ్లానెల్ గుడ్డగానివేసి అది దాని స్థానమున నిలిచియుండు నట్లు బ్యాండేజితోగాని బైండరుతోగాని దానిని కట్టవలెను. చర్మము మిక్కిలి కందియున్నట్లైన దానిని పైన చెప్పినట్టు తుడిచి ఆరనిచ్చుట కంటె దానిపైన కొంచెము నూనె అద్దుట మేలు. రెండు ఊపిరితిత్తులకు న్యుమోనియా వ్యాధి సంభవించినప్పుడు పట్టీని ఒక చొక్కావలె చేసి వేయవలెనని డాక్ట[illegible]ను. రోగియొక్క వెనుకభాగము (వీపు), ముందుభ[illegible]చున్నదో, [illegible]ము)లను కప్పివేసి రెండుకొనలు చేంకల క్రిందనుండి భ వడక చెడకుండయు కొనుటకు చాలినంత క్యాలికో గుడ్డ మీద పిండిని టర్స్ కాయిల్ :—ఇది [illegible]చువలెను. ఈ పనికి అవిసెపిండి బదులు రా[illegible] దీనిగుండ మంచునీటిని [illegible].

1 Lead and opium.



ఆవాలపిండిపట్టీ:—కొన్నిసార్లు అవిసెపిండితో కొంచెము ఆవాలపిండిని చేర్చుదురు. ఒకపాలు ఆవాలపిండిని 15 పాళ్ల అవిసె పిండితో బాగుగ కలిపి చిన్నబిడ్డకు పట్టీ వేయవచ్చును. కొంచెము పెద్దబిడ్డకు 1: 10 నిష్పత్తిలో ఈ రెండు పిండిపదార్థములు కలిపి పట్టీ వేయవచ్చును. పెద్ద వారికి 1: 5 నిష్పత్తిలోకలిపి వేయవచ్చును. దీనివలన రక్తప్రసరణము నకు ఎక్కువ చురుకుదనము కలుగును. ఆవాలపిండిని కలిపినపుడు పొంగెడి నీటిని పోయకూడదు. అనగా అంత వేడినీరుపోసి కలుప కూడదు. అట్లు చేయుటవలన ఆవాలపిండియొక్క ఘాటు తగ్గిపోవును. ఈ పట్టీని వేసినపుడు చర్మము ఎఱ్ఱగ కందునేమోయని జాగ్రత్తగ కని పెట్టుచు చర్మము కాలకముందే ఈ పట్టీని తీసివేయవలయును. పట్టీని తీసివేసినతర్వాత చర్మముమీద ఆవాలు అవిసెపిండి పక్కులు నిలిచియుండ కుండ నూనెతోరుద్ది తీసివేయవలెను. పిమ్మట ఆ భాగమునకు నూనె బాగుగ పూసి లింటుగుడ్డతోగాని, పాత మస్లిన్ గుడ్డతోగాని బాగుగ కప్పివేయవలెను.

[1]గంజిపట్టీ:—8 డ్రాముల గంజిపిండికి 1 డ్రాము బోరిక్ పౌడరు చేర్చి కలుపుము. కొంచెము చన్నీళ్లుపోసి గట్టి బంకవలె అగునట్లు కలుపుము. పిమ్మట 1 పైంటు పొంగుచున్న నీళ్లుపోసి పిండి అంతయు కరిగిపోవువరకు వడివడిగ కలుపుము. ఇట్లు చేసిన తరువాత, మొదట నీటిలోనుండి తీసి పిండిన క్యాలికో లేక లినన్ గుడ్డమీద చల్లని పట్టీని దట్టముగ పూయుము. అప్పుడు గుడ్డకు గంజి యింక బాగుగ అంటుకొనును. దీనిని తిన్నగ పుండుమీదవేసి దానిమీద సైనపు పట్టుబట్టనుగాని, జాకొనెట్ (రవ సెల్ల) గుడ్డనుగాని వేసి దానిని సరియైన పాటులోపెట్టి బ్యాండేజి గుడ్డతో కట్టుము. చర్మముమీద ఏర్పడిన పక్కులను, పొలుసులను తీసివేయుటకు ఈ రకము పట్టీని వేయుదురు. ఈ పట్టీని వేయుభాగమును వీలైనంత బాగుగ శుభ్రము చేయవలెను. ఎండినప్పుడు పిండి చర్మమునకు అంటు కొనకుండ పట్టీ అంచుచుట్టు ఒలీవనూనె లేక వ్యాజలీను పూయవలెను. ఈ పట్టీని జాగ్రతగను, మెల్లగను, నిదానముగను తీసివేయుచు, పట్టీ ఏదైన నొక చోట పక్కులను అంటుకొనినయెడల వానిని [2]ఫార్సెప్స్తో

1 Starch Poultice. 2 Dissecting forceps.

విడిపించుచుండవలెను. ఊడుచున్న పక్కులులేక పొలుసులను జాగ్రతగ తీసివేసి అవసరమైనయెడల మరియొకపట్టీని వేయవచ్చును.

[1] పట్టీలు

పట్టీనివేయునపుడు ముందటివలె వేడిప్రయోగము చేయవలసిన అవసరము లేక పోవచ్చును. సాధారణముగ ఈ పట్టీయందు మందుకలిపిన బంకవంటి పదార్థముండును. దీనిలో చేర్చబడిన మందునుబట్టి యీ పట్టీ మంట పుట్టించునదిగగాని, శాంతి పర్చునదిగగాని యుండును.

ఆవాల పట్టీ:—అసలు ఆవాల పట్టీనే వేయవచ్చునుగాని దీనిలో పిండి కలుపుటయు మామూలైనది. ఒక బలమైన పట్టీని వేయుటకు సరిసమానముగ ఆవాలపొడి, పిండి—ఈ రెంటిని కలుపుదురు. లేక ఒక పాలు ఆవాల పొడి, 4—6 పాళ్ల పిండితో చేర్చబడును. బిడ్డలకు వేయునపుడుగాని చర్మము మృదువుగనుండుచోట దీనిని ప్రయోగించునపుడుగాని రెండవ నిష్పత్తిని వాడుదురు. మొదట పిండిని, ఆవాలపొడిని బాగుగచేర్చి నులివెచ్చని నీళ్లుపోయుచు దానినంతయు గట్టి చిక్కని అంబలిగ కలుపుదురు. వేడి నీరు కలుపుటవలన ఆవాలు ఆవిరిగామారు లక్షణములు పాడగును. సిద్ధముచేసిన చిక్కని అంబలిని గోధుమవర్ణముగల కాగితముమీద పూసి దానిమీద ఒక పొర గాజ్ (వలగుడ్డ)నుగాని, మస్లిన్‌గుడ్డను గాని పరచి యీ పట్టీని చర్మముమీద వేయవలెను. ఈ పట్టీమీద దీనికంటె పెద్దదైన దూది యున్నిమెత్తనువేసి పట్టీ దాని స్థలములో నిలిచి యుండునట్లు ఒక బ్యాండేజిగుడ్డతో కట్టుము. సాధారణమైన పట్టీ కొన్ని అంగుళములు చదరముగ నుండును. 5 నిమిషములు అయినతరువాత చర్మము ఎంతవరకు ఎఱ్ఱగా కందినదో చూచుటకు పట్టీయొక్క మూలలను ఎత్తి పరీక్షించవలెను. పట్టీవేసిన భాగమునందలి చర్మమంతయు గులాబి రంగువలె మారినప్పుడు పట్టీసి తీసివేయవలెను. ఆవాలకు మంటపుట్టించు గుణముకలదు. కావున దీని ఫలితముగ చర్మము కాలి పొక్కులు లేవకుండ చూడవలెను. ఆవాలపట్టీ కొంచెమైనను చర్మముమీద నిలిచి యుండకుండ దానిని నూనెతోగాని, దూది ఉండలతోగాని తీసివేయవలెను. పిమ్మట ఆ భాగమును ఒక చిన్నగుడ్డతోగాని లేక లింటు బ్యాండేజి గుడ్డలతోగాని కప్పి వేయవలెను.

[1] Plasters.



ఆవాలపిండిని కాగితము మీదపరచి సిద్ధముచేసి అమ్ముదురు. దీనిని [1]ఆవాల ఆకు (మస్టర్డులీఫ్) అందురు. ఈ కాగితము వెనుకనే దీనినెట్లు ఉపయోగించవలెనో వివరములు వ్రాయబడియుండును. సాధారణముగా దీనిని కాగితముప్రక్కన నులివెచ్చని నీటిలో పెట్టుదురు. కొంచెము తడిచి బంకవలె అయినప్పుడు దీనిని ఆవాలపట్టీగా వేయుదురు.

[2]బెల్లడానా, నల్లమందు పట్టీలు:—వీనిని ప్రత్యేకముగా సిద్ధముచేసి అమ్ముదురు. దేహమునందు కలిగిన యీడ్పును, బాధను తగ్గించుటకు వీనినుపయోగించెదరు. వీనినెంత పరిమాణములో కత్తిరించివేయవలెనో నియమించబడును. సాధారణముగా 4 నుండి 6 అంగుళముల చదరములుగా కత్తిరించుట మామూలు. దీని వెనుకభాగమును ఒక వేడిజగ్గుకు ఆనించినయెడల, ఇది కొద్దిగా వెచ్చనగును. దీనిని చర్మమునకు అంటించి, అది యంటుకొనువరకు, దానిని దాని స్థానమున పట్టుకొనవలెను. పట్టీ బాగుగా అమరియుండునట్లు దాని యంచులను అక్కడక్కడ కత్తిరించవలసిన అవసరముండవచ్చును. దీనిని అంటించునప్పుడుమాత్రము ముడుతలులేకుండ సదునుచేసి వేయవలెను. దీనిని యెంతకాలము చర్మముమీద నుంచవలెనో వైద్యుడు నియమించిననే తప్ప, లేనియెడల, అంచులు పైకి తిరుగువరకు దీని నుంచెదరు. ఇట్టి పట్టీని స్తనముమీద వేసినయెడల, ఱొమ్ము మొనచుట్టు ఒక రంధ్రముచేసి వేయవలెను. అనగా మొనమీద వేయకూడదు. ఈ పట్టీవేయుటవలన స్తనములోని పాలు తగ్గిపోవచ్చును.

[3]ఆంటి ఫ్లోజిస్టిన్:—దీనినికూడ సిద్ధముచేసి అమ్మెదరు. దీనిని బంకమట్టితో చేయుదురుగాని, దీనిలో ఆవిరియగు నూనెవస్తువులు అనేకములు కలుపుదురు. వేడిప్రయోగమునకు ఇది చాల అనుకూలమైనట్టియు, ఫలితము కలుగునట్టియు పట్టీ. ఒక పళ్లెమును పొయ్యిమీదగాని, స్టౌవ్‌మీదగాని పెట్టి, దానిలో నీరుపోసి, వేడినీటిలో ఆంటి ఫ్లోజిస్టిన్ డబ్బాను పెట్టుదురు. ఈ పట్టీ వేడియగుచుండగా, దీనిలోని పదార్థమంతయు సమానముగా వేడియగునట్లు దానిని బాగుగా త్రిప్పుచుండవలెను. పిమ్మట ఒక పట్టీపలకమీద కొంచెము లింటు లేక లినన్‌గుడ్డ పరచి, దానిమీద ఒక అంగుళము దట్టముగా, అంతట సమానముగా ఈ బంకపదార్థమును

[1] Mustard leaf. [2] Belladonna and opium plaster.
[3] Antiphlogistine.

(ప్లాస్టరును) పూయవలెను. ఇల్లు సమానముగా పూయుటకు వేడిచేసిన చదును కత్తితో దానిని సరిచేయుచుండవలెను. దీని చుట్టుకూడ ఒక అంగుళము స్థలము విడిచిపెట్టుదురుగాని, ముందటివలె ఈ యంచులను పైకి మడువరు. రోగికి హాయిగా నుండునంత వేడిగా దీనిని చర్మమువిూద వేసి, దానిమీద ఉన్ని మెత్తనుగాని, ఫ్లానెల్ గుడ్డనుగాని వేసి, దాని స్థానములో అది నిలిచియుండునట్లు బైండరుతోగాని, నాడాలతోగాని, బ్యాండేజి గుడ్డలతోగాని బిగించవలెను. దీనిలోని బంకమట్టి యెండిపోయినప్పుడు, సాధారణముగా 12 గంటలకొకసారి, దీనిని మార్చివేయుచుండవలెను. కాని చాల వేడికాలములో దీనిని మరి తరుచుగా తీసివేయవలసియుండును. దీనిని తీసివేసినతరువాత చర్మమును కడిగి, మృదువుగా తుడిచి ఆరనీయవలెను.

### లినిమెంటులు (తైలములు)

ఈ తైలములను సబ్బు, నూనె, ఆల్కహాల్ అను సారాయి మున్నగు పదార్థములతోచేసి, చర్మములోనికి ఇంకునట్లు రుద్దవలసిన మందులను చేర్చుదురు. రక్తప్రసరణమునకు చురుకుపుట్టించుటవలన, ఏదైన ఒక స్థలమున (అనగా జబ్బు ఉన్న స్థలమున) మంచి ఫలితము కనబడును. రోగికి సౌఖ్యముగానుండు తీరులో ఆమెను పరుండనిచ్చి, తైలము రుద్దవలసిన భాగమును అందుబాటులో నుండనిచ్చెదరు. నర్సు మొదట కొంచెము లినిమెంటును తన అరచేతిలో పోసికొని, రోగి చర్మము ఎఱ్ఱగా కందువరకు దానిని 10—15 నిమిషములు బాగుగా రుద్దును. ఈ చికిత్సలో బాగుగా రుద్దుటయే ముఖ్యమైనపని. పిమ్మట రుద్దిన భాగమువిూద ఉన్ని లేక ఫ్లానెల్ గుడ్డను కప్పుదురు. అవసరమైనయెడల ఎక్కువ తైలము నుపయోగించవచ్చును. సాధారణముగా ఉపయోగించు లినిమెంటు లేవనగా:—[1] కాంఫరేటెడ్ నూనె (కర్పూరతైలము,) [2]వింటర్ గ్రీను నూనె, [3]టర్పెంటైన్ లినిమెంట్లు, [4]మిరపకాయ, ఐయోడిన్ అనునవి. ఐయోడినును పూయకముందు చర్మము ఎండియుండునట్లు దానిని బాగుగా తుడువవలెను. ఐయోడిను పూసినపిమ్మట, దానిలోని ఆల్కా-

[1] Camphorated Oil. [2] Oil of wintergreen.
[3] Turpentine liniment. [4] Capsicum.



హాల్ అంతయు ఆవిరియై, యెండువరకు పూసినదానిమీద ఏమియు కప్పకూడదు; లేనియెడల, ప్రమాదకరమైనపొక్కులు లేచును.

[1]టింక్చర్ ఆఫ్ ఐయోడిన్:—టింక్చర్ ఆఫ్ ఐయోడినును ఏదైన ఒక దేహభాగమునకు పూయునప్పుడు, భాగమంతటికి సమానముగా పూయవలెను; రెండవపూత పూయకముందు మొదటిదానిని బాగుగా ఎండనీయవలెను. మొదటిపూతను పైనుండి క్రిందికిని రెండవపూతను ఒక ప్రక్కనుండి మరియొక ప్రక్కకును పూయుట మంచిది. ఒకవిధమైన బ్రౌనురంగుగాని నలుపురంగుగాని చర్మమువిూద కనబడువరకు మార్చిమార్చి పూయుచుండవలెను. ఎక్కువ ఐయోడినును పూసియున్నట్లయిన దూది ఉండలను ఆల్కహాల్‌లో ముంచి తుడుచుటవలన ఎక్కువైన ఐయోడినును తీసివేయవచ్చును.

### వివిధప్రయోగములు (పూతలు)

[2]స్కాట్సు డ్రెసింగు అనునది ఆలివ్‌నూనె, పాదరసము, కర్పూరము కలిపిచేసిన తైలము. ఏదైన ఒక కీలువాచినయెడల, వాపు తగ్గుటకు ఈ తైలమును పూయుదురు. ఇది గట్టిగా నుండునుగాన లింట్, లినెన్ గుడ్డలకు దీనిని పూయకముందు కొంచెము వేడిచేయవలెను. లినన్ గుడ్డను పరచి, 1½—2 అంగుళముల వెడల్పుగల తుండ్లుగా దానిని కత్తిరించవలెను. కీలునకు 2, 3 అంగుళములక్రిందినుండి, 2, 3 అంగుళములు పైవరకు ఈ గుడ్డముక్కలను అంటించవలెను. ఈ పట్లువేయకముందు కీలును బాగుగా కడిగి తుడిచి, అవసరమైనయెడల, అనగా వెండ్రుకలున్నయెడల, క్షౌరము చేయవలెను. మొదటిపట్టీని కీలుక్రింద వేయవలెను. రెండవదానిని, దానితరువాత పట్టీలను ఒకదానిమీద ఒకటి అర్థ అంగుళము పడుచుండునట్లువేయుచు, కీలుమీదికి పోవువరకు వేయవలెను. ఈ పట్టీల (గుడ్డల) కొనలు, కీలు వెలుపలిభాగమున ఒకదానినొకటి దాటుచుండవలెను. ఇదేవిధముగా, అంటించెడు నాడాలను లినన్‌గుడ్డముక్కలకంటె కొంచెము వెడల్పుగా కత్తిరించి, మొదటి పట్టీకి అర్థ అంగుళముక్రిందనుండి ఆరంభించి, కీలంతటిమీద వేయుచు, తుదకు పై పట్టీమీద అరంగుళమువరకు ఉండునట్లు అంటించవలెను. ఇవి వాని

[1] Tincture of Iodine. [2] Scott's Dressing.

స్థానములో నుండునట్లును, రోగి గుడ్డలు, పడకగుడ్డలు చెడకుండునట్లును, పైన అంటించి వానిమీద బ్యాండేజి కట్టుదురు. ఈ డ్రెస్సింగును ఒక వారమైనతరువాత తీసివేయవచ్చును. కట్టు వదులగుటయే దీనిని తీసి వేయవలెననుటకు సూచనగా నుండును. దీనివలన కందుటయు, కీలుయొక్క వాపును తగ్గుచు వచ్చును. రెండవసారి క్రొత్తములామును వేయకముందు, కీలును ఉడుకునీళ్లు, సబ్బుతో బాగుగా కడిగి, మొదట వేసిన పాతతైలము అంతయుపోవునట్లు శుభ్రము చేయవలెను. ఈ ములాములో 12% పాదరసము కలిసియున్నందున, పాదరససంబంధమైన విషము ఎక్కిన గుర్తులు దేహమునందు కనబడుచున్నవేమోయని నర్సు గమనించుచుండవలెను. విషమెక్కినదనుటకు గుర్తులు వమనము వచ్చినట్లుండుట, ఆకలిలేకుండుట, నోరు మంచి రుచిలేకయుండుటగాన, రోగి ఆకలి తగ్గిపోవుచున్నదేమోయని జాగ్రత్తగా చూచుచుండవలెను.

[1]మైనమును ప్రయోగించుట:—కాలుటవలన కలిగిన మొదటి, రెండు, మూడుదశల పుండ్లకును, పచ్చిపుండ్లకును కందినవాటికి పైనవేయుటకును ప్యారఫినుతోచేసిన అనేక రకములైన మైనములు గలవు. ఈ మైనమును ఒక చిన్నపాత్రలోవేసి, స్పిరిట్ దీపముమీద కరిగించి 130°—150° F. వేడియుండునట్లు చేయుదురు. మైనము తనలోని వేడినిపోగొట్టుకొనకుండ నుండుటకుగాను, ఈ చిన్నపాత్రను చాలా వేడినీరున్న పెద్ద పాత్రలో పెట్టియుంచెదరు. ఇట్లు పెట్టియుంచియే యీ మైనమును ప్రయోగించి డ్రెస్సింగు చేయుదురు. ఈ పనికి కావలసిన యితర సామాను లేవనగా, చిన్నచిన్న పలుచని దూదిపొరలు, ఒంటెవెండ్రుకల బ్రష్, మైనమును పూయుటకు ఒక ఈక, బ్యాండేజిగుడ్డ మొదలైనవి. ఈ మైనము తడియున్నచోట బాగుగా అంటుకొనదుగాన, దీనిని ఏ భాగమునకు పూయవలెనో ఆ భాగమును శుభ్రముగా కడిగి, ఆరనీయవలెను. పచ్చిపుండుమీద దీనిని పూయవలసినప్పుడు, ఆ పుండును సేలైను (ఉప్పునీరు) తో కడుగవలెను. పిమ్మట స్టెరైల్ గాజ్ తో బాగుగా తుడువవలెను. నర్సు మొదట ఈ మైనముయొక్క వేడిని చూచుటకు దానిని తన [2]మోచేతి మడతలో కొంచెము అంటించుకొని చూచి, పిమ్మట పుండు అంతటిమీద సమానముగా పూతవేయవలెను. కొన్ని దూదిపొరలను

[1] Application of wax. [2] Flexure of the elbow.



పూయబడిన మైనముమీద అంటించి, వానిమీద తిరిగి మైనముపూసి, దానిమీద మరల దూదిపొరలను అంటించవలెను. ఇట్లు చేయుటవలన డ్రెస్సింగు గట్టిపడినప్పుడు, దానిమీదమరల ఒకపొర దూదవేసి, బ్యాండేజ్ కట్టవలెను. దీనిని 24 గంటల కొకసారి మార్చవచ్చును. మిక్కిలి వేసవికాలములో ఈ మైనము ఎండి, పెట్లు బారినయెడల, దానిలో కొన్ని బొట్ల నూనెవేసి కరిగించినప్పుడు, దానిలో నూనెలేని కొరత తీరి పోవును.

జలగలను పట్టించుట:—రక్తము ఒకచోట అధికముగ చేరి గడ్డకట్టినందు వలన కలిగెడు బాధను నివారించుటకు జలగలను పట్టించుదురు. ఈ చికిత్సను చాల అరుదుగా వాడుచున్నందున దీనిని వివరించ నవసరము లేదు.

పొక్కించుట:-కొన్ని మందులు చర్మము పొక్కునట్లు చేయును. ఇట్లు పొక్కుటవలన పైతోలులేచి, దానిక్రింద ఏర్పడిన పచ్చిపుండు కనబడును. ఈ పుండు సంపూర్ణముగా కాకపోయినను దాదాపుగా ఏర్పడియుండును. ఈ విధమైన పుండ్లు చీముపట్టకుండను, మచ్చ ఏర్పడకుండను త్వరలోనే మానిపోవును. [1]అగ్నిమండలపురుగులు అనునవి ఒకవిధమైన స్పెయినుదేశపు ఈగలు. ఎండిన ఈ పురుగులనుండి ములాములు, తైలము, ద్రవము మొదలైనవి సిద్ధము చేయుదురు. వీనిని పొక్కులు ఏర్పడుటకు ఉపయోగించుదురు. పొక్కులు ఏర్పడవలసిన చర్మముయొక్క భాగమును మొదట నిర్మలముగా సిద్ధముచేసి, ఎంతవరకు మందుపూయవలెనో, అంతవరకు వ్యాజిలీనుపూసి గుర్తువేయవలెను. ద్రవమును పూసినప్పుడు అది వ్యాపించకుండ యీ వ్యాజిలీనును అంతట సమానముగాను వలయముగాను పూయవలెను. ద్రవమును ఒంటెరోమముల బ్రష్‌తో పూసి, ఒక పూత ఆరినతరువాత ఇంకొకపూత, యిట్లు ఐదారు పూతలు పూయవలెను. పొక్కులు ఏర్పడుటకు కొన్నిగంటలు పట్టును. 8 గంటలలో పొక్కులు లేవనియెడల, వేడినీటి రబ్బరుసంచిని ఆ భాగమునకు ప్రయోగించవచ్చును.

ఈ పూతరోగి ధరించుకొనిన బట్టక్రిందనుండినప్పుడును, రోగికి ఆయాసముగా నుండినప్పుడును తప్ప, ఇతరసమయములలో దీనిని మూసి

[1] Cantharides.

వేయవలసిన అవసరములేదు. పొక్కులేచినప్పుడు దాని క్రిందిభాగమును పొంగించిన కత్తెరతో కత్తిరించి నీరు బైటికి కారునట్లు చేయవలెను. కొన్ని సారులు పైతోలును ఊడదీయవలసి యుండును. దీనిని ఛేదించెడు స్టెరైల్ ఫార్సెప్సులతో పట్టుకొని, స్టెరైల్ కత్తెరతో కత్తిరించవలెను. పచ్చి పుండు ఎంత యున్నదో అంత [1]జింకు లేక బోరిక్ ములాము తీసికొని, యీ పుండుకు పూసి డ్రెస్సింగు చేయవలెను. డ్రెస్సింగుచేయునప్పుడు పుండునుండి నీరు బయటికికారునట్లు సందువిడిచి చేయవలెను. అనగా అంచుచుట్టు అంటుదునాడాను కరిపించవచ్చును; కట్టునైనను కట్టవచ్చును. దానిపైన దూదియున్నివేసి మూయవలెను. ఈ డ్రెస్సింగును మొదటి దినములలో రెండుసార్లయినను మార్చుచుండవలెను. పచ్చిపుండుయొక్క పైభాగము మానుచున్నప్పుడు దినమునకు ఒకసారి డ్రెస్సింగుచేసిన చాలును.

[2]కప్పింగ్:—చర్మము క్రిందనున్న రక్తనాళములను విస్తరింపచేయుటకు చేసెడు ఒకవిధమగు చికిత్స. వేడిచేసిన గాజుగిన్నెలుగాని, యితర ప్రత్యేకమైన గిన్నెలుగాని యీ పనికి వాడవచ్చును. ఎదుఱ్ఱొమ్ము వలయములో వాపుసంబంధమైన వ్యాధులు కలిగినప్పుడును, మూత్రపిండములో అధికముగా రక్తముచేరి గడ్డగట్టినప్పుడును ఈ చికిత్సచేయుదురు. ఈ చికిత్సనుగూడ చాల అరుదుగా చేయుదురుగాన, దీనినికూడ వివరించ వలసిన అవసరములేదు.

[3]కౌంటరు ఇరిటెంట్సు:—(మారుమంట కలుగజేయునవి.)

శరీరములో లోతుగనున్న నొప్పిని, వెవ్వేరు భాగములందు కంది నప్పుడును, వాటిని తగ్గించుటకు తరుచుగా వాడు పద్ధతికి కౌంటర్ ఇరిటేషన్ అని పేరు. ఇదివరకే వివరించిన ప్రయోగములన్ని యీ శీర్షికక్రింద చేరును. అన్నివేడి ప్రయోగములును, ఒక భాగమును చురుకుగా రుద్దుటయు దీని క్రింద గణించబడును. రక్తప్రసరణమును ప్రేరేపించు మందుగల లిన మెంటుతో ఈ ప్రయోగమును జేసినయెడల దీనిఫలితము అధికమై యుండును.

లినమెంటులు, వేడినీటిబుడ్లు, పొక్కులు లేపుమందులు, ఆవాల పట్టీలు, కర్పూరతైలము—ఇవి ముఖ్యమైన కౌంటరు ఇరిటెంట్సు.

[1] Zinc or Boric. [2] Cupping. [3] Counter-irritants.

అధ్యాయము 10

# చిన్న శస్త్రప్రయోగములు

ఈ యధ్యాయములో వివరించెడి శస్త్రప్రయోగములు ప్రతిదినము ప్రతి ఆస్పత్రిలో జరుగుచుండునవే. ఆలస్యములేకుండ పని బాగుగా జరుగుటకుగాను ఆయా చికిత్సలకొరకు అవసరమైయుండు సామానులను ముందుగనే పొంగించి, యే సమయములోనైనను ఉపయోగపడునట్లు వానిని ఒక ట్రేలో వరుసగా ఏర్పరచిపెట్టుట మంచిది.

ఈ సామానులను పొంగించుట, ట్రేలను సిద్ధముచేయుట, తెలివితో వైద్యునికి సహాయముచేయుట మొదలగుపనులనన్నిటిని కొన్ని పద్ధతుల ననుసరించి చేయవలసియుండును. ఈ పద్ధతులను నర్సు తన తర్ఫీతు ఆరంభములోనే నేర్చుకొనవలెను. ఆమె నేర్చుకొనవలసిన సంగతులు, సూత్రము లేవనగా:—

(1) స్టెరైల్సామానులేవైన స్టెరైల్కాని సామానులకు తగిలిన యెడల, అవి అన్‌స్టెరైల్ (మలినము) అగును.

(2) స్టెరైల్ వస్తువులను స్టెరైల్పాత్రలలోగాని, స్టెరైల్తువాలు మీదగాని పెట్టియుంచి వాడుకచేయువరకు వానిమీద మూతవేసి యుంచ వలెను.

(3) స్టెరైల్ అయిన సామానులను పట్టుకొనుటకు ఉపయోగించెడు ఫార్సెప్సులను శుభ్రముచేసి, పొంగించి, ఆంటిసెప్టిక్ సొల్యూషను క్రొత్తగాపోసి పొంగించిన జాడీలోవేసి పెట్టవలెను. ఈ పనిని ప్రతి దినము చేయవలెను. అవి యే కారణముచేతనైనను మురికియైనయెడల, తిరిగి జాడీలో పెట్టకముందు వానిని పొంగించవలెను. ఫార్సెప్సులను బయటికి తీయుచుండగను తిరిగి లోపలపెట్టుచుండగను జాడీ (కూజా) మూతి పైభాగమును తాకకుండ జాగ్రత్తగా నుండవలెను. ఫార్సెప్సును ఉపయోగించుచున్నప్పుడు వాని రెండు [1]ముండ్లు క్రిందికి త్రిప్పియే పట్టు కొనవలెను.

[1] Prongs.

(4) స్టెరైల్ సామానుంచిన స్థలముమీదుగా, స్టెరైల్ కాని యేవస్తువునుగాని, తుదకు నీ ముంజేతులను పై చేతులనుగాని దాటనియ్యవద్దు. అనగా వానిమీదుగా తీసికొనిపోకూడదు.

(5) ఏదైన ఒక ప్యాకేజినుండిగాని పాత్రనుండిగాని వస్తువులను తీయునప్పుడు మూతయొక్క లోపలిభాగమును తాకకుండ జాగ్రత్తగా తెరువుము. లోపలివస్తువులను స్టెరల్ ఫార్సెప్స్‌తో బయటికి తీయుము. ఇట్లే సిరింజ్‌లను (పిచికారులను) గూడ తీయవలెను.

(6) స్టెరైల్ బేసినునుగాని, మరేదైన ద్రవమును పట్టుకొను పాత్రనుగాని, దాని ప్రక్కలలోనైనను, క్రిందిభాగముననైనను చేతులుంచి పట్టుకొనుము. వ్రేళ్లతో పాత్రఅంచులను ఎన్నడును పట్టుకొనకుము. పాత్రలన్నిటిని ప్రక్కలలోగాని, క్రిందగాని పట్టుకొను అలవాటును చేసికొనుము.

(7) బుడ్లనుండి బిరడాలు (కార్కులు) గాని, పాత్రమీదనుండి మూతలుగాని తీసి క్రింద పెట్టవలసివచ్చినప్పుడు వానిని త్రిప్పి పెట్టుము. అనగా మూతిపైకిని మట్టుక్రిందికిని ఉండునట్లు పెట్టుము.

(8) మందు సొల్యూషనులను ఒక బుడ్డిలోనుండి యింకొకదానిలో పోయునప్పుడు బుడ్డి మూత క్రిందిభాగము అంటుపడకుండ పోయుము. బుడ్డి మూతను తీసినతరువాత, పొంగించిన స్పంజిని ఆంటిసెప్టిక్ ద్రవములో ముంచి, దానితో బుడ్డి మూతిని తుడువుము. ఆంటిసెప్టిక్ ద్రవము దగ్గర లేనప్పుడు, బుడ్డిలోని సొల్యూషనును కొంచెము క్రింద విడువుము. దాని వలన బుడ్డి మూతి అంచు శుభ్రమగును.

(9) స్టెరైల్ జాడీలను స్టెరైల్ తువాళ్లు కప్పిగాని, స్టెరైల్ మూతలు వేసిగాని యుంచుము.

(10) సామానులను పొంగించకముందు అవి శుభ్రముగానున్నవని నిశ్చయముగా తెలిసికొనుము. మరియు పొంగించునప్పుడు అవి కాలిపోకుండను, పగిలిపోకుండను వానిని గుడ్డతో చుట్టుము.

ట్రేను సిద్ధముచేయు విధము

1. స్టెరైల్ తువాలును ఫార్సెప్స్‌తో ఎత్తుకొని, ట్రేమీద పరువుము. ట్రేయొక్క అంచులనుగూడ మూసివేయవలెను. తడిగల వస్తువులను ట్రేలో పెట్టునప్పుడు ట్రేమీద పరిచెడు గుడ్డను రెండు మడతలు వేసి పరువుము.



2. పొంగించిన సామానులను ఫార్సెప్స్‌తో ఎత్తుకొని నియమించబడిన వరుసన ట్రేలో పెట్టుము.

3. దీని అంతటిమీద స్టెరైల్ తువాలును కప్పి రోగి పడకయొద్దకు తీసికొనిపొమ్ము.

[1]రక్తప్రసరణమండలమునకు మందు నెక్కించుట

ఫలితము త్వరగా కనబడుటకును, ఆ మందును వేరొకమార్గమున ఇయ్యలేనప్పుడును ఈ విధమున మందు నెక్కించుదురు.

**చర్మముక్రిందికి సూదిని గ్రుచ్చి మందు నెక్కించుట:** చర్మము క్రింది సూదిమందులను సాధారణముగా చేతులు, తొడలయొక్క వెలుపలభాగమున నిచ్చెదరు.

పరికరములు:—ఒక ట్రేలో ఈ క్రింది సామానులుండవలెను.—స్పిరిట్ దీపమునకు గరిటెను తగిలించిగాని, ప్రత్యేకముగగాని ఉండవలెను; [2]బట్టీలో దించిన నీరు పోసియున్న బుడ్డి; మూతవేసిన జాడీలో స్పిరిట్ పోసి దానిలో సిరింజియొక్క [3]కడ్డీని, గొట్టములను ప్రత్యేకముగా ముంచియుంచవలెను; సూదులకొరకు ఒక పాత్ర; స్టెరైల్ దూది యుండలున్న మరియొక పాత్ర; ఆంటిసెప్టిక్ లోషనులో ముంచియుంచిన [4]ఫార్సెప్స్; అగ్గిపెట్టె; ఉపయోగించిన నీళ్లు పోయుటకొక పాత్ర; రోగికి ఇయ్యవలసిన మందు దినుసు.



12. స్పిరిట్ దీపము, దానికి తగిలించిన గరిటె.

ఈ పనిని క్రింది విధముగా చేయవలెను:—మొదట ఉత్తర్వులను జాగ్రత్తగా చదివి కావలసిన మోతాదులను తెలిసికొనుము. చేతులను శుభ్రము చేసికొనుము. గరిటెలో బట్టీ పట్టిన నీరుపోసి, దీపము ముట్టించుము. తీగ నెక్కించిన సూదిని, గరిటెలో పెట్టి ఒక నిమిషము పొంగించుము. నీరు సూది మునుగునంతగ నుండవలెను. మంటనుండి తీసి గరిటె కాడకు ఆధారముంచి, ట్రేమీద పెట్టుము. ఫార్సెప్స్‌తో పాత్రలోని దూదియుండను తీసి ట్రేమీద పెట్టుము. ఇప్పుడు సూదిని తీసి

[1] Medication through the circulatory system.
[2] Distilled water. [3] Piston and barrel. [4] Forceps.

దూదిమీద పెట్టుము. స్పిరిట్‌నుండి ఫార్సెప్స్‌తో సిరింజిని తీసి కడుగుటకుగాను దానిగుండ కొంత స్టెరైల్ నీటిని లాగి, చిన్న చిప్పలోనికి విడువుము. గరిటెనుండి 15 మినిమ్స్ నీళ్లను సిరింజిలోనికి లాగుకొని మిగత నీరు పారబోయుము. సిరింజిమొన దూదియుండమీద నుండునట్లు పెట్టుము. కరిగించవలసిన మాత్రను బుడ్డిలోనుండి తిన్నగా గరిటెలో పడునట్లు విడువుము; లేదా స్టెరైల్ ఫార్సెప్స్‌తో తీయుము. ఇప్పుడు సిరింజిలోనున్న నీటిని, మాత్రమీద పడునట్లు చిమ్ముము. పిమ్మట మాత్ర కరుగువరకు గరిటెలోని సొల్యూషనును సిరింజిలోనికి లాగుచు, విడుచుచునుండుము. ఫార్సెప్స్‌తో సూది నెత్తుకొని, దానిని సిరింజికి గట్టిగా బిగించుము. సూది మొన పైకి యుండునట్లు సిరింజిని పట్టుకొనుము. సిరింజిలోని గాలి బయటికి పోవునట్లు దానిలోని సొల్యూషన్ ఒక బొట్టు, సూది మొన పైకి వచ్చువరకు సిరింజిలోని కడ్డీని ముందుకు నెట్టుము. దూదియుండను స్పిరిట్‌లో ముంచి, సూది మొనమీద పెట్టి, దానిని




13. A పై తోలు క్రిందికి సూదిని గ్రుచ్చి మందు నెక్కించుట.
B కండరములలోనికి సూదిని గ్రుచ్చి మందు నెక్కించుట.

రోగి పడకయొద్దకు తీసికొని పొమ్ము. ఈ సూదిమందు నేభాగమున నెక్కించవలెనో ఆ భాగమును, సూది మొనమీదనుండిన దూదియుండతో రుద్దుము. దూదియుండను చూపుడువ్రేలు, మధ్యవ్రేలి నడుమ నుంచుకొని, యెడమచేతి బొటనవ్రేలితోను, చూపుడు వ్రేలితోను చర్మముయొక్క కొంతభాగమును పట్టుకొనుము. కుడిచేతితో సూదిని 45° కోణములో చర్మములోనికి గ్రుచ్చి కొద్దిగ వెనుకకు లాగుము. పైన 13-వ పటము A అను గుర్తుగల సూది తీరును గమనించుము. ఇప్పుడు సిరింజిలోని కడ్డీని బొటనవ్రేలితో నిలకడగా ఒత్తుచు, మందు నెక్కించుము. దూదియుండను సూదివేసిన తావున పెట్టి, సిరింజిని త్వరగా బయటికి లాగి, సూదివేసిన చోటునుండి, ఆ భాగమును మెల్లగా పైకి రుద్దుము. (మర్దనచేయుము.) సిరింజిని నీటిలో శుభ్రముచేసి, స్పిరిట్‌లో జాడించి సూదిని ఊడదీసి, తీగెను దూర్చి, సిరింజిని, సూదిని ప్రత్యేకముగా వాని వాని పాత్రలలో పెట్టుము. ఇచ్చినమందుయొక్క పేరును, పరిమాణమును, గంటను చార్టుపై వ్రాసిపెట్టుము. ఈ మందుయొక్క ఫలితమునుగూడ నర్సు గురించి, చార్టుపై వ్రాయవలెను. మందు ద్రవరూపమున నుండినయెడల సిరింజినుండి గాలిని విడిపించునప్పుడు, కొంత మందు నష్టమగునుగాన, మందు ద్రవరూపమున నున్నప్పుడు అవసరమైనదానికంటె రెండు మినిమ్స్‌మందును జాస్తిగ సిరింజిలోనికి లాగుకొనవలెను. రబ్బరుమూతగల బుడ్డినుండి సొల్యూషనును లాగుకొనవలసినయెడల, రబ్బరుయొక్క పైభాగమును స్పిరిట్‌తో శుభ్రముచేసి, దానిగుండ సూదిని దూర్చి బుడ్డిని బోర్లించుము. ఈ విధముగ చేయుటవలన సూది త్వరగ మొద్దుబారును. మాత్రలుగానుండు కొన్నిమందులను బట్టీపెట్టిన నీటిలో పొంగించవచ్చును. కాని యీ క్రిందిమాత్రలను దీపముమీదనుండి నీటని తీసివేసిన తరువాత ఆ నీటితో కలుపవలెను. ఆ మాత్రలేవనగా:—[1]ఎఫోమార్ఫిన్ హైడ్రోక్లోరైడ్, హయొసిన్ హైడ్రోబ్రోమైడ్, మార్ఫిన్, అట్రోఫిన్‌మాత్రలు, మార్ఫిన్, అట్రోఫిన్, స్ట్రిక్‌నిన్, స్ట్రొఫెంటీన్, మరియు మార్ఫిన్, హయొసిన్ కలిసి.



**సూదిమందును కండరములోనికి ఎక్కించుట:**—కందజేయునట్టి మందు దినుసులు అనగా క్వినిన్, ఎమిటిన్, ఎర్గాట్, ఇనుముతో సిద్ధముచేసిన మందులు, బిజ్మత్, సీరా, నూనెతోచేసిన మందులు, రక్తము మొదలైన వానిని ఇచ్చునప్పుడు ఈ పద్ధతిని వాడుదురు. చర్మము క్రిందికి సూది నెక్కించినప్పుడు అవసరమైయుండిన పరికరములే దీనికిని అవసరమై యుండునుగాని దీనికి మునుపటికంటె పొడుగైన సూది కావలెను. ఈ సూదిని వేయుటకు ఏదైన ఒక పెద్దకండరపు భాగమును ఏర్పరచుకొనవలెను. పిరుదులు, తొడయొక్క వెలుపలిభాగము, భుజపుటెముకము భాగములోను

[1] Apomorphine hydrochloride, hyoscine hydrobromide, morphine and atropine, morphine, atropine, strychnine, strophantine, and morphine and hyoscine.

డెల్టాయిడ్‌లోను సూదిని చర్మమునకు సమకోణముగ పట్టుకొని కండరము లోపలికి గ్రుచ్చవలెను. 13-వ పటములో B అని గుర్తించబడిన సూదియొక్క తీరును చూడుము. ఇప్పుడు మందును మెల్లగాను, నిలకడగాను ఎక్కించుము.

హెచ్చరిక:—సూది కండరములో విరిగిపోకుండునట్లు అది చాలినంత బలముగాను, పదునుగాను ఉండునట్లు, దానిని చాల జాగ్రత్తగా గమనించి యేర్పర్చుకొనవలెను.

రక్తనాళములలోనికి మందు నెక్కించుట:—[1]అతి మూత్రము, ఇన్సులిన్ కోమయను వ్యాధులయందు, వెంటనే పనిచేయుటకు ఇట్లు రక్తనాళములలోనికి మందు నెక్కించుదురు.

పరికరములు:—ఒక స్టెరైల్ ట్రేలో ఈ దిగువ సామాను లుండవలెను. 5 లేక 10 CC. ల సిరింజి, 2 సూదులు, దూది యుండలు, మందున్న ఆంప్యూల్, దానిని కోయుటకు రంపము, స్టెరైల్ తువాలు, ఒక అన్‌స్టెరైల్ ట్రేలో [2]టూర్నికెట్ (బిగింపుకట్టు) ఆంటిసెప్టిక్ లోషను, ఫార్సెప్స్ (దీనిని ఆంటిసెప్టిక్ లోషనులో పెట్టి యుంచవలెను), [3]కిడ్నిట్రే ఒకటి.

పద్ధతి:—రోగి చేతినిచాపి, దానిక్రింద ఏదైన యెత్తుపెట్టి రోగి సుఖముగానుండు తీరున వానిని బెట్టుము. టూర్నికెట్‌ను మోచేతిపైకి బాగుగా బిగించికట్టి, సూదిమందు వేయవలసిన భాగమును ఆంటిసెప్టిక్ లోషనుతో శుభ్రముచేయుము. వైద్యుడు సిరింజినిండ మందునింపి సూదిని రక్తనాళములోనికి నెక్కించును. సిరింజిలో రక్తము కనబడిన వెంటనే, టూర్నికెట్‌ను వదులుచేసి, మందును లోపలికి విడుచును. పిమ్మట సిరింజిని తీసివేసి, గాయముమీద దూది ఉండను బెట్టి రోగిచేతిని ఒకటి రెండు నిమిషములు ముడిచియుంచును. రక్తము కారుట నిలువనియెడల, [4]కొలొడియన్ డ్రెసింగ్ చేయవచ్చును.

[5]ద్రవముల నెక్కించుట

వెన్నుకాలువలోనికి మందు నెక్కించుట:—దీనిని చేయుపద్ధతి, ప్రయోగమునుగూర్చి 189-వ పుటలోని లంబరు పంక్చర్ (నడుములోనికి రంధ్రము చేయుట) అను భాగము చూడుము.

[1] Diabetic or insulin coma. [2] Tourniquet. [3] Kidney tray. [4] Collodion dressing. [5] Introduction of fluids.



ద్రవము నెక్కించుట

చర్మముక్రింద ద్రవము నెక్కించుట (హైపొడర్మొక్లైసిస్):—ఈ పద్ధతి ప్రకారము ఇయ్యబడినమందు ముఖ్యముగా శోషనాళములలో ప్రవేశించి, దేహములో ఇమిడిపోవును. ఈ పనిచేయుటకు ఉపయోగించు సామానులన్నియు పొంగించినవై యుండవలెను. సూది నెక్కించు తావునందలి చర్మమును శస్త్రముకొరకు శుభ్రము చేసినట్లు శుభ్రము చేయవలెను. [1]టిష్యు ఎక్కడ సళ్లుగానుండునో, అనగా స్తనములక్రిందగాని, పెక్టొరాలిస్ క్రిందగాని తొడలలోగాని సూది నెక్కించుదురు. దీనికి ఉపయోగపడు సాధనము: ఒక రబ్బరు గొట్టమునకు ఒక సూది అమర్చియుండును. రబ్బరుగొట్టము పిచికారి డబ్బాకుగాని, తర్మాసుఫ్లాస్కునకుగాని తగిలించబడియుండును. దీనిని ఒక స్టాండునకు తగిలించియుందురు. సూదికి ప్రవహించు ద్రవమును క్రమపరచుటకు గొట్టమునకు ఒక బందును అమర్చియుందురు. కాని స్టాండును దించుటవలనగాని, ఎత్తుటవలనగాని ద్రవము ప్రవహించుటను క్రమపర్చవచ్చును. ఇంజెక్షను వేయుచోట స్టెరైల్ తువాలును వేసియుంచవలెను. స్తనములక్రింద ఈ సొల్యూషనును ఎక్కించునప్పుడు Y ఆకారముగల గొట్టము మరియొక సూదియు రబ్బరు గొట్టమును అవసరమై యుండును. అప్పుడు ఒకేసారి రెండు స్థనములకు ఈ సొల్యూషను నెక్కించుటకు వీలగును. సూదులను ఎదురొమ్ము గోడకును, స్తనగ్రంధికిని మధ్య గ్రుచ్చవలెను. టిష్యులోనికి గ్రుచ్చకముందు సూదిని గాజ్ డ్రెస్సింగులోనికి గ్రుచ్చి తీసినయెడల, సూది చుట్టునున్న భాగమంతయు నిర్మలముగా నుండినట్లు భావించవచ్చును. స్టెరైల్ నార్మల్ సేలైన్‌ను బట్టీ పట్టిన నీటితో సిద్ధముచేసిగాని, 5% గ్లూకోసును సేలైనుతో కలిపిగాని వాడుదురు. సూదిని గ్రుచ్చకముందు దాని గొట్టములోనున్న గాలి బయటికి పోవునట్లు మొదట కొంచెము ద్రవమును బయటికి విడిచెదరు. రబ్బరు గొట్టము బిగువుగా నుండుటవలన సూదిని వెనుకకు లాగకుండునట్లు తగు జాగ్రత్త తీసికొనవలెను. రోగియొక్క స్థితినిబట్టియు, వయస్సునుబట్టియు ఎంతద్రవము నెక్కించవలెనో నిర్ణయించబడును. చిన్నపిల్లకు కొన్ని ఔన్సుల ద్రవము మాత్రము ఎక్కించుదురు

[1] Tissue.

గాని, పెద్దవారికి 1—2 పైంట్లువరకు ఎక్కించెదరు. ఏ భాగమున ద్రవము నెక్కించుచున్నారో, ఆ భాగమున ద్రవము ఎక్కువ చేరియుండకుండ నర్సు జాగ్రత్తగా చూచుచుండవలెను. ద్రవము త్వరగా దేహములో ఇముడకుండినయెడల, పిచికారిడబ్బా యెత్తును తగ్గించి ద్రవప్రవాహమును తగ్గించవలెను. సూదులను తీసివేసిన తరువాత టింక్చరు బెన్జాయినులో ముంచిన స్టెరైల్ దూది యుండలను గాయముల మీద పెట్టుదురు.

**ఇంట్రపెరిటోనియల్ (ఆంత్రవేష్టన భాగమునకు) ద్రవము నెక్కించుట:-** ద్రవహీనమైన చంటిబిడ్డలకు సాధారణముగా ఈ పద్ధతిప్రకారము ఎక్కించెదరు. చర్మముక్రింద ద్రవమెక్కించునప్పుడు వాడెడు పరికరములే దీనికిని కావలెను. ద్రవమును ఒక పెద్ద సిరింజితోకూడా ఎక్కించవచ్చును. మూత్రకోశమును కాళీచేయించి, బొడ్డు క్రింది భాగమును శుభ్రము, నిర్మలము చేయించినపిదప, బొడ్డునకు ఒక అంగుళముక్రింద సూదిని గ్రుచ్చవలెను.

**రక్త నాళములలోనికి ద్రవము నెక్కించుట:-** ఈ ప్రయోగమువలన ద్రవమును రక్తనాళములోనికి ఎక్కించుదురు. శరీరము అధికముగా అదరినప్పుడును, రక్తస్రావమునందును వెంటనే ఫలితము కనబడవలసినప్పుడును ఈ ప్రయోగము చేయుదురు. క్రొత్తగా బట్టీపెట్టిన నీటితో సిద్ధముచేసిన నార్మల్ సెలైన్ సొల్యూషనునుగాని, సెలైనులో 5% గ్లూకోసు కలిపిన ద్రవమునుగాని యీ పనికి ఉపయోగించుదురు.

**పరికరములు:—** ఒక స్టెరైల్ ట్రేలో ఈ క్రింది వస్తువు లుండవలెను. [1]సమాన భాగములు గుర్తించియున్న గాజుబుడ్డికి ఒక కుఱుచయైన రబ్బరు గొట్టమును అమర్చి యుండవలెను. ఈ గొట్టమునకు ద్రవమును బొట్టు బొట్టుగా విడుచు [2]బల్బును తగిలించి యుండవలెను. ఈ బల్బుయొక్క రెండవకొనను రక్తనాళములోనికి గ్రుచ్చెడు సూదికి అమర్చియున్న [3]ఎడాప్టర్ అను సాధనమునకు తగిలించిన పొడుగు రబ్బరుగొట్టమునకు సంబంధపరచి యుండవలెను. ప్రవహించు ద్రవమును క్రమపరచుటకు కుఱుచయైన రబ్బరు గొట్టమునకు ఒక మరబందు నమర్చియుందురు. దూది యుండలు, మరియొక సూది, రెండుతువాళ్లు కూడ అవసరమై యుండును.

---

[1] Graduated glass flask. Drip bulb. [3] Adaptor.



అన్‌స్టెరైల్ ట్రేమీద ఈ దిగువ వస్తువు లుండవలెను. ఒక చేతిపలక, టూర్నికెట్, చేతిపలకను బిగించి కట్టుటకు ఒక బ్యాండేజి, ఒక బుడ్డిలో అంటిసెప్టిక్‌లోషను, ఆంటిసెప్టిక్‌లోషనులో నుంచిన ఫార్సెప్స్, ఉపయోగించిన ఉండలు వేయుటకు ఒక పాత్ర, అడ్‌హిసివ్‌ప్లాస్టర్, బ్యాండేజిగుడ్డ, కత్తెర, అవసరమైన సొల్యూషనుపోసి ఒక బేసిను వేడినీటిలో పెట్టిన ఒక బుడ్డి, స్టాండు మొదలైనవి.

**పద్ధతి:—** చేయబోవు చికిత్సనుగూర్చి రోగికి ముందుగా వివరించి, ఆమెను ధైర్యపర్చుము. సామానులన్నిటిని సిద్ధముచేసి, రోగి పడక యొద్దకు తీసికొనిరమ్ము. చేతిపలకమీద చేతిని చాపి, పలకను చేతికి బిగించికట్టి, మోచేతియొద్దను, పైనను శుభ్రముచేయుము. టూర్నికెటును కట్టి, సూది గ్రుచ్చెడు చోటున స్టెరైల్ తువాళ్లు ఒకటి క్రింద, ఒకటి పైన వేయుము. సొల్యూషనును సమానభాగముల గీతలు గీయబడియున్న బుడ్డిలోపోసి, గొట్టములోనుండి గాలి బయటికి పోవునట్లుచేసి, గొట్టముయొక్క పై భాగమును మరబందుతో బిగించవలెను. వైద్యుడు సూదిని నాళములోనికి ఎక్కించును. పిమ్మట టూర్నికెటును వదులుచేసి, మందు నిమిషమునకు 40—60 బొట్లు పడునట్లు మరబందును క్రమపరచుము. సూది నిలకడగా నిలిచియుండునట్లు రెండు అడ్‌హిసివ్ ప్లాస్టరు ముక్కలను దీసికొని, ఒక దానిని సూది దిగువమట్టము దగ్గరను, ఇంకొక దానిని యెడాప్టర్ మీదను అంటించవలెను.

**వీనెసెక్షన్:—** శరీరములోని ద్రవములు చాలవరకు నష్టమైపోయినప్పుడు రక్తనాళములు ముడుచుకొనిపోవును. అప్పుడు సూది రక్తనాళములోదూరుట కష్టమగును. గనుక ఈ క్రింది స్టెరైల్ సామానులు అవసరమైయుండును. [1]ఫార్సెప్స్, [2]ప్రోబ్, [3]కత్తి, 2 [4]అల్లిస్‌మరబందులు, 2 వంకరమరబందులు, చర్మమును కుట్టెడుసూది, [5]క్యాట్‌గట్. అనుభవముగల నర్సు దగ్గరనే యుండి రోగియందు చలిపుట్టుట, గుండెలో నొప్పి, నాడి, శ్వాసలో గలుగు మార్పులు, ఆయాసము మొదలగు అవలక్షణములు కనబడుచున్నవేమో యని జాగ్రత్తగా గమనించుచుండవలెను.

---

[1] Forceps. [2] Probe. [3] Scalpel. [4] Allis clamps. [5] Catgut.

[1]బ్లడ్ ట్రాన్సుఫ్యూషన్

**నిర్వచనము:**—ఒక మనిషి (డోనర్) రక్తనాళమునుండి మరియొకని (రిసిపియంట్) రక్తనాళములోనికి రక్తము నెక్కించుట. ఇట్లు రక్తము నెక్కించకముందు, [2]దానినిచ్చువానిరక్తము, [3]పొందువాని రక్తముతో సరి పడునో లేదో, ముందుగనే తెలిసికొనవలెను. ఇట్లు ఒండొరులరక్తము సరి పడనందున రక్తమునిచ్చువాని యెఱ్ఱకణములు గడ్డకట్టునట్లుచేయును. దీని వలన రక్తములోని హిమొగ్లోబిన్ వేరగును. ఇట్లు గడ్డకట్టిన రక్తపుముద్దలు, కేశనాళికలు పనిచేయకుండ అడ్డుపడును. దీనివలన ప్రమాదకరమైన ఒగర్పు, నిస్త్రాణ, మరణముకూడ సంభవించవచ్చును. పరీక్షవలన మానవ రక్తమంతయు 1, 2, 3, 4 అను నాలుగు తరగతులకు చేరియుండునని కను గొనియున్నారు. 1 టి తరగతిలో చేరిన రోగి, [4]సర్వత్రరక్తము పొందతగిన వాడుగాన, తక్కిన 3 తరగతులలో ఎవరి రక్తమునైనను ఇతనికి ఎక్కించ వచ్చును. 2 వ తరగతికి చేరిన రోగులు, 2, 4 తరగతులవారి రక్తమును పొందవచ్చును; అట్లే 3 వ తరగతిలో చేరిన రోగులు 3, 4 తరగతులలో చేరినవారి రక్తమును పొందవచ్చును. కాని 4 గుంపులో చేరినవారు ఆ గుంపులో చేరినవారి రక్తమునే పొందగలరు. అనగా మొదటి మూడు గుంపులవారి రక్తము వీరికి సరిపడదు. ఈ నాలుగవ గుంపులో చేరిన వారు [5]సర్వత్రా ఇచ్చెడువారుగాన, వీరి రక్తము నెవరికైనను ఇయ్య వచ్చును. వీరిని యూనివర్సల్ డోనర్సు అందురు. ఈ నాలుగు తర గతులవారి నికరమైన రక్తముయొక్క మచ్చులను సిద్ధముగా పెట్టియుంచు కొన్నయెడల, రక్తము నియ్యగోరువారు ఏ తరగతికి చెందినవారో త్వరగా నిర్ణయించుటకు వీలగును. కాని సాధ్యమైనంతవరకు, ఇచ్చువాడును, పొందువాడును ఒకే తరగతికి చెందియుండుట మంచిది. రక్తము నెక్కిం చుటవలన మలేరియా, సిఫిలిస్ అను వ్యాధులు వ్యాపించవచ్చునుగాన, రక్తమునిచ్చెడువాని (డోనర్) రక్తమును ఈ రెండు జబ్బులకొరకు పరీ క్షించవలెను.

**దేహము అదరుట, రక్తస్రావము, [6]సెకెండరీ అనీమ్యా, కఠినమైన అంటు రోగములలో బ్లడ్ ట్రాన్సుఫ్యూషన్ ఎక్కువ సహాయపడును.**

[1]Blood transfusion. [2]Donor. [3]Recipient. [4]Universal receiver. [5]Universal donor. [6]Secondary anemia.



రక్తము నెక్కించు పనిచేయుటకు మూడుపద్ధతులున్నవి. (1) [1]అంగర్ లేక డైరెక్టుమెథడ్ (2) లిండిమన్ లేక సిరింజి, క్యాన్యులమెథడ్ (3) సోడియం సిట్రేట్ లేక ఇండైరెక్టుమెథడ్. ఈ మూడవదానినే యెక్కువగా ఉప యోగించుదురుగాన, దానిని దిగువ వర్ణించడమయినది:—

రోగి ఉండవలసిన తీరు: డార్సల్ తీరు.

రక్తమును దీసికొనుటకు కావలసిన సామానులు:—

2 తువాలబందులు.

1, 2 CC. ల సిరింజి: (లోకల్ అనెస్తీషియ కొరకు).

2 సిరింజికొరకైన సూదులు.

1 చిన్న చిప్ప (సోడియం సిట్రేట్ గొట్టమును స్టెరైల్ చేయుట కొరకు).

1 గాజుగొట్టము—దీనిలో ఒక పైంటు రక్తమునకు సరిపోవునంత, అనగా 12½ గ్రాముల సోడియం సిట్రేట్ ఉండవలెను.

1 రంపము,

1 10 CC. ల సిరింజి: దీనితో సేలైనును కొలిచి సిట్రేటుతో కలుపు దురు.

1 పాత్ర: దీనిలో రక్తనాళములలోని కెక్కించెడు సేలైన్ ద్రవ ముండును.

2 రక్తనాళములలోనికి గ్రుచ్చెడు సూదులు. వీనికి గాజు ఎడాప్టరు లును, ఒక్కొక్కటి 9 అంగుళముల పొడుగుగల రబ్బరు గొట్టములును అమర్చబడి యుండవలెను.

1 సమానభాగములు గుర్తించబడిన పాత్ర.

1 కలిపెడు పుల్ల (గ్లాస్ రాడ్).

2 స్టెరైల్ తువాళ్లు.

చేతిని శుభ్రముచేయుటకు కావలసిన సాల్యూషను, స్పంజీలు:—

1 రక్తపీడనపు సాధనము.

రక్తమంటుకొనిన సామానులనన్నిటిని బట్టీపెట్టిన నీటిలో పొంగించ వలెను.

[1]Unger or direct method, the Lindeman or syringe and canula method, and the sodium citrate or indirect method.

సిట్రేటున్న గొట్టమును రంపముతోకోసి, సమభాగముల పాత్రలో పోసి, 50 CC. ల ద్రవమగునట్లు దానితో చాలినంత రక్తనాళములకొరకైన సేలైనును కలుపవలెను.

రక్తమునిచ్చువాని చేతిని పలకచెక్కమీదగాని, బల్లమీదగాని బాగుగా చాచి [1]స్పిగ్మోమనోమీటర్ అనుదాని కఫ్‌ను తలక్రిందుచేసి, చేతిపైన యెత్తుగా పెట్టవలెను. పిమ్మట చేతిని శుభ్రముచేసి స్టెరైల్ తువాళ్లు కప్పవలెను. లోకల్ అనెస్తెటిక్‌ను సూదితో ఎక్కించిన తరువాత, రక్తనాళములసూదిని రక్తనాళములోనికి గ్రుచ్చి, రక్తమును సమభాగములు గుర్తించియున్న పాత్రలో పడునట్లు చేయవలెను. రక్తము గడ్డకట్టకుండ దానిని కొద్దిగా త్రిప్పవలెను. రక్తమును బయటికి తీయుచుండగా, రక్తపీడనపు సాధనములో రక్తపు ఒత్తిడి 80 mm. ఉండవలెను. కావలసినంత రక్తము, సాధారణముగా ఒక పైంటు రక్తమును దీసికొన్నతరువాత కఫ్ వదలుచేసి, సూదినితీసి, చేతికి బ్యాండేజి కట్టవలెను. ఒక వ్యక్తి శరీరమునుండి రక్తము తీయుచుండగా, దానిని తీసినంతసేపు వానిని జాగ్రత్తగ గనిపెట్టుచు, అతనికి ఊపిరాడనట్లున్నను, ఆయాసముగనున్నను, రక్తము తీసినతరువాత అతనిని కొంచెముసేపు విశ్రమింప నియ్యవలెను.

రక్తము నెక్కించుటకు కావలసిన సామానులు

2 తువాలబందులు.
1 2 CC. ల సిరింజి: లోకల్ అనెస్తెటిక్ యిచ్చుటకొరకు.
2 సూదులు: సిరింజికొరకు.
1 చిప్ప: లోకల్ అనెస్తెటిక్‌కొరకు.
1 ఆర్టరి ఫార్సెప్స్: గొట్టమును అణిచియుంచుటకు.
2 రక్తనాళముల సూదులు: వీనికి ఎడాప్టరులు తగిలించియుండవలెను.
1 గాజుబుడ్డి: దీనికి 5 అడుగుల రబ్బరు గొట్టము తగిలించి యుండవలెను.
రక్తనాళముల సేలైన్.
గాజ్ స్పంజీలు.
2 స్టెరైల్ తువాళ్లు.

[1] Cuff of the sphygmomanometer.



ఆంటిసెప్టిక్ లోషను.
1 టూర్నికెట్.
1 చేతిపలక.

ఎడాప్టరున్న సూదిని గాజుబుడ్డి తగిలించియున్న రబ్బరుగొట్టమునకు అమర్చుదురు. గొట్టములోనుండియు, సూదిలోనుండియు గాలి బయటికి పోవుటకుగాను రక్తనాళముల సేలైనును గాజుబుడ్డిలో పోయవలెను. పిమ్మట గొట్టమును మరబందుతో బిగించవలెను.

రక్తమును పొందనైయున్న రోగి చేతిని చేతిపలకకు కట్టి, టూర్నికెట్‌ను బిగించి చేతిని శుభ్రముచేసి, గుడ్డతో కప్పియుంచవలెను. లోకల్ అనెస్తెటిక్ (అనగా ఏదో ఒక భాగమునకు మత్తు, చైతన్యము కలిగించెడు) మందు ఇచ్చినతరువాత, రక్తనాళముల సూదిని రక్తనాళములోనికి ఎక్కించి, టూర్నికెటును మరబందును వదులుచేయుదురు. సోడియం సిట్రేట్ కలిసిన యీ రక్తమును బుడ్డిలో పోయుదురు. రోగియందు ఆయాసము, ఒగర్పు, దగ్గు మొదలగు లక్షణములు కనబడుచున్నవేమో యని జాగ్రత్తగా గమనించవలెను. రక్తము నెక్కించినతరువాత చలిపుట్టుట సాధారణమే. ఏదైన అవలక్షణము కనబడినయెడల, చికిత్సను వెంటనే మానివేయవలెను. ఒక పైంటు రక్తము నెక్కించుటకు సాధారణముగా 20 నిమిషములు పట్టును. ఒకొక్కప్పుడు [1]రక్తనాళమునకు రంధ్రము చేయుటకు వీలుకాక పోవునుగాన, అట్టి సందర్భముకొరకు [2]రక్తనాళములో రంధ్రముచేయుటకు కావలసిన సామానులను సిద్ధముచేసి, ట్రేలో పెట్టియుంచుట ఎప్పటికైనను మంచిది.

రక్తము తెంపులేకుండ బొట్లు బొట్లుగా పడునట్టి క్రొత్త పద్ధతిని కనుగొని వృద్ధిచేసియున్నారు. దీనిని తెంపులేనట్టి [3]బ్లడ్ డ్రిప్ ట్రాన్స్ఫ్యూషన్ అందురు. రక్తము తెంపులేక కారుచు ఆపుటకు వీలులేనప్పుడు ఈ పద్ధతి చాల ఉపయోగపడుచున్నది. దీనివలన రక్తమును ఎక్కించుటకు ఎక్కువకాలము పట్టును; అట్లు చాలకాలము తీసికొని నిదానముగా పనిచేయుదురు. ఒక పాత్రను ఎత్తు స్థలమున బెట్టి, దానికి ఒక డ్రిప్ బల్బు, గొట్టము, దీనికొరకు ప్రత్యేకముగా చేసిన [4]బంగారు పూతగల క్యాన్యులా

[1] Venipuncture. [2] Venesection instruments.
[3] Blood drip transfusion. [4] Gold plated canula.

అను వానిని వరుసగా నమర్చియుందురు. బంగారుపూతగలవి చిలుము పట్టవు గనుక అట్టివాటిని వాడుదురు. ఈ సాధనమునకు ప్రాణ వాయువును ఇచ్చెడు సాధనమునుగూడ అమర్చెదరు. దీనివలన రక్తము లోనికి ప్రాణవాయువుపోయి, యెఱ్ఱని రక్తకణములు అడుగున చేరియుండ కుండ కాపాడును. ఈ పద్ధతిలో రోగియొక్క రక్తములోని హిమొగ్లోబిన్ ఎంతవరకు మారినదో యని చూచుటకు, రక్తములోని యెఱ్ఱని కణములను లెక్కించుచుందురు. ఇట్లు లెక్కించుచు, రక్తముకారుటవలన అయిన నష్టముకంటె ఎక్కించిన రక్తము ఎక్కువ అయినదా, కాలేదా యని చూచు చుందురు.

మరియొక క్రొత్తపద్ధతి: [1]ప్లాస్మట్రాన్స్‌ఫ్యూషన్:—దీనిప్రకారము సిట్రేట్ పద్ధతివలెనే రక్తమును బయటికితీసి, మంచుమీద వేసి యుంచుదురు. తేరిన తరువాత, ప్లాస్మయను దానిని సూక్ష్మజీవి రహితమైన దానినిగా తీసి, ఉపయోగముకొరకు సిద్ధముగా పెట్టి యుంచుదురు. దీనివలనగల ప్రయోజన మేమనగా, ఇంతకుముందు చెప్పిన నాలుగుతరగతుల రక్తముతో పనియే యుండదు; రక్తమంతటికంటె ఈ ప్లాస్మ చాలకాలము చెడిపోకయుండును. దేహము అదరుట, ఎక్కువ రక్తస్రావము, కాలుట—ఈ సందర్భము లలో ఇది యెక్కువ ఉపయోగపడును.

చిన్నపిల్లల రక్తనాళములను గనుగొనుట కష్టమైనందున, వారికి ఆంత్ర వేష్టనము (పెరిటోనియం) మూలమునగాని, కండరములలోనికిగాని రక్తము నెక్కించుదురు.

### [2]ఆస్పిరేషన్, ట్యాపింగ్

దేహములోని ఆయా గుహలవంటి లోతైనస్థలములనుండి ద్రవమును దీయుటకు ఆస్పిరేషన్, ట్యాపింగ్ పద్ధతి నుపయోగింతురు. ఆస్పిరేష ననగా, ఆస్పిరేటరుద్వారా ద్రవమును బైటికితీయుట. దీనిని ఒక సిరిం జితోగాని, గాలిలేకుండచేసిన ఒక బుడ్డిమూలమునగాని చేయుదురు. పీల్పుగొట్టము ([3]సక్షన్) ద్వారా ద్రవము బైటికిలాగబడును. లోపల బోలుగా నున్న సూదిని పైజెప్పిన లోతు గుహలలోపెట్టి ద్రవమును దీయుటను ట్యాపింగు లేక [4]పెరెసెంటీసిస్ అనియు నందురు. ద్రవము దానిసొంత

[1] Plasma transfusion. [2] Aspiration and Tapping.
[3] Suction. [4] Paracentesis.



ఒత్తిడివలననే బయటికివచ్చును. ఈ పనికి ఉపయోగించెడు సాధనము పని చేయుటకు తగినస్థితిలోను, సూదులు పదునుగాను నుండవలెను.

ఊపిరితిత్తులను ఆస్పిరేషనుచేయుట: (తొరసెంటిసిస్):—ద్రవము చేరి నందున [1]ప్లూరిసియందు కలుగు లక్షణములను తొలగించుటకును పరీక్ష కొరకు ద్రవము సేకరించుటకును ఈ ప్రయోగమును చేయుదురు.

పరికరములు:—ఒక స్టెరైల్ ట్రేలో ఈ దిగువ వస్తువులుండవలెను:— లోకల్ అనెస్తెటిక్ కొరకు ఒక చిన్నపాత్ర; 2 CC. ల సిరింజియు, 2 సూదు లును; 20 CC. ల సిరింజియు, 2 సూదులును. ఈ సూదులు ఎడాప్టరునకు కూడ సరిపోవునవై యుండవలెను. ఈ యెడాప్టరు ఆస్పిరేటింగ్ గొట్ట మునకు అమర్చబడి, బుడ్డిలోనికి దూరి యుండును. మరియు [2]స్టెరైల్




14. పొటెయిన్ ఆస్పిరేటరును, దానికి సంబంధించిన బుడ్డియు

తువాలు, 6 చిన్న గాజ్ స్పాంజీలు లేక దూదియుండలు [3]టెస్ట్ ట్యూబులును కావలెను. ఒక అన్‌స్టెరైల్ ట్రేలో ఆంటిసెప్టిక్ సొల్యూషనున్న బుడ్డి, లోకల్ అనెస్తెటిక్ ద్రవమున్న ఒక బుడ్డి, చురుకుదనము పుట్టించెడు ఏదైన ఒక మందు, ఆంటిసెప్టిక్ లోషనులో వేసియుంచిన ఫార్సెప్స్, అడ్‌హిసివ్ ప్లాస్టరు, బ్యాండేజి, ఒక కత్తెర, సమభాగములుగా గుర్తించ బడిన పైంటు కొలత పాత్ర, ఉపయోగించిన వస్తువులను వేయుటకు ఒక టిన్ను, ఆస్పిరేటింగ్ సాధనముయొక్క ఇతరభాగములు, మాకింటాష్, [3]చికిత్సతువాల, ద్రవము కొద్దిగామాత్రము కావలసియుండినయెడల,

[1] Pleurisy. [2] Treatment towel. [3] Test tubes.

20 CC. ల సిరింజియు, దానికి అవసరమైన సూదులును చాలును. లేనియెడల పొటెయిన్ ఆస్పిరేటరుగాని, మరేదైన ఆస్పిరేటరుగాని, దానికి తగిన సంబంధములతో ఉపయోగించవలెను, 14-వ పటము చూడుము. పంపుగొట్టమును అమర్చియున్న బుడ్డి, శూన్యస్థలమును కలిగించినందున, ఆ స్థలములోనికి ద్రవము ఎక్కును.

రోగిని సిద్ధముచేయు విధము:—రోగిని పడక అంచునకులాగి, అతనికి శక్తియున్నయెడల, లేపి కూర్చుండబెట్టుము. రోగి తన యెదుఱొమ్మును [1]బెడ్ టేబిలుకు ఆనించి ముందుకువంగి, చేతులు కట్టుకొని బల్లమీదనున్న దిండ్లమీద తలనుపెట్టుకొని కూర్చుండవలెను. రోగి కూర్చుండలేని స్థితిలో నుండినట్లయిన, ద్రవము చేరియుండని ప్రక్కకు ఒదిగి పరుండవలెను. కాని ఒక దిండును ఎదుఱొమ్ముక్రింద పెట్టుకొని పరుండినయెడల, ఆవలిప్రక్కనున్న ప్రక్కటెముకల మధ్యస్థలము విశాలమగును. రోగి వేసికొన్న కోటు లేక గౌను తీసివేసి, ఎదుఱొమ్ము ముందటిభాగముమీద ఒక పలుచని స్నానపు కంబళి కప్పుము. మాకింటాషును, చికిత్స తువాలును వెనుక పరువుము. రోగినిట్లు సిద్ధముచేయుచుండగా, ఏమి చేయబోవుచున్నారో ఆయనకు, లేక ఆమెకు తెలియజేసి, సాధ్యమైనంతవరకు రోగికి భయములేకుండచేయవలెను. ఈ పని చేయుచుండగా, చాల నెమ్మదిగానుండవలెననియు, దగ్గువచ్చినయెడల దానిని కొంచెము ఆపుకొనుటకు ప్రయత్నించవలెననియు, నర్సు రోగికి చెప్పటమంచిది.

పద్ధతి:—డాక్టరుగారు తనచేతులను బాగుగా రుద్ది కడుగుకొని, చికిత్స చేయవలసినభాగమున ఆంటి సెప్టిక్‌లోషనును పూయును. పిమ్మట ఒక స్టైరెల్ తువాలును ప్రయోగించి, 2 CC. ల సిరింజిని, దానికితగిన సూది నుపయోగించి, ఆ భాగమునకు లోకల్ అనెస్తెటిక్ మందు నెక్కించి, స్పర్శ లేకుండజేయును. ఇప్పుడు మొదటిసూదిని తీసివేసి, 20 CC. ల సిరింజికి పెద్ద సూదినమర్చి, కోరబడినంత ద్రవమును బయటికి తీయును; కొద్దిద్రవము తీయవలసినప్పుడే యిట్లు చేయును; లేనియెడల, ఆస్పిరేటింగ్ సాధనమునకు గొట్టమునమర్చును. దానికి పంపుగొట్టుటవలన శూన్యస్థలము ఏర్పడును. శూన్యస్థలములోనికి వక్షములోని ద్రవము లాగివేయబడును. ఈ

[1] Cardiac table.



పని జరుగుచుండగా, నర్సు రోగియొక్క నాడి, శ్వాస, రంగును గమనించుచుండవలెను. ఏదైన అసాధారణమైన అవలక్షణము కనబడిన వెంటనే, నర్సు దానిని డాక్టరుగారికి తెలియజేయవలెను. రోగి తెంపు లేకుండ దగ్గుచుండినను, రోగికి మైకము వచ్చినట్లున్నను, చికిత్సను వెంటనే ఆపివేయవలెను. చికిత్సయైనతరువాత సూదిని తీసివేసి, గాజ్ డ్రెస్సింగు చేసి, అడ్‌హిసివ్ ప్లాస్టరుతో, అది దానిస్థానమున నిలిచియుండునట్లు అంటించెదరు. మాదిరి ద్రవములను టెస్ట్యూబులలోపోసి, [1]చీటి కరిపించి, లెబొరటోరికి పంపుదురు. ఈ చికిత్సచేయబడినకాలము, ద్రవముయొక్క కొలత, దాని రంగు ఇతరలక్షణములు, రోగి స్థితిని గమనించి చార్టుపై వ్రాయుదురు. ఈ చికిత్సయైనతరువాత, రోగి సుఖముగా పరుండునట్లుచేసి, ఆమెయందు ఏవైన అవలక్షణములు అనగా రక్తముగల కళ్లెనుమియుట, ఆయాసము, ఎదుఱొమ్మునొప్పి మొదలైనవి కనబడునేమో యని నర్సు గమనించుచుండవలెను. అవసరమైనయెడల, చురుకు పుట్టించు మందులు వాడవచ్చును. ఉపయోగించిన సాధనమును తిరిగి బిగించి, అనగా దాని భాగములన్నియు తిరిగి అమర్చి, చన్నీళ్లు దానిగుండ పోనిచ్చి దానిని వెంటనే శుభ్రముచేయుము. తరువాత 1-20 కర్బాలిక్ లోషను వంటి ఆంటి సెప్టిక్‌లోషను దానిలోపోసి శుభ్రముచేసి పిమ్మట సాధనమును పొంగించి, యెండబెట్టి, సూదులకు నూనెవేయుదురు.

[2]హృత్కోశమునుండి ద్రవమును తీయుట:—దీనినుండి కూడ వక్షము నుండి ద్రవమును తీసినట్లే తీయుదురు. కాని దీనినుండి కొద్దిద్రవమును మాత్రమే తీయవచ్చును. కావున, ఆస్పిరేటింగ్ బుడ్డి దీనికి అవసరము లేదు. రోగి వెల్లికిలపరుండి యుండును. ఆమె వీపును [3]వెనుక మెత్తుతోను, దిండ్లతోను ఎత్తి పెట్టుదురు. ఈ పని జరుగుచుండగా, రోగియొక్క స్థితిని చాల జాగ్రత్తగా గమనించుచు, రంగుగాని, నాడి తత్వముగాని మారినదేమో గమనించవలెను.

[4]కడుపులోని ద్రవమును తీయుట (పెరసెంటీసిస్ అబ్డామినిస్):—ఒత్తిడిని తగ్గించుటకును, ద్రవమును పరీక్షించుటకొరకును ఇట్లు కడుపులోని ద్రవమును తీయుదురు.

[1] Label. [2] Aspiration of the Pericardium. [3] Back rest.
[4] Tapping of the abdomen (paracentesis abdominis)

పరికరములు:—ఒక స్టెరైల్ ట్రేలో, లోకల్ అనెస్తెటిక్ యున్న చిన్న పాత్ర యొక్క 2 CC. ల సిరింజి, దానికి సరిపోయిన 2 సూదులు, ఒక కత్తి, [1]ట్రోకార్, క్యాన్యుల, ఫార్సెప్స్, 2 పెద్ద బెస్ట్యూబులు, కడుపుపైన పెట్టుటకు ఒక మెత్త, 6 చిన్నగాజ్ స్పంజి, 1 తువాలు, పొడుగు రబ్బరుగొట్టము: దీనికి ట్రోకార్, క్యాన్యుల నమర్చవలెను. ద్రవప్రవాహమును క్రమపర్చుటకు ఒకమరబందు అన్‌స్టెరైల్ ట్రేలో ఆంటిసెప్టిక్ సొల్యూషనున్న ఒక బుడ్డి, ఫార్సెప్స్ వీనినికూడ ఆంటిసెప్టిక్ ద్రవములో వేసియుంచవలెను; లోకల్ అనెస్తెటిక్ మందున్న బుడ్డి, అడ్‌హిసివ్ ప్లాస్టరు, బ్యాండేజి, కత్తెర, కడుపునకు కట్టుటకు ఒక బైండరు, 6 సెప్టీపిన్నులు, సమభాగములుగ గుర్తించబడిన పైంటుగ్లాసు, మాకింటాష్, తువాలు, పాత్ర, ఉపయోగించిన వస్తువులను వేసెడు టిన్ను, బ్యాక్‌రెస్టు.

రోగిని సిద్ధముచేయుట:—రోగిని మూత్రము పోయుమని చెప్పవలెను. అట్లు చేయలేనియెడల, ఆ సంగతి డాక్టరుతో చెప్పినయెడల, వారు క్యాతిటరైజేషను చేయుమని ఆజ్ఞ నియ్యవచ్చును. రోగికి బ్యాక్ రెస్టు మీద దిండ్లువేసి, పడకలో కూర్చుండబెట్టుము. చికిత్స చేయవలసిన భాగము శుభ్రము చేయుము; అవసరముండినయెడల క్షౌరముకూడ చేయుము. కడుపులోని ద్రవము తగ్గుచుండగా, బిగించుటకుగాను బైండరును దాని పాటున సిద్ధముగా పెట్టియుంచుము. ఇట్లు చేయుటవలన ఒక్కొక్కప్పుడు కడుపులోపలి యొత్తడియందు అకస్మాత్తుగ గలుగు మార్పునుబట్టి సంభవించు అదురుపాటును నిరోధించవచ్చును. మాకింటాషును, తువాలును రోగి ఒడిమీద వేయుము.

పద్ధతి:—డాక్టరు తన చేతులు మొదట కడుగుకొని, సాధారణముగా బొడ్డుక్రింద కొన్ని అంగుళముల దూరమున చికిత్స చేయవలసిన భాగమును ఆంటిసెప్టిక్ సొల్యూషనుతో సిద్ధము చేయును. తువాలు పైనవేసి, లోకల్ అనెస్తెటిక్ సూదిమందు నెక్కించును. కత్తితో చర్మముమీద గాటు పెట్టును; దానిద్వారా, ట్రోకారును, క్యాన్యులను లోపల ప్రవేశపెట్టును. ట్రోకారును తీసిన తరువాత క్యాన్యులకు గొట్టము నమర్చును. నర్సు మొదట కొంత ద్రవమును టెస్ట్యూబులో పట్టుకొని, మిగిలినది రోగి పడక ప్రక్కనున్న పాత్రలో పడునట్లు చేయును.

[1] Trochar and canula.



ఈ చికిత్సనమయములో రోగియొక్క నాడిని బహు జాగ్రత్తగా గమనించవలెను. ద్రవమును తీసినతరువాత, క్యాన్యులను తీసివేసి, గాయముమీద కడుపుమెత్తను వేయవలెను. దీనిని అడ్‌హిసివ్ ప్లాస్టరుతో బిగించవలెను. ఒత్తిడిని కాపాడుటకును, అది నిలిచియుండునట్లును, బైండరును బిగించవలెను. రోగిని సాధ్యమైనంత నెమ్మదిగానుండనిచ్చి, అదురుటయొక్క గుర్తు లేవైన కనబడునేమో యని గమనించవలెను. ఈ చికిత్సచేసినకాలమును, ద్రవముయొక్క కొలతను, రంగును, రోగి స్థితిని గమనించి నర్సు చార్టుపై వ్రాయవలెను.

లంబర్ పంక్చర్—(వెన్నెముకను పొడిచి, ద్రవమును తీయుట):—[1]పుర్రెలో గలిగిన ఒత్తిడిని తీసివేయుటకును, వెన్ను కాలువలోనికి మందెక్కించుటకును, వ్యాధిని తెలిసికొనుటకును ఇట్లు ద్రవమును బయటికి తీయుదురు. పుర్రెలోని యొత్తిడిని కనుగొనుటకుకూడ వెన్నులో రంధ్రము చేయుదురు. అప్పు డొక [2]మానోమీటరు నుపయోగించెదరు.

పరికరములు:—ఒక స్టెరైల్ ట్రేలో ఈ దిగువ పరికరము లుండవలెను:—లోకల్ అనెస్తెటిక్ కొరకు ఒక చిన్నపాత్ర; 2 CC. ల సిరింజియు దానికి సరిపోయిన 2 సూదులును; వెన్నెముకను గ్రుచ్చెడు 2 సూదులు (స్టైలెట్స సరిపోవునవిగా నుండునట్లు నిశ్చయముగా తెలిసికొనుము) 20 CC. ల [3]లూయర్ సిరింజి ఒకటి (ఒత్తిడి తగ్గుగానున్నప్పుడు దీని నుపయోగింతురు) 1 తువాలు, 6 దూది ఉండలు, 2 టెస్ట్యూబులు, ఒక కిడ్నీ బేసిన్. ఇవిగాక, అన్‌స్టెరైల్ ట్రేలో లోకల్ అనెస్తెటిక్ మందున్న ఒక బుడ్డి, ఆంటిసెప్టిక్ సొల్యూషనున్న ఒక బుడ్డి, ఆంటిసెప్టిక్ ద్రవములోనున్న 1 ఫార్సెప్స్, అడ్‌హిసివ్ ప్లాస్టర్.

రోగిని సిద్ధముచేయు విధము:—రోగిని ప్రక్కకు పరుండనిమ్ము. అతని వెనుకభాగము మంచము అంచున నుండవలెను. మోకాళ్లు వీలైనంత పైకిలేపి, కడుపునకు తగులునట్లు తొడలను ముడుచుకొని యుండవలెను. వీలైనంతవరకు వెన్ను వంగియుండుటకుగాను తలను భుజములను ముందుకు వంచుము. లేక, రోగి ఒక స్టూలుమీద కూర్చుండవచ్చును. లేక [4]యెదుఱొమ్ముదగ్గరనున్న బల్లమీద నానుకొనునట్లు ముందుకువంగి,

[1] Intracranial pressure. [2] Manometer. [3] Luer syringe.
[4] Cardiac table.

చేతులు ఒకదానినొకటి దాటునట్లు ముడుచుకొనవలెను. రోగి తొడల క్రింద మాకింటాషును తువాలును వేయుము. రంధ్రముచేయవలసిన భాగమును శుభ్రముచేసి, అవసరమైనయెడల క్షౌరముకూడ చేయుము.

పద్ధతి:—డాక్టరు తన చేతులను మొదట బాగుగారుద్ది కడుగుకొని, రెండవ, ఐదవ నడ్డిపూసల మధ్యభాగమును శుభ్రముచేయును. తువాలను పైనవేసి, మూడవ నాల్గవ లేక నాల్గవ ఐదవ నడ్డిపూసల మధ్య లోకల్ అనెస్థెటిక్ మందును సూదితో నెక్కించును. పిమ్మట వెన్నెముకకు ఉపయోగించెడు సూదినిపొడిచి, ద్రవము బయటికివచ్చునట్లు సూది నుండి [1]స్టైలెట్‌ను (తీగెను) తీసివేయును. మాదిరికొరకు ద్రవము కావలసినప్పుడు, కొంత ద్రవమును టెస్ట్యూబ్ లోనికి పారనిచ్చును. లేదా, అవసరమైన మందు నెక్కించును. ఈ చికిత్సయైన పిమ్మట, ముఖ్యముగా, రోగికి [2]సీరము నెక్కించినతరువాత, తలనొప్పికలుగకుండ కొన్ని గంటల వరకు పడకయొక్క కాళ్లతట్టు దిమ్మెలు ఎత్తుపెట్టుదురు. మాదురులను వెంటనే లెబారటొరికి పంపవలెను. గాయమునుండి సూదిని తీసివేసిన వెంటనే, దానిమీద గాజ్ స్పంజిని పెట్టి, అడ్‌హిసివ్ ప్లాస్టరు అంటించెదరు.

ఆర్టిఫిషియల్ న్యుమొతొరాక్స్:—ఏదైన ఒక్క ఊపిరితిత్తికి మాత్రమే వ్యాధియున్నప్పుడు ఈ చికిత్స చేయుదురు. ప్లూరల్ క్యావిటీ అను గుహలోనికి గాలికొట్టి వ్యాధియున్న ఊపిరితిత్తి పడిపోవజేయుదురు. ఈ పనిని పలుమారు చేయనియెడల, గాలి క్రమేణ హరించబడును, అప్పుడు ఊపిరితిత్తి మరల సాగనారంభించును.

ఆర్టిపిషియల్ న్యుమొతొరాక్స అను చికిత్సకు సంబంధపు గొట్టములమర్చియున్న రెండుబుడ్లు కావలెను. సాధారణముగా ఈ చికిత్సలో 1—40 బలముగల కర్బాలిక్ ఆంటిసెప్టిక్ లోషను వాడుదురు. చికిత్స కాలములో ఈ లోషను ఒక బుడ్డినుండి గాలియున్న యింకొక బుడ్డిలోనికి ఒక క్రమమైన ఒత్తిడితో పారుచుండును. ఇట్లు ద్రవము పారుటవలన తప్పించుకొనుగాలిని, గొట్టము, బోలుగనుండు సూదిమూలమున రోగి యొక్క ప్లూరల్ క్యావిటిలోనికి పోనిత్తురు. ఇట్లు ఎంతగాలి పోవలెనో

[1] Stylet. [2] Serum.



డాక్టరెరుగును. ఈ గాలిని సాధారణముగా క్యూబిక్ సెంటిమీటరులలో కొలిచెదరు. ఈ పనికివాడెడు సాధనము నుపయోగించక ముందు, అది యంతయు ఉపయోగయోగ్యముగ నున్నదా, లేదా యని సరిచూడవలెను. సూదిని, సంబంధపు గొట్టమును పొంగించవలెను.

## అధ్యాయము 11

# కట్లుకట్టుట

కట్లుకట్టుట అనునది యొక కళ. దీనియొక్క సరియైన యుద్దేశమును గ్రహించి, దీనిని కట్టుటకుగల నియమములను నేర్చుకొని, విసుగులేకుండ దీనిని అభ్యాసముచేసిననే దీనిని సరిగాచేయుటకు వీలుపడును.

కట్లు అనునవి నూలుగుడ్డ, లేక మరియొక మెత్తని గుడ్డతోచేసిన వివిధపొడుగులు, వెడల్పులుగల కట్టుగుడ్డలు. ఏదైన ఒక దేహభాగమునకు కట్టుటకు అనుకూలముగా వీనిని సిద్ధముచేసియుందురు.

ఉపయోగములు

1. డ్రెసింగులు, మందుపూతలు, చెకలులేక బద్దలు వాని స్థలములో నిలిచియుండుటకు,
2. అవయమునకును, టిష్యులకును ఆధారముగా నుండుటకు,
3. ఒత్తిడిని ప్రయోగించుటకు,
4. చలనమును ఆపుటకు (నిలుపుటకు) లేక దానిని వ్యాపించకుండ చేయుటకు,
5. కురూపములను సరిచేయుటకు—ఈ కట్లు ప్రయోగించబడును.

కట్ల రకములు

1. రోలర్.
2. మూడుమూలల కట్టు.
3. తోకలు గలవి (*a*) 4 తోకలు, (*b*) 6 తోకలు (*c*) అనేక తోకలు గలవి.
4. బైండర్: (*a*) కడుపుకు కట్టునది. (*b*) రొమ్మునకు కట్టునది. (*c*) T ఆకారముగల బైండర్.

**ఉపయోగించెడు గుడ్డలు**

1. [1]గాజ్:—ఇది పల్చుచగాను, మెత్తగాను, సులభముగా అనుకూల పడునదిగాను నుండునుగాని, యిది సన్నని చీలికలుగా సాగియుండుటచేత దీనిని సరిగా ఉదుకుటకు వీలుకాదు.

2. [2]మాతుక మజ్లిన్: — ఇది బరువుగాను, బలముగానునుండును. బద్దలు వాని స్థలములో నిలిచియుండునట్లు కట్టుటకు ఇది చాల బాగుగా ఉపయోగపడును. దీనిని ఉదికి తిరిగి ఉపయోగించవచ్చును గాన, ఎక్కువ ఖర్చుకాకుండును.

3. ఫ్లానెల్:—ఇది మెత్తగాను, సాగునదిగాను, వెచ్చగాను ఉండును. ఇది చాలకాలము నిలిచియుండగలదు గాన దీనిని బైండర్సుగా నుపయోగించవచ్చును. [3]ప్లాస్టర్ ఆఫ్ పారిస్ అను గచ్చుక్రిందను దీనిని ఉపయోగించవచ్చును.

4. లింట్:—ఇది మెత్తగాను, చర్మముయొక్క పైభాగమును గాపాడునదిగాను ఉండును. ముఖ్యముగా ప్లాస్టర్ ఆఫ్ పారిస్ గచ్చుక్రింద నుపయోగింతురు.

5. రబ్బర్:—ఇది బాగుగా సాగును గాన ఒత్తిడికొరకు దీనిని ఉపయోగింతురు.

6. క్రినొలిన్:—ఇది బిరుసుగాను, వదులుగా నేయబడియుండును. ప్లాస్టర్ ఆఫ్ పారిస్ కట్టును చేయుటకు ఇది ఉపయోగించును. క్రినొలిను దొరకనప్పుడు మంచిరకము గాజ్ గుడ్డను ఉపయోగించవచ్చును.

**కట్లను చుట్టుట**

కట్టు కొనను మొదటమడిచి దాని మీదనే గుడ్డ అంతయు ఒక గట్టి చుట్టగ ఏర్పడువరకు చుట్టుము. ఇది బొటనవ్రేలు, మరియొక వ్రేలు మధ్య పట్టుకొన్నప్పుడు వంగి పోకుండునంత గట్టిగా నుండవలెను.

2. కుడిచేతి బొటనవ్రేలు, చూపుడు వ్రేళ్లమధ్య ఈ చుట్టను నిలువగా పట్టుకొనుము. లోపలిభాగము పైకి యుండునట్లు పట్టుకొనుము.

3. కుడిచేతి బొటనవ్రేలు, చూపుడువ్రేళ్ల మధ్య దీనిని చుట్టుచుండుము.

[1] Gauze. [2] Unbleached muslin. [3] Plaster of Paris casts.



4. ఎడమచేతి చూపుడు, మధ్య వ్రేళ్లమధ్య చుట్ట సులభముగా జారిపోవునట్లు దానిని చక్కగా చుట్టుము.

**కట్లు కట్టుటకు ముఖ్యమైన నియమములు**

1. దీనిని ఏ పనికొరకు ఉపయోగించెదరో, ఆ పని సఫలము కావలెను.

2. దీనివలన రోగికి సుఖము కలుగవలెను.

3. ఇది సామాన్యమైనదిగాను, చక్కగాను నుండవలెను.

రోలర్ కట్టును పై చెప్పిన యే గుడ్డతోనైనను చేయవచ్చును. ½ నుండి 5 అంగుళముల వెడల్పుగాను, 4 నుండి 10 గజముల పొడుగుగాను ఉండును. దీనిని సిద్ధముచేయుటకు [1]అంచును తీసివేసి, అవసరమైన పొడుగు, వెడల్పు ఉండునట్లు దీనిని కత్తిరించుము, లేక చించుము. అంచులు సమముగా నుండవలెనుగాన, దారపుచిక్కులను దారపు పోగులనన్నిటిని తీసివేయుము. గాజ్ గుడ్డలోని పోగు ననుసరించి దానిని రెండు చీలికలుగా కోయుము. అప్పుడవి సమముగా నుండును. కట్టును గట్టిగాను సమముగాను చుట్టవలెను. ఇది బిగువుగా కరుచుకొని యుండు ఒక వలయముగా చుట్టబడి యుండవలెను. దీనిని కట్ల రోలర్ మూలమున బాగుగా చుట్టవచ్చును. కాని కట్ల రోలర్ దొరకనప్పుడు దీనిని చేతితోనే చుట్టవచ్చును. ఉదకవలసిన కట్లను సాధారణముగా చేతితోనే చుట్టుదురు. కట్టునంత చుట్టినతరువాత, వెలుపలికొనను పిన్నుతో గ్రుచ్చుము; లేదా, చుట్టచుట్టు ఒక దారముచుట్టుము. రోలర్ కట్టుయొక్క ఆయా భాగము లేవనగా:—

ముఖ్యభాగము లేక తల......కట్టు చుట్ట.
లోపలి ఉపరి భాగము......చుట్టయొక్క లోపలి భాగము.
బయటి ఉపరి భాగము......చుట్టయొక్క వెలుపలి భాగము.
మొదటి లేక వెలుపలి కొన......ఊడియున్న వెలుపలికొన.
చివరికొన......చుట్ట మధ్యనున్న చివరికొన.

**కట్లు కట్టుటకు సామాన్య పద్ధతులు**

1. కట్టు కట్టకముందు దానిని కట్టవలసిన భాగము శుభ్రముగను, పొడిగ నుండవలెను.

[1] Selvage.

2. తగిన వెడల్పు, రకము గలిగిన కట్టును ఏర్పర్చుకొని, ప్రయోగించకముందు దానిని గట్టిగా చుట్టుము. దానిని ప్రయోగించుచుండగా, ఒక్కొక్కసారి 3 నుండి 4 అంగుళములకంటె నెక్కువ కట్టును ఎన్నడును ఊడదీయ కూడదు.

3. రోగిని సుఖమైన తీరుననుంచి కట్టుకట్టవలసిన భాగమును ఏదైన ఒక దానిపై నాధారపడి యుండనిమ్ము.

4. సాధారణముగా కట్టుకట్టుభాగము ఎదురుగ నిలుచుండి ఎడమ తట్టునుండి, కుడితట్టునకు కట్టుకట్టవలెను. సాధ్యమైనప్పుడెల్ల అవయవము యొక్క లోపలియంచునుండి మొదలుబెట్టి వెలుపలి యంచుతట్టునకు కట్టు కట్టుచు, ముందరిభాగమునకు అడ్డముగా క్రిందినుండి కట్టును పైకిరానిమ్ము. కొన్ని కొన్ని సారులు మొండెమునకు పైనుండి క్రిందికిని, ఒక్కొక్క అవయవమునకు వెలుపలనుండి లోపలికిని కట్టుకట్టుదురు. ముఖ్యముగా కాలును వెలుపలికి త్రిప్పునప్పుడు ఇట్లు కట్టుదురు.

5. కట్టును మృదువుగాను, ఒత్తిడి అన్నిప్రక్కల సమముగా నుండు నట్లును బిగువుగా కట్టుము. కట్టిముగించిన కట్టు, బిగువుగా నుండును; వదులుగా కట్టిన కట్టు సులభముగా జారిపోవును. కాని కట్టును మరి గట్టిగా బిగించి కట్టుటవలన, రక్తప్రసరణము అటంకపడవచ్చును; దీనివలన వాపు, రంగు నల్లగామారుట, [1]తిమ్మిరి, సలపరించుట, చల్లదనము కలుగుటయేకాక, కుళ్లికూడపోవచ్చును. ఒక అవయవముయొక్క చివరకు కట్టుకట్టినప్పుడు, కట్టుకట్టకముందును, కట్టిన తరువాతను ఆ భాగమున రక్తప్రసరణమెట్లున్నదో గమనించవలెను.

6. చర్మముయొక్క పైభాగములు, ఒకదానినొకటి యెన్నడును కరుచుకొని యుండకూడదు. అట్టిచోటులకు పౌడరుకొట్టి, చంకలలో మెత్తలు పెట్టుము. అట్లే రొమ్ములక్రిందను, రొమ్ములమధ్యను, గజ్జలమడతలలోను, మోచేయి, మోకాలు ముడుతలలోను, కాలివ్రేళ్లమధ్యను మెత్తలుంచుము.

7. కాలు, లేక పై చేతిభాగమునకు కీలుతోకలిసి కట్టుకట్టవలసినట్లయిన, స్వాభావికముగానున్న తీరుననే దానినిపెట్టి కట్టుకట్టుము.

[1] Tingling.



8. ఒక అవయవమునకుగాని, చేతి లేక కాలి వ్రేళ్లకుగాని కట్టుకట్టునప్పుడు వానికి గాయము తగిలియుండిననేకాని, లేనియెడల వానిని విడిచి కట్టుము. ఇట్లు కట్టినయెడల చేతి, కాలివ్రేళ్ల రక్తప్రసరణ మెట్లున్నదా యని గమనించగలవు.

9. ఒక డ్రెస్సింగుమీద కట్టుకట్టునప్పుడు, ఆ కట్టు డ్రెస్సింగ్ అంతటిమీదపడి అన్నిప్రక్కల కొంచెముదూరము సాగియుండునట్లు కట్టవలెను.

10. గాయముమీదగాని, వాచియున్న చోటుమీదగాని, యెముక యెత్తుకొనియున్న తావునగాని, రోగిపరుండు భాగముమీదగాని పిన్ను గ్రుచ్చకుము; ముడియైనను వేయకుము.

11. ఒక కట్టును బిగించుటకు దానిని సేఫ్టీపిన్నుతో గ్రుచ్చుము, లేక కుట్టుము. కట్టు వెలుపలికొన రెండుగా చీల్చి ముడివేసి, ఆ చీలికలను ఒకదానిమీద నొకటి దాటించి కట్టును బిగించుము. లేక అడ్హీసివ్ ప్లాస్టరు అంటించుము. కట్లను కట్టునప్పుడు అనేకరకములైన పటములను, మాదురులను ఉపయోగించుదురు. వానిని ఈ క్రిందిరీతిగా పేర్కొందురు:—

(1) సర్క్యులర్‌కట్టు:— దీనిని రెండుమూడు చుట్లు చుట్టుదురు. ఈ చుట్లు ఒకదానిమీద నొకటి సంపూర్ణముగా చుట్టబడును. రోలర్ కట్లను ప్రయోగించునప్పుడు అవి గట్టిగా నిలిచియుండునట్లు, ఆరంభములో ఈ సర్క్యులర్ కట్లను కట్టుదురు. చేతిమణికట్టునొద్దగాని చీలమండలమునొద్దగాని డ్రెస్సింగుచేయునప్పుడు, ఆ డ్రెస్సింగు దాని స్థలములో నిలిచియుండునట్లు 3, 4 చుట్లుచుట్టి కట్టుకట్టిన చాలును.

(2) [1]స్పైరల్‌కట్టు అనగా క్రిందనుంచి పైకి ఏటవాలుగ చుట్లు చుట్టుచు క్రిందిచుట్టు వెడల్పుయొక్క మూడు భాగములలో రెండు భాగములను పైచుట్టు కప్పునట్టు చుట్టవలెను. సమానపరిమాణములుగల అవయవములకు ఇట్టికట్టు నుపయోగింతురు. 15-వ పటము చూడుము.



15. స్పైరల్‌కట్టు

[1] Spiral bandage.

(3) ¹స్పైరల్ రివర్సుకట్టు:—ఇదికూడ ముందటిదానివలె పైకిపోవునట్లు చుట్టబడునుగాని, ఒక్కొక్క చుట్టును తిరిగి వెనుకకుత్రిప్పి, అనగా కట్టుయొక్క లోపలిభాగమును వెలుపలికిత్రిప్పి, కట్టు చక్కగా నిలిచి యుండునట్లు కట్టుదురు. కట్టు నెక్కడ వెనుకకు త్రిప్పవలెనో, ఆ చోట యెడమచేతి బొటనవ్రేలుపెట్టి త్రిప్పి యీ స్పైరల్ రివర్సు కట్టును కట్టుదురు. కట్టును కుడిచేతితో పట్టుకొని, అరచేతి క్రిందికి వంచి, ఒక చుట్టుమీద మరియొకచుట్టు రెండు మడతలుగాపడునట్లు మడువుము. ఇప్పుడు దీనిని కుడిచేతితో మెల్లగా లాగి, దాని స్థలములో అది యుండునట్లు అమర్చి, అవయవము చుట్టు చుట్టుము. వెనుకకుత్రిప్పిన మడతలు అవయవము వెలుపలి భాగమున తిన్నగా ఒకదానిపై నొకటి పడునట్లు కట్టుము. శంకు ఆకారముగానుండు అవయవములు కాళ్లుచేతులు మొదలైనవానికి ఈ కట్టు నుపయోగించుము. 16-వ పటము చూడుము.



16. స్పైరల్ రివర్సు కట్టు

(4) ²ఫిగర్ ఆఫ్ ఎయిట్ (ఎనిమిది) అను సంఖ్య ఆకారముగల కట్టు:—ఒక చుట్టును క్రిందికిని, ఇంకొకచుట్టును పైకిని తీసి ఒకదానినొకటి దాటునట్లు అనేక ఏటవాలుచుట్లు వేయుదురు. దీనిని కీళ్లకును, చేతి వెనుకభాగమునకును కట్టుదురు.

(5) ³స్పైకకట్టు:—శరీరముయొక్క మొండెమునకు సమకోణముగా నుండు భుజము, తుంటి, బొటనవ్రేలు మొదలగు అవయవములకు లేక కీలునకు ఫిగర్ ఆఫ్ ఎయిట్ కట్టునుకట్టినయెడల, అట్టి కట్టునకు స్పైకకట్టు యని పేరు. ముగించినప్పుడు ఈ కట్టు బాగుగముదిరిన బార్లీకంకి (స్పైక) వలె నుండునుగాన, దీనికి స్పైక కట్టు అను పేరు గలిగినది.

(6) ⁴డైవర్జంట్ స్పైక:—దీనిని మడిమెలకుగాని, ముడుచుకొనిన మోకాలునకుగాని కట్టుదురు. మధ్యలో మొదటి చుట్టువేసి, తక్కిన

¹ Spiral reverse. ² Figure-of-eight. ³ Spica.
⁴ The divergent spica.



చుట్లను ఆ చోటనుండి పరస్పరము దూరమగుచు పోవునట్లు త్రిప్పుచు కట్టును కట్టుదురు.

(7) ¹రికరెంట్ కట్టు:—ఈ కట్టునుగట్టుభాగమున ముందునకు, వెనుకకు అనేకచుట్లు వేయుదురు. మొండి మొన మధ్యనుగాని, వేరొక భాగముయొక్క మధ్యనుగాని ఆరంభించి, మధ్యనుండి ఒకసారి ఆ తట్టునకు, ఒకసారి యీ తట్టునకు వెనుకకును ముందునకును కట్టును మార్చిమార్చి చుట్టుము. దానిని కట్టుచున్నభాగమంతయు బాగుగా కప్పబడువరకు ఇట్లు చుట్టుచు, క్రిందిభాగమున స్పైరల్ లేక ఫిగర్ ఆఫ్ ఎయిట్ చుట్లు వేయుము. తల, చేతి, కాలివ్రేళ్ల కొనలు మొదలగు మొండి అవయవములకు, ఈ విధమైన కట్టును కట్టుదురు.

తలకు కట్టెడు కట్టు:—(17-వ పటము A, B లను చూడుము.)

తలకట్టునకు లేక కేప్‌లైన్ కట్టుకు రోలర్ కట్టుకు కావలసిన దానికంటె రెండింతలు అధికము కట్టుగుడ్డ కావలెను. ఇది 2 అంగుళములు వెడల్పు, 8 గజముల పొడుగుండవలెను. లేక రెండు కట్లు కొనలను ఒకదానితో నొకటిచేర్చి కుట్టవచ్చునుగాని, కుట్టుమాత్రము చాల చదునుగానుండవలెను. కట్టు మధ్యభాగమును నొసలు మధ్య పెట్టి, రెండుచుట్టలను ఎదురుప్రక్కలకు తలవెనుక గుంటవరకు తీసికొని పొమ్ము. ఇక్కడ రెండుచుట్లను ఒకదానిమీదనింకొకదానినిదాటించి, క్రిందిచుట్టును తలమధ్య గీతమీదుగా, నొసలువరకు రానియ్యవలెను.



17. A. తలకు కట్టెడు కట్టు

రెండవచుట్టను చెవిమీదుగా తలచుట్టుచుట్టి, నుదుటి మధ్యకు రానియ్యవలెను. ఇక్కడ తలమధ్య గీతనుగాని లేక తలమీద వేయబడిన చుట్టనుగాని దాటవలెను. ఈ చుట్టక్రిందనున్న చుట్టను తలమీద ఐమూలాగా తలవెనుక మెడవరకు తీసికొనిపోవలెను. ఇప్పుడు రెండవచుట్టను మరల చెవి

¹ Recurrent.

మీదుగా తల వెనుకకు తీసికొనిపోవలెను. ఇట్లు ఒకదాని తరువాత మరియొకచుట్టను వేయుచు, తల మధ్య గీతకు అవతలను, ఇవతలను మార్చి మార్చి తల అంత కప్పుకొనువరకు చుట్లను పెక్కుసారులు వేయుము. చివరకు రెండు అడ్డచుట్లు వేయుము. కంటిమూలాలగా పోవుచుట్లు వానికి ముందు వేయబడినచుట్టును 2/3 పాళ్లును, అడ్డచుట్లు వానికిముందు వేయబడిన చుట్టును సంపూర్ణముగా కప్పునట్లును చేయుము. ఆఖరున ఒక సేఫ్టీ పిన్నుతో నొసటిపైన గ్రుచ్చి కట్టును ముగించుము.



17 B. తలకుకట్టెడు కట్టు

కంటికట్టు:—(18-వ పటము చూడుము.)

దీనికి 1½ నుండి 2 అంగుళముల వెడల్పుగల కట్టుగుడ్డ కావలెను. ఏ కంటికి కట్టుకట్టవలెనో ఆ కంటితట్టునున్న కణత దగ్గర కట్టుకొనను పెట్టుము. మొదటి చుట్టు: దీనిని నొసలుమీదుగా తల చుట్టుచుట్టి ఆవలి ప్రక్క చెవివరకు పోనిమ్ము. రెండవచుట్టు: ఈ చుట్టునుకంటిమూలగా చెవిక్రిందుగను, కంటిమీదుగను కట్టు క్రింది యంచు ముక్కు పై భాగమును దాటునట్లు తలవెనుకకు తేవలెను. పిమ్మట అడ్డముగా తలచుట్టు చుట్టవలెను. డ్రెస్సింగ్ అంతయు కప్పబడువరకు ఇట్లు చుట్ట



18. కంటికట్టు



వలెను. సాధారణముగా దీనికి మూడుచుట్లు చాలును. బాగున్న కంటి మీదుగాను కట్టు క్రిందుగాను ఒక నాడాను పోనిచ్చి, చుట్లు అన్నిటిని దాటునట్లు ఒక కట్టుకట్టినట్లయిన, కట్టు కంటిమీదికి జారకయుండును.

రెండుకండ్లకు కట్టు (19-వ పటము చూడుము.)

ఫిగర్ ఆఫ్ ఎయిట్ కట్టును దీనికి ఉపయోగింతురు. కుడి కణతయొద్ద ఆరంభించి, మొదటిచుట్టను తలచుట్టుచుట్టి, యెడమ కంటిక్రిందికిని, యెడమచెవి క్రిందికిని, మెడవెనుకకును, కుడిచెవిక్రిందికిని రానిచ్చి, కుడికంటిమీదుగా, యెడమ కణతవరకు పోనిమ్ము. ఇట్లు తలచుట్టు, కుడికణతవరకు రెండుకండ్లు బాగుగా మూయబడువరకు పెక్కుసారులు చుట్టుము. ఈ చుట్లు ఒక్కొక్కసారి ముక్కు (పై భాగమున) ఒకదాని నొకటి దాటుచు పోవలెను. ఆఖరున ముగించుటకుగాను తలచుట్టు రెండుచుట్లు చుట్టవలెను.



19. రెండుకండ్లకు కట్టెడి బ్యాండేజి

దవుడకట్టు ([1]బార్టన్‌కట్టు) (20-వ పటము చూడుము.)

క్రిందిదవుడయెముక విరిగినప్పుడును, గడ్డముమీద డ్రెస్సింగ్ చేయవలసినప్పుడును [1]బార్టన్‌కట్టు నుపయోగింతురు. దీనికి 2 అంగుళముల వెడల్పును, 5, 6 గజముల పొడుగునుగల కట్టుగుడ్డ కావలెను. తలవెనుక గుంటక్రింద మెడమూపుమీద కట్టునారంభించుము. కట్టును ఏమూలాలగా పైకిపోనిచ్చి యెడమచెవికివెనుక, చెవికిదగ్గరగా తలమీదికి పోనియ్యవలెను. తిరిగి క్రిందికిదించి, ముఖము కుడిప్రక్కగా, ముందు భాగమున చెవికిదగ్గర యుండునట్లు రానియ్యవలెను. ఇప్పుడు గడ్డము

[1] Barton bandage.

క్రిందికి పోనిచ్చి, యెడమచెవికి ముందరగా తలమీదికి పోనియ్యవలెను. అక్కడ ఇది తలమధ్యగీతలో మొదటి చుట్టును దాటును. ఇట్లు దాటనిచ్చి, ఆరంభించిన స్థలమునకు తిరిగి దీనిని తీసికొనిరావలెను. ఇక్కడ యిది మొదటిచుట్టును దాటి, దానిని దిట్టము చేయును. ఇప్పుడు కట్టును యెడమ చెవిక్రిందుగా గడ్డముమీదికి పోనిమ్ము. తిరిగి కుడిచెవి క్రిందుగా మొదట ఆరంభించిన స్థలమునకు దీనిని తీసికొని రావలెను. ఇట్లు మూడు నాలుగు సారులు చుట్లు చుట్టవలెను. ఒక్కొక్క కట్టు దాని ముందువేసిన కట్టు మీదనే సరిగా పడుచుండవలెను.



20. దవుడకట్టు

గడ్డముక్రిందినుండి తల పైభాగమునకు (నడినెత్తికి) పోవుచుట్టుతో ఈ కట్టును ముగించి, నడినెత్తిన ముడివేయవలెను.

**చెవికట్టు** (21-వ పటము చూడుము.)

ఈ కట్టునకు [1]మాస్టాయిడ్ కట్టు అని పేరు. దీనికి 2 అంగుళముల వెడల్పును, 5 గజముల పొడుగునుగల కట్టుగుడ్డ కావలెను. ఏ భాగమున చికిత్సచేయవలెనో, ఆ భాగమున ఆరంభించి తలచుట్టు వలయముగా రెండు చుట్లు చెవులమీదుగా చుట్టుము. ఇట్లే గుండ్రముగా చుట్టుచు, మొదట చుట్టును తలవెనుకనున్న గుంటక్రిందికి దించి, తలకు ఎదురుపక్షమున చెవుల క్రిందుగా, తలమీదికి చాలయెత్తుగా పోనిమ్ము. ఇట్లు పైకి పోవుచుట్టనే చుట్టుచు, రెండవచుట్టు దాని ముందుచుట్టుమీద, కట్టున్న వెడల్పులో ⅔ పాళ్లు పడునట్లును, రానురాను డ్రెస్సింగంతయు సంపూర్ణముగా కప్పుకొను



21. చెవికట్టు

[1] Mastoid bandage.



నట్లును చుట్టుము. జబ్బులేనితట్టున మీదికి చుట్టబడిన మొదటిచుట్టే అధిక ఉన్నతమైనది; తక్కిన చుట్లన్ని ఒకదానిమీద ఒకటి బ్యాండేజ్ వెడల్పులో ⅔ పాళ్లు పడుచు క్రిందికి దిగుచుండవలెను. ఆఖరున ఒక చుట్టు తలచుట్టుచుట్టి, నుదుట బిగించుము.

**వ్రేలికట్టు**

దీనిని కొన్నిసార్లు [1]గాంట్ లెట్ కట్టు అందురు. 1 అంగుళము వెడల్పు, 5, 6 గజములు పొడుగుగల కట్టుగుడ్డ దీనికి అవసరమై యుండును. వ్రేళ్లు కాలినప్పుడును, నలిగిపోయి గాయములు కలిగినప్పుడును, ఈ గాయములమీద వేయు డ్రెస్సింగులు నిలిచియుండునట్లు ఈ కట్టు కట్టుదురు. ఈ కట్టును బిగించుటకు మణికట్టుచుట్టు రెండు గుండ్రని చుట్లుచుట్టి, చేతి వెనుకభాగము ఐమూలాలగా చిటికెనవ్రేలు మట్టమువరకు తీసికొనిపోవలెను. తిరిగి ఐమూలాలగా దీనిని వ్రేలి చివరకు తీసికొనిపోయి, అవసరమైనయెడల వ్రేలితలనుకూడ కప్పుచు, మూడు రికరెంటుచుట్లు పై పైన వేయవలెను. ఇప్పుడు సర్క్యులర్ లేక స్పైరల్ రివర్సు చుట్లు చుట్టుచు, వ్రేలిని కప్పివేయవలెను. తిరిగి ఒకచుట్టు మణికట్టు చుట్టు చుట్టి, చేతి వెనుకభాగముమీదుగా రెండవవ్రేలి మట్టమువరకు పోనిమ్ము. ఇట్లు వ్రేళ్లనన్నిటిని కట్టువరకు చేయుము. ఒక్కొక్కసారి మణికట్టుచుట్టు ఒక చుట్టుచుట్టుచు, చేతి వెనుకభాగముమీదుగా, దానివెంబడి వ్రేలి మట్టమువరకు కట్టును తీసికొనిపోవుటను మరువకుము. చివరన ఆఖరి చుట్టు మణికట్టుచుట్టు చుట్టుము. ఒకే ఒక వ్రేలుకు కట్టుకట్టవలసినప్పుడు, వ్రేలి తలమీద రెండుమూడు రికరెంట్ చుట్లుచుట్టి, వ్రేలి తలమొదలుకొని, సర్క్యులర్ లేక స్పైరల్ రివర్సుచుట్లు చుట్టుచు, క్రిందికివచ్చి, వ్రేలిక్రిందిమట్టముదగ్గర ముగించుము.

**[2]బొటనవ్రేలికి స్పైకకట్టు**

1 అంగుళము వెడల్పు, 3, 4 గజముల పొడుగుగల కట్టుగుడ్డ కావలెను. మణికట్టు చుట్టు రెండుచుట్లు చుట్టి, ఈ కట్టును బిగించుము. కట్టుగుడ్డను ఐమూలాలగా చేతి వెనుకభాగమునుండి స్పైరల్ చుట్లు చుట్టుచు, బొటనవ్రేలు తలమీదికి తీసికొనిపొమ్ము. అక్కడ ఒక గుండ్రని

[1] Gauntlet bandage. [2] Spica of thumb.

చుట్టుచుట్టి, స్పైరల్ రివర్సు చుట్లమూలముగా, బొటనవ్రేలు క్రింది మట్టమునకు తీసికొనివచ్చి, వ్రేలివెనుకనుండి మణికట్టులో ప్రకోష్టిక ఎముకయున్న భాగమువరకు తీసికొనిపోవలెను. ఇప్పుడు మణికట్టుచుట్టు ఒక గుండ్రని చుట్టు చుట్టవలెను. డ్రెస్సింగు సంపూర్ణముగా మూయ బడువరకు ఇట్లు బొటనవ్రేలు చుట్టును, చేతిచుట్టును ఫిగర్ ఆఫ్ ఎయిట్ (8) చుట్లు చుట్టుచు నుండవలెను. ఒక్కొక్కచుట్టు దాని ముందు చుట్టుమీద దాని వెడల్పులో సగముభాగము పడుచుండవలెను. ఆఖరున మణికట్టుచుట్టు ఒక చుట్టుచుట్టి ముగించవలెను.


22. ఫిగర్ ఆఫ్ ఎయిట్ చేతికట్టు

**చేతికట్టు** (22-వ పటము చూడుము.)

2 అంగుళముల వెడల్పును, 3, 4 గజముల పొడుగును గల కట్టుగుడ్డకావలెను. మణికట్టు చుట్టు చుట్టెడి గుండ్రని చుట్లవలన కట్టు బిగించబడును. పిమ్మట కట్టును, చేయి, వ్రేళ్ల వెనుకగా పోనిచ్చుచు, వానిచుట్టు గుండ్రముగా ఒక చుట్టు చుట్టవలెను. చేతివెనుకను, వ్రేళ్ల మట్టము చుట్టును ఫిగర్ ఆఫ్ ఎయిట్ (8) చుట్లు వేయుచు ఈ కట్టును ముగించవలెను. ఆఖరున మణికట్టు చుట్టు ఒక గుండ్రని చుట్టుచుట్టి దీనిని ముగించెదరు.

**మిటెన్ కట్టు** (23-వ పటము చూడుము.)

చేతిని, చేతివ్రేళ్లనుగూడ కప్పుటకు ఈ కట్టు నుపయోగించెదరు. బొటనవ్రేలును కప్పి కట్టుకట్ట వలసియెడల, మొదట దానిచుట్టు స్పైక కట్టు కట్టుదురు. వ్రేళ్లమధ్యనున్న చర్మము ఒకదానితో నొకటి యంటుకొనకయుండునట్లు వ్రేళ్లమధ్య డ్రెస్సింగ్ వేసి, వ్రేళ్లను కాపాడుదురు. కట్టుయొక్క మొదటి కొనను చేతి వెనుకభాగమున నిలువుగా పెట్టి, పెక్కు రికరెంట్ చుట్లు చుట్టి ఒక్కొక్కచుట్టు దాని ముందు చుట్టు మీద $\frac{2}{3}$ భాగమును కప్పునట్లు చేయవలెను. ఈ చుట్లను వ్రేళ్లచుట్టువేయు గుండ్రని చుట్లమూలమున


23. మిటెన్ కట్టు



బిగించుదురు. ఇప్పుడు చేతిచుట్టు పెక్కువరుసల ఫిగర్ ఆఫ్ ఎయిట్ (8) చుట్లను జుట్టి, ఒక్కొక్క క్రొత్తచుట్టు దాని ముందు చుట్టుమీద $\frac{2}{3}$ భాగమును కప్పునట్లు చేయవలెను.

**ముంజేతికట్టు** (24-వ పటము చూడుము.)

మణికట్టు క్రిందిచేతికి కట్టిన కట్టునే మోచేతివరకు కట్టుచు పోవచ్చునుగాని, ముంజేతికి (మణికట్టు, మోచేయి మధ్యభాగము) మాత్రమే కట్టుకట్టవలసి యుండినయెడల, మణికట్టుచుట్టు రెండు గుండ్రని చుట్లుచుట్టి కట్టును బిగించుము. పిమ్మట రెండు మూడు స్పైరల్ చుట్లు పైకి చుట్టుచు పోయి వీనివెనుక స్పైరల్ రివర్స్ లేక ఫిగర్ ఆఫ్ ఎయిట్ (8) చుట్లు, చేతిభాగమంతయు కప్పుకొను వరకు చుట్టుము.


24. ఫిగర్ ఆఫ్ ఎయిట్ ముంజేతి కట్టు

**మోచేతికట్టు** (25-వ పటము చూడుము.)

మోచేతిని కొద్దిగా మడువుము. మోచేతి [1]బుడుపు, కట్టుగుడ్డ నడుమనుండునట్లు తిన్నగా మోచేతిమీద రెండు గుండ్రనిచుట్లు చుట్టుము. ఇప్పుడు మోచేతి బుడుపుపైన చుట్టుమీద సగము వెడల్పు కప్పునట్లు దానిపైన గుండ్రనిచుట్లు చుట్టుచు, ముంజేతి క్రిందివరకు రానిమ్ము. పిమ్మట ఈ కట్టు మోచేతిని మడిచిన ముందు భాగమునకు రానిచ్చి, రెట్టచుట్టు చుట్టుచు, మోచేతి బుడుపుమీద చుట్టిన గుండ్రనిచుట్టుమీద దాని వెడల్పులో సగము చుట్టుమీద పై చుట్లు పడునట్లు చుట్టవలెను.


25. ఫిగర్ ఆఫ్ ఎయిట్ మోచేతికట్టు

మోచేతి పైభాగమునను క్రిందిభాగమునను మార్చిమార్చి చుట్లువేయుచు

[1] Olecranon process.

పెక్కుసార్లు చుట్టుము. ఇట్లు మోచేయియంతయు బాగుగా కప్పుకొను వరకు చుట్టుము. రెట్టచుట్టు ఒకటి రెండు గుండ్రని చుట్లుచుట్టి కట్టు కట్టుట ముగించుము.

రెట్టకట్టు:— మోచేతిపైన రెట్టమీద రెండు గుండ్రనిచుట్లుచుట్టి యీ కట్టును బిగించవలెను. స్పైరల్, లేక స్పైరల్ రివర్సుచుట్లు పైకి చుట్టుచు, రెట్ట అంతయు కప్పువరకు చుట్టుచుండవలెను. రెట్టచుట్టు రెండు గుండ్రనిచుట్లుచుట్టి కట్టుకట్టుట ముగించుము.

[1]భుజమునకు స్పైకకట్టు కట్టుట (26-వ పటము చూడుము.)

2½ అంగుళములు వెడల్పు, 8 గజములపొడుగుగల కట్టు గుడ్డ దీనికి కావలెను. ఈ స్పైక కట్టును పైచుట్లు చుట్టిగాని, క్రిందిచుట్లు చుట్టిగాని కట్టవచ్చును. సాధారణముగా పై చుట్లకట్టును కట్టుదురు. కట్టుకట్టవలసిన భాగము ప్రక్క నిలుచుండి యీ కట్టు కట్టవలెను. చంకలో మెత్తపెట్టవలెను. రెట్టచుట్టు చంకదగ్గర రెండు గుండ్రని చుట్లుచుట్టి యీ కట్టును బిగించవలెను. పిమ్మట దానిని రెట్ట చుట్టు పోనిచ్చి, కుడిభాగము గాయపడియున్న యెడలవక్షముమీదుగను, ఎడమభాగము గాయపడియున్నట్లయిన వీపుమీదుగను ఎదుటి చంక క్రిందుగాను వీపుమీదుగాను గాయపడిన చేతికి కట్టుకట్టుచు, దీనికి ముందుచుట్టును, ఇది, మధ్యగీతలో దాటునట్లు చేయవలెను. రెండవచుట్టు మొదటిదాని వెడల్పులో సగము లేక మూడింట రెండుపాళ్లు పడునట్లు చుట్టుచు, మొదటిదాని మధ్యగీతలో సరిగ రెండవచుట్టు దాటునట్లు భుజమంతయు కప్పుకొనువరకు పైకిపోవు చుట్లుచుట్టవలెను. ఈ కట్టును ముందుతట్టు బిగించుము.


26. స్పైకభుజపుకట్టు

[1]Spica of the shoulder.



[1]వెల్పోకట్టు

దీనికి 2½ అంగుళముల వెడల్పుగల పెక్కు కట్టుగుడ్డలు కావలెను. వీనిని ఒకటిగాచేర్చి కుట్టవచ్చును. [2]కంటి ఎముకలు, భుజపు టెముకలు విరిగినప్పుడును, భుజము స్థానము తప్పినప్పుడును ఈ చికిత్స చేయుదురు. దీనిని డాక్టరే సాధారణముగ చేయునుగాని దాని నెట్లు చేయవలయునో నర్సుకూడ తెలిసికొనియుండుట మంచిది. చంక, ఱొమ్ము, చెయ్యి— ఈ మూటిని స్పిరిట్‌తో బాగుగరుద్ది పౌడరు పట్టించవలెను. చంకలో మెత్త నొకదానిని పెట్టవలెను. చేతికిని ఱొమ్ముకును మధ్యగల చర్మమునకు ఏ హాని కలుగకుండ వాని మధ్య సన్నని దూదిపొరను పెట్టవలెను. ఇంక మెత్తలను మోచేతిముడతలోను, గాయపడిన ఎముకమీదను, అరచేతియందును పెట్టవచ్చును.

గాయపడిన ప్రక్కనున్న చేతిని ఎదురుభుజముమీద వీలైనంత పైగ పెట్టవలెను. కట్టుయొక్క మొదటి కొనను గాయపడని ప్రక్కనున్న భుజపుటెముకలమీద పెట్టవలెను. దానిని గాయపడిన ప్రక్కనున్న భుజము తలమీదికి తీసికొనిపోయి చేతి వెలుపలి అంచుమీదుగా రెట్ట క్రిందికి రానిచ్చి మోచేతిని కలిపి కట్టును చుట్టవలెను. ఈ కట్టును ఎదురుపక్షముననున్న చంకక్రిందికి వక్షముమీదుగ పోనిచ్చి ఆరంభించిన స్థలముతో కలుపవలెను. కట్టును బిగించుటకు ఇట్లే మరియొకసారి చేయవలెను. కట్టు, గాయపడని ప్రక్కనున్న [3]అంసఫలకము మీదికి రెండవసారి వచ్చినప్పుడు దానిని వీపుమీదుగను, మోచేతి బుడుపుమీదుగను, వక్షము ముందరగను, చంకక్రిందుగను పోనిచ్చి తిరిగి బాగున్న ప్రక్కయొక్క అంసఫలకమువరకు పోనియ్యవలెను. ఇక్కడనుండి దీనిని గాయపడిన భుజముమీదుగను, రెట్ట వెలుపలిభాగము క్రిందికిని, మోచేతి క్రిందికిని, వక్షముమీదుగను, చంకక్రిందుగను మొదట ఆరంభించిన స్థానమునకు పోనియ్యవలెను. దీనివలెనే వక్షము చుట్టును, మోచేతి బుడుపుమీదుగను, మరియొక గుండ్రని చుట్టు చుట్టవలెను. ఈ గుండ్రని పైచుట్టు, క్రింది చుట్టుమీద దాని వెడల్పులో సగమువరకు కప్పవలెను. భుజముమీదను, రెట్టక్రిందను చుట్టిన ఒక్కొక్కచుట్టు దానిముందరిచుట్టు

[1] Velpeau bandage. [2] Fractures of the clavicle and scapula, and the dislocation of the shoulder. [3] Shoulder blade.

యొక్క వెడల్పులో ⅔ పాళ్లు కప్పవలెను. భుజములమీద ఈ చుట్లు మెడక్రింది మట్టమునకు వచ్చువరకు చుట్టుచుండవలెను. అట్లే రెట్ట నంతయు బాగుగ కప్పువరకు గుండ్రని చుట్లను చుట్టవలెను. చేతిని సాధారణముగ విడిచిపెట్టి కట్టుకట్టుదురు. నిలువుగను, అడ్డముగను పోవు చుట్లు ఒకదానినొకటి దాటుచోట కుట్లు వేయవచ్చును. విడిగానున్న కొననుగూడకుట్టి భద్రముచేయవలెను.

**పాదపుకట్టు** (27-వ పటము చూడుము.)

2½ అంగుళముల వెడల్పుగల బ్యాండేజ్ దీనికి అవసరమై యుండును. కాలివ్రేళ్లకు కొంచెముపైన రెండు గుండ్రని చుట్లు చుట్టుము. ఫిగర్ ఆఫ్ ఎయిట్ చుట్ల మూలమున పాదమును కప్పివేయుము. ఈ చుట్లు పాదమునుండి చీలమండవరకు పోవుచు పైచుట్టు, క్రింది చుట్టుయొక్క వెడల్పులో సగము వెడల్పును కప్పివేయవలెను. కాలివ్రేళ్లనుకూడ కలిపి కట్టు కట్టవలసిన యెడల పాదము లోపలిభాగమును, మీగాలును కలిపి వ్రేళ్లచుట్టు మూడు నాలుగు రికరెంట్ చుట్లు చుట్టవలెను. పిమ్మట పైన వివరించినట్లు ఫిగర్ ఆఫ్ ఎయిట్ కట్టు కట్టవలెను.



27. ఫిగర్ ఆఫ్ ఎయిట్ పాదపుకట్టు

**మడిమకట్టు** (28-వ పటము చూడుము.)

దీనికి 2½ అంగుళముల వెడల్పుగల బ్యాండేజ్ కావలెను. మడమమీదనే తిన్నగా రెండు గుండ్రని చుట్లుచుట్టి యీ కట్టును బిగించవలెను. పిమ్మట దీనికి ఫిగర్ ఆఫ్ ఎయిట్ కట్టుకట్టుచు, మధ్యమధ్య రెండు లేక యెక్కువ చుట్లు మడమ క్రిందను మీదను చుట్టుచుండుము. ముందు వేసిన కట్టులో ⅔ పాళ్లు వెడల్పును వెనుకవేసిన కట్టు కప్పవలెను. ఆఖరున చీలమండచుట్టు గుండ్రని చుట్టుచుట్టి కట్టు బిగించుము.



28. మడమకుకట్టెడు డైవర్జెంట్ స్పైకకట్టు



**కాలికట్టు** (28-వ పటము చూడుము.)

2—2½ అంగుళముల వెడల్పును, 8 గజముల పొడుగునుగల బ్యాండేజ్‌ని దీని కుపయోగించుము. రక్తము జాస్తిగ కూడకుండుటకుగాను పాదమునుకలిపి కట్టు కట్టుదురు. కాలుయొక్క ఆకారమునుబట్టి మొదట



29. ఫిగర్ ఆఫ్ ఎయిట్ కాలికట్టు

కొన్నిచుట్లు స్పైరల్ చుట్లుగా చుట్టవచ్చును. పైకి పోవుచుట్లు స్పైరల్ రివర్స్‌గాగాని ఎనిమిది యను సంఖ్య చుట్లుగాగాని యుండవచ్చును.

**మోకాటికట్టు** (30-వ పటము చూడుము.)

2 అంగుళముల వెడల్పుగల బ్యాండేజ్ కావలెను. మోకాటిచిప్పను కప్పునట్లు మోకాటిమీద తిన్నగా రెండు గుండ్రనిచుట్లు చుట్టుము. వీని తరువాత వేయు రెండు చుట్లను మోకాటి క్రిందికి పోవునట్లు చుట్టుము. ఈ రెండు చుట్లును వీనికి ముందువేసిన వాని వెడల్పులో సగము వెడల్పును కప్పవలెను. వీనికి తరువాత వేయుచుట్లును ఒకటి మోకాటి మీదను, ఒకటి క్రిందను మార్చి మార్చి వేయవలెను. క్రింది చుట్టుయొక్క వెడల్పులో ⅔ భాగమును మీదిచుట్టు కప్పునట్లు వీనిని వేయవలెను. పైకి పోవుచుండు స్పైరల్ చుట్లుగాని, స్పైరల్ రివర్స్ చుట్లుగాని చుట్టుచు పోవలెను. పై కాలుయొక్క ఆకారమునుబట్టి దానికి ఈ చుట్లు వేయవలెను.

గజ్జకు స్పైక అను కట్టు కట్టుట [1](ఆసెండింగ్ స్పైక)

మొదట తొడచుట్టు రెండు గుండ్రనిచుట్లు చుట్టుము. పిమ్మట కట్టును వస్తిచుట్టు వెనుకనుండి ముందుకుచుట్టి, ఆరంభించిన స్థలమునకు రానిమ్ము. మొదటిచుట్ట తొడయొక్క వెలుపలి భాగముమీద దాటి, తొడచుట్టును, మరల వస్తిచుట్టును ముందటి చుట్టచుట్టును తిరిగి రావలెను. తుంటిని



30. గజ్జకు కట్టెడు స్పైకకట్టు

బాగుగా కప్పువరకు ఈ చుట్లను మరలమరల చుట్టుము. ఒక్కొక్క క్రొత్తచుట్టు, ముందటిచుట్టును దాని వెడల్పులో సగము కప్పునట్లు వేయుము. ఈ బ్యాండేజ్‌ని క్రిందికి దిగుచున్న స్పైక కట్టుగానైనను కట్టవచ్చును. అట్లు కట్టునప్పుడు మొదటి రెండు చుట్లను వస్తిచుట్టును జుట్టి బ్యాండేజ్‌ని పైకి కాకుండ క్రిందికి కట్టుచుండవలెను.

స్తనముకట్టు (స్తనము ఆధారపుకట్టు.) (31-వ పటము చూడుము.)

3—3½ అంగుళముల వెడల్పును, 12 గజముల పొడుగునుగల బ్యాండేజ్ దీనికి అవసరమైయుండును. ఇది రొమ్మునకు వేసిన డ్రస్సింగ్‌ను దాని స్థానమున నుంచుటకును, స్తనమునకు ఆధారముగానుండుటకును వేయబడును. స్తనమునకు ఆధారముగా వేయునప్పుడు చర్మమును గాపా

[1] Ascending spica.



డుటకుగాను స్తనముక్రింద దూది నుంచవలెను. రెండు స్తనముల బ్యాండేజ్ చేయవలసినట్లయిన, వీనిమధ్య దూదినుంచి కట్టుకట్టవలెను. మొదటి కొనను కట్టుకట్టవలసిన స్తనము క్రింద నుంచుము. వక్షము చుట్టు రెండు గుండ్రని చుట్లు చుట్టి కట్టును బిగించుము. ఎడమ స్తనము బ్యాండేజ్ చేయునప్పుడు ఎడమతట్టునుండి కుడితట్టునకును, కుడి స్తనమును బ్యాండేజ్ చేయవలసినప్పుడు, కుడినుండి యెడమతట్టునకును ఈ చుట్లను, అనగా వక్షము చుట్టు చుట్లను చుట్టవలెను. మూడవ చుట్టును స్తనము




31. స్తనముకట్టు

క్రిందిభాగము మీదినుండి యెదురువక్షము భుజమునొద్దకు, వీపుమీదికిని, జబ్బగనున్న ప్రక్కయొక్క చంకక్రిందికిని తీసికొనిపోయి, దీనిముందు చుట్టును దాటించి, తిరిగి యెదురొమ్ము, వీపుమీదుగా ముందుతీసికొని పోయిన భుజముమీదికి తీసికొనిపోవలెను. డ్రస్సింగ్ అంతయు కప్ప బడువరకు ఇట్లు పెక్కుసారులు చేయుము. స్తనములకు కట్టుకట్టుచుండగా, వానిని ఎత్తికట్టుటకు జాగ్రత్తగలిగి యుండవలెను. ఒక్కొక్క చుట్టు దాని ముందరిచుట్టులో సగము వెడల్పును కప్పివేయవలెను.

[1]బైండర్స్ అను బంధనపుకట్లు; అనేక తోకలు లేక స్కల్టీటస్ బైండర్స్

వీనిని కడుపునకు కట్టుటకు ఉపయోగించెదరు. వీనిని క్రింది విధముగా చేయుదురు:—3 అంగుళములు వెడల్పును, 1½ గజము పొడుగును గల 5 లేక 6 గట్టి గుడ్డపేలికలు తీసికొనుము. ఈ పేలికల అంచులు చదునుగానుండునట్లు కుట్టవలెను. ఒక్కొక్క పేలిక దానిముందు పేలిక వెడల్పులో సగము వెడల్పును కప్పునట్లు అమర్చి, వాని మధ్యభాగమున ¼ గజము దూరము కుట్టవచ్చును. ఇట్లు కుట్టినభాగమే దీనియొక్క ముఖ్యభాగమై యుండును. తక్కినభాగము దీనికి తోకలుగా ఉపయోగ

[1] Binders, many tailed or scultetus binders.

గజ్జెకు స్పైక అను కట్టు కట్టుట [1](అసెండింగ్ స్పైక)

మొదట తొడచుట్టు రెండు గుండ్రనిచుట్లు చుట్టుము. [illegible] కట్టును వస్తిచుట్టు వెనుకనుండి ముందుకుచుట్టి, ఆరంభించిన స్థలమునకు రానిమ్ము. మొదటిచుట్ట తొడయొక్క వెలుపలి భాగముమీద దాటి, [illegible]చుట్టును, మరల వస్తిచుట్టును ముందటి చుట్టచుట్టును తిరిగి రావలెను. తుంటిని



30. గజ్జెకు కట్టెడు స్పైకకట్టు

[illegible] కప్పువరకు ఈ చుట్లను మరలమరల చుట్టుము. ఒక్కొక్క [illegible]త్తచుట్టు, ముందటిచుట్టును దాని వెడల్పులో సగము కప్పునట్లు వేయుము. ఈ బ్యాండేజ్‌ని క్రిందికి దిగుచున్న స్పైక కట్టుగానైనను కట్టవచ్చును. అట్లు కట్టునప్పుడు మొదటి రెండు చుట్లను వస్తిచుట్టును [illegible] బ్యాండేజ్‌ని పైకి కాకుండ క్రిందికి కట్టుచుండవలెను.

స్తనముకట్టు (స్తనము ఆధారపుకట్టు.) (31-వ పటము చూడుము.)

[illegible] అంగుళముల వెడల్పును, 12 గజముల [illegible]గల బ్యాండేజ్ దీనికి అవసరమైయుండును. ఇది రోగమునకు [illegible] డ్రెస్సింగ్‌ను దాని స్థానమున నుంచును, [illegible] ఆధారముగానుండుటకును చేయబడును. స్తనమునకు ఆధారముగా చేయునప్పుడు చర్మమును గాఢ

[1] Ascending spica.



డుటకుగాను స్తనముక్రింద దూది నుంచవలెను. రెండు స్తనముల బ్యాండేజ్ చేయవలసినట్లయిన, వీనిమధ్య దూదినుంచి కట్టుకట్టవలెను. మొదటి కొనను కట్టుకట్టవలసిన స్తనము క్రింద నుంచుము. వక్షము చుట్టు రెండు గుండ్రని చుట్లు చుట్టి కట్టును బిగించుము. ఎడమ స్తనము బ్యాండేజ్ చేయునప్పుడు ఎడమతట్టునుండి కుడితట్టునకును, కుడి స్తనమును బ్యాండేజ్ చేయవలసినప్పుడు, కుడినుండి ఎడమతట్టునకును ఈ చుట్లను, అనగా వక్షము చుట్టు చుట్లను చుట్టవలెను. మూడవ చుట్టును స్తనము




31. స్తనముకట్టు

క్రిందిభాగము మీదినుండి యెదురువక్షము భుజమునొద్దకు, వీపుమీదికిని, జబ్బుగనున్న ప్రక్కయొక్క చేంకక్రిందికిని తీసికొనిపోయి, దీనిముందు చుట్టును దాటించి, తిరిగి యెదురొమ్ము, వీపుమీదుగా ముందు[illegible] పోయిన భుజముమీదికి తీసికొనిపోవలెను. డ్రెస్సింగ్ అంతయు [illegible]బడువరకు ఇట్లు పెక్కుసారులు చేయుము. స్తనములకు కట్టుకట్టు[illegible] వానిని ఎత్తికట్టుటకు జాగ్రత్తగలిగి యుండవలెను. ఒక్కొక్క [illegible] దాని ముందరిచుట్టులో సగము వెడల్పును కప్పివేయవలెను.

[1]బైండర్స్ అను బంధనపుకట్లు; అనేక తోకలు లేక స్కల్‌టీటస్ బైండర్స్

వీనిని కడుపునకు కట్టుటకు ఉపయోగించెదరు. వీనిని క్రింది విధముగా చేయుదురు:—3 అంగుళములు వెడల్పును, 1½ గజము పొడుగు[illegible] గల 5 లేక 6 గట్టి గుడ్డపేలికలు తీసికొనుము. ఈ పేలికల అంచులు చదునుగా[illegible]నట్లు కుట్టవలెను. ఒక్కొక్క పేలిక దానిముందు పేలిక వెడల్పులో సగము వెడల్పును కప్పునట్లు అమర్చి, వాని మధ్యభాగమున ¼ గజము దూరము కుట్టవచ్చును. ఇట్లు కుట్టినభాగమే దీనియొక్క ముఖ్యభాగమై యుండును. తక్కినభాగము దీనికి తోకలుగా ఉపయోగ

[1] Binders, many tailed or scultetus binders.

14

పడును. ఈ బైండర్‌యొక్క ముఖ్యభాగమును రోగిక్రింద ప్రయోగించునప్పుడు, బైండర్‌యొక్క క్రింది యంచులు తుంట్లమీద పడునట్లు పెట్టవలెను. కాని పడకచట్టిని ఉపయోగించుటకు వీలుకానంత క్రిందికి యీ యంచులు వ్రేలాడకూడదు. తోకలను కడుపుమీద ఐమూలగా మొదట కుడితట్టునకును, తరువాత యెడమతట్టునకును పోనిమ్ము. ఇట్లు ఇవియన్ని కడుపు మధ్యభాగముమీద ఒకదానినొకటి దాటునట్లు చేయుము. వీనిని ప్రక్కలలో దోపి, ఆఖరిదానిని సేఫ్టీ పిన్నులతో గ్రుచ్చుము. ఈ బైండర్‌ను శస్త్రగాయములకు కట్టునప్పుడు క్రిందినుండి మీదికి కట్టుదురు. కాని గాయములనుండి రసి మొదలగు ద్రవములు స్రవించవలసినప్పుడు, ఈ కట్టును మీదినుండి క్రిందికి కట్టుదురు. ఇట్లే ప్రసవసంబంధముగా దీనిని ప్రయోగించునప్పుడును, పైనుండి క్రిందికి కట్టుదురు. కొన్నిసారులు తలను కట్టుటకు నాలుగుతోకల బైండర్ల నుపయోగించుదురు.

**[1]సింగిల్ T బైండర్**

ఒక పేలికను నిలువుగాను మరియొక పేలికను మొదటిదాని తలకడ్డముగాను పెట్టి కుట్టినయెడల, దానికి ఇంగ్లీషు T అక్షరపు ఆకారము కలుగును. దీని పేలికలు 3—4 అంగుళముల వెడల్పుగలవై యుండవచ్చును. ఇండియాదేశములోని చాకలివారు ఈ బైండరులను చలువ చేయరు గాన, యివి 4 అంగుళముల వెడల్పున్నను మంచిదే. సన్నముగా నుండు వానివలె ఇవి త్వరగా ముడతలు పడకయుండును. పెరినియమ్ మీద [2]డ్రెస్సింగ్‌లుగాని, డయపర్లు లేక న్యాప్కిన్సుగాని వాని స్థలములలో నిలిచియుండుటకు ఆడవారికి వీటిని వాడుదురు.

**[3]డబుల్ T బైండరు**

దీనినికూడ సింగిల్ T బైండరును చేసినట్లే చేయుదురుగాని, నిలువు పేలికలు ఒకటిగాక రెండువేసి కుట్టుదురు. పెరినియమ్ పై డ్రెస్సింగ్‌లు వాటి స్థానములోనుండుటకై మగవారికి వీటిని వాడుదురు.

**[4]బ్రెస్ట్‌బైండర్**

1½ గజము పొడుగు, 12 అంగుళముల వెడల్పుగల గట్టి గుడ్డముక్కను తీసికొనుము. అన్నిప్రక్కల పోగుపోసి, అంచులుకుట్టి రెండు

[1] Single T binder. [2] Dressings on diapers or napkins.
[3] Double T binder. [4] Breast binder.



భుజపు పేలికలను తగిలించుము. ఈ పేలికలు 12 అంగుళములు పొడుగుండవలెను; ఒక్కొక్కప్రక్కను బైండర్ మధ్యనుండి 4 అంగుళముల దూరములోనుండవలెను. ఒక చివర భుజపుపేలికను స్వేచ్ఛగా విడువుము. దీనిని ముందుతట్టును, చెంగులను ప్రక్కలతట్టును పిన్నులతో గ్రుచ్చి రోగిదేహమునకు సరిపోవునట్లు చేయుదురు. దీనిని రొమ్ముమీదను, దీని యంచులయొద్ద వచ్చిన వదులును మడిచి ప్రక్కలయందును పిన్నులతో గ్రుచ్చవలెను. బైండర్ దానిస్థానములో నిలిచియుండునట్లు సరిచేసి, దానిని పిన్నులతో గ్రుచ్చవలెను. స్తనములు పైకెత్తబడియుండునట్లు స్తనములమధ్య దూదిని చంకలక్రింద తువాలును పెట్టవచ్చును.

**ట్రయాంగ్యులర్ లేక చేతిరుమాల బ్యాండేజ్ (32-వ పటము చూడుము.)**

చేతికిని, ముంజేతికిని, మోచేతికిని ఆధారముగానుండునట్లు ఈ కట్టు కట్టుదురు. ఒక చేదరపుగుడ్డను ఐమూలగా కత్తిరించి యిట్టి రెండు బ్యాండేజ్‌లను సిద్ధముచేయుదురు. ముంజేతిని మధ్యపెట్టుము. బాండేజ్ సమకోణపుకొన మోచేతిమీదికి వచ్చునట్లు దాని నమర్చుము. మొండెము నానుకొనియుండు కొనను గాయపడిన ప్రక్కనున్న భుజముమీదికి



32. ట్రయాంగ్యులర్ బ్యాండేజ్‌ని చేతికి ఆధారముగా కట్టుట

పోనియ్యవలెను. రెండవకొనను ఎదురుపక్షముననున్న భుజముమీదికి పోనియ్యవలెను. ఈ రెండు కొనలను మెడచుట్టు ముడివేయుదురు. సమకోణపుకొనను చక్కగామడిచి, బ్యాండేజ్ ముఖ్యభాగమునకు పిన్ను గ్రుచ్చుచుందురు. వట్టి చేతినిమాత్రమే ఆధారపడ జేయవలసినప్పుడు, త్రిభుజాకారపు బ్యాండేజ్‌ని ఒకటి రెండుసారులు మడిచికట్టిన చాలును. లేక కొంచెము వెడల్పుగల రోలర్ బ్యాండేజ్ నైనను ఉపయోగించవచ్చును.

తల, భుజము, చెయ్యి, పాదము, తొంటి, పిరుదులు వీనికి వేయు డ్రెస్సింగ్‌లు తమ స్థానముననుండునట్లును ఈ ట్రయాంగ్యులర్ బ్యాండేజ్‌ని ఉపయోగింతురు.

**ట్రయాంగ్యులర్ పాదపుకట్టు** (33-వ పటము చూడుము.)

**తెరచియున్న** ట్రయాంగ్యులర్ బ్యాండేజ్‌ని పాదముక్రింద పెట్టుము. దాని సమకోణము కాలివ్రేళ్ల వెలుపలనుండునట్లు పెట్టుము. ఈ బ్యాండేజ్ అడుగు మట్టము మడమకు దాదాపు 4 అంగుళముల దూరమున నుండవలెను. సమకోణపు కొనను వ్రేళ్లమీదుగా **చీలమండలము** కీలు ముందరకును, **అడుగు మట్టమును** మడిమచుట్టును మడువుము. కొనలను **చీలమండలముచుట్టు** పోనిచ్చి, ముందుతట్టున ముడి**వేయుము.**


33. ట్రయాంగ్యులర్ పాదపుకట్టు

**చేతికికట్టుడి** ట్రయాంగ్యులర్ బ్యాండేజ్

రోగియొక్క అరచేతిని క్రిందికిత్రిప్పి, దానిని బ్యాండేజ్ **అడుగుమట్టమున పెట్టుము.** బ్యాండేజ్ సమకోణపు కొనమాత్రము రోగినుండి **దూరమునుగానుండవలెను.** ఇప్పుడు ఈ సమకోణపు కొనను చేతిపైకి **మడిచి,** దానిమీదపడునట్లు రెండు ప్రక్కలనున్న కొనల నొక్కొక్క **దానినికూడ** మడువుము. వెనుకభాగమున (మణికట్టుచుట్టు) ఈ కొనలను


34. తలకుకట్టెడు ట్రయాంగ్యులర్ బ్యాండేజ్


35. మడమకుకట్టెడు ట్రయాంగ్యులర్ బ్యాండేజ్



దాటించి మణికట్టుమీద ముడి**వేయుము.** ఈ విధముగా **దేహములోని** యితరభాగములకుకూడ ఈ బ్యాండేజ్‌లను కట్టవచ్చును. (34, 35-వ పటములు చూడుము.)

**పీటముడి** (36-వ పటము చూడుము.)

కుడిచేతిలో పట్టుకొన్న కొనను ఎడమచేతిమీదుగా దాటించి, దాటిన స్థలమునకు క్రిందుగా దానినినే తిరిగి యెడమచేతివైపునున్న దానిక్రిందికి తీసి ఒక ముడివేయవలెను.


36. పీటముడి


37. రీఫ్‌ముడి

**రీఫ్‌ముడి** (37-వ పటము చూడుము.)

పైన పీటముడిలో నలెనే యిప్పుడుకూడ కుడిచేతిలోని కొనను ఎడమచేతి మీదుగా దాటించుము. ఇప్పుడు ఎడమచేతికొనను కుడిచేతికొన మీదుగా దాటించి ముడివేయుము. ఈ ముడి గట్టిముడిగా నుండును.

అధ్యాయము 12

# చనిపోవుచున్నవారికి చేయవలసిన పరిచర్య[1]

“ప్రతి నర్సుకు ఎప్పుడో ఒకప్పుడు కొంచెము ముందుగా గాని, ఆలస్యముగా గాని చనిపోవుచున్న రోగి పడకప్రక్కన మొదటిసారి నిలుచుండవలసిన తరుణము వచ్చును. అప్పుడామె చావునుగూర్చి యేమి తలంచును? ఒక క్షణము యోచించినట్లయిన, పుట్టుట గిట్టుటకే యన్నట్టు పుట్టిన ప్రతివారు చావవలెననియు, ఈ మరణము, భూమిమీద మనము

[1] Quoted from Pearce's *A General Text-book of Nursing*, by kind permission of the author and her publishers, Faber and Faber

జీవించిన జీవితకాలమునకును, నిత్యత్వమునకును మధ్య ఏర్పడిన ఒక వంతెన వంటిదనియు ఆమె గ్రహించును. మరణము—అనగా, భౌతిక శరీరము నుండి మానవుని యాత్మ లేచిపోవుట. ఇట్టి విడుదలను మరణము అందురు. 'అబ్బో! మరణమెంతో భయంకరమైనది' యని అనేకులు భయపడు చుందురు.

ఒకడు రోగియై యున్నప్పుడు అతడు బాగుపడుటకును, సుఖముగా నుండుటకును నర్సు ఎట్లు ఉపచర్యచేయునో, అట్లే మరణమనెడి యీ ముఖ్యమైన కాలములోను రోగికి ఆమె తనశక్తికొలది ఉపచర్యచేయుటకు సిద్ధముగా నుండును. సాధారణముగా రోగి తన మరణమునుగూర్చి ముందుగనే గ్రహించియుండును గాని, దానినిగూర్చి యెవరితోనైనను ముఖ్యముగా తన బంధువులతోనైనను ప్రస్తాపించ నిష్టపడడు. అయినను యీ సంగతినిగూర్చి వైద్యునిగాని, నర్సునుగాని యడుగును. 'నా జవాబును, రోగి భరించగలడా?' యను సంగతిని, వైద్యుడు ముందుగా నిర్ణయించుకొనవలెను. పరిస్థితులనుబట్టి రోగి యడిగిన ప్రశ్నకు వెంటనే జవాబియ్యవలసినదియు లేనిదియు వైద్యుడు నిర్ణయించును. కాని యెట్లయినను తన విధినిబట్టి వైద్యుడు జవాబిచ్చి తీరవలెను. కాని ఆయన దానిని ఒకే మాటతో చెప్పక, రోగియెడల తనకుగల సానుభూతిని, ప్రేమను కనుపరచుచు, నిదానముగా సంగతిని తెలియచెప్పుట మామూలు.

రోగి చనిపోవుచున్నాడని వైద్యుడు నిశ్చయముగా తెలిసికొన్నప్పుడు, ఆ సంగతిని రోగి బంధువులకు తెలియజేయుట ఆయన విధి. దుఃఖించుచున్న బంధువులందరు రోగి పడకచుట్టు చేరుదురు. రోగియొక్క మరణమువలన వారికి గొప్పలోటు కలుగును. ఇప్పుడు చనిపోయినవానిని మినహాయించి, రాబోవుకాలమునుగూర్చిన తమ ఏర్పాటులన్నియు చేసికొన నారంభింతురు. ఒకొరినొకరు ఓదార్చుకొనుటకును మొదలిడుదురు.

ఇట్టి సమయములో వైద్యుడు రోగి పడకదగ్గర జాగుచేయుచు నుండడు. ఈ సమయములో ఆయనయొక్క పనియు సులభమైనది. చనిపోవనైయున్న రోగియొక్క అంత్యఘడియలు వీలైనంత సుఖముగాను, నెమ్మదిగాను నుండునట్లు కొన్నిమందు లియ్యుమని ఆజ్ఞచేయును.

రోగియొద్ద అనేక గంటలు ఓపికగా కనిపెట్టియుండి, పరిచర్యచేసిన నర్సు, అతని మరణమునుగూర్చి విచారపడును. ఏదో పోగొట్టుకొని



నట్టు ఆమె తలంచును. నర్సు తన పరిచర్యవలన రోగిని చాల బాగుగా ఎరిగి యుండును. రోగియొక్క అక్కరలను తీర్చుట ఆమెకు చాల అవసరమై యుండెను. ఇట్లు రోగికి పరిచర్యచేయుచు, అతని యక్కరలను దీర్చుచుండినందున వీరిద్దరిమధ్య ఒకవిధమైన స్నేహము ఏర్పడును. ఈ మరణకాలములో అట్టి నర్సు దగ్గరనుండుటవలన, రోగికి యెంతో నెమ్మది, ధైర్యము కలుగును. అట్లే రోగియొక్క బంధువులును చాల ఓదార్పు పొందగలరు. చనిపోవుచున్న రోగి అసలు, ఒంటరిగా నుండును; వాని బంధుమిత్రాదులు దగ్గరనుండి, వానిని ఓదార్చుచుండిననే తప్ప, లేనియెడల, నర్సు పలుమారు రోగిపడకప్రక్కకు పోయి, వానిచేతిని పట్టుకొని, మరియొక చెయ్యి నొసటిమీదపెట్టి, ఇట్లు రోగిని తాకుటమూలమున తాను అతనిదగ్గర నున్నట్టు తెలియజేసి, అతనికి ధైర్యము కలుగజేయవలెను. చనిపోవుచున్న రోగి, తానెరిగిన ఒకరు తనతోకూడ నున్నారని తెలిసికొని సంతోషించును. తాను ఒంటరిగా లేనట్లు గ్రహించును. రోగి తన దగ్గరనున్న వారిని చూడనట్లును, మతితప్పియున్నట్టు నున్నను, తాను కండ్లు తెరచినప్పుడు తనయొద్ద మరియొకరుండుట చూచి, ధైర్యము పొందును.

రోగి మరణస్థితిలోనున్నాడు, గనుక ఆతడు వినవలెనను ఉద్దేశముతో మనము సంభాషించుటలేదు గదా యనుకొని అతని పడకయొద్ద మాటలాడకూడదు. ఎందుకనిన రోగి చలనములేనట్లును, నవ్వనట్లును, మాటలాడలేనట్టు నున్నను, అతడు మనము చెప్పుకొనుమాటలు బాగుగా విని గ్రహించగలిగిన స్థితిలో నుండును. రోగి తెలియజెప్పలేక పోయినను తాను కొంతబాధ ననుభవించుచు, ఆ బాధను తగ్గించుటకు మనము చేయగల చిన్నకార్యములనుగూర్చి సంతోషించును. ఉదాహరణముగా:—ఎండిపోవుచున్న అతని పెదవులను నీటితో తడుపుట, ముక్కును దుడుచుట, కనుబొమను చేతిగుడ్డతో నద్దుట, కండ్లలో పడుచుండు వెంట్రుకలను చేతితో తీసి, చక్కచేయుట, అతని అవయవములమీద ఏవైన పడకగుడ్డలుపడి బరువుగా నుండినట్లయిన, ఆ బరువును తీసివేయుట, ఒకేప్రక్క పరుండుటవలన తిమ్మిరిపట్టకుండ రోగిని ప్రక్కకు త్రిప్పుట, ఇత్యాది కార్యములవలన రోగికి ఎంతో నెమ్మది కలిగించవచ్చును. కడుపు ఉబ్బరమును తగ్గించుటకు పడకచట్టిని గాని, మూత్రపాత్రనుగాని

యియ్యవచ్చును. తనకు ఇవి యవసరమని రోగి గ్రహించకపోయినను, వాని నిచ్చినప్పుడు ఉపయోగించవచ్చును.

కొందరు రోగులమనస్సు ఇట్టి పరిస్థితులలో చంచలముగాను, ఎక్కడనో తిరుగుచు నుండును; వారి జ్ఞాపకశక్తియన్ననో వారిని మోసపుచ్చుచుండును. ఒక క్షణములో రోగి తన పూర్వకాలపు జీవితమును తలంచి, గతకాలపు తన మిత్రులతో సంభాషించుచున్నట్లు ఊహించును; మరు క్షణములో తన నిజస్థితిని, దగ్గర చుట్టుపట్లనున్న పరిస్థితులను గ్రహించవచ్చును. నర్సు వానిని తాకుటవలనను, ఆమె స్వరము అతనికి వినబడునట్లు చేయుటవలనను ఇట్లు చంచలమై తిరుగుచున్న రోగియొక్క మనస్సు, తిరిగి మంచిస్థితికి రావచ్చును. రోగి గ్రహించెడు శక్తిలేక పిచ్చిపిచ్చిగా మాటలాడుచున్నప్పుడు నర్సు, ఏదో ఒక మంచిమాట చెప్పి, అతనిని నవ్వించవలెను. నర్సు తనప్రక్కనున్నది గదా యను తలంపువలనను, తనను ఇతరులు పరామర్శించుచున్నారని అతడు చూచునట్లు చేయుటవలనను రోగి నెమ్మిది పొందవచ్చును.

చనిపోవుచున్నరోగులు దేవునిగూర్చి తలంచుట సహజమే, కావున, వారు ఏ క్రైస్తవ సంఘమునకు చెందియున్నారో ఆ సంఘ గురువు (పాస్టరు) వారిని దర్శించునట్లు చేసినయెడల, రోగులు కృతజ్ఞత గలిగియుందురు. బోధకుడు రోగితో మాటలాడి పోయినతరువాత కొంతసేపటివరకు నర్సు అతనిని తొందరచేయకుండుట మంచిది. ఎందుకనగా, అతడు దేవునిగూర్చి తలంచుచు మనోనెమ్మది, శాంతిగలిగియుండును. నర్సు రోగిని పలుకరించుటవలన ఈ శాంతి చెడిపోవును.

జబ్బుతోను, చనిపోవుచునున్న రోగులను పరామర్శించు నర్సు, తనకు దేవునిగూర్చి యెట్టి నమ్మకమున్నను, నమ్మకము లేకపోయినను, రోగులుగాని, వారి తలిదండ్రులు పోషణకర్తలు తదితరులుగాని కోరినట్లు నర్సు చేయవలెను. ఉదాహరణముగా:—చనిపోవుచున్న ఒకరోగి, ప్రభుసంస్కారమిచ్చు వాడుకయున్న ఒక సంఘమునకు చేరినవాడై యుండవచ్చును. అట్టి సమయములో రోగికి ఇంక మతియు, అవయవములను బుద్ధిని ఉపయోగించు శక్తియు నుండగనే, సంఘగురువునకుగాని, సాక్రమెంటులు (ప్రభుసంస్కారము) ఇచ్చెడి సంఘాధికారికిగాని, వెంటనే కబురు



చేయవలెను. (మాట పంపవలెను.) రోగి మతిహీనుడును, మ్రింగుటకు శక్తిహీనుడునై యుండినయెడల ఆ సంగతిని గురువునకు తెలుపవలెను.

రోగి యీ సాక్రమెంటులు (ప్రభువు సంస్కారము) పుచ్చుకొనుటవలన అతని హృదయమునకు గొప్ప నెమ్మది కలుగవచ్చును. ఎందుకనగా, తన కృపను మానవులు పొందునట్లు క్రీస్తు నియమించినమార్గములివియే. ఆలస్యములేక ఎంతత్వరగా రోగి వీనిని పొందునట్లుచేయునో, అంతవరకు అతని యాత్మకు సహాయముచేసితినని నర్సు భావించుకొనవచ్చును. ఆమె చేసిన యీ కార్యమువలన రోగికి నెమ్మదియు, ఆమెకు తృప్తియు కలుగవచ్చును. ఇంకొక చిన్న విషయమునుగూడ నర్సు మరచిపోక, చాల గౌరవపూర్వకముగా చేయవలెను. ఏదనగా, రోగియొక్క భక్తికి సహాయపడు ప్రియమైన వస్తువులు కొన్ని యుండవచ్చును. నర్సు వీనిని గమనించి అప్పుడప్పుడు వానిని రోగి చేతికిచ్చుచుండవలెను. రోగి తనలో తాను "దేవా! పాపినైన నన్ను కరుణించుము"ని ప్రార్థించుకొనుచుండగా, ఈ చిన్న వస్తువులు దేవుని ప్రేమనుగూర్చి రోగికి జ్ఞాపకముచేయవచ్చును. తన చేతికిచ్చిన ప్రియమైన వస్తువును, రోగి తన వ్రేళ్లతో వానిచుట్టు తాకుచు నుండుట గమనించుటకు శక్తిగల నర్సు చూడవచ్చును. దీనివలన ఆమె యేమి గ్రహించవలెను? రోగికి మాటలాడు శక్తి పోయినందున పెదవులు కదలక మెదలకయున్నను, దేవుని యొద్దకు చేరుటకు తన హృదయమునందుగల కోరికను తన కార్యముల ద్వారా చూపుచున్నాడని నర్సు తెలిసికొని, రోగి బంధువులకు వానిని చూపినయెడల, వారును చాల ఓదార్పు పొందుదురు.

ఈ క్రింది గుర్తులును, చిహ్నములును మరణలక్షణములను సూచించును:—ముఖము పాలిపోయి బూడిదరంగుగా మారును; ముక్కు ముడుచుకొని చల్లగానుండును; కండ్లు పొరలుగమ్మి గుంటలుపడియుండును; కనురెప్పలు సగము మూసికొనియుండును; చెవులు పాలిపోయి చల్లగగాని, నీలివర్ణముగగాని యుండును. చర్మము చెమటతోనిండి, జిగటగనుండును. నాడి బలహీనముగాను, క్రమముతప్పియు, ఒకొక్కప్పుడు కొట్టి, మరియొకప్పుడు కొట్టకయునుండును. శ్వాస దీర్ఘముగను, బలహీనముగను శబ్దముతోను, గురకతోను కూడియుండవచ్చును. లేదా, లోతు తక్కువగను, నిట్టూర్పుగను నుండవచ్చును. అనేకమంది రోగులకు మరణ

మాసన్నమైనప్పుడు వారి శ్వాస [1]చెయిన్-స్టోక్స్ రకముగానుండును. రోగి నెమ్మదిగాపరుండి, వ్రేళ్లతో పడక గుడ్డలను తడవుచుండవచ్చును; లేక చేతులు అటు ఇటువేయుచు, ఆయాసము, ఆరాటముగలిగియు నుండవచ్చును. రోగి బలహీనుడై, తన్నుతాను భరించుకొనలేనప్పుడు, దిండ్లమీదినుండి జారి, పడకలో ముడుచుకొనును. కాళ్లకండరములు సడలి, పడకపైన బరువుగాపడియుండును.

చనిపోవుచున్న రోగిచేయు శబ్దము, చెయిన్-స్టోక్స్‌రకముగా శ్వాస కష్టముతోను, గురకతోను విడుచుట చూచి, విని అతని బంధువులు, చాల కష్టపడుదురు. ఊపిరి గొట్టములలోచేరిన కళ్లెవలనగాని, శ్వాసనాళములలో ఉమ్మినీరు బొట్లు బొట్లుగా పడుటవలనగాని రోగి గురకవంటి శబ్దము చేయును. ఒక్కొక్కప్పుడు రోగి మ్రింగలేని స్థితిలోనుండగా, త్రాగుటకు ఏదైన ద్రవము నిచ్చుటవలనను ఇట్లు గురకపుట్టవచ్చును. రోగి బలహీనుడగుకొలది, అతనికిచ్చెడి ద్రవముయొక్క పరిమాణమునుగూడ తగ్గించవలెను. నోటిని, పెదవులను తడిచేయుచుండిన చాలును. మ్రింగుటకు శక్తియున్నంతవరకు ఒక్కొక్క గుక్క ద్రాక్షసారాయినిగాని, నీటినిగాని, బ్రాందినిగాని, చాంపెయిన్‌నుగాని యిచ్చుచుండవలెను.

చావనున్న రోగికి ఉమ్మినీరు ఎక్కువగా గారవచ్చును గాన అతనితలను ఒకప్రక్కకు పెట్టి కొంచెము క్రిందికివాల్చి, ఉమ్మినీరు శ్వాసనాళములలో కాకుండ, బయటపడునట్లు చేయవలెను. ఊపిరితిత్తులనుండి వచ్చుద్రవము, ఉమ్మినీరు—వీనిమూలమున శ్వాసించుటద్వారా, ఇతరులకు ఇష్టములేని గురక, శబ్దము పుట్టకుండు నిమిత్తమును పై జెప్పిన ద్రవములు కారుటను తగ్గించుటకై రోగికి [2]అట్రొపిన్ ఇచ్చుటకు వైద్యుడు ఆజ్ఞ నియ్యవచ్చును.

నాలుక వెనుకకు జారిపోవుటవలన శ్వాసకోశముల మార్గము అడ్డుపడియు, నిట్టి గురకతోకూడిన శ్వాసను రోగి విడువవచ్చును. నాలుకను బాగుగా ముందుకులాగి యుంచుటవలనగాని, రోగియొక్క తలయున్న తీరును మార్చుటవలనగాని నర్సు ఈ గురకను నిలుపవచ్చును. రోగి వెల్లికిల పరుండియుండినయెడల, అతనితలను ఒకతట్టునకు ఒదిగించి యుంచవచ్చును. రోగి కూర్చుండియుండినయెడల అతని తలక్రింద ఎత్తు ఏదైన

[1] Cheyne-Stokes. [2] Atropine.



పెట్టి, అది వెనుకకు పడిపోకుండ చేయవలెను. రోగి బలహీనుడగుకొలది చెయిన్-స్టోక్స్‌రకము శ్వాస ఆరంభమగుట సాధారణమే. [1]కార్బన్ డైయాక్సైడ్‌ను రోగిలోనికి పీల్చుకొనునట్లు చికిత్సచేయుటవలన, పై జెప్పిన అయిష్టకరమైన లక్షణము తొందరగ తొలగిపోవును.

చనిపోవు రోగియొక్క నోరు సాధారణముగా తెరచుకొనియుండును గాన, నాలుక యెండిపోవుటకు కారణమగుచున్నది. ఇట్టి సమయములో నాలుకమీద వ్యాజిలీన్‌నుగాని, లిక్విడ్ పారఫిన్ అను మందునుగాని పూయుటవలన అది మెత్తగను, తడిగనునుండి వీలైనంతకాలము రోగికి సౌఖ్యము నిచ్చును. దీనివలన నిజముగా మేలుకలుగవలెనన్న, ప్రతి 15 లేక 20 నిమిషముల కొకసారి పై చెప్పినవి పూయుచుండవలెను.

చనిపోవుచున్న రోగియొక్క తలను నర్సు కొంచెమెత్తి పెట్టినట్లయిన, ఈ తీరులో శ్వాసించుటకు సులభముగా నుండును. కాని గాఢ మూర్ఛగలరోగి కిట్లు చేయుటకు వీలుకాకపోవచ్చును. అయినను తలను చేతులను ఇట్లు ఎత్తిపెట్టి, రోగి జారిపడిపోకుండ, అతని మోకాళ్లక్రిందను ఒక దిండు పెట్టవలెను.

దేహములో రక్తప్రసరణము తగ్గిపోవుకొలది, చర్మమునిండ చెమట పోయును. దీనిని ఉడుకు తువాళ్లతో తుడిచి, అవసరమైనప్పుడెల్ల రోగి దుస్తులను మార్చుచుండవలెను. ఈ సమయములో కాళ్లకు పుట్టుచలి, యెన్ని వేడినీటిబుడ్లు బెట్టినను, ఎన్ని ఉడుకుకంబళ్లు కప్పినను అణగకయే యుండును. ఈ చల్లదనము పైకి ప్రాకుచునే యుండును. మోకాళ్లు, తొడలు, మొండెమువరకు పైకి ప్రాకుచుండును. ఈ చల్లదనమును జూచి రోగి బంధువులు తత్తరపోదురుగాని, రోగి తాను చాల వేడిగానున్నట్టు చెప్పుచుండును. మరణమిప్పుడు చాల సమీపములో నున్నదని గ్రహించి రోగికి ఎక్కువగుడ్డలు కప్పుటకంటె, ఉన్న పడకగుడ్డలలో కొన్ని తీసివేయుట మేలు. కాని యీ విషయములో నర్సు రోగియొక్క బంధువుల ఇష్టమును గ్రహించి వారు సంగతి గ్రహించలేక, రోగికి ఇంకను గుడ్డలు కప్పవలెనని కోరినయెడల, రోగి వాని బరువునంతయు భరించవలసిన అవసరము లేకుండ పడకటుయ్యాల (బెడ్ క్రేడిల్) పెట్టుట మంచిదని నర్సు వారితో చెప్పవలెను.

[1] Carbon dioxide.

చనిపోవుచున్న రోగికి గాలి, వెలుగు అవసరమైయుండును. రోగి బంధువులు ఈ సంగతినికూడ గ్రహించక, నర్సు కిటికీని బాగుగా తెరచుట కిష్టపడరు. కిటికీ తెరచినందువలన రోగికి ఎక్కువచలి పుట్టునని యనుకొందురు. ఈ యాఖరిగంటలలో రోగికి ఏదైన సహాయము చేయుటకు వారు చాల కోరుచుందురు గాన, రోగికి గాలి విసరుడని వారితో చెప్పవలెను. కాని రోగి ముఖముమీద తిన్నగా కాక, తలకు ఆవలి ప్రక్కను ఈవలి ప్రక్కను విసనకఱ్ఱతో చల్లగా విసరవలెను. ఇట్లు విసరుటవలన రోగి బాధ కొంతవరకు తగ్గును. చివరి సమయము వచ్చినప్పుడు మల మూత్ర మార్గముల బిగువు తగ్గుటవలన, రోగి తనకు తెలియకుండనే మూత్రమును, బహుశః మలమునుగూడ విసర్జింపవచ్చును. ఉన్ని మెత్తలను, పీచు మెత్తలను ప్రయోగించుచు, పలుమారు మార్చుచు నుండినయెడల, పడక మైలపడకుండను, దుర్వాసన గొట్టకుండను చేయుటకు వీలగును.

రోగియొక్క బుద్ధియు, శక్తులును త్వరత్వరగా నిలిచిపోవుచున్నందున, అతడు చాల ఒంటరిగా నున్నట్లు అనుభవించును. ఇప్పుడు అతని చెవిలో చెప్పిన సంగతిని మాత్రమే వినగలుగును. అతని నెవరైన తాకినయెడల, వారిని గట్టిగా పట్టుకొనును. పిమ్మట కొంచెము మతియున్నట్టును లేనట్టును పడియుండును. అప్పుడప్పుడు ఒకవేళ కండ్లు తెరచును. అప్పుడు తన్ను ప్రేమించుచున్నవారు తనచుట్టునుండుట చూచి తృప్తియు సంతోషమునుపొందును. తా నిప్పుడు చనిపోవుచున్నానని గ్రహించి, క్రైస్తవ మతస్థాపకుడగు క్రీస్తుప్రభువు తన మరణకాలములో చేసినట్టు, ఒక స్నేహితుని చెయ్యి మరియొకని చేతిలోపెట్టి, "మా యమ్మను ప్రేమతో చూడుము." "నా బిడ్డను పరామర్శించుము" యని మౌనముగా చెప్పును. తాను ప్రేమించుచున్నవారి పేరును చెప్పునప్పుడుగాని, ప్రార్థించునప్పుడుగాని అతని పెదవులు కదలుచు నుండును.

బంధువులును, నర్సును, ఒకవేళ యింటివారికి స్నేహితుడైన వైద్యుడును రోగిప్రక్కను నిలుచుండి యుండినయెడల, "వారు నిలుచుండి, వేచియుండినను సేవచేయుచునే యున్నారు" అను వాక్యము వారి విషయమై సత్యమై యుండును. ప్రతి సంవత్సరము నవంబరునెల 11-వ తేదిన కోట్లకొలది ప్రజలు, చనిపోయిన యుద్ధసైనికుల జ్ఞాపకార్థము కట్టబడిన



సెనోటాఫ్ అను దానియొద్ద మౌనముగా రెండు నిమిషములు నిలుచుందురుగదా. అప్పుడు వారి మౌనము ఎంత బలమైనదిగా నుండునో, యిప్పుడును వీరి మౌనము అంత బలమైనదై యుండును. వారికి తెలిసినంతమట్టునకు వారిప్పుడు చనిపోవుచున్న తమ స్నేహితునికి సహాయము చేయుచున్నారు.'

'ఓ నా స్నేహితులారా, నా కొరకు ప్రార్థించుడి.
ఎవరో ఒక దర్శకుడు నా ద్వారమును తట్టుచు నన్ను పిలుచుచున్నాడు.
నన్ను బెదిరించుటకో, లేక అధైర్యపర్చుటకోగాని,
ఇతడెప్పుడు నన్ను ఇంతకుముందు దర్శించి యుండలేదు.
ఇదియే మరణము! నా ప్రియస్నేహితులారా! ప్రార్థించుడి.
ఇది మరణమే!
నా జీవితమంతయు గతించిపోవుచున్నది నేనిప్పుడు ఏమియు బలము, జీవములేనివాడనైతిని.
ఇప్పుడు నే నాధారపడుటకు ఊత ఏమియు గానరాకయున్నది.
ప్రియప్రభువా! (నీవే సహాయము చేయుము. ఇప్పుడు నీవే నా కాశ్రయము, అవును నీవే.)
ఇట్లని నా స్నేహితులారా, మీకు బలము లేకపోయినను నా కొరకు ప్రార్థించుడి.'

గెరాంటియస్ యొక్క కల.

రోగికి మతియుండి, అప్పుడప్పుడు కండ్లు తెరచుచుండినయెడల, దీపమునకు కప్పిన ముసుగునుతీసివేసి, కిటికీల తెరలను పైకితీయవలెను. చనిపోవుచున్న రోగి వెలుగును చూచుటకు ఇష్టపడును. ఎందుకనగా, అతని చుట్టుచీకటి కమ్ముచుండగా, దానినిజూచి, చిన్నబిడ్డవలె భయపడుచు, వెలుగును చూడగోరును.

చివరన మరణము సులభముగా సంభవించును. అది నిద్రపట్టినట్టుండును. అనేకులకు ఈ మరణము సంభవించుట తెలియనే తెలియదు. అతడు ఏదైనను తన్నుకొన్నట్టును, అవయవములు ఈడ్చుకొన్నట్టు నుండిన నుండవచ్చును గాని, వీనివలన రోగికి తొందర ఏమియు కలుగదు.

ఈ సంగతి రోగి బంధువులు గ్రహించలేరు. కావున వారి ఆదరణ నిమిత్తమై, రోగికి ఎట్టి చింతయు, బాధయు లేదని నర్సు చెప్పవలెను. ఇప్పుడతడు కదులుట మానివేసి, శాంతముగా నుండును. అనగా అతడు చనిపోయినాడని యర్థము. ఇట్లు శాంతముగా చనిపోవుటవలననే, చనిపోవుచున్న కొందరి రోగుల ముఖముమీదను, కొద్దికాలముక్రిందటనే చనిపోయినవారి ముఖములమీదను ఒకవిధమైన శాంతి, నెమ్మది నిలిచి యున్నట్టు మనకు తోచును. ఇతని కిప్పుడు జీవితపోరాటము ఆగిపోయినదని, బంధువులు గ్రహించుట వారికెంతో ఆదరణకరముగా నుండును. ఇక మీదట అతనికి సుఖము, సంతోషముండునని వారు జ్ఞప్తికి తెచ్చుకొందురు.

రోగి చనిపోయినవెంటనే నర్సు అతని కండ్లు చల్లగ మూయవలెను. అనగా, ఇంతకుముందే వానిని మూసియుండనియెడల, నర్సు ఇప్పుడు మూయవలెను. ఇప్పుడు రోగి బంధువులను గదిలోనుండియు, వైద్యశాలనుండియు బయటికి నడిపించుకొనిపోయి, వారితో ఒక సిస్టర్‌గాని, వైద్యుడుగాని మాటలాడునట్లు చేయవలెను. ఆమెమాత్రము రోగి గదికి మరలిపోయి, దేహమునకు చేయవలసిన పనులుచేయును. శవము ఇప్పుడు ఎక్కువ బరువుండునుగాన, ఇద్దరు దీనిని సులభముగాను, మర్యాదగాను కదిలించి పనిచేయగలరు, కాన మొదటి నర్సు మరియొకరి సహాయము కోరవలెను.

ఒక్క దుప్పటితోమాత్రము శవమును గప్పి, తక్కిన పడక గుడ్డలన్నియు తీసివేయవలెను. [1]దిండ్లు, మెత్తలు, [2]గాలిదిండ్లు [3]నీటి తలగడలు మొదలైనవానినన్నిటిని తీసివేయవలెను. ఏదైన పెద్ద నీటి పడకను పెట్టియుండినయెడల, దానిని ఖాళీచేయవలెను.

శవము నిప్పుడు పడకపైన వెల్లికిల పరుండబెట్టి, కాళ్లను చక్కగా చాచి యుంచవలెను. అవి ఒకదానికి ఒకటి దూరముగా నుండకుండ వానిని ఒకటిగాచేర్చి ఒక బ్యాండేజ్‌తో కట్టవలెను. లేదా, ఇసుకసంచులను ప్రక్కలలో పెట్టవలెను. పాదములు వంగిపోకుండుటకు వానికి ఒక్కొక్కదాని కొక ఇసుకసంచిని ఆధారముగా పెట్టవలెను. చేతులను వైద్యశాల యలవాటుననుసరించి, ప్రక్కలలో పొడుగుగా చాచిపెట్టవలెను. కాని బంధువుల యిష్టమునుబట్టి వానిని వక్షముమీద ఒకదానినొకటి

---

[1] Bolsters. [2] Air ring. [3] Water pillows.



దాటునట్లు మడిచి యుంచవలెను. ప్రయివేట్ ప్రాక్టిస్ చేయునప్పుడు, నర్సు ఈ సంగతిని రోగి బంధువులనడిగియే చేయవలెను. దవుడ వాలిపోకుండ ఏదో యొక పనిచేయవలెను. నాలుగుతోకల దవుడ కట్టుకట్టుటచేతనో, గడ్డముక్రింద ఒక చిన్నదిండునుంచుట మూలముననో, యీ కార్యమును సాధింపవచ్చును. ఒక తువాలులో కొంచెము గోధుమరంగు దూదినుంచి యిట్టి మెత్తను జేయవచ్చును. సాధారణముగా రోగిమీద సొమ్ములున్నయెడల, వానిని వైద్యశాలలోనే తీసివేయుదురుగాని, ప్రయివేట్ నర్సింగ్ చేయునప్పుడు, బంధువులతో ఆలోచించి యీ పని చేయవలెను.

పడక క్రింది దుప్పటిని గట్టిగాలాగి పడకను ముడతలులేకుండ చక్క చేయవలెను. అంత్యక్రియలు చేయకముందు శవము నిట్లు సిద్ధముచేసి ఒక గంటసేపు గదిలో నుండనియ్యవలెను."

### మరణమునకు తరువాత చేయవలసినపని

ఇండియాలో మరణమునుగూర్చి అనేకమైన మూఢనమ్మకములు, భయములు నున్నందున, చనిపోయిన రోగియొక్క బంధువులు తెంపులేకుండ ఏడ్చుచుందురు. వారి యేడ్పువలన చాల జబ్బుగానున్న రోగులకు తొందరకలుగును. కావున శవమును వెంటనే వైద్యశాలనుండి బయటికి తీసికొనిపోవుట మంచిది. అనగా శవముల గదికి తీసికొనిపోవలెను.

శవముల గదిలో శవము సహజముగా నుండునట్లు చాపి పరుండబెట్టి, స్నానముచేయింతురు. కులాభ్యంతరమునుబట్టిగాని, నమ్మకమునుబట్టిగాని రోగి బంధువులు శవమునకు స్నానము చేయించకముందే యింటికి తీసికొని పోగోరినయెడల, వారి యిష్టప్రకారముగా చేయనియ్యవచ్చునుగాని, అంటువ్యాధులచేత చనిపోయినవారి దేహములను మాత్రము స్నానము చేయించకుండ పోనియ్యరాదు. ఇట్టి శవములను ఆంటిసెప్టిక్ మందుతోకడిగి, వెండ్రుకలు దువ్వి, కండ్లుమూసి యుంచవలెను. దూది యుండలను తడిపి కండ్లమీద పెట్టుటవలనగాని, కొంచెము దూది పొరలు కండ్లసందులలో దూర్చుటవలనగాని, వానిని మూసి యుంచవచ్చును. ఏదైన ఒక గాయమునుండి రసి కారుచుండినయెడల, అక్కడ ఒక మందము

గల దూది మెత్తవేసి కట్టుకట్టవలెను. మలద్వారమునుండి మైల రాకుండ, పీచు లేక దూదిని దానిలో దూర్చవచ్చును. లేదా, పీచువేసిన మెత్తలను నఫికినులలో పెట్టి మలద్వారము, బాహ్య జననద్వారము మీదవేసి కట్టు కట్టవచ్చును. మోకాళ్లయొద్దను, చీల మండలముల యొద్దను, కాళ్లను ఒకటిగాచేర్చి కట్టవలెను. పిమ్మట బంధువులువచ్చి శవమును తీసికొనిపోయి, దహనకర్మగాని, సమాధిగాని చేయువరకు దాని మీద ఒక శుభ్రమైన దుప్పటిని కప్పియుంచవలెను. ఉష్ణమండలములలో అత్యుష్ణోగ్రతనుబట్టి, వీలైనయెడల రోగి చనిపోయిన దినముననే శవమును పాతిపెట్టుదురు; లేక దహనముచేయుదురు.

మూడవ భాగము

# ఆహారశాస్త్రముయొక్క సిద్ధాంతములు

## అధ్యాయము 13.

## ఆహార శాస్త్రము

ఆహారమును గూర్చియు, ఆహారమువలన మానవ శరీరమునకు గలుగు ఫలితమునుగూర్చియు తెలియజేయు దానిని ఆహార శాస్త్రమందురు. మానవుడు ఆరోగ్యముగ నున్నప్పుడును అనారోగ్యముగ నున్నప్పుడును తాను భుజించు ఆహారమువలన వాని శరీరమునకెట్టి ఫలితము కలుగునో, ఈ శాస్త్రపఠనము తెలియజేయును. పెక్కు అవయవముల సహాయమువలన, శరీరము తన్నుతాను పోషించుకొనుటకును, పెరుగుటకును జీర్ణించిన కణజాలమును తిరిగి బలపరచుటకును, శరీరమునకు ఉష్ణమును, బలమును గలుగుటకును ఆహారము ఉపయోగపడుచున్నది. ఆహారమువలన ఈ పనులన్నియు ఒకని శరీరములో నెరవేరినయెడల, అట్టివాని [1]పోషణ సరిగా నున్నదని చెప్పుదుము. ఒకని శరీరములో ఈ పనులు జరుగనప్పుడు, అతడు [2]సరియైన పోషణ లేక బాధపడుచున్నాడు అందుము.

ఒకని ఆరోగ్యమునందేమి, వ్యాధియందేమి ఆహారము చాలా ముఖ్యమైన ధాతువుగా గణించబడునుగాన, నర్సుకు ఈ విషయములను ఉపయోగములో పెట్టదగిన జ్ఞానముండవలెను. ఒకని బాల్యమునుండి వృద్ధాప్యమువరకు అతని యక్కఱనుబట్టి, అతనికి అవసరమైన ఆహార పదార్థములు మారుచుండును. మనకు ఇరువదియైదు సంవత్సరముల వయస్సు వచ్చువరకు, మన శరీరము పెరుగుచుండును. ఈ కాలములో శరీరము పెరుగుటకు అనుకూలమైన ఆహారపదార్థములనే భుజించుచుండవలెను. ఇంకను శరీరములో ఏదో యొక భాగము జీర్ణించుచుండగా,

[1] Nutrition. [2] Malnutrition.

మనము భుజించు ఆహారము జీర్ణభాగమును బాగుచేయగలదియునై యుండవలెను. బాల్యదశనుండి వృద్ధాప్య దశవరకును మన శరీరములో తగినంత ఉష్ణముండుటకు దానికి వేడి యవసరమై యుండును. ఈ వేడి వలననే [1]శరీరాణువులు జీవించుటకును, శరీరము పనిచేయుటకును వీలగును. మనకు మంచి ఆరోగ్యకరమైన దేహములు గలవనియు, ఇవి తమ పనిని సామర్థ్యముతో చేయగలవనియు, రోగములను ఎదిరించగలిగినంత శక్తిగల వనియు మనము భుజించు ఆహారమునుబట్టి తీర్మానించవచ్చును.

సరియైన ఆహారములో [2]మాంసకృత్తులు, క్రొవ్వుపదార్థములు, [3]కార్బొహైడ్రేట్స్ (పిండిపదార్థములు) నీరు, లోహములు, [4]విటమినులు ఉండును. మిరియాలు, మసాల, లవంగములు మొదలైన కారపు వస్తువులలో ఆహారపు విలువ ఏదియు లేదుగాని వీనివలన భోజనమునకు రుచి మాత్రము కలుగును. టీ, కాఫీ మొదలగు పానీయములు చురుకును పుట్టించునవేకాని శరీరమును పోషించునవి కావు. అయినను వీనిలో చక్కెర, పాలు కలిపినపుడు శరీరమునకు కొంత పోషణకలుగును. ఆహార పదార్థములు జీవసంబంధమైనవనియు, నిర్జీవసంబంధమైనవనియు రెండు విధములు. జీవసంబంధమైనవి చెట్లనుండి, జంతువులనుండి లభించును. నిర్జీవసంబంధమైనవి నీటినుండి, లోహములనుండి లభించును.

మాంసకృత్తులు:—దీనిలో నైట్రొజన్ (నత్రజని). కార్బన్ (కర్బనము), హైడ్రొజన్ (ఉదజని), ఆక్సిజన్ (ప్రాణవాయువు), ఫాస్ఫరస్ (భాస్వరము), సల్ఫర్ (గంధకము) అనునవి యున్నవి. ఇవి క్రొవ్వులేని మాంసము, గ్రుడ్లు, పాలు, చేపలు మొదలగువానిలో బాగుగ లభించును. పప్పు దినుసులు, సోయబీన్స అను చిక్కడు విత్తనములు, నిండు గోదుమపిండి, పచ్చని ఆకుకూరలు, కూరగాయలు మొదలగువానియందును ఇవి లభించును. కాని వీనినుండి లభించెడు మాంసకృత్తులు జంతువులనుండి లభించు మాంసకృత్తులకంటె శరీరమునకు తక్కువ ఉపయోగకరమైనవి. శరీరము పెరుగుటకును, జీర్ణించిన శరీరభాగము తిరిగి బలపడుటకును అవసరమైన ఆహారపదార్థములు మాంసకృత్తులవలన శరీరమునకు లభించుచున్నవి. పరిమాణమునుబట్టి పెద్దవారికంటె పిల్లలకు ఎక్కువ మాంసకృత్తులు అవసరమైయుండును.

[1] Body cells. [2] Proteins. [3] Carbohydrates. [4] Vitamins.



కార్బొహైడ్రేట్స (పిండిపదార్థములు):—ఇవి పిండి, చక్కెర పదార్థములు. వీనియందు కార్బన్, హైడ్రొజన్, ఆక్సిజన్ అను పదార్థములు కలిసియున్నవి. ఇవి ముఖ్యముగా కూరగాయలు, ధాన్యాదులనుండి ఎక్కువగ దొరకుచున్నవి. ఇవి శరీరమునకవసరమైన శక్తిని, ఉష్ణము నిచ్చును. వీనిని మితిమీరి భుజించినందువలన కణజాలములయందు ఎక్కువ క్రొవ్వుచేరి ఆరోగ్యమునకు ఆపదకలుగును.

క్రొవ్వు పదార్థములు:—ఇవి క్రొవ్వుగల ఆసిడ్స, గ్లిసరీన్ కలిసిన వస్తువులు. ఇవి ముఖ్యముగా జంతువులనుండియే లభించును. అయినను కూరగాయలనుండియు కొన్ని క్రొవ్వుపదార్థములు దొరకుచున్నవి. క్రొవ్వు మండెడు ఆహారపదార్థము; దీనివలన శరీరమునకు ఉష్ణము, శక్తి కలుగును. క్రొవ్వును జీర్ణించుకొనుట కష్టమే. ఉష్ణమండలములలో, శీతలమండలములకంటె తక్కువ పరిమాణముగల క్రొవ్వు పదార్థములను భుజింపవలెను. చలిదేశములలో శరీరమునకు ఎక్కువ ఉష్ణము అవసరమై యుండును గాన, క్రొవ్వుపదార్థములనుగూడ అధికముగా భుజించవలెను. శరీరమునందు ఉపయోగముకాగా మిగిలిన క్రొవ్వు చర్మము క్రింది కణజాలములలో మూత్రపిండములు, గుండె, తదితర లోపలి అవయముల చుట్టునున్న టిష్యూలలో చేరియుండును. ఇట్లు చేరిన క్రొవ్వు, ఆ యవయవములకు మెత్తలుగా ఉపయోగపడి, వానిని గాపాడుచుండును; అట్లే వానికి ఉష్ణము కలిగించి, వానికి ఆధారముగా నుండును.

నీరు:—శరీరమునకు నీరు మిక్కిలి యవసరము. దినమునకు సరాసరి భోజనముతోకూడ నాలుగునుండి ఆఱుపైంట్ల నీటిని పుచ్చుకొనుచుండవలెను. దీనిలో సగము నీటిని భోజనముతోను, సగము పానీయములుగాను త్రాగవలెను. వేసవికాలములో లేక వాతావరణము ఉష్ణముగానున్నప్పుడు, శరీరమునుండి అధిక నీరు చెమటమూలమున నష్టమగుచుండును గాన, ఎక్కువ నీటిని త్రాగుచుండవలెను. దేహోష్ణోగ్రత క్రమపరచబడుటకును, చర్మము, మూత్రపిండములు, ప్రేగులమూలమున మలినపదార్థము బహిష్కరించబడుటకును, రక్తమును, శరీరములోని యితర ద్రవములును ఏర్పడుటకును శరీరమునకు నీరు అవసరమైయుండును.

లోహలవణములు:—వీనిలో ముఖ్యమైనవి. కాల్షియమ్, ఫాస్ఫరస్, సోడియమ్, ఐయొడిన్, ఇనుము, క్లోరిన్ అనునవి. ఇవి ముఖ్యముగా

కూరగాయలలోను, ఫలాదులలోను లభించుచున్నవి. జంతు పదార్థములలోను, ధాన్యాదులలోను కొన్ని లోహపదార్థములుండును. అన్నము వండిన నీటిని (గంజిని) యెన్నడును పారబోయగూడదు. ఎందుకనగా తఱచుగా ఈ గంజిలో పెక్కు లోహములుండును. శరీరమునకు అవసరమైన ముఖ్యలోహములలో కాల్షియమ్ ఒకటి. ఎముకలు, పండ్లు బలపడుటకును, గుండె సరిగా పనిచేయుటకును, రక్తము గడ్డకట్టుటకును, క్రొవ్వులను, ఇనుమును దేహము ఉపయోగించుకొనగలుగుటకును కాల్షియమ్ అవసరమై యుండును. దేహము పెరుగుటకును, అణువులు హెచ్చుగా వృద్ధిజెందుటకును ఫాస్ఫరస్ లేక భాస్వరము మిగుల అవసరము. మరియు రక్తములో ఇదియొక ముఖ్యభాగమైయున్నది. ఊపిరితిత్తులనుండి శరీరములోని యితరభాగములన్నిటికి రక్తము ప్రాణవాయువును గొనిపోవుటకు ఇనుము అవసరమైయుండును. దీనిలో లోపము కలిగినప్పుడు, అనగా చాలినంత ఇనుములేనప్పుడు [1]అనీమియ (రక్తహీనత) యను జబ్బుకలుగును. కొద్ది పరిమాణములుగా ఐయొడిన్ గూడ శరీరమునకు అవసరమే. ఐయొడిన్ తక్కువైనప్పుడు థైరాయిడ్ యను గ్రంథి పెద్దదై, [2]గలగండము అను వ్యాధి యేర్పడును. ఉప్పు (సోడియమ్ క్లోరైడ్) భోజనమునకు రుచిని కలిగించుటకు అవసరమైయుండుటయేకాక, శరీరములో ద్రవములను క్రమపరచుటకును, కడుపులో హైడ్రోక్లోరిక్ ఆసిడ్ అను స్రావము ఏర్పడుటకును సహాయపడును.

విటమినులు:—ఇవి మన యాహారములోని రసాయనికపదార్థములు. జీవమునకును, దేహము పెరుగుటకును ఇవి కొద్ది పరిమాణములుగా అవసరమై యుండును. ఇప్పటికి తొమ్మిది విటమినులను కనుగొని పఠించి, పరిశీలించుచున్నారు. A. D. E. K. అనునవి క్రొవ్వునందు కరుగగల విటమినులు. ఇవి ముఖ్యముగా క్రొవ్వునందే యుండును. $B_1$, $B_6$, C, $B_2$ లేక G కాంప్లెక్స్—వీనిలో రెండు విటమినులుండును. ఇవి నీటియందు కరుగగల విటమినులు. ఇవి పండ్లు, పప్పుదినుసులు, కూరగాయలు, మొదలగు క్రొవ్వులేని పదార్థములలో కనబడును. వీనిలో కొన్నిటిని [3]వెవ్వేరు వస్తువుల రసాయనిక సంయోగమువలన సిద్ధముచేసియున్నారు.

[1] Anemia. [2] Goitre. [3] Synthesized.



కావున వీనిని [1]బలపరచి (చిక్కగచేసి) చర్మము క్రిందికిగాని, కండరములలోనికిగాని, రక్తనాళములలోనికిగాని సూదితో నెక్కించవచ్చును.

విటమిను A:—ఎపిథీలియల్ [2]టిష్యులయొక్క పనిని, వృద్ధిని క్రమపరచుటకును హానికరమైన సూక్ష్మజీవులు శరీరములోనికి ప్రవేశించకుండ నివారించుటకును A విటమిను అవసరమై యుండును. [3]కల్లె మొదలగు వానిని సిద్ధముచేయగల పొర (అమత్వచ) లన్నిటిని, కంటిలోని కొన్ని భాగములను, పండ్లను, ఎముకలను, గ్రంథులనుగూడ ఆరోగ్యస్థితియందుంచుటకు A విటమిను అవసరము. ఒకదినమునకు సాధారణముగా పెద్దవారికి 4,000 [4]ఇంటర్‌న్యాషనల్ యూనిట్స్‌ను, చిన్నపిల్లలకు 6,000 నుండి 8,000 వరకు గల ఇంటర్‌న్యాషనల్ యూనిట్స్‌ను కావలసియుండును. అవసరమైన యీ పదార్థము, చేపకాలేయపు నూనెలు, చేపలు, గ్రుడ్డునందలి పసుపు జన, వెన్న, నెయ్యి, కాలేయము, మూత్రపిండములు, జంతు క్రొవ్వుపదార్థములు, పాలు, మొదలగువానియందుండును; ఆకుపచ్చని కూరగాయలందు ఇది [5]కారొటీన్ రూపముగనుండును. కారెట్స్, గుమ్మడికాయలు, [6]ముద్దగాచేసిన పండ్లు, [7]మొక్కజొన్న, సీమ తక్కాళి పండ్లు మొదలగువానియందును ఇది లభించును. కారొటీను రూపమున శరీరములోనికి పోయినప్పుడు కాలేయమునందు ఇది A విటమినుగా మారి, అక్కడ గొప్ప పరిమాణములుగా నిలువచేయబడియుండును. కాబట్టి, కాలేయము చెడునట్టి వ్యాధులు సంభవించినప్పుడు, చాలినంత A విటమిను రోగికి లభించునట్లు చేయవలెను; లేనియెడల, దీనియందు లోపమేర్పడును. కూరగాయలనుండి తీసిన నూనెలలో కెల్ల ఒక్క తాటినూనెలోనే యీ విటమిన్ ఉండును. గాలితగిలిననే తప్ప, లేనియెడల, వండుటవలన ఈ విటమిను చెడిపోదు. ఇది తక్కువైనప్పుడు రేజీకటి, మూత్రపుతిత్తియందు రాయి యేర్పడుట, కుఱుచగా పెరుగుట (పొట్టిగా పెరుగుట) మొదలగు శరీరలోపములు సంభవించును. పాలిచ్చెడు తల్లి A విటమినున్న ఆహారపదార్థములు చాలినన్ని పుచ్చుకొనుట మేలు. పెద్దవారి యందున్న ఒక్కొక్క యూనిట్ బరువుగల విటమినులో 1/20 (ఇరువదవ వంతు)

[1] Concentrated. [2] Tissues. [3] Mucous membranes.
[4] International Units. [5] Carotene. [6] Squash.
[7] Yellow corn and tomato.

మాత్రమే అప్పుడే పుట్టినబిడ్డ కాలేయములో నుండును. బిడ్డయందు గల యీ కొరతను దీర్చుటకే తల్లి పైనచెప్పినట్లు భోజనపదార్థములను బుచ్చుకొనవలెను.

విటమిను B:—ఒకప్పుడు విటమిను B, అని భావించబడినది పద మూడు వేరు వేరు భాగములు గలిగిన సంశ్లిష్ట పదార్థమని యిటీవల కనుగొనబడెను. ఈ పదమూడు భాగములలో కొన్ని మాత్రమే బాగుగా తెలియబడియున్నవి. ఇట్లు బాగుగా, తెలిసిన వానిలో మొదటిది, విట మిన్ B, లేక [1]తైయమిన్. దీనిని పూర్వము దక్షిణ ఇండియాలో పని చేసిన ఒక మిషనెరి కుమారుడు విల్యయమ్స్ అను నతడును, అతని జత పనివారును 1936, 1937 సం॥లలో కనుగొనిరి. ఈ తైయమిన్ పదా ర్థము కాయధాన్యపు బీజపు పొరలయందును, పై పొరయందును, చిక్కుడు జాతి విత్తనములందును, క్రొవ్వులేని మాంసపదార్థములందును, పెంకు గల కాయలయందును గ్రుడ్లు, ఈస్ట్ అను వానియందును లభించును. ఉష్ణము నెదిరించగల శక్తి దీనికి బాగుగా కలదు. కావున ఆల్కలై అను పదార్థమును చేర్చి వండిననేతప్ప, సాధారణ వంటకమునకు ఈ పదార్థము నమసిపోదు. కూరగాయలను ఉడికించి, వాని నుడికించిన నీటిని పార బోయునప్పుడు దానిలోని తైయమిన్ పదార్థము అధికముగా నష్టమగు చున్నది. భోజనములో అవసరమైన దానికంటె నెక్కువ పిండిపదార్థము చేరియుండినయెడల, ఎక్కువ తైయమిన్ అవసరమై యుండును. కాని భోజనములో క్రొవ్వు చేరియుండినయెడల, ఆ క్రొవ్వు తైయమిన్‌ను కాపాడును. దక్షిణ ఇండియాలో జరుగుచున్నట్లు మరబియ్యమును భుజించువారికి చాల యెక్కువ తైయమిన్ అవసరమై యున్నది గాని, అది వారి భోజనములో కొరతపడియున్నది. దక్షిణ హిందూ దేశములో [2]బెరి బెరి యను వాపు సంబంధమైన వ్యాధి హెచ్చుగా వ్యాపించి యుండుటకు బహుశః ఇది కారణమై యున్నది. ప్రతిదినము 300—500 యూనిట్స్ తైయమిన్ ఒకనికి అవసరమై యుండును. దీనిని నిలువజేసి యుంచెడు శక్తి చాల కొద్దిపాటిది. కావున అవసరమైన దాని కంటె అధికమైన తైయమిన్ త్వరగా బహిష్కరించబడి, పోగొట్టుకొన బడును.

[1]Thiamin. [2]Beriberi.



విటమిన్ $B_2$ లేక G కాంప్లెక్స్:—1928 సం॥లో విటమిన్ $B_2$ లో నిజముగా పెక్కు భాగములున్నవని కనుగొనబడినది. ఆకుపచ్చ, పసుపు వర్ణముగల వస్తువును, అనగా విటమిన్ $B_2$ లోని యొక భాగమును పాల నుండి ప్రత్యేకించి, దానికి [1]రిబోఫ్లావిన్ యను పేరు పెట్టియున్నారు. ఇదియు వేడిని యెదిరించగలది. ముఖ్యముగా ఆసిడ్ కలిసియున్నప్పుడు దీనికి ఆ శక్తి అధికముగా నుండును. కాని ఆల్కలిస్, సూర్యునివెలుగు, మరికొన్ని విధములైన వంటకములకు ఇది త్వరగా లొంగిపోవును. మాంస మును రోస్టుచేయుట, కాల్చుటవలన 60% (నూటికి 60 పాళ్లు) రిబోఫ్లావిన్ నష్టము కావచ్చును. నూనెతో వేయించుట ([2]ఫ్రయింగ్) వలన కలిగెడు నష్టము స్వల్పము. [3]స్టూయింగ్ అను వంటపాకములో ఈ వస్తువు బొత్తుగా నష్టమగుటలేదు. ప్రతిదినము 1½-3 మిల్లిగ్రాముల రిబోఫ్లావిన్ శరీరమునకు అవసరమై యుండును. రిబోఫ్లావిన్ శరీరమునందు కొరతపడుటవలన రెండు దుర్లక్షణములు ఏర్పడుచున్నవి. ఏవనగా, పెదవులకు పుండ్లులేచుట, కంటిలోని [4]నల్లగ్రుడ్డు మసక కమ్ముట.

[5]నికొటినిక్ ఆసిడ్ అనునది $B_2$ విటమినులోని రెండవ ముఖ్య భాగము. ఇది కొరతపడుటవలన [6]పెల్లగ్ర యను వ్యాధి కలుగును. యునైటెడ్ స్టేట్సులోని కొన్ని ప్రాంతములలోను, మరికొన్ని దేశముల లోను ఈ వ్యాధి సంభవించునుగాని, ఇండియాలో మాత్రమిది లేదు. ఈ పదార్థము కాయధాన్యములు, ఈస్ట్, మాంసపదార్థము మొదలైనవాని యందు లభించును. ఈ జాతి విటమినులలో నిది అధిక పక్షము ఉష్ణము నెదిరించు శక్తిగలది. దీనిని ఆటోక్లేవ్ అను ఆవిరి సాధనముమీద పొంగించినను, దీనియందు బహు కొద్దిగ మాత్రమే నష్టమగును. దిన మునకు సాధారణముగ 25 మిల్లిగ్రాముల నికొటినిక్ ఆసిడ్ దేహమునకు చేరుట అవసరమైయుండును.

విటమిన్ $B_6$ అనునది విత్తనములు, కాయధాన్యములు, బటానీ కాయలు, కూరగాయలు, క్రొవ్వుచేపలు, మాంసాదులందు లభించును. [7]కాడ్ లివరాయిల్, [8]కాడ్ చేపజన యందు, నూటికి అనేక పాళ్లు ఈ

[1] Riboflavin. [2] Frying. [3] Stewing. [4] Cornea. [5] Nicotinic acid. [6] Pellagra. [7] Cod-liver oil. [8] Cod roe.

పదార్థములో చేరియుండును. దీనివలన పెల్లగ్ర యను వ్యాధివలన కలిగెడు కొన్ని యపలక్షణములు తగ్గిపోవుననియు, [1]క్రొవ్వును రక్తములోనికి ప్రవేశించు వస్తువుగా చేయుటయందు ఇది కొంత తోడ్పడుచున్నదనియు తెలిసికొనియున్నారు. అయినను ఈ సంగతి యింకను నిశ్చయము కాలేదు.

విటమిన్ C.—లేక [2]ఎస్కార్బిక్ ఆసిడ్:—ఇది మొక్కలయందును, ముఖ్యముగా అప్పుడే కోసిన పచ్చికాయలు, కూరగాయలయందు, [3]జంతు కణజాలమందును గనబడుచున్నది. ఇది అతిసూక్ష్మముగా ప్రాణవాయువుతో చేరి మార్పుచెందును. ముఖ్యముగా ఆల్కలై చేరియున్నప్పుడు ఈ పని యెక్కువ త్వరగా జరుగును. ఫలములు, కూరగాయలలోని ఎస్కార్బిక్ ఆసిడ్ నష్టమైపోకుండ, వానిని సిద్ధముచేయునప్పుడు కొన్ని హెచ్చరికలు. నియమములు గమనించవలెను. అవి యేవనగా:—(1) బేకింగ్ సోడాను దీనితో చేర్చకూడదు. (2) భుజించువరకుగాని సిద్ధము చేయువరకుగాని దీనికి సంబంధించిన ఆహారపదార్థములను చల్లనిచోట నుంచవలెను. (3) దీనికి సూర్యునివెలుగు తగులకూడదు. (4) ఆహారపదార్థములను పొంగించిన నీటిలోవేసి, రాగితప్ప, యితర యే లోహపాత్రలలోనైనను మూతవేసి యుడికించవలెను. ఊరగాయవేయుట, ఉప్పువేసి యూరనిచ్చుట, బాగుచేయుట మొదలగు కార్యములవలన దీనిలోని విటమినులన్నియు పోవునుగాని యెండబెట్టుట, డబ్బాలలో ఉడికించిపెట్టుట యను పనులను సరిగా చేసినట్లయిన, నూటికి 90 పాళ్లు విటమినులు నిలిచియుండును. దినమునకు సాధారణముగా 1000—1500 యూనిట్ల విటమిన్ C అవసరమైయుండును. దీనిలో పిల్లలకు $\frac{3}{4}$ భాగము అవసరమైయుండును. కనెక్టివ్ టిష్యులను సరిగనుంచుటకును, రక్తనాళములు, చిగుళ్లు, పండ్లు ఆరోగ్యముగానుండుటకును ఇది తోడ్పడును. దేహపరిశ్రమ, గర్భవతియైనకాలము, కఠినమగు అంటులు, జ్వరములు ఉన్నప్పుడును థైరాయిడ్ గ్రంధియందు విషము చేరినప్పుడును [4]కణజాలముల మార్పు చాల హెచ్చుగా జరుగునుగాన, అప్పుడు విటమిను C యొక్క అవసరము ఎక్కువైయుండును.

[1]Metabolism of fat. [2] Ascorbic acid. [3] Animal tissues.
[4] Metabolic rate.



విటమిన్ D:-మనుష్యులలో విటమిన్ D కొరతపడినప్పుడు, ఈ కొరతను దీర్చుట కిప్పుడు [1]రెండు రసాయనపదార్థములు కనుగొనబడినవి. వీనిలో నొకటి [2]వైయొస్టిరల్ అనునది. ఇది జంతుశరీరము లోపలగాని, వెలుపలగాని యున్నప్పుడు ఆల్ట్రవయొలెట్ రేస్ అను కల్పిత సూర్యకిరణములు దీనిమీద మంచిపని చేయగలవు. రెండవది, [3]కొలెస్టిరల్ అనునది. ఇది దేహచర్మముయొక్క చేమురులోనిపదార్థము. దీనిమీందకూడ ఆల్ట్రవయొలెట్ వెలుగు బాగుగా పనిచేయును. ఈ చేమురు చేపకాలేయపు నూనె, జంతు క్రొవ్వుపదార్థములు, పాలు, గ్రుడ్లు మొదలగు వానియందు కనబడును. పాలమీద వెలుగును అనేకవిధములుగా ప్రయోగించుటచేత, దానియందలి విటమిన్ D పరిమాణమును హెచ్చించవచ్చును. పెద్దలకును, పిన్నలకును ఇది దినమునకు సాధారణముగా 600 యూనిట్లు అవసరమైయుండును. దీనిలో నధిక భాగము సూర్యుని వెలుగుపడుటచేత లభించునుగాని, పిల్లలకు ఇది భోజనమువలన లభించవలెను. ఇది ముఖ్యముగా, కాలేయమునందు నిలువచేయబడునుగాని, యిట్లు నిలువజేసెడి శక్తి చిన్నదైనందున, ఖర్చు అయినదానిని పలుమారు పూర్తిచేయుచు రావలెను. కాల్షియమ్, ఫాస్ఫరస్ అను రెండుపదార్థములు శరీరములో ఇముడునట్లు విటమిన్ D సహాయపడును. బిడ్డల పండ్లును, ఎముకలును పెరుగుటకు ఇది తోడ్పడును. ఎముకల కొనలు ఏర్పడుటకును, అవి గట్టిపడుటకును ఇది యవసరమైయుండును.

విటమిన్ E:-ఇది మనుష్యులలో నేమి, జంతువులలో నేమి సంతానాభివృద్ధికి తోడ్పడునని నమ్ముచున్నారు. ఇట్లే యిది కండరములను నరములను బలపరచుచున్నది. ఇది ముఖ్యముగా కూరగాయలలోను ధాన్యములలోను లభించును.

విటమిన్ K:—దీనివలన ఒకవిధమైన పదార్థము సిద్ధమగుచున్నది. ఏదైన నొక రక్తనాళము తెగినప్పుడు రక్తము గడ్డకట్టుటకు ఈ పదార్థము సాయపడును. ఇది పచ్చని యాకులుగల కూరగాయలయందు లభించును.

ఆహారములోని ప్రతిమూలపదార్థము దేహమును బలపరచుటయందు ఏదో యొక ప్రత్యేకపనిని చేయవలసియున్నందున, యివి

[1] Two chemical compounds. [2] Viosterol. [3] Colesterol.

యన్నియు సరియైన పరిమాణములు గలిసియున్న ఆహారపదార్థములను భుజించుట యెంత ప్రాముఖ్యమో, మనము సులభముగా గ్రహింపవచ్చును. ఇట్టి దానినే [1]సంపూర్ణ పరిమాణముగల ఆహారము అందురు.

38-వ పటములోని చార్టునందు దక్షిణ ఇండియాలో ఒకడు భుజించు సాధారణభోజనము చూపబడినది. ఇది [2]అసంపూర్ణ పరిమాణముగలది. చార్టులోని రెండవ భాగములో భోజనము నెట్లు సంపూర్ణ పరిమాణము గలదానిగా చేయవచ్చునో చూపబడియున్నది. చార్టుక్రింద "క్యాలొరి" యను పదము ఉపయోగించబడియున్నది. పైన చెప్పినరీతిగా కొన్ని యాహారపదార్థములు దేహమునందు వేడిని పుట్టించి, శక్తిని గలిగించును. ఆహారశాస్త్రములో క్యాలొరి యనగా, 1 కిలోగ్రాము నీటియొక్క యుష్ణోగ్రతను శతమాని 0—1 డిగ్రీలవరకు వేడిచేయగల యూనిట్ పరిమాణమని యర్థమగును. వివిధ ఆహారపదార్థములు వివిధ సంఖ్యగల [3]క్యాలొరీల ఉష్ణము పుట్టించును. తగిన శక్తియు, వేడియు కలిగియుండుటకు ఒక పెద్దవానికి దినమునకు 2,500 క్యాలొరీలకు తక్కువ లేకుండవలెను. 39-వ పటములో ఏయే ఆహారపదార్థము లున్నవో, ఒక్కొక్కదానిలో నెంత క్యాలొరిశక్తియున్నదో, ఇండియాలో జనులు భుజించు సాధారణ ఆహారములయందు, పై పదార్థములలో నొక్కొక్కటి యెంతేసి కలిసియున్నదో చూపెడు చార్టు గలదు.

ఈ విషయమునుగూర్చి గ్రంథకర్త అభిప్రాయమేమనగా:—ఈ జాబితాలో ఇండియాదేశమందు జనులు తినెడి ఆహారపదార్థములలో కొన్ని మాత్రమే పేర్కొనబడినవి. దీనిలోలేని పెక్కు ఆహారపదార్థములను వాడుకలో చూతురు. ఏదైన ఒక గుంపునకుచేరిన యాహారపదార్థము అదేగుంపునకు చేరిన యితర పదార్థములకు సమానమైన విలువగలదై యుండును.

ఉదా:—పప్పుదినుసులు, కూరగాయలలో ఇది సత్యమని చూడగలము. ఆకుకూరలన్నిటిలోను ప్రోటీన్ తక్కువగా నుండును; క్రొవ్వులు కొద్దిగ నుండిన నుండును; లేక బొత్తుగా నుండకపోవచ్చును. కాని వీని యాహారపు విలువ గొప్పది; యెందుకనగా వీనినుండి కొంత కాల్షియమ్,

[1] Well-balanced diet. [2] Ill balanced. [3] Calorie.



ఇనుము లభించును. వీనిలో [1]క్యారొటీన్ (ప్రొవిటమిన్ A) విస్తారముగ నుండును. ఇట్లే పప్పుదినుసులలో ప్రోటీన్, కాల్షియమ్, విటమిన్ $B_1$ విస్తారముగ నుండును. విటమిన్ $B_2$ గుంపునకుచేరిన ధాతుపదార్థములు







[*Reprinted by the Courtesy of Pasteur Institute.*

38-వ పటము.

గూడ కొంతవరకు పప్పుదినుసులలో దొరుకును. కాని వీనిలో విటమిన్స్ A, C అనునవి చాల తక్కువగ నుండును. [2]ఎండిన కందిపప్పులో

[1] Carotene (Pro-vitamin A.) [2] Bengal gram in dry state.

# సామాన్య ఆహారపదార్థముల వస్తుగుణ పొందిక

కూనూరులోనున్న న్యూట్రిషన్ రిసర్చి ల్యాబరేటరీలవారు పరిశోధించి సిద్ధముచేసిన జాబితా

39-ఎ. పటము.

| ఆహార పదార్థములు | ప్రొటీన్ % | క్రొవ్వు % | కార్బొహైడ్రేట్స్ (పిండిపదార్థములు) % | కాల్షియం (సున్నము) % | భాస్వరము % | ఇనుము mg. % | విటమిన్ A I. U. per 100 g. | విటమిన్ $B_1$ I. U. per 100 g. | విటమిన్ C mg. per 100 g. | కెలోరిక్ లేక కెలోరిఫిక్ (వేడి నిచ్చు) విలువ per 100 g. | ఒక్కౌన్సు నందున్న కెలోరి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| **ధాన్యాదులు:—** | | | | | | | | | | | |
| సజ్జలు | 11 | 5 | 67 | 0·05 | 0·35 | 8 | 220 | 110 | 0 | 360 | 102 |
| జొన్నలు | 10 | 2 | 74 | 0·03 | 0·28 | 6 | 140 | 120 | 0 | 360 | 101 |
| యవలు (మిల్లెట్) | 12 | 5 | 61 | 0·03 | 0·29 | 6 | 50 | 200 | 0 | 330 | 95 |
| రాగి | 7 | 1 | 76 | 0·33 | 0·27 | 5 | 70 | 140 | 0 | 350 | 98 |
| బియ్యము పచ్చివి, మరబియ్యము | 7 | 1 | 79 | 0·01 | 0·11 | 1 | 0 | 20 | 0 | 350 | 99 |
| దంచిన బియ్యము | 8 | 1 | 78 | 0·01 | 0·17 | 3 | 4 | 60 | 0 | 350 | 100 |
| ఉడకబెట్టిన మరబియ్యము | 7 | 1 | 79 | 0·01 | 0·15 | 2 | 0 | 70 | 0 | 350 | 98 |
| ఉడకబెట్టి దంచిన బియ్యము | 8 | 1 | 77 | 0·01 | 0·28 | 3 | 15 | 90 | 0 | 350 | 99 |
| ముడి గోధుమలు | 12 | 2 | 71 | 0·05 | 0·32 | 5 | 110 | 150 | 0 | 350 | 98 |
| ముడి గోధుమ పిండి | 12 | 2 | 72 | 0·04 | 0·32 | 7 | 100 | 120 | 0 | 350 | 100 |
| **పప్పు దినుసులు:—** | | | | | | | | | | | |
| ఉలవలు | 22 | 5 | 59 | 0·10 | 0·30 | 9 | 320 | 100 | 10 | 370 | 103 |
| మినుములు | 24 | 1 | 60 | 0·20 | 0·37 | 10 | 60 | 140 | 0 | 350 | 99 |
| పెసలు | 24 | 1 | 57 | 0·14 | 0·28 | 8 | 160 | 160 | 5 | 330 | 95 |
| కందులు | 22 | 2 | 57 | 0·14 | 0·26 | 9 | 220 | 150 | 0 | 330 | 95 |
| **ఆకు కూరలు:—** | | | | | | | | | | | |
| అమర్నాత్ (లేతది) | 5 | 1 | 6 | 0·50 | 0·10 | 21 | 6,500 | 10 | 173 | 50 | 13 |
| క్యాబేజ్ | 2 | 0 | 6 | 0·03 | 0·05 | 1 | 2,000 | 50 | 120 | 30 | 9 |
| ఫెనుగ్రీక్ | 5 | 1 | 10 | 0·47 | 0·05 | 17 | 3,900 | 70 | 140 | 70 | 19 |
| స్పినాక్ | 2 | 1 | 4 | 0·06 | 0·01 | 5 | 3,000 | 70 | 50 | 30 | 9 |
| **వేర్లు, కాడలు:—** | | | | | | | | | | | |
| కొలోకాసియా | 3 | 0 | 22 | 0·04 | 0·1[illegible] | 2 | 40 | 80 | ట్రేస్ | 100 | 29 |
| ఉర్లగడ్డలు | 2 | 0 | 23 | 0 | 0·03 | 1 | 40 | 20 | 20 | 100 | 28 |
| గెణుసుగడ్డలు | 1 | 0 | 31 | 0·02 | 0·05 | 1 | 10 | 10 | 20 | 130 | 37 |
| సాధారణమైన (యామ్) | 1 | 0 | 27 | 0·06 | 0·02 | 1 | 25 | 20 | ట్రేస్ | 110 | 33 |
| **ఇతరమైన కూరగాయలు:—** | | | | | | | | | | | |
| కాకరగాయలు | 2 | 0 | 4 | 0·02 | 0·07 | 2 | 210 | 20 | 90 | 30 | 8 |
| వంకాయలు | 1 | 0 | 6 | 0·02 | 0·06 | 1 | ట్రేస్ | 20 | 20 | 30 | 10 |
| గోరుచిక్కుడుగాయలు | 4 | 0 | 10 | 0·13 | 0·05 | 6 | 330 | — | 50 | 60 | 16 |
| గుమ్మడికాయ | 0 | 0 | 3 | 0·01 | 0·03 | 2 | ట్రేస్ | 30 | 10 | 10 | 4 |
| బెండకాయలు | 2 | 0 | 8 | 0·09 | 0·08 | 2 | 60 | 20 | 20 | 40 | 12 |
| తక్కాళి | 2 | 0 | 5 | 0·02 | 0·04 | 2 | 320 | 20 | 30 | 30 | 8 |
| **విత్తనములు, నూనె విత్తనములు:—** | | | | | | | | | | | |
| కొబ్బెరకాయ | 5 | 42 | 13 | 0·01 | 0·24 | 2 | ట్రేస్ | 20 | ట్రేస్ | 440 | 126 |
| వేరుశనగ | 27 | 40 | 20 | 0·05 | 0·39 | 2 | 60 | 300 | 0 | 550 | 156 |
| **కారపు దినుసులు, సుగంధ ద్రవ్యములు మొదలగు:—** | | | | | | | | | | | |
| ఎండు మిరపకాయలు | 16 | 6 | 32 | 0·16 | 0·37 | 2 | 600 | — | 50 | 250 | 70 |
| ధనియాలు | 14 | 16 | 22 | 0·63 | 0·37 | 18 | 1,570 | — | ట్రేస్ | 290 | 83 |
| చింతపండు | 3 | 0 | 67 | 0·17 | 0·11 | 11 | 100 | 50 | ట్రేస్ | 280 | 82 |
| **పండ్లు:—** | | | | | | | | | | | |
| సాధారణమైన అరటిపండ్లు | 1 | 0 | 25 | 0·01 | 0·03 | 1 | 120 | 2 | 10 | 100 | 30 |
| అమియ (ఇండియన్ గూస్బెరి) | 0 | 0 | 14 | 0·05 | 0·02 | 1 | ట్రేస్ | — | 600 | 60 | 17 |
| బనానా (అరటిపండ్లు) | 1 | 0 | 36 | 0 | 0·05 | 1 | ట్రేస్ | 50 | ట్రేస్ | 150 | 43 |
| దేశీయ జామపండ్లు | 2 | 0 | 15 | 0·01 | 0·04 | 1 | ట్రేస్ | 12 | 300 | 70 | 19 |
| దేశీయ నిమ్మపండ్లు | 2 | 1 | 11 | 0·09 | 0·02 | 0 | 30 | — | 40 | 60 | 17 |
| మామిడి పండ్లు | 1 | 0 | 12 | 0·01 | 0·02 | 0 | 4,800 | 20 | 10 | 50 | 14 |
| ఆరెంజి | 1 | 0 | 11 | 0·05 | 0·02 | 0 | 350 | 40 | 60 | 50 | 14 |
| బొప్పాయి | 1 | 0 | 10 | 0·01 | 0·01 | 0 | 2,020 | 8 | 50 | 40 | 11 |

కనగా, మామూలు జబ్బులు, అంటు, శస్త్రక్రియలకు చెందిన రోగములు ఆయా అధ్యాయములలో వివరించబడియున్నవి. ఈ క్రింద పేర్కొనునవి సాధారణముగా ఉపయోగించు ఆహారములు:—

[1]సాధారణ పథ్యములు:—జబ్బుపడి, తిరిగి బాగుపడుచున్నవారికిని, జ్వరము (ఉష్ణోగ్రత) లేనివారికిని యీ సంపూర్ణ పరిమాణముగల ఆహారము నిచ్చెదరు. ఒకటి రెండు ప్రత్యేకమైన మూలపదార్థములు కొరతపడినందున కలిగిన జబ్బుచేత బాధపడు రోగులకు, కొరతపడిన ఆహార పదార్థములను సాధారణ పథ్యాహారముతో కలిపి యియ్యవచ్చును.

[2]తేలికమైన ఆహారపథ్యములు:—జ్వరము మోతాదుగా నున్నవారికిని, శస్త్ర చికిత్సయైనపిమ్మట ప్రతికూలమైన లక్షణములు లేనివారికిని యీ యాహారము నియ్యవచ్చును. మాంసము, పప్పు, పెంకుగల కాయలు, క్రొవ్వులు, సంబారములు వీటితో చేర్చరాదు. చేప, కోడి మాంసమును చేర్చవచ్చును.

[3]మెత్తని యాహారపథ్యములు:—జ్వరము హెచ్చుగానుండి బాగుపడుచున్నవారికి ఈ రకపు ఆహారము నిచ్చెదరు. బాగుగా వండిన కాయధాన్యములు, గుడ్డుతో తయారుచేసిన వంటకములు, చారులు, కాల్చిన రొట్టె, పండ్లు మొదలగునవి.

[4]ద్రవాహారము:—మ్రింగుటకు కష్టముగానున్న రోగులకును, [5]తీవ్రమయిన జ్వరముగల రోగులకును ఈ రకము భోజనము నిచ్చెదరు. దేహములోని విషపదార్థములన్నియు బయటికి పోవుటకు సహాయపడునటుల, ఈ రోగులకు విస్తారమైన ద్రవాహారమునియ్యవలెను. ఈ యాహారములను సులభముగా జీర్ణించుకొనుటకుగూడ వీలగును. ఏవిధమైన ద్రవాహారమునైనను ఈ రకము క్రింద చేర్చవచ్చునుగాని, శరీరములోని జీర్ణించిన టిష్యులను తిరిగి బలపరచుటకు మాంసకృత్తులుగల ద్రవాహారములను ధారాళముగా నిచ్చుట చాల మంచిది.

[6]శేషము మిగిలియుండని ద్రవాహారము — దీనికిని సాధారణమైన ద్రవాహారమునకునుగల భేదమేమనగా—ఈ రకము ద్రవాహారములు

[1] General diet. [2] Light diet. [3] Soft diet. [4] Liquid diet. [5] Hyperpyrexia. [6] Non-Residual liquid diet.



ప్రేగులలో బొత్తుగా శేషించియుండవు. ఏదో ఒక కారణముచేత విరేచనము కాకుండనుండవలసిన రోగులకు ఈ యాహారము నిచ్చెదరు. చెక్కెర కలిపిన పండ్లరసము, టీ, పాలు లేని కాఫీ, గ్లూకోసుద్రవము ఈ రకమైన ఆహారములలో చేరినవి.

రోగులు జబ్బుతో నున్నప్పుడు, వారి యాకలి మందగించును. కావున వారికిచ్చెడు ఆయా పథ్యాహారములను జూచి అయిష్టపడుదురు; నర్సు వివిధముగా భోజనమును వండి, రోగులు దానిని తినునట్లు వారిని ప్రోత్సాహించవలెను. ఆయా [1]వంటకములపట్టి యీ యధ్యాయము చివర నియ్యబడి యున్నది.

భోజనమును వీలైనంత చక్కగా వడ్డించుటచేత రోగి దానిని తినుటకు నర్సు ప్రోత్సహించినదగును. వెవ్వేరు తెగల జనులు వెవ్వేరు విధములుగా భుజించువాడుక గలిగియుందురు. రోగికి దేహశ్రమ లేకుండినయెడల, నర్సు ఎవరి వాడుకచొప్పున వారికి వడ్డించవలెను. శుభ్రముగాను, చక్కనిరీతిగాను భోజనము నెల్లప్పుడు వడ్డించవలెను. స్త్రీల నుపయోగించుట మంచిది. భోజనము చేయునప్పుడు ఒక్కొక్క రోగి త్రాగుటకు మంచినీళ్లు పెట్టవలెను. అవసరమైన రోగులకు నర్సు సహాయము చేయవలెను. రోగుల బంధువులు సహాయము చేయుచున్నప్పుడు, పడక మీదనుండి లేవలేని రోగులు సుఖముగా భుజించునట్లు వారికి భోజనమెట్లు తినిపించవలెనో వారికి తెలియజేయవలెను.

పెక్కు వైద్యశాలలలో ప్రత్యేకమైన వంటశాలలుండును. అక్కడ ప్రత్యేకమైన వంటకములు సిద్ధముచేయుదురు. ఇతర వైద్యశాలలలో వార్డునందే యిట్టి ప్రత్యేకమైన పథ్యాహారమును సిద్ధము చేయుదురు. నర్సు వైద్యుని యాజ్ఞప్రకారము రోగియొక్క భోజనము సిద్ధముచేసి, ఆయన నియమించిన కాలములోనే దానిని వడ్డించవలెను. నర్సు తన చేతికి అప్పగించబడిన ఆహార పదార్థములనుగూర్చి మనస్సాక్షిపూర్వకముగా జాగ్రత్త పుచ్చుకొని, దానిని న్యాయముగా నుపయోగించవలెను.

అనేక వైద్యశాలలలో రోగులకు ఇచ్చిన ఆహారమును చార్టులో వ్రాయరు. కాని ప్రతిదినము నర్సింగు రికార్డులు వ్రాయునప్పుడు, రోగికి ఏ రకము భోజనమిచ్చినదియు, ఎంత భుజించినదియు సూచించుచు ఆహార

[1] Recipes.

వివరమును వ్రాయవలెను. రోగిని చికిత్సచేయుటకు ఈ సంగతి వైద్యునికి చాల సహాయపడును.

తల్లి ఆరోగ్యముగానుండి, సరియైన పోషణగలిగియున్నప్పుడు, పసిబిడ్డలకు తల్లిపాలే శ్రేష్ఠమైన పోషణనిచ్చును. కాని, పలుమారు, బిడ్డలకు [1]కల్పితపాలు (పోతపాలు మొదలైనవి) అవసరమైయుండును. వైద్యుడు నియమించిన పరిమాణములప్రకారము సిద్ధముచేయుటకు నేర్చుకొనియుండవలెను. బిడ్డల భోజనము సిద్ధముచేయునప్పుడు దానిని శుభ్రముగాను, మోతాదు పరిమాణములుగాను సిద్ధముచేయుట చాల ప్రాముఖ్యమైన విషయము. ఆవుపాలు శుభ్రమైనవిగానుండి, రోగములేని యావునుండి పిండినవైనయెడల, ఆ పాలను ఉపయోగించవచ్చును. తీపి కలియని డబ్బాపాలుగాని, పొడిచేసిన పాలుగాని ఆవుపాలకంటె మేలు. బిడ్డయొక్క వయస్సు, తూనికలనుబట్టి, ఆ బిడ్డకిచ్చు పాలనన్నిటిని నీటితో కలిపి పలుచన చేయవలెను. ఇట్లు పలుచనచేయుటకు సాధారణముగా వేడినీటిని కలుపుదురు. అయినను కొన్నిసారులు బార్లీనీళ్లు, సున్నపు తేటయు కలుపుట వాడుక. 40-వ పటములో వెవ్వేరు జంతువుల పాలయందలి పదార్థములు చూపబడియున్నవి. వానిని పరిశీలించి చదివినట్లయిన, పాల నెందుకు పలుచన చేయవలెనో కారణము తెలియనగును. ఇట్లు సిద్ధము చేయుచుండగా, ఏదో ఒక రకముగా పాలయందు చక్కెర కలుపవలసిన అవసరముకూడ బోధపడును. శరీరముయొక్క ఒక్కొక్క పౌండు బరువునకు 2½ ఔన్సుల చొప్పున బిడ్డకు ద్రవము అవసరమై యుండును. పాలను పొంగించినప్పుడు (ఈ దేశములో తప్పక పొంగించి తీరవలెను) దానిలోని విటమిను పదార్థములో అధికపక్షము నష్టమైపోవును. ఇందుచేత బిడ్డయొక్క ఆహారమునకు చేపచేమురు, ఆరెంజి పండ్లరసము చేర్చి యిచ్చెదరు. బిడ్డకు నాలుగునెలల వయస్సు వచ్చిన తరువాత బాగుగా పండిన మెత్తని కాయధాన్య భోజన మియ్యవచ్చును. ముఖ్యముగా [2]గోదుమరవ్వ (రోలాంగ్) లేక [3]సుజి [illegible]ను వానిని బాగుగా జావ చేసి ఇయ్యవచ్చును. క్రమక్రమముగా కూరగాయలు, ఫలముల రసమును బిడ్డ భోజనముతో చేర్చి ఇయ్యవచ్చును. బిడ్డకు కడుపునొప్పి రాకుండ, బిడ్డకిచ్చు భోజనపదార్థము లన్నిటిని ఉడుకుగా నియ్యవలెను.

[1] Artificial feeding. [2] Rolong. [3] Suji.



ఆఱు లేక ఏడు నెలల వయసప్పుడు బిడ్డకు కొంచెము ఉడికించిన గ్రుడ్డు నియ్యవచ్చును. బిడ్డకు పండ్లు వచ్చుచున్నప్పుడు, టోస్టుచేసిన రొట్టెముక్క నిచ్చుటమేలు. బిడ్డకు ఒక సంవత్సరము వచ్చులోపల తల్లిపాలను, బుడ్డిపాలను చాలించి, గిన్నెతో ద్రవాహారము త్రాగునట్లు వాడుక చేయవలెను. రానురాను బిడ్డ భోజనమును గట్టిచేయుచువచ్చి, రెండు సంవత్సరములగు సరికి, సాధారణ భోజనము భుజించునట్లు చేయవలెను. కాని, పాలు మాత్రము బిడ్డకు ఎల్లప్పుడు ఇచ్చుచుండవలెను. ఐదారు నెలలలో బిడ్డయొక్క తూనిక రెండింతలు హెచ్చుటయు, తరువాత ఆఱు నెలలలో నెలకు ఒక పౌండు చొప్పున బరువు హెచ్చుచు, రెండు సంవత్సరముల చివరన 28 పౌండ్లు బరువు తూగుటయు మేలు.

ఆయా పాలలోని పదార్థముల శాతము (పర్సెంటేజ్)

| రకము | నీళ్లు | క్రొవ్వు | చెక్కెర | మాంసకృత్తులు |
|---|---|---|---|---|
| తల్లిపాలు ... ... | 88·5 | 3·3 | 6·5 | 1·5 |
| ఆవు ,, ... ... | 87·0 | 4·0 | 5·0 | 3·3 |
| మేక ,, ... .. | 83·1 | 4·9 | 4·4 | 4·7 |
| బఱ్ఱె ,, ... ... దాదాపు | 80·0 | 12·6 | 3·7 | 6·0 |

Fig. 40.

## ఆహారము తయారుచేయు విధములు

శేషము మిగిలియుండని ద్రవాహారములు.

**చింతపండు నీళ్లు:**— రెండు టేబిల్‌స్పూనుల చింతపండు, ఒక గిన్నెడు పొంగుచున్న నీటితో దీనిని సిద్ధము చేయవలెను. చింతపండు మీద పొంగుచున్న నీటినిపోసి, ఒక గంటసేపు కరుగబెట్టి గాజుగుడ్డ ననేక మడతలువేసి యీ నీటిని బాగుగా వడియగట్టి ఒక టేబిల్‌స్పూన్ చక్కెరకలిపి, ఆరనిచ్చి త్రాగించుము.

[1]వే:—అనగా పాలనువిరిచి వడగట్టగా వచ్చిన ద్రవము. ఒక పైంటు తాజాపాలను శరీరోష్ణోగ్రత (98° నుండి 100° F.) వరకు బాగుగా వేడి

[1] Whey.

చేసి, దానికి ఒకటి రెండు టీ స్పూనుల [1]రెనెట్ అను పదార్థము కలుపవలెను. దీని నేదైన నొక వేడిస్థలములో ఒక పాతిక గంటసేపు ప్రత్యేకముగా పెట్టియుంచవలెను. పిమ్మట గడ్డగట్టిన పెరుగును ముల్లు గరిటెతో చిలికి విడగొట్టుము. ఇట్లు సిద్ధము చేసినదానిని 15 నిమిషములు తేరనిచ్చి, మజ్లినుగుడ్డతో వడగట్టి, పొంగునంతవరకు వేడిచేయుము. రెనెట్ అను దానికి బదులు పెరుగును వాడవచ్చును.

[2]**నిమ్మరసముతో చేసిన వే:**—ఒక పైంటు తాజా పాలలో నాలుగు టేబిల్ స్పూనుల నిమ్మరసము కలుపవలెను. దీనిని కలపకుండ నీరు తేరునంతవరకు పొంగించుము. పెక్కుమడతలు వేసిన గాజ్ గుడ్డతో వడియగట్టి, చక్కెర కలుపుము. చల్లార్చి త్రాగించుము.

[3]**ఇంపీరియల్ డ్రింక్:**—అర్థ ఔన్సు [4]క్రీమ్ ఆఫ్ టార్టార్ రెండు నిమ్మకాయల రసము, రెండు టేబిల్ స్పూనుల చక్కెర కలుపుము. ఈ వస్తువులను ఒక జగ్గులోపోసి, వానిమీద పొంగుచున్న ఒక క్వార్ట్ నీరు పోసి, చల్లారునవరకు మూతవేసి యుంచుము.

## ద్రవాహారము

**బార్లినీళ్లు:**—(1) 1 టేబిల్ స్పూన్ బార్లిపిండి, 1 పైంటు పొంగుచున్న నీళ్లు, 2 టేబిల్ స్పూనుల చన్నీళ్లు, రుచికొరకు కొంచెము ఉప్పు తీసికొనుము. పిండిని చన్నీటితో మెత్తని అంబలిగకలిపి, కలుపుచుండగనే పొంగుచున్న నీళ్లను క్రమేణ పోయుచు, 30 నిమిషములు ఉడికించి, ఉప్పును (వైద్యుని సెలవైనయెడల) ఒక పెద్దగంటెడు నిమ్మకాయరసమును గలిపి, ఉపయోగించకముందు వడియగట్టుము.

(2) 1 ఔన్సు బార్లిబియ్యము, 1 పైంటు చన్నీళ్లు తీసికొనుము. ఈ నీళ్లుపోసి, బార్లిబియ్యమును తెల్లగా కడుగుము. ఒక పైంటు నీరు 2—3 వంతులకు దిగువరకు బార్లిని బాగుగా ఉడికించుము. పిమ్మట వడగట్టుము. ఇట్లు దినమునకు రెండు పర్యాయములు తాజాగా సిద్ధము చేయవలెను. పొంగించకముందు, ఇష్టమున్నయెడల, నీటితో నిమ్మరసము చేర్చవచ్చును. రుచి కలుగుటకు చక్కెరకూడ కలుపవచ్చును.

[1] Rennet. [2] Lime Whey. [3] Imperial Drink. [4] Cream of tartar.



[1]**ఆల్బ్యుమెన్ నీరు:**—(1) రెండు క్రొత్తగ్రుడ్ల తెల్లజన తీసికొని ఒక కోపా నీళ్లు కలుపుము. దీనిని వెడల్పు మూతిగల బుడ్డిలోపోసి గట్టిగ కదిలించుము. కొంచెము నిమ్మరసము, చక్కెర కలుపుము. ఇష్టముండిన యెడల, నిమ్మరసమునకు బదులు కమలాపండ్ల రసము కలుపవచ్చును.

(2) ఒక గాజ్ గుడ్డగుండ రెండు గ్రుడ్ల తెల్లజనను ఒక గ్లాసులోనికి పిండుము. దీనిని కొట్టకుండనే, నిమ్మరసము, నీళ్లు, చక్కెర దీనితో కలుపుము. తీపికలుపని ఆల్బ్యుమెను నీటిని మాంసపు రసముతోగాని, మరేదైన పానకముతోకాని చేర్చినయెడల, దానికి పోషణ ప్రభావము ఎక్కువగును. ఇది జ్వరముతోనున్న రోగులకు చాల ఉపయోగపడును.

[2]**ఎగ్ ఫ్లిప్:**—గ్రుడ్డు నొకదానిని బాగుగాకొట్టి, దానికి అర్ధపైంటు పాలు కలుపుము. బాగుగా ఈ రెంటినికలిపి, త్రాగించకముందు దీనిని వడగట్టవలెను. ఇది మంచి వాసన గొట్టుటకు చక్కెర, లవంగచెక్క, లేక నిమ్మపండ్లరసము కలుపవచ్చును. ఇష్టమున్నయెడల దీనిని కాఫీ, టీ, [3]కోకోతోచేర్చి ఇయ్యవచ్చును.

**కాఫీలో పాలు కలుపుట:**—ఒక జగ్గు వెచ్చచేసిన తరువాత రెండు టేబిల్ స్పూనుల కాఫీపొడి దానిలోవేసి అర్థపైంట్ పొంగుచున్న నీళ్లు పోసి బాగుగాకలిపి 5 నిమిషములవరకు వెచ్చనిచోట నుంచుము. ఆ తరువాత అర్థపైంటు అప్పటమైన పాలను కాగబెట్టి, ఒక టేబిల్ స్పూన్ కాఫీనీళ్లను గలిపి యిష్టమైనంత చక్కెరవేసి ఇయ్యవచ్చును.

పాలతో 2 గ్రెయినుల సోడియంబైకార్బొనేటుగాని లేక 1—2 గ్రెయినుల సోడియం సిట్రేటుగాని కలుపుటవలన పాలు త్వరగా జీర్ణమగునట్లు చేయవచ్చును. వీనిని కలుపుటవలన పాలలోని పెరుగు పదార్థము పరిమాణమునందు తగ్గించబడును. కాబట్టి పాలుత్వరగా జీర్ణము కాగలదు.

[4]**లాక్టిక్ ఆసిడ్ పాలు:**—సంపూర్ణమైన పాలనుండిగాని, మీగడ చిలికిన పాలనుండిగాని లాక్టిక్ ఆసిడ్ పాలను సిద్ధముచేయవచ్చును. ఒక పైంటు నీటిని 5 నిమిషములు పొగించి చల్లార్చుము. పిమ్మట మెల్లగాను, జాగ్రత్తగాను, బొట్లు బొట్లుగా 45 బొట్లు లాక్టిక్ ఆసిడ్ పోయుము. ఇట్లు పోయుచుండగా బాగుగా కలుపుచుండుము.

[1] Albumen water. [2] Egg flip. [3] Cocoa. [4] Lactic acid.

[1]మెత్తని యాహారము

[2]కస్టర్డ్ పుడింగ్:— ఒక తాజాగ్రుడ్డు జనకు ఒక డెజర్టుస్పూన్ చెక్కెర, ఒక చిటికెడు ఉప్పు, కొన్నిచుక్కలు [3]వనిల్లా ఎసెన్సుచేర్చి, బాగుగా కలియగొట్టుము. ఇట్లు సమయమంతయు కొట్టుచునే దీనిలో అర్ధపైంటు పాలుపోసి, ఒక జల్లెడగుండ ఉడుకబెట్టెడు పాత్రలోనికిగాని, బేసినులోనికిగాని వడియగట్టుము. కస్టర్డును సన్నని సెగగల పొయ్యి మీద 15 లేక 20 నిమిషములు ఉడికించుము, లేదా [4]డబుల్ బాయిలరులోనైనను ఉడికించుము.

[5]జంకెట్:— అర్ధపైంటు తాజాపాలను 100°F. వరకు వేడిచేసి రుచికొరకు చెక్కెర కలుపుము. దీనిని ఒక గాజుపాత్రలోపోసి ఒక టీస్పూన్ రెనెట్ కలిపి, కదిలించి, గడ్డకట్టువరకు ఉంచుము. ఇష్టమున్న యెడల లవంగచెక్కపొడిగాని, జాజికాయపొడిగాని దీనిమీద చల్లవచ్చును. ఈ పాలను పొంగించనందున, ఈ పాలు పాశ్చరైజ్ చేసినవనిగాని, ఆరోగ్యమైన ఆవునుండి పితికినవనిగాని నర్సు నిశ్చయముగ తెలిసికొనవలెను.

[6]మెత్తగ ఉడుకబెట్టిన గ్రుడ్లు:— (1) పొంగుచున్న నీటిలో గుడ్డును జాగ్రత్తగ జారవిడిచి, 3½ నిమిషములవరకు ఉడుకబెట్టుము.

(2) గ్రుడ్డును చన్నీటిలో పెట్టి నీరుపొంగువరకు ఉడుకబెట్టుము.

[7]పోచ్డ్ ఎగ్:—ఒకపైంటు నీటిలో ½ టీస్పూన్ ఉప్పువేసి, పొంగించుము. గ్రుడ్డునుగొట్టి పాత్రలోపోసి, మెల్లగా నీటిలోనికి జారనిమ్ము. దీనిని రెండునిమిషములవరకు మెల్లగ ఉడుకనిమ్ము.

[8]సాధారణమైన ఆమ్లెట్:— రెండుగ్రుడ్లను పగులగొట్టి పాత్రలోపోసి, రుచికలుగుటకు ఉప్పు, మిరియాలపొడి చల్లి, ఒక నిమిషమువరకు ముళ్లగరిటెతో కొట్టుము. పెనమును పొయ్యిమీదపెట్టి దానిలో సగము టీస్పూన్ వెన్న వేయుము. వెన్నకరగి, పొగలేచునప్పుడు, గ్రుడ్లను దానిలో పోసి, అది గడ్డకట్టునట్లు కొన్ని సెకెండులు నిలిచియుండనిమ్ము. ఆమ్లెట్ అంచులను పైకెత్తుచు, దానిక్రిందికి వెన్నను పోనిమ్ము. ఆమ్లెట్ కుదురు

[1] Soft diet. [2] Custard pudding. [3] Vanilla essence. [4] Double boiler. [5] Junket. [6] Soft boiled egg. [7] Poached egg. [8] Plain omelet.



కొనునట్లు పెనమును కదిలించుము. పిమ్మట ముళ్లగరిటెతో ఆమ్లెట్ యొక్క సగముభాగమును త్రిప్పి, రెండవ సగముభాగముమీద పడునట్లు వేసి, ఉడుకుపాత్రమీద వడ్డించుము.

గంజివంటకములు

రాగిగంజి:—రాగిని విసిరినతరువాత మజ్లిన్ గుడ్డగుండ రెండు మూడు సార్లు జల్లించవలెను. ఒక టేబిల్‌స్పూన్ రాగిపిండిని కొంచెము చన్నీటితో మెత్తని అంబలి అయ్యేటట్టు కలిపి, 10 ఔన్సుల పొంగుచున్న నీటిలోవేసి, చిటికెడు ఉప్పుకలిపి 15 నిమిషము లుడుకబెట్టుము. ఇష్టమున్న యెడల సగము నీళ్లు, సగము పాలు వాడవచ్చును.

[1]చిమిడిన అన్నము:— రెండు టేబిల్‌స్పూనుల బియ్యము 8 ఔన్సుల పాలు, నీళ్లు—లేక నీటితోకలిపిన పాలు, చిటికెడు ఉప్పు బియ్యమును బాగుగాకడిగి పాలలోవేయుము. ఇప్పుడు దీనిని 1 నుండి 1½ గంటల వరకు మెల్లగా ఉడికించి జిగురుగానగునట్లు చేయుము. ఇష్టమున్నయెడల దీనిని వడ్డించకముందు చెక్కెర కలుపుము.

[2]ఆరోరూట్ గంజి:—1½ టీస్పూనుల ఆరోరూట్‌పిండి, 1 టేబిల్‌స్పూన్ చన్నీళ్లు 4 ఔన్సుల పొంగుచున్న నీళ్లు, 4 ఔన్సుల వేడిపాలు, రుచికలుగుటకు చెక్కెర, చిటికెడు ఉప్పు తీసికొనుము. చన్నీటితో ఆరోరూట్ పిండిని మెత్తని అంబలిగ కలిపి, దానితో క్రమేణ వేడినీరుచేర్చుము. సమయమంతయు త్రిప్పుచు, దీనిని 10 నిమిషములవరకు కలుపుచు ఉడికించుము. ఇప్పుడు దీనికి పాలు, ఉప్పుకలిపి, తిరిగి పదినిమిషములు ఉడికించుము. వడ్డించకముందు ఇష్టమున్నయెడల చెక్కెరకలుపుము.

[3]బార్లి:—1 టేబిల్‌స్పూన్ సిద్ధముచేసిన బార్లిపిండి, 2 టేబిల్‌స్పూనుల చన్నీళ్లు, 4 ఔన్సులు వేడినీళ్లు, 4 ఔన్సుల వేడిపాలు, ¼ టీస్పూన్ ఉప్పు కావలెను. బార్లిపిండి మెత్తనియంబలి యగునట్లు చన్నీళ్లుపోసి కలుపుము. పిమ్మట వేడినీళ్లు కలిపి సమయమంతయు త్రిప్పుచు, 30 నిమిషములు ఉడికించుము. ఇప్పుడు పాలు, ఉప్పుచేర్చి పొంగుచున్న నీళ్లు క్రమేణ పోయుచు ఉడికించుము.

[4]సుజి (రోలాంగ్):—1 పైంటు పొంగుచున్న నీటిలో చిటికెడు ఉప్పు వేసి 1 టేబిల్‌స్పూన్ సుజి (గోదుమరవ)ని మెల్లగపోయుచు సమయ

[1] Double boiled rice. [2] Arrowroot. [3] Barley. [4] Suji (Rolong).

మంతయు కలియబెట్టుచుండుము. దీనిని డబుల్ బాయిలర్‌లో పెట్టి మూతవేసి 45 నిమిషములవరకు ఉడికించుము. ఉడుకుచుండగా, దీనిని అప్పుడప్పుడు కలియబెట్టుచుండవలెను.

అన్నిరకముల గంజిని పాలు, చక్కెరకలిపి త్రాగించవచ్చును.

పప్పుచారు:—అర్ధకోపా పప్పు, 1 పెద్ద ఉల్లిగడ్డ, 1 కోపా నీళ్లు, రుచి కలుగుటకు ఉప్పు. పప్పును మెత్తగ పిండిచేయుము. ఉల్లిగడ్డ పైతోలు ఒలిచి, ముక్కలుగ తరిగివేయించుము. ఇప్పుడు పైచెప్పిన ద్రవ్యము లన్నిటిని దీనిలో వేసి 20—30 నిమిషములవరకు ఉడికించుము.

[1]లివర్ కాక్ టెయిల్:—¼ పౌను కాలేయమును తీసికొని బలమైన జల్లెడలో పెట్టి బాగుగ చిదిపి పిండవలెను. లేదా మాంసమును తురుమెడు మరలోవేసి పదునుగల కత్తితో చిదుపవలెను. ఇట్లు చేసి పిండిన రసముతో కమలాపండ్లరసము, నిమ్మరసము, టొమేటో (సీమవంకాయ) రసమును, మరికొన్ని వాసనద్రవ్యములను చేర్చి కాలేయముయొక్క రుచిని మార్చివేయవచ్చును.

1 Liver cocktail.

నాల్గవ భాగము

అధ్యాయము 14

# ఔషధ పదార్థ తత్వ ప్రారంభ శాస్త్రము

**విభజన**

రోగమును నివారించుటకుగాని, కుదుర్చుటకుగాని ఇచ్చెడు ఔషధ పదార్థమునకు [1]మందు దినుసు అని పేరు. ఇట్టి మందు దినుసులు ముఖ్యముగా ఉద్బిజ్జములు, లోహములు, జంతువులనుండి లభించుచున్నవి. కొన్ని ఔషధములు [2]వాయు పదార్థములు. ఉద్బిజ్జములనుండి లభించు మందు దినుసులకు ఉదాహరణము లేవనగా:—(1) [3]డిజిటాల్యలిస్ అనునది. ఇది [4]ఫాక్స్‌గ్లౌ అను చెట్టుయొక్క ఆకునుండి చేయబడినది. (2) [5]క్యాఫిన్ ఇది కాఫివిత్తనమునుండి తయారు చేయబడుచున్నది. (3) [6]కస్కార. ఇది ఒక చెట్టు బెరడునుండి చేయబడుచున్నది. లోహములనుండి చేయబడు ఔషధము లేవనగా:—[7]ఆర్సెనిక్ (పాషాణము), ఇనుము, సోడియమ్. చేపచమురు, [8]ఇన్‌సులిన్ అను ఔషధము, [9]థైరాయిడ్ అను మాంస గ్రంధినుండి తీసిన సారము మొదలగునవి జంతువులనుండి లభించిన మందు దినుసులు. ఆక్సిజన్, కార్బన్ డై ఆక్సైడ్ ఇవి వాయుసంబంధమైన ఔషధములు.

**మందు దినుసులను సిద్ధము చేయుట**

మందు దినుసులను మూడు ముఖ్యవిధములుగ సిద్ధము చేయుదురు. అవి ఏవనగా:—ద్రవములు, ఘనపదార్థములు, వాయువులు. ఈ ఒక్కొక్క గుంపునకు చేరిన మందు దినుసులను సిద్ధముచేయు రీతులు క్రింద పేర్కొనబడినవి.

**ద్రవములు**

1. ద్రావణములు (సొల్యూషనులు): — ఒక ఘనపదార్థమునుగాని, ద్రవపదార్థమునుగాని, వాయుపదార్థమునుగాని, మరియొక ద్రవముతో

1 Drug. 2 Gases. 3 Digitalis. 4 Foxglove. 5 Caffein. 6 Cascara. 7 Arsenic. 8 Insulin. 9 Thyroid extract.

చేర్చినప్పుడు చేర్చబడిన పదార్థము సంపూర్ణముగ కరిగిపోయి, దీని ఫలితముగ ఏర్పడిన ద్రవము తేటగ నుండినయెడల దానిని [1]ద్రావణము అని చెప్పుదురు. సాధారణముగ లోషనులు అని పిలువబడు డిసిన్ ఫెక్టెంటు ఔషధములన్నియు ద్రావణములే. దీనికి ఉదాహరణములు—బోరిక్ సొల్యూషన్, కర్బాలిక్ లోషను. నోటిద్వారా త్రాగు అనేక ఔషధములు కూడ ద్రావణములే. ఉదాహరణము—క్వైనైన్ సల్ఫేట్ సొల్యూషన్. ద్రావణ రూపములోనున్న మందులను రికార్డు చేయునప్పుడును, పని కొరకు కావలెనని వ్రాయునప్పుడును 'సొల్యూషన్ లేక లోషన్' అను మాటను వ్రాయుటకు ఎన్నడును మరిచిపోకూడదు.

ఒక మందుదినుసును నీటిలో కరిగించుటవలన పెక్కు ద్రావణములను చేయుచున్నారు. అట్టి ద్రావణములను [2]లిక్కర్స్ అందురు. ఉదా. లిక్కర్ ఆర్సనికాలిస్. [3]వాయువునందు సులభముగ హరించబడగల పదార్థమును నీటిలో కరిగించినప్పుడు దానిని 'వాటర్' లేక 'ఆక్వా' అందురు. ఉదాహరణము—[4]అక్వామెంతపిప్, కొన్నిసార్లు నీటికి బదులు ఆల్కహాల్ అను సారాయము నుపయోగించెదరు. ఇట్టి కొన్ని ద్రావణములను 'టింక్చర్స్' అందురు. ఉదాహరణము:—(అరకు) టింక్చర్ ఆఫ్ డిజిట్యాలిస్. మరికొన్నిటిని (సారాయి) 'స్పిరిట్స్' అందురు. ఉదాహరణము—అరొమ్యాటిక్ స్పిరిట్స్ ఆఫ్ అమ్మోనియా. కొన్నిసార్లు చెక్కెరనీళ్లనుగూడ ఉపయోగించుదురు. వీనిని (షర్బత్) 'సిరప్స్.' అందురు. ఉదాహరణము—[5]సిరప్ ఆఫ్ ఇపిక్యాక్.

ద్రవరూపముననుండు కషాయమును, ఒక మందుదినుసును ఏదైన ద్రవములోవేసి దానిసారము తీయుటవలన చేయుదురు. లేదా, ఒక వస్తువును ఏదేని ఒక ద్రవములో కరిగించి చేయుదురు. ఇట్టి కషాయ ద్రావణము బలకరమైనదగుటచే, ద్రవములో కొంతభాగము ఆవిరియగుచున్నది. ఇందుచేత 1CC. ద్రావణములో 1 గ్రాము మందుండును. దీనికి ఉదాహరణము—[6]'గ్లిసరైజ్ కొ' యను ద్రవసారము.

ఏదైన ఒక మందుదినుసు మీద చన్నీళ్లుగాని, వేడినీళ్లుగాని పోసి, ఆ దినుసు నీటిలో కరగునంతకాలము దానిని నిలిచియుండ నిచ్చినయెడల,

Solution. [2] Liquors. [3] Volatile substance. [4] Aqua mentha pip.
[5] Syrup of ipecac. [6] Extract glycyrrhiza co.



దానిని [1]ఇన్ఫ్యూషన్ అందురు. దీనికి టీ ఇన్ఫ్యూషన్ ఉదాహరణము. ఒక పదార్థమును పొంగించుటచేత అది నీటిలో కరిగినట్లయిన దానిని [2]డికాక్షన్ అందురు. కాఫీ దీని కుదాహరణము.

పొంగించి రోగక్రిమిరహితముగా చేసిన మందుద్రావణములను [3]ఆంప్యూల్సు అను వానియందు పోయుదురు. వీనిని సూదిద్వారా శరీరములోనికి ఎక్కించెదరు. ఉదాహరణము:—గ్లూకోస్ సొల్యూషన్ ఆంప్యూల్సు.

2. మిక్స్చర్స్:—కరిగిపోనట్టి రెండు లేక యెక్కువపదార్థములను ఒకదానితో నొకటి కలుపుటవలన ఏర్పడు మిశ్రమమునకు మిక్స్చర్ అని పేరు. ఇట్లు మిశ్రమము చేయబడిన పదార్థములలో నొకటి నూనె పదార్థముగా నుండినట్లయిన, దానిని బంకవంటి ఒక వస్తువుతో చేర్చి [4]ఎమల్షన్ చేయుదురు. ఉదాహరణముగా 'కాడ్ లివరాయిల్ ఎమల్షన్.' 'లినమెంట్స్' అనునవి మంటపుట్టించు ఒక పదార్థము చేరియున్న మిశ్రమము. వీనిని శరీరము పైభాగమునమాత్రమే పూయుదురు. ఉదాహరణము:—[5]టర్పెంటైన్ లినిమెంటు.

## ఘనపదార్థములు

1. [6]మాత్రలు:—వీనిలో ఒకటి లేక యెక్కువ మందుదినుసులు కలిసియుండవచ్చును. ఇవి ఉండలవలె గుండ్రముగానుండును. వీనితో బంకవలె నంటుకొను ఒక పదార్థము చేర్చబడును. ఉదాహరణము: [7]కస్కార సగ్రాడపిల్స్. 2. బిళ్లలు.—ఇవియు మాత్రలవలెనుండును. కాని వీనిని బల్లపరుపుగానుండునట్లు ఒత్తుదురు. ఉదాహరణము [8]సింకోనా ట్యాబ్లెట్స్. 3. చూర్ణములు.—వీని పేరునకు తగినట్టు వీనిని చూర్ణము (పొడి) చేయుదురు. ఒక్కొక్కసారి యీ చూర్ణములో నొకేమందుండును; మరికొన్ని సారులు ఎక్కువ మందు దినుసులుండును. చూర్ణమును గ్లాస్ పాత్రలోనుంచి స్టెరలైజ్ చేసినట్లయిన దానిని, 'ఆంప్యూ'లందురు. కొన్నిసారులు ఈ చూర్ణ

[1] Infusion. [2] Decoction. [3] Ampules. [4] Emulsion.
[5] Turpentine liniment. [6] Pills. [7] Cascara sagrada pills.
[8] Cinchona tablets.

ములను [1]కరుగునట్టి గొట్టములలో వేయుదురు. ఈ గొట్టములకు [2]కాప్సూ్యల్స్ అని పేరు. 4. [3]కషాయములు.—ఏదైన ఒక మొక్క లేక చెట్టు నుండి తీసిన రసమును ఆవిరియగువరకు పొంగించి కషాయములను జేయుదురు. ద్రవకషాయములకంటె ఇట్లు ఆవిరిపట్టిన కషాయములు నాలుగింతలు ఘాటయినవి. ఉదాహరణము: కస్కార సగ్రాఢ కషాయము. 5. సప్పొజిటొరీస్.—ఇవి కొకొ వెన్నవంటి క్రొవ్వుపదార్థములు, మందుదినుసులు గలిసిన మిశ్రమములు. ఇవి పొట్లముయొక్క ఆకారముగా ఒకతట్టు మొన తేలియుండును. వీనిని శరీరమందలి ద్వారములలో ప్రవేశపెట్టినప్పుడు క్రొవ్వుపదార్థము కరుగుచుండగా, ఔషధపదార్థము కణజాలమువలన పీల్చుకొనబడును. 6. [4]అంజనములు.—ఇవి నూనెతోగాని, పందిక్రొవ్వుతోగాని, వ్యాజిలీనుతోగాని మందుదినుసులు కలిపి చేయు అంజనములు. వీనిలో కొన్నిటిని పైపూతకుమాత్రమే ఉపయోగింతురు. ఉదాహరణము: సల్ఫర్ ఆయింట్‌మెంట్ (గంధకపు అంజనము). మరికొన్ని చర్మముమీద బాగుగా రుద్దినప్పుడు, లోపలికి బాగుగా ఇంకును. ఉదాహరణము: మెర్క్యూరి ఆయింటుమెంట్ (పాదరసపు అంజనము). 7. [5]పట్టీలు.—వీని నొకే మందుదినుసు, లేక కొన్ని మందుదినుసులను సాధారణముగా నీటితో కలిపి, సగము గట్టిముద్దగా చేయుదురు. దీనిని కాగితము, లేక గుడ్డమీద పూసి దేహమునకు పట్టింతురు. పట్టి ఫలితము సాధారణముగా శరీరముమీదనే కనబడును. కొన్నిటిలో మాత్రము దేహములోనికి పీల్చుకొనబడు మందు కలిసియుండును.

[6]వైద్యమున నుపయోగించెడు సంకేతాక్షరములు

మందులుకావలెనని కోరునప్పుడును, కాగితముమీద వ్రాయునప్పుడును వైద్యశాఖవారు అంగీకరించిన పొడిగుర్తులనే వ్రాయుదురు. కాని యెవరికి తెలియని గుర్తులను (సంకేతాక్షరములను) వైద్యుడుగాని, నర్సుగాని యెన్నడును వ్రాయకూడదు. ఈ క్రింద పేర్కొనబడినవి యెక్కువ సాధారణముగా వాడుచుండెడు గుర్తులు. వాని ప్రక్కలలోనే వాని యర్థము లియ్యబడినవి.

---

[1] Gelatin Containers. [2] Capsules. [3] Extracts. [4] Ointments. [5] Plasters. [6] Medical abbreviations.



కాలమునుగూర్చిన సంకేతములు (గుర్తులు)

| | |
|---|---|
| a.c. — భోజనమునకు ముందు. | h.s. — నిద్రించుటకు ముందు |
| p.c. — భోజనమునకు తరువాత | p.r.n. — సమయోచితముగా |
| b.i.d. — దినమునకు రెండుసారులు | s.o.s. — అవసరమైనప్పుడు (ఒకసారి మాత్రమే) |
| t.i.d. — దినమునకు మూడుసారులు | |
| q.i.d. — దినమునకు నాలుగుసారులు | a.m.—ప్రొద్దున |
| q.—ఒక్కొక్క లేక ప్రతి | p.m.—సాయంకాలమున |
| h. or hor.—గంట | stat.—వెంటనే (తత్క్షణమే) |

పరిమాణము (మోతాదు)లకు చెందిన గుర్తులు

| | |
|---|---|
| aa.—ప్రతిదాని | gr.—గ్రయిను |
| ad lib.—ధారాళముగా | lb.—పౌండు |
| q.s.—చాలినంత | tsp.—టీస్పూను |
| ss.—ఒక సగము | tbs.—టేబిల్‌స్పూన్ |
| d.i.d.—భాగించిన మోతాదులు | gtt.—డ్రాప్ (చుక్క) |
| m.—మినిమ్-బొట్టు | cc.—క్యూబిక్ సెంటిమీటరు |
| dr.—డ్రామ్ ℨ | l.—లిటర్ |
| oz.—ఔన్సు ℥ | gm.—గ్రామ్ |
| pt. or o.—పైంటు | mgm.—మిల్లిగ్రామ్ |
| qt.—క్వార్టు | cgm —సెంటిగ్రామ్ |
| gal.—గ్యాలను | dgm.—డెసిగ్రామ్ |

మందుల రీతిని తెలియజేయు గుర్తులు

| | |
|---|---|
| aq.—నీళ్లు | syr.—సిరప్ |
| dest.—డిస్టిల్‌డ్ (ఆవిరిగా మార్చి చల్లార్చిన లేక బట్టీపెట్టిన నీళ్లు) | pil.—పిల్ (మాత్ర) |
| | pulv.—పౌడర్ (చూర్ణము) |
| comp.—కాంపౌండు | spt.—స్పిరిట్ |
| emp.—ప్లాస్టరు (పలాస్త్రీ) | tinct. or tr.—టింక్చర్ |
| ext.—ఎక్స్‌ట్రాక్టు (కషాయము) | ung.—ఆయింట్‌మెంట్ (అంజనము) |
| liq.—లిక్విడ్ (ద్రవము) | lot.—లోషన్ |
| mist.—మిక్స్‌చర్ | lin.—లినిమెంటు |
| ol.—ఆయిల్ (నూనె) | fl.—ఫ్లూయిడ్ (ద్రవము) |

మందులియ్యవలసిన పద్ధతులను తెలియజేయు గుర్తులు

div.—డివైడెడ్ (భాగించబడిన)
p.o.—నోటిద్వారా
p.r.—ఆసనముద్వారా
dil.—డైల్యూట్ (పలచనచేయుట)
hypo.—హైపొడెరమిక్
s. c.—సబ్‌క్యుటేనియస్‌లీ (చర్మముక్రింద)
i.m. — ఇంట్రమస్క్యులర్‌లీ (కండరములోనికి)
i.v.—ఇంట్రవీనస్‌లీ (నాళములలోనికి)

కొన్ని మందులయొక్క గుర్తులు

$H_2O$—నీళ్లు (వాటర్)
KI—పొటాసియం ఐయొడైడ్
$H_2O_2$—హైడ్రొజన్ పెరాక్సైడ్
$CHCl_3$—క్లొరొఫారం

ఇతర గుర్తులు

c̄—తో (చేర్చి)
s̄—చేర్చకుండ (మినహాయించి)
no.—నెంబర్
per —గుండ లేక మూలమున
℞—తీసికొనుము
e.g.—ఉదాహరణము
et —అండ్ (మరియు)
i.e.—అనగా

ఒక్కొక్క వైద్యశాలకు దాని స్వంతగుర్తులు కొన్ని యుండవచ్చును. మందులను క్లుప్తపరచి వ్రాయుటకును, రికార్డు చేయుటకును, చికిత్స చేయుటకును వీనిని ఉపయోగింతురు.

మందులయొక్క మోతాదులను (డోసులను) వ్రాయుచుండగా మొదట అరబి సంఖ్యలను, తరువాత రోమను సంఖ్యలను వ్రాయుట మామూలు. రోమను సంఖ్య I అను దానిని అజాగ్రత్తగా వ్రాయు సంఖ్యలతో కలిపి పొరపాటు చేయకుండ దానిమీద ఒక చుక్క వేయుదురు. క్రింద అరబి సంఖ్యలును, వానికి సరిపోయిన రోమను అంకెలును ఇయ్యబడియున్నవి.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అరబిసంఖ్య: | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| రోమనుసంఖ్య: | i | ii | iii | iv | v | vi | vii | viii | ix | x |
| అరబిసంఖ్య: | 20 | 30 | 40 | 50 | 60 | 70 | 80 | 90 | 100 | |
| రోమనుసంఖ్య: | XX | XXX | XL | L | LX | LXX | LXXX | XC | C | |



[1]తూనికలు, కొలతలు

రోగి పుచ్చుకొనుచున్న మందుయొక్క సరియైన మోతాదును తెలిసికొనుటకుగాను, ప్రమాణమైన కొన్ని తూనికలు అవసరమై యుండును. ఇయ్యవలసిన మోతాదుకంటె ఎక్కువ మందిచ్చుటవలన రోగియందు విషప్రయోగముయొక్క చిహ్నములు కనబడవచ్చును గాన, ముందుగనే దానిని తూచుట చాల ప్రాముఖ్యమైన సంగతి. మందులను తూచుటకు అనేక పద్ధతులుగలవు. ఇవి [2]అపాతకెరి, ఇంపీరియల్, మెట్రిక్, హౌస్‌హోల్డ్ అని పిలువబడుచున్నవి. అపాతకెరి, ఇంపీరియల్ అను రెండు పద్ధతులను జేర్చుటవలన హైందవ నర్సుకు ఒక సులభమైన ప్రమాణ మేర్పడగలదు. ఇట్లు చేయుటయే శ్రేష్ఠమని తోచుచున్నది.

అపాతకెరి, ఇంపీరియల్ పద్ధతుల సమ్మేళనము

| తూనికలు | కొలతలు |
|---|---|
| 60 గ్రెయినులు = 1 డ్రాము | 60 మినిమ్స్ = 1 డ్రాము |
| 8 డ్రాములు = 1 ఔన్సు | 8 డ్రాములు = 1 ఔన్సు |
| 16 ఔన్సులు = 1 పౌండు | 20 ఔన్సులు = 1 పైంటు |
| | 2 పైంట్లు = 1 క్వార్టు |
| | 4 క్వార్టులు = 1 గాలను |

మెట్రిక్ పద్ధతి

| తూనికలు | కొలతలు |
|---|---|
| 10 మిల్లిగ్రాములు = 1 సెంటిగ్రాము | 10 క్యూబిక్ సెంటిమీటరులు = 1 సెంటిలీటర్ |
| 10 సెంటిగ్రాములు = 1 డెసిగ్రాము | 10 సెంటిలీటర్స్ = 1 డెసిలీటర్ |
| 10 డెసిగ్రాములు = 1 గ్రాము | 10 డెసిలీటర్స్ = 1 లీటర్ |
| 10 గ్రాములు = 1 డెకగ్రాము | |
| 10 డెకగ్రాములు = 1 హెక్టొగ్రాము | |
| 10 హెక్టొగ్రాములు = 1 కిలోగ్రాము | |

[1] Weights and measures.
[2] Apothecary, Imperial, Metric, and Household.

హౌస్ హోల్డ్ (ఇంటి సంబంధమైన) కొలతలు

బలమైనమందు నుపయోగించునప్పుడు ఈ కొలత నుపయోగించ రాదు. [1]ప్రిస్క్రిప్షన్ (మందుచీటి) వ్రాయునప్పుడైనను ఇతరకొలతలకు బదులైనను వీనిని వ్రాయకూడదు.

60 చుక్కలు = 1 చిన్న గరిటె (టీస్పూన్)
2 టీ స్పూనులు = 1 డెజర్టుస్పూన్
2 డెజర్టుస్పూనులు = 1 పెద్దగరిటె (టేబిల్ స్పూన్)
4 టేబిల్ స్పూనులు = 1 వైయిన్ గ్లాసు
3 వైయిన్ గ్లాసులు = 2 డ్రింకింగ్ గ్లాసు (నీళ్లుతాగు గ్లాసుపాత్ర)

కొన్ని సారులు ఒకవిధమైన కొలతలనుండి యింకొకవిధమైన కొలతలకు మార్చుట అవసరమైయుండును. కావున పై మూడు పద్ధతుల పరస్పర సంబంధముగల కొలతలు క్రింద పేర్కొనబడినవి.

15 గ్రెయినులు = 1 గ్రాము
15 మినిములు = 1 క్యూబిక్ సెంటిమీటర్
1 డ్రాము = 4 గ్రాములు
1 డ్రాము = 4 క్యూబిక్ సెంటిమీటరులు = 1 టీ స్పూన్
1 ఔన్సు = 30 గ్రాములు
1 ఔన్సు = 30 క్యూబిక్ సెంటిమీటలు = 2 టేబిల్ స్పూనులు

ద్రావణములను, వాని మోతాదులను (డోసులను) సిద్ధముచేయుట

ఇంతకుముందే చెప్పినరీతిగా, మందుదినుసులను అనేకరీతులుగా సిద్ధము చేయవలసినప్పుడు, ఉపయోగించెడు మందుదినుసుయొక్క పరిమాణమును తప్పులేకుండ సరిగా కొలిచి తెలియజేయుట చాల ముఖ్యమైన సంగతి. ఉదాహరణముగా, ఐదు గ్రెయినుల సింకోన బిళ్లలనగా, ఐదు గ్రెయినుల సింకోనాను గొలిచి, మందుకానట్టి యితర బంక వస్తువుతో చేర్చి, దాని నొక బిళ్లగా ఒత్తియున్నారని యర్థమగును. సాధారణముగా ఒక నర్సు పెక్కురకములుగా ఒకమందును సిద్ధముచేయవలెనని కోరబడదు. కొన్నిమందులను ఫాక్టరీలలో సిద్ధముచేసి, బిళ్ల, మాత్ర లేక సొల్యూషనునందు ఎంతమందు కలిసియున్నదో సూచించుచు ఒక చీటీని

[1] Prescription.



అంటించుదురు. అనేక వైద్యశాలలలో చూర్ణములు, సొల్యూషనులు, మిక్స్చరులు మొదలగు వానిని మందులు సిద్ధముచేయు కంపౌండింగ్ రూములోనే సిద్ధముచేసి, వానిమీద సరియైన చీటీలనంటించి ఆస్పత్రి వార్డునకు పంపుదురు. కాని కొన్నిసారులు, సొల్యూషనులు సిద్ధము చేయుటకుగాని, ఒక సొల్యూషన్‌యొక్క బలమును తగ్గించుటకుగాని, ఒకమందును కొన్ని చిన్న చిన్న భాగములుగా చేసి ఉపయోగించవలెననిగాని వైద్యుడు కోరవచ్చును. కాబట్టి యీ మూడు పనులు చేయుటకును నర్సు నేర్చుకొనియుండవలెను.

సొల్యూషనులను సిద్ధముచేయుట

ఒక ద్రావణముయొక్క బలమును (ఘాటును) దెలుపుటకు మూడు పద్ధతులున్నవి. రేషియో (నిష్పత్తి)పద్ధతి సామాన్యమైనది. ఉదాహరణముగా, 20 కర్బాలిక్ ఆసిడ్‌లో 1 అనగా, సొల్యూషనులోని ప్రతి యిరువదవభాగములలో నొకభాగము స్వచ్ఛమైన కార్బాలిక్ ఆసిడ్ అనియు, మిగత పందొమ్మిది భాగములు నీళ్లనియు, అర్థమగును.

రెండవది [1]శాతము (పెరెసెంటేజి) పద్ధతి. ఉదాహరణముగా, 5% కార్బాలిక్ ఆసిడ్ సొల్యూషనందుము. పెరెసెంట్ (%) అనగా నూటిలో ఇన్నిపాళ్లు (శాతము) అని యర్థమగును. కావున 5% సొల్యూషన్ అనగా, ప్రతి నూటిలో ఐదుపాళ్లు స్వచ్ఛమైన కర్బాలిక్ ఆసిడ్ అనియు, మిగత తొంబదియైదు పాళ్లు నీళ్లనియు అర్థమగును.

మూడవపద్ధతి యేదనగా, ఇంత నీటిలోగాని, ఏదైన ఒక ద్రవములోగాని కలిసియున్న సొల్యూషన్ శక్తిని, అది కలుపబడియున్న పరిమాణమునుబట్టి చెప్పుట. దీనిప్రకారముగా, ఒక పైంటు కార్బాలిక్ ఆసిడ్ సొల్యూషన్‌లో 1 ఔన్సు స్వచ్ఛమైన కర్బాలిక్ ఆసిడ్ ఉన్నదని చెప్పవచ్చును. సాధారణముగా, నోటిద్వారాగాని, సూదిద్వారాగాని రోగికి మందిచ్చునపుడు దాని నిట్లు తెలియజేతురు. ఉదాహరణముగ క్వినైన్ సల్ఫేట్ సొల్యూషన్‌యొక్క చీటీమీద ఈ క్రిందివిధముగ వ్రాయవచ్చును:—grs. V = ʒi, దీని యర్థమేమనగా, ఒక్కొక్క డ్రాము సొల్యూషన్‌లో అయిదు గ్రెయినుల క్వినైన్ సల్ఫేట్ ఉన్నదని అర్థము.

[1] Percentage.

సొల్యూషనులు తయారు చేయునపుడుగాని లేక ఒక సొల్యూషన యొక్క బలమును (ఘాటును) మార్చునప్పుడుగాని ఒక క్యూబిక్ సెంటిమీటరు నీళ్లు మెట్రిక్ కొలత పద్ధతిప్రకారము ఒక గ్రాము బరువు తూగుననియు, ఇంపీరియల్, అపాతెకెరి కొలత పద్ధతిప్రకారము ఒక మినిమ్ నీళ్లు దాదాపు ఒక గ్రెయిను బరువు తూగుననియు నర్సు గ్రహించవలెను.[1]

సొల్యూషనులు కోరబడిన బలముగలవిగా వానిని లెక్క-చేయు పద్ధతికి ఉదాహరణముగా క్రింద కొన్ని సమస్య లియ్యబడియున్నవి.

1. [2]నిష్పత్తి పద్ధతి, ఇంపీరియల్ పద్ధతి

భగమునకు [3]లైసాల్‌డూషు నియ్యవలెనని వైద్యుడు ఉత్తరు వియ్యవచ్చును. డూష్‌కొరకు లైసాల్‌యొక్క సాధారణ ఘాటు 200 లో 1 పాలు. ఈ పనికి కావలసిన మొత్తము సొల్యూషన్ 1 క్వార్టు. దీనిని బట్టి ప్రతి 200 భాగములలో 1 భాగము స్వచ్ఛమైన లైసాలై యుండవలెను గాన $\frac{1}{200} \times 40$ ఔన్సులు (అనగా ఒక క్వార్టు)$=\frac{4}{20}$ లేక ఒక ఔన్సులో 1/5 వంతు.

ఒక ఔన్సులో 1/5 వంతు$=1/5 \times 8$ డ్రాములు లేక 1 3/5 డ్రాములు.

డ్రాములో $3/5=3/5 \times 60$ మినిములు$=36$ మినిములు.

ఈ లెక్క-ప్రకారము నర్సు 1 డ్రాము 36 మినిములు స్వచ్ఛమైన లైసాల్ కొలిచి, దానిని క్వార్టు కొలత గీతలుగల పాత్రలో పోసి, ఒక క్వార్టు సొల్యూషన్‌కు సరిపోవునంత నీళ్లను కలుపవలెను.

[1] 110 మినిములు లేక నీళ్లు వాస్తవముగ 100 గ్రెయినుల బరువు మాత్రమే తూగు కాని నర్సులు సాధారణముగ సొల్యూషనులలో నుపయోగించెడి ఘనపదార్థ సంబంధమైన మందులను తూచుటకు బదులుగా కొలిచెదరు. అప్పుడు 1 మినిమ్ = 1 గ్రెయిను అను స్కేలు నుపయోగింతురు. లోపలి కియ్యవలసిన ఏదైన ఒక బలమైన మందును సిద్ధము చేయవలసినప్పుడు, దానిని తూయవలెను. అప్పుడు $\frac{\%}{110} \times$ మొత్తము అను సిద్ధాంత ప్రకారము తూయవలెను.

[2] The ratio method, imperial system. [3] Lysol vaginal douche.



[1]శాతపద్ధతి, ఇంపీరియల్ పద్ధతి

అంటు వ్యాపించిన చేతికి తడికట్టు కట్టుటకుగాను 50% మహాగ్నీష గంధకితము (మగ్నీషియం సల్ఫేట్) సొల్యూషన్ కావలెనని వైద్యుని యుత్తరవైనయెడల, 50% సొల్యూషన్ అనగా, 100 భాగములలో 50 భాగములు మహాగ్నీష గంధకితము కలిసియుండవలెను. ఈ చికిత్స కొరకు 1 పైంటు సొల్యూషన్ అవసరమై యుండును. ఇప్పు డామె యిట్లు లెక్క-చేయును: $\frac{50}{100} \times 20$ ఔన్సులు (1 పైంటు)$=10$ ఔన్సులు.

కావున ఆమె 10 ఔన్సుల మహాగ్నీష గంధకితము పలుకులు తీసికొని వానిని 20 ఔన్సుల ఉడుకు నీటిలో కలుపును. ఆమె 10 ఔన్సులకు బదులుగా 20 ఔన్సుల నీటిలో నెందుకు కలుపుననగా, ఒక ద్రవమును ఇంకొక ద్రవముతో కలిపినప్పుడు దాని పరిమాణము విస్తరించినట్లు ఘనపదార్థమును నీటిలో కరిగించినప్పుడు దాని పరిమాణమును హెచ్చింపదు.

3. నిష్పత్తిపద్ధతి, మెట్రిక్ పద్ధతి

25 పాళ్లలో 1 పాలువంతున ½ లిట్టర్ బోరిక్ ఆసిడ్ సొల్యూషన్ సిద్ధముచేయుము. మొదటి యుదాహరణము ప్రకారము.—

$\frac{1}{25} \times 500$ CC. (½ లిట్టర్)$=20$ CC. లేక 20 గ్రాములు (gms.)

కాబట్టి 20 గ్రాముల (gms.) బోరిక్ ఆసిడ్ చూర్ణమును దీసికొని, దానిని 500 CC. నీటితో కలుపుము.

4. శాతపద్ధతి, మెట్రిక్ పద్ధతి

5% గ్లూకోస్ సొల్యూషన్ ఒక లిట్టర్‌గా సిద్ధముచేయుము. రెండవ ఉదాహరణము ప్రకారము:—

$\frac{5}{100} \times 1{,}000$ CC. (1 లిట్టర్)$=50$ CC.

కాబట్టి 50 CC. ల గ్లూకోసుతీసికొని 950 CC. ల నీటితో కలుపుము అనగా గ్లూకోసు ద్రవరూపముగా నుండినయెడల ఇట్లు కలుపుము. కాని గ్లూకోసు చూర్ణముగా నున్నట్లయిన, 50 గ్రాముల పొడి (చూర్ణము) తీసికొని, దానిని 1,000 CC. ల నీటిలో కలుపుము.

[1] The percentage method, imperial system.

ఏదైన ఒక ప్రమాణము బలముగల సొల్యూషనును, దానికంటె బలహీనమైన సొల్యూషనుగా మార్చుపద్ధతి:

1. నిష్పత్తి పద్ధతి

కార్బాలిక్ ఆసిడ్ స్టాక్‌సొల్యూషన్‌యొక్క బలము, 20 పాళ్లలో 1 పాలు. నర్సుకు 60 యింట 1 పాలు బలముగల $1\frac{1}{2}$ పైంటు సొల్యూషన్ కావలెను. ఒక సొల్యూషన్‌యొక్క బలమును నిష్పత్తిపద్ధతియందు తెలియజేసినప్పుడు, దీనిని చేయు సూత్ర్మపద్ధతి యేదనగా, కావలసిన బలమును నిలువయున్న స్టాక్ సొల్యూషన్ బలముతో భాగించి, కావలసిన సొల్యూషన్ మొత్తముతో గుణించుము. ఈ లెక్కలో స్టాక్ సొల్యూషన్ బలము 1: 20; కావలసిన బలము 1: 60. కావున $\frac{1}{60} \div \frac{1}{20} \times 30$ ఔన్సులు$= \frac{20}{60} \times 30$ ఔన్సులు ($1\frac{1}{2}$ పైంట్లు)$=10$ ఔన్సులు.

1: 20 బలముగల 10 ఔన్సుల సొల్యూషన్ తీసికొని, దానికి మిగత కొలత అనగా, 20 ఔన్సుల నీళ్లు కలిపినయెడల, 1: 60 బలముగల $1\frac{1}{2}$ పైంట్ల కార్బాలిక్ ఆసిడ్ సొల్యూషన్ నీకు లభించును.

2. శాతపద్ధతి

4% బోరిక్ ఆసిడ్ సొల్యూషన్ ఉన్నదనుకొనుము. బలమును శాతములో తెలిపినప్పుడు ఉపయోగించవలసిన సూత్ర్మపద్ధతి యేదనగా, కావలసిన బలమును మీదను, స్టాక్ సొల్యూషన్ బలమును క్రిందను వేసి, కోరబడిన మొత్తముతో గుణించుము. ఈ లెక్కయందు:

$\frac{2}{4} \times 40$ ఔన్సులు (1 క్వార్టు)$=20$ ఔన్సులు.

అనగా 4% బలముగల 20 ఔన్సుల సొల్యూషన్ తీసికొని, మిగత 20 ఔన్సుల నీళ్లు కలుపుము.

### మందు మోతాదులో కోరబడిన చిన్న భాగమును కనుగొనుట ([1]ఫ్రాక్షనల్ డోస్)

బుడ్డిలోగాని, గొట్టములోగాని యున్న మందుకొలతను ఒక చీటిలో వ్రాసి, పైన అంటించుదురు. ఇట్లు అంటించిన కొలతలో ఏదో ఒక

[1] Fractional dose.



భాగముమాత్రమే ఇయ్యమని సాధారణముగా వైద్యుడు నర్సుకు చెప్పవచ్చును. ఇట్లు వైద్యు డుత్తర్విచ్చిన మోతాదు ఒక బిళ్లలోగాని, మాత్రలోగాని, లేక కొన్ని డ్రాముల సొల్యూషన్‌లోగాని కలిసియున్న మందులో ఏదో ఒకభాగమై యుండవచ్చును. కోరబడిన భాగమును లెక్కించుటకు ఈ క్రింద కొన్ని యుదాహరణము లియ్యబడియున్నవి:—

1. ఒక బిడ్డకు 2 గ్రెయినుల క్వినైన్ సల్ఫేట్ ఇమ్మని వైద్యుడు ఆజ్ఞ యిచ్చును. దీని స్టాక్ సొల్యూషన్‌లో ప్రతి డ్రాముకు 5 గ్రెయినులు. ఇప్పుడు అనుసరించవలసిన నియమ మేదనగా.—నీవు కోరిన కొలతను మీదను, నీ యొద్దనున్న కొలతను క్రిందనువేసి, సొల్యూషన్ మొత్తముతో గుణించుము. ఈ లెక్కలో:—

$2/5 \times 60$ min. (1 dr.)$=24$ min. అనగా బిడ్డకు ఇయ్యవలసిన 2 గ్రెయినుల క్వినైన్ సొల్యూషన్ మొత్తము ఈ లెక్కవలన లభించును.

2. మార్ఫిన్ సల్‌ఫేట్ బిళ్లలు $\frac{1}{4}$ గ్రెయినులు బలముగలవి. దీనిలో నర్సు 1/12 గ్రెయిల మందు చర్మముక్రింద సూదితో నెక్కించవలెను. సూత్రముప్రకారము దీనిని చేయవలసిన దెట్లనగా:—

$$\frac{1/1_2 \text{ (కావలసిన కొలత)}}{1/4 \text{ (మనయొద్దనున్న కొలత)}} \times \text{సొల్యూషన్ మొత్తము}$$

$\frac{1/12}{1/4} = 1/12 \times 4/1 = 1/3$, అనగా, కావలసిన ఫ్రాక్షనల్ మోతాదు ఇదియే.

ఈ సందర్భములో తాను ఉపయోగించబోయెడు సొల్యూషన్ మొత్తమెంతో నర్సు ముందుగానే నిర్ణయించుకొనవలెను. ఎందుకనగా బిళ్ల పరిమాణమునుండి, కావలసిన సొల్యూషను చేయుటకు అవసరమైన మందు పరిమాణమును వేరుచేయవలెను. లెక్కను తేలికగా చేయగలుగునట్టి కొలతను గోరుకొనుట శ్రేయస్కరము. ఈ లెక్కలో 15 అను సంఖ్య మంచిది. దీనివలన $1/3 \times 15 = 5$ Minims (మినిమ్స్) అని సులభముగా లెక్క చేయవచ్చును.

దీని ప్రకారము $\frac{1}{4}$ గ్రెయిన్ బిళ్లను 15 Minims (మినిమ్స్) నీటిలో కరిగించి, దానిలో 5 Min. సొల్యూషను రోగికి వాడుము.

కొన్నిసార్లు కావలసిన మోతాదు ఒక బిళ్లలోనున్న కొలతకంటె ఎక్కువై యుండవచ్చును. అట్టిలెక్క నీ క్రిందివిధముగా చేయవలెను:—

మన యొద్దనున్న అట్రొపిన్ సల్ఫేట్ బిళ్లలు $\frac{1}{100}$ గ్రెయినులు పరిమాణముగలవి. వైద్యుడు ఆజ్ఞ యిచ్చిన ప్రమాణము

$$\frac{\frac{1}{50}\text{ (ఇది కావలసినది)}}{\frac{1}{100}\text{ (ఇది మన యొద్దనున్నది)}} = \frac{1}{50} \times \frac{100}{1} = 2.$$

అనగా, బిళ్లలోని ప్రమాణమునకు రెండింతలు లేక రెండు బిళ్లల ప్రమాణమును నీవు ఉపయోగించ గోరుచున్నావు. అట్లయిన దీనిని కావలసిన ప్రమాణముగల నీటిలో కరిగించి, ఉపయోగించుము.

కొందరు నర్సులకు ఈ లెక్కలు చేయుట కష్టముగా నుండును. మందును చిన్న మోతాదులుగా (ఫ్రాక్షనల్ డోసుగా) చేయు విషయములో నెట్టి సందేహము కలిగినను ఆమె ఎల్లప్పుడు పనిమీదనున్న సీనియర్ నర్సునుగాని, వైద్యునిగాని అడిగి రూఢిగా తెలిసికొనవలెను.

పిల్లలకు మందు ఇచ్చు విషయములో నర్సు మరియొక విధమైన లెక్కను జేయ నేరిగియుండవలెను. పెద్దలు భరించగలిగిన మందు మోతాదులను పిల్లలు భరించలేరు. పిల్లలకొరకు వైద్యుడు ఆజ్ఞయిచ్చిన మందుల ప్రమాణమును క్రింద ఇచ్చిన [1]యంగ్స్ రూల్ నుపయోగించి నిర్ణయించుట మామూలు

$$\frac{\text{వయస్సు (సంవత్సరములలో)}}{\text{వయస్సు} + 12} \times \text{పెద్దవారి ప్రమాణము} = \text{కావలసిన పిల్లల మోతాదు.}$$

ఉదాహరణము:

1. 2 సంవత్సరముల వయస్సుగల చిన్న బిడ్డకు ఇయ్యగల ఆముదము కొలత యెంత?

వయస్సు (సం॥లలో) = 2 సంవత్సరములు.

పెద్దవారి మందుకొలత (డోసు) 1 ఔన్సు లేక 8 డ్రాములు.

కావున $\frac{2}{2+12} \times 8$ డ్రాములు $= \frac{2}{14} \times 8$ డ్రాములు $= 1\frac{1}{7}$ dr. లేక దాదాపుగా 1 డ్రాము.

---

[1] Young's Rule.

2. 6 నెలల వయస్సుగల చంటిబిడ్డకు ఇయ్యగల [1]పొటాసియం బ్రొమైడ్ ప్రమాణము (డోసు) ఎంత?

వయస్సు (సం॥లలో) = $\frac{1}{2}$ సంవత్సరము.

పెద్దవారి ప్రమాణము 30 grs. (గ్రెయినులు.)

$$\frac{\frac{1}{2}}{\frac{1}{2}+12} \times 30\text{ grs.} = \frac{\frac{1}{2}}{\frac{25}{2}} = \frac{1}{2} \times \frac{2}{25} \times 30\text{ grs.} = 1\tfrac{1}{5}\text{ grs.}$$

[2]యంగ్స్ రూలునకు మూడు మినహాయింపు లున్నవి:

1. నల్లమందును ఏ రీతిగా వాడవలసినను, యంగ్స్ రూల్ ప్రయోగమువలన తేలిన కొలతలో సగము కొలతగల ప్రమాణమునే రోగికియ్యవలెను.
2. క్వినైన్ కొలతను మాత్రము హెచ్చించవలెను.
3. స్ట్రిక్నీన్ అను మందు నెన్నడును పిల్లలకు ఇయ్యకూడదు.

### [3]మందు నిచ్చుట

విద్యార్థిగానున్న నర్సుయొక్క బాధ్యతలలో మందు నిచ్చుట మిక్కిలి గొప్ప బాధ్యత. మందు లిచ్చునప్పుడు అవి త్వరగా, సరిగా శ్రేష్ఠమైన విధముగా ఫలితమిచ్చునట్లు వానిని నిర్దుష్టముగా నియ్యవలెను. ఈ ఫలితము కనబడుటకుగాను, మందు దినుసుయొక్క గుణము, ఈ గుణమును మార్చు పరిస్థితులు, మందు దినుసునలన కలుగగల ఫలితములు, ఇయ్యవలసిన మందుయొక్క మోతాదు, రోగికిగల రోగము, ఈ మందు నిచ్చుటకుగల కారణము, మితిమించిన మోతాదుగల మందు నిచ్చుటవలన కనబడగల లక్షణములు, మందుపట్ల రోగియొక్క తత్వము, మందు నియ్యవలసిన సరియైన కాలము—ఈ మొదలగు విషయములన్నియు నర్సు బాగుగా తెలిసికొని యుండవలెను.

### [4]మందుల బీరువా

వైద్యశాలలో నుపయోగించెడు మందుల నుంచుకొనుటకు ఒక ప్రత్యేకమైన బీరువా యుండవలెను. దీని తలుపులు ఎల్లవేళల తాళము వేసి యుంచవలెను. రోగులున్న గదిలోనే యీ మందుల బీరువా

---

[1] Potassium bromide. [2] Exceptions.
[3] The administration of medicine. [4] The Medicine cabinet.

యున్న యెడల, దానిగూర్చి మరి యెక్కువ జాగ్రత్తగ నుండవలెను. మందు లిచ్చుటయందు మంచినేర్పు పొందిన పెద్దనర్సులు తప్ప తక్కినవా రెవరును మందుల బీరువా దగ్గరకైనను పోగూడదు.

ఈ బీరువాలోని మందులను వరుసగాను, క్రమముగాను ఏర్పరచి పెట్టవలెను. పాషాణౌషధములను (అనగా విషములను), అన్నిటికంటె పై అరమీద ప్రత్యేకముగాపెట్టి "Poison" (విషము) అను గుర్తుగల చీటి నంటించవలెను. వెలుపల పూయుటకు వినియోగించెడు మందులన్నిటిని ప్రత్యేకమైన అరమీద పెట్టవలెను. కావలసిన మందును సులభముగా కనుగొనగలుగుటకు ద్రవరూపమైన మందులను ఘనరూపమైన మందులను ప్రత్యేకించి పెట్టుటమేలు. ఒక్కొక్క అరమీది మందులను వాని [1]అకారాది పేరులనుబట్టి వరుసగా పెట్టుట మంచిది. క్రిమికల్కములు ([2]వాక్సీన్సు), సీర మొదలగు కొన్ని మందులను మంచుపెట్టెవంటి చల్లని చోట్ల పెట్టవలెను. సూదిమందు నెక్కించుటకు (ఇన్‌జెక్షన్ చేయుటకు) అవసరమైన మందులను ఒక ట్రేమీద వరుసగా పెట్టవలెను. వానితో కూడ సూదిమందును సిద్ధము చేయుటకు కావలసిన యితర వస్తువులను గూడ సిద్ధముగా నుంచవలెను.

మందున్న ప్రతిబుడ్డి లేక పాత్రమీద మందుయొక్క పేరును వ్రాయ వలెను. ఒక బిళ్ల, మాత్ర, చూర్ణమునందున్న మందు మోతాదును, సొల్యూషనులోని ఒక్కొక్క డ్రాము మందును వివరముగా వ్రాసియుంచ వలెను.

పైన అంటించెడు చీటీలు శుభ్రముగా నుండవలెను. అవి మైల పడినవెంటనే వానిని మార్చి క్రొత్తవాని నంటించవలెను. బుడ్లను శుభ్రముగా తుడిచి, వానికి నిండుగా మందుపోసి, బిరడాలు సరిగా బిగించి మూయవలెను. ఒక బుడ్డిలోని మందు రంగుగాని, స్థితిగాని మారినట్లుండిన యెడలను, మరి యేవిధముగానైనను అది చెడినట్లు కన బడినయెడలను దానిని పారవేసి, దానికి బదులు వేరేమందు తెప్పించవలెను. ఏదైన ఒక మందును ప్రత్యేకముగా వాడుటకు కోరి తెప్పించినయెడల, దానిని వాడుట ముగియగనే, దానిని మరల మందులున్న (స్టాక్) గదికి పంపించి వేయవలెను.

[1] Alphabetically. [2] Vaccines and sera.



బీరువా అరలు, మందుగ్లాసులు, ట్రేలు, కొలతగ్లాసులు—వీని నన్నిటిని బహు శుభ్రముగా పెట్టవలెను.

[1]ప్రమాణము (డోసేజ్)

రోగికి ఒకసారి యిచ్చెడు మందు ప్రమాణమును ఒక డోసు అందురు. ఒక చేంటిబిడ్డయందు ఫలితము కనబడుటకుగాను ఒకసారి ఇచ్చెడు మందు ప్రమాణమును లేక కొలతను [2]అథమపక్షము డోసు అనవచ్చును. దేహమునకు హానికలుగకుండ ఒకసారి యిచ్చెడు అధిక ప్రమాణము గలిగిన మందునకు [3]అధికపక్షపు ప్రమాణము (డోసు) అనిపేరు. ఈ యధిక పక్షముకంటె ఎక్కువమందు నిచ్చినట్లయిన దానిని [4]ఓవర్ డోసు అందురు. దీనివలన విషఫలితములు కలుగవచ్చును.

రోగికిచ్చెడు మందు దినుసులయొక్క ప్రమాణమును (డోసును) నిర్ధారణ చేయుటకు అనేక విషయములు గమనించవలెను. కొన్ని యేవనగా:—

1. పరిమాణము: చిన్నవారికంటె పెద్దవారు ఎక్కువ డోసుమందు పుచ్చుకొనగలరు.

2. వయస్సు: యౌవనులైన పెద్దవారికంటె చిన్న పిల్లలకును ముసలి వారికిని తక్కువ డోసులమందు నియ్యవలెను. (262-వ పుటలోని యంగ్స్ రూల్ చూడుము.)

3. స్త్రీ పురుష భేదము: స్త్రీలకంటె పురుషులకు ఎక్కువ డోసు మందు అవసరమై యుండును.

4. అలవాటు: [5]భేదిమందులు, [6]బాధనాశకములు, [7]నిద్రాజనకములు మున్నగు మందులను పుచ్చుకొనుటకు అలవాటు పడినవారికి, ఈ మందులు అలవాటు లేనివారికంటె ఎక్కువ డోసులమందు కావలెను.

5. సున్నితత్వము; అసాధారణ స్వభావము: కొందరు బెల్లడోనా, ఐడైడ్స్, ఆస్పరిన్ మొదలగు మందుల నిచ్చినప్పుడు చాల బాధపడుదురు. అనగా, ఈ మందులువారి తత్వమునకు సరిపడలేదని గ్రహించవలెను. వీరికి మందులు వ్రాయునప్పుడు అధిక జాగ్రత్తగలిగి, ఆలోచనతో వ్రాయవలెను.

[1] Dosage. [2] Minimum dose. [3] Maximum dose. [4] Overdose. [5] Cathartics. [6] Analgesios. [7] Narcotics.

6. రోగియొక్క స్థితి: చాల బలహీనముగానున్న రోగి, ఆరోగ్యముగానున్న మనిషివలె ఎక్కువమందు త్రాగి తట్టుకోనలేడు.

7. మందును ప్రయోగించగల మార్గములు: రక్తప్రసరణ మండలములోనికి తిన్నగా ఇచ్చిన మందులు త్వరితముగను, ఫలప్రదముగను పని చేయును. కావున ఇట్లు ఈ మార్గమున నిచ్చుమందు నోటితో త్రాగించు మందు ప్రమాణములో సగము మాత్రమై యుండును. ఆసనముద్వారా యెక్కించిన మందులు త్వరగా పనిచేయుననిగాని, ఎక్కించిన మందంతయు దేహములో ఇముడుననిగాని చెప్ప వీలులేదు. కావున ఈ మార్గమున నిచ్చుమందు నోటిద్వారా యిచ్చు ప్రమాణమునకు రెండింత లుండును.

సాధారణ ఫలితములు, స్థానిక ఫలితములు గలుగుటకు మందు లియ్యబడును. అవి యియ్యబడు మార్గములు క్రింద పేర్కొనబడినవి:—

1. సాధారణ ఫలితము లిచ్చుటకు మందు లెక్కించెడు మార్గము లెవ్వియనగా:—

a. [1]అన్నవాహికముద్వారా.

(1) నోటిద్వారా.

(2) ఆసనముద్వారా.

b. రక్తప్రసరణ మండలములోనికి ఎక్కించెడు మార్గములు.

(1) చర్మము క్రిందుగను.

(2) కండరములలోనికి.

(3) రక్తనాళములలోనికి.

(4) [2]ఆంత్రవేష్టనములోనికి.

(5) [3]వెన్నుపూసలోనికి.

c. చర్మమునకు తైలములను ప్రయోగించెదరు.

d. శ్వాసము:—ఊపిరి పీల్చుకొనుటద్వారా.

2. స్థానిక ఫలితము నిచ్చుటకు ఈ క్రిందివిధమును ప్రయోగింతురు.

a. [4]ఊపిరిలోనికి పీల్చుకొనుట.

b. [5]తైలమును మర్దనచేయుట.

c. సప్పొజిటరీలద్వారా.

[1] Alimentary canal. [2] Intraperitoneally. [3] Intraspinally.
[4] Inhalations. [5] Liniments.

[1]ద్రవమును పాతించి కడుగుట (పరిషేకము) ద్వారా.

[2]లేపనము (పూతపూయుట) ద్వారా.

సాధారణముగా సామాన్య చికిత్సలకు ఉపయోగించెడు పద్ధతి, నోటిద్వారాను, ఆహార గొట్టము (అన్నవాహికము) ద్వారాను మందు నిచ్చుటయే. ఈ పనికిగాను నర్సునొద్ద ఐదు మినిములనుండి ఒక ఔన్సు వరకు ఔషధమును గొలిచెడు కొలత గ్లాసుండవలెను. ఇట్లు కొలిచిన మందును మరియొక గ్లాసులో పోసి రోగియొద్దకు గొనిపోవుట శ్రేష్ఠమైన పని. అప్పుడు కొలతగ్లాసు, అంటుపడకుండ శుభ్రముగా నుండగలదు. చాలమంది రోగులకు ఒకేసారి మందు నియ్యవలసినప్పుడు, ఒక్కొక్కరి మందు నొక్కొక్క గ్లాసులోపోసి, ఆ గ్లాసులను ట్రేలో వరుసగా పెట్టుకొననలెను. ఆ గ్లాసుక్రింద, ఆ రోగిపేరు, పడక సంఖ్య, ఒక చీటీమీద వ్రాసియుంచి తీసికొనిపోయి మందులియ్యవలెను. ఈ పద్ధతి అనుకూలమైనదేగాక, చాల సమయముకూడ నష్టము కాకయుండును. [3]మెడిసిన్ డ్రాపర్—అనగా మందును చుకలు చుక్కలుగా కొలిచి విడుచుటకు ఒక గొట్టము చాల ఉపయోగముగా నుండును. కాని చుకల లెక్క ప్రకారము కాకుండ, మినిముల లెక్క ప్రకారము ఇయ్యవలెనని వైద్యుని యుత్తరువై యుండినయెడల, మినిమ్ గ్లాసుకుబదులు మెడిసిన్ డ్రాపరు నెన్నడును ఉపయోగించ కూడదు. మెడిసిన్ డ్రాపరు సరియైన కొలత గొట్టముకాదు. [4]మందును గలిపెడు పుల్ల, నీటిపాత్ర, గ్లాసులను గడుగుటకు ఒక గిన్నె లేక పాత్రనిండ నీళ్లు, పాత్రలను దుడుచుటకుగాను ఏదైన పాతగుడ్డ, లేక మెత్తని చేదరమైన కాగితములు—ఇవన్నియు ఈ పనికి చాల అవసరమైన పరికరములు. రోగుల కియ్యవలసిన మందులపట్టీని తప్పులేకుండగను, స్పష్టముగను వ్రాసి, దగ్గరనే పెట్టుకొనవలెను.

నోటిద్వారా మందునిచ్చునప్పుడు నర్సు గమనించవలసిన నియమములు పెక్కు గలవు. అవేవనగా:—

1. అవసరమైన వస్తువులన్ని యుండునట్లు చూడుము.

2. నీవు చేయుచున్నపనిని ఏకదీక్షగ గమనించుము. ఎవరితోనైనను మాట్లాడకుము.

[1] Irrigations. [2] Painting. [3] Medicine dropper. [4] A stirring rod.

3. వైద్యుని యుత్తరువును రెండుసార్లు చదువుము. అనగా మందును కొలతగ్లాసులో పోయకముందును, పోసిన వెనుకను తిరిగి చూడవలెను.

4. బుడ్డిమీది చీటీని మూడుసార్లు చదువుము. బుడ్డిని తీసికొన్నప్పుడు, కొలతగ్లాసులో పోయకముందు, తిరిగి బుడ్డిని దానిస్థానములో పెట్టునప్పుడును చూడవలెను.

5. [1]మిశ్రమమందులను సొల్యూషనులను పోయకముందు ఎల్లప్పుడు బుడ్డిని బాగుగా కుదిలించుము.

6. మందు పోయుచుండగా, బుడ్డికి అంటించిన చీటీ మైలకాకుండ, దానిని పైకి త్రిప్పి బుడ్డిని చేతితో పట్టుకొనుము. పని ముగిసినతరువాత బుడ్డిమూతిని తుడిచి, బిరడా పెట్టి, దానిస్థానములో నుంచవలెను.

7. చదువునప్పుడు కొలతగ్లాసును నీ కంటిమట్టమునకు సమముగ పట్టుకొనుము.

8. ఎల్లప్పుడు వైద్యుని యుత్తరువుప్రకారము మందును సరిగ నియ్యవలెను. మినిములని ఉత్తరువైనప్పుడు మినిములనే వాడుముగాని, చుక్కలు వాడకూడదు. డ్రాములని ఉత్తరువైనప్పుడు, డ్రాములేకాని టీస్పూనులు కాదు.

9. ఎల్లప్పుడు నియమితవేళకు మందిమ్ము. దినమునకు మూడుసారులు (t.i.d.) లేక నాలుగుసారులు (q.i.d.) ఇయ్యవలెనని ఉత్తరువుచేసిన మందును తగిన వ్యవధివిడిచి, క్రమముగా వేళ కియ్యవలెను. అనగా 8—12—4 లేక 9—1—5—9 గంటల కియ్యవలెనేకాని, 8—10—6 లేక 9—12—3—6 గంటల కియ్యకూడదు. భోజనమునకు తరువాతను (p.c.) భోజనమునకు ముందును (a.c.) ఇయ్యవలెనని వైద్యుడు ఉత్తరువుచేసిన మందులను భోజనమునకు ముందును, వెనుకను ఒక అరగంటలోపుగా నియ్యవలెను. రోగికి ఒకటికంటె నెక్కువమందు లిచ్చునప్పుడు వానిని ఒకేసారి పోయవచ్చునో లేదో వైద్యునడిగి కనుగొనుము. ఎందుకనగా కొన్నిమందులు ఒకదానితో నొకటి సరిపడవు.

10. నీకు సందేహముగానున్న మందులనుగాని, ఊరుపేరులేని బుడ్డిలోని మందునుగాని యెన్నడును ఉపయోగించకుము.

11. ఎన్నడును చీకటిలో మందు సిద్ధముచేసి యియ్యకుము.

1 Mixtures.



12. మందును సిద్ధముచేయు నర్సు, దానిని సిద్ధముచేసినవెంటనే రోగి కియ్యవలెను. రోగి దానిని త్రాగునో లేదో యని దగ్గర నిలుచుండి చూడవలెను. రోగి దానిని త్రాగనొల్లక పోయినయెడల, ఆ సంగతి చార్జి నర్సునకుగాని వైద్యునికిగాని తెలియజేసి చార్టుమీద వ్రాయుము.

13. ఒక రోగి కియ్యవలసిన మందును మరియొక రోగిద్వారా పంపించకూడదు.

14. మందులను ఇచ్చిన తరువాతనే వానిని వ్రాసిపెట్టుము. ముందుగా ఎన్నడును వ్రాయకుము.

15 పరికరములన్ని శుభ్రముగను, వరుసక్రమము ననుసరించియు నుండునట్లు చూడుము.

వెవ్వేరుమందుల నిచ్చుటకు క్రింద కొన్ని సలహాలియ్యబడినవి:—

ఇనుము కలిపిన మిశ్రమమందు (ఐరన్ మిక్స్చర్), ఆసిడ్స్ (అమ్లములు) మొదలగు కొన్ని మందులను గొట్టముగుండ ఇయ్యవలెను. లేదా పండ్లకు తగలకుండ మ్రింగునట్లుచేయుము. ఎందుకనగా, అట్టి మందు పండ్లు కరగట్టునట్లుచేయును.

రోగికి అసహ్యముగానుండు మందులను ఫలముల రసము, చన్నీరు, మంచు, చెక్కెర, తేనె మొదలగు వస్తువులతో చేర్చి యియ్యవచ్చును.

ఇట్లు అసహ్యమైన మందులను చిన్న చిన్న ప్రమాణములుగా కాప్సుల్స్ అను గొట్టములయందు నింపియిచ్చెదరు. సాధారణముగా చూర్ణములుగానున్న మందులను పుచ్చుకొనుటయే కష్టము. వానిని నీరు, సిరప్—వీనిలో రోగికేది యిష్టమో దానిలో కలిపి యియ్యవచ్చును. [1]మూత్రమును వృద్ధిచేయుట కిచ్చెడిమందులను, దగ్గుమందులను (దగ్గుకొరకైన సిరపులను తప్ప) [2]చెమట హెచ్చుగా పట్టుట కిచ్చెడు మందులను 6—8 ఔన్సుల నీటితో కలిపి యిచ్చినయెడల అధిక ఫలితము కనబడును. స్మారకము తప్పిన రోగికి ఎన్నడును నోటిద్వారా మందు నియ్యరాదు. కాని [3]స్టమక్ ట్యూబ్ లేక నేసల్ ట్యూబ్ వాడవచ్చును. ఎందుకనగా అట్టి రోగులకు సాధారణముగా మ్రింగుటకు శక్తి తగ్గిపోవును.

చిన్నపిల్లలకు మందునిచ్చుట చాల కష్టమైన పని. బిడ్డకు మందును త్రాగించునప్పుడు, వాని ముక్కుమూసి బలవంతముగా మందును మ్రింగిం

1 Diuretics. 2 Diaphoretics. 3 Stomach or nasal tube.

చుటవలన మందును లోపలికి పీల్చుకొనవచ్చును. అందువలన నది చాల అపాయకరమైన సంగతిగా నెంచబడుచున్నది. మందు మ్రింగువిషయములో బిడ్డ తోడ్పడనియెడల, ఒక చిన్న గరిటెను నోటివెనుకకు పోనిచ్చి యుంచినయెడల, ఈ పని జరుగుటకు వీలగును. బిడ్డ బలహీనముగా గాని, సగము తెలివిమాత్రమే గలిగియున్నప్పుడుగాని, వాని నాలుక చివరన కొన్ని మందుచుక్కలుమాత్రము వేయుము. తక్కిన మందియ్యక ముందు మొదటిది మ్రింగెనని నిశ్చయముగా తెలిసికొనుము. మందు నిచ్చినప్పుడు బిడ్డయొక్క తలను కొంచెము ఎత్తియుంచవలెను.

[1]నిలిచియుండగల ఎనీమాలను మూలముగను సప్పొజిటరీల మూలముగను పురీషనాళముద్వారా, రోగికి మందులిచ్చెదరు. ఇట్లు నిలిచియుండు ఎనీమా, సప్పొజిటరీని యిచ్చెడు పద్ధతి, 7-వ అధ్యాయములో వివరించబడినవి.

రక్తప్రసరణమండలము మూలముగా మందుల నెక్కించెడు పద్ధతులు, శస్త్రవిధానములైయున్నవి. అవి 10-వ అధ్యాయములో వివరించబడియున్నవి.

[2]పాదరసపు టంజనమువంటి కొన్ని మందులు, అంజనము చర్మముమీద రుద్దినంతమాత్రమున లోపలికి ఇనికిపోవును. మందు పూయవలసిన భాగమును బాగుగా శుభ్రముచేసి, యెండనియ్యవలెను. నర్సు తన చేతికి రబ్బరుగ్లౌ తగిలించుకొని 15-20 నిమిషములు అంజనమును బాగుగ ఆ భాగమున రుద్దవలెను. ఇదే ప్రాంతములో వెంటనే రెండవసారి మందు రుద్దకూడదు.

కొన్ని మందులను లోపలికి పీల్చుకొనజేయుటమూలమున ప్రయోగించవచ్చును. మత్తుకలిగించెడు మందులనుగూర్చి 37-వ అధ్యాయములో ప్రస్తాపించబడినది. [3]అరొమాటిక్ స్పిరిట్స్ ఆఫ్ అమ్మోనియవంటి కొన్ని చురుకు కలిగించెడు మందులను కొంచెము దూది లేక గాజ్ గుడ్డమీద పోసి, ముక్కుదగ్గర పట్టుకొనవచ్చును. [4]ఉబ్బసముకొరకు వాడెడు స్ట్రమోనియం అను మందును బొగ్గులవలన కలిగించిన నిప్పులమీదపెట్టి వేడిచేయవచ్చును. [5]ఎమిల్ నైట్రేట్ వంటి మందులను సిద్ధము

[1] Retention enemas and suppositories. [2] Mercurial ointment.
[3] Aromatic spirits of ammonia. [4] Asthma. [5] Amyl nitrate.



దీని నిచ్చెడివిధములు. (*a*) స్వచ్ఛమైనదిగాను, కల్తీలేనిదిగాను (*b*) మంచువలన చల్లగచేసియు (*c*) ఎమల్షనుగాచేసియు దీని నియ్యవచ్చును.

(2) కాలొమెల్ (హైడ్రర్గిరి సబ్ క్లోరిడం) డోసు, ½–3 gr. p.o.

ఇది పాదరసముతో కలిపిచేసిన కాంపౌండు మందు. ఇది విరేచనములు కలుగజేసి, పిత్తము హెచ్చుగా స్రవించునట్లుచేయును. దీనిని కొన్నిసారులు చిన్న డోసులుగా విభాగించి యిచ్చెదరు. దీనివెంటనే భేదికి యుప్పునియ్యవలెను. అప్పుడు మందులోని పాదరసము శరీరములో ఇంకకుండ బహిష్కరించబడును. దీనిని సోడియం బైకార్బొనేట్ తోచేర్చి యిచ్చినట్లైన, దీనివలని బాధ కొంత తగ్గును.

(3) ఇతర సాధారణౌషధము లేవనగా:—[1]రుబార్బ్, [2]సెన్న, [3]లికొరిస్ అనునవి.

*c.* సేలైన్ (ఉప్పు) విరేచనపుమందులు (హైడ్రొగాగ్స్): ఇవి టిష్యూలనుండి ద్రవమును (నీరును) లాగి, నీళ్ల విరేచనమగునట్లు చేయును.

(1) ఎప్సంసాల్ట్స్ (భేదియుప్పు) లేక మెగ్నీషియం సల్ఫేట్. డోసు, 30-240 gr.

ఇది దానికి సమానమైన నీటిలో కరుగును. కావున బాగుగ [4]సాచురేటెడ్ సొల్యూషను ఏర్పడును. సాధారణముగా ఇది త్వరగా పనిచేయును. 1—3 గంటలలో ఫలితము కనబడును. ఉప్పుతో చేర్చి యెంత ఎక్కువ నీరు పుచ్చుకొందురో అంత త్వరగా పనిజరిగి, భేదియగును.

మలబద్ధకము, గుండె, మూత్రపిండముల వాపునకు దీనిని ప్రయోగించెదరు. పురుగులను బయటవేయుటకు ఇచ్చెడు మందుల తరువాతను దీనిని ప్ర[illegible]. దీనిని కండరములలోనికి (i.m.) ఎక్కించినప్పుడు బాధను [illegible] ఎక్కించినను, లేక నోటితో త్రాగించినను (i.[illegible] లేక [5]ఒత్తిడిని తగ్గించును. కాని యిది చిన్నపిల్లలను, చాల [illegible] వారిని బలహీనపడజేయును.

[1] Rhubarb. [2] Senna. [3] Licorice. [4] Saturated solution.
[5] High blood pressure.

కావున దీనిని మలబద్ధమునకు క్రమముగా నియ్యరాదు. లేక [1]సల్ఫోనమైడ్ మందులతోనైనను దీనిని గలిపి యియ్యరాదు.

(2) సోడియం సల్ఫేట్ డోసు, 30–240 gr. p.o.

2. [2]అంతెల్మింటిక్స్.

ఈ మందులు ప్రేగులలోని పురుగులను జంపి, వానిని బయటికి త్రోసివేయును. ఇవి రోగియందు అతిబలమైన విషవస్తువులుగా పని చేయునుగాన, వానిని చాల జాగ్రత్తగానిచ్చి, వాని తరువాత కతార్టిక్స్ అను విరేచనపు మందుల నియ్యవలెను. పై మందునిచ్చిన దినముననే రోగి ప్రేగులు బాగుగా కదిలి విరేచనము కావలెను. లేనియెడల, ఈ మందు ఒంటిలో ఇంకినందున విషప్రయోగము కావచ్చును. ఈ యాపదను దొలగించుటకే విరేచనపు మందు నియ్యవలెను. ఏదైన ఒక కారణముచేత రోగిగుండె బలహీనముగానున్నట్టు, దాని వేగముగల నాడిచేతగాని, శబ్దముచేతగాని తెలిసికొనినప్పుడును, లేక జ్వరమునుబట్టి రోగి గుండె యెక్కువ పనిచేత శ్రమపడుచున్నప్పుడును రోగికి పురుగుల మందు ఇయ్యకూడదు. ప్రేగులలో శేషించియుండు మందును బయటికి తీసి వేయుటకు సాయంకాలమున ఒకసారి యెనెమ నియ్యవచ్చును.

ప్రేగు కదిలి విరేచనమగువరకు భోజనము పెట్టకూడదు.

(*a*) ఏటికపాములకు మందులు.

(1) [3]హెక్సిల్‌రిసార్సినల్ క్రిస్టల్స్ (ఇవి క్యాప్‌సుల్స్‌లో నుండును.) డోసు, 15 gr. ఇది పెద్దవారి కియ్యవలసిన అధికపక్షము మోతాదు.

(2) [4]సాంటొనిన్. డోసు 1–3 gr. దీనినియ్యక పూర్వమును, ఇచ్చిన పిమ్మటను ప్రేగులు బాగుగా శుభ్రమగునట్టు విరేచనమున కియ్యవలెను. ఈ మందు నియ్యకముందు రెండు గంటలును, ఇచ్చిన తరువాత రెండు గంటలవరకును రోగి యేమియు భుజించకూడదు.

ఓవర్‌డోసుయొక్క చిహ్నములు [illegible] వచ్చగానుండుట డోకు, వమనము, కండరములు [illegible], కలవరింతలు, కొలాప్స్. దీనికి చేయదగిన చికిత్స—ఆహారకోశమును గడుగుట, వాంతి

[1] Sulphonamide. [2] Anthelmintics. [3] Hexylresorcinal crystals.
[4] Santonin. [5] Yellow vision.



చేయించు మందులనిచ్చుట, విరేచనమునకు నిచ్చుట. ఈడ్పు రోగము వచ్చినయెడల క్లోరోఫార్మ్, ఈతర్ అను మందులను, గుండెకు బలము కలుగజేసెడు టానికులు, చురుకుకలుగజేయు మందులు నిచ్చుట.

(3) [1]చెనొపోడియం నూనె. డోసు 3–15 m. దీనిని ఏటికపాములు, కొంకిపురుగులు, నులిపురుగులు, నట్టలకు ప్రయోగించెదరు. దీనిని భేదియుప్పుతో కలిపి యియ్యవచ్చును. లేక రెండుడోసుల మందును క్యాప్‌సుల్సులో నింపి, ఒకటి యిచ్చిన గంటసేపటికి మరియొక మోతాదు ఇయ్యవచ్చును. కాని యట్లు ఇచ్చినయెడల, దీనికి ముందును వెనుకను భేదియుప్పును ద్రాగించవలెను. ఈ మందునియ్యక పూర్వము నాలుగు గంటలు రోగి యేమియు భుజించకూడదు.

దీని ఓవర్‌డోసుయొక్క చిహ్నము లేవనగా:—నిద్రమత్తు, అధిక దాహము, కడుపులో అధికనొప్పి, రోగి క్రుంగిపోవుట, ఈడ్పులు, పక్షవాతము. లక్షణములనుబట్టి చికిత్స చేయవలెను; ఎనెమల నియ్యవలెను.

(*b*) కొంకిపురుగులకు మందులు.

(1) చెనొపోడియం నూనె.

(2) [2]కార్బన్ టెట్రక్లోరైడ్. డోసు 30—60 m. దీనిని కరిగిపోవునటువంటి గొట్టముల (క్యాప్‌సుల్సు)లో పెట్టియిచ్చి, దీని తరువాత మగ్నీషియం సల్ఫేటు నిచ్చెదరు. [3]పిండిపదార్థముగల భోజనము కడుపునిండ తినిన తరువాత ఈ మందు నియ్యవలెను.

(3) హెక్సిల్‌రిసార్సినల్.—దీనిని ఏటికపాములకు ఇచ్చునట్లే యిచ్చెదరు.

కార్బన్ టెట్రక్లోరైడ్, చెనొపోడియం నూనె—ఇవి రెండు బిడ్డలకును, ఆల్కొహాలు త్రాగువారికిని, కాలేయమందు జబ్బుగలవారికిని యిచ్చినయెడల అపాయము కలుగవచ్చును.

(*c*) నట్టలకు మందు.

(1) [4]ఫిలిక్స్ మాస్ (మేల్ ఫెర్న్) డోసు, 60—180 gr. p. o. ఈ మందును ప్రయోగించకముందు రెండుదినములు రోగిని

[1] Oil of chenopodium. [2] Carbon tetrachloride. [3] Carbohydrate meal.
[4] Filix mas.

ఉపవాసముంచి, భేదిమందునిచ్చి ప్రేగులు శుభ్రము చేసినవెనుక ఆస్పిడియం ఫిలిక్స్‌మాస్ అను మందు నియ్యవలెను.

(2) [1]పెపో: లేక గుమ్మడి విత్తనములు. సాధారణ గుమ్మడి కాయయందలి బాగుగా పండిన విత్తనములు. ఇవి నట్టలకు ఇచ్చెడు మంచి మందు. ఈ మందు ఇచ్చెడు దినమునకు ముందటిదినము రోగి ఉపవాసముండవలెను. మందు పుచ్చుకొనవలసిన దినమున తాజా గుమ్మడిపండునుండి తీసిన ¼ ఔన్సుల విత్తనములను బాగుగా పొడిచేసి, తేనెలో లేక చెక్కెరనీటిలో బాగుగాకలిపి, రంగరించి, తెల్లవారుజాముననే యియ్యవలయును. దీని తరువాత విరేచనమునకు మందు నియ్యవలెను.

(3) కార్బన్ టెట్రక్లోరైడ్.—దీనిని కొంకిపురుగుల కిచ్చినట్లే యియ్యవలెను.

(*d*) [2]నులిపురుగులకు మందు.

(1) [3]క్వాష్యా: పురీషనాళమును ఖాళీచేసి, 5—10% మందు నుపయోగించి, యీ మందుతో రోగి పురీషనాళమును గడుగవలెను. ఇది నులిపురుగులకు శ్రేష్ఠమైన మందు. 15—30 నిమిషములు కడుపులో నిలిచియుండు ఎనెమగాగూడ దీని నియ్యవచ్చును. దీనిని సరిసమానమైన నీటితో కషాయమువలె తయారు చేయుదురు.

(2) [4]పటిక ½—1% సొల్యూషన్‌గా సిద్ధముచేసి యెనెమగా నియ్యవలెను. (10 gr.—1 oz.)

(3) వేపాకు కషాయమును ఎనెమగా నిచ్చెదరు.

3. [5]అస్ట్రింజెంట్లు (ఒగరు మందులు.)

ఇవి రక్తకణములు టిష్యూలు ముడుచుకొనునట్లు చేయు మందులు. లోహములు, ఉద్భిజ్జములు (చెట్లు మొదలైనవి)—వీనినుండి తయారుచేసిన మందులును అస్ట్రింజెంటు మందులరకములో చేరియున్నవి. వీనిని (1) పుండ్లమీదను, గాయములమీదను వేసినప్పుడు పేరుకొనిన గ్రుడ్డులోని సొన (ఆల్బ్యుమెన్) పూతవలె ఏర్పడును. ఇవి [6]కణములను గాయపడకుండ కాపాడి, గాయములు మాన్పుటకు తోడ్పడును. (2) రక్తము

[1] Pepo. [2] Pinworms or threadworms. [3] Quassia. [4] Alum. [5] Astringents. [6] Cells.



కారుచున్నచోట ఈ మందులను ప్రయోగించినప్పుడు, రక్తధార కట్టునట్లు చేయును. (3) అమత్వచయను పొరకు ప్రయోగించినప్పుడు, పొరలు ముడుచుకొని, వానియందలి స్రావములు ఆపబడును.

*a.* [1]బిస్మత్: ఇదియొక లోహము. ప్రమాణము: బిస్మత్ సబ్ నైట్రేట్ 5—20 gr. సబ్ కార్బొనేట్ 10—30 gr. p. o. కడుపులోను, ప్రేగులోను జఠరాగ్నిలోను పుండులేచినను అతి విరేచనములకును అస్ట్రింజెంటు మందువలె దీనిని ప్రయోగించెదరు. కణములపైన చర్మపుపొరయేమియు నుండనందున, ఈ మందును ఆముదముతో కలిపి యిచ్చినట్లయిన, కణములమీద బాగుగా, గట్టిబంకవలె ఇది అంటుకొనును.

*b.* అల్యూమినియమ్: (స్ఫటికము) ఇది పటిక రూపముననుండు లోహము. నోరును శుభ్రముచేయు ద్రవముగాను, నులిపురుగులను జంపుటకు ఎనెమగాను దీనిని ప్రయోగించెదరు. దీని సొల్యూషన్ ప్రమాణము ½—1%. ఉండవచ్చును.

*c.* [2]సిల్వర్ నైట్రేట్ (రజతనత్రితము): 1—5000 పాళ్లు మోతాదును ప్రేగులోని [3]కోలన్ అను భాగమును గడుగుటకు ఉపయోగించెదరు. (60 gr.—3 pts.)

*d.* [4]ట్యానిక్ ఆసిడ్: చెట్లబెరడులో పెరిగెడు పదార్థములనుండి దీనిని చేయుదురు. 20% పాళ్లుగల ట్యానిక్ ఆసిడ్ ములామును ప్రయోగించి [5]మలలు ముడుచుకొనునట్లు చేయుదురు. 1—10% బలముగల సొల్యూషనును కాలుటవలన గలిగిన గాయములు మాన్పుటకు ఉపయోగించెదరు.

4. [6]ఆంటాసిడ్స్ (పిత్తఘ్నములు) (పులుపునకు విరుగుడులు.)

ఆహార కోశమునందలి పులుపును విరిచివేయగల మందుదినుసులు అంటాసిడ్స్ (పిత్తఘ్నములు) అనబడును. దీనిని జఠరాగ్ని పుండునకు ముఖ్యముగా నుపయోగించెదరు.

ఉదాహరణములు: సున్నపునీరు. మోతాదు 1—4 fl. oz. p. o.; సోడియం బైకార్బొనేట్ 15—60 gr. p. o.; మెగ్నీషియ, ఆక్సైడ్ 10—60 gr. కార్బొనేట్ 10—60 gr. పాలు మోతాదు, 60—240 m.

[1] Bismuth. [2] Silver nitrate. [3] Colon. [4] Tannic acid. [5] Hemorrhoids. [6] Antacids.

5. [1]ఇమెటిక్స్ (వాంతిమందులు.)

వాంతి మందులకు ఇమెటిక్స్ అని పేరు. ఉదాహరణములు: వేడి నీటితో కలిపిన ఆవాలపొడి. 1 dr. పొడిని ఒక గ్లాసు నీటితో కలిపి ఇయ్యవలెను; వేడి నీటితో కలిపిన ఉప్పు. 1—2 dr. మోతాదును ఒక గ్లాసు నీటితోకలిపి యియ్యవలెను. ఇపికాక్ యను పొడిని 15—30 gr. వేడినీటితో కలిపి యియ్యవలెను.

6. ఆంటి ఇమెటిక్స్ (ఛర్దినాశకములు.)

కడుపులో డోకును, వికారమును దొలగించి వాంతిని నివారించు మందులకు ఆంటి ఇమెటిక్స్ అనిపేరు.

*a.* అంటాసిడ్స్ (పిత్తఘ్నములు) ఇవి యాహార కోశమునందలి పులుపును విరుచునవిగాన వీనిని ఆంటాసిడ్స్ అందురు. వీనికి ఉదాహరణము:— సున్నపునీరు, సోడియం బైకార్బొనేట్, మెగ్నిషియం సాల్ట్స్ (ఉప్పు).

*b.* సెడటివ్స్:— అనగా శామకములు లేక ఉపశమనము గలిగించు మందులు. ఉదాహరణము: మార్ఫిన్.

*c.* అస్ట్రింజెంట్స్ (గ్రాహకములు).—అనగా నరములను సంకుచితముగాచేసి రక్తవాహినుల యాకారమును సన్నముగా చేయునవి. ఉదా: బిస్మత్ సబ్ నైట్రేట్ 5—20 gr.

7. [2]స్టమాకిక్స్ (పాచనములు.)

జీర్ణశక్తిని ప్రేరేపించి, ఆకలిని యెక్కునచేయు మందులకు స్టమాకిక్స అని పేరు.

*a.* క్వినిన్ (క్వైనా.)

*b.* [3]టింక్చెర్‌నక్స్‌వామిక (విషముష్టిమద్యార్కము.) మోతాదు 10—30 m. p. o.

8. జీర్ణశక్తికి తోడ్పడు మందులు

*a.* [4]డైల్యూట్ హైడ్రోక్లోరిక్ ఆసిడ్:—మోతాదు, 5—60 m. p. o. నీటితోగాని, పండ్ల రసముతోగాని కలిపి భోజనమునకు ముందును, భోజనముచేయుచుండగను ఇయ్యవచ్చును.

[1] Emetics. [2] Stomachics. [3] Tr. nux vomica,
[4] Dilute hydrochloric acid.



దీర్ఘకాలమునుండియున్న గుల్మవ్యాధి, తదితర వ్యాధులయందు దేహమునందలి హైడ్రోక్లోరిక్ ఆసిడ్ తక్కువై యుండును. అందువలన జాఠరికరసమునందలి (కాలకము) అను పదార్థము ఆహారమును జీర్ణింప జేయ లేనిదై యుండును. అప్పుడు జీర్ణమగుటకు పలుచన చేసిన హైడ్రోక్లోరిక్ ఆసిడ్‌ను భోజనమయిన తరువాత p. o. గా నిచ్చెదరు. ఈ మందు పండ్లకు దగిలినయెడల నవి మొద్దుబారును గాన, వానికి తగలకుండుటకు మందు త్రాగెడు ఒక గొట్టము (ట్యూబ్)గుండ నియ్యవలెను.

*b.* [1]పెప్‌సిన్ (కాలకము.)

ఆరోగ్యమైన పందుల ఆహార కోశములందలి అమత్వచలనుండి యిది లభించును. జాఠరికరసమునందలి పెప్‌సిన్ (కాలకము) అనునది తరిగి పోయినను, లేకుండ పోయినను జీర్ణమగుటకు ఈ పెప్‌సిన్ (కాలకము) అను మందును వాడుదురు. ఇది ఆమ్లము (ఆసిడ్) చేరియున్నప్పుడే పనిచేయును. కావున దీని నెల్లప్పుడు పలుచనచేసిన హైడ్రోక్లోరిక్ ఆసిడ్‌తో చేర్చి యియ్యవలెను.

9. [2]కార్మినెటివ్స్ (వాతహరణములు.)

ఆహారకోశములోను, ప్రేగులలోను వాయువు చేరకుండ ఇది ఆపును. ఒకవేళ వాయువు చేరినను, దానిని బయటి వెడలగొట్టగలదు.

*a.* పెప్పర్‌మింట్ (పుదీనా.)

(1) [3]పెప్పర్‌మింట్‌నూనె. (ఓలియం మెంత పిప్పరీట) 1-3 m.

(2) సోడియం బైకార్బొనేట్, పెప్పర్‌మింట్ మిక్చర్ 1 dr. p. o.

*b.* అల్లము (జింజిబెరిసె.)

దీనిని సారముగాగాని, టింక్చెర్‌గాగాని యిచ్చెదరు. మోతాదు 5—10 m వేరును పచ్చిగాగాని, ఉడికించిగాని లేక షర్బత్‌లో ఊరవేసిగాని తినవచ్చును.

*c.* [4]ఇంగువ

దీనిని మాత్రలుగాగాని, టింక్చెరుగాగాని పుచ్చుకొనవచ్చును. డోస్ 30—60 m. భరించ నలవిగాని చెడువాసన దీనికి గలదు.

*d.* [5]అరోమ్యాటిక్ స్పిరిట్స్ ఆఫ్ అమ్మోనియ (క్రిందచూడుడు.)

[1] Pepsin. [2] Carminatives. [3] Oil of peppermint. [4] Asafetida.
[5] Aromatic spiris of ammonia.

II. రక్త ప్రసరణమండలము మీద పనిచేయు మందులు

1. గుండెకు చురుకుదనము కలిగించు మందులు.

*a.* [1]కర్పూరము:—దీని నొక చెట్టునుండి చేయుదురు, మోతాదు, నూనెలో 1–3 gr. (క్యాంఫర్) కర్పూరము కలిపి చర్మముక్రిందుగా నెక్కించవలెను.

ఇది గుండెమీద చాల త్వరగా పనిచేయునుగాని, కొంచెము కాలమే దీని ప్రభావము నిలిచియుండును. దీనివలన గుండె కొట్టుకొనుట బల పడును.

*b.* **అమోనియా:**—(నవాసారము) ఇది బలమైన క్షారము (అల్క-లాయ్) ఆరొమాటిక్ స్పిరిట్స్ ఆఫ్ **అమోనియను** లోపలికి పీల్చుకొనునట్టు చేయుదురు. మోతాదు, 15–60 m. వరకు నీటితో కలిపి నోటిమూలముగా ఇచ్చెదరు.

తలతిరిగి సొమ్మసిల్లి, చలువవాయువు కమ్మినప్పుడు త్వరగా పనిచేసి, తత్కాలికమునకు ఫలితము కలుగునట్టు గుండెకును, శ్వాసకును చురుకు దనము కలుగజేయుటకొరకు దీని నిచ్చెదరు. అవసరమైన దానికంటె నధికమైన ఆసిడ్‌ను ఇది తగ్గించగలదు; లేక విరిచివేయగలదు. అట్లే ఆహారకోశములో వాయువు చేరకుండచేయును.

*c.* [2]అడ్రెనలిన్ లేక ఎపినెఫ్రీన్:—అడ్రెనలిన్ క్లోరైడ్ సొల్యూషను 1—1000, 2–8 m. మోతాదుగా చర్మముక్రిందగాని, కండరములలో గాని లేక గుండె కండరమునకుగాని యెక్కించవచ్చును.

ఇది, జంతువులలో పుట్టు ఆడ్రినల్ లేక సుప్రరీనల్ గ్రంథినుండి తీయబడిన కషాయము (ఎక్స్‌ట్రాక్ట్). దీని నిప్పుడు లెబొరటొరిలో సుల భముగా దొరకగల వస్తువులనుండియు సిద్ధముచేయుచున్నారు.

ఇది రక్తనాళములను ముడుచుకొనజేయును. ఇందువలన రక్తము కారుట నిలిచిపోవును. గుండె కొట్టుకొనుటయొక్క వడి తగ్గి బలపడును. దేహము అదరుట (షాక్), మూర్ఛిల్లుట (కొలాప్స్) యనునవి సంభవించి నప్పుడు దీని చికిత్స అవసరమైయుండును. రక్తము కారుచున్నచోట గాని, దేహపు చర్మము (అమత్వచ) వాచియున్నచోటగాని దీనిని పూయ వచ్చును.

[1] Camphor. [2] Adrenalin, or epinephrine.



*d.* [1]క్యాఫిన్ (283 పుట చూడుము.)

*e.* [2](స్ట్రిక్‌నీన్) (282 పుట చూడుము.)

*f.* [3]అట్రొపిన్ (289 పుట చూడుము.)

*g.* [4]పిట్యూయిట్రిన్ (298 పుట చూడుము.)

2. గుండెను బలపరచెడు బలీయములు (టానిక్స్).

[5]డిజిటాలిస్:—దీనిని ఒకచెట్టు ఆకులనుండి చేయుదురు. టింక్చర్ డిజిటాలిస్ 5–15 m. డిజిటాలిస్ $\frac{1}{100}$—$\frac{1}{60}$ gr. మోతాదును చర్మముక్రింద నెక్కించవలెను. డిగాక్సిన్ —$\frac{1}{80}$—$\frac{1}{40}$ gr. p.o.

ఈ మందు, గుండె బలముగాను, నిదానముగాను కొట్టుకొనునట్టు చేయును. రక్తము శరీరమంతట ప్రసరించునట్లును చేయును. మూత్ర పిండములయందు రక్తమిట్లు ఇంతకు ముందుకంటె బాగుగా ప్రసరించు చున్నందున రోగి యెక్కువ మూత్రముపోయును. వాపురోగమున్న యెడల, నీరు రక్తకణములలో చేరియుండుటకు వీలులేనందున వాపు తగ్గును. కాని దీనివలన పలుమారు కడుపులో త్రిప్పుటయు, వాంతి యగుటయు, అతివిరేచనములగుటయు సహజము. ఈ మందు దేహ ములో చాల నిదానముగా ఇముడును; నిదానముగ బహిష్కరింప బడును. అందువలన ఇది దేహములో చేరిపోయి ఆపదకలిగించవచ్చును. ఇట్టి యాపదకు [6]క్యుములేటివ్ ఆక్షన్ అని పేరు.

మితిమీరిన మోతాదుయొక్క లక్షణములు (గుణగతచర్య):—నాడి నిదానముగా కొట్టుకొనుట. దీనిలెక్క నిమిషమునకు 50 కంటె తక్కు వగా నుండవచ్చును. క్రమము తప్పియుండును. వదలకుండ కడుపులో వికారముగానుండుట, వాంతియగుట, తలనొప్పి, అతివిరేచనములు, కల వరింతలు, ఈడ్పు మొదలైనవి.

**చికిత్స:**—మందిచ్చుట మానివేసి, సంగతి వైద్యునికి తెలియజేయుము. రోగిని నెమ్మదిగ నుండనిమ్ము. గుండెమీద మంచు తిత్తినిగాని, ఉడుకు నీటి సంచినిగాని పెట్టుము. విషము బాగుగా ఎక్కినట్లుండినయెడల, వాంతికలుగు మందులను, విరేచనములగు మందులను ఇచ్చి, కాఫీ, టీ లేక అట్రొపిన్ అను వానివలన చురుకుదనము పుట్టించుము. ఈడ్పున్నయెడల,

[1] Caffein. [2] Strychnine. [3] Atropine. [4] Pituitrin. [5] Digitalis.
[6] Cumulative action.

[1]మార్ఫిన్ లేక బ్రోమైడుల నిమ్ము. వీనివలన గుండె కొట్టుకొనుట ఇంకను తగ్గవచ్చునుగాన జాగ్రత్తతో నియ్యవలెను.

3. [2]గుండెయొక్క శక్తిని నిదానపరచు మందులు.

(*a*) నిద్రప్రదములు — నిద్రకలిగించుమందులు ([3]హిప్నొటిక్స) (285 పుట చూడుము.)

(*b*) నిద్రకలిగించి నొప్పి తగ్గించుమందులు ([4]నర్కొటిక్స (287 పుట చూడుము).

III. **నరములమీద పనిచేయు మందులు**

1. చురుకుదనముకలిగించునవి:-(*a*) విషముష్టి కాయ ([5]నక్సవామిక):- దీనిని విషముష్టిచెట్టు విత్తనములనుండి చేయుదురు. దీనిలోని ముఖ్య పదార్థము [6]స్ట్రిక్నీన్. **మోతాదు**:—టింక్చెర్ నక్సవామిక 10–30 m.p.o. స్ట్రిక్నీన్ సల్ఫేట్ gr. 1/100–1/30 s.c. లేక p.o. స్ట్రిక్నీన్ హైడ్రో క్లోరైడ్ $\frac{1}{32}-\frac{1}{8}$ gr.

ఇది సెరిబ్రల్ (అనగా మెదడు), స్పైనల్ (వెన్నెముక) యొక్క కేంద్రములకు చురుకుదనము కలిగించు మందు. కొద్దిపాటి కండరముల పక్షవాతమును తగ్గించి, [7]ప్రతిఫలపు చురుకుదనమును హెచ్చించును. సరాసరి మోతాదులు గుండెకుగాని రక్తప్రసరణమునకుగాని యే విధమైన తొందర కలిగించవు. కాని మితిమీరిన మోతాదులు గుండె, ముందటి కంటె నిదానముగాను బలముగాను కొట్టుకొనునట్టుచేయును. రక్తపోటును [illegible]డ హెచ్చించును. శ్వాస ముందుకంటె లోతుగను, త్వరితముగను [illegible]ను. దగ్గు కొద్దిగా హెచ్చగును. ఈ మందు చాల చేదుగానుండును. ఆకలి, ఉమ్మినీరు హెచ్చగుట మూలమున అన్నము జీర్ణమగుటకు దీని నిచ్చెదరు.

**దీనివలన** కలుగు అధిక విషప్రయోగముయొక్క గుర్తులు:—స్ట్రిక్నీన్ (విషముష్టి) యెక్కువ పెద్ద మోతాదునిచ్చుట మూలమున నిట్టి విష ప్రయోగము కలుగవచ్చును. దీని గుర్తులు సాధారణముగా 15 నిమిష ములలో కనబడును. అవేవనగా—ముఖము, చేతుల కండరములు బిగుసు కొని లాగుకొనుట; అకస్మాత్తుగా, ఈడ్పువాతము (టెటానిక్) సంబంధ

[1] Morphine or bromides. [2] Heart Depressants. [3] Hypnotics. [4] Narcotics [5] Nux vomica. [6] Strychnine. [7] Reflex activity.



ముగా దేహమంతట ఈడ్పు కనబడవచ్చును. తల వెనుకకును, వీపు, నడుము ముందుకును విల్లువలె వంగవచ్చును. ఈడ్పు పలుమారువచ్చుట వలన సాధారణముగా రోగి 2, 3 గంటలలో చనిపోవచ్చును. కాని మరణమువరకును మనస్సుమాత్రము తేటగా నుండును. ఈడ్పు వచ్చి నప్పుడు తప్ప, యితర సమయములలో నాడి నిదానముగను బలముగను కొట్టుకొనును. ఈడ్పులో అతివేగముగను బలహీనముగను నుండును.

పై రోగమునకు **చికిత్స**:—[1]ట్యానిక్ ఆసిడ్ లేక టీ (తేనీరు) స్ట్రిక్ నీన్‌తో కలిపి యియ్యవలెను. [2]ఆహారకోశమును కడుగు మందులు, వాంతియగు మందులు, వీనిని నోటిద్వారా ప్రయోగించవచ్చును. ఈడ్పును వశపరచుకొనుటకు [3]ఈతర్ లేక క్లోరొఫార్మ నియ్యవచ్చును. [4]బ్రోమైడ్స లేక క్లోరల్ అను వానిని ఈడ్పు రాకుండ చేయుటకు ఇయ్య వచ్చును. మూత్రములో చేరిన స్ట్రిక్నీన్ మరల రక్తములో ఇముడకుండ క్యాతిటరైజేషన్ చేయవలెను. ఈ కాలములో [5]కల్పిత విధముగా ఉచ్ఛ్వాస నిశ్వాసములు చేయించుట అవసరమై యుండవచ్చును.

స్ట్రిక్నీన్ చాల త్వరగా దేహములో నిమిడి బహు నిదానముగా బహిష్కరింపబడునుగాన దీనిని తెంపులేకుండ ఇచ్చినప్పుడు దానిలో కొంచెము ఎల్లెనను దేహములో నిలిచియుండును. అందువలన తరుచుగా [6]దీర్ఘకాలముగ జీర్ణించిన విషప్రయోగము కావచ్చును. ఈ విషప్రయో గముయొక్క గురుతు లేవనగా, ముఖము, కాలుచేతుల కండరములు ఈడ్చుకొనుట; అతి విరేచనములు; మెడ, దవుడ, ముఖముసందలి క[illegible] ములు బిగుసుకొనుట; చివరగా ఈడ్పు సంభవించుట. దీనికి చిక[illegible] మందు నాపివేసి ప్రమాదకరమైన గుర్తులు కనబడినప్పుడు అధిక విష ప్రయోగమునకు చేసిన చికిత్సనే చేయవలెను.

(*b*) క్యాఫిన్:—టీ లేక కాఫినుండి ఇది లభించును.

**మోతాదు**:—[7]క్యాఫిన్ సోడియం స్యాలిసిలేట్ 3 gr. s. c., క్యాఫిన్ ఎట్ సోడియం [8]బెన్‌జోయేట్ ను 5—15 gr. s. c., క్యాఫిన్ [9]సిట్రేట్ 2—5 gr. s. c., ఒక కోప కాఫి లేక టీ లో 1—4 gr. క్యాఫిన్ చేరియుండును.

[1] Tannic acid. [2] Stomach washes or emetics. [3] Ether or chloroform. [4] Bromides or chloral. [5] Artificial respiration. [6] Chronic poisoning. [7] Caffein sodium salicylate. [8] Benzoate. [9] Citrate.

క్యాఫిన్ అనునది చురుకుదనము పుట్టించుటకు ఆదర్శనీయమైన ఒక మంచిమందు. దాదాపు దేహములోని ప్రతి అవయవముయొక్క పనిని ఈ మందు హెచ్చించును. ఇది గుండెకుకూడ చురుకుదనము పుట్టించును. అందువలన గుండె త్వరితముగను, బలముగను పనిచేయును. కాని దీని ఫలితము చాలకాలము నిలిచియుండదు. ఇది మెదడునందలి ప్రతి భాగమునకు చురుకుదనము పుట్టించును. అందువలన రోగి బాగుగా మేల్కొని, సంగతులు ఎక్కువ సూక్ష్మబుద్ధితో గ్రహించును. శ్వాసను గూడ ఇది ప్రేరేపించును. అందువల్లన లోతైన శ్వాసను రోగి పలుమారు విడుచుచుండును. మూత్రపిండములనుగూడ ఈ మందు ప్రేరేపించును. మూత్రమును హెచ్చించు శ్రేష్ఠమైన మందులలో నిదియొకటి.

**క్యాఫిన్‌యొక్క అధిక విష ప్రయోగము:**—ఇట్లు సంభవించుట చాల అరుదు. ఎందుకనగా క్యాఫిన్ బహు వేగముగా బహిష్కరించబడును. బలమైన కాఫీని వాడుకగా త్రాగువారికి దీర్ఘకాలము జీర్ణించి క్యాఫిన్ విష ప్రయోగము సంభవించును. దీని గుర్తులేవనగా, నరముల పటుత్వము తగ్గుట, [1]నిద్రలేమి, [2]గుండెదడ, నాడిక్రమము తప్పికొట్టుకొనుట, తలనొప్పి, కండరములు లాగుకొనుట, అతి విస్తారముగ మూత్రము పోయుట. కాఫీ త్రాగుటను మానివేయుటవలన ఈ మందు దేహములోనికి పోకుండ చేయుటయే దీనికి తగిన చికిత్స.

2. [3]నెమ్మదిని గలుగజేయు మందులు.

*a.* [4]అనాల్జిసిక్స్, [5]ఆంటిపైరెటిక్స్: ఇవి బాధను, జ్వరమును దగ్గించును. కాని నిద్రపట్టునట్టుచేయు మందులు గావు.

(1) [6]ఆస్పిరిన్ లేక అసెటిల్ సాల్సిలిక్ ఆసిడ్ మోతాదు, 5—15 gr. p. o.
(2) సోడియం స్యాలిసెలేట్. మోతాదు 10—30 gr. p. o.
(3) [7]సాలాల్. మోతాదు 5—20 gr. p. o.
(4) [8]ఫెనాసిటిన్. మోతాదు 5—10 gr. p. o.
(5) [9]పైరమిడన్. మోతాదు 5—10 gr. p. o.

[1] Insomnia. [2] Palpitation. [3] Depressants. [4] Analgesics. [5] Antipyretics. [6] Aspirin. [7] Salol. [8] Phenacetin. [9] Pyramidon.



**మితిమీరిన మోతాదుయొక్క గుర్తు లేవనగా:**—

పైన చెప్పిన మొదటి మూడు మందులు సేవించినయెడల, చెవులలో శబ్దములు పుట్టుట, చూపు మందమగుట (చీకటి కమ్ముట) విస్తారముగా చెమట పోయుట, కొన్నిసారులు శ్వాసావరోధము, కలవరింతలు (విభ్రమము), క్రుంగిపోవుటయు సంభవించును.

ఆఖరి రెండు, కడుపులో త్రిప్పుట, వాంతియగుట, నాడి నిదానముగను బలహీనముగను గొట్టుకొనుట, కండరములు లాగుకొనుట, [1]స్మారకము తప్పి మైకము గప్పియుండుట, క్రుంగిపోవుట (కొలాప్స్)—ఈ లక్షణములు కలుగజేయును.

**చికిత్స:**—మందు నాపివేసి, రోగి వేడిగా నుండునట్లుచేసి, కడుపు శుభ్రముగా కడిగి, చురుకుదనము పుట్టించు పానీయముల నిమ్ము.

*b.* నిద్రప్రదములు (హిప్నాటిక్స్.)

ఈ మందులు నిద్రను గలుగజేయునుగాని బాధను తగ్గించవు. రాత్రి నిద్రపోవుసమయమున హిప్నాటిక్స్ ఇచ్చుటకుముందు రోగి సౌఖ్యముగా నుండునట్లును గది నిశ్శబ్దముగా నుండునట్లును సర్దు చూడవలెను. కిటికీలు తెరచియుంచవలెను. రాత్రికొరకు అంతయు సిద్ధముచేసి యుంచవలెను. అప్పుడు ఈ మందును వేడిపాలలో కలిపి రోగికి త్రాగించి, అతడు నెమ్మదిగా నిద్రించునట్లు చూడవలెను. [2]నర్కాటిక్స్ అను మందులు ఇచ్చినప్పుడుకూడ ఇట్టి నియమములనే యనుసరించి పనిచేయవలెను.

(1) బ్రోమైడ్స్:—మోతాదు, సోడియం పొటాసియమ్, అమ్మోనియమ్ బ్రోమైడ్స్, 5—30 gr. p.o., ట్రిపల్ బ్రోమైడ్స్ (3 బ్రోమైడ్లు) వీనిని సమభాగములుగచేసి 5—30 gr. p.o. or p.r. ఇయ్యవచ్చును.

బ్రోమైడ్లు నాడీమండలమంతటి చురుకుదనమును తగ్గించును. నరములబలహీనతగల రోగులను నెమ్మదిపర్చుటకును, ఈడ్పురాకుండ చేయుటకును, ఇచ్చినయెడల దానిని వశపర్చుకొనుటకును బ్రోమైడ్ల నిచ్చెదరు. గర్భధారణమువలన కడుపులోపుట్టు వికారమునకు వీనిని పురీషనాళము ద్వారా నిచ్చెదరు.

[1] Stupor. [2] Narcotics.

బ్రోమైడ్లు చాల త్వరితముగా దేహమునం దిముడునుగాని చాల నిదానముగా బహిష్కరించబడును. వీనిని తెంపులేకుండ ఇచ్చినయెడల అవి దేహములో నిలిచిపోయిన లక్షణములు లేక [1]బ్రోమిజమ్ అను విషప్రయోగము కావచ్చును. బ్రోమిజమ్‌యొక్క లక్షణము లేవనగా:—చర్మముమీద పొక్కులులేచుట, ఆకలి తగ్గిపోవుట, అజీర్ణము, మలబద్ధకము, నిద్రమత్తు, నాడి నిదానముగ కొట్టుకొనుట మొదలైనవి. విష మెక్కువగ చేరియున్నప్పుడు స్మారకము తప్పిపోవుటయు, గాఢమూర్ఛ కలుగుటయు సంభవించును. పై రోగమునకు చికిత్సగా మందు నాపివేసి భేదిమందునిచ్చి వేడినీటి స్నానము చేయించినయెడల, లోపల చేరియున్న మందులు సులభముగా బహిష్కరించబడుటకు తోడ్పడును. పిమ్మట చురుకుదనము పుట్టించు మందులు అనగా, క్యాఫిన్, స్ట్రిక్‌నీన్ అను వానిని అవసరమునుబట్టి ఇయ్యవలెను.

(2) క్లోరల్ హైడ్రేట్:—మోతాదు 5—20 gr. p.o. లేక p.r.

ఈ మందు 5—15 నిమిషములలో పనిచేయును. ఇది మెదడుయొక్క చురుకుదనమును తగ్గించునేగాని బాధను (నొప్పిని) తీసివేయదు. ఈడ్పును వశపరచుకొనుటకు దీనిని వాడుదురు. దీనివలన గుండె ముందుకంటె నిదానముగాను, బలహీనముగాను కొట్టుకొనును. శ్వాసయు నిదానమైనదిగను, లోతులేనిదిగను ఉండును. కొందరి రోగుల తత్వమునుబట్టి వారిముఖము కందును. చర్మముమీద పొక్కులులేచును. కడుపులో తిప్పుట, వాంతియగుట, తలనొప్పి, తత్తరపాటు మొదలగు దుర్లక్షణములును రోగియందు కనబడును.

మితిమీరిన మోతాదుయొక్క గుర్తు లేవనగా:—శ్వాస నిదానమైనదిగను; లోతులేనిదిగను ఉండును. నాడి నిదానముగను, బలహీనముగను, క్రమముతప్పియు కొట్టుకొనును. రక్తపోటు తగ్గియుండును. మొదట స్మారకము తప్పియుండుట, పిమ్మట గాఢమూర్ఛ, కృంగిపోవుట, తుదకు మరణమగుటయు సంభవించును. దీనికి చికిత్సగా ఆహారకోశమును కడుగవలెను. కల్పితవిధముగా శ్వాసను క్రమపర్చవలెను. అవసరమైనయెడల [2]అట్రొపిన్, క్యాఫిన్ లేక ఆల్కోహాల్ అను వానిని వాడి,

[1] Cumulative symptoms or bromism. [2] Atropine.



గుండెయొక్క పనిని హెచ్చించవలెను. రోగిని వెచ్చగను, నెమ్మదిగను పరుండనియ్యవలెను.

(3) [1]పెరాల్‌డెహైడ్:—మోతాదు 30—120 m. దీనిని నీటితోగాని పాలతోగాని కలిపి పలుచనచేసి ఇయ్యవలెను. ఇది కొన్ని నిమిషములలోనే పనిచేయును. దీనివలన కొన్ని గంటలు నిద్రపట్టును.

(4) [2]సల్‌ఫొనల్, ట్రయొనల్:—మోతాదు, ఒక్కొక్క మందును 5—20 gr. మోతాదుగ ఇయ్యవలెను. ఇవి చాల నిదానముగ పనిచేయును గాన రాత్రి పరుండక ముందు కనీసము ఒక గంట ముందుగా ఈ మందు నియ్యవలెను.

మితిమీరిన మోతాదుయొక్క లక్షణము లేవనగా:—ప్రేగులయందు వాయువు చేరుటవలన నొప్పి, బాధకలుగుట, బుద్ధిమాంద్యము కలుగుట, స్మారకము తప్పిపోయి పిమ్మట గాఢమూర్ఛ సంభవించుట.

చికిత్స:—పాలు, సోడియమ్ బైకార్బొనేట్ అనువానిని కలిపి పెద్ద మోతాదు లియ్యవలెను.

(5) [3]వెరొనల్ (బార్బిటల్):—మోతాదు 5—10 gr. p.o. ఈ మందు 15 నిమిషములలో పనిచేయును.

(6) [4]లూమినల్:—మోతాదు ½—2 gr. p.o. ఇది వెరొనల్‌తో చేరిన కాంపౌండ్ మందు. కావున వెరొనల్‌వలెనే యిదియు పనిచేయును. కాని దానికంటె త్వరితముగ పనిచేయును. ఎక్కువ గాఢనిద్రపట్టును.

3. నర్కాటిక్స్.

ఈ మందులు బాధను నొప్పిని తీసివేసి నిద్రను గలుగజేయును.

[5]ఓపియమ్:—(నల్లమందు). పురాతనమైన మందులలో నిదియొకటి; చాల నమ్మకముగా పనిచేయునది. ఇతర మందులకంటె బాగుగా ఇది బాధను తొలగించును. [6]గసగసాల చెట్టుయొక్క బీజములు పచ్చివిగా నున్నప్పుడే వానినుండి కారిన ద్రవమును బాగుగా నెండనిచ్చి, గట్టిచేసి యీ మందును సిద్ధముచేయుదురు. ఇది త్వరగా 10—15 నిమిషములలో పనిచేయును. నరములు ఉద్రేకము పొందినందున కలుగు [7]కలవరింతల

[1] Paraldehyde. [2] Sulphonal and Trional. [3] Veronal (Barbital). [4] Luminal. [5] Opium. [6] Poppy plant. [7] Delirium tremens.

సంబంధమైన సన్నిపాతము (విభ్రమము), ఈడ్పు మొదలగు దుర్లక్షణములను తగ్గించును. శ్వాస నిదానముగా వచ్చునట్లు దాని ఉరవడిని తగ్గించును. [1]పెరిస్టాల్సిస్ యను ప్రేగుల చలనమును అడ్డగించి మలబద్ధకమును గలుగజేయును. కొందరి రోగులయొక్క తత్వమునుబట్టి తప్ప తక్కినవారియందు కడుపులో త్రిప్పుట, వాంతియగుట మున్నగువానిని సాధారణముగా తొలగించును. కనుపాప చిన్నదగునట్లు చేయును.

నల్లమందునుండి చేసిన మందులును, వాని ప్రయోగములును.

*a.* [2]మార్ఫిన్ సల్ఫేట్ లేక హైడ్రోక్లోరైడ్. మోతాదు, $\frac{1}{8}$—$\frac{1}{3}$ gr. p. o. లేక s. c.

*b.* [3]కోడీన్ సల్ఫేట్ లేక ఫాస్ఫేట్. $\frac{1}{4}$—1 gr. p. o. లేక s. c.

*c.* టింక్చర్ ఆఫ్ ఓపియమ్ (లాడనమ్.) 5—30 m. p. o.

*d.* టింక్చర్ ఆఫ్ క్యాంఫర్ కాంపౌండ్ లేక ప్యారెగోరిక్ (క్యాంఫరేటెడ్ టింక్చర్ ఆఫ్ ఓపియమ్.) 30—60 m. p. o.

*e.* నల్లమందు చూర్ణము $\frac{1}{2}$—3 gr. p. o. (1 gr. నల్లమందులో 1/10 gr. మార్ఫిన్ ఉండును.)

*f.* డోవర్స్ పౌడర్. 5—10 gr. p. o.

*g.* [4]హెరోయిన్ $\frac{1}{24}$—$\frac{1}{8}$ gr. s. c.

**మితిమీరిన మోతాదుయొక్క లక్షణము లేవనగా:**—రోగి గాఢనిద్రపోవును. దానినుండి వానిని లేపుట చాల కష్టమగును. కొన్ని ప్రమాదకరమైన పరిస్థితులలో గాఢమూర్ఛ కలుగుటవలన రోగిని లేపుట కేవలము అసాధ్యము. ఇట్టి సమయములలో తరచుగా మరణము సంభవించును. ఉచ్ఛ్వాస నిశ్వాసములు నిదానముగను లోతులేకను జరుగుచుండును. కనుపాపలు ముడుచుకొని చిన్నవగును. నాడి నిదానముగా కొట్టుకొనును. చెమట విస్తారముగా పోయును.

**చికిత్స లేవనగా:**—

*a.* సాధారణమైన నీటితోగాని 1—2000 పాళ్ల పొటాసియమ్ పర్మాంగనేట్ కలిపిన సొల్యూషనుతోగాని ఆహారకోశమును గడుగవలెను. దీనివలన మందుశక్తి బలహీనమైనదగును. రోగికి ప్రమాదము

[1] Peristalsis. [2] Morphine sulphate. [3] Codein sulphate. [4] Heroin.



తప్పువరకు ప్రతి అరగంటకు ఒకసారి యిట్లు కడుగుచుండవలెను. ఈ మందును సూదిద్వారా చర్మముక్రిందికి ఎక్కించినను అది యాహారకోశమునకు బహిష్కరింపబడును గాన, ఈ చికిత్సనే చేయవలెను.

*b.* ఎమెటిక్స్. (వాంతిమందులు.) ఏ కారణముచేతనైనను ఆహారకోశమును గడుగ వీలులేనప్పుడు ప్రతి 15 నిమిషముల కొకసారి వాంతిమందుల నియ్యవలెను. నల్లమందును నాశనము చేయుటకుగాను వాంతియగుటకుగాని ఇచ్చెడు ప్రతి మందులో పొటాసియమ్ పర్మాంగనేట్ చేర్చవలెను.

*c.* అట్రొపిన్. $\frac{1}{100}$ gr. s. c. మార్ఫిన్కు ఇది విరుగుడు. శ్వాస తిరిగి లోతుగను వడిగను వచ్చువరకు ఈ మందును గంట కొకసారి యిచ్చుచుండవలెను. కాని దీనివలన అట్రొపిన్ విషప్రయోగము కాకుండ అధిక జాగ్రత్తగా నుండవలెను. మెదడునకు చురుకుదనము కలుగజేయునవి అనగా, క్యాఫిన్, స్ట్రిక్నీన్ మొదలైనవి వాడవచ్చును.

*d.* [1]ఫిజికల్ స్టిమ్యులెంట్స్. (ఇంద్రియములకు చురుకుదనము కలుగజేయు మందులు.) రోగి మేల్కొనియుండుటకు నర్సు చేయగలిగిన ప్రతి పనియు చేయవలెను. అనగా చురుకుదనము పుట్టునట్టు కొట్టుట, చర్మముమీద చల్లని నీరుపోయుట, విద్యుచ్ఛక్తిని ప్రయోగించుట మొదలగు వానిమూలమున రోగికి చురుకుదనము పుట్టించవలెను.

*e.* వేడిగ నుంచుట.

*f.* క్యాథిటరైజేషన్.

*g.* [2]కల్పిత విధముగా శ్వాసింపజేయుట. రోగి సరిగా శ్వాసించకుండినయెడల, ఈ చికిత్స తెంపులేకుండ చేయవలెను. రోగి బ్రతికియున్నంత కాలముగాని, లేక మామూలుగ శ్వాసించువరకునుగాని ఈ చికిత్స కొన్ని గంటలవరకు చేయుచుండవలెను.

(దీర్ఘకాల విషప్రయోగము) లేక [3]నల్లమందు అలవాటు.

కొందరు రోగులకు చాలకాలమువరకు ఓపియమ్ లేక మార్ఫిన్ ఇచ్చుట అవసరమైయుండును. అట్టివారికి దీర్ఘకాల విషప్రయోగము

[1] Physical stimulants. [2] Artificial respiration.
[3] Chronic poisoning or [illegible] habit'.

కలుగవచ్చును. స్నేహితులు కొందరిని ప్రేరేపించి నల్లమందు తినునట్లు చేయుదురు. ఇట్టివారియందు ఈ విషప్రయోగము సర్వసాధారణముగా నుండును. ఈ మందును ఓపియమ్ పిల్స్ (నల్లమందు మాత్రలుగాగాని, టింక్చర్ ఆఫ్ ఓపియమ్‌గాగాని యిచ్చెదరు. లేక చర్మముక్రింద మార్ఫి నుగా సూదితో ఇంజెక్షను వేయుదురు. చీనా, ఇండియాదేశములలో అనే కులు నల్లమందు పొగ పీల్చుదురు. (చుట్టత్రాగినట్టు త్రాగుదురు.) మరికొందరు పచ్చిమందునే నోటిలోవేసికొని నమలుచుందురు.

రోగికి నల్లమందుయొక్క ప్రభావము లేనప్పుడు అతనియం దగపడు లక్షణములు:

*a.* విస్తారముగా చెమటపోయుట, అటుపిమ్మట కడుపులో ఉండి, ఉండి, నొప్పిపుట్టుట.

*b.* కండరములు లాగుకొనుట.

*c.* ఆపుటకు వీలుగాని ఆవులింతలు.

*d.* చీదర, నరముల బలహీనత. రోగి తాను చేయుపనిమీద గమనము నిలుపలేక, దానిని చేయ నశక్తుడైయుండును.

*e.* ఆకలిలేనందున సరిగా భుజించలేడు. కావున రోగి బలహీన పడి కృశించుచునుండును.

*f.* శరీర, మానసిక, నైతికశక్తులు, బుద్ధులు క్షీణించుట.

ఈ మందుయొక్క శక్తి క్రిందనున్న రోగియందు అగుపడు లక్షణములు:—

రోగిమొదట చాల ఉషారుగానుండును. చాల శక్తితో కొంతసేపు మాత్రమే పనిచేయగలుగును. కాని త్వరలోనే నిద్రమత్తుకలుగును. పిమ్మట కలలుగనుచు, గాఢనిద్రపోవుచుండును.

చేయవలసిన చికిత్స యేదనగా:—క్రమేణ ఈ మందును తగ్గించుచు రావలెను. ఒకేసారి యీ మందును విలిపివేసినయెడల రోగి క్రుంగి పోవచ్చును. దీనికి బదులు నిద్రమందులు, భేదిమందులు ఇయ్యవచ్చును.

4. అనెస్తెటిక్స్: ఈ మందులు శరీరమును ఏదైన నొకచోటగాని, అంతటగాని యింద్రియ జ్ఞానములేనిదై మొద్దుబారిపోవునట్లు చేయును. అనెస్తెటిక్సనుగూర్చి 37-వ అధ్యాయములో వివరించబడినది.



IV. శ్వాసావయవములమీద పనిచేయుగల మందులు

1. శ్వాసకు చురుకుదనము పుట్టించునవి:—

(*a*) క్యాఫిన్. (283-వ పుట చూడుము.)

(*b*) అట్రోపిన్. (289-వ పుట చూడుము.)

(*c*) అమోనియ. (280-వ పుట చూడుము.)

(*d*) క్యాంపర్. (కర్పూరము) (280-వ పుట చూడుము.)

(*e*) స్ట్రిక్‌నీన్. (282, 283-వ పుటలు చూడుము.)

(*f*) ఆక్సిజిన్ (ప్రాణవాయువు). ఇది రంగు, వాసన, రుచిలేని వాయువు. సాధారణమైన గాలిలో ఇది నూటికి ఇరువై పాళ్లుండును. జంతువులన్నియు బ్రదుకుటకు ఇది యవసరము.

దీనిపని

(1) స్వచ్ఛమైన ప్రాణవాయువును పీల్చుకొనినప్పుడు, అది ఊపిరితిత్తులలోని గాలి సంచులగుండ రక్తములోని [1]ప్లాస్మయను దానిలోనికి పోవును. దీనిలో కొంతప్రాణవాయువు ఎఱ్ఱని రక్తకణములయందలి [2]హెమొగ్లోబిన్‌తో చేరిపోవును. మిగిలినది ప్లాస్మయనుదానితో చేర కయే రక్తముతో దేహమంతట తిరుగుచుండును. ఇట్లు రక్తము వృద్ధి యగుట మూలమున శ్వాస కొంచెము నెమ్మదిచెంది, గుండెనుగూడ నెమ్మది పరచి, దాని పనిని బలపరచును.

(2) ఎఱ్ఱనికణములు ప్రాణవాయువును దేహమునందలి వెవ్వేరు టిష్యూలకు గొనిపోవును. అక్కడ అది అణువులతో కలిసి కొనును. అందువలన టిష్యూలు తమ పనినిచేయుటకు శక్తిగలవగును.

(3) ప్రాణవాయువు చాల మంచి ఆంటిసెప్టిక్. అందుచేత అనేకవిధములైన బాక్టీరియా స్వచ్ఛమైన ప్రాణవాయువున్న వాతావరణ ములో బ్రతుకజాలవు.

ప్రాణవాయువుయొక్క ఉపయోగములు

(1) క్రొత్తగ పుట్టినబిడ్డ ఊపిరి పీల్చుకొనలేనప్పుడు శ్వాస కలిగించుటకై ప్రాణవాయువును ప్రవేశపెట్టుదురు. పెద్దవారికికూడ ఇట్లు శ్వాస నిలిచిపోయినను, న్యుమోనియ రోగి దేహము నల్లబడినను, ప్రాణవాయువును పై జెప్పినవిధమున నుపయోగింతురు.

---

[1] Plasma. [2] Hemoglobin of the red blood cells.

(2) పొటాసియమ్ క్లోరేట్ వలనగాని, దాని విషవాయువు వలనగాని విషప్రయోగము కలిగినప్పుడుకూడ ప్రాణవాయువును ఇచ్చెదరు. ఈ మందులు హెమొగ్లొబిన్‌తో చేరుకొని, యది యూపిరితిత్తులలో ప్రాణవాయువు పొందకుండ ఆపును.

*g.* [1]కార్బన్ డైయాక్సైడ్:—స్వచ్ఛమైన కార్బన్ డైయాక్సైడు నెప్పుడును రోగికి ఇయ్యకూడదు. ఎందుకనగా, దీనివలన రోగి శ్వాస నిలిచిపోయి, ఊపిరాడకపోవచ్చును. కాని దీనిని ప్రాణవాయువుతో చేర్చినను, 5—7% పాళ్లు గాలిలో కలిసినను, రోగి దీనిని పీల్చుకొనుట వలన నతడు చురుకుగా శ్వాస విడువగలడు; అతని శ్వాస ముందటివలెనే క్రమపరచబడును.

2. [2]శ్వాసను మందగించు మందులు.

*a.* హిప్నాటిక్స్ (285-వ పుట చూడుము.)

*b.* నార్కాటిక్స్ (287-వ పుట చూడుము.)

3. [3]కఫమును గోయు మందులు.

ఈ మందులు బ్రాంకియల్ (వాయునాళముల) స్రావమును హెచ్చించి, కఫమును దొలగించును. వీనిలో ముఖ్యమైనవి యేవనగా:—

అమ్మోనియమ్ క్లోరైడ్, పొటాసియమ్ ఐయొడైడ్, ఇపికాక్, అపొమార్ఫిన్.

బెన్‌జొయిన్:—దీనిని ఒక చెట్టుయొక్క సారమునుండి సిద్ధము చేయుదురు. మోతాదు, టింక్చర్ బెన్‌జొయిన్‌కొ., 30—60 m. p.o. కాంపౌండ్ టింక్చర్ ఆఫ్ బెన్‌జొయిన్ అను దానిని దేహముయొక్క ఏదైన ఒక భాగమునకు పూయవచ్చును. ఆవిరితో కలిపి లోపలికి పీల్చుకొనునట్లు నీళ్లలో కలిపి వాడుదురు. మోతాదు 1 dr.—1 pt. నీళ్లు. శ్వాస నాళములో ఏదైన గురగురమనుచు బాధలేక నొప్పియున్నయెడల, ఈ మందు వెంటనే దానిని తగ్గించి నెమ్మది కలుగజేయును. స్రావమును హెచ్చించి, కఫ్లె పలుచబడునట్లును సళ్లుబడునట్లును చేయును. తామరకు ఈ మందు నుపయోగింతురు.

[1] Carbon dioxide. [2] Respiratory Depressants. [3] Expectorants.



[1]క్రియొసొట్:—మోతాదు 2—10 m. p.o. దీనిని పాలతోగాని, కాడ్లివర్ ఆయిల్‌తోగాని కలిపి యియ్యవచ్చును. [2]కరిగిపోవునట్టి గొట్టములలోబోసిగాని, చక్కెర మీదవేసిగాని యియ్యవచ్చును. దీనిని సాధారణముగా ఆవిరి పట్టుకొనునప్పుడు ఉపయోగింతురు.

దేహముమీద ఏదైన ఒక స్థలమునకు పూసినప్పుడు నొప్పిని తగ్గించి ఆంటిసెప్టిక్‌గా పనిచేయును. దీనిని నోటిద్వారా త్రాగించినప్పుడు కడుపులో మంట, వికారముపుట్టించి వాంతియగునట్లు చేయును. ప్రేగులలో కూడ ఇది ఆంటిసెప్టిక్‌గా పనిచేయును. ప్రేగులనుండి రక్తములోనికి యిది యింకినప్పుడు అమత్వచలయొక్క స్రావములన్నిటిని హెచ్చించును. ఈ మందు ఊపిరితిత్తులగుండను, మూత్రముగుండను బహిష్కరించబడును. ఈ రెండు అవయవములలోను ఇది ఆంటిసెప్టిక్‌గా పనిచేయును.

4. [3]బ్రాంకియల్ నాళముల ఈడ్పును తగ్గించు మందులు.

*a.* బెల్లడానా, అట్రొపిన్ (296-వ పుట చూడుము.)

*b.* అడ్రెనలిన్ (280-వ పుట చూడుము.)

*c.* ఎఫెడ్రిన్. మోతాదు, $\frac{1}{4}$—$1\frac{1}{2}$ gr. p.o. లేక s.c. వైద్యుని యుత్తర్వులేకుండ 24 గంటలలో 3 సార్లకంటె ఎక్కువగా నియ్యకూడదు.

ఈ మందును ఒక చిన్న పొదచెట్టునుండి సిద్ధముచేయుదురు. దీనిని లెబారటోరిలోకూడ కొన్ని వస్తువులనుండి సిద్ధము చేయుచున్నారు. అడ్రెనలిన్‌వలెనే యీ మందుకూడ పనిచేయునుగాని, దీనిని నోటిద్వారా కూడ త్రాగించవచ్చును. అప్పుడు ఇది చాలకాలము పనిచేయుచుండును. ఉబ్బసము, [4]హే ఫీవర్—వీనికి ఇది చాల విలువగల ఔషధము. గుండె చాల బలముగా కొట్టుకొనునట్లుచేసినను, త్వరలోనే దాని నణిచివేసి బలహీనపడునట్లు చేయును.

V. మూత్రావయవములమీద పనిచేయు మందులు

1. [5]డైయూరెటిక్స్ (మూత్రవర్ధకములు):- ఈ మందులు మూత్రమును హెచ్చించును.

*a.* గుండెకు బిగువునిచ్చు మందులు. ఎందుకనగా, ఇవి మూత్రపిండములకు ఎక్కువ రక్తము పారునట్లుచేయును.

[1] Creosote. [2] Capsules. [3] Bronchial spasm. [4] Hay fever. [5] Diuretics.

(1) డిజిటాలిస్, (281-వ పుట చూడుము.)

(2) క్యాఫిన్ (283-వ పుట చూడుము.)

*b.* [1]సేలైన్ డైయూరెటిక్స్ (లవణ మూత్రవర్ధకములు) ఇవి రక్తము ఎక్కువ నీటిని పీల్చుకొనునట్లు చేయును.

(1) పొటాసియమ్ సాల్ట్స (ఉప్పులు) మోతాదు, పొటాసియమ్ ఆసెటేట్ లేక సిట్రేట్, 15—60 gr. p. o., పొటాసియమ్ టార్ట్రస్ ఆసిడస్ 15—60 gr. p. o.

ఇవి క్షారసంబంధమైన మందులు. మూత్రమునందు పులుసు ఎక్కువ కలిసియున్నప్పుడు వీని నుపయోగించెదరు.

(2) సోడియమ్ సాల్ట్స (ఉప్పులు.) మోతాదు, సోడియమ్ ఆసిడ్ ఫాస్ఫేట్ 10—20 gr. p. o.

మూత్రము రియాక్షనులో ఆసిడ్‌గల దానినిగా జేయుటకు ఈ మందు నిత్తురు.

2. **మూత్రసంబంధమైన** ఆంటిసెప్టిక్స:-మూత్రావయవములందుగల సూక్ష్మజీవులను నాశనము చేయుటకు ఈ మందులు వాడుదురు.

*a.* యూరోట్రోఫిన్:—మోతాదు, 10—30 gr. p. o.

ఇది మూత్రమును సూక్ష్మజీవిరహితమైనదిగా (డిస్‌యిన్‌ఫెక్టెంట్) చేయును. మూత్రావయవములలో ప్రవేశించి, వానిలోని అమత్వాచలను గూడ సూక్ష్మజీవిరహితమైన వానినిగా చేయును. మూత్రములో ఆసిడ్ చేరియున్నప్పుడే యిది పనిచేయును. కావున మూత్రములో ఆసిడ్ లేనప్పుడు దీనిని సోడియం ఆసిడ్ ఫాస్ఫేట్ లేక అట్టిది మరియొక మందుతోచేర్చి యిచ్చెదరు.

*b.* [2]మెతిలెన్‌బ్లు మోతాదు, 1—5 gr.

*c.* [3]మాండెలిక్ ఆసిడ్ మోతాదు, దినమునకు నాలుగుసార్లు (q. i. d.)—45 gr.

VI. రక్తముమీద పనిచేయు మందులు

1. ఇనుము (ఫెర్రమ్.)

లెటస్, పచ్చని ఆకుకూరలు, గ్రుడ్లజన, మాంసము ముఖ్యముగా కాలేయము—ఇట్టి యాహారపదార్థములలో ఇనుముండును. రక్తములో ఇనుము తగ్గిపోయినప్పుడు, ఇనుముతో చేసిన మందుల నియ్యవచ్చును.

[1] Saline diuretics. [2] Methylene blue. [3] Mandelic acid.



ఇనుము రక్తములో ఇమిడిపోయినప్పుడు రక్తముయొక్క హీమొగ్లోబిన్ శాతమును (పెరసెంటేజిని) హెచ్చించును. (అనగా నూరుపాళ్ల రక్తములో నిది యిప్పుడు హెచ్చుగా చేరియుండును.) అట్లే రక్తములో ఎఱ్ఱని కణములును హెచ్చును. కావున ఇనుముయొక్క ముఖ్యమైన ఉపయోగమేదనగా — అనీమియ (రక్తహీనతను) పోగొట్టుటకు చికిత్సచేయుటయే. రక్తము కారుచున్నచోట ఇనుమును బెట్టినట్లయిన, రక్తము కారుట నిలిచిపోవును. దీనిని పుచ్చుకొన్నప్పుడు మలము నల్లగా నుండును. ఈ మందుబొట్లు గుడ్డలమీదను, దుప్పట్లమీదను పడినయెడల వానిని [1]ఆక్సాలిక్ ఆసిడ్‌తో తీసివేయవచ్చును.

**ఇనుముతో తయారుచేసిన మందులు**

*a.* ఈస్టన్స సిరప్. లేక సిరప్ ఆఫ్ ఐరన్, క్వినిన్, స్ట్రిక్‌నీన్, మోతాదు 30-60 m. p.o.

*b.* [2]బ్లాడ్స పిల్స (మాత్రలు) మోతాదు, 5-30 gr. p.o.

*c.* ఐరన్, క్వినిన్, ఆర్సెనిక్, స్ట్రిక్‌నీన్ పిల్స. మోతాదు, 1 మాత్ర, p.o.

*d.* ఐరన్ సిట్రేట్ లేక ఆర్సెనైట్ (దీనిని ఆంప్యూల్స్‌లో) i.m ఇన్‌జెక్షన్‌గా నిచ్చెదరు.

2. ఆర్సెనిక్ (పాషాణము) (299-వ పుట చూడుము.)

3. లివర్ (కాలేయము.)

[3]పాండురోగము లేక రక్తహీనత విషమించిన అనేక జబ్బులలో కాలేయమును వాడుదురు. అట్టి జబ్బులకు ఇది విలువైన ఔషధము. రక్తములో ఎఱ్ఱనికణములు తక్కువపడినను కాలేయము నిచ్చెదరు. భోజనముతోచేర్చి యెక్కువ పరిమాణముల కాలేయము నియ్యవచ్చును. అనేకవిధములుగా తయారుచేసిన [4]లివర్ ఎక్స్‌ట్రాక్ట్సను p.o. (నోటిద్వారాను) i.m. (కండరములయందును) లేక i.v. రక్తనాళములలోగాని యియ్యవచ్చును.

4. బ్లడ్‌ట్రాన్స్‌ఫ్యూషన్ (10-వ అధ్యాయము చూడుము.)

[1] Oxalic acid. [2] Blaud's pills. [3] Anemia. [4] Liver extracts.

VII. [1]దేహచర్మముమీద పనిచేయు మందులు

ఇవి చర్మముమీదను అమత్వచలమీదను పనిచేయును.

1. లోకల్ అనెస్తెటిక్స్ (స్థానిక స్పర్శనాశకములు) (దీనినిగూర్చి 37-వ అధ్యాయములో వ్రాయబడినది.)

2. బెల్లడానా—దీనిలో ముఖ్యపదార్థము అట్రోపిన్.

అట్రోపిన్‌తో చేసిన మందులు

*a.* అట్రోపిన్ సల్ఫేట్ 1/240—1/60 gr. లేక s.c. p.o.

*b.* బెల్లడానా లినిమెంట్ లేక [2]పలస్త్రీ, దీనిని స్థానికముగా (ఏదైన ఒక స్థానమున) నుపయోగింతురు.

*c.* [3]హొమాట్రోఫిన్. — దీని బొట్లు కండ్లలో వేయుదురు. అట్రోపిన్‌కంటె ఇది క్రమముగా పనిచేయునుగాని దీనిఫలితము చాల కాలము నిలిచియుండదు.

*d.* [4]హైయొసిన్ లేక స్కోపాలమీన్ హైడ్రొబ్రొమైడ్, $\frac{1}{200}-\frac{1}{100}$ gr. s.c.

ఈ మందు గుండెకును ఊపిరి తిత్తులకును చురుకుదనము కలిగించి [5]ఉబ్బసపు బాధను దొలగించును. దీనికిట్టి చురుకుదనము బుట్టించు గుణమున్నందున, నల్లమందువంటి వస్తువులవలన గలిగిన విషమును దొలగించుటకు చాల తోడ్పడును. అమత్వచమీద నిది పనిచేసి, స్రావమును రాకుండ ఆపును. అందుచేతనే గొంతు ఎండిపోవును. ఇతర స్రావములను—చెమట, పాలు, లేక ఉమ్మి నీరు మొదలగు వానినిగూడ నిదియాపును. చర్మముమీద వేయగా, నొప్పిని తగ్గించును గాన దీనిని [6]బెల్లడానా పలస్త్రీగా వేయుదురు. ఇది కంటిపాపను విస్తరింపజేయును. ఇట్లు దీని ఫలితము అనేకదినములు నిలిచియుండును. అందువలన ఈ మందు కంటి ఆపరేషను, పరీక్ష, చికిత్సలకు చాల విలువైనదిగా వాడబడును. హైయొసిన్ లేక స్కోపాలమీన్ అను మందులుగా దీనిని వాడినప్పుడు, మెదడు పనిని తగ్గించి, నిద్రగలుగజేసి, కలవరింతల నాపును. అనగా, రోగిని శాంతిపరచును.

[1] Periphery. [2] Plaster. [3] Homatropine.
Hyoscine or scopolamine hydrobromide. [5] Asthma.
[6] Belladonna plaster.



మితిమీరిన మోతాదుయొక్క గుర్తులు:—పెద్ద మోతాదులుగా ఈ మందు నిచ్చినయెడల రోగి ఎక్కువగా మాటలాడుచు దప్పిగొనును. చర్మము ఎండి కందినట్లగును. నాడి, శ్వాస త్వరితముగా కొట్టుకొనుచుండును. [1]ఎగశ్వాస పుట్టినమీదట కొన్నిసారులు ఈడ్పులు, గాఢమూర్ఛ సంభవించవచ్చును.

చికిత్స:—సాధ్యమైనంత త్వరగా వాంతి కలిగించు మందు లిమ్ము, లేదా, ఆహారకోశమును గడుగుము. విస్తారముగా నీళ్లిచ్చి, రోగి వెచ్చగాను, నెమ్మదిగాను నుండునట్లు చూడుము. కంటిపాపలు ముడుచుకొనుటకు [2]ఎస్ఎరిన్ అను మందును వాడవచ్చును. రోగిని క్రుంగజేయు గుణము మార్ఫియకున్నందున మార్ఫిన్‌ను ఈ సమయమున నియ్యకూడదు.

3. [3]అడ్రెనలిన్ (280-వ పుట చూడుము.)

4. ఎస్ఎరిన్, మోతాదు, 1/2 % సొల్యూషను కండ్లకు ఉపయోగించవలెను. ఈ మందు కంటిపాపలు ముడుచుకొనునట్లు చేయునుగాన, అట్రోపిన్ విషమునకు విరుగుడుగా దీనిని వాడుదురు.

VIII. జననేంద్రియములమీద పనిచేయు మందులు

1. గర్భకోశమునకు చురుకుదనము గలిగించునవి.

(*a*) [4]ఎర్గట్—[5]రై యను కాయధాన్యమునకు పట్టెడు ఒకవిధమైన [6]చీడ. మోతాదులు:—

(1) ఫ్లూయిడ్ ఎక్స్‌ట్రాక్ట్ ఆఫ్ ఎర్గట్ (ఎర్గట్ ద్రవసారము) 10–20 m. p.o.

(2) ఎర్గొమిట్రీన $\frac{1}{120}-\frac{1}{60}$ gr. p. o., $\frac{1}{240}-\frac{1}{120}$ gr. i.m.

దీని మితిమీరిన మోతాదులయొక్క లక్షణములేవనగా—కడుపులో వికారముగానుండి త్రిప్పట, వాంతియగుట, అతివిరేచనములు, [7]కొలాప్స్. తెంపులేకుండ చాలకాలము ఈ మందిచ్చినట్లయిన కాలుచేతుల వ్రేళ్లు పుండ్లయి క్రుళ్లిపోవచ్చును.

చికిత్స:—ఆహారకోశమును పలుమారు గడుగుట, గుండెకు చురుకుదనము గలిగించుమందు లిచ్చుట.

[1] Exhilaration. [2] Eserine. [3] Adrenalin. [4] Ergot.
[5] Rye. [6] Parasitic fungus. [7] Collapse.

(*b*) పిట్యూయిట్రిన్.—ఇది [1]ఇన్‌ఫన్‌డిన్ లేదా పిట్యూయిటరి ఎక్స్‌ట్రాక్ట్‌నుండి సిద్ధముచేసిన ఏదైన నొక మందై యుండవచ్చును. మోతాదు 2—5 యూనిట్స్ s.c.

దీనిని జంతువుల పిట్యూయిటరి గ్రంధినుండి సిద్ధముచేయుదురు. ప్రసవకాలమున నొప్పులు ఎక్కువచేయుటకును, గర్భకోశమునుండి రక్తము కారుటను ఆపివేయుటకును దీని నుపయోగించెదరు. ఆపరేషను జరిగిన తరువాత గాలిచేరుటచేత కడుపు ఉబ్బినను, ఇన్‌ఫెక్‌షన్ వలన కడుపు ఉబ్బినను, కడుపులో చేరిన వాయువును దీసివేయుటకును దీనిని వాడుదురు. ఇది గుండె బలముగాను, నిదానముగాను కొట్టుకొనజేయును. చిన్న రక్తనాళమును ముడుచుకొనజేయును. రక్తపు పోటునుగూడ హెచ్చించును.

(*c*) [2]క్వినీన్ హైడ్రోక్లోరైడ్ లేక సల్‌ఫేట్ 5—10 gr. p.o.
ప్రసవవేదన కలుగుటకో త్వరగా ప్రసవమగుటకో ఆముదముతో కలిపి క్వినీన్ ఇచ్చెదరు.

2. గర్భకోశమునకు నెమ్మది గలుగజేయు మందులు.

ఈ మందులను ముఖ్యముగా గర్భకోశము ముడుచుకొనుటను తగ్గించుటకును, నొప్పితో గూడిన ఋతుస్రావమును పోగొట్టుటకును వాడుదురు.

(*a*) మార్ఫిన్.

(*b*) [3]వైబర్నమ్. మోతాదు, [4]ఫ్లూయిడ్ ఎక్స్‌ట్రాక్ట్ ఆఫ్ వైబర్నమ్ ప్రునిఫోలియమ్. $\frac{1}{2}$—1 dr. p.o.

ఋతుస్రావమప్పుడు గలుగు నొప్పిని, అధికముగా ఋతుస్రావమగుటను ఆపివేయుటకు ఈ మందును ముఖ్యముగా వాడుదురు.

(*c*) [5]అనల్‌జీజిక్స్.

3. [6]ఇమెనగాగ్స్.

[1] Infundin. [2] Quinine. [3] Viburnum.
[4] Fluid extract of viburnum prunifolium. [5] Analgesics. [6] Emmenagogues.



ఋతుకాలములో మైలను హెచ్చుచేయుటకు ఈ మందులు వాడుదురు. బలమునిచ్చెడు సామాన్య మందు లేవనగా—ఇనుము, పాషాణము, స్ట్రిక్‌నీన్ మొదలైనవి.

4. [1]మాంసగ్రంధులనుండి తయారుచేసిన మందులు.

[2]ఓవరియన్ ఎక్స్‌ట్రాక్‌ట్స్:—మోతాదు, ఓవరియన్ ఎక్స్‌ట్రాక్ట్ లేక ఓవరియన్ సబ్‌స్టెన్స్, $\frac{1}{10}$—5 mgms. p.o., [3]కార్పస్ లూటియమ్. దీనిని కాప్‌సుల్స్ లేక బిళ్లలుగా నిచ్చెదరు. మోతాదు 1—10 mgms. i.m.

దీనిని పశువుల అండాశయములనుండి తీసి యెండబెట్టి తయారుచేయుదురు. రజస్వలయగుట ఆలస్యమైనప్పుడు, సంతానము లేనప్పుడు, ఋతుస్రావము క్రమముతప్పి వచ్చునప్పుడు ఈ మందులను ఉపయోగింతురు. గర్భవతులు వేవిళ్లు పడునప్పుడు మితిమించి వాంతులగుటను ఈ మందు లాపును. ఇందు నిమిత్తము ఈ మందును ముఖ్యముగా కండరములలోనికిగాని, రక్తనాళములలోనికిగాని సూదిద్వారా ఎక్కించెదరు.

IX. [4]సిద్ధౌషధములు

కొన్ని వ్యాధులను కుదుర్చుగుణముగల మందులకు స్పెసిఫిక్ డ్రగ్స్ (సిద్ధౌషధములు) అనిపేరు.

1. సిఫిలిస్ కొరకైన స్పెసిఫిక్.

*a*. ఆర్సెనిక్ (పాషాణము):—సిఫిలిస్ (సవామేహము)ను కుదుర్చుటకు ఇది విలువగలమందు. రోగబీజమునే యిది తాకి నాశనము చేయును. చిన్న మోతాదులు పుచ్చుకొనినయెడల ఆకలి యెక్కువగా పుట్టును. జీర్ణశక్తి వృద్ధియగును. శరీరపోషణ అంతయు హెచ్చును. ఇది రక్తకణములను గూడ హెచ్చించి, మితిమీరిన పాండురోగము (రక్తహీనత)ను స్వస్థపరుచునట్టి విలువగల ఔషధము.

దీనితో సిద్ధముచేసిన మందులు

(1) ఫౌలర్స్‌సొల్యూషన్, లిక్కర్ ఆర్సెనికాలిస్. 2—8 m. t.i.d. మోతాదులను ప్రతిదినము 3 m. వంతున హెచ్చించి, అధిక పక్షపు మోతాదు వచ్చువరకు ఇచ్చెదరు.

(2) ఇనుము, క్వినీన్, ఆర్సెనిక్, స్ట్రిక్‌నిన్ 1 pill p.o.

[1] Gland products. [2] Ovarian extracts.
[3] Corpus luteum in capsules or tablets or ampules. [4] Specific Drugs.

(3) ఐరన్ ఆర్సెనైట్ లేక ఐరన్ ఆర్సెనిక్ సొల్యూషన్. దీనిని ఆంప్యూల్స్‌గా i. m. (కండరములలోనికి ఇయ్యవలెను.)

(4) [1]సోడియమ్ కాకొడిలేట్ ¼—1 gr. s.c.

(5) [2]ఆర్స్‌ఫెనమిన్, నియోఆర్స్‌ఫెనమిన్ లేక సల్ఫార్స్‌ఫెనమిన్ i.v. (రక్తనాళములలోనికి ఇయ్యవలెను.) సిఫిలిస్‌కొరకు మోతాదులను హెచ్చించుచుండవలెను.

దీని మితిమీరిన మోతాదుయొక్క లక్షణము లేవనగా—ప్రేగుల యందు వాయువుచేరి తొందర కలిగించుట, [3]నరములు కందుట, [4]చర్మము మీద మచ్చేలు, చర్మముపొక్కుట, రక్తభేదులగుట. రోగికి అధిక దాహమగుటయు నుండును. దేహమునుండి ద్రవము పోయినందున మూత్రము కొద్దిగాపోయును. [5]కొలాప్స్, గాఢమూర్ఛయును, ఈడ్పులును సంభవించును.

దీనికి చికిత్సగా మందును ఆపివేయవలెను. విషము మితిమించియున్న యెడల ఐరన్ హైడ్రాక్సైడ్ ఇయ్యవలెను. దీనిని మాత్రమేగాని లేక దీనిని మెగ్నీషియతో చేర్చిగాని ఇయ్యవచ్చును. మెగ్నీషియ, విషమునకు విరుగుడుగా పనిచేయును. ఆహారకోశములోనుండి [6]ఐరన్, ఆర్సెనిక్ అనువాని మిశ్రమమును తొలగించుటకు అన్నకోశమును కడుగునట్టిగాని, వాంతియగునట్టిగాని మందుల నియ్యవలెను. రోగికి కొలాప్స్ కలిగిన యెడల కాఫిన్, ఆట్రొపిన్, స్ట్రిక్‌నిన్—వీనిలో ఏదో ఒక దానినిచ్చి ద్రవములను ఎక్కువగా నియ్యవలెను. పిమ్మట బిస్మత్, చాక్ (సున్నము), లేక ఓపియమ్ (నల్లమందు) వీనిని అతి విరేచనములు కట్టుకొనుటకు ఇయ్యవలెను.

*b.* పాదరసము:—ఈ మందు ఆంటిసెప్టిక్‌గా పనిచేయును. సిఫిలిస్ రోగక్రిములను నాశనము చేయును. ఇది విరేచనముల మందు. దీనిని పుచ్చుకొనిన తరువాత భేదికి యుప్పుమందు త్రాగవలెను. స్రావములన్నిటి నిది హెచ్చించును. ముఖ్యముగా ఉమ్మినీటిని హెచ్చించును. పైత్యరస మెక్కువగా ఊరుటకు దీని నిచ్చెదరు.

[1] Sodium cacodylate. [2] Arsphenamine. [3] Neuritis.
[4] Pigmentation. [5] Collapse. [6] The compound of iron and arsenic



(1) దీనితో సిఫిలిటిక్ తదితర చర్మవ్యాధులకు బూసెడు అంజనములు చేయుదురు.

(*a*) ఘాటులేని అంజనము లేక బ్లూ ఆయింట్‌మెంట్‌ను సిఫిలిస్‌కు [1]చర్మములోనికి ఇనుకునట్లు రుద్దుదురు.

(*b*) అమ్మోనియేటెడ్ మెర్క్యురి ఆయింట్‌మెంట్‌ను ముఖ్యముగా, చీము పోయు పుండ్లకు పూయుదురు. వీని కిది విలువైన ఔషధము.

(*c*) యెల్లో ఆక్సైడ్ ఆఫ్ మెర్క్యురియనునది కండ్లకలకకు చాల విలువగలమందు. కంటిరెప్పకు, కాయకాసినప్పుడు పెరుగకుండ ఆపుటకును, కంటిలోపడిన నలుసులు మొదలగు వానిని తీసివేసిన తరువాత కలుగు బాధను తగ్గించుటకును ఈ మందు బాగుగా ఉపయోగపడును.

(2) నోటిద్వారా ఇచ్చెడి పాదరసపు మందులు.

(*a*) కాలోమెల్:—రసకర్పూరము (హైడ్రార్‌జరి క్లోరిడమ్ మిటె) దీనినే సబ్‌క్లోరైడ్ ఆఫ్ మెర్క్యురి యందురు. మోతాదు ½—3 gr. p. o.

(*b*) పొటాసియమ్ మెర్క్యురి ఐయొడైడ్స్ (మిశ్రమ చికిత్స చేయవలెను.) సిఫిలిస్‌కు p.o.

(3) కండరములలోనికి ఉపయోగించు మందులు:— మెర్క్యుకొసాల్, దానివంటి ఇతరమైన మందులును సిఫిలిస్‌కు వాడుదురు.

మితిమీరిన మోతాదునకు గుర్తులేవనగా—నోటిలో లోహపు రుచి యుండును. గొంతులో మండుచుండు బాధ యుండును. లాలాజలము విస్తారముగా నూరుచుండును. కడుపులో శూలనొప్పివంటి నొప్పి, డోకు, వాంతులు, అతివిరేచనములు, మలముతో రక్తముపడుట, ఆల్బ్యుమిన్ లేక రక్తముగలిగిన మూత్రమును కొద్దిగా పోయుట. అదియునుగాక విస్తరించి వాంతి, విరేచనములగుట మూలమున చలువ గమ్ముట, నాడి బలహీనముగను త్వరితముగను క్రమము తప్పియు కొట్టుకొనుట, ముఖము వాడిపోయి, రోగి విచారముగా నున్నట్టు కనబడుట, చర్మము చల్లగను తడిగను ఉండుట, శ్వాస నిదానముగను, పైపైదిగను నుండుట. మరణమునకు ముందు ఈడ్పులు, గాఢమూర్ఛయు సంభవించవచ్చును. మూత్ర

[1] Inunctions.

పిండములలో పాదరసము చేరియున్నందున, అవి యెక్కువగా కంది పై రోగలక్షణములకు కారణము కావచ్చును. మరణమే సంభవించని యెడల, రోగి క్రమేణ తెప్పరిల్లును. చిగుళ్లు పుండ్లగుట, నోరు లేక గొంతుకకూడ పుండగుట సహజము. జీర్ణము సరిగా లేనందున రోగి పోషణలేక కేవలము సన్నగిలి పోవును. కండరములు బలహీనపడి, రోగి వశము దప్పియుండవచ్చును. దీనినే పాదరసపు పక్షవాతము ([1]మెర్క్యూరియల్ పాల్సి) యందురు.

చికిత్స:—కోడిగ్రుడ్డు తెల్లజెనగాని పాలుగాని యిమ్ము. ఇవి పాదరసముతో చేరి దానికి విరుగుడుగా పనిచేయును. ఆహారకోశమును బాగుగా కడుగుము; లేదా, వాంతియగు మందులిమ్ము. చలువ గమ్మిన యెడల గుండెకు చురుకుదనము బుట్టించు మందుల నుపయోగించుము. అతివిరేచనముల నాపుటకును రోగిని శాంతిపరచుటకును మార్ఫిన్ లేక నల్లమందు నిత్తురు. పొటాసియమ్ క్లోరేట్ లేక [2]టానిక్ ఆసిడ్ నుపయోగించి నోటిని గడుగుము. అప్పుడు పుండైన చిగుళ్లు బాగుపడును; బాధతగ్గును. చిగుళ్లకు [3]టింక్చర్ ఆఫ్ మిర్ (బోళము) కూడ పూయవచ్చును.

(*c*) ఐయొడైడ్స్, పొటాసియమ్, సోడియమ్, అమ్మోనియమ్ మోతాదు 5–30 gr. p.o. సిఫిలిస్‌కు మూడవదశలో పెద్ద మోతాదులు ఇయ్యవచ్చును.

ఈ మందులు సిఫిలిస్ మూడవదశయందుండగా వాడదగిన సిద్ధౌషధములు. ఇవి అమత్వచలయొక్క స్రావమును హెచ్చించును. థైరాయిడ్ గ్రంధి యనుదానికి ముందటికంటె ఎక్కువ ఐయొడీనును కలుగజేసి, దాని స్రావమునుగూడ అధికముచేయును. ఈ మందులను తెరిపిలేకుండ ఇచ్చినయెడల, [4]గాయిటర్ (గలగండము) తగ్గించును. ఈ మందులు మెర్క్యూరి, ఆర్సెనిక్ (పాషాణము)నకు విరుగుడులు.

మితిమీరిన మోతాదుయొక్క గుర్తులేవనగా:—క్రానిక్ విషప్రయోగము లేక [5]'ఐయొడిజం,' ముక్కునుండి నీరు విస్తారముగా గారుచుండును. తుమ్ము లధికమగును. కన్నీళ్లు, ఉమ్మినీరు, శ్వాసనాళములలో కళ్లె అధికమగును. దీనితో దగ్గుచేరియుండును. నొసలుపోటు, రోగి క్రుంగియుండుట, అలసట, చర్మమీద పొక్కులు, గొంతురాచుటయు సహజమే.

[1] Mercurial palsy. [2] Tannic acid. [3] Tincture of myrrh. [4] Goitre. [5] Iodism.



చికిత్స:—మందు నాపివేసి, పొటాసియమ్ క్లోరేట్ నీటితో గొంతువరకు బాగుగా పుక్కిలించి ఊయవలెను.

(*d*) బిజ్మత్. [1]జీర్ణావయవములమీద పనిచేయు మందులనుగూర్చి వ్రాసినది చూడుము.

2. మలేరియకు సిద్ధౌషధములు.

*a.* క్వినీన్. క్వినీన్, సింకోన, ఈ రెండును సింకోనయను చెట్టు బెరడునుండి లభించుచున్నవి. క్వినీన్ మలేరియ క్రిములను జంపును. అతి శ్రేష్ఠమైన చేదు టానికులలో నిదియొకటి.

దీనితో తయారుచేసిన మందులు

(1) క్వినీన్ సల్ఫేట్, బైసల్ఫేట్, బైహైడ్రొక్లోరైడ్. మోతాదు, 1–10 gr. p.o., లేక 5 gr. i.m. లేక i.v. సొల్యూషను అయినట్లయిన నెక్కువ పనిచేయును. ఈ సొల్యూషనులోని క్వినీన్ కరుగుటకుగాను ఏదైన ఆసిడ్, సాధారణముగా హైడ్రొక్లోరిక్ లేక సిట్రిక్ ఆసిడ్‌ను సొల్యూషనుతో చేర్చవలెను.

(2) [2]సింకోన ఫెబ్రిఫ్యూజ్. మోతాదు, 5–15 gr. p.o. దీనిని చూర్ణము, కాప్‌సుల్స్, (గొట్టములు) మాత్రలు, లేక సొల్యూషను రూపమున నియ్యవచ్చును. క్వినీన్ ఇచ్చుటకు ఉదయమే శ్రేష్ఠమైన కాలము. ఎందుకనగా, చలి, జ్వరము ఆరంభమైనప్పుడే క్వినీన్ రక్తములో చేరి వెంటనే పనిచేయును.

[3]రోగుల అసాధారణ ప్రవర్తనలు:—కొందరు రోగులు చిన్న మోతాదుల మందు పుచ్చుకొన్నను వారియందు విషఫలితములు కనబడును. చెవులలో మోతలు వినబడును. కొంతకాలము చెవుడేర్పడును. చూపు తగ్గి మసకగా కనబడును. తలనొప్పియు, నాడి నిదానముగను బలహీనముగను కొట్టుకొనుటయు, మరికొన్ని లక్షణములు నుండును. మూత్రములో రక్తము చేరి యుండవచ్చును.

[1] Alimentary system. [2] Cinchona febrifuge. [3] Idiosyncrasies.

*b.* ప్లాజ్మొక్వీన్.—మోతాదు $\frac{1}{6}$–$\frac{1}{3}$ gr. p.o. ప్రతిదినము ఇయ్యవలెను. ఇది లెబారటొరిలో తయారుచేసిన మందు. స్వచ్ఛమైన క్వినీన్ పుచ్చుకొనుటవలన గలిగెడు కొన్ని అవలక్షణములు దీనివలన గలుగవు.

*c.* ఆటెబ్రిన్.—మోతాదు $1\frac{1}{2}$ gr. p.o., b. i. d. (దినమునకు రెండుసారులు) చొప్పున 5 దినములియ్యవలెను. ఇది మలేరియ సూక్ష్మజీవిని జంపును. దీర్ఘకాలము జీర్ణించిన మలేరియకు చాల మంచిమందు. దీనివలన రోగికి విషప్రయోగముగాకుండ, అతడు వైద్యుని వశమున నుండవలెను.

3. అమీబిక్ డిసెంటెరి (రక్తభేది)కి సిద్ధౌషధములు.

*a.* ఎమిటీన్. — [1]కుక్కపాలచెట్టు (ఇపికాక్ఉఆన) వేరులనుండి దీనిని తయారు చేయుదురు. [2]ఎంటమీబహిస్టొలిటిక యను అమీబిక్ రక్తవిరేచనములకు హేతుభూతమైన సూక్ష్మజీవిని నాశనముచేయును.

మోతాదు—ఎమిటీన్ హైడ్రొక్లోరైడ్, $\frac{1}{2}$–1 gr. s. c. లేక i.v. ఎమిటీన్ బిజ్మత్ ఐయొడైడ్ ఇది ఆరెంజిరంగుగల చూర్ణము. మోతాదు 1–3 gr. దీనిని మాత్రలుగాగాని, కాప్సుల్సగాగాని ఇయ్యవచ్చును. రాత్రులలో దీనిని లిక్విడ్ పారఫినందు గలిపి, కోకో మీదగాని పాల మీదగాని దేలునట్లుచేసి, రోగి కియ్యవచ్చును.

*b.* [3]కర్చి.—ఇదియు ఒకచెట్టు బెరడునుండి లభించును. మోతాదు— కర్చి యెక్స్‌ట్రాక్ట్, 10–20 gr. p.o., b. i. d. (నోటిద్వారా ప్రతిదినము రెండుసార్ల చొప్పున) 10 దినములియ్యవలెను. కర్చి బిజ్మత్ ఐయొడైడ్, 10 gr. p.o., b. i. d. 10 దినములియ్యవలెను. సోడియమ్ బైకార్బొనేట్ 60 gr. సోడియమ్ సిట్రేట్ 40 gr. p.o. యిచ్చిన అరగంట సేపటికి కర్చి బిజ్మత్ ఐయొడైడ్ నియ్యవలెను.

*c.* [4]కార్‌బార్‌సాన్ యనునది పాషాణమునుండి తయారుచేయబడిన మందు. మోతాదు 4 gr. దినమునకు రెండుసారులు వంతున పదిదినములియ్యవలెను.

4. కుష్ఠరోగమునకు ఉపయోగపడు మందులు.

[1] Ipecacuanha. [2] Entameba histolytica. [3] Kurchi. [4] Carbarsone.



*a.* [1]చాల్మూగ్ర ఆయిల్ (నూనె). దీనిని ఒక చెట్టువిత్తనముల నుండి చేసియున్నారు. ఇది కుష్ఠువ్యాధిని గలిగించు సూక్ష్మజీవులను జంపుటకు తోడ్పడును. స్థానికముగా (దేహముమీద ఏదైన ఒక స్థలమున) లేచిన పుండ్లకు రాయుదురు. దీనిని నోటిద్వారా గూడ నియ్యవచ్చునుగాని, ఆహారకోశములో మంటగానుండును. సాధారణముగా నిచ్చెడు మోతాదు 1 cc. మోతాదులను క్రమముగా హెచ్చించుచు చర్మములోనికిగాని, చర్మముక్రింద (s. c.) గాని యియ్యవచ్చును.

*b.* హిడ్నొకార్పస్ ఆయిల్. ఇదియు చాల్మూగ్ర ఆయిల్‌వలెనే పనిచేయును. మోతాదు హిడ్నొక్రియోల్ 1–8 cc. s. c., దీని మోతాదులను క్రమముగా హెచ్చించుచు నియ్యవలెను.

X. నానావిధములైన మందులు

1. సల్ఫోనమైడ్స

ఇటీవల కనుగొనబడి, వాడుకలోనుండిన నూతన మందుదినుసులలో సల్ఫోనమైడ్స తరగతికి చేరినవి ముఖ్యమైనవి. ఈ తరగతిలో మొదట సల్ఫనిలమైడ్ అను దానిని [2]గెల్మో అను నతడు 1908–వ సంవత్సరము సిద్ధముచేసెను. ఇతడు గుడ్డలకు రంగులద్దువాడు. చాయపోని రంగులను కనుగొనవలెనని [3]"ఎజొడైస్" అను రంగులను ఈయన పరిశోధించుచుండగా సల్ఫనిలమైడ్‌ను కనుగొనెను. ఎజొడైస్ అనునవి ఉన్ని, పట్టులయొక్క ప్రోటీనుతో కలియుటనుబట్టి, యివి బాక్టీరియ ప్రోటీనులోను కలిపినయెడల సూక్ష్మజీవులను చంపగల ఔషధము కావచ్చునని [4]ఐజెన్‌బర్గు అను నతనికి తలంపుకలిగెను. 1913–వ సం॥ ఐజెన్‌బర్గు అను నతడు [5]క్రిసాయిడిన్, అను రంగు సూక్ష్మజీవిని చంపగలిగినదని కనుగొనెను. కొద్దికాలములోనే [6]పిరిడియం, [7]స్కార్లెట్ రెడ్ (ఎఱుపురంగు)—ఈ రెంటిని మందులయందు ఉపయోగించిరి. అయినను 1932–వ సంవత్సరమున [8]'ప్రాంటొసిల్' అను రంగును, మరికొన్ని ఎజొ రంగులను పరిశోధింప నారంభించిరి. 1932–వ సంవత్సరమున జర్మనీదేశస్థుడైన డొమాక్ అను నతడు పరిశోధనచేసి, [9]'స్ట్రెప్టొకాకల్ సెప్టిసీమియ' అను విషమును చిట్టెలుకలలో ఉద్దేశపూర్వకముగా ప్రవేశపెట్టి, ఆ విషమువలన ఎలుకలకు ఏ హానియుకలుగకుండ

[1] Chaulmoogra oil. [2] Gelmo. [3] Azo dyes. [4] Eisenberg. [5] Chrysoidin. [6] Pyridium. [7] Scarlet red. [8] Prontosil. [9] Streptococcal septicemia.

రక్షించవచ్చునని రుజువుచేసెను. స్ట్రెప్టోకాకల్ విషములకు విరుగుడుగా తాను చేసిన పరిశోధనా నివేదికలను డోమాక్ 1935-వ సం॥ ప్రచురించెను. వెంటనే యితరులు సల్ఫోనమైడ్సతో ఇతర పరిశోధనలను గావించ నారంభించిరి. 1935-వ సం॥న పారిసు పట్టణములోని పాస్టర్ ఇన్‌స్టిట్యూట్ వారు పరిశోధించి, మానవశరీరములో ఎజోడైస్ అను రంగులు విభజింపబడి సల్ఫనిలమైడ్ గ అగుచున్నదనియు, సూక్ష్మజీవిని చంపుటకు మంచి పనిచేసెడు [1]కెమొతెరప్యూటిక్ మందుగా ఈ పదార్థము మారుచున్నదనియు ప్రకటించిరి. అప్పటినుండి సల్ఫనిలమైడ్‌ను అనేక వ్యాధులకు వాడి, సూక్ష్మజీవులను జంపుటకు దీనికి విస్తారమైన శక్తియున్నదని తెలిసికొనిరి. ఒక్క స్ట్రెప్టోకాకల్ విషములకేకాక, యితర అంటు వ్యాధులకును ఇది పనిచేయుననియు తెలిసికొనిరి. దీనిని కనుగొనినతోడనే ఔషధశాస్త్రాభ్యాసములలో గొప్ప మార్పులుగలుగ నారంభించినవి. సల్ఫనిలమైడుకు సంబంధించిన చిల్లరమందు లెన్నోయున్నవి. వీనిని చిల్లర సల్ఫోనమైడ్స మందు లనవచ్చును. అసలు తల్లిమందు దినుసుకంటె ఈ చిల్లరదినుసులు ఎక్కువగా ఉపయోగపడుచున్నవి. [2]సల్ఫపిరిడిన్, [3]సల్ఫతయజోల్, [4]సల్ఫగ్వానెడిన్, [5]సల్ఫడయజీన్, [6]సక్సినల్ సల్ఫతయజోల్, [7]తాలిల్ సల్ఫతయజోల్ — సల్ఫనిలమైడ్ జాతిలో ఇవి ముఖ్యమైనవి. (800 లకు పైగా పరిశోధించి ముఖ్యమైనవానిని తేల్చిరి). ఔషధాభ్యాసములో పైన బేర్కొన్న ముఖ్యమైన సల్ఫోనమైడ్స మందులు చాల ఉపయోగకరముగానున్నట్టు కనుగొనియున్నారు. ప్రస్తుతకాలములో ఆయా క్లినిక్స (చికిత్సాలయము)లలో పరిశోధనచేసి, పెక్కు గ్రంథములు వ్రాయగలిగి నన్నిసంగతులు తెలిసికొనియున్నారు. ఈ రిపోర్టులనుబట్టి చూడగా, గతకాలములో సల్ఫోనమైడ్సకు సంబంధించిన మందులను వాడిన వ్యాధులన్నిటియందు, సల్ఫడయజీన్ అను దానిని వాడుటవలన మొదటి మూడు ముఖ్యమైన సల్ఫోనమైడ్సయొక్క గుణములకంటె ఎక్కువ ప్రయోజనకారిగానున్నది. దీనికి కారణమేమనగా, సల్ఫడయజీన్ అను దానికి సల్ఫనిలమైడ్, సల్ఫపిరిడీన్, సల్ఫతయజోల్ అను వానికి ఉన్నంతశక్తి యుండుటయేకాక, దేహములోనికి పోయినప్పుడు

[1] Chemotherapeutic agent. [2] Sulphapyridine. [3] Sulphathiazole.
[4] Sulphaguanidine. [5] Sulphadiazine. [6] Succinylsulphathiazole.
[7] Phthalylsulphathiazole.



దీనికిగల విషపుశక్తి చాల తక్కువైయుండును. [1]జాఠరీయ ప్రేగులమార్గములో చేరియుండు విషములకు సల్ఫగ్వానడిన్ అనునది చాల గొప్ప పనిచేయునని రుజువుచేయబడినది. ముఖ్యముగా కోలన్ బసిల్లస్ సంబంధమైన ఇన్ఫెక్షన్లకు విరుగుడుగా ఇది బాగుగా పనిచేయును. బస్సిలరి రక్తభేది, ముఖ్యముగా, [2]ఫ్లెక్స్‌నర్ అను క్రిమిసంబంధమైన రక్తభేదికి ఇది అద్భుతముగా పనిచేయును. భావికాలములో సల్ఫోనమైడ్స ఎక్కువ ప్రయోజనకరమైన ఔషధములగునను నిరీక్షణకలదు.

నోటిమూలమున పుచ్చుకొన్నప్పుడు సల్ఫోనమైడ్స త్వరగా హరించిపోవును. మరియు మూడునుండి నాలుగు గంటలలో రక్తమునం దివి ఎక్కువగా నిలిచి పనిచేయును. [3]ఆల్కలైస్ ఇచ్చుటవలన సల్ఫోనమైడ్స త్వరగా హరించిపోవునట్లు చేయవచ్చును. రక్తప్రవాహములో చేరగానే సల్ఫోనమైడ్స దేహములోని ద్రవములలోనికిని, టిష్యూలలోనికి త్వరగా దూరిపోయి పనిచేయును. మూత్రపిండముల మూలమున ఈ మందులు బహిష్కరింపబడును.

ఈ మందులు పుచ్చుకొనుటవలన సాధారణముగా కలుగు ప్రతిక్రియలు (రియాక్షనులు) ఏవనగా-వాంతి, బలహీనత, తలనొప్పి, జ్వరము, దేహము నీలిరంగుగా మారుట, శ్వాసావరోధము, దద్దురులు, పచ్చకామెరలు, రక్తహీనత, తెల్లకణముల సంఖ్యతగ్గుట, మూత్రములో రక్తము పడుట మొదలైనవి.

స్ట్రెప్టోకాకస మెనింగోకాకస్, న్యుమొకాకస్, గానోకాకస్, స్టాఫిలోకాకస్, బాక్టీరియం కొలై, గాస్ గాంగ్రీన్ అను ఇన్ఫెక్షన్లలో క్రిముల ఫలితముగా కలుగు విషములకును, ఇన్ఫెక్షన్లకును సల్ఫోనమైడ్స బాగుగా ప్రయోగించును.

సల్ఫోనమైడ్ మందులిచ్చుచుండగా గమనించవలసిన హెచ్చరికలు

*a*. మూత్రపిండములు చెడిపోకుండ విస్తారముగా నీళ్లుత్రాగించవలెను.

*b*. రోగియొక్క మూత్రము, హిమొగ్లోబిన్ తెల్లకణములు—వీనిని దినము మార్చి దినము పరీక్షించుచుండవలెను.

*c*. నోటిగుండ సోడియం బైకార్బొనేట్ యిచ్చినట్లయిన, మందు త్వరగా హరించుటయే కాక, రోగికి డోకు, వాంతి రాకుండతగ్గించును.

[1] Gastro-intestinal tract. [2] Flexnor organism. [3] Alkalis.

వ్యాధినిబట్టియు, ఏ రకము సల్ఫోనమైడ్స్ ఇచ్చెదరో దానినిబట్టియు ఎంత మోతాదు ఇయ్యవలెనో నిర్ణయమగును.

సాధారణమైన వ్యాధులకు చికిత్సచేయుటకై యిచ్చెడు సల్ఫోనమైడ్స్ మందురకములను, వాని మోతాదులను క్రింద వేర్కొనుచున్నాము:—

స్ట్రెప్టొకాకస్ సంబంధమైన ఇన్ఫెక్షన్లకు

సల్ఫడయజీన్, సల్ఫనిలమైడ్. మోతాదు 30—60 గ్రెయినులు ప్రారంభమున ఇయ్యవలెను. తరువాత ప్రతి 4 గంటలకొకసారి 7½ గ్రెయినుల చొప్పున దేహోష్ణము నార్మల్‌కు వచ్చినతరువాత 3 దినములియ్యవలెను.

స్టాఫిలొకాకస్ సంబంధమైన ఇన్ఫెక్షన్లకు

సల్ఫడయజీన్, సల్ఫతయజోల్:—మోతాదు, పైన స్ట్రెప్టొకాకస్ ఇన్ఫెక్షన్లకు ఇచ్చిన మోతాదులనే యియ్యవలెను. (ఈ మందులు సెప్టిసీమియ ఇన్ఫెక్షన్లకు, కండ్లు, ముక్కు, గొంతు ఇన్ఫెక్షన్లకు, ఆస్టియోమయలైటిస్ మొదలగువానికి శ్రేష్ఠమైనవి.

గొనొకాకల్ ఇన్ఫెక్షన్లకు

సల్ఫడయజీన్, సల్ఫపిరిడిన్, తరువాత సల్ఫనిలమైడ్.

మోతాదు:—మొదటి 4 దినములు (దినమునకు) 80 గ్రెయినులు

| | | | |
|---|---|---|---|
| తరువాత 3 దినములు | ( ,, ) | 60 | ,, |
| రెండవవారము | ( ,, ) | 40 | ,, |
| మూడవవారము | ( ,, ) | 20 | ,, |

మెనింగొకాకల్ ఇన్ఫెక్షన్లకు

సల్ఫడయజీన్, సల్ఫపిరిడిన్.

మోతాదు:—ప్రారంభమున 60 గ్రెయినులు, తరువాత మొదటి రోజున 30 గ్రెయినులు—4 గంటలకొకసారి. తరువాత దేహోష్ణము మామూలుగ మూడు దినములుండువరకు 4 గంటలకొకసారి 15 గ్రెయినులు ఇయ్యవలెను.

C. వెల్‌ష్.

సల్ఫడయజీన్, సల్ఫనిలమైడ్, సల్ఫపిరిడిన్.

మోతాదు:—ప్రారంభమున 60 గ్రెయినులు; దేహోష్ణము మామూలుగ మూడు దినము లుండువరకు 4 గంటలకొకసారి 15 గ్రెయినులు, తరువాత కొన్నిదినముల వరకు 7½ గ్రెయినులు 4 గంటలకొకసారి యియ్యవలెను.



న్యుమోనియ

సల్ఫడయజీన్, సల్ఫతయజోల్, సల్ఫపిరిడిన్ వీనిని (పైన వెల్‌ష్‌కి) పేర్కొన్న వరుసనే యియ్యవలెను.

మూత్రసంబంధమైన ఇన్ఫెక్షన్లకు

సల్ఫడయజీన్, సల్ఫనిలమైడ్.

మోతాదు:—మొదట 30 నుండి 60 గ్రెయిలవరకు; తరువాత జ్వరము దిగి ఉష్ణోగ్రత మామూలుకువచ్చువరకు 4 గంటలకొకసారి 15 గ్రెయినుల చొప్పున యియ్యవలెను.

శ్యాంక్రాయిడ్

సల్ఫనిలమైడ్.

మోతాదు:—మూత్రమార్గములో అంటుచేరినప్పుడు ఇచ్చే మోతాదులే యియ్యవలెను.

రక్తభేది

సల్ఫగ్వానడిన్ (దీని నిప్పుడు సక్సినల్ సల్ఫతయజోల్, తాలిల్ సల్ఫతయజోల్ అందురు).

మోతాదు:—ప్రతిదినము 180 గ్రెయినుల చొప్పున 2 నుండి 7 దినములవరకు ఇయ్యవలెను.

అండ్యులెంట్ ఫీవర్[1] (జ్వరము)

సల్ఫడయజీన్.

మోతాదు:—మొదట 15 నుండి 30 గ్రెయినులు, తరువాత దినమునకు 40 గ్రెయినుల చొప్పున 2 వారములు లేక యెక్కువకాలము ఇయ్యవలెను.

లింఫొగ్రాన్యులోమ వెనేరియం

సల్ఫనిలమైడ్, సల్ఫగ్వానడిన్, సల్ఫడయజీన్.

మోతాదు:—2 వారములనుండి 2 నెలలవరకు ప్రతిదినము 7½ గ్రెయినుల చొప్పున యిచ్చుచుండవలెను.

2. పెనిసిలిన్[2].

పెనిసిలిన్ అనునది సూక్ష్మజీవులను జంపునట్టి మందులలో మిక్కిలి బలమైనది. దీనిని 'పెనిసిలియం నోటటమ్' అను బూజునుండి సిద్ధము

[1] Undulant fever. [2] Penicillin.

చేయుదురు. ఇది పసుపు పచ్చని చూర్ణము. నీళ్లు, గ్లూకోసు, లేక నార్మల్ సేలైనులో సులభముగా కరుగును. మూత్రపిండములు (కిడ్నీస్), కాలేయము (లివర్) నుండి యిది చాల వేగముగ స్రవించును. స్టఫీలోకాకస్, హిమొలిటికస్, స్ట్రెప్టొకాకస్, న్యుమొకాకస్, గనొకాకస్ అను రోగబీజములవలన గలిగిన అంటును గొట్టివేయుటకు ఇది యెక్కువ శక్తిగల మందు. సిఫలిస్‌కు చికిత్సగా కూడ దీనిని ఉపయోగించవచ్చును.

మోతాదు:—40,000—120,000 యూనిట్లను i. v. లేక i. m. గా ఒక వారము ఇచ్చినట్లయిన పై జెప్పిన అంటులేవైనను బాగవును. గాయములపైనగూడ దీనిని పూయవచ్చును.

3. చేపకాలేయపు నూనె:—(చేపనూనె) కాడ్, హాలిబట్, షార్క్స అను చేపలనుండి యీ నూనె తీయుదురు. రికెట్స్ (ఎముకలు వంగుట), క్షయ, రోగిని కృశింపచేయు నిట్టి యితర వ్యాధులకు ఈ నూనె దివ్యౌషధము. దీనిని కొంత తీసికొని, దానికి సమాన పరిమాణముగ వాజిలీనును కలిపి కాలిన గాయములకు, పుండ్లకు, ఇతర గాయములకు పూయుటకు చాల శ్రేష్ఠమైన అంజనమగును. దీనిని చాలకాలము రోగికి విడువకుండ యిచ్చినట్లయిన రోగియొక్క ఆరోగ్యము మొత్తముమీద బాగుపడును; రోగి బలపడును. ఇది బిడ్డల పోషణను ప్రేరేపించి, వారి యెముకలు పెరుగజేయును. వారి యాకలి యెక్కువ యగునట్లును జేయును.

*a.* కాడ్‌లివరాయిల్. ఇది స్వచ్ఛమైనదిగాగాని, హైపోఫాస్ఫైట్స్, మాల్ట్, లేక ఐరన్ (ఇనుము)తో కలుపబడిన ఎమల్షన్‌గాగాని యుండవచ్చును. మోతాదు 1—4 dr. p. o. చిన్నపిల్లలు కాడ్‌లివరాయిల్ నోటితో త్రాగలేనప్పుడు దానిని వారి యొంటికి యినుకునట్లు ఎదురొమ్ము చర్మముమీద బాగుగా రుద్దవచ్చును.

*b.* [2]హాలిబట్ లివరాయిల్ లేక హాలివరాయిల్. 1—3 m. p. o.

*c.* షార్క్ లివరాయిల్. 20—30 m. p. o.

4. ఇన్సులిన్:-జంతువుల [3]పృక్వకమునుండి దీనిని తీసి తయారుచేయుదురు. అతిమూత్రవ్యాధికి ఇది మంచిమందు. ఎందుకనగా ఇది కార్బొహైడ్రేట్స్‌ను సాధారణరీతిగా జీర్ణించివేయ శక్తిగలది. దీనిని s. c.

[1] Lymphogranuloma Venereum.
[2] Halibut liver oil or Haliver oil. [3] Pancreas.



(చర్మముక్రింద) ఇచ్చెదరు. రోగి మూత్రములో ఎంత చెక్కెర యున్నదో దానినిబట్టి మోతాదు నిచ్చెదరు.

మితిమీరిన మోతాదుయొక్క గుర్తు లేవనగా:—రోగికి మైకముగా నుండుట, విస్తారముగా చెమటపోయుట, వణకుట, మూర్ఛపోవుట. నాడి బలహీనముగను వడిగను కొట్టుకొనుట. వెంటనే చెక్కెర లేక ఆరెంజిపండ్లుగాని యియ్యనియెడల రోగికి గాఢమూర్ఛ రావచ్చును.

5. కాల్సియమ్ లేక లైమ్ (సున్నము):—దీనిని వివిధమైన ఉప్పులుగా మందునందు ఉపయోగించుదురు. ఇది యెముకలు పెరుగుటకును, నరములయొక్క, కండరములయొక్క, గ్రంధులయొక్క పనిని క్రమపరచుటకును, రక్తము గడ్డకట్టునట్టు చేయుటకును అవసరమైయుండును.

*a.* రక్తము కారుచున్నప్పుడును, రక్తము గడ్డకట్టుశక్తి తగ్గియున్న రోగములకును దీనిని వాడుదురు.

*b.* టెటని అనగా కండరములకు వచ్చు ఈడ్పు వ్యాధి. పారథైరాయిడ్ అను మాంసగ్రంధి సరిగా పనిచేయనప్పుడు ఈ వ్యాధి కనబడును. దీనికి కాల్సియము ఉపయోగింతురు.

*c.* [1]అంట్ఆసిడ్ (ఆమ్లము) వలన గలిగిన పులుపునకు విరుగుడుగా దీనిని సున్నపు నీటి రూపమున వాడుదురు.

*d.* కాలుటవలన గలిగిన గాయములకును వేరువిధముగా శరీరమునకు మంట పుట్టించు పుండ్లకును దీనిని [2]కారన్ ఆయిల్‌గా సిద్ధముచేసి ఉపయోగించుదురు.

*e.* కాల్సియమ్ లేక సున్నము అను దానిని మలమును ముట్టికి కాలువలను క్రిములు లేనివిగా చేయుటకు ఉపయోగింతురు. కట్టడములయొక్కయు, ఇండ్లయొక్కయు గోడలకును, నేలలకును సున్నమును నీటితో కలిపి కొట్టుదురు.

**కాల్సియముతో సిద్ధముచేసిన యితర మందులు**

*a.* లైమ్ వాటర్ (లిక్కర్ కాల్‌సిస్). 1—4 dr. p. o.

*b.* కాల్సియమ్ క్లోరైడ్. 10—30 gr. p. o.

*c.* కాల్సియమ్ లాక్‌టేట్ 15—60 gr. p o. క్లోరైడ్‌కంటె ఇది తక్కువ మంట పుట్టించును.

[1] Antacid. [2] Carron oil.

*d.* కాల్సియమ్ గ్లూకొనేట్ ఒక మాత్ర p. o., 30—60 gr.

*e.* కొలాయిడల్ కాల్సియమ్—దీనిని ఇంజెక్షను చేయుదురు.

*f.* కారన్ ఆయిల్:—నీటిని, ఆలివ్ లేక [1]అవిసెనూనె సమ భాగములుగా చేర్చి లైమ్‌వాటర్ మిక్చెర్‌గా చేయుదురు.

XI. వాక్సీన్స్, సీర, ఇమ్యూనిటి. అంటురోగములు తగులకుండెడు సంరక్షణ. (23-వ అధ్యాయము చూడుము.)

జంతువులలోనికి అంటువ్యాధులు కలుగజేయు సూక్ష్మజీవులనుగాని, వానినుండి తీసిన టాక్సీన్ అను విషపదార్థమునుగాని సూదిద్వారా యెక్కించుదురు. అప్పుడు జంతు రక్తమునందు [2]ఆంటి బాడీస్ (విరుగుడు బీజములు) ఏర్పడును. ఈ ఆంటి బాడీస్ పెరిగినతరువాత ఆ రక్తమును తీసికొని, యిట్టి సూక్ష్మజీవులవలన కలిగిన వ్యాధిగల రోగికి జంతు రక్తము నుండి తీసిన రసి నుపయోగింతురు. ఇట్లు మనుష్యులయందు సంభవించు వ్యాధులకు చికిత్స చేయుచున్నారు. ఆరోగ్యముగానున్న యొకని దేహములోనికిని ఈ సీరమ్‌ను ఇంజెక్ట్‌చేసి, ఏ వ్యాధికి చికిత్స చేయబడినదో, ఆ వ్యాధి రాకుండ నివారించుదురు. ఇట్టి చికిత్స చేయబడినవాడు వ్యాధి ఆపాదించలేనట్టి సంరక్షణగలవాడగును. దీనిని [3]పాసివ్ ఇమ్యూనిటి యందురు. ఇట్టిది సాధారణముగా కొద్దికాలమే సంరక్షణగా నుండును. [4]సీరను (రసిని) చేయుటకు సాధారణముగా గుఱ్ఱములను ఉపయోగించెదరు.

ఒకని శరీరములోనికి చనిపోయిన సూక్ష్మజీవులను సూదితో ఎక్కించినట్లయిన వానిలో క్రమేణ ఆంటిబాడీస్ వృద్ధిపొంది వ్యాధి రాకుండ వానిని కాపాడును. ఇట్టి యింజెక్షనుకు [5]వాక్సినేషన్ (టీ కాలువేయుట) అని పేరు. ఇట్లు వ్యాధినుండి కలుగు కాపుదలకు [6]కల్పితముగా సంపాదించుకొనిన రక్షణశక్తియని పేరు. వ్యాధినిబట్టియు, వ్యక్తినిబట్టియు ఈ రక్షణశక్తి యెంత కాలముండునో నిర్ణయించబడును. ఉదాహరణముగా, కాలర (వాంతిభేదికి) ఇచ్చెడు ఇమ్యూనిటి 6 నెలలు మాత్రమే యుండునుగాని, మాశూచికి ఇచ్చెడు ఇమ్యూనిటి 7 సంవత్సరముల వరకుగాని, జీవితాంతము వరకుగాని నిలిచియుండవచ్చును. చనిపోయిన సూక్ష్మజీవు

[1] Linseed oil. [2] Antibodies. [3] Passive immunity. [4] Sera. [5] Vaccination. [6] Artificially acquired immunity.



లను [1]నార్మల్ సాల్ట్ సొల్యూషనులో వేసియుంతురు. దీనినే [2]వాక్సీనందురు. ఒక క్యూబిక్ సెంటిమీటర్ సాల్ట్ సొల్యూషనుకు ఇన్ని సూక్ష్మజీవులని వాని సంఖ్యను ఖచ్చితముగా నిర్ణయింతురు. ఒక రోగిని చికిత్స చేయుటకు ఆ రోగి శరీరమునందున్న బాక్టీరియనుండియే కావలసిన వాక్సీనును తీసినయెడల, అట్టిదానికి [3]అటూజినస్ వాక్సీన్స్ అని పేరు. ఇతర మార్గముల బాక్టీరియనుండి, సిద్ధముచేసిన వాక్సీనులను [4]స్టాక్ వాక్సీనులందురు. ఒకనికి వ్యాధి సంభవించకుండ వానికి ఇమ్యూనిటి కలుగజేయుటకేకాక, ఒకనియందు రోగము కనపడినప్పుడు వానిశరీరమునందు ఆంటిబాడీస్ అనునవి వృద్ధియై విరివిగా పుట్టుటకును ఈ వాక్సీనులను వాడుదురు.

ఈ క్రిందివి సాధారణముగా నుపయోగించు సీర, వాక్సీనుల జాబితా:—

| సీర | వాక్సీన్స్ |
|---|---|
| ఆంటి-స్ట్రెప్టొకాకిక్ సీరమ్ | స్ట్రెప్టొకాకస్ వాక్సీన్ |
| ఆంటి-స్టఫిలొకాకిక్ సీరమ్ | స్టఫిలొకాకస్ వాక్సీన్ |
| ఆంటి-డిఫ్తీరియ సీరమ్ | రూమటీజమ్ ఫైలాకజెన్ |
| ఆంటి-నూమొకాకిక్ సీరమ్ | నూమొకాకస్ వాక్సీన్ |
| ఆంటి-ప్లేగ్ సీరమ్ | ప్లేగ్ వాక్సీన్ (హాఫ్‌కిన్స్‌గారిది) |
| ఆంటి-టెటనస్ సీరమ్ (టెటనస్ ఆంటి-టాక్సీన్) | టైఫాయిడ్ వాక్సీన్ (దీనిలో పార టైఫాయిడ్ A, B రకములు చేరియున్నవి) |
| ఆంటి-మెనింగొకాకిక్ సీరమ్ | పర్‌టసిన్ లేక పర్‌టసిస్ B. వాక్సీన్ |
| ఆంటి-డిసెంటరి సీరమ్ | B. కోలాయివాక్సీన్ |
| | స్మాల్‌పాక్స్ (మశూచి) |
| | లింఫ్ (ఆవుల మశూచియొక్క బ్రతికియున్న సూక్ష్మజీవులు) |
| | డిసెంటరి B. వాక్సీన్ |

[1] Normal salt solution. [2] Vaccine. [3] Autogenous vaccines. [4] Stock vaccines.

XII. జర్మిసైడ్స్, ఆంటిసెప్టిక్స్, పారసిటిసైడ్స్. అనగా సూక్ష్మజీవులను, క్రిములను బదనికవంటి జీవులను జంపునట్టి మందులు:—

1. కార్బాలిక్ ఆసిడ్ (ఫినాల్):—ఇది పలుకులవంటి పదార్థము. మొదట క్రొత్తగానున్నప్పుడు దీనికి రంగేమియు నుండదుగాని, పాతబడినప్పుడు రోజా రంగుగా మారును.

కార్బాలిక్ ఆసిడ్ సొల్యూషనులను పొంగుచున్న నీటితో కలిపి చేయవలెను. ఈ మందులు సులభముగా కరుగవు గాన వానిని బాగుగా కలుపవలెను. ఇది యెక్కువ ఖరీదులేని మందు. చర్మమునకు మంటపుట్టించునట్టి చాల విషకరమైనమందు. పెద్ద గాయములు కట్టుటకు ఈ మందు నెన్నడు నుపయోగించకూడదు. ఈ మందువలన కాలిన గాయములకు వెంటనే ఆల్కహాల్ పూసినయెడల కార్బాలిక్ ఆసిడ్‌కు విరుగుడుగాను, దాని బలము తగ్గించునదిగాను నుండును. కార్బాలిక్ ఆసిడ్ చర్మమును మొద్దుచేయునట్టి (అనెస్తెటిక్) గుణముగలది. కావున దీనిని చేతితో అంటుకొని పనిచేయుటకు అయిష్టముగా నుండును.

**ఉపయోగములును, బలములును**

పరికరములు, పాత్రలు, రబ్బరు మున్నగువానిని స్టెరల్ చేయుటకు 20% సొల్యూషనులో 15 నిమిషములును, 5% సొల్యూషనులో 1 గంటసేపును ఉంచవలెను. ఏదైన ఒక పరికరమును స్వచ్ఛమైన కార్బాలిక్‌లో శుభ్రముచేసినయెడల 3—5 నిమిషముల కాలముంచిన వెంటనే దానిని ఆల్కహాలులో కడిగి తీయవలెను.

గుడ్డలు, మలము మొదలైనవానిని సూక్ష్మజీవిరహితమైనవానిగా చేయుటకు 5% సొల్యూషనులో ఒక గంటసేపు ఉంచవలెను.

కుక్కకాటు మొదలైన గాయములు కాల్చుటకు మొదట స్వచ్ఛమైనదాని నుపయోగించి, తరువాత విరిగిపోవునట్లు ఆల్కహాల్‌తో కడుగవలెను.

2. [1]లైసాల్, క్రిసాల్—ఇవి సబ్బుచేర్చి కలిపిన ఫినాల్ మందులు. క్రిసాల్‌కంటె లైసాల్ స్వచ్ఛమైనది. ఈ రెండును కార్బాలిక్‌కంటె తక్కువ విషకరమైనవి; ఇవి కార్బాలిక్‌కంటె బాగుగ శుభ్రముచేయు గుణముగలవి. [2]ఖటిక జలములో (ఉప్పునీటిలో) ఈ రెండును కరుగుట

[1] Lysol and Cresol. [2] Hard water.



కష్టము. కార్బాలిక్ ఆసిడ్‌వలె ఈ రెండు మందులును చర్మమును కొంచెము మొద్దుబారచేయును.

**ఉపయోగములును బలములును**

పరికరములను నిర్మలముచేయుటకు స్వచ్ఛమైన మందులను 5 నిమిషములును, 5% బలముగలవానిని 15 నిమిషములును ఉపయోగించవలెను.

భగమును కడుగుటకును, చేతులు శుభ్రముచేసికొను సొల్యూషను కొరకును, చర్మమును శుభ్రముచేయుటకును 1—2% బలమైన సొల్యూషను నుపయోగించవలెను.

3. పాదరసము (మెర్క్యూరి), బైక్లోరైడ్ లేక పెర్‌క్లోరైడ్ ఆఫ్ మెర్క్యూరి—ఇదియొక చూర్ణము. ఇది త్వరగా కరగదుగాన బలమైన సొల్యూషనులలో దీనిని సిద్ధముచేయుట కష్టము. ఇది కరుగునట్లు దీనితో దీనికి సమాన పరిమాణముగల సోడియమ్ క్లోరైడ్‌ను, ఏదైన కొంత రంగుపదార్థమునుచేర్చి మందు తయారుచేయుదురు. దీని సొల్యూషను వేడినీటితోగాని చన్నీటితోగాని చేయవచ్చును. అంగళ్లలో ఈ మందుతోచేసిన కొన్ని బిళ్లలు అమ్ముదురు. అవి యింటిలో ఉపయోగించుకొనుటకు చాల అనుకూలముగానుండును.

మెర్క్యూరి బైక్లోరైడ్ చాల బలమైన ఆంటిసెప్టిక్; దీని వెలయు స్వల్పము. ఇది లోహములను దినివేయును. కాని సబ్బు, చీము, రక్తము, మలము మొదలైనవానితో కలిసినప్పుడు దీని బలము తగ్గిపోవును; కావున దీని యుపయోగము మితిగలిగినది. ఇది విషకరమైనది గాన పెద్ద గాయములు కట్టుకట్టుటకుగాని [1]ఇంట్రయూటిరైన్ డూషులకు (గర్భకోశము కడుగుటకు) గాని ఈ సొల్యూషనును వాడకూడదు.

**ఉపయోగములును, బలములును**

చేతులకును గాయములకును 1—2,000. రబ్బరు, మొదలగు సాగెడు వస్తువులను నిర్మలముచేయుటకు 1—1,000 మందును 5 నిమిషములు వాడవలెను.

వజైనల్ డూషన్, 1—5,000.

కంటిని గడుగుటకు, 1—10,000.

4. [2]బినైయొడైడ్ ఆఫ్ మెర్క్యూరి.—ఇది యెక్కువ వెలగలదియైనను, ఎక్కువ మంచిపనిచేయునట్టి మెర్క్యూరితో చేసినమందు. మెర్క్యూరి:

[1] Intra-uterine douches. [2] Biniodide of mercury.

బైక్లోరైడ్‌ను ఉపయోగించు పనులకే దీనినికూడ ఉపయోగింతురు. దీని ముఖ్యమైన ఉపయోగమేమనగా, దీనిని తెర్మామీటర్ సొల్యూషనుగా వాడుదురు. అప్పుడు దీని బలము, 1—500.

5. ఆల్కొహోల్ (మద్యసారము):—ఫలములను, కూరగాయలను, చెక్కెరయున్న ధాన్యాదులరసమును పులియబెట్టి పొంగునట్లునుజేసి ఆల్కొహోల్ చేయుదురు. ఇది బలమైన ఆంటిసెప్టిక్ కాదు.

ఉపయోగములును, బలములును

హైపొడర్మిక్ సూదులు, సిరంజీలు శుభ్రముచేయుటకు 50—70%.

చేతులను చర్మమును శుభ్రముచేయుటకు 50—70%.

6. బోరిక్ ఆసిడ్:—ఇది చాల బలహీనమైన ఆంటిసెప్టిక్ చూర్ణము. ఇది బాక్టీరియ వృద్ధికాకుండ ఆపును గాని, వానిని చంపదు. చర్మమునకుగాని, అమత్వచకుగాని మంట పుట్టించదు. ఇది త్వరగా కరుగనందున 4% కంటె బలముగల సొల్యూషనుగా చేయలేము. సొల్యూషను చేయునప్పుడు చూర్ణమును నీటితో కలిపి, అదంతయు బాగుగా కరుగునట్లు సొల్యూషనును పొంగించవలెను. ఇది విషపదార్థము కాదు.

ఉపయోగములును, బలములును

బ్లాడర్‌వాష్ (మూత్రకోశమును కడుగుటకు) 2—4%; కండ్లు కడుగుటకు 1—2%; గాయములను శుభ్రము చేయుటకు 4%; గొంతువరకు పుక్కిలించి ఊయుటకు 2%.

బోరిక్ ఆసిడ్‌ను ప్రత్యేకముగాగాని, ఇతర చూర్ణములతో కలిపిగాని డస్టింగ్‌పౌడరుగా (గాయములమీద చల్లెడు పొడిగా) నుపయోగించవచ్చును. కాలుటవలన గలిగిన గాయములకు, దురదలకు, ఇతర గాయములకు పూసెడు అంజనముగాను దీనిని చేయుదురు.

7. క్లోరైడ్ ఆఫ్ లైమ్:—ఇది యొకరకము బ్లీచింగ్‌పౌడర్ (తెలుపుచేయునది) మలమూత్రములను, గుడ్డలను రోగక్రిమిరహితములుగా డిస్ఇన్‌ఫెక్ట్ చేయుటకును, అంటురోగముల సంబంధమైన గాయములు చికిత్సచేయుటకును దీని నుపయోగింతురు. దీని సొల్యూషనును చన్నీటిలో సిద్ధము చేయుదురు. దీనిని పోసియుంచు బుడ్డిగాని యితర పాత్రగాని వెలుగును చేరనియ్యనిదిగా నుండవలెను. మందుపోసి మూత బిగువుగా



పెట్టి చీకటియు, చల్లదనమునుగల స్థలములో పెట్టవలెను. వెలుగు, వేడి తగిలినయెడల ఈ మందు చెడిపోవును. దీనిలోని క్లోరైన్ వాయువుగా మారును. కావున క్లోరైన్ సొల్యూషనులను ప్రతివారము క్రొత్తగా చేయవలెను. ఈ సొల్యూషనును ఉపయోగించకముందు దీనిని నీటితో బాగుగా కలుపవలెను. బలమైన సొల్యూషను గుడ్డలను నాశనముచేయును.

ఉపయోగములు, బలములు

మలమూత్రములను డిస్ఇన్‌ఫెక్ట్ చేయుటకు, 5% మందును ఒక గంటసేపు వాడవలెను.

గుడ్డలను డిస్ఇన్‌ఫెక్ట్ చేయుటకు ½%, మందును 6 గంటలు వాడవలెను.

ఇన్‌ఫెక్టెడ్ గాయములకు చికిత్సచేయుటకు [1]డేకిన్స్ సొల్యూషన్ లేక యూసాల్ యను వేరొకవిధమైన మందును వాడుదురు. ఈ మందును తెంపులేకుండ రోగి గాయములు కడుగుటకు వాడుదురు. దీనిని చేయువిధము:—5 ఔన్సులు 6 డ్రాముల క్రిస్టలైజ్‌డ్ సోడియమ్ కార్బొనేటును 1 గాలన్ నీటిలో కలుపుము. దీనితో 2 ఔన్సులు, 7 డ్రాముల క్లోరైడ్ ఆఫ్ లైమ్ చేర్చుము. బుడ్డిని బాగుగా కుదిలించి ½ గంటసేపు ఉండనిమ్ము, దూదిగుండ వడగట్టుము. 4½ డ్రాముల బోరిక్ ఆసిడ్ స్వచ్ఛమైన ద్రవముతో చేర్చి, బాగుగ కలుపుము. ఏదైనపాత్రలో పోసి బిగువుగా మూతపెట్టి, వెలుగు తగులకుండ కాపాడుము.

8. ఐయొడిన్:—ఇది పలుకులవంటి పదార్థము. ఒకవిధమైన సముద్రపు రెల్లునుగాల్చి, దాని బూడిదతో దీనిని చేయుదురు. దీనిని 7% బలముగల ఆల్కొహోల్ సొల్యూషనులోచేర్చి, టింక్చర్‌గా నుపయోగింతురు.

టింక్చర్ ఆఫ్ ఐయొడిన్ ఉపయోగములును, బలములును

చర్మమునకును, చిన్న గాయములకును సంపూర్ణబలముగల సొల్యూషను వాడవలెను.

అమత్వచలకు సగము బలము వాడవలెను.

వజైనల్ దూషులకు ½% బలము వాడవలెను.

[1] Dakin's solution or Eusol.

[1]కౌంటర్ ఇరిటేషన్‌కొరకు సంపూర్ణబలముగల సొల్యూషను నుపయోగించవలెను.

9. పొటాసియమ్ పర్మాంగనేట్:—ఇది నల్లగాను ఊదారంగుగాను నున్న క్రిస్టలైన్ (పలుకులవంటి) పదార్థము. జీవముగల పదార్థములకు ప్రయోగించినయెడల, ఇది డిస్‌యిన్‌ఫెక్‌టెంట్‌గా పనిచేయును. దుర్వాసనను పోగొట్టు శక్తియు దీనికిగలదు. ఇది ఉడుకునీటిలోగాని చల్లని నీటిలోగాని త్వరగాకరుగును. ఇది చర్మముమీద, గుడ్డలమీద, పాత్రలమీద మరకలు పడజేయును. ఈ మరకలను ఆక్సాలిక్ ఆసిడ్ తీసివేయును.

ఉపయోగములు, బలములు

చేతులు శుభ్రము చేసికొనుటకును గాయములకును 1—2,000.

వాజైనల్ డూషులకు 1—5000.

పాముకాటునకును, తేలుకుట్టినదానికిని [2]పలుకులను లేక సాచురేటెడ్ సొల్యూషన్ ఉపయోగించవలెను.

10. సిల్వర్ (వెండి):—ఇది కండ్లకును, జననేంద్రియ మూత్రనాళములకును ఆంటిసెప్టిక్‌గా ఉపయోగపడును. ఇది [3]అస్ట్రింజెంట్. సిల్వర్‌ను బట్టీపెట్టిన నీటితోనే సిల్వర్ సొల్యూషనులు చేయవలెను. ఎందుకనగా బట్టీపెట్టని నీటితో చేసినయెడల, ఆ నీటిలోనుండు ఇతర లోహములతో నిది రసాయనక మార్పులు కలుగజేయవచ్చును. సిల్వర్‌తో చేసిన సొల్యూషను త్వరగా చెడిపోవును గాన, వారమున కొకసారి క్రొత్తగా చేయుచుండవలెను. ఈ సొల్యూషనును రంగుబుడ్లలో పోసియుంచవలెను.

సిల్వర్ సొల్యూషనుయొక్క ఉపయోగములును, బలములును

సిల్వర్ నైట్రేట్ [4]స్టిక్, ఇది కాస్టిక్‌వలె కండలు పెరిగిన టిష్యూలను గాల్చి, యట్టి కండలు పెరుగకుండ చేయును.

ముక్కు, గొంతు ప్రయోగములకు 2-5%

భగమును, మూత్రపు తిత్తిని గడుగుటకు $\frac{1}{10}$%.

[1] Counterirritation. [2] Crystals or saturated solution. [3] Astringent. [4] Silver nitrate stick.



ప్రొటార్‌గల్, ఆర్జిరల్ యనునవి సిల్వర్‌తో చేసిన బలహీనమైన మందులు.

11. సల్ఫర్ (గంధకము):—ఇది పసుపు పచ్చనిచూర్ణము. బదనిక వంటి సూక్ష్మజీవులను నాశనముచేయు గుణముగలది. పొగవేయుటకు ఇది బాగుగా ఉపయోగపడును. ధూపముగాను, 2—10% బలముగల అంజనముగాను ఇది గజ్జి పురుగులవంటి బదనిక జీవులను జంపును.

XIII. చర్మముమీద పూయుటకు ఉపయోగపడు ఆంటిసెప్టిక్ కాని మందులు

1. ఇక్థియోల్—దీనిని అంజనముగా వాడుదురు. దీనిని గ్లిసరిన్ సొల్యూషనుగా చేసి పట్టించినయెడల కందు తగ్గిపోవును. అమత్వచ యొక్క చర్మమునకు శమనము కలిగించును. దీనిలో ఆంటిసెప్టిక్ శక్తి కొద్దిగా నుండవచ్చును.

2. మెగ్నీషియమ్ సల్ఫేట్:—అంటురోగములందు ఏర్పడిన వాపును మెగ్నీషియమ్ సల్ఫేట్ సొల్యూషను తగ్గించును. ఇది చన్నీటిలోను, వేడి నీటిలోను కరుగును.

ఉపయోగములును బలములును

కంటి కాపడమునకు 5—10%.

చర్మము కాపడమునకు 5—100%.

3. సోడియమ్ క్లోరైడ్:—ఇది సాధారణమైన ఉప్పు. ఇది కొద్దిగా ఆంటిసెప్టిక్ గుణముగలది. దీనిని వివిధబలములుగల సొల్యూషనుగా వాడుదురు. సాధారణముగా ఇది నార్మల్ సాల్ట్ సొల్యూషనుగా ఉపయోగపడును. అప్పుడు దీని బలము రక్తములోనున్న లవణముయొక్క బలమునకు సమానముగా నుండును. అనగా, 6—.9%. 16 ఔన్సుల సొల్యూషను చేయుటకు 1 డ్రాము తూనికగల ఉప్పును 16 ఔన్సుల నీటితో కలుపవలెను. వేడిచేయుటవలన ఉప్పు త్వరగా కరుగును. అన్ని విధములైన అమత్వచలను గడుగుటకు నార్మల్ సాల్ట్ సొల్యూషనును ఉపయోగింతురు. దీనిని రక్తనాళములోనికిగాని, చర్మముక్రిందికిగాని, పురీషనాళములోనికిగాని ద్రవమును ఎక్కించుటకును చురుకుదనమును కలిగించుటకును ఉపయోగింతురు.

నార్మల్ సొల్యూషనుకంటె నాలుగింతలు బలముగల హైపర్‌టానిక్ సొల్యూషనును లోపలికి పుచ్చుకొనుటకు ఇచ్చెదరు.

## XIV. విషములు

విషము ఏ పదార్థములో గలిసియున్నను, దేహములో ప్రవేశించి నప్పుడు ప్రాణమును జంపు శక్తి దానికి గలదు. మనము ఉపయోగించు మందులలో ననేక ఔషధములు బలమైన విషములుగానుండును. కావున, విషౌషధములమీద "విషము" ([1]పాయ్‌జెన్) అను చీటివ్రాసి, అంటించి తాళమువేసిన బీరువాలో పెట్టియుంచవలెను.

విషము రెండు విధములు:—(1) [2]అక్యూట్ (2) [3]క్రానిక్. పెద్ద మోతాదు పుచ్చుకొనుటవలన విషఫలితము అకస్మాత్తుగా కనబడినయెడల దానిని [4]అక్యూట్ పాయ్‌జెనింగ్ (విషసంభవము) అందురు. విషకరమైన మందును చాలకాలము పుచ్చుకొనుటవలన, విషప్రయోగము యొక్క గుర్తులు క్రమేణ కనబడినయెడల, దానికి [5]క్రానిక్ పాయ్‌జెనింగ్ అని పేరు.

అవి శరీరమునందలి టిష్యూలయందు చేయుపనినిబట్టి సర్వ సాధారణమైన విషములను ఈ క్రింద బేర్కొనుచున్నాము:—

1. కొరోసివ్స్:—ఇవి బలమైన ఆసిడ్స్, ఆల్కలైన్సవంటి విషపదార్థములు. ఇవి టిష్యూలను నాశనముచేయును.

ఉదాహరణములు

| | |
|---|---|
| సల్ఫ్యూరిక్ ఆసిడ్ | కార్బాలిక్ ఆసిడ్ |
| హైడ్రోక్లోరిక్ ఆసిడ్ | కాస్టిక్ సోడా |
| నైట్రిక్ ఆసిడ్ | కాస్టిక్ పొటాష్ |

ఆక్సాలిక్ ఆసిడ్

ఇవి టిష్యూలను పాడుచేయునవిగాన, బయటికి కనబడెడు గుర్తులేవనగా:—నోటిచుట్టు మరకలుపుట్టుట, అన్నవాహికపొడుగున మంట పుట్టునట్టి నొప్పి కలుగుట, వాంతియందు రక్తముపడుట, షాక్ యొక్క గుర్తులు కనబడుట.

[1] Poison. [2] Acute. [3] Chronic. [4] Acute poisoning. [5] Chronic poisoning.



2. ఇరిటెంట్స్:—ఇవి టిష్యూలు కందునట్లు చేయును.

ఉదాహరణములు

| | |
|---|---|
| పాషాణము (ఆర్సెనిక్) | [1]టోమెయిన్ |
| గాజుపొడి | కెరోసిన్ ఆయిల్ |
| పాదరసము (మెర్క్యురి) | కర్పూరతైలము (టర్పెంటైన్) |

ఐయోడిన్

ఇవి కందునట్లును మంట పుట్టునట్లునుచేయు మందులుగాన, అవి కడుపులో నొప్పిని కలుగజేయును. రక్తముతోచేరిన అతివిరేచనములు కలుగును. ఈ మందులన్నియు విరేచనములును వాంతులును కలుగజేయునుగాని, గాజుపొడిమాత్రము వాంతి కలుగజేయదు. ఈ లక్షణములు చాలకాలము నిలిచియుండినయెడల కొలాప్స్ సంభవించును. టోమెయిన్ లేక చెడిపోయిన ఆహారపదార్థములవలన గలుగు విషప్రయోగము ఫలితముగా దేహోష్ణము చాల హెచ్చవచ్చును.

3. నరములకు సంబంధించిన విషములు:—ఇవి నాడీమండలమునకు విషము కలుగజేయును.

ఉదాహరణములు: నల్లమందు (ఓపియమ్)ను దానినుండి చేయబడిన మార్ఫిను, లాడనను. ఇవిగాక

| | |
|---|---|
| ఆల్కహాల్ | కొకేయిన్ |
| బెల్లడానా | బంగీ |
| దతూర | [2]కుక్కగొడుగు |
| స్ట్రమోనియమ్ | పొటాసియమ్ సైఅనైడ్ |
| క్లోరోఫారమ్ | స్ట్రిక్‌నిన్ లేక నక్స్‌వామిక |

పుచ్చుకొన్న మందు మోతాదునుబట్టి విషముయొక్క లక్షణములు భేదించుచుండును. ఓపియమ్, మార్ఫిన్, పాషాణము, పాదరసము, అట్రోపిన్, స్ట్రిక్‌నిన్—వీనివలన కలుగు విషప్రయోగముయొక్క లక్షణములను, వానికి చేయవలసిన చికిత్సలనుగూర్చి యింతకు ముందే చెప్పబడినది.

[1] Ptomaine. [2] Fungi (toadstools).

ఆల్కొహాల్ (సారాయి) పుచ్చుకొన్నయెడల కలుగు మొదటి ప్రతిఫలమేమనగా, పుచ్చుకొన్న వానియందు ఉద్రేకము పుట్టును; వాని ముఖము ఎఱ్ఱబడును. కడకు అతడు మతిలేనివాడగును. బెల్లడానా, దతూర, స్ట్రమోనియమ్, క్లోరొఫారమ్, కొకేయిన్, బంగి—యివికూడ మొదట ఉద్రేకము పుట్టించును. తరువాత మతి తప్పిపోవుటయు సంభవించును. ఘంగాయి (కుక్కగొడుగు)వలన గలుగు విషప్రయోగముయొక్క ఫలితములు టొమెయిన్‌నందు కనబడు గుర్తులవంటివే కాని, దేహోష్ణము మాత్రము హెచ్చదు. పొటాసియమ్ సైయెనైడ్ అతి త్వరగా పని చేయును. దీనివలన తలదిమ్ము, కష్టముగా శ్వాసవిడుచుట, కొలాప్స్.

ఒక మనుష్యునియందు తీక్షణమైన విషప్రయోగము కలిగెనేని, తత్క్షణమే ఏదోయొక పనిచేయవలెను. ఇట్టి పరిస్థితులలో నర్సు రోగిని గూర్చిన సమాచారమును దగ్గరనున్న వైద్యునికి సాధ్యమైనంత త్వరలో తెలియజేయుట ఆమె మొదట విధి. రోగియందు కనబడు గుర్తులను దుర్లక్షణములను త్వరగా గుర్తించి, వానినిగూడ వైద్యునికి త్వరగా తెలియజేయవలెను. ఈ క్రింది గుర్తులనుబట్టి నర్సు విషప్రయోగము గలిగినదని అనుమానించవచ్చును. (1) ఆరోగ్యముగానున్న ఒకనియందు అకస్మాత్తుగా ఆపదకరమైన లక్షణములు కనబడుట. (2) ఏదైన ఆహారము భుజించిన వెంటనే లేక పానీయము త్రాగినవెంటనే, అకస్మాత్తుగా ఇట్టి దుర్లక్షణములు కనబడుట. విషమును దాచియుంచుకొనిన ఏదేని బుడ్డి, పెట్టె లేక కాగితము రోగిదగ్గర దొరికెనేని దానిని వైద్యుని పరీక్షకొరకు భద్రముగా పెట్టియుంచవలెను. రోగిచేయు వాంతులను, మలమును పరీక్షకొరకు ఎత్తిపెట్టవలెను. నోటిచుట్టు మచ్చలు, శ్వాసయందు విపరీతమైన వాసన నర్సు గమనించవలెను. నిద్రమత్తు, మతి తప్పుట, ఉద్రేకము, నొప్పి—వీనిలో ఏవి రోగియందున్నవోయని నర్సు జాగ్రత్తగా గమనించుచుండవలెను. కనుపాప విస్తరించుట, లేక ముడుచుకొనుట యను గుర్తులు, వ్యాధి ఫలానిదని నిర్ణయించుటకు సహాయకరముగా నుండును.

వైద్యుడు వచ్చువరకు నర్సు రోగికి ప్రథమ చికిత్సచేయుచు, ఆయన యుపయోగించు అవసరమైన వస్తువులనన్నిటిని ఆయన రాకముందే సిద్ధముగా పెట్టియుంచవలెను.



ప్రథమ చికిత్స విషయము లేవనగా:—

*a.* విషమును నోటిద్వారా పుచ్చుకొని యుండినయెడల, రోగి పుచ్చుకొనినది, బలమైన అల్కాలి లేక ఆసిడ్ అయిననే తప్ప, వాంతియగు మందు ఇచ్చియైనను ఆహారకోశమును కడిగియైనను ఆ విషమును ఆహారకోశమునుండి తీసివేయవలెను. వాంతియగుటకు సాధారణముగా వాడెడు మందు లేవనగా—8 ఔన్సుల గోరు వెచ్చని నీటిలో 1 టేబిల్ స్పూన్ ఆవాలపొడి కలిపియిచ్చుట; లేదా, 8 ఔన్సుల గోరు వెచ్చని నీటిలో 2 టేబిల్ స్పూనుల ఉప్పుకలిపి యిచ్చుట; లేక 30—60 మినిముల [1]టింక్చర్ ఇపికాకుఆన నీటితో కలిపి యియ్యవలెను.

*b.* విషమునకు ఏదైన విరుగుడు నిమ్ము. అనగా, రోగి యే విషమును బుచ్చుకొనినది తెలిసినయెడల, దానిని బలహీనపరచి నిష్ప్రయోజనము చేయగల ఏదైన మందు నియ్యవలెను. సాధారణమైన విషములును వాని విరుగుడులును క్రింద చేర్కొనబడినవి:—

| విషము | | విరుగుడు |
|---|---|---|
| నల్లమందు (ఓపియమ్) | ... | అట్రొపిన్, పొటాసియమ్ పర్మాంగనేట్, సొల్యూషన్ 1—2000. |
| అట్రొపిన్ లేక బెల్లడానా | ... | ఓపియేట్స్, పొటాసియమ్ పర్మాంగనేట్ సొల్యూషన్ 1—2000. |
| ఆసిడ్స్ | ... | పలుచని ఆల్కాలైస్, అనగా ఎప్సం సాల్ట్స ½ ఔన్సు 4 ఔన్సుల నీళ్లలో కలిపి యియ్యవలెను; 1 టేబిల్ స్పూన్ చాక్ (సుద్ద) 1 పైంట్ నీటిలో కలిపి యియ్యవలెను; సబ్బునీళ్లుగాని, సున్నపు నీళ్లు గాని యియ్యవలెను. |

[1] Tincture ipecacuanha.

| | | |
|---|---|---|
| కార్బాలిక్ ఆసిడ్ | ... | ఆల్కొహాల్ ¼ భాగము, ¾ పాళ్లు నీళ్లు కలిపి యియ్యవలెను; లేక బ్రాందీ నియ్యవలెను. |
| ఆల్కాలైస్ | ... | వినిగర్ వంటి పలుచని ఆసిడ్స్ నియ్యవలెను. 2 ఔన్సులు వినిగర్ (చిరక) 1 పైంట్ నీటిలో కలిపి యియ్యవలెను; లేదా, నిమ్మరస మియ్యవలెను. |
| ఐయొడిన్, మెర్క్యూరి | ... | గంజినీళ్లుగాని, పిండిని మరేదైన ఒక విధముగా వండిగాని గ్రుడ్డులోని తెల్ల జెనసుగాని నియ్యవలెను. |
| స్ట్రిక్ నిన్ | ... | మార్ఫిన్, టానిక్ ఆసిడ్, తేనీళ్లు, పొటాసియమ్ పర్మాంగనేట్ సొల్యూషన్ 1—2000. |

*c.* ఇంక ఏదైన ద్రవమునిచ్చి విషమును బలహీనపరచవలెను. రోగికి [1]ఉపశమనము కలిగించు మందుకూడ నియ్యవలెను. ఈ రెండు పను లొకే సారి చేయవచ్చును. రోగికి ఆసిడ్స్, ఆల్కలాయ్ విషప్రయోగము గలిగినప్పుడును, మంటను బుట్టించు ఇరిటెంట్సును రోగి పుచ్చుకొన్నప్పుడును ఈ చికిత్స బహు అవసరము.

ఉపశమనము కలిగించి, విషపుబలమును దగ్గించు కొన్ని నూనెవస్తువు లేవనగా—నువ్వులనూనె, ఆలివ్‌నూనె. ¼ పైంట్ నూనెను ¼ పైంట్ నీరు, పాలు లేక బార్లీ నీటితో చేర్చి యియ్యవలెను.

*d.* షాక్‌ను ఆపుటకు చికిత్స చేయుటకుగాని, షాక్ లక్షణములు సంభవించినప్పుడు చేయు చికిత్సకుగాని రోగి బాగుగ విశ్రమించుట చాల అవసరము. వానికి వెచ్చదనము కలిగించవలెను. మంచము కాళ్లతట్టు ఎత్తి దిమ్మెలమీద నుంచవలెను. వేడి కాఫీ, తేయాకునీళ్లు, అరొమాటిక్

[1] Demulcents and diluents.



స్పిరిట్స్ ఆఫ్ అమ్మోనియ మున్నగు వానినిచ్చి రోగికి చురుకుదనము పుట్టించవలెను.

*e.* [1]కల్పిత సూత్రములద్వారా రోగి శ్వాసించునట్లు చేయవలెను.

*f.* రోగి గాజుపొడి మ్రింగినట్లు గుర్తులు కనబడిననే తప్ప, లేనియెడల వానికి 2 ఔన్సుల ఆముదము త్రాగించుము. రోగి గాజుపొడి మ్రింగినట్లు నిశ్చయమైనయెడల, విస్తారముగా రొట్టెగాని, అన్నముగాని తిననిమ్ము. ఇవి గాజురవ్వలను చుట్టుకొని, నిరపాయకరమైన వానినిగా జేయును.

*g.* రోగి పుచ్చుకొనిన విషము ఏదో నిశ్చయముగా తెలియనప్పుడు, చన్నీళ్లు విస్తారముగా త్రాగించుము.

విషములు పుచ్చుకొనుటవలననేకాక, పాముకాటు, తేలుకుట్టుట, మొదలగువాని మూలమునను విషప్రయోగము కావచ్చును. అవి 27-వ అధ్యాయములో వివరించబడినవి.

విషప్రయోగము కలిగిన పరిస్థితులలో, నర్సు తత్తరపాటు చెందక, నిశ్చలమైన మనస్సుతో బాగుగా యోచించి, తాను నేర్చుకొనిన చికిత్సను చేయవలెను.

[1] Artificial respiration,

ఐదవ భాగము

# వైద్య పరిస్థితులును వ్యాధులును వాని చికిత్సయు, నర్సింగ్ పరిచర్యయు

## అధ్యాయము 15

### ప్రస్తావన, కొన్ని లక్షణములు

పరిచర్య చేయవలసిన వైద్య పరిస్థితులను రోగములను సరిగా గ్రహించుటకు రోగియందు కనబడు వ్యాధి లక్షణములను చాల జాగ్రత్తగ గమనించుచుండవలయును. ఈ లక్షణములు [1]విషయాత్మకములుగను [2]విషయిగతములుగను నుండును. విషయాత్మకమైన వానిని చూచి తెలిసికొనునట్లు అవి బాహ్యముగా కనబడును. విషయిగతమైన లక్షణములు రోగి నడిగిగాని, రోగి తెలియజెప్పగగాని తెలిసికొనునవి. నర్సు తాను గ్రహించి తెలిసికొనిన సంగతులను తప్పులేకుండ వైద్యునికి తెలియజేయుటకును, వ్రాసియుంచుటకును తగు శక్తిసామర్థ్యములు గలిగియుండుట అవసరము. రోగి శరీరముయొక్క ఆయా అవయవములకు సంబంధించిన వ్యాధి లక్షణములను సరిగా గుర్తించగల అభ్యాసము పొందుటకు, నర్సు, రోగిని చేర్చుకొన్న గడియనుండి, అతడు వైద్యశాలలో నున్నంతకాలము, అతనిని జాగ్రత్తగ గమనించుచుండవలెను. ఇట్టి గమనిక వ్యాధిలక్షణములను గ్రహించుటకు ఎక్కువగ తోడ్పడును.

చికిత్స చేయవలసిన పెక్కు వ్యాధులకు మందులకంటె శౌచమును, సకాలములో సరియైన ఆహారమును ఎక్కువ అవసరమై యుండును. దేహములోని మలినము బయటికి పోవుటకు పలుమారు రోగికి స్నానము చేయించవలెనని నర్సు జ్ఞాపకము పెట్టుకొనవలెను. ఇట్లు మలినము వెడలిపోవుటవలన లోపలి యవయవముల పని కొంతతగ్గి, దేహమునకు మొత్తమున కొంత నెమ్మదియు, విశ్రాంతియు కలుగవచ్చును. రోగియొక్క పథ్యమును వైద్యుడే నియమించును. ఏ విధమైన దేహపరిశ్రమయైనను రోగి నిదానముగా చేయవలెను. మొదట కొద్దికాలముతో ప్రారంభించి క్రమేణ కాలపరిమితిని హెచ్చింపుచు పోవలెను. పరిశ్రమ చేయుచుండగా రోగియందు [3]మూర్ఛ, [4]కండ్లుతిరుగుట [5]గుండెదడ మొద

[1] Objective. [2] Subjective. [3] Syncope. [4] Dizziness. [5] Palpitation,



లగు అవలక్షణములు ఏవైన కనబడినయెడల, వెంటనే వానిని పడకలో పరుండబెట్టి, వైద్యునకు సంగతి తెలియజేయవలెను.

వైద్య పరిస్థితులను రోగములను గ్రహించి చికిత్సచేయుటకు రోగియందు కనబడు రెండు ముఖ్యమైన లక్షణములను గమనించవలెను. అవేవనగా.—[1]నిద్రనాశము లేక నిద్రలేమి; నొప్పి లేక బాధ.

నిద్రనాశము:—ఇది అసౌఖ్యము, శబ్దము, నొప్పి, జ్వరము లేక ఏదైన నరముల తొందర వీనివలన కలుగవచ్చును. నర్సు దీనికి సరియైన కారణము కనుగొని వీలైతే, దానిని తొలిగించుటకు యత్నించవలెను. రోగి పరుండినతీరును మార్చుట, వేడి పానీయమును త్రాగించుట, రోగిని పడకచట్టినుపయోగింపనిచ్చుట, వేడి స్పంజ్ స్నానము చేయుట, లేక రోగియందున్న ఏదైన భయమును పారదోలుట మొదలగు ఉపచారముల మూలమున కండరములు సడలి రోగికి నిద్రపట్టవచ్చును. నిద్రయు విశ్రాంతియు రోగికి అత్యావసరములు. ఇవి లేనికారణముచే రోగము అపాయకరమైన రీతిగా పరిణమించవచ్చును. కావున రోగియొక్క విశ్రాంతి, నిద్ర అను వానిని శ్రద్ధగా గమనించుచు, సాధారణ పరిచర్యవలన రోగి కివి లభించనప్పుడు మందులనైనను వాడవచ్చును. ఉపశమనమును గలుగజేయు మందును వాడవలసి వచ్చినప్పుడు నర్సు, రోగి నట్టి విశ్రాంతికొరకును, నిద్రకొరకును సిద్ధపరచి, మందు రోగియందు పనిచేయునప్పుడు అతనిని తొందరచేయకుండునట్లు చూడవలెను. వైద్యుడు ప్రత్యేకమైన ఉత్తర్వు ఇచ్చియుండిననేకాని, రోగి నిద్రించుచుండగా మందు పోయుటకుగాని, జ్వరము కొలుచుటకుగాని, ఆహార మిచ్చుటకుగాని యతనిని లేపకూడదు. రోగి నిద్రనుగూర్చి నర్సు రిపోర్టు నిచ్చునప్పుడు, అతడు ఎంతసేపు నిద్రించినది, గంటలలో చెప్పవలెను. రోగి నిద్రకు ఏదైన భంగము కలిగినదా? తెంపులేకుండ ఒకేపట్టున నిద్రించినాడా? నిద్రయొక్క లక్షణమెట్టిది? రోగి నెమ్మది, విశ్రాంతి పొందగలిగినట్టి నిద్రయా? లేక భంగకరమైన నిద్రయా? నొప్పిలేక బాధ యను వివరములను తెలియజేయవలెను.

నొప్పి:—ఇది రోగిని శారీరకముగను మానసికముగను చాల బాధపెట్టు లక్షణమై యుండవచ్చును. నొప్పిని ఓర్చుకొను శక్తి రోగులనుబట్టి భేదించుచుండును. వారి మనోభావమునుబట్టియు, ఈ నొప్పి హెచ్చుచు, తగ్గుచు

[1] Insomnia,

నుండును. పూర్వము అనుభవించిన బాధను జ్ఞప్తికి తెచ్చుకొనుటవలన, ప్రస్తుతపు బాధయు నధికము కావచ్చును. అట్లుగాక, మనోవిక్షేపము వలన నొప్పియొక్క తీవ్రత తగ్గవచ్చును. నొప్పి పలువిధములుగా నుండ వచ్చును. [1]చీముగడ్డ (విద్రధి) పోటువలన భరించరాని నొప్పి పుట్టును; ఏదైన లోపలి యవయవమునందో, యెముకయందో ఆంపముతో కోసినట్లు నొప్పి పుట్టును. దీర్ఘకాలమునుండి కందియున్నందువలన మందమైన నొప్పి పుట్టును. [2]నురాల్జియ (వాతశూల) వలన పొడిచినట్టి నొప్పి పుట్టును.

సాధారణముగా చిన్నపిల్లలును, పసిబిడ్డలును తమ నొప్పిని సరిగా వివరించలేరు. కావున నర్సే వారి చేష్టలను గమనించి వ్యాధికి కారణము నిర్ణయించుటకు నేర్చుకొనవలెను. ముఖ్యముగా రాత్రులలో పిల్లలు ఆయాసముగా నుండుట, వారు ఏదో నొప్పి ననుభవించుచున్నారనుటకు సూచననై యుండును. ఇట్టి నొప్పిని నివారించుటకు ఏ ప్రాంతమున కండరములు ముడుచుకొనునో, ఆ ప్రాంతముననే నొప్పియున్నదని గ్రహించవలెను.

శరీరములో నొక భాగమునందుండు నొప్పి ఇంకొక భాగమునన్న తొందరను సూచించవచ్చును. దీనికి [3]రిఫర్డ్ పెయిన్ యని పేరు. తల నొప్పియందు, ఎక్కడ నొప్పిపుట్టుచున్నదో, దాని లక్షణమెట్టిదో గ్రహించుట చాలముఖ్యమైన సంగతి. అజీర్ణపు తొందరవలనగాని, దృష్టి లోపము వలనగాని, తక్కువ లేక ఎక్కువ రక్తపుపోటువలనగాని, మనోశ్రమవలన గాని, నాడీమండల కేంద్రమున గలుగు తొందరవలనగాని తలనొప్పి కలుగవచ్చును. [4]టాక్సీమియయు, పెక్కు అంటురోగముల ఆరంభదశయు స్త్రీల జననేంద్రియముల వ్యాపారములయందు లోటును, తలనొప్పికి కారణములు కావచ్చును. కుడిభుజమునందు కత్తితో నరికినట్లు పుట్టునొప్పి, [5]గాల్ బ్లాడర్ (పిత్తాశయము)లో రాళ్లు ఏర్పడుటవలన గలిగినదై యుండ వచ్చును. అట్లే ఎడమరెట్టలోను బుట్టు నొప్పి గుండెలో కలిగిన తొందర వలన నైనదై యుండవచ్చును. ఈ రెండును రిఫర్డ్ పెయిన్‌కు మంచి యుదాహరణములు.

[1] Abscess. [2] Neuralgia. [3] Referred pain. [4] Toxemia.
[5] Gallstone colic.

అధ్యాయము 16

# రక్తప్రసరణ మండలమునకు కలుగు వ్యాధులు. రక్తము, రక్తమును తయారుచేయు ఇంద్రియములు

## రక్తప్రసరణ మండలమునకు కలుగు వ్యాధులు

రక్తప్రసరణ మండలమునకు గలుగు వ్యాధుల లక్షణములేవన:—గుండెనొప్పి, గుండెదడ, మూర్ఛ, ముఖము తెల్లబారుట లేక నీలి వర్ణముగా మారుట, ఒగర్పు, చేతులు కాళ్లు చల్లబడుట, జలోదరము, వాపు, ఒత్తినయెడల చర్మము గుంటలుపడుట మొదలైనవి.

గుండెయందలి వికృతలక్షణములు:—ఇవి గుండెయొక్క వ్యాపారమునకు సంబంధించినవిగాగాని, గుండె భాగములకే సంబంధించినవిగాగాని యుండవచ్చును.

[1]గుండెయొక్క వ్యాపారమునకు సంబంధించినవి:—వీనివలన గుండె చేయుచున్న వ్యాపారమునకు లోపముగలుగును. గుండెయందు యే వ్యాధియు లేకపోయినను, శరీరములోని యితరభాగముల వ్యాధులవలన గుండెకును తొందర సంభవించవచ్చును. దీనికి కారణము నరముల సంబంధమైన వ్యాధులైనను, అనీమియ (రక్తహీనత)యైనను, ఆల్కహాల్ (మద్యసారము) పొగాకులవలన కలిగిన టాక్సీమియ లేక యితర విషకరమైన మందులు పుచ్చుకొనుటవలనను నరముల పటుత్వము పాడై, గుండె తన పనిని బాగుగ చేయకుండునటుల చేయుటయైనను కావచ్చును. ఈ వ్యాధులయందు కనబడు ముఖ్య లక్షణము లేవనగా:—అజీర్ణము, గుండెదడ, ఊపిరాడకపోవుట, నిద్రనాశము (నిద్రలేమి), చెమటపోయుట, మూర్ఛపోవుట, వణకుట.

గుండెదడ:—గుండెదడయనగా రోగి తెలిసికొనునంత గట్టిగా, గుండె కొట్టుకొనుట. ఇది వక్షములోపలనే నెమ్మదిగా కొట్టుచుండవచ్చును; లేదా, గుద్దినట్లు గట్టిగ కొట్టుకొనునంతవరకు హెచ్చవచ్చును. అప్పుడు

[1] Functional disorders.

రోగి దానినిగూర్చి తొందరపడవచ్చును. ఈ గుండెదడ నాపుటకు, గుండెలో ఏవిధమైన తొందరలేదనియు, ప్రమాదమేమి జరుగదనియు చెప్పి మొదట రోగిని శాంతిపరచవలెను.

చికిత్స:—గుండె చేయవలసిన వ్యాపారమునందలి లోపములకుగల కారణమును మొదట కనుగొని, సాధ్యమైనయెడల, దానిని తొలగించవలెను. దీనికి తోడు శరీరము మొత్తముమీద బలపడుటకు రోగికి తగిన విశ్రాంతి, నిద్ర, సరియైన ఆహారము, క్రమేణ హెచ్చుచుండు దేహాభ్యాసము నిచ్చుచుండవలెను. ఉపశమనమును గలిగించు మందులు కొంత కాలమువరకు ఇచ్చుట అవసరమైయుండవచ్చును. రోగి వ్యాధి చాల నిదానముగా బాగై, స్వస్థత కలుగుచుండును గాన, రోగికిని, నర్సుకును ఈ విషయములో చాల ఓర్పుండవలెను.

[1]గుండెభాగములకు సంబంధించిన జబ్బులు:— ఇది పుట్టుకతో వచ్చినదైనను, లేక రోగి సంపాదించుకొన్నదైనను గావచ్చును.

పుట్టుకతోవచ్చిన గుండెజబ్బు:—ఇది గుండె యెదుగుటలో కలుగు లోపములవలనగాని, పిండముగానుండగా సంభవించు వ్యాధులవలనగాని రావచ్చును. గుండె అసాధారణమైన స్థానమున నుండవచ్చును. ఒకానొకప్పుడు గుండె వక్షమునకు కుడిప్రక్కన నుండవచ్చును. గుండెకు ఇరుప్రక్కల కుడికర్ణికకును, ఎడమకర్ణికకును మధ్య రంధ్రముండవచ్చును. మరియొకలోపమేనగా—[2]డక్టస్ ఆర్టీరియోసస్ (ధమనీయప్రణాళి) అనునది తెరచుకొనియుండుట; [3]పల్మనరి ఆర్టరి, [4](పుప్పుసధమని) అయోర్టల (బృహద్ధమనుల) మధ్యనుండు ద్వారము బిడ్డ పుట్టినతరువాత మూసికొనకుండుటవలన శుద్ధరక్తము, అశుద్ధరక్తము కలిసిపోవుట. ఇట్టి లోపము గల బిడ్డను [5]"బ్లూ బేబి" (నీలివర్ణపుబిడ్డ) యందురు.

పుట్టుకతోవచ్చిన గుండెవ్యాధియొక్క లక్షణములు సాధారణముగా బిడ్డ పుట్టినవెంటనే కనబడవచ్చును లేదా కొంతకాలమయిన తరువాత కనబడవచ్చును. రోగియందు కనబడు లక్షణములలో ముఖ్యమైనవేవనగా:—జాస్తి నీలిరంగుగానుండుట, గుండె పెద్దదియగుట, గుండెయందు విపరీతమైన శబ్దముపుట్టుట, కాలు చేతివ్రేళ్ల కొనలు లావుగా కనబడుట,

[1] Organic Heart Disease. [2] Ductus arteriosus. [3] Pulmonary artery. [4] Aorta. [5] Blue baby.



ఒగర్పు ఉండుట [1]ఊపిరితిత్తులనుండి రక్తముపడుట, [2]ముక్కునుండి రక్తము కారుట మొదలైనవి. హిమొగ్లొబిన్ హెచ్చుటతో సమానముగా రక్తములోని యెఱ్ఱని కణములు సంఖ్య 10,000,000 టికిగాని, వానికంటె ఎక్కువగాగాని హెచ్చవచ్చును. రోగియందు మానసిక శారీరకశక్తులు తగ్గుట కానవగును. ఇట్టి రోగులైన బిడ్డలు నూటికి 30—50 మంది, పుట్టిన మొదటి రెండునెలలో చనిపోదురు. నూటికి 16—20 మంది 15 సంవత్సరములకుపైగా జీవించవచ్చును. పుట్టుకతోవచ్చిన గుండె వ్యాధిగల రోగులు శ్వాసకు సంబంధించిన ఇన్ఫెక్షనులకు త్వరగా లోనగుదురు.

చికిత్స:—చిహ్నములనుబట్టి ఇన్ఫెక్షనులకు చికిత్సచేయవలెను. ముఖ్యముగా, శ్వాస సంబంధమైన ఇన్ఫెక్షనులకు రోగిని దూరముగా నుంచవలెను. రోగియొక్క స్థితినిబట్టి అతడెంత పనిచేయగలడో నిర్ణయించవలెను.

[3]సంపాదించుకొన్న గుండెజబ్బు:— ఇది డిఫ్తీరియ, (కంఠరోహిణి) టైఫాయిడ్ (విషజ్వరము) ఇన్ఫ్లూయంజె, న్యుమోనియ, వాతజ్వరము అను అంటువ్యాధుల ఫలితముగా కలుగును. ఇట్లు సంప్రాప్తమైన రోగము, [4]పెరికార్డియమ్ (హృత్కోశము) [5]మయొకార్డియమ్ (గుండెయొక్క కండ), [6]ఎండొకార్డియమ్ (గుండెమీదనున్న సన్ననిపొర)—వీనిలో నొక్కొక్కదానినిగాని, రెంటినిగాని, మూటినిగాని వ్యాధిగల వానినిగా చేయవచ్చును. గుండెలో ఏదైన నొకభాగమునకు వ్యాధిగలిగిన, మరియొకభాగము, ముఖ్యముగా, వ్యాధిగలభాగము వెనుకనున్న జఠరిక వ్యాధిపడిన భాగమునకు బదులు కొరతలేకుండ పనిచేయజాలును. చేకూర్చబడినశక్తి మిగిలియున్నంత కాలము పని బాగుగనే జరుగునుగాని, ఆ శక్తి తగ్గిపోగానే, రక్తప్రసరణము ఆగిపోవ నారంభించును. ఇట్లు గుండె తన పనిచేయుటమాని, యితర అవయవములలోనికి చాలినంత రక్తమును జిమ్ముట చాలించినప్పుడు, రక్తమంతయు గుండెలోనే నిలిచిపోవును; పనియొక్క క్రమము తప్పిపోవును; తుదకు గుండెకొట్టుటయు ఆగిపోవును. దీనినే [7]హార్ట్ ఫేల్యూర్ అందురు.

[1] Hemoptysis. [2] Epistaxis. [3] Acquired heart disease. [4] Pericardium. [5] Myocardium. [6] Endocardium. [7] Heart failure.

గుండెలోని లోపమువలన కలుగు లక్షణములు దేహమంతట కనబడును. నాడి వడిగను, అక్రమముగను, బలహీనముగను కొట్టుకొనుట వలన రక్తప్రవాహక్రమము తప్పిపోయినదని తెలియును. ముఖము తెల్లబారును; లేదా, నీలిరంగుగా మారును. ఏదైన అంటుతగిలిన వెంటనే, దేహోష్ణము హెచ్చును. కాళ్లు చేతులు చల్లబడి వాచియుండవచ్చును. శ్వాసావయవములయందు ఒగర్పు, నీలిరంగుగా మారుట, బ్రాంకైటిస్ (శ్వాసనాళరోగము), [1]హిమాప్టిసిస్ మొదలగు దుర్లక్షణములు కనబడును. వ్యాధి బాగుగా ముదిరినయెడల, ఊపిరితిత్తులు వాయును. జీర్ణావయవములకును, ఆంత్రములకును వ్యాధి వచ్చినయెడల, ఆకలి తగ్గిపోవుట, వాంతి వచ్చినట్టుండుట, అజీర్ణము, ఆంత్రములందు వాయువుచేరుట మొదలగు రోగచిహ్నాము లగుపడును. మూత్రావయవములకు వ్యాధి వచ్చినప్పుడు రోగి విసర్జించు మూత్రముతగ్గును, నాడీమండలమునకు వ్యాధి కలిగినయెడల, తలనొప్పి, దృష్టిమారుట, చెవులలో శబ్దములు పుట్టుటయు, నిద్రలేమి, భయము మొదలగు అవలక్షణములు కనబడును.

చికిత్సయు, పరిచర్యయు:—చికిత్సచేయుటయందు రోగికి ముఖ్యముగా, నిద్రయు, సరియైన ఆహారమును, మందులును లభించునట్లు చూడవలెను. రోగి విశ్రాంతి తీసికొనుచుండగా, అతనికి సరియైన వేడిమి గలిగియుండునట్లును, పరుపుగుడ్డలు తేలికగానుండునట్లును చేయవలెను. అవసరమైనయెడల, బెడ్ క్రేడిల్ (పడకగూడు) ఉపయోగించవచ్చును. రోగియందు కనబడు వ్యాధి లక్షణములనుబట్టి యతడు పరుండవలసిన తీరు నిర్ధారణ చేయవచ్చును. గుండెవ్యాధి తీవ్రముగానున్నప్పుడు రోగిని డార్సెల్ తీరులో పరుండబెట్టి పరిచర్యచేయుదురు. అట్లుకాక దీర్ఘకాలపు గుండెవ్యాధితో ఒగర్పుకూడ నున్నయెడల, బెడ్ రెస్ట్, దిండ్లు ఉపయోగించి, రోగిని తిన్నగా కూర్చుండబెట్టి పరిచర్యచేయవలెను. గుండె నానించుకొనుటకు ఒక బల్లను, దానిపైన దిండ్ల నుంచినయెడల, రోగికి చాల నెమ్మదికలుగును. కదులుటకు రోగి యే ప్రయత్నమైనను చేయకూడదు. నర్సే రోగిని కడిగి, ఆహారము తినిపించి, కదిలించవలెను. రోగి మాటలాడుటకైనను వీలుకలుగకుండ వీలైనంతమట్టుకు నర్సు అతని

[1] Hemoptysis.



కోరికలు, అక్కరలు తెలిసికొని పరిచర్యచేయుచుండవలెను. రోగము చాలవరకు బాగై, రోగి కొంచెము బలముపొందిన తరువాత, అతడు స్వయముగా కొన్నిపనులు చేయవచ్చునుగాని, ఒక్కొక్క పని చేయక ముందును, చేసినతరువాతను నాడిని పరీక్షించి, ముందున్న దానికంటె ఎక్కువగానున్నయెడల, రోగిచేయు పనినిగాని, దేహాభ్యాసమునుగాని తగ్గించవలెను.

రోగికి నిద్ర మిక్కిలి యవసరమైనను గుండె జబ్బున్న రోగి సాధారణముగా మంచి నిద్రపోడు. వేడిమి, చాలినంత మంచిగాలి, గాలి వాటము లేకుండ కాపాడుట, రోగికి తొందరకలిగించు శబ్దముగాని వెలుగుగాని లేకుండ చేయుట, తాను పిలిచినప్పుడెల్ల సహాయముచేయుటకు ఎవరో ఒకరు దగ్గరనేయున్నారని రోగికి నమ్మకము కలిగించుట మొదలగునవి అతనికి నిద్రపట్టునట్టు చేయును. రోగికి మలబద్ధకము లేకుండ దినమునకు ఒకటి, రెండుసార్లు మలవిసర్జనముచేయునట్లు రోగి ప్రేగులను క్రమపరచవలెను. రోగి లోపలికి పుచ్చుకొన్న ద్రవమును, నతడు విసర్జించుమూత్రమును కొలిచి సరిపోల్చి చూడవలెను. మూత్రములో ఆల్బ్యుమిన్ (శ్వేతధాతువు) ఉన్నదేమో చూచుటకు దానిని వారమునకు కనీసము రెండుసార్లయినను పరీక్షించవలెను. చర్మమును శుచిగానుంచి, పడకపుండ్లు లేవకుండ చూడవలెను. దినమంత నాలుగేసి గంటలకు ఒకసారి దేహోష్ణమును, నాడిని కనుగొని వ్రాసియుంచవలెను. రాత్రులలో నాడిమాత్రమే చూడవలెను. నాడిని చూచునప్పుడు దాని పరిమాణము, బలము, క్రమము, లయ మొదలగువానిని గమనించి, యేదైన మార్పు కనబడినయెడల, వెంటనే వైద్యునికి తెలుపవలెను. రోగి ముఖవర్చసును గమనించి, అది తెల్లబారినదా, నీలిరంగుగా మారినదా, అలసియున్నదా యని జాగ్రత్తగా గుర్తించవలెను.

గుండె జబ్బుగల రోగులకు పరిచర్యచేయునప్పుడు వారి ఆహారమును చాల జాగ్రత్తగ గమనించి ఇయ్యవలెను. ఆహారము జీర్ణమగుటలో ఏ తొందరకలిగినను కడుపు ఉబ్బి గుండెకు సంకటము కలుగును. దీనినిబట్టియే రోగికి, తేలికయైనట్టియు, సులభముగా జీర్ణము కాగలిగినట్టియు ఆహారమును క్రమముగ పలుమారు ఇచ్చుచుండవలెను. ఉదయము

ఆఱుగంటలనుండి రాత్రి తొమ్మిదిగంటలవరకు మూడుగంటలకొకసారి ఆహారమిచ్చుచుండవచ్చును. వైద్యుడిచ్చు ఉత్తరువునుబట్టి రోగికి ఏదైన మోతాదుగల ద్రవాహారము నియ్యవలెను. దీనిలో రోగి యెంతపుచ్చుకొనినది వ్రాసియుంచవలెను. ఆహారములకు మధ్య మధ్య ద్రవాహారముల నిచ్చుట మంచిది. మాంసకృత్తులు, ఉప్పు మితముగా నియ్యవలెను. [1]సెల్యులోస్ అను పదార్థము ఎక్కువగానున్న ఆహారములు అనగా, ముడిగోదుమ ధాన్యములు, ముదిరిన కూరగాయలు రోగికి ఇయ్యకూడదు. పాలు, గ్రుడ్లు, పెరుగు, మజ్జిగ, తురిమిన పశుమాంసము, చేప, కోడి మాంసము తదితర బలమైన (కాన్‌సెన్‌ట్రేటెడ్) ఆహారములను, పండ్ల రసమును నిచ్చుచుండవలెను. రోగియొక్క నోటిని, నాలుకను శుభ్రముగానుంచుట చాల ముఖ్యమైన విషయము. ఒక్కొక్క వ్యాధికి తగిన మందులను ఇచ్చుటకు వైద్యుడు ఉత్తర్వుచేయును.

[2]పెరికార్డైటిస్ (ఆదరణిక) పెరికార్డియమ్, లేక గుండెను గప్పియున్న పొరకందుట. ఇది సాధారణముగా క్షయవ్యాధిని కలుగజేయు [3]ట్యూబర్‌కిల్ అను సూక్ష్మజీవి, [4]న్యుమోకాకస్, [5]పయోజెనిక్ (చీము పట్టు) అను ప్రాణులవలన కలుగుచున్నది. మరియు ఏదైన యితర వ్యాధికి ఇది రెండవదిగ నుండును. గవదకాయ (టాన్సిల్స్), [6]సైనసెస్, లేక పండ్లవలన కలుగు ఇన్‌ఫెక్‌షన్లనుబట్టి కలుగవచ్చును; లేదా, న్యుమోనియవంటి తీవ్రమైన అంటువ్యాధినిబట్టి కలిగిన సంకరవ్యాధిగానైన నుండవచ్చును. వాతరోగము, [7]కొరియ (కండరములు స్వయముగా ఈడ్చుకొనుట) అను వ్యాధులతో సాధారణముగా సంబంధపడియుండును. [8]పెరికార్డియల్ సంచిలో రక్తపు నీరుగాని, చీముగాని చేరుటవలన, పెరికార్డియం గుండెకు అంటుకొనును. అందువలన గుండెపని కష్టమగును. సాధారణముగా ఆహారకోశమున్న భాగమున, నొప్పిగాని, అసౌఖ్యముగాని యుండును. ఈ బాధ శరీరములోని యితర భాగములకు సంబంధించినది కావచ్చును. ఇతరలక్షణము లేవనగా — ఒగర్పు, కొద్దిపాటి జ్వరము, నాడియొక్క రేటు, శ్వాసఎక్కువగుట మొదలైనవి. రోగముయొక్క తీవ్రతనుబట్టి

[1] Cellulose. [2] Pericarditis. [3] Tubercle bacillus.
[4] Pneumococcus. [5] Pyogenic. [6] Sinuses.
[7] Chorea. [8] Pericardial sac.



వ్యాధి బాగవునో, కాదో తేల్చవచ్చును. చీము చేరియుండుట దుర్లక్షణము.

చికిత్సయు, పరిచర్యయు: — ఇతర గుండెవ్యాధులకన్నిటికి చేసినట్టే దీనికిని పరిచర్యచేయవలెను. ఏ తీరున పరుండిన రోగికి అధికపక్షపు సౌఖ్యము కలుగునో, ఆ తీరులోనే అతడు పరుండి సంపూర్ణ విశ్రాంతి తీసికొనవలెను. మంచుతిత్తిని, [1]కౌంటర్ ఇరిటెంట్స్‌ను పై కడుపుమీద బెట్టిన, కొంత నెమ్మది కలుగగలదు. వాతరోగమునకు [2]సలిసిలేట్స్ అను మందులు వాడుదురు. ఇతర ఇన్‌ఫెక్‌షన్లు, వ్యాధికి కారణమైనయెడల వానికి తగిన చికిత్స చేయవలెను. బాధను, నొప్పిని తగ్గించి, రోగికి విశ్రాంతికలుగునట్లు [3]కోడీన్, మార్ఫిన్ అను మందులు వాడుట అవసరమై యుండవచ్చును. హార్ట్ ఫేల్యూర్ (గుండె కొట్టుకొనుట కష్టమైనయెడల) చురుకుదనము పుట్టించు మందులు వాడవలెను. పెరికార్డియమునందు నీరు చేరినయెడల, [4]డైయూరెటిక్స్, సేలైన్ ఎనిమలిచ్చిన, ఆ ద్రవములు లోపలి కింకుటకు సహాయము చేయును. నీటివలన గుండెయొక్క పనిలో ఏదైన కష్టమేర్పడినయెడల, పెరికార్డియమ్‌నందలి నీటిని బయటికి తీయవలెను. చీము చేరినప్పుడు, డ్రెయినేజి (చీము కారుట) కొరకు గొట్టము పెట్టుదురు. ఇతర విషయములలో గుండె రక్తప్రవేశ ద్వారములకు (పిధానములకు) [5]దీర్ఘకాలపు వ్యాధికి చేసెడి చికిత్సయే చేయవలెను.

[6]ఎండోకార్డైటిస్: — అనగా గుండెయొక్క లోపలిపొరను, దాని పిధానములను గప్పియున్న సన్ననిపొరకందుట. ఈ వ్యాధి ముఖ్యముగా [7]బృహద్ధమని, కిరీట పిధానములకు అపాయము కలిగించును. వాస్తవముగ ఇది, గనోకాకస్, న్యుమోకాకస్, స్టాఫీలోకాకస్, సిఫిలిస్ అను వ్యాధిని గలుగజేయు స్పైరోకీట్స్ అను సూక్ష్మజీవులు కలుగజేయు అంటు రోగములకు వచ్చు సంకరవ్యాధి. ఇది తరచుగ రుమాటిక్ జ్వరమువలన కలుగును. ఈ భాగము కందుటవలన, పిధానములమీద దుర్మాంసములు పెరుగును. ఇవి బాగుపడునప్పుడు మచ్చ కలుగజేయు

[1] Counterirritants. [2] Salicylates. [3] Codein.
[4] Diuretics. [5] Chronic valvular. [6] Endocarditis.
[7] Aortic and mitral valves.

కండరమేర్పడి పిధానములు చేయుపనికి, ఈ క్రింది రెంటిలో ఏదో యొకవిధముగా చెరుపు చేయును: పిధానములు సంపూర్ణముగా మూసికొనక పోవుటవలన రక్తము ఏ యరలోనుండి వచ్చినదో, ఆ యరలోనికే తిరిగి కారుట సంభవించును. ఇట్లు గాకపోయినను, ద్వారము సరిగా తెరచుకొననందున, దానినుండి కొద్దిగ మాత్రమే రక్తమువచ్చును. ఈ స్థితికి [1]'స్టెనోసిస్' అని పేరు.

**లక్షణములు:**—ఎండోకార్డైటిస్‌వలన కిరీట పిధానములు చెడుటచేత, ఊపిరి తిత్తులలోని రక్త వ్యాపకమునకు ఆటంకము కలుగును. అప్పుడు నొప్పియు, ఒగర్పును, భారమైనపని చేయుటవలన గుండెదడయు పుట్టును. చెంప బుగ్గలు ఎఱ్ఱబడియైన, నలుపెక్కియైన నుండవచ్చును. గుండె బలహీన పడుకొలది పాదములు, చీలమండలములు వాపెక్కును. [2]మయోకార్డియమునకు చాలినంత రక్తము లేనందున రొమ్ము ఎముకయుండు భాగమునందు నొప్పియుండును.

[3]**మలిగ్నెంట్ ఎండోకార్డైటిస్:**—దీనిలో పిధానములమీద పుండు ఏర్పడును. చిన్నచిన్న టిష్యూముక్కలు ఈ పుండ్లనుండి యూడి, రక్త ప్రవాహములో కొట్టుకొనిపోవుచు, అవి యే భాగమున నిలుచునో, ఆ భాగమున రక్తనాళములలో ఏర్పడిన మురికి సంబంధమైన అంటు వ్యాపించును. ఇది చాల అపాయకరమైనస్థితి. ఎక్కువ [4]ఆహిక జ్వరము ఉండును. నాడిరేటుకూడ హెచ్చును. [5]తెల్లరక్తకణముల సంఖ్యయు ఎక్కువగును. గుండెయున్న భాగమున నొప్పి, గుండెదడ, ఒగర్పు, గుండెలో ఏదో ఒక మొరటు శబ్దముపుట్టుట మొదలగు లక్షణములు కనబడును. తీక్షణమైన పట్టి యెండోకార్డైటిస్‌వలన మరణాపాయము లేకపోయినను, సర్వసాధారణముగా అది సంభవించినప్పుడెల్ల, గుండె పిధానములు పాడగును. మలిగ్నెంట్ ఎండోకార్డైటిస్ తరుచుగా మరణముతోనే అంతమగును.

**చికిత్సయు, పరిచర్యయు:**—ఈ స్థితికి కారణము తెలిసికొని దానిని తొలగించవలెను. అంటు నిలిచియుండు కేంద్రస్థానమును గమనించి,

[1] Stenosis. [2] Myocardium. [3] Malignant endocarditis.
[4] Remittent fever. [5] Leucocyte count.



దానిని తీసివేయవలెను. వ్యాధి కుదిరిన తరువాతకూడ అనేక వారములు, రోగి సంపూర్ణ విశ్రాంతిపొందుట చాల అవసరము. తేలికగానుండు మంచుతిత్తి గుండెయున్న భాగమున బెట్టుట, వేడిమి, గుండెకు పనికలిగించెడు మనోశారీర కార్యములనుండి విశ్రమించుట ఇవన్నియు స్వస్థతకు తోడ్పడును. రోగిని డార్సల్ తీరులోనుంచి, చికిత్స చేయవలెనుగాని ఒగర్పున్నయెడల, అతని కొంచెము లేపి కూర్చుండబెట్టి, దిండ్లు ఆధారముగా పెట్టవలెను. ఇన్‌ఫెక్షన్ దొలగించుటకు [1]సీరంలును వ్యాక్సీన్‌లును కాక, [2]సల్ఫోనమైడ్ మందులు ప్రయోజనకరమని రుజువు చేయబడినది.

**మయోకార్డైటిస్:**—అనగా మయోకార్డియమ్ లేక గుండెయొక్క కండరము కందుట. ఎండోకార్డైటిస్‌కు చూపిన కారణములే దీనికిని కారణములు. ఇది గుండెలో యెండోకార్డైటిస్‌తోను, పెరికార్డైటిస్‌తోను వృద్ధిచెంది, సాధారణముగా పిల్లలలోను పడుచువారిలోను కనబడుచుండును. దీర్ఘమైన మయోకార్డైటిస్‌నందు గుండెయొక్క కండరము క్షీణించిపోవును. అంటురోగ క్రిములు ప్రవేశించవచ్చును. లేదా, వానినుండి వచ్చిన [3]విషకందళములు రక్తప్రవాహములో ప్రవేశింపవచ్చును.

సాధారణముగా, రోగలక్షణము లిట్టివని చెప్పవీలుకాదు. సరియైన లక్షణములు కనబడకుండనే, వ్యాధి మరణకరమైనది కావచ్చును. కొన్నిసార్లు, ఊపిరి ఆడకపోవుట, గుండెయున్న భాగములో ఆయాసముండుట, గుండెదడ, గుండెయొక్కపని అక్రమమగుట, నాడి త్వరితముగను, అక్రమముగను కొట్టుకొనుట, తక్కువ రక్తపుపోటు మున్నగు లక్షణము లుండవచ్చును. దేహోష్ణము కొంత హెచ్చును. కాని ఆరంభమునుండిన ఇన్‌ఫెక్షన్‌నుబట్టి కలిగిన జ్వరము దీనిని గప్పివేయవచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు:**—ఇన్‌ఫెక్షన్‌కు మూలకారణము కనుగొని దానికి చికిత్సచేయుము. తరుచుగా మయోకార్డైటిస్, డిఫ్తీరియతో సంబంధించియున్నందున, దాని నివారణకు ముందుగనే [4]ఆంటిటాక్సిన్

[1] Sera and vaccines. [2] Sulphonamide. [3] Toxins. [4] Antitoxin.

ఇచ్చుట మేలు. తీవ్రమైన ఎండోకార్డైటిస్‌కు చేసిన చికిత్సయే, వచ్చిపోయి దీనికిని చేయవలెను. సాధ్యమైనంతవరకు మనస్సు, శరీరము సంపూర్ణముగా విశ్రమించుట అవసరము. స్వల్పమైనట్టియు, త్వరగ జీర్ణమగునట్టియు కొద్ది పరిమాణముల ఆహారము తరుచుగ నిచ్చుచుండవలెను. గుండె తొందర మెకువగ నుండెనేని, అత్యావసరమైన చికిత్స వెంటనే చేయవలెను. ఈ జబ్బు ప్రమాదకరమైనదిగా ఉండవచ్చును; గుండెకు కలిగిన నష్టమునుబట్టి యీ ప్రమాదముండును. తగిన జాగ్రత్తనుబట్టి రోగి అనేక సంవత్సరములు జీవించవచ్చును.

అంజైన పెక్టోరిస్:—గుండెయున్న భాగమున అకస్మాత్తుగా పుట్టిన భయంకరమైన నొప్పి.

లక్షణములు:—గుండెయున్న భాగములో అకస్మాత్తుగా తీవ్రమైన నొప్పి పుట్టును. అదేసమయమున రొమ్ము బిగబట్టినట్లుండి, మరణము సంభవించునేమో యను భయము గలుగును. గుండెలోని నొప్పి, యెడమ చేతి వ్రేళ్ల కొనలవరకు ప్రాకును. పై లక్షణములన్నియు ప్రమాదకరమైనవి. అనుకూల, అతి ప్రతికూల రకముల లక్షణముల వ్యత్యాసము కనుగొనుట కష్టము.

చికిత్సయు, పరిచర్యయు:—తగినంత ఆధారముతో రోగిని వీలైనంత సౌఖ్యమైన తీరులో పెట్టవలెను. మార్ఫిన్, నైట్రైట్స్, అనగా నైట్రొగ్లిసరిన్, లేక ఏదోయొక నైట్రైట్ మందునిచ్చి రోగి బాధను తగ్గించవలెను.

మైకము లేక [1]సింకోపి:—గుండెవ్యాధిగల రోగులలో నిది దుర్లక్షణము. ముఖము తెల్లబారుట, కష్టమైనట్టియు, అల్పమైనట్టియు శ్వాసవిడుచుట, నాడి త్వరితముగను, అక్రమముగను కొట్టుకొనుట, ముఖముమీద చెమట బిందువు లేర్పడుట—ఇవి రోగలక్షణములు. రోగికి స్మారకము తప్పిపోయి కొలాప్స్ రావచ్చును.

చికిత్స:—చికిత్స వెంటనే చేయవలెను. రోగి మొండెముకంటె తలను కొంచెము క్రిందికివంచి, వెలికిల పరుండబెట్టి, బట్టలు, ముఖ్యముగా మెడ చుట్టును, వీపు చుట్టునున్న బట్టలను వదలుచేయవలెను. మంచిగాలి

[1] Syncope.



విస్తారముగా వీచునట్లు వీలు కలిగించవలెను. గుండెకుచురుకుదనము పుట్టించుమందులు, అనగా [1]అరోమాటిక్ స్పిరిట్స్ ఆఫ్ అమ్మోనియ ½—1 డ్రాము ఇయ్యవలెను. ద్రవములను నోటిద్వారా యియ్యవచ్చును. వేడి రెక్టల్ సెలైన్ అయినను, చురుకుదనము పుట్టించు బ్రాందితో కలిపిన పాలులేని నల్లని కాఫియయినను ఎనెమ యియ్యవచ్చును.

గుండెకు లోపము గలుగుట:—గుండెకు లోపముగల వ్యాధి యున్నప్పుడు దేహము నల్లబడుట, ఒగర్పు, [2]ఊపిరి యాడకుండుట, దగ్గు ఉండును. ఆహారకోశమున్న భాగము నిండియున్నట్లును, నొప్పియు, డోకును, వాంతియును ఉండును. రోగికి వాపుండును. మూత్రముపోయుట తగ్గిపోవును. పోసినమూత్రములో [3]కాస్ట్సుయును [4]ఆల్బ్యుమిన్‌యును తరుచుగా విస్తారమైన [5]యూరేట్స్‌ను ఉండును. రోగికి జలోదరము ఆరంభించి, కాలేయము పెద్దదగును. పరీక్షించినప్పుడు గడగడమను కొన్ని విధములైన శబ్దములును, శ్వాస తగ్గిపోయినట్టి శబ్దములును వినబడును. ఈ సమయములో రోగికి చురుకుదనము పుట్టించుటకు వాడెడుమందు లేవనగా.—కాఫిన్, [6]తియొబ్రొమిన్, ఆల్కహాల్ స్ట్రిక్‌నిన్. హార్ట్ ఫెల్యుర్ అనునది తీక్షణముగాను అకస్మాత్తుగాను వచ్చునప్పుడు [7]అడ్రినలిన్ సహాయపడును.

కారొనెరి థ్రాంబోసిస్: — గుండెయొక్క కండరమునకు రక్తమును కలుగజేయు కారొనెరి ధమనులకు ఆటంకము కలుగజేయుదానికి [8]కారొనెరి థ్రాంబోసిస్ అని పేరు. ఈ రక్తనాళము గుండెయొక్క ఏ భాగమునకు రక్తమును వ్యాపింపచేయుచున్నదో, ఆ భాగమునందలి [9]కండరము చెడిపోవును. ఇది పైజెప్పిన కారొనెరి థ్రాంబోసిస్‌యొక్క సంకరవ్యాధి. ఈ భాగమున మొదట రక్తనాళము తెగిపోయి, పిమ్మట [10]అన్యూరిజమ్ ఏర్పడవచ్చును. తరుచుగా ఇది 50—70 సంవత్సరముల మధ్య వయస్సుగలవారికి సంభవించుచుండును. అధిక రక్తపోటు కలుగుటకు కారణములే దీనికిని ముఖ్యకారణములై యున్నవి.

లక్షణములు:—దీనికి పూర్వము రోగి [11]అంజైన పెక్టోరిస్ హృదయశూలల అను వ్యాధివలన బాధపడియుండవచ్చును. కాని సాధారణముగా

[1] Aromatic spirits. [2] Orthopnea. [3] Casts. [4] Albumin. [5] Urates.
[6] Theobromine. [7] Adrenalin. [8] Coronary thrombosis.
[9] Necrosis. [10] Aneurism. [11] Angina.

రోగి విశ్రాంతి పొందుకాలములో కారొనెరిత్రాంబోసిస్ రావచ్చును. గుండెలో తీక్షణమైన నొప్పియుండవచ్చును. ఈ నొప్పి యెడమభుజమునకును కడుపునకును వ్యాపించవచ్చును. ఈ నొప్పి గంటలకొలది యుండవచ్చును. కొన్నిసమయములలో రోగికి కొలాప్స్ వచ్చుట, షోకు, వాంతియగుట, నాడి వడిగను, బలహీనముగను నుండి స్వారిచేయుచున్న లయవలె వినబడుటయునుండవచ్చును. ఈ సమయములో సాధారణముగా దేహోష్ణము హెచ్చును; రక్తపుపోటుతగ్గును; తెల్లకణములు కొద్దిగా హెచ్చును. విశ్రాంతివల్లనైనను నైట్రైట్స్‌వల్లనైనను నొప్పి తగ్గదు. గుండెయొక్క కండరము ఎంతవరకు చెడిపోయినదో దానినిబట్టి వ్యాధియొక్క ముందుస్థితి యుండును. కొందరు రోగులు వెంటనే చనిపోదురు; మరికొందరు కొన్ని నిమిషములలోనో లేక గంటలలోనో చనిపోదురు. ఇంక కొందరు కొన్నిదినములు జీవింతురు. కొందరు కొంతవరకు తెప్పరిల్లుదురుగాని వారిగుండె క్రమేణ బలహీనపడి, హార్ట్ ఫేల్యూర్ సంభవించును. ఈ వ్యాధిగ్రస్థులలో నూటికి 50 మంది తెప్పరిల్లవచ్చును గాని, తరువాత వారికి ఈ వ్యాధి అప్పుడప్పుడు సంభవించవచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు:**—అనేక వారములు పడకలో పరుండి సంపూర్ణముగా విశ్రాంతిపొందవలెను. ఈ సమయములో విశ్రాంతికలుగుటకు సహాయముగా మార్ఫియాను, ఉపశాంతినిచ్చెడి మృదువైన మందులును పుచ్చుకొనుట అవసరమైయుండవచ్చును. సులభముగా జీర్ణముకాగల ఆహారముగాని, ద్రవాహారముగాని, మెత్తగా ఉడికించిన ఆహారముగాని పెట్టవచ్చును.

**ధమనులకును, సిరలకును గలుగు వ్యాధులు**

**త్రాంబస్:** — వ్యాధివలననో, గాయమువలననో రక్తనాళములోని రక్తము గడ్డకట్టుట. దీనికి త్రాంబస్ అని పేరు. ఈ గడ్డ దాని పరిమాణమునుబట్టి ఆ నాళమునందు ఆటంకము కలిగించును. ఏదైన నొక నాళములో త్రాంబస్ ఉన్నప్పుడు ఆ నాళము త్రాంబోస్డ్ అయినదని చెప్పుదురు. ఇట్టి స్థితికి త్రాంబోసిస్ అని పేరు.

**[1]ఎంబొలస్:**—ఇది త్రాంబస్‌లోగాని, త్రాంబస్‌యొక్క ఒక భాగములోగాని యుండి, అదియున్న రక్తనాళమునుండి ఊడిపోయి, రక్తప్రవాహ

[1] Embolus.



మున గొట్టుకొనిపోవును. తుదకు అది దూరిపోలేని యేదేని ఒక నాళములోచేరి, అక్కడనిలిచి, దానికి ఆటంకము కలిగించును. దీనిని '[1]ఎంబొలిజేమ్ అందురు. ఇది యేదైన, ఒక ముఖ్య అవయవము అనగా, ఊపిరితిత్తి, గుండె, మెదడు మొదలగు వానియందలి ఒక నాడి కొనచేరి ఈ స్థితిని కలిగించినయెడల, ఆ క్షణమే మరణము సంభవించవచ్చును. [2]ఫ్లెబైటిస్ అను వ్యాధికి వాడు చికిత్సనే దీనికిని వాడవచ్చును. (347 పుట చూడుము).

**అన్యురిజేమ్:**—వ్యాధివలనగాని, గాయమువలనగాని ధమనిసాగుట (విస్తరించుట)కు అన్యురిజేమ్ అని పేరు. దీనినిండ రక్తముండును. ఈ వ్యాధి యేధమనికైనను తగలవచ్చునుగాని, సాధారణముగా, [3]బృహద్ధమనికి సంభవించును. బృహద్ధమనియొక్క వంపునకు అన్యురిజేమ్ సంభవించినయెడల, అది ప్రమాదకరమైన స్థితిని తెలియజేయును. ఈ స్థితి మిక్కిలి తరుచుగా మేహారోగులకు సంభవించును. వాతరోగము, సెప్టిసీమియ అను ఇన్ఫెక్షన్లలోను ఇది సంభవించవచ్చును. ఒకడు ఎక్కువ చురుకుగపనిచేయు సంవత్సరములలోనే ఇది తరుచుగా సంభవించును.

బృహద్ధమని వంపునకు సంభవించు అన్యురిజేమ్‌యొక్క లక్షణములు: మంటతోకూడిన నొప్పి, లేక నరములసంబంధమైన బాధ, [4]కింకవాతపు దగ్గు, శ్వాసించుటకును, మ్రింగుటకును కష్టపడుట, గొంతు రాయుట మొదలైనవి. రోగికి కొద్దిపాటి జ్వరము తగులును; బరువు తగ్గిపోవును. [5]ఊపిరితిత్తులనుండి రక్తస్రావమగుట, వాపు, నీలిరంగు కలుగుట ఒక చేతిసిర ఉబ్బుట — ఇవి ఈ రోగముయొక్క గుణలక్షణములు. ధమనియొక్క గోడ బలహీనపడి, పగిలినందువలన, ఆ క్షణములోనే మరణము సంభవించవచ్చును. నూటికి 50 మందికి, ఈ స్థితి తరుచుగా 2½ సంవత్సరములలోపల సంభవించును. ఈ లక్షణములు కనబడిన తరువాత ఒక్కొక్కప్పుడు రోగులు 10 సంవత్సరములవరకును జీవించుట గలదు.

**చికిత్సయు, పరిచర్యయు:**—మేహారోగముతో బాధపడు రోగికి అన్యురిజేమ్‌యొక్క లక్షణములు కనబడకముందే, మొదటి దశ ఆఖరునగాని,

[1] Embolism. [2] Phlebitis. [3] Aorta. [4] Croupy cough. [5] Hemoptysis.

రెండవ దశ ఆరంభమునగాని చికిత్స చేయవలెను. ఏ దశయందున్న మేహరోగమునకైన చికిత్సచేయవలెను. రోగి 10—12 వారములు సంపూర్ణ విశ్రాంతిపొందవలెను. ఇందువలన గుండె కొట్టుకొను వేగమును, ధాటియు తగ్గును; అన్యూరిజమ్‌కూడ తగ్గిపోవును. రోగికిచ్చు ఆహారము, బలమును, మంచి పోషణయుగలదియై, తేలికగానుండవలెను. ఆల్కాహాల్‌ను, పొగాకును రోగి వాడకూడదు. వేడికాపడమువలనగాని, నొప్పి భాగముమీద మంచుసంచిని పెట్టుటవలనగాని రోగికి కొంత ఉపశాంతి కలుగవచ్చును. నొప్పిని నివారించుటకు మార్ఫిన్‌ను, ఒగర్పు ఉన్నయెడల కొన్నిసార్లు నైట్రొగ్లిసరిన్‌ను వాడుదురు.

సెరిబ్రల్ హెమొరెజ్ (అపొప్లెక్సీ) (రుద్రవాతము):— మెదటిలో నేదేని రక్తనాళము తెగుటవలన సెరిబ్రల్ హెమొరెజ్ (మెదటిలోనే రక్తస్రావము) కలుగును. దీని ఫలితముగా రోగికి హఠాత్తుగా పక్షవాతము, గాఢమూర్ఛ కలుగవచ్చును. దీనిని [1]అపొప్లెక్సీ లేక స్ట్రోక్ అందురు. సాధారణముగా ఇది 40 ఏండ్లు దాటిన వయస్సుగలవారికి సంభవించునుగాని, యే వయస్సులోనైనను రావచ్చును. ధమనులకు వచ్చు వ్యాధులకు కారణములైనవన్నియు సెరిబ్రల్ హెమొరెజ్‌కి దారి తీయును. వీనిలో తరుచుగా కనబడు లక్షణములు: ధమనులు గట్టిపడుట, అధిక రక్తపోటు, దీర్ఘకాలము నుండియున్న నెఫ్రైటిస్, త్రాగుబోతుతనము, మేహరోగము. ఈ వ్యాధి వంశ పరంపరగానైనను రావచ్చును.

లక్షణములు:—కండ్లు తిరుగుట, తలదిమ్ము, దేహమందు ఒకప్రక్క తిమ్మిరి, భయము, మాటలు తబ్బిబ్బుగా మాటలాడుట, ఇవి సాధారణముగా అపొప్లెక్సికి ముందుగా కనబడును, వ్యాధి సంభవించినప్పుడు రోగి స్మారకము తప్పి క్రిందబడును; ముఖము కందును; శ్వాసము నిదానముగను శబ్దముతో కూడినదియునై యుండును. ఊపిరి విడుచునప్పుడెల్లను బుగ్గలుబ్బును. వ్యాధి యే ప్రక్కననుండునో కండ్లు ఆ ప్రక్కకు తిరుగును. దేహముయొక్క ఒక ప్రక్కకు సాధారణముగా పక్షవాతము వచ్చును. మెదటికి ఏ భాగమున వ్యాధికలిగినదో ధాని ఎదుటిపక్షమునకు పక్షవాయువు వచ్చును. సాధారణముగ ఈ వ్యాధి చేతికి కలిగినయెడల అది

[1] Apoplexy or stroke.



యెల్లప్పుడు నిలిచియుండును. రోగికి కొద్దిపాటి జ్వరముండును. దానితోపాటు తనకు తెలియకుండనే మలమూత్రాదులను విడుచుచుండును. మరణము సంభవించువరకు రోగి స్మారకము తప్పియే యుండవచ్చును లేక కొన్ని గంటలలో తెలివి పొందవచ్చును. ఈ వ్యాధి పూర్తిగ కుదురునదైన, మొదటి నెలలోనే కుదురవలెను. అట్లు కానిపక్షమున ఏదోకొంత పక్షవాతము నిలిచియుండును. కావున మనసు స్థిమితము లేక యుండును. ఇట్టి రోగి సాధారణముగ కష్టముతో మాట్లాడును.

**చికిత్సయు, పరిచర్యయు:**—రోగియొక్క తలను కొంచెము ఎత్తిపెట్టి పరుండనియ్యవలెను. తలకు మంచుసంచిని, పాదములకు వేడినీటి సంచులను పెట్టవలెను. మెడచుట్టును వీపుచుట్టుననున్న బట్టలు వదలుచేయవలెను. [1]సిరలను కోసి 250—350 cc. ల రక్తము తీసి దానిపోటును కొంతవరకు తగ్గించవలెను. ఈ సమయమున ఎనెమ నియ్యవచ్చునుగాని రోగిని కదిలించుటయైనను తొందరచేయుటయైనను మంచిదికాదు. న్యుమొనియ వ్యాధి సంభవించకుండ రెండుగంటల కొకసారి రోగిని ఒక ప్రక్కనుండి మరియొక ప్రక్కకు త్రిప్పి పరుండబెట్టవలెను. రోగి నోటిని శుభ్రముగను తడిగను ఉంచవలెను. పురీషనాళముద్వారాగాని ముక్కుద్వారాగాని ఆహారము నియ్యవచ్చును. రక్తపుపోటుకు లోనగువారికి సెరిబ్రల్ హెమొరెజ్ తగులకుండునట్లు రోగికి ఉద్రేకము పుట్టించుపనులు, దేహమునకు భారము పుట్టించుపనులు చేయించరాదు. సారాయము, కాఫి, టీ లాటి చురుకుదనమును పుట్టించు వానిని, ఉప్పునుకూడ తగ్గించవలెను. అవసరమైనయెడల రోగియొక్క బరువునుకూడ తగ్గించవలెను. వ్యాధి తీక్షణమైన లక్షణములు తగ్గినప్పుడు రెండవ వారమందైనను రోగిచేత తేలికయైన దేహాభ్యాసముచేయించి పక్షవాతముచేత పడిపోయిన అవయవములను మర్దనచేయుచుండవలెను. వ్యాధి తీక్షణముగనున్నప్పుడు అవయవములు వికృతరూపము పొందకుండ వానిని తగు జాగ్రత్తగా సరియైన తీరులో పెట్టియుంచవలెను. రోగికి పడకపుండ్లు లేవకుండునట్లు రోగిని శుభ్రముచేయుచు పలుమారు ప్రక్క త్రిప్పుచు రక్తప్రసరణము చురుకుగా జరుగుటకు ఆయా అవయవములను మర్దన చేయుచుండవలెను. రోగి

[1] Venesection.

పడకయందే దేహాభ్యాసము చేయవలెనుగాని మూడువారములవరకు నడుచుటకు ప్రయత్నమైనను చేయకూడదు.

అధిక రక్తపుపోటు [1](హైపర్ టెన్షన్):—తాత్కాలికముగా సంభవించు అధిక రక్తపుపోటుకు రోగికిగల చింత, కోపము, ఇతర మనస్తాపములుగాని, ఎక్లాంప్షియ, యురీమియ అను వ్యాధులుగాని కారణమైయుండవచ్చును. [2]గలగండము విషపూరితమైనప్పుడును, బృహద్ధమని (అయోర్ట) యందు చాలినంత రక్తములేనప్పుడును, ఒక్కొక్కప్పుడు [3]ఆర్టిరియోస్క్లెరోసిస్ యందును, [4]క్రానిక్ బ్రైట్స్ వ్యాధియందును, క్రానిక్ ఆర్టీరియల్ హైపర్ టెన్షన్ (దీర్ఘకాలమునుండి రక్తనాళములలో అధికపోటు ఉండుట) వలనను కలుగును. సెరిబ్రల్ హెమొరెజ్ (మెదడునందు రక్తముకారుటవలన కలిగిన అధికపోటు) వలనను, పుఱ్ఱె పగులుటవలనను, మెనింజైటిస్ అను వ్యాధి వలనను మెదడునందు అధిక రక్తపుపోటు ఏర్పడును. ఇందువలన డయస్టాలిక్, సిస్టాలిక్, అను రెండువిధములైన పోట్లు అధికమగును.

లక్షణములు:—రక్తపు ఒత్తిడి అధికమగును; ధమనులయొక్క బిగువు హెచ్చును; ధమని ఉబ్బును; నొసలు పోటుపుట్టును; మెడయందలి నాళములనిండ రక్తముచేరి ఉబుకుచుండును; గుండెదడ, శ్వాసించుటయందు కష్టము, కండ్లు తిరుగుట, డోకు, వాంతి, జీర్ణ అవయవములయందు తొందర, రక్తస్రావము, కండ్లముందు ఏవో చుక్కలు కనబడినట్లు దృష్టియందు లోపము కలుగుట—ఇవి మరికొన్ని సాధారణమైన లక్షణములు. ఈ స్థితి క్రమముగ బలముచెందుటవలన గుండె పెద్దదియు శక్తిహీనమైనదియునగు అపాయమేర్పడును. సెరిబ్రల్ హెమరెజ్, త్రాంబోసిస్, మూత్రపిండములకు తొందరకలుగు అపాయముకూడ ఉండును.

చికిత్సయు, పరిచర్యయు:—వీలైనయెడల ఈ స్థితికి కారణము కనుగొనవలెను. మూత్రమునందు ధవళము ఉన్నదాయని పరీక్షచేసి తెలిసికొనవలెను. మూత్రావయవముల పనిని గుర్తెరుగవలెను. కార్డియోగ్రాఫ్‌ద్వారా గుండెయొక్క పనిని పరీక్షించవలెను. థైరాయిడ్ గ్రంథి పని ఎక్కువగానున్నట్లు అనుమానముకలిగిన, [5]బేసల్ మెటాబలిజమ్ అను

[1] Hypertension. [2] Goitre. [3] Arteriosclerosis.
[4] Chronic Bright's disease. [5] Basal metabolism.



పరీక్షచేయవలెను. రోగికి చురుకుదనము పుట్టించు ఏ వస్తువునైనను ఇయ్యకూడదు. రోగి సరియైన విశ్రాంతియు, ఆహారమును పుచ్చుకొనునట్లు గమనించవలెను. నోటిద్వారా ఇచ్చు ద్రవములు మితముగ నుండవలెను. దేహమునందలి ద్రవములను తగ్గించుటకు హైపర్‌టానిక్ సేలైనును అవసరమైనప్పుడెల్ల పురీషనాళముద్వారా ఇచ్చుచుండవలెను. రోగి బరువు ఉండవలసినంతకంటె తక్కువగనుండునట్లు తగ్గించవలెను.

తక్కువ రక్తపుపోటు [1](హైపొటెన్షన్):—హిందూదేశములో [2]సిస్టాలిక్ ప్రెషర్ 90 కంటె తక్కువగానున్నయెడల అసాధారణము [3](అబ్‌నార్మల్) అని తలంచెదరు.

ఈ స్థితి అడిసన్స్ వ్యాధియందును, [4]హైపొథైరాయిడిజమ్‌నందును, క్షయ, [5]అమిబయసిస్ మొదలగు దీర్ఘకాలపు అంటువ్యాధులయందును, దేహములోని యేదో యొకభాగమునందు తగిలిన ఇన్‌ఫెక్షన్‌నందును కనబడును. నరములకు సంబంధించిన వ్యాధులయందును, హెమొరెజ్ (రక్తస్రావము) మొదలగు వ్యాధులయందును సంభవించును.

లక్షణములు:—నాడి మెత్తగనుండును. తనకు మైకమును, కండ్లు తిరుగుటయు, బలహీనతయు నున్నట్లు రోగి అనుభవించును. చలిని త్వరగా గమనించును. సాధారణముగా ఈ స్థితిలో [6]అనీమియ (పాండురోగము) కలుగును. రోగము బాగుపడు సూచనలు రోగమును కలిగించిన స్థితి కారణములనుబట్టి యుండును.

చికిత్సయు, పరిచర్యయు:—ఈ వ్యాధికి కారణముకనుగొని సాధ్యమైనచో దానిని తొలగించుము. అడ్రినలిన్ వలన తరుచుగా మైకము తొలగించబడును. విశ్రాంతి, చాలినంతబలము కలుగజేయు ఆహారము, ద్రవముల నెక్కువగానిచ్చుట, పాండురోగమునకు చికిత్సచేయుట—ఇవి వ్యాధి నివారణకు సహాయములు.

ఆర్టీరియొస్క్లెరోసిస్:—అనగా, ధమనులయొక్క గోడలు గట్టిపడుట. అధిక రక్తపుఒత్తిడి, వృద్ధాప్యము, ఆల్కహాలిజమ్‌తోను డిఫ్తీరియ, విషజ్వరము, సవామేహము మొదలగు తీక్షణమైన అంటువ్యాధులతోను ఇది సంబంధించియుండును. అధిక రక్తపుఒత్తిడి—మితిమీరి భుజించుట, దేహాభ్యాస

[1] Hypotension. [2] Systolic pressure. [3] Abnormal.
[4] Hypothyroidism. [5] Amebiasis. [6] Anemia.

మును నిర్లక్ష్యపెట్టుట, దీర్ఘకాలము మనోవ్యాకులత కలిగియుండుట ఇత్యాది కారణములవలన కలుగును. ఇది వంశపరంపరగాను రావచ్చును. ధమనుల మూడు పొరలయందును మార్పులు కనబడును. దీని ఫలితముగా టిష్యూలు క్షీణించును. వీనికిబదులు మందముగను, గట్టిగను నుండు నారవంటి స్నాయువులు [1](ఫైబ్రస్ టిష్యూలు) ఏర్పడును.

లక్షణములు:—ఇవి వ్యాధివచ్చిన స్థలమునుబట్టియు, అది యెంత దూరము వ్యాపించినదో దానినిబట్టియు నుండును. ఎందుకనగా, వ్యాధియున్నభాగములో చాలినంత రక్తము పారనందున, ఆయా అవయవములు బలహీనపడి, పని చేయలేకపోవుచున్నవి. ముఖ్యముగా మెదటికి, మూత్రపిండములకు, గుండెకు ఈ వ్యాధి కలుగును. మొత్తముమీద శరీర, మనోపటుత్వములు తగ్గిపోవును. జ్ఞాపకశక్తి, ముఖ్యముగా ఇటీవల జరిగిన సంగతులనుగూర్చిన జ్ఞాపకశక్తి తగ్గిపోవును. ఏదైన ఒక సంగతిమీద మనస్సునిలిపి పనిచేయుశక్తియు తగ్గిపోవును. చిరచిరలాడుట, వ్యసనము, నిద్రనాశముకూడ యుండును. రోగి త్వరగా అలసిపోవును. తలనొప్పి, అజీర్ణము, మలబద్ధకము, ఆకలిలేకపోవుట, బరువు క్రమేణతగ్గుట రోగియందు కనబడు మరికొన్ని లక్షణములు. కండరములు పట్టుకొనుటగాని, కొంచెము ప్రయాసపడినప్పుడు ఎగశ్వాసగాని, గుండె కండరమునకు తగినంతబలము లేకపోవుటగాని యుండును. ధమనులు గట్టిగను, మందముగను, తరుచుగ పూసకట్టినట్లు నుండును. ఆర్టీరియొస్లెక్రోసిస్ అను వ్యాధియు, దానికి సంబంధించిన సెరిబ్రల్ హెమొరెజ్ మధ్యవయస్సు దాటిన అనేకులు చనిపోవుటకు కారణమగును.

చికిత్సయు, పరిచర్యయు:—ఈ లక్షణములను తొలిగించవచ్చును. కొన్నిసారులు ఈ వ్యాధి వృద్ధికాకుండ చేయవచ్చును. ముఖ్యముగా వ్యాధి ఆరంభదశలో నున్నప్పుడు ఇది సాధ్యపడును. ఇన్ఫెక్షన్ యొక్క కారణమును తీసివేయవలెను. ఒక్కొక్క రోగి అక్కరకు తగిన, ఆహారమియ్యవలెను. చురుకుదనము పుట్టించునవేవిగాని యియ్యకూడదని ఒక నియమముండవలెను. రోగికి దేహాయాసము, మానసిక ఆయాసము ఏదియు కలుగగూడదు. కాని కొద్దిపాటి దేహపరిశ్రమ, పరిస్థితు

[1] Fibrous tissue.



లనుబట్టి వీలైనయెడల ప్రకృతిసంబంధమైన చికిత్స—వెలుగు, వేడిమి, గాలి, నీళ్లు మొదలైనవాని మూలమైన చికిత్స ([1]ఫిజియొతెరపి) తీసికొనవలెను. చర్మము, ప్రేగులు, మూత్రపిండము, వీని మూలమున వీలైనంతవరకు మలినము విసర్జింపబడునట్లు చూడవలెను. తీక్షణమైన తలనొప్పితోకూడ కనబడు ఇతర లక్షణములను నైట్రైటులిచ్చి తొలిగించవలెను. నిద్రకొరకు ఉపశాంతినిచ్చు మందులను వాడవలెను. రోగి యెక్కువ ఆయాసముగా నుండినట్లయిన [2]పరాల్డిహైడ్ సహాయకరముగా నుండును. కాళ్లచేతులకు రక్తప్రసరణము తగ్గినప్పుడు, వేడి నుపయోగించి, అవయవములను పైకి ఎత్తిపెట్టుట, క్రిందికిదించుట, లేక ప్రక్కలకు చాచియుంచుట అను సాధకములవలన రక్తము ఎక్కువ పారునట్లు చేయవచ్చును. [3]కుళ్లిన భాగమునకు శస్త్రచికిత్స చేయవలెను.

[4]ఫ్లెబైటిస్:—అనగా ఏదైన ఒక సిర కందుట. [5]ఎరిసిపెలస్, దేహములోని యేదో యొకభాగముననున్న ఇన్ఫెక్షన్, టైఫాయిడ్‌వంటి అంటు రోగములు, ప్రసవమైనతరువాత వచ్చు ఇన్ఫెక్షన్లు—వీని అన్నిటికి ఫ్లెబైటిస్ ఒక సంకరవ్యాధిగా రావచ్చును.

లక్షణములు: — సిరమార్గము పొడుగునవాచి, నొప్పిగనుండును. ఇది ముఖ్యముగా క్రింది అవయవ సిరలకును, మరి ముఖ్యముగ [6]తొడ సిరలకు వచ్చును. ఆ అవయవమునందు వాపును, నొప్పియు, కొద్దిగానో, గొప్పగానో జ్వరము ఉండవచ్చును.

చికిత్సయు, పరిచర్యయు:—రోగి కనీసము రెండు వారములైనను సంపూర్ణవిశ్రాంతి తీసికొనవలెను. త్రాంబస్ అనునది ఒకేచోట నిలిచి యుండునట్లు, రోగిని, ముఖ్యముగా వ్యాధియున్న అవయవమును బహు జాగ్రత్తగా కదిలించవలెను. ఆ భాగము నెత్తిపెట్టి, వేడిగను నెమ్మదిగను నుండునట్లు ఇసుకసంచులను పడకచట్రమును ఆధారముగా పెట్టవలెను. అప్పుడు పడకగుడ్డలబరువు ఆ భాగమునకు తగలదు. చాల తేలికయైన మంచుసంచినిగాని, అవయవమునకు వాడవలసిన ఇతర మందులనుగాని వైద్యుడు ఉత్తర్వుచేయవచ్చును. వ్యాధి

[1] Physiotherapy. [2] Paraldehyde. [3] Gangrene. [4] Phlebitis. [5] Erysipelas. [6] Femoral.

యున్న అవయవము నెన్నడును రుద్దకూడదు. కొంతకాలమైన తరువాత [1]ఇలాస్టిక్ సపోర్టర్‌ను వాడుట అవసరమై యుండవచ్చును.

[2]**ఉబ్బిన సిరలు:**— ఎక్కువ గాలిగొట్టిన రబ్బరుగొట్టము ఉబ్బినట్లు, ఈ స్థితియందు నరములు ఒకచోట యెక్కువగను, ఇంకొకచోట తక్కువగను ఉబ్బును. సాధారణముగా, క్రింది అవయవముల సిరలకును, పురీషనాళ భాగమునందు సిరలకును ఈ వ్యాధికలుగును.

లక్షణములు:—తీపుతీయునట్టి నొప్పి, దానితోకూడ వాపు, ఆ భాగమున తిమ్మిరి, బరువు ఉన్నట్లుండును. కాలిసిరల మీదిచర్మము కంది పోయి, పిగిలి, ఉబ్బుసిరల పుండు ఏర్పడును. సిర తెగి రక్తము విస్తారముగ కారవచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు:**—కాలికి ఉబ్బినసిరలు కలవారు ఎక్కువసేపు నిలువబడకూడదు. ఉదయముననే పని యారంభించకముందు కాళ్లకు కట్టు కట్టవలెను. సిరలోనికి రేపుడుమందు నెక్కించుటవలన, ఆ భాగము మాత్రమే కంది తరువాత సిరము ముడుచుకొనిపోవును.

[3]**హెమొరాయిడ్స్:**—(మూలవ్యాధి) ఇవి తరుచుగా మలబద్ధకము వలన కలుగును. మలబద్ధకము లేకుండచేయుటయే దీనికి తగిన చికిత్స. వేడినీటితో గడుగుట, మలను లోపలికి పోవునట్లుచేయుట, అస్ట్రింజెంట్‌ను దీనికి ములాముగ పట్టించుట, సప్పాజిటరిస్ పెట్టుట—ఇవి చికిత్సలు. శస్త్రచికిత్సయు అవసరమైయుండవచ్చును. సూదిమందు ఎక్కించు చికిత్సయు చేయవలసివచ్చును.

**రక్తమును తయారుచేయు అవయవముల వ్యాధులును, స్థితులును**

**రక్తహీనత:**—రక్తపు పరిమాణమునందును, స్వభావమునందును లోపముండుటను రక్తహీనత (అనీమ్యా) అందురు. ఎఱ్ఱని రక్తకణములైన, వాని హిమొగ్లోబినైన లేక ఈ రెండునైన తక్కువగుటవలన రక్తహీనత కలుగవచ్చును. రక్తము పోవుటవలనను, రక్తము ఏర్పడుటలోగల లోపమువలనను, రక్తము పాడగుటవలనను రక్తహీనత కలుగుచున్నదని యిటీవల ప్రవీణులు గ్రహించియున్నారు.

**తీక్షణమైన రక్తహీనత:**—రక్తము విశేషముగా పోవుటవలన ఇది కలుగుచున్నది. రక్తస్రావము, గాయములు తగులుటవలనను, వెవ్వేరు

[1] Elastic supporter. [2] Varicose veins. [3] Hemorrhoids.



పుండ్లు—అనగా [1]జఠరాగ్ని పుండ్లు, ప్రథమాంత్రమునందలి పుండ్లు, విషజ్వరపు పుండ్లు మొదలగునవి రంధ్రములుపడుటవలన కలుగుచున్నది. ఇంకను [2]ఎక్టాపిక్ జెస్టేషన్, [3]ప్లెసంట ప్రీవియ, క్షయ, మొదలగు రోగములయందును, శస్త్రచికిత్స జరిగిన తరువాతను రక్తస్రావ ముండవచ్చును. తీక్షణమైన రక్తస్రావమియొక్క ప్రమాదము, కారిన రక్తపరిమాణమునుబట్టియు కాలమునుబట్టియు నుండును. దేహములోని రక్తములో మూడవభాగము హఠాత్తుగా కారిపోయినయెడల, వెంటనే దానికిబదులు క్రొత్తరక్తము నెక్కించనియెడల మరణము తటస్థించును. ఒక్కొక్కప్పుడు మూడింట రెండుపాళ్లు రక్తము 24 గంటలలో పోయినను, రోగి జీవించవచ్చును. సాధారణముగా, మామూలుకు నూటికి 25 కంటె తక్కువగా, హిమొగ్లోబిన్ తగ్గినప్పుడు, క్రొత్తరక్తము ఎక్కించనియెడల రోగి చనిపోవుట నిశ్చయము.

**దీర్ఘకాలమునుండియున్న రక్తహీనత:**—దీనికి అనేక కారణము లుండవచ్చును. కొన్ని యేవనగా:—(1) చాలకాలము రక్తస్రావముండుట, (2) రక్తమేర్పడుటలో లోపముండుట. (3) రక్తము పాడగుట. దీర్ఘకాలపు రక్తహీనతయొక్క లక్షణము లేవనిన:—బలహీనత, అలత, ఏదైన భారమైన పనిచేసినయెడల ఆయాసము, కండ్లుతిరుగుట, చెవులలో ఒకవిధమైన ధ్వనిపుట్టుట, గుండెదడ, నాడి వడిగకొట్టుకొనుట. రోగి పాలిపోయి యుండును; కొద్దిగ వాపుకూడ నుండును. కారణమును దొలగించగలిగినచో రోగి బాగుపడవచ్చును.

**చికిత్సయు పరిచర్యయు:**—రక్తస్రావమునకు మూలవ్యాధి, [4]జీర్ణావయవములందు పుండ్లు, [5]గర్భకోశమునందు కణుతులు కారణమైనయెడల, శస్త్రచికిత్సగాని రేడియం చికిత్సగాని చేసిన, సాధారణముగా వ్యాధి తగ్గిపోవును. ట్రాన్స్‌ఫ్యూషన్ అగత్యమై యుండవచ్చును. రక్తము ఏర్పడుటలోగల లోపమువలనను, ఎక్స్‌రే, రేడియమ్, రసాయనిక పాషాణములు, మొదలగువానివలన రక్తము పాడగుటవలనను

[1] Gastric and duodenal ulcers. [2] Ectopic gestation.
[3] Placenta previa. [4] Peptic ulcers. [5] Uterine fibroids.

రక్తహీనత సంభవించవచ్చును. ఇంకను రక్తమును వృద్ధిచేయు ఇనుము మొదలగు పదార్థములు లోపించినప్పుడును లేక, మలేరియ, కొంకిపురుగులు, స్ట్రెప్టొకాకస్ హిమొలిటికస్, గర్భమువలన విషము కలుగుట, వీని వలనను రక్తహీనత కలుగవచ్చును. కారణమేదో కనుగొని, వీలైనంతవరకు దానికి చికిత్సచేయవలెను; ఇనుముతో తయారైన మందులును, బ్లడ్ట్రాన్స్ఫ్యూషనులును ఇయ్యవలెను. గర్భధారణవలన విషము కలిగినయెడల, గర్భము అభివృద్ధికాకముందే, పిండమును తీసివేయవలసివచ్చునేమో. మంచి గాలి, సూర్యునివెలుగు, విశ్రాంతి, ఇనుమును, కాలేయమును గలిసిన మిశ్రాహారము ఎక్కువగా నిచ్చుటవలన, వ్యాధిని నిరోధించగలశక్తి రోగికి కలుగును. కాలేయమునుండి తీసినమందులను, ఇనుము తదితర ఉపయోగకరమైన లోహలవణములను ఇంజెక్షన్ మూలముగ నియ్యవచ్చును.

**వినాశనకరమైన రక్తహీనత:** ఇది తెలియని కారణమువలన వచ్చును. ఇంతకుముందు ఇది మరణకారణమైన వ్యాధి యని తలంచిరి. ఇప్పుడు దీనికి ఆరంభములోనే చికిత్సచేసినయెడల, రోగి బాగుపడి మామూలు ఆరోగ్యముగలిగి, పెక్కుసంవత్సరములు జీవించును. వ్యాధివలన రక్తములోను, రక్తము తయారుచేయు అవయవములందును, కేంద్ర నాడీమండలమందును, జీర్ణావయవములందును కొన్నిమార్పులు కలుగును. జాఠరిక రసమునందు కొన్ని పొంగుడు పదార్థములు లోపించును.

**లక్షణములు:**—అలసట దీని మొదటి లక్షణము. ఈ లక్షణము విడువకుండ నిలిచియుండును. బలహీనత, ఆకలిలేకపోవుట, అజీర్ణము, ఊపిరి ఆడకపోవుట, గుండెదడ, పాదములందు వాపు, తిమ్మిరి, చేతులు కాళ్లు సలపరించుట — యివి తనయందు కనబడుచున్నవని రోగి చెప్పును. చర్మము పసుపు పచ్చగను, నాలుక, పెదవులు తెల్లబారియు నుండును. 99°—101° F. ల మధ్య కొద్దిపాటిజ్వరము, నాడివేగముగ కొట్టుకొనుట, ఎఱ్ఱ రక్తకణములసంఖ్య 1,000,000 వరకు తగ్గుట, దానితోపాటు 30% వరకు హిమొగ్లోబిన్ హెచ్చుట—మరికొన్ని లక్షణములు. [1]జాఠరికరసములో లవణరసము బొత్తుగా కనబడకపోవును. మూత్రము

[1] Hydrochloric acid.



ఎక్కువరంగు గలిగియుండును. నాలుక, చిగుళ్లు దీర్ఘకాలము పుండుపడియుండును; వెన్నుబాము క్షీణించుచుండును.

**చికిత్సయు, పరిచర్యయు:**—వ్యాధి తీవ్రముగనుండగా, రోగి వేడిమిని గలిగియుండి పడకలో విశ్రాంతిపొందుట చాల అవసరము. రోగి చర్మము, నాలుక, నోరు — వీనిని శుభ్రముగానుంచి, జాగ్రత్తగా కనిపెట్టుచుండవలెను. మంచిగాలి, చాలినంత ఆహారము ముఖ్యమైనవి. రోగికి కావలసిన జాఠరికపొంగు కలుగజేసెడు పదార్థముల లోపమును నివారించుటకు పుల్లని పం[illegible] దానితోపాటు, పలుచనైన లవణరసమును విస్తారముగా నియ్యవలె[illegible]500 — 600 గ్రాముల కాలేయము లేక కాలేయము సంబంధమైన పదార్థములు; కాలేయమునుండియు, [1]అన్నకోశమునుండియు తయారైనటువంటి మందులను ప్రతిదినము నోటిద్వారా నియ్యవలెను. కాలేయమునుండి తయారైన మందులను కండరములలోనికిగాని, సిరలలోనికిగాని సూదితో ఎక్కించవచ్చును. సాధారణముగా క్రొవ్వును తగ్గించవలెను. ఇతర లక్షణములు కనబడినప్పుడెల్ల వానికి తగిన చికిత్స చేయుచుండవలెను. కాలేయపు చికిత్స తెంపులేకుండ చేయకపోయినయెడల, రోగలక్షణములు తిరిగి కనబడునని రోగి గ్రహించునట్లు చేయవలెను.

[2]**హిమొఫీలియ:**—ఈ వ్యాధియందు రక్తము గడ్డకట్టుసమయము మామూలుకంటె ఎక్కువకాలము పట్టును. ఇది వంశపారంపర్యముగా వచ్చును. సాధారణముగా మగవారికే యీ వ్యాధి వచ్చునుగాని, ఆడువారివలన వ్యాపించును. జీవితకాలమంతయు ఈ వ్యాధి కలిగినవారికి కొంచెము గాయము తగిలినను ఎక్కువ రక్తము కారును. దీనికి కారణము తెలియదు.

[3]**పర్పుర:**—(శీతాదము) అనగా చర్మములోనికి, అమత్వచలోనికి రక్తము దానంతట అదే కారుట. [4]యెల్లోఫీవర్ (పసుపు జ్వరము), [5]సెరిబ్రల్ స్పైనల్ మెనింజైటిస్ మొదలగు తీక్షణమైన అంటువ్యాధులను ఇది కొన్నివేళల సూచించును. ముమ్మరముగానుండు తట్టమ్మవారు, మశూచి, [6]ఎండొకార్డైటిస్ అను వ్యాధులయందును ఇది యుండును.

[1] Stomach extract. [2] Hemophillia. [3] Purpura. [4] Yellow fever.
[5] Cerebrospinal meningitis. [6] Subacute endocarditis.

లక్షణములు:— కీళ్లచుట్టు రక్తముకారి నొప్పిపుట్టును. జ్వరము, [1]అర్టికేరియ లేక ఎరిటీమ అను చర్మవ్యాధులుండును. అమత్వచనుండి రక్తము కారవచ్చును. ప్లీహము పెద్దదగును.

చికిత్సయు, పరిచర్యయు:— వ్యాధినిబట్టి చికిత్స చేయవలెను. విశ్రాంతి, మంచి ఆహారము అవసరము. కాలేయము, ఇనుము కలిపిన ఆహారము, రక్తపుష్టి కలుగజేయు ఆహారము రోగికియ్యవలెను.

లూకీమియ:—రక్తమునందు ఎక్కువ తెల్లకణము లుండుస్థితికి లూకీమియ యని పేరు. కొన్నిసార్లు ఇవి ఎఱ్ఱని రక్తకణములసంఖ్యకు సమానముగా నుండవచ్చును. దీని కింకను సరియైనకారణము కనుగొనబడలేదు.

తీక్ష్ణమైన లూకీమియ:—ఇది యెక్కువ అపాయకరమైనది. మరణము త్వరగా సంభవించును. ముఖ్యముగా చిన్న పిల్లలకును, పడుచువారికిని ఈ వ్యాధి సంభవించును. ఈ రక్తపు లూకీమియయందు ఎముకల యొక్క మజ్జకు మాత్రము హానికలుగును. శ్వాసావయవముల పై భాగమునకు తీక్ష్ణమైన ఇన్‌ఫెక్‌షన్ తగిలినప్పుడు, తరుచుగా, దాని వెంట ఈ వ్యాధి వచ్చును.

లక్షణములు:—నోరు, చిగుళ్లువాచి పుండ్లగును. అమత్వచనుండి రక్తస్రావము కలుగునట్లుండును. ఇంకను తలనొప్పి, బలహీనత, అధికజ్వరము, రోగి ఇన్‌ఫెక్‌షన్‌వలన బాధపడుచున్నట్లు నీరసముగా నుండుట మొదలగు లక్షణములు కనబడును. రోగి పాలిపోయి, శక్తిహీనుడైయుండును. తెల్లకణముల సంఖ్య విస్తరించును. సాధారణముగా 30,000—100,000 ఉండును.

చికిత్సయు, పరిచర్యయు: — లక్షణములనుబట్టి చికిత్సచేయవలెను. బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూషన్, ఫౌలర్స్ సొల్యూషను వాడుట సహాయకరముగా నుండును.

క్రానిక్ లూకీమియ:—([2]మైయిలోయిడ్) ఈ వ్యాధియందు ఎముకలోని మజ్జయందలి క్రొవ్వు క్రమేణ తగ్గిపోయి, దానిబదులు పక్వమురాని తెల్లకణములు చేరును. ప్లీహము, కాలేయము పెద్దవగును. ఈ వ్యాధి 40-వ సంవత్సరమునకు ముందు సంభవించును.

[1] Urticaria or erythema. [2] Myeloid.



లక్షణములు:—దీని సాధారణ లక్షణములు వినాశకరమగు రక్తహీనతయొక్క లక్షణములను పోలియుండును; క్రమేణ ఆరంభము కావచ్చును. రోగికి బలహీనత, అలసట, తరువాత ముక్కు, ప్రేగులు, ఇతర శరీర భాగములనుండి రక్తము కారుటయు నుండును. సాధారణముగా కొద్దిపాటి జ్వరము, దానితోకూడ చలి, విస్తారమైన చెమట ఉండును. ప్లీహము పెద్దదగుట, తనయందు కనబడిన మొదటి లక్షణముగా రోగి చెప్పవచ్చును. తెల్లకణములసంఖ్య మామూలునుండి 1,500,000 వరకు మారుచుండును. ఎఱ్ఱకణములసంఖ్య రెండు, మూడు మిలియనులవరకు తగ్గిపోవచ్చును. శోషవాహిక ([1]లింఫాటిక్ లూకీమియ) యందు శోషవాహిక గ్రంథులు పెద్దవగునుగాని, ప్లీహము పెరుగుట తక్కువ. సాధారణముగా ఈ వ్యాధిగలవారు మూడున్నర సంవత్సరములలో చనిపోదురు. అయినను కొందరు పది సంవత్సరములవరకును జీవింతురు. రక్తస్రావము, రక్తహీనత, బలహీనత, ఇన్‌ఫెక్‌షన్, ఇవి మరణమునకు కారణములైయుండును.

చికిత్సయు, పరిచర్యయు:—ప్లీహముమీద ఎక్స్‌రే, రేడియమ్ చికిత్స చేయుదురు. రక్తహీనత పోగొట్టుటకు ఇనుము, కాలేయము, బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూషన్స ఇచ్చెదరు. చాలినంత విశ్రాంతి, బలమునిచ్చెడు ఆహారము, దేహపరిశ్రమ, మంచిగాలి దీనికి సాధారణముగా చేయు చికిత్సలు.

[2]అడెనైటిస్:—అనగా శోషవాహిక గ్రంథులు కందుట. ఇది స్వల్పమైన రీతిగా కందియున్నయెడల, కాపడమువలన తగ్గిపోవును. అట్లుకాక, యిది వాచి, చీము కూడినదైనయెడల, దీనిని శస్త్రచికిత్సచేసి, కోసి, చీము బైటికి తీయవలసి యుండును. వ్యాధిగల గ్రంథులదగ్గర ఇన్‌ఫెక్‌షన్ ఉన్నయెడల ఈ వ్యాధి సంభవించును. ఈ వ్యాధి క్షయరోగముయొక్క ఇన్‌ఫెక్‌షన్‌వలన వచ్చినయెడల, దీనికి సాధారణముగా [3]అస్పిరేషన్ చేయవలసి యుండును. ఇది [4]కాన్సర్ (కొరకుడు పుండు) వలన కలిగినదని ముందుగనే తెలిసియుండిన, శస్త్రచికిత్స, ఎక్స్‌రే, రేడియమ్ చికిత్సలు చేయవచ్చును.

[5]హాడ్జికిన్స్ వ్యాధి:—ఈ వ్యాధియందు ఏ బాధయు లేకుండనే శోష గ్రంథులు, ప్లీహము క్రమక్రమముగా పెరుగుచుండును. దీనితో పాటు

[1] Lymphatic leukemia. [2] Adenitis. [3] Aspiration.
[4] Carcinomatous. [5] Hodgkin's disease.

జ్వరము, కొంతకాలమైన తరువాత రక్తహీనత అధికమగుచుండును. దీని కింకను కారణము కనుగొనలేదుగాని, ఇది టాన్సిల్స్ యందును, పండ్ల యందునుండు ఇన్‌ఫెక్షన్సుకు ఫలితముగా రావచ్చునేమో.

లక్షణములు:—సులభముగా కంటికి కనబడు లక్షణము లేవనగా, మెడయందలి శోషగ్రంథులు పెద్దవై నొప్పిలేక యుండును. దీని తరువాత, దేహములోని యితర భాగమునందలి శోషగ్రంథులు పెద్దవగును. ఇట్లు ఒక భాగము తరువాత యింకొక భాగమునందలి శోషగ్రంథులు పెద్దవగుచుండును. కొద్దిపాటి రెమిటెంట్ (సంతత) జ్వరముండును; ప్లీహము పెద్దదగును; అధికదురద, బరువుతగ్గుట, తక్కువ రక్తపు ఒత్తిడియు నుండును. కొంతకాలమునకు రక్తహీనత వృద్ధియగును. ఈ వ్యాధివలన రోగి తరుచుగా 2—5 సంవత్సరములలో చనిపోవును. తగిన చికిత్స యుండెనేని, రోగి ఐదు లేక ఆరు సంవత్సరములు జీవించవచ్చును.

చికిత్సయు, పరిచర్యయు:—మెడయందు శోషగ్రంథులు గుంపుగ నొకే చోటనుండిన, శస్త్రచికిత్సయే దీనికి శ్రేష్ఠమైనది. కేవలము శస్త్రచికిత్సయే చేసి విడిచిన, ఈ వ్యాధి మరల రావచ్చునుగాన, అట్లు రాకుండ, శస్త్ర చికిత్సతో పాటు, [1]రేడియో తెరపి చికిత్సయు చేయవలెను. రేడియో తెరపివలన గ్రంథులు చిన్నవగుటయేకాక, వాని యొత్తిడివలన గలుగు బాధయు తగ్గును. ఫౌలర్స్ సొల్యూషన్‌ను ఈ రోగమునందు సహాయకరముగా నుండును. రోగికి విశ్రాంతి, మంచిగాలి, పోషణకరమైన ఆహారమిచ్చుట ఇవి మిక్కిలి ముఖ్యమైనవి.

## అధ్యాయము 17

# శ్వాసావయవ మండలమునకు కలిగెడు వ్యాధులును, స్థితులును

శ్వాసావయవములకు కలిగెడు వ్యాధులును, స్థితులును రెండు భాగములుగా విభజింపబడినవి. అనగా, (1) పై శ్వాసమార్గమునకు వచ్చెడి వ్యాధులు, (2) క్రింది శ్వాసమార్గమునకు వచ్చెడి వ్యాధులు.

[1] Radiotherapy.



శ్వాసమార్గముతో ముఖ్యముగా సంబంధించిన లక్షణములేవనగా:—[1]ముక్కునుండి రక్తముకారుట, గొంతురాయుట, విపరీతమైన శ్వాసము దగ్గు, కళ్లెఊయుట.

పై శ్వాసమార్గమునకు గలిగెడు స్థితులనుగూర్చి 36-వ అధ్యాయము చూడవలెను.

బ్రాంకైటిస్:—బ్రాంకియల్ నాళములు కందుట. ఇది తీక్షణముగ గాని, దీర్ఘకాలమునుండిగాని యుండవచ్చును. సాధారణముగా [2]శ్వాసనాళము (ఊపిరిగొట్టము) నకు ఈ వ్యాధి కలుగును.

తీక్షణమైన బ్రాంకైటిస్:—ఇది యితర వ్యాధులకు అనగా, జలుబు, తట్టమ్మ, కోరింతదగ్గు, ఇన్‌ఫ్లూయంజె, విషజ్వరము, ఉబ్బసము మున్నగు వ్యాధుల తరువాత వచ్చును. ఇది తరుచుగ న్యుమోనియతో కలిసి వచ్చును. గనుక, అపాయకరమైన వ్యాధి. సులభముగా బ్రాంకైటిస్ వ్యాధికి లొంగెడువానికి, కొంచెము చల్లనిగాలితగిలినను, దుమ్ము, విష వాయువులు లోనికి పీల్చుకొనినను ఈ వ్యాధి సంభవించవచ్చును.

లక్షణములు:—దీని లక్షణములు అకస్మాత్తుగా కనబడవచ్చును. కాని తరుచుగా రోగికి మొదట జలుబుచేసి, జ్వరమువచ్చును. వీపు, కాలు, చేతులయొక్క కండరములు నొప్పిగానుండును. మొదట పొడిదగ్గు ఆరంభమై, కొంతకాలమునకు సళ్లుపడి, బంకవంటి కళ్లెయు చీమిడియు బైటికి వచ్చుచుండును. దీని రాబోవుస్థితి సాధారణముగా నిరీక్షణకరము గనే యుండును గాని, చాల చిన్నప్రాయముగలవారికిని, ముసలివారికిని [3]బ్రాంకోన్యుమోనియ రావచ్చును.

చికిత్సయు, పరిచర్యయు:—రోగనివారణకు చికిత్స చేయుట చాల ప్రాముఖ్యము. ఈ వ్యాధికి లోనగువారు, చలిగాలి తగులకుండ, అసమానమైన టెంపరేచర్ నుండి తమ్మును తాము కాపాడుకొనవలెను. పెద్దగా పెరిగిన అడినాయిడ్స్, టాన్సిల్స్ ఉన్నయెడల, వానిని తీసివేయవలెను. దేహోష్ణము నార్మల్‌కువచ్చువరకు రోగికి తేలికమైన ఆహారమిచ్చుచు, పడకలో పరుండబెట్టవలెను. ఆరంభములోనే రోగికి విరేచనమునకు మందునిచ్చి వేడిపానీయములు, వేడిస్నానము చేయించిన యెడల, బాగుగా చెమటపోసి, వ్యాధి తగ్గును. [4]డోవర్స్ పౌడర్

[1] Epistaxis. [2] Trachea. [3] Broncho-pneumonia. [4] Dover's powder.

ఇచ్చినయెడల కండరములనొప్పి తగ్గి బాగుగా శ్వాసించుటకు వీలు కలుగును. బెన్‌జోయిన్ అనుదానిని లోపలి ఆవిరిపీల్చుకొనునట్లు చేసిన, సులభముగా ఊపిరి ఆడుటకు వీలుకలుగును. రోగి బాగుపడుచుండగా, చేపకాలేయపునూనె (కాడ్లివర్ ఆయిల్,) ఆర్సెనిక్ టానిక్, చాల సహాయకరముగా నుండును.

దీర్ఘకాలపు బ్రాంకైటిస్:—పిల్లలకు అడినాయిడ్స్, టాన్సిల్స్ పెద్దగా పెరిగినచో శీతకాలములో ఈ వ్యాధి తరుచుగావచ్చును. తీక్షణమైన బ్రాంకైటిస్‌కు ఏ కారణమో, దీనికిని అదేకారణమై యుండవచ్చునుగాని, సాధారణముగా ఇది, ఊపిరితిత్తులకు, గుండెకు, మూత్రపిండములకు కలిగిన వ్యాధుల సంబంధముగా గూడను రావచ్చును.

లక్షణములు:—దీర్ఘకాలము నుండియున్న దగ్గు, ఉదయమునను రాత్రులలోను ఎక్కువగా నుండును. పొడిదగ్గుగానైనను కల్లెతో గూడిన దగ్గుగానైన నుండవచ్చును. దీనికి సాధారణముగా జ్వరముగాని, నొప్పిగాని యుండదుగాని, కొంచెము భారమైనపని చేసినయెడల ఒగర్పుండవచ్చును. ముసలివారిలో ఊపిరితిత్తుల గోళములు విస్తరించి పగులును. దీనివలన [1]బ్రాంకియెక్టసిస్, [2]ఎంఫిజీమ యను వ్యాధులు సంభవించును. గుండెయు పెద్దది కావచ్చును. బిడ్డలయందు ఈ రోగము బాగు కావచ్చునుగాని, ముసలివారు ఈ వ్యాధినుండి సంపూర్ణముగా బాగుపడుట దుర్లభము.

చికిత్సయు, పరిచర్యయు:—దీర్ఘకాలమునుండి శ్వాసమార్గపు పైభాగమునకు కలిగిన ఇన్‌ఫెక్షనును తొలగించి, ఇతర దీర్ఘకాలపు స్థితులకు చికిత్సచేయవలెను. శ్వాసమార్గమునకు అంటుతగులు వ్యాధుల నుండి రోగిని దూరముగా నుంచవలెను. వీలైనయెడల, రోగి యెక్కువ ఉష్ణమున్న స్థలాంతరమునకు పోవలెను. విశ్రాంతి, తేలికయైన దేహపరిశ్రమ చేయుట అవసరము. ఎక్కువ కలోరిక్ ఆహారము, సులభముగా జీర్ణమగు ఆహారము, చేపకాలేయపు నూనె, ఆర్సెనిక్, ఇనుము, స్ట్రిక్‌నిన్ మొదలగువానితో చేసిన టానిక్సులు ఇయ్యవలెను. ఇట్టి యాహార పదార్థములు రోగము నెదిరించు శక్తిని బుట్టించును.

ఉబ్బసము:—ఈ స్థితిలో ముఖ్యముగా, ఊపిరి విడుచునప్పుడు శ్వాసావరోధముండును; పిల్లికూతలు వినబడును. సన్నని శ్వాసనాళ శాఖలు

[1] Bronchiectasis. [2] Emphysema.



ఇరుకగుటవలననో, ఆ నాళములకు కల్లె అడ్డుపడుటవలననో, ఊపిరి బలవంతముగా విడుచుటచేత ఒగర్పు (శ్వాసావరోధము) పుట్టును. ఉబ్బసము వచ్చుటకు ననేక కారణములు గలవు. నూటికి 40 మంది ఉబ్బసమున్న రోగులకు ఆ వ్యాధి వంశ పారంపర్యముగా వచ్చును. శరీరములోనికి పీల్చుకొనినట్టిగాని, అన్నముతో తినినట్టిగాని, చర్మముమూలమున ప్రవేశించినట్టిగాని, కొన్ని యితరపదార్థములవలన కొందరికి ఈ వ్యాధి సంభవించవచ్చును. శరీరమునందు ప్రవేశించు అన్యపదార్థములను సహించలేని అతి సున్నితగుణము [1]'అలెర్జి' యందురు. పెద్దవారు ఇతరపదార్థములను అనగా పుష్పాడిని, జంతువులనుండి వెడలెడు వాసనలను, దుమ్మును పీల్చుకొనుట ఈ వ్యాధికి సాధారణ కారణము. పిల్లలలో నన్ననో గ్రుడ్డులోని తెల్లజన, కొన్ని కాయధాన్యాహారములు తినుట వలన ఈ వ్యాధి సంభవించవచ్చును. ఇతరులలో ఇన్‌ఫెక్షన్‌కు మూలస్థానములైన ముక్కు, శ్వాసమార్గములో విపరీతమైన స్థితులుండుట ఈ వ్యాధికి కారణమై యుండవచ్చును.

లక్షణములు:—దీనియొక్క ముఖ్యమైన లక్షణమేదనగా, ఊపిరి విడుచునప్పుడుగాని, పీల్చుకొనునప్పుడుగాని, లేక ఈ రెండు సమయములందుగాని యేదో అడ్డుపడుటవలన రోగి నొప్పితో గుర్రు, గుర్రుమని శ్వాసించుచుండును. సాధారణముగా, శ్వాస దీర్ఘముగా విడుచును; ఒగర్పు ముమ్మరముగానుండును; ఎదురొమ్ములో ఏదో ఒత్తినట్టు రోగి అనుభవించుచుండును. శరీరము చల్లబడి, చెమట నిండుగపోయును. ఈ వ్యాధి అప్పుడప్పుడు సంభవించును. ఇది రానప్పుడు రోగి బాగున్నట్టుండును. పైకి కనబడు కారణమేమి లేకుండనే యీ వ్యాధి రాత్రులలో సంభవించును. దగ్గు ఉండినను కొద్దిగానుండును. ఇది యెంత తీక్షణముగా వచ్చినను సాధారణముగా ప్రమాదకరముకాదు. పిల్లలకు ఉబ్బసమున్న యెడల, దానికి కారణము తెలిసికొని, దానిని తొలిగించినయెడల, వ్యాధి నివారణయగును. పెద్దవారిలోనున్న ఉబ్బసమునకు గల కారణమును గనుగొని, దానిని తొలిగించగలిగినయెడల రోగము నివారణ కావచ్చును.

[1] Allergy.

**చికిత్సయు, పరిచర్యయు:**—ఈ వ్యాధి కలుగుటకు దగ్గర కారణము కనుగొని వీలైనయెడల, దానిని తొలిగించవలెను. [1]అడ్రెనలిన్ క్లోరైడ్‌ను 1—8 మినిములు ఇన్‌జెక్షన్ ఇచ్చి దీని పొంగును తగ్గించవచ్చును. అవసరమైనప్పుడెల్ల (p. r. n.) ఇయ్యవచ్చును. ½ గ్రెయిన్ [2]ఎఫెడ్రిన్‌ను నోటి ద్వారా యిచ్చినను మంచి ఫలితముండును. స్ట్రమోనియమ్, బెల్లడాన ఆకులు పొగవేసినను, టింక్చర్ బెన్‌జోయిన్‌కో ఆవిరి పీల్చుకొనునట్టు చేసినను కొంత బాధతగ్గును. బెల్లడాన, అట్రోపిన్‌వంటి యుపశాంతి నిచ్చెడు మందులు, ఈ వ్యాధి పొంగును తగ్గించును. వ్యాధి మరల మరల వచ్చులోపల పొటాసియమ్ ఐయొడైడ్ చిన్నడోసులుగా వాడినను, రాత్రులలో భారముగా భుజించక తేలికయైన ఆహారము తినుట వలనను, శీతోష్ణస్థితియందు మార్పుగలిగినను మరల ఈ వ్యాధి రాకుండును. మార్ఫిన్ నుపయోగించినట్లయిన బహు జాగ్రత్తగా వాడవలెను. ఎందుకనగా, అజాగ్రత్తగ నుండినయెడల శ్వాసావయవములు క్రుంగి పోవును.

ప్లూరిసి (పార్శ్వశూల):—అనగా ప్లూరల్ మెంబ్రేన్స్ (ఎదురొమ్ము నందున్న లోపలి పొరలు) కందుట. ఇది పొడి పార్శ్వశూలగా నుండవచ్చును. అట్లుండిన, పైచెప్పిన పొరలు మందమై ఒకదానితో నొకటి యంటుకొనును. లేక స్రావముతోగూడిన పార్శ్వశూలగానైన నుండవచ్చును. అప్పుడు సీరస్ లేక సీరొఫైబ్రినస్ అను ద్రవము చీముగా మారవచ్చును. దేహములో ఇంక యెక్కడనో కలిగిన వ్యాధివలన ఈ పార్శ్వశూల సాధారణముగా కలుగును. చలి, తడి, గాలులు తగులుటవలనను ఇది కలుగవచ్చును; కాని యిది సాధారణముగా ఊపిరితిత్తులలో కందెడు వ్యాధులతోగాని క్షణితితోగాని సంబంధించి యుండవచ్చును; కొన్నిసారులు ఇది గాయములవలనగాని, విరిగిన యెముక వలనగాని రావచ్చును.

పొడి లేక ఫైబ్రినస్ పార్శ్వశూల:—ఇది సాధారణముగా చలితో ఆరంభమగును; అప్పుడు పొడిచినట్టు నొప్పియుండును. రెండు పొరల రాపిడివలన ప్రక్కలో కుట్టినట్టు శూలపుట్టును. శ్వాస లేక దగ్గు లోతుగ వచ్చునప్పుడు నొప్పి ఎక్కువగును. దగ్గు పొడిగానుండి, కత్తితో నరికినట్టు

[1] Adrenalin chloride. [2] Ephedrine.



బాధించును. కావున రోగి దానిని అణిచివేయుటకు ప్రయత్నించును. సాధారణముగా కొద్దిపాటి జ్వరము వారము లేక పదిరోజులుండును. తెల్లకణముల సంఖ్య 8,000 నుండి 12,000 వేల వరకైనను ఎక్కువగనైన నుండును. ఎదురొమ్ము చలనము తగ్గించుటకుగాను రోగి వ్యాధియున్న ప్రక్కన ఒదిగి పరుండును. ఈ వ్యాధి పీడితులలో 1/3 మందికి తరువాత కాలములో క్షయ రావచ్చును. ఈ వ్యాధి వేరే జబ్బుకు సంకర వ్యాధిగా రానియెడల, రోగి బాగుపడునని నిరీక్షించవచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు:**—కొన్ని దినములు వరసగా దేహోష్ణము మామూలుగా నుండువరకు రోగి పడకలోపరుండి విశ్రాంతిపొందుట అవసరము. సులభముగా జీర్ణమగు తేలికయైన ఆహారమిచ్చుచు, క్రమముగా విరేచనమగునట్లు చూడవలెను. వ్యాధియున్న భాగమున వేడినీటి బుడ్డిపెట్టి, బాధను తగ్గించవచ్చును. ఆవాలపట్టీనిగూడ వేయవచ్చును. లేక ఊపిరి సంపూర్ణముగా విడుచునప్పుడు అడ్‌హీసివ్ ప్లాస్టర్ వేయవచ్చును. కొన్నిసారులు మార్ఫిన్ ఉపయోగించుట అవసరమైయుండును. వ్యాధి తీవ్రత తగ్గిపోయినప్పుడు, విశ్రాంతి, మంచిగాలి తగులుట, పోషణకరమైన ఆహారమిచ్చుట అవసరము.

[1]**స్రావముతోకూడిన** పార్శ్వశూల:—ఆరంభములో దీని లక్షణములు పొడిపార్శ్వశూలయొక్క లక్షణములవలెనే యుండును. కందియున్న పైభాగములు (పొరలు) ద్రవముచేత వేరుచేయబడగా నొప్పి తగ్గునుగాని శ్వాసావరోధము దానితరువాత వచ్చును. చలితోను, చెమటతోను కొద్దిపాటి జ్వరము విడువకుండ వచ్చుచుండును. ఆకలి తగ్గుట, వికారము, వాంతియు నున్నయెడల, వాటికి చికిత్సచేయవలెను. భావికాలములో ఈ వ్యాధి బాగుపడు సూచనలుండినను, సాధారణముగ ఈ వ్యాధిగ్రస్థులు నూటికి 30 మంది తరువాత కాలములో క్షయతో బాధపడుదురు.

**చికిత్సయు, పరిచర్యయు:**—రోగి పడకలో పరుండియుండగా, అతనికి దిండ్లు ఎత్తుపెట్టవచ్చును. అతనికిచ్చు ఆహారము పోషణకరమైనదిగను సులభముగా జీర్ణించునదిగను నుండవలెను. ద్రవములను తగ్గించి మోతాదుగా నియ్యవలెను. గుండెమీదనున్న ఒత్తిడిని తగ్గించుటకును, రోగికి సుఖము కలుగచేయుటకును [2]థొరసెంటిసిస్ చేయుదురు. (అనగా వక్షస్సు

[1] Pleurisy with effusion. [2] Thoracentesis.

నుండి ద్రవము తీయుదురు) ఈ చికిత్సను మరల మరల చేయవలసివచ్చును. దేహోష్ణము క్రమముగా తగ్గుచుండినయెడల, ద్రవము ఇమిడి పోవు చున్నదనియు, రోగి బాగుపడు చున్నాడనియు, గ్రహించవచ్చును.

[1]ఎంపయీమా:—ఈ స్థితిలో పుప్పసవేష్టనమునందు చీముండును. ఇది పార్శ్వశూలమై యుండవచ్చునుగాని సాధారణముగా దానివలన పార్శ్వశూల రావచ్చును. పార్శ్వశూల, న్యుమోనియ వ్యాధులు సంభవించిన తరువాత, దేహోష్ణము హెచ్చినయెడల ఎంపయీమా వచ్చునని ఊహించవచ్చును.

**లక్షణములు:**—ముమ్మరమైన ఇన్‌ఫెక్షన్లయొక్క లక్షణములే దీని లక్షణములు. చలి, చెమట, కొద్దిపాటి లేక హెచ్చు జ్వరముండును. ఈ జ్వరము సాధారణముగా సంతత జ్వరముగానుండును. నాడి వడిగను బలహీనముగను కొట్టుకొనును. ఇవన్ని యీ వ్యాధియొక్క సామాన్య లక్షణములు. దగ్గు, ఒగర్పు, రోగి నీలి రంగుగా మారుటయు తరచుగా నుండును. ఈ జబ్బు బాగవునో, కాదో దీనికి కారణమైన వ్యాధిని బట్టియు, రోగి వ్యాధిని నిరోధించగల శక్తినిబట్టియు, ఇన్‌ఫెక్షన్‌యొక్క రకమునుబట్టియు ఉండును. ఈ వ్యాధివలన పెద్దవారికంటె, పిల్లలు ఎక్కువమంది చనిపోవుదురు.

**చికిత్సయు, పరిచర్యయు:**—వక్షస్సునుండి తీసిన ద్రవముయొక్క రకమునుబట్టి చికిత్సచేయవలెను. చీము కనబడిన బయటికి లాగివేయుట అవసరము. మంచి ఆహారము, మంచిగాలి, టానిక్సు రోగికిచ్చుట చాల ముఖ్యము. కొంతకాలమైన తరువాత శ్వాసాభ్యాసములు చేయించవలెను.

[2]పల్మోనెరి ఎంబొలిజమ్:—గడ్డకట్టిన రక్తపుతునుక రక్తప్రవాహములో కొట్టుకొనిపోయి, ఏదైన ఒక ఊపిరితిత్తిలోనికిపోవు ధమనిద్వార ప్రవేశించుటవలన ఈ భాగపు ఊపిరితిత్తి, దాని సాధారణపని చేయలేకపోవును. నోరు, గొంతు, వక్షము—ఈ అవయవముల శస్త్రచికిత్స అయిన తరువాత, తరుచుగా ఈ వ్యాధి సంభవించును.

**లక్షణములు:**—లక్షణములు సాధారణముగా అకస్మాత్తుగా కనబడును. ఎంబొలిజమ్ కొద్దిపాటిదిగానున్న శ్వాసావరోధము, రోగి నీలిరంగుగా

[1] Empyema. [2] Pulmonary embolism.



మారుట, బహుశః కొంత రక్తస్రావముండును. ఎంబొలిజమ్ పెద్దది గాన, గుండెకును, శ్వాసమునకు చాల తొందరకలుగును; ఒకవేళ మరణముకూడ హఠాత్తుగా రావచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు:**—శ్వాసావరోధమును తగ్గించుటకు, కూర్చుండియుండు తీరులో రోగినుంచి, తగిన ఆధారముల నుంచవలెను. శ్వాసించుటకు ఆటంకముగానున్న గుడ్డలన్ని వదులుచేయవలెను. సాధ్యమైనయెడల, రోగిని సంపూర్ణముగా విశ్రాంతి పొందనియ్యవలెను. వ్యాధి సంభవించని రెండవ ఊపిరితిత్తియు, గుండెయు తమ పనినిచేయునట్లు వానికి ప్రాణవాయువు నియ్యవలెను. రోగికి నెమ్మది కలుగుటకును, బాధ నివారణకును మార్ఫిన్ ఇచ్చెదరు. వేడికాపడములవలన కొంత బాధ తగ్గవచ్చునేమో కాని, కాపడమిచ్చుచుండగా రోగి నెంతమాత్రమైన కదలించకూడదు. ఈ సమయములో రోగికి సంపూర్ణ శారీరక, మానసిక విశ్రాంతి యవసరము. దర్శకులు రోగిని చూడగోరినయెడల, ఎంతో విచక్షణతో వారికి సెలవియ్యవలెను. రోగికిచ్చు ఆహారము తేలికగ నుండవలెను. ప్రేగులు కదిలి భేదియగునట్లు ఘాటులేని భేదిమందుల నైనను, కొద్దిపాటి ఎనెమలనైనను నియ్యవలెను. [1]ఎంబొలెక్టొమి అనగా రక్తపుగడ్డను తీసివేయుటకు శస్త్రము చేయుదురుగాని, యిది కష్టమైన పని.

[2]శస్త్రచికిత్స అయినతరువాత సంభవించు న్యుమోనియ:—శస్త్రచికిత్స అయినపిదప మత్తుమందువలన అమత్వచ రాచుకొనుటవలనగాని, శ్వాసమూలమున రక్తమును లేక చీమిడిని యూపిరితిత్తులలోనికి పీల్చుకొనుట వలనగాని న్యుమోనియ రావచ్చును. ముఖ్యముగా, నోటికిని, గొంతుకును శస్త్రచికిత్స చేసినపిమ్మట ఇట్లు జరుగుట సహజము.

**లక్షణములు:**—వ్యాధి ప్రమాదము లేనిదైనచో, సాధారణమైన న్యుమోనియచేయునట్టి తొందర చేయకపోవచ్చును. ఈ వ్యాధికి కారణము నాల్గవగుంపునకుచేరిన న్యుమొకాకస్ అను సూక్ష్మజీవిమై యుండును. ఈ వ్యాధిలో బ్రాంకో న్యుమోనియలోవలె, అహితజ్వరము, వేగముగ కొట్టుకొను నాడి యుండవచ్చును. ఈ వ్యాధి రెండు లేక మూడు వారము లుండవచ్చును. తరువాత దేహోష్ణము క్రమేణ తగ్గు చుండును.

[1] Embolectomy. [2] Postoperative pneumonia.

చికిత్సయు, పరిచర్యయు:— రోగ నివారణకు మందిచ్చుట చాల ముఖ్యము. మత్తుమందిచ్చునప్పుడు శ్వాసమార్గములో చీమిడిని చేర నియ్యరాదు. రోగికి చలిపుట్టకుండ చేయవలెను. నోరు అన్నివిషయములలో ఆరోగ్యముగను, శుభ్రముగను నుండవలెను. రోగిని తరుచుగా అటునిటు త్రిప్పుచు, లోతుగ శ్వాసించుటకు ప్రోత్సహించవలెను. ఈ వ్యాధి అంటు క్రిములవలన కలిగినదైన [1]లోబర్ న్యుమోనియకు చేసిన చికిత్సయే చేయవలెను. 23-వ అధ్యాయము చూడుము. దీనికి [2]సల్ఫపిరిడిన్ చాల మంచిమందు.

అధ్యాయము 18

# జీర్ణేంద్రియ మండలమునకు గలుగు వ్యాధులు, స్థితులు

జీర్ణావయవమార్గము (గాస్ట్రో ఇన్‌టెస్‌టినల్ ట్రాక్ట్) నందు జీర్ణముతో సంబంధించిన అవయవములు అనగా, నోరు, ఆహారకోశము, కాలేయము పిత్తాశయము, ప్రేగులు చేరియుండును. ఈ యవయవములలో దేని స్థితియైనను, జీర్ణమునకు ప్రాముఖ్యమైనదిగా నుండును. గనుక వీనిలో ఏ యవయవమునకు వ్యాధిగాని, విపరీతస్థితిగాని కలిగిన, ఇతర అవయవములకు కూడ చెరుపుకలుగును.

జీర్ణమండలములో ఏదేని తొందరయున్నదని తెలియజేయు లక్షణములేవనగా, ఆకలిలేమి, డోకు, వాంతియగుట, ప్రేగులలో గాలిచేరియుండుట, అజీర్ణము, వెక్కిళ్లు, అతివిరేచనములు, మలబద్ధకము, మలములో మార్పులు కనబడుట.

**నోటియొక్క వ్యాధులు**

[3]నోటికి కలుగు ఇన్‌ఫెక్‌షన్. ఈ వ్యాధిలో రెండు సామాన్యస్థితులుండును. [4]పయోరియ, [5]ఆల్వియోలర్ అబ్‌సెస్. పండ్లచుట్టునున్న చిగుళ్లకు ఇన్‌ఫెక్‌షన్ తగిలినయెడల, దానిని పయోరియ అందురు. ఇది పన్ను నిలిచి

[1] Lobar pneumonia. [2] Sulphapyridine. [3] Oral sepsis.
[4] Pyorrhea. [5] Alveolar abscess.



యుండు పల్లమునందలి ఎముకను పాడుచేయుచుపోవును. ఇట్లు పాడైన పల్లములలో సూక్ష్మజీవులు, విషకందళములు పీల్చుకొనబడుటవలన సూక్ష్మజీవుల సహితమైన స్థితి యేర్పడును.

లక్షణములు:— చిగుళ్లయందు రక్తమధికముగకూడుకొని, మృదుత్వము గలిగి రక్తస్రావపు సూచనలుండును; చిగుళ్లు తగ్గిపోవును. అక్కడక్కడ చీము కూడును. పండ్లు వదులగును; శ్వాస దుర్వాసనగొట్టును.

చికిత్సయు, పరిచర్యయు:—నోటి యారోగ్యమునుగూర్చి యధిక శ్రద్ధ తీసికొని, విటమిన్ C. ఎక్కువకలిగియున్న ఆహారము పుచ్చుకొనినయెడల, ఈ వ్యాధిని నివారించవచ్చును. ఈ వ్యాధికి చికిత్సయేమనగా, ఇన్‌ఫెక్‌షన్ గలిగిన భాగమునంతయు శుభ్రముచేయవలెను. పుచ్చిపోయిన పండ్లను, ఏయే పండ్లచుట్టు వ్యాధియున్నదో వానినిగూడ ఊడదీయవలెను. చచ్చుబడిన యెముకల టిష్యూలను 'క్యూరెట్' (గీకులు) అను సాధనము నుపయోగించి శుభ్రముచేయవలెను.

ఆల్వియొలర్ అబ్సెస్:—ఇది సాధారణముగా పిప్పిపండ్లకు సంబంధించినది. పంటియొక్క కండచెడి, ఇన్‌ఫెక్‌షన్ పంటియొక్క అడుగుభాగము (వేరు) వరకు వ్యాపించి, పైకొనన పుండగును. ఇది చివరన పుండుగనో, పంటిమొదలున దీర్ఘకాలపు గడ్డగనో యేర్పడవచ్చును.

ఈ విధముగా సూక్ష్మజీవులసహితమైన సెప్టిక్ స్థితులవలన మూత్రపిండములు, గుండె, రక్తనాళములు, కీళ్లు మొదలగు అవయవములకు దీర్ఘకాలపు వ్యాధి పరిస్థితులు ఏర్పడునని వైద్యులు తలంచుచున్నారు. ఏదైన ఒక స్థలమున ఇన్‌ఫెక్‌షన్ ఉన్నట్టు అనుమానము కలిగినయెడల, పండ్లను ఎక్స్‌రే పరీక్షచేయవలెను. లేక, అనుభవముగలిగిన [1]దంత వైద్యునిచేత రోగి తన పండ్లను పరీక్షచేయించుకొనవలెను.

పైనచెప్పిన స్థితులేకాక, అసలు పండ్లువచ్చుటయే ఆలస్యముకావచ్చును. వచ్చినవైనను సరిగాయేర్పడని పండ్లై యుండవచ్చును. ఈ స్థితి, రికెట్స్ (ఎముకలువంగుట) అను వ్యాధిమూలమున కలుగునని కొందరును, కాదని కొందరును వాదింతురు. సవాషేహాము అను వ్యాధి

[1] Dentist.

వలన పండ్లు ఆలస్యముగావచ్చును. మేకువలె పండ్లు మొనలు తేలి యుండును. ఇట్టి పండ్లు కాట్లు పెట్టినట్టు నుండును.

[1]స్టొమటైటిస్ (నోటిపూతయొక్క అమత్వచకందుట): — జీర్ణమునకు తొందరకలిగినను, సరియైన భోజనములేకపోయినను, బలముతగ్గినను, నోటి ఆరోగ్యమునుగూర్చి అజాగ్రత్తగనున్నను ఇది కలుగవచ్చును. అంటు సంబంధమైన జ్వరములతోగూడ కొద్దిగనో గొప్పగనో నోరుకందవచ్చును.

**లక్షణములు:**—అమత్వచ ఎఱ్ఱగ కందవచ్చును. అంటు జ్వరమునకు తరువాత వచ్చెడు [2]కటారల్ స్టొమటైటిస్ నందువలె, నోటియొక్క అమత్వచకంది, వాచి, సున్నితముగానుండును. కొన్ని చిన్న బొబ్బలులేచి, పగిలి, లొత్తలుపడి పుండ్లుకావచ్చును. వీనిని [3]కాంకర్స్, (నోటిపుండ్లు) అందురు. జీర్ణవ్యాపారమునకు కలిగిన తొందరలవలన నివి తరుచుగా వచ్చును. సరియైన భోజనము లేకయు, ఆరోగ్యమునుగూర్చి సరియైన జాగ్రత్త లేకయు పుండ్లుగల నోటియొక్క అమత్వచకందును. అప్పుడు చిగుళ్లు వాచి, రక్తముకారును. కొంతకాలమైన తరువాత పండ్లకు దగ్గర నున్న చిగుళ్లమీద పుండ్లులేచును. దుర్వాసనగలిగిన రక్తముకారును. శ్వాసయు దుర్వాసన గొట్టును. [4]గవదకాయలకు (టాన్సిల్స్) గొంతునకుకూడ కొన్నిసారులు ఈ జబ్బురావచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు:**—ఈ వ్యాధికి కారణమును తొలిగించవలెను; పిమ్మట వ్యాధికి చికిత్సచేయవలెను. నోటిని శుభ్రపరచి, ఆంటిసెప్టిక్ లోషనుతో నోటిని కడుగవలెను. చిన్న పుండ్లైనట్టయిన, వానిని 5—10% బలముగల సిల్వర్ నైట్రేట్ సొల్యూషన్ దూదిపుల్లతో పూయవలెను. అమత్వచ కంది పుండ్లు పడినయెడల టింక్చర్ ఆఫ్ ఐయొడిన్ పూయుట మంచిది. ఫౌలర్స్‌సొల్యూషన్ లేక [5]ఆర్స్‌ఫెనమిన్ అను మందులుకూడ వాడుదురు. పోషణకరమైన ద్రవములను, కొంచెము గట్టిగనుండు ఆహారమును రోగికియ్యవలెను. వ్యాధి ముమ్మరముగా నున్నప్పుడు గవాజ్ చేయుట అవసరమైయుండును. (ముక్కు-ద్వారా ఆహారము నిచ్చుట). ద్రవములను విస్తారముగా లోపలికి ఎక్కించి, విరేచనము క్రమముగా అగునట్లు చూడవలెను.

1 Stomatitis. 2 Catarrhal stomatitis. 3 Cankers. 4 Tonsils. 5 Arsphenamine.



నోమ:—దీనినిగూర్చి అంటురోగములనుగూర్చి వ్రాసిన 23-వ అధ్యాయము చూడుము.

త్రష్:—దీనినిగూర్చియు 23-వ అధ్యాయము చూడుము.

**పరీక్షలు**

జీర్ణావయవములకు కలిగెడు వ్యాధులకును, స్థితులకును తగిన కారణములు కనుగొనుటకు జాఠరీయక పరీక్షలును, ఎక్స్‌రే పరిశోధనలను చేయవలెను.

ఆహారకోశములోని వస్తువులను పరీక్షించుటకు సాధారణముగా [1]ఈవాల్డ్ టెస్ట్‌మీల్ అను పరీక్షచేయుదురు. దీనివలన, ఆహారకోశమునకు ఆహారపదార్థములను జీర్ణించుకొను శక్తిని, ఆహారకోశమునందలి స్రావముల సహజ స్వభావమును కనుగొని, ఆహారము నిర్ణయించుదురు. ఈ పరీక్ష ఉదయకాలమున ఆహారకోశము ఖాళీగానున్నప్పుడు చేయుదురు. అప్పుడు ఉపవాసమువలన నేర్పడిన జీర్ణరసమును రైల్స్ లేక [2]రేఫస్ ట్యూబ్ మూలమునను, 20 cc. గ్లాస్ సిరంజ్ మూలమునను తీసివేయుదురు. నోటి గుండ గొట్టము నెక్కించి, దాని బయటికొనను క్రిందిదవడకు ఆడ్‌హిసివ్ టేప్‌తో అంటించుదురు. రోగికి ఒక యెండు రొట్టెముక్క, (స్లైస్)ను, 400 cc. గల రెండు కోపాల నీళ్లును ఇయ్యవలెను. ఈ యాహారమిచ్చిన గంటసేపటికి, ఆహారకోశములోని జాఠరికపదార్థములను పైనచెప్పిన ట్యూబ్, గ్లాస్ సిరంజ్ నుపయోగించి బయటికి తీయుదురు. కొన్ని సమయములందు ఆహారకోశములోని వస్తువులను భిన్నభిన్నముగా బయటకు తీయుదురు. అనగా, వస్తువులు బయటకు వచ్చునంతవరకుగాని, 2½ గంటలలోగాని ప్రతి 15 లేక 20 నిమిషములకు మాదిరీలు తీసివేయుదురు. ఈ పరీక్షవలన ఆహారకోశమునందలి పదార్థముల పులుపుదనము (అసిడిటి), వాసన యెట్టిదో, తనకు తాను ఖాళీచేసికొను శక్తి ఆహారకోశమున కెంతయున్నదో తెలిసికొనగలరు.

జీర్ణావయవములను ఎక్స్‌రే పరీక్షచేయుటవలన అన్నవాహికలోని నాళము ముడుచుకొనియుండుట, [3]కార్డియోస్పాసమ్, ఆహారకోశమునందలి పుండు, స్వకీయముగా ఆహారకోశము ఖాళీయగు శక్తి, ఆహారకోశము

1 Ewald test meal. 2 Rehfuss tube. 3 Cardiospasm.

ఉబ్బుట, కాన్సర్, పైలోరిక్ సంబంధమైన ఆటంకము, [1]విసెరోప్టోసిస్ పెద్దప్రేగునందున్న ఏదైన యితర ఆటంకములను దెలిసికొనవచ్చును.

జీర్ణావయవములను ఎక్స్‌రే పరీక్షచేయవలసినప్పుడు, 48 గంటలకు ముందు రోగికి సాధారణముగా విరేచనములగుటకు ఆముదము త్రాగించెదరు. పరీక్షకు 6 గంటలు ముందు ఎనెమనిచ్చెదరు. ఆహారకోశమును ఎక్స్‌రే పరీక్షచేయవలసియుండిన, పరీక్షకు ముందటి సాయంకాలము తేలికయైన ఆహారమును, మరుసటి యుదయము బారియమ్ సల్ఫేట్ అనునది 4 ఔన్సులను, ఒక పైంట్ గంజి లేక పాలతో కలిపి యిచ్చెదరు. కొన్ని గంటలైన పిదప జీర్ణావయవములను ఎక్స్‌రే పటము తీసి బారియమ్ యెట్లు ప్రవర్తించినదో పరీక్షించుదురు. ఎక్స్‌రే పరీక్షలన్నియు ముగియువరకు నోటిద్వారా యేమియు పుచ్చుకొనకూడదని నర్సు రోగికి తెలియ చెప్పవలెను. పరీక్షలైన పిమ్మట ఏదైన తేలిక యాహారమియ్యవచ్చును. కోలన్ అను పెద్దప్రేగును ఎక్స్‌రే తీయవలసినప్పుడు, బేరియమ్‌ను ఎక్స్‌రే గదిలోనే ఎనెమద్వారా నిచ్చెదరు. తరుచుగ 6 ఔన్సుల బేరియమ్, 6 ఔన్సుల తుమ్మబంక, 32 ఔన్సుల నీళ్లు కలిపి ఎనెమ నియ్యవలెను.

పిత్తాశయముయొక్క వ్యాపారమును ఎక్స్‌రే తీసి పరీక్షచేయుదురు. ఇట్టి సమయములో పిత్తాశయమునందు చేరియున్నట్టియు, ఎక్స్‌రే పటము మీాద నీడపడునట్టియు ఒక విధమగు రంగును వాడుదురు. ఈ పరీక్షకు ముందు సాయంకాలము క్రొవ్వుగాని, పాలుగాని లేని తేలికయైన ఆహారమును రోగికి పెట్టవలెను. దీనికి తరువాత 6 గ్రాముల [2]ఒపకోల్ అను దానిని నోటిద్వారానో, రక్తనాళములద్వారానో ఇచ్చెదరు. ఇక ఎక్స్‌రే పరీక్ష అగునరకు నోటిద్వారా మరేమియు నియ్యకూడదు. సాధారణమైన రీతిగా ఒపకోల్ అనునది పిత్తాశయములోనికి ప్రవించినట్లయిన, ఎక్స్‌రే ఫిల్మ్‌మీాద పిత్తాశయము నీడపడును. అట్లు నీడపడనియెడల, పిత్తాశయము సరిగా పనిచేయుటలేదనియు, నీడ అంతయు ఏక రీతిగ లేకుండిన, పిత్తాశయములో రాళ్లున్నవనియు అర్థము. మూడుగంటలైన పిమ్మట మరల ఎక్స్‌రే తీయుదురు. అప్పుడింకను నీడ యున్నట్లయిన చాల క్రొవ్వున్న ఆహారముపెట్టి, మూడవసారి ఎక్స్‌రే పటము తీయుదురు. ఖాళీచేయుటకు పిత్తాశయమునకు ఎంత శక్తియున్నదో యీా పరీక్ష తెలియజేయును.

[1] Visceroptosis. [2] Opacol.



**అన్నవాహికకు కలిగెడు వ్యాధులును, స్థితులును**:—ఇవి సాధారణముగా రావుగాని, వచ్చెనేని వానిని చాల ముఖ్యమైన వ్యాధులుగా పాటించవలెను. కొరుకుడుపుండు (కాన్సర్) వలనగాని చర్మమును దినివేయు ఏవైన రసాయనిక మందువలన గలిగిన పుండు మానుటవలనగాని యేర్పడు వ్యాధిమూలమున అన్నవాహిక ముడుచుకొనును.

లక్షణములు:—మ్రింగుటకు కష్టముగానుండుట, తినిన అన్నము త్రేపినప్పుడు గొంతులోనికి వచ్చుట, కొన్ని సమయములలో నొప్పియుండుట దీని లక్షణములు. అడ్డుపడిన దానికి పైనున్న అన్నవాహిక ఉబ్బియుండును.

**చికిత్స**:—ముడతలు అనుకూలముగా నున్నయెడల క్రమేణ [1]డైలేటర్సనుపయోగించి, వానిని పెద్దవిచేయవలెను. ద్రవాహారమును మాత్రమియ్యవలెను.

జాఠరీయవ్యాధులు, స్థితులు

[2]నర్వస్ డిస్‌పెప్సియ:—(అమ్లపిత్తము) ఇది పిండముతోనే ఆరంభము కావచ్చును; లేక మతిస్థిమితము లేనందున కలుగవచ్చును. ఈ వ్యాధి దేహములోని యితరచోట్లను తరుచుగా కనబడును.

చికిత్స:—రోగి బుద్ధి బాగుపడుటకు అతనికి పెక్కుసంగతులు నేర్పవలెను. వీలైనంతవరకు రోగిని సామాన్యముగానే చూడవలెను. విశ్రాంతి, దేహపరిశ్రమ, అవసరమైన అతడు చేయుచున్న పనిని మార్చుట, మంచి గాలి, చాలినంత నిద్ర, ఇవి చికిత్సయందు గమనించవలసిన ముఖ్య విషయములు.

[3]**తీక్షణమైన జాఠరీయవ్యాధి**:—ఆహారకోశముయొక్క లోపలి పొర, మంటపుట్టించు పదార్థమువలన కందును. కాస్టిక్ అనగా, దేహము పొక్కునట్టి రసాయనములవల్లనో, పులిసి చెడిపోయిన అన్నమువలని విషమువల్లనో, టైఫాయిడ్‌వంటి అంటువ్యాధులవల్లనో, మితిమీారి తినుటవల్లనో, అన్నమును నమలక తొందరగా మ్రింగుటవల్లనో యీా స్థితి యేర్పడును.

[1] Dilators. [2] Nervous dyspepsia. [3] Acute gastritis.

లక్షణములు:—ఆమ్లపిత్తము (డిస్‌పెప్సియ) యొక్క లక్షణములే దీని లక్షణములు. కడుపు నిండినట్టుండుట, అన్నము తినినతరువాత ఆహార కోశములో అసౌఖ్యముగానుండుట, డోకు, తలదిమ్ము, ఆకలిలేమి, పైకడుపు నొప్పిపుట్టుట. ఇవి దీని లక్షణములు. వాంతియగుటవలన కొంత నెమ్మదికలుగును. జాఠరరసములో కొద్దిగా ఆసిడ్ ఉండునుగాని, మ్యూకస్ (బంక) ఎక్కువగానుండును. అతి విరేచనములుండిన నుండ వచ్చునుగాని మలబద్ధకము తరుచుగానుండును. నాలుకమీద పూత యుండును; ఉమ్మినీరు ఎక్కువగును. విషమువల్లనైన జాఠరీయవ్యాధుల లక్షణములు మరి ముమ్మరముగ నుండును. తీవ్రమైన డోకు, వాంతి యగుట, నొప్పి యెక్కువగానుండుట దీని లక్షణములు. ఇంక రక్తస్రావము, కొలాప్స్, కొన్ని సమయములలో అతివిరేచనములు, ఇతర సమయము లలో మలబద్ధకము, [1]అన్యూరియ (మూత్రపిండములనుండి మూత్రము రాకుండుట) కూడ ఉండవచ్చును.

చికిత్సయు, పరిచర్యయు:—వ్యాధి కొద్దిపాటిగానుండెనేని, ఆవాల పొడిని చన్నీళ్లు లేక వేడినీళ్లతో కలిపి యిచ్చి వాంతిచేయించుటవలన కొంత నెమ్మది కలుగవచ్చును. లవాజ్ చేయుట (కడుగుట)యు, విరేచన మగుటకు ఎనెమనిచ్చుటయు అవసరమైయుండును. కొంతకాలము ఉప వాసముండి, కడుపుపైన నెక్కడ నొప్పియున్నదో, అక్కడ పట్టువేయుట వలన కొంత ఉపశాంతి కలుగును. ద్రవాహారములు అనగా, [2]ఆల్‌బ్యుమెన్ నీళ్లు, పలుచనచేయబడిన పాలులేక వట్టి గంజినిచ్చుట మేలు. వ్యాధి ముమ్మరముగానుంటే, పురీషనాళముగుండను, చర్మముక్రింద సూదిద్వారాను సెలైన్ నెక్కించవచ్చును. రోగి నోటిద్వారా ద్రవాహారములను త్రాగ గల్గిన తరువాత, సులభముగా జీర్ణమగు మెత్తని యాహారము నియ్యవలెను. ఇన్‌ఫెక్షన్ వల్ల వ్యాధికలిగినప్పుడు, వ్యాధినిబట్టి చికిత్సచేయవలెను.

విషములను పుచ్చుకొన్నందువలన కలిగెడు జాఠరీయవ్యాధి, పుచ్చు కొనిన విషముయొక్క స్వభావము, మోతాదునుబట్టి యుండును. జీర్ణావ యవములను గడుగుటగాని, మందులిచ్చి వాంతిచేయించుటగాని అవసరమై యుండును. ఆసిడ్, ఆల్కాలివిషమునకు తగిన విరుగుడు వెంటనే యియ్య వలెను. 14-వ అధ్యాయములో దీని [3]ప్రత్యేకవివరము గలదు.

[1] Anuria. [2] Albumen water. [3] Specific treatment.



క్రానిక్ గాస్‌ట్రైటిస్ (దీర్ఘకాలపు జాఠరీయవ్యాధి):—ఈ యవస్థలో చాలకాలము విడువకుండ కందుటవలన గలుగు మార్పులు కనబడును. తీవ్రమైన జాఠరీయవ్యాధిని గలిగించు, ఇరిటెంటును చాలకాలము ఉపయోగించినట్లయిన, క్రానిక్ గాస్‌ట్రైటిస్ కలుగును.

లక్షణములు:—లక్షణములు బాగుగా కనబడకపోవచ్చును. రోగి యాకలి తగ్గవచ్చును; లేదా హెచ్చవచ్చును. గుండెలో మంట, పులి త్రేపులు, కొన్నిసార్లు చాల దప్పి, యుండవచ్చును. నాలుకమీద పూతయుండును. నోటియందు చెడ్డ రుచియుండును. ముఖ్యముగా, ఉదయమునసే డోకు, వాంతియగుట ఉండును. వాంతిలో కొద్దిగ హైడ్రోక్లోరిక్ ఆసిడ్ యుండునుగాని, మ్యూకస్ లెస్సగానుండును. తల దిమ్ము, తలనొప్పి, రోగి చింతతోనుండుట దీని ఇతరలక్షణములు. క్రానిక్ గాస్‌ట్రైటిస్ ఆరంభదశలోనే, యెక్కువ ముదరక పూర్వమే బాగుచేయ వచ్చును. ముదిరినవ్యాధిని చికిత్సచేసి యుపశాంతి కలిగించవచ్చునుగాని, సంపూర్ణముగా కుదుర్చుట చాల కష్టము.

చికిత్సయు, పరిచర్యయు:—వ్యాధినివారణకు, రోగి పథ్యమును క్రమ పర్చవలెను; భుజించుటయందు సదభ్యాసము లలవడవలెను. నోటినిగూర్చిన ఆరోగ్యమును దినదినము అభ్యసించవలెను. వ్యాధికి చికిత్సగా, మంటను పుట్టించెడు పదార్థములను దొలగించి, ఇన్‌ఫెక్షన్ చేరియున్న స్థలములను చికిత్సచేయవలెను. రోగి, స్వల్పభోజనమును బాగుగా నమలి తినవలెను. భోజనములకు మధ్య మంచి వ్యవధియుండునట్లు, నియమితసమయముల లోనే తినవలెను. పాలు, గంజిపదార్థములు, ఉడికించి వడయగట్టిన కూరగాయలు, మొదలగువానిని రోగికి చాలకాలమియ్యవచ్చును. తరు వాత చేపలు, కోడి తెల్లనిమాంసముకూడ ఇయ్యవచ్చును. కొన్ని సార్లు పిండిపదార్థములు రోగికి గిట్టవు; అప్పుడు రోగి స్థితినిబట్టి యతని ఆహారమును క్రమపర్చవలెను. ఉదయము, సాయంకాలము అన్నకోశ మును వేడి ఆల్కలైన్ సొల్యూషన్‌తో గడుగుటయు, కొంతకాలమైన తరువాత ఆల్కలైన్‌నీరు భోజనమునకుముందు త్రాగుటయు మంచిది. కాఫిని, తేనీళ్లను, ఎక్కువ కారములను సారాయములను నిషేధించవలెను.

[1]హైపర్‌క్లోరిడియ, అనగా, అమితముగా హైడ్రోక్లోరిక్ ఆసిడ్ ఉన్నప్పుడు, ఆహారముతో మీగడ, ఆలివ్ ఆయిల్, వెన్న చేర్చి యిచ్చుట మేలు.

[2]అక్లైలియ లేక ఉండవలసినదానికంటె తక్కువ ఆసిడ్ ఉన్నప్పుడు, బీఫ్‌జ్యూస్ (గొడ్డుమాంసపు రసము), [3]బలమగు మాంసపుచారు పుల్లని పండ్లరసము నిచ్చుట లాభకరము.

ఆహారకోశము ఉబ్బుట:—తీక్షణముగా ఆహారకోశము ఉబ్బుట అపాయకరమైనదేగాని, సాధారణమైనదికాదు. శస్త్రచికిత్సయైన పిమ్మట అప్పుడప్పుడు ఇట్లు ఉబ్బవచ్చును. ఇంకను కడుపునకు గాయములుతగిలినను, న్యుమోనియ, టైఫాయిడ్‌వంటి తీవ్రమైన జ్వరములయందును, ఆహారకోశ మిట్లు ఉబ్బవచ్చును.

[4]ఆహారకోశము దీర్ఘకాలము ఉబ్బుట: — ఇది సాధారణమైనదే. ఆహారకోశము ఉబ్బి బలహీనమగును. పైలోరస్‌కు ఏదైన నడ్డుపడుట వలన అనగా, పుండుపడి మానినచోట, ఈ రంధ్రము చిన్నదిగా నగుట, గుల్మము (టూమర్), పైలోరస్ దగ్గర కందుట—ఈ కారణములవలన అచటి భాగములు ఒకదానితో నొకటి అంటుకొనిపోవును. చాలకాలమునుండి మితిమీరి తినుట, క్రానిక్ గాస్ట్రైటిస్‌నందు ఆహారకోశము కందుట, రక్తహీనత, వ్రణము, క్షయ, రికెట్స్ మొదలగు వ్యాధులవలన దేహము సామాన్యముగా బలహీనపడుట, ఆహారకోశపు గోడకు బిగువుతగ్గుట దీనికి మరికొన్ని కారణములు. ఇట్లు ఏదైన అడ్డుపడుటవలనను, ఆహారకోశము బలహీనపడుటవలనను, అది సరిగా ఖాళీ కానేరదు. ఇట్టి యవస్థలో ఒక్కొక్కప్పుడు అసలు పరిమాణముకంటె రెండు మూడింతలు అన్నకోశము పెద్దదియగును.

లక్షణములు:—నొప్పియుండును. వాంతిచేయించుట మూలముననో, జీర్ణావయవములను గడుగుట మూలముననో, కొంత ఉపశాంతి గలిగించక పోయినయెడల, ఈ నొప్పి ఎల్లప్పుడు నుండును. వాంతి పలుమారగుట, రోగము తీవ్రమగుకొలది వాంతి జాస్తియగుటయు నుండును. ఈ

[1] Hyperchloridia. [2] Achylia. [3] Boullion. [4] Chronic dilatation.



వాంతిలో అంతకుముందు రెండు మూడుసార్లు తిన్న భోజనపు ముక్కలు గాని అప్పుడప్పుడు కొన్నిదినములకు ముందు తినిన, ఆహారపు ముక్కలు గాని ఉండవచ్చును. ఆహారకోశమునందు అన్నము పులిసిపోయి, ఆహారకోశపు గోడకు హానికలిగించును. అందువలన జాఠరీయరసము తగ్గి, బలహీనమగును. ఇట్లు వాంతియందు చాల అన్నము పోవుటవలన రోగి బలహీనపడి, బరువుతగ్గును. అప్పుడు కడుపునిండినట్లును, బరువుగాను ఉండి మలబద్ధకమును ఆయాసమును నుండును.

చికిత్స:—పైలోరస్ దగ్గర ఏదైన అడ్డుపడియుంటే, శస్త్రచికిత్సచేసి దానిని తీసివేయవలెను. రోగికి చాలినంత పోషణకరమైన ద్రవాహారముల నియ్యవలెను. ముఖ్యముగా, భోజనమైన పిమ్మట విశ్రాంతి తీసికొనవలెను. అప్పుడప్పుడు అన్నకోశమును గడుగవలెను. గ్లూకోస్, సోడియమ్ బైకార్బొనేట్ లేక సేలైన్—వీనిని పురీషనాళము మూలమున ఆహారముగా నియ్యవలెను. ఆహారకోశపు గోడల బిగువుతగ్గినయెడల, ఈ వ్యాధిరాకుండ ఆపుటకు మొట్టమొదట చికిత్సచేయవలెను. విశ్రాంతి, దేహపరిశ్రమ, జాగ్రత్తగా సరిచేయబడిన ఆహారము, దేహమర్దన, ఇవి రోగికి లాభకరముగా నుండును. టైఫాయిడ్‌వంటి జ్వరమువలన చాల కాలము బాధపడి, రోగి బాగుపడుచుండగా, అతని విషయము చాల జాగ్రత్తగలిగి పరామర్శించు చుండవలెను.

ఆహారకోశముయొక్క బిగువు తగ్గినప్పుడు, మర్దన, దేహపరిశ్రమ, స్ట్రిక్‌నిన్ మొదలగు వానివలన కండరముల బిగువు బాగుపడును. దీనివలన ఆహారకోశము ఖాళీయగుటకు వీలగును. కాన్‌సెన్ట్రేటెడ్ (బలపరచబడిన) ఆహారము, అప్పుడప్పుడు చిన్న మోతాదులుగా ఇచ్చుట మంచిది. భుజించినపిమ్మట రోగి కుడిప్రక్కన పరుండి విశ్రాంతి తీసికొనవలెను. వ్యాధి ముమ్మరముగా నున్నప్పుడు విశ్రాంతితోకూడ, మర్దన చేయుట సహాయకరముగా నుండును. బిగువుతగ్గిన అవస్థకు శస్త్రచికిత్స చేసినను, అది జయకరముగా నుండదు.

జాఠరీయపుండ్లు:—జాఠరీయపుండ్లకును, ఆహారకోశపు పుండ్లకును 'సెప్టిక్ పుండ్లు' అని పేరు. ఆహారకోశపు గోడయొక్క ఏదైన నొక భాగము

లోని టిష్యూలు చచ్చిపడిపోవుటవలన జాఠరీయపుండు ఏర్పడును. మొదట ఇది అమత్వచమీద చిన్నపుండుగా పుట్టును. సాధారణముగా, ఏ భాగము బలహీనపడునో, ఆ భాగమున నీ పుండుపుట్టి కండరమునకుగాని కండరముగుండ [1]పెరిటోనియమ్ (ఆంత్రవేష్టనము) నకు గాని ప్రాకును. అన్ని వయస్సులలోను జాఠరీయపుండు పుట్టవచ్చును. ఇది తరుచుగా పురుషులలో పుట్టును. ఆహారకోశమున పైలోరిక్ కొనన ఇది తరుచుగా కనబడుచుండును. అన్నవాహిక భాగమున గుండె మొననగూడ ఇది కనబడవచ్చును. ఈ భాగమునకు సరియైన రక్తము ప్రవహించకపోవుటయు, మనస్సునకుగాని నరముల వ్యాపారమునకుగాని తొందర కలుగుటయు ఈ వ్యాధికి ముఖ్యమైన కారణములని ఇప్పుడు తలంచుచున్నారు.

లక్షణములు:—దీని లక్షణములు మారుచుండవచ్చునుగాని వీనిలో మూడు లక్షణములుమాత్రము ముఖ్యమైనవని తలంచుచున్నారు. ఇవి యేవనగా, నొప్పి, వాంతి, రక్తముకారుట. ఈ వ్యాధిగ్రస్తుల కందరికి నొప్పియు అసౌఖ్యమును సగముమందికి వాంతియు, నూటికి 10 మందికి రక్తము కారుటయును అన్నము తినినతరువాత దాదాపు నాలుగుగంటల సేపువరకు నొప్పి యీ క్రింది లయననుసరించి వచ్చును: — ఆహారము, సుఖము, నొప్పి; సుఖము. పుండ్లులేచిన స్థలములనుబట్టి నొప్పి పుట్టు సమయము భేదించుచుండును. గుండె కొనదగ్గరగా లేచినట్లయిన, నొప్పి త్వరగా పుట్టును. ఈ నొప్పి మొద్దుబారినట్లును, మంటపుట్టినట్లు నుండినను, చాల ముమ్మరముగా నుండును. నొప్పి అధికముగా నున్నప్పుడే తరుచుగా వాంతియగును. అప్పుడు చాల నెమ్మదికలుగును. సాధారణముగా ఈ వాంతి చాల పుల్లగానుండును. రక్తము అధికముగా కారినట్లయిన, అది చాల యెఱ్ఱగానుండును. తక్కువరక్తము పడినయెడల, కాఫీ మడ్డి రంగుగాగాని, నల్లగాగాని యుండును. మలములోగూడ రక్తముండవచ్చును. ఆకలి మామూలుగాగాని, అధికముగాగాని యుండును; అజీర్ణ లక్షములు కనబడవచ్చును. [2]ఎపిగాస్ట్రియమ్ (పైకడుపు) లో నొప్పియుండుటయు, వీపున దానికి సంబంధించిన నొప్పియు నుండవచ్చును. ఎక్స్‌రేపరీక్షయు, టెస్ట్‌మీల్‌ను వ్యాధి యెట్టిదైనది నిర్ధారణచేయుటకు సహాయపడును.

[1] Peritoneum. [2] Epigastrium.



[1]డుఓడీనల్ అల్సర్ (ఆంత్రమూలములోని పుండు):— జాఠరీయ పుండుకుగల కారణములవలననే మీాదిప్రేగులోను పుండ్లు లేవవచ్చును. ఇట్టి పుండ్ల లక్షణములుకూడ జాఠరీయపుండు లక్షణములవంటివే.

లక్షణములు:—అన్నము తినినితరువాత రెండు గంటలసేపటికి జాఠరీయ తొందరకలిగి కొంతకాలముండును. కాని యీ తొందరవలన పుట్టు నొప్పి భేదముగానుండును. ఇప్పుడు దీని లయ: 'అన్నము, సౌఖ్యము, నొప్పి' ఆహారము భుజించినమీాదటనే నొప్పి తగ్గును. అంతవరకు నొప్పి పుట్టుచునేయుండును. సాధారణముగా తక్కువ వాంతియగును; అయినవాంతిలోనైనను రక్తము కనబడుట అరుదు. కాని తారువంటి మలములోమాత్రము రక్తముండును. ఆహారకోశము క్రిందిభాగములో, [2]బొడ్డుకు కుడిప్రక్కను, బొడ్డుపైనను తాకినచో నొప్పిపుట్టును.

పెప్టిక్ పుండునకు సంకర వ్యాధులు. గడ్డలులేచి చిల్లులు పడినందున పెరిటోనియమ్ (ఆంత్రవేష్టనము) అంతయు కందును. ఇంకను రక్తస్రావము, పొరలు అంటుకొనుటవలన ఆహారకోశము ముడతలుపడుట, [3]పైలోరిక్ రంధ్రము (జఠరాధోద్వారము) చిన్నదగుట, అప్పుడప్పుడు కొరుకుడుపుండు లేచుటయు సంభవించును. వ్యాధి తిరుగు రీతులనుబట్టి దీనియంతము భేదించుచుండును. ఈ వ్యాధి పలుమారు వచ్చుచుండుటయు సాధారణమే. కొన్నివ్రణములు ఏ చికిత్సచేయబడకయే అనేక సంవత్సరములు నిలిచియుండును.

చికిత్సయు, పరిచర్యయు:—ఈ పుండ్లకు సరియైన కారణము తెలియనందున, దీని నివారణా చికిత్సయు నిర్ణయించబడలేదు; కాని యాహారము భుజించుటయందు సదభ్యాసములు, మంటపుట్టించు ఆహార పదార్థములను నిరాకరించుట, అంటుచేరియున్న స్థలములను తొలగించుట, ఆహారకోశములో నేదేని కందెడి వ్యాధియున్న దానినిగూడ తొలగించుట, మలబద్ధకమును నివారించుట, శారీరక, మానసిక శ్రమలను తగ్గించుట—ఇత్యాది కార్యములవలన పుండ్లు లేచుటకు వీలులేకుండ చేయవచ్చును. వేరే తొందరలు లేకుండ వట్టి అల్సర్ (పుండ్లు) మాత్రమే

[1] Duodenal ulcer. [2] Umbilicus. [3] Pyloric stenosis.

యయిన, తగినపథ్యమువలనను, మందులవలనను చికిత్స చాలకాలము చేయవలెను. (1) మంటపుట్టించు ఆహారములన్నిటిని నిరాకరించవలెను. (2) జాఠరీయరసము విస్తారము స్రవించవలసిన అక్కఱగల ఆహారములను, తక్కువ జాఠరీయరసము అవసరమైయుండు ఆహారములనే రోగి కియ్యవలెను. (3) రోగిని బలపరచి, పుండు మానుటకు సహాయపడునట్టియు, రక్తమును యథాస్థితికి తెచ్చునట్టియు ఆహారము నియ్యవలెను. తరుచుగా, రోగి మేల్కొని యుండగా, మూడుగంటల కొకసారి, మొత్తమున దినమునకు ఆరుసార్లు ఆహారముపెట్టుట శ్రేష్ఠము. ఒకటి రెండు వారములవరకు 6—8 ఔన్సుల పాలును, మీగడయు, లేక జావయు—ఇయ్యవలెను. దీనికి క్రమేణ మెత్తగా ఉడికించిన గ్రుడ్డును, [1]పాలును గ్రుడ్లును కలిపి వండిన పదార్థమును, పాలలో నానబెట్టిన [2]కాల్చినరొట్టెను బాగుగా ఉడికించిన అన్నమును, పచ్చని కూరగాయముక్కల చారును ఇయ్యవచ్చును. పండ్లు ఇచ్చినయెడల రోగికి అసౌఖ్యము తరుచుగా హెచ్చునుగాన, బహు జాగ్రత్తగా నాలోచించి యియ్యవలెను. మూడు వారములైన తరువాత, చేపలు, కోడిమాంసము, వేటమాంసపు ముక్కలు ఆహారముతో కలిపి యియ్యవచ్చును. వ్యాధి కుదురుటకు, పై చెప్పిన పథ్యము కొన్ని నెలలవరకు సేవించవలెను. రక్తస్రావమునకు రోగి సంపూర్ణ విశ్రాంతి పుచ్చుకొనవలెను. అన్నవాహిక భాగమున మంచు పెట్టుచుండవలెను. నోటిద్వారా కాకుండ పురీషనాళముద్వారా, ఆహారమియ్యవలెను. మార్ఫిన్ ఇయ్యవలెను. రక్తము నెక్కించుట (బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూషన్) అవసరమైయుండవచ్చును. ఎంత జాగ్రత్తగా ఆహారమును, మందును ఇచ్చినను ఈ వ్యాధి పలుమారు వచ్చును. ఆహారకోశము పనిచేయుట క్రమక్రమముగా క్షీణించుచుండెనేని, శస్త్రచికిత్స అవసరమైయుండును. చిల్లులు పడినప్పుడు వెంటనే శస్త్రచికిత్స చేయవలెను. (29-వ అధ్యాయము, చూడుము).

## ప్రేగులయొక్క వ్యాధులును, స్థితులును

మలబద్ధకము:—ప్రేగులు పనిచేయు క్రమము తప్పినప్పుడు మలబద్ధక మేర్పడును. అప్పుడు చాల ఆలస్యముగా విరేచనము కావచ్చును. లేక

[1] Custard. [2] Milk toast.



అసంపూర్ణముగా కావచ్చును. పెద్దప్రేగునందు ఆహారము చాలసేపు నిలిచి యుండుటవలన, దానినుండి నీరంతయు పోవును. అందువలన మలము ఎండి గట్టిముద్దలుగా విరేచనమగును. దీనికి పెక్కు కారణములున్నవి. (1) శరీరారోగ్యమునుగూర్చి నిర్లక్ష్యముగా నుండుట; విరేచనము వచ్చుచున్నట్టు కనబడేవరకు, ఎంతకాలము బిగబట్టుకొనగలమో అంత కాలము బిగబట్టుకొనుట. దీనివలన అమత్వచకు స్పర్శజ్ఞానముతప్పును. ఈ లోపము తొలగిపోయి, భేది వేళకు క్రమముగా కావలెననిన, క్రమమైన కాలములో ప్రతిదినము ఈ పని జరుగునట్టు అభ్యాసము చేసికొనవలెను. అంతేకాకుండ, వేళకు భుజించుటవలన, పరిపూర్ణమైన ఆహారమువలన, దేహాభ్యాసమువలన త్వరలో ఈ లోపము చక్కపడగలదు. భేది మందును పుచ్చుకొనుటను నిరుత్సాహ పరచవలెను. (2) [1]అపెండిసైటిస్ వంటి కందెడు వ్యాధులవలనను, ప్రేగులు కందుటవలనను పెద్దప్రేగులోని యొకభాగము ముడుచుకొనవచ్చును. ఇట్టి వ్యాధులకు శస్త్రచికిత్సయే తగినది. ముడి యాహారములను నిరాకరించవలెను. (3) మలబద్ధకమునకు కండరపుగోడ బలహీనపడుట, బిగువుతగ్గుట మరియొక కారణము. ఈ స్థితి, రక్తహీనతవలన, అతి మూత్రమువలన, నరముల దుస్థితివలన గలుగ వచ్చును. దీనికి విస్తారముగా నీరు, ఇతర ద్రవములు, పచ్చని కూరగాయలు పండ్లు ఇచ్చినయెడల మేలు. చేయగలిగినంత దేహాపరిశ్రమ చేయుటయు, మర్దనచేయుటయు, ఇనుమును, విషముష్టి టానికులును ఇచ్చుటయు మంచిది.

లక్షణములు:—ఈ వ్యాధికి సంబంధించిన లక్షణములు కనబడక పోవచ్చునుగాని, రోగికి సాధారణముగా కండ్లుతిరుగుట, తలనొప్పి, మందముగనుండుట, ఆకలిలేమి, గమనశక్తి తగ్గుట, దుర్వాసనగల శ్వాస, నాలుక పూత, అజీర్ణము, మనస్సు క్రుంగియుండుట మొదలగు అవలక్షణము లుండవచ్చును. అతిసారము దీనికొక సాధారణ లక్షణము. గట్టిపడిన మలమువలన నొప్పిపుట్టి నీళ్ల భేదియగును; గాని దానిలో గట్టిముద్దలుగ మలము పడుచుండును. భేదిలో మ్యూకస్ (బంక) ఉండినయెడల, అది ప్రేగులయొక్క అమత్వచను గాపాడును.

మలబద్ధకమువలన కలుగు సంకరవ్యాధు లేవనగా:—[2]మూలవ్యాధి, పగుళ్లు, పెద్దప్రేగులో పుండ్లులేచుట, పెద్దప్రేగు ఉబ్బుట, మలము అణచి

[1] Appendicitis, [2] Hemorrhoids,

వేయబడి గడ్డకట్టుట, వరిబీజము మొదలైనవి. ఆరంభములోనే చికిత్స చేసినయెడల, మలబద్ధకమును కుదర్చవచ్చును. కాని యీ వ్యాధికిగల కారణమునుబట్టి చికిత్సచేయవలెను. తరుచుగా అవయవసంబంధమైన దురవస్థను శస్త్రముచేసి బాగుచేయవలెను.

[1]అతిసారము:–పలుమారు నీళ్లవంటి పలుచని భేదులగుటను అతిసారమందురు. ఇది ఒక వ్యాధికాదుగాని, అనేక వ్యాధులకును, వ్యాధిస్థితులకును ఒక లక్షణమైయుండును. [2]వేసవికాలపు అతిసారమనగా, తీక్షణమైన వేసవికాలములో ఎపిడెమిక్‌గా పిల్లలకు కలుగు అతిసారము. ఈ రకము అతివిరేచనమును గూర్చిన వివరమును, చికిత్సయు 23-వ అధ్యాయములో వ్రాయబడినవి. విశ్రాంతియు, వ్యాధికారణమునకు తగిన చికిత్సయు తీక్షణమైన అతివిరేచనమునకు చేయవలసిన చికిత్సలు. తగని ఆహారము వలన నీ వ్యాధి కలిగినయెడల, సాధారణముగా ఒక మోతాదు ఆముదముగాని, మగ్నిషియమ్ సల్ఫేట్‌గాని త్రాగుటవలన బాగవును.

[3]తీక్షణముగ ప్రేగుకందుట:–ప్రేగునందలి భాగమంతగాని, యేదైన నొకభాగముగాని కందుటవలన నీ వ్యాధి సంభవించును. ఈ వ్యాధి [4]ఆంత్రమూలము, మధ్యాంత్రము, పెద్దప్రేగు, పురీషనాళము అను భాగములకును రావచ్చును. దీనికి సాధారణకారణము లేవనగా (*a*) పచ్చి లేక ఎక్కువగా పండినపండ్లుగాని, చెడిపోయిన మాంసమును, పాలునుగాని పుచ్చుకొనుట, (*b*) పాషాణము, పాదరసమువంటి కందజేయు మందులు పుచ్చుకొనుట, (*c*) చల్లగాలి తగులుట, (*d*) ఇన్‌ఫెక్షన్ మొదలగునవి.

లక్షణములు:–ఇది అకస్మాత్తుగా ఆరంభమగును. ఆహారకోశమునందు తెరలు తెరలుగా నొప్పికలుగుట, వాంతి, అతిసారము, కడుపు ఉబ్బుట, ఇవి ముఖ్యలక్షణములు. దినమునకు 15-20 భేదులగును. ఇవి నీళ్లవిరేచనములుగ నుండి జీర్ణముకాని యాహారము కలిగియుండును. ప్రేగులు ముమ్మరముగా కందినప్పుడు బంకయు, రక్తమును పడును. పెద్దప్రేగు కందినప్పుడు [5]టెనెస్మస్ అనగా భేదివచ్చుచున్నట్లు ముక్కుడు సంభవించును. ముమ్మరముగానున్న స్థితులలో నోరును, నాలుకయు మెండి,

[1] Diarrhea. [2] Summer or epidemic diarrhea. [3] Acute enteritis.
[4] Duodenitis, jejunitis, colitis and proctitis. [5] Tenesmus.



దేహములో నీరులేకయుండును. కొద్దిపాటి జ్వరముండవచ్చును. సాధారణముగా చిన్నపిల్లలు ఈ వ్యాధిపాలగుదురు.

చికిత్సయు, పరిచర్యయు:–రోగికి విశ్రాంతినిచ్చి, రోగమునకు కారణము కనుగొని తగిన చికిత్స చేయవలెను. ప్రేగులలో మంటపుట్టించు వస్తువుండెనేని, దానిని బయటికి తీయవలెను. రోగికి డోకులేకుండిన ఒక మోతాదు ఆముదము త్రాగించుట మంచిది. 24 గంటలు రోగికి అన్నము పెట్టకూడదు. నార్మల్ సెలైన్‌ను రక్తనాళములలోనికిగాని, చర్మముక్రిందికిగాని ఎక్కించి దేహములో చాలినంత ద్రవముండునట్లు చూడవలెను. ఆహారకోశమునకు వేడికాపడమునిచ్చి నొప్పిని తొలగించవచ్చును. డోకు ఉన్నయెడల, వేడి సెలైన్‌తో పెద్దప్రేగును గడిగి, మంట పుట్టించు వస్తువులను దీసివేయవచ్చును. వ్యాధియొక్క బలము తగ్గినప్పుడు, పలుచని తేనీళ్లు ఇయ్యవచ్చును. కొంతకాలమైన తరువాత చారు, కాల్చినరొట్టె మెత్తని యాహారపదార్థ లియ్యవచ్చును.

దీర్ఘకాలము ప్రేగుకందుట:–దీనికి పెక్కు కారణములు గలవు. తీక్షణముగ ప్రేగుకందినతరువాత యిది రావచ్చును. కాని సాధారణముగా కావలసినదానికంటె తక్కువ లవణరసము స్రవించుటవలనను, [1]ఎంట్ అమీబ హిస్టాలిటికవలన కలుగు ఇన్‌ఫెక్షన్ మూలమునను, కొరుకుడు పుండు, క్షయ, గ్రహిణి అను వానివలన పెద్దప్రేగుకు లేక పురీషనాళమునకు కలుగు వ్యాధులమూలమునను దీర్ఘకాలముగ ప్రేగుకందుట సంభవించును. [2]కారిజముయొక్క క్షీణతలో రక్తప్రసరణమునకు అడ్డు కలిగినప్పుడుగాని గుండె జబ్బువలనగాని, [3]మూత్రపిండ రోగమువలనగాని ఇది రావచ్చును.

లక్షణములు:–సాధారణముగా అతిసారము, మలబద్ధకము, ఆహారకోశములో పట్టుకొన్నట్టు నొప్పి, కడుపు ఉబ్బుట, క్రిందిప్రేగుకు వ్యాధియున్నయెడల ముక్కుట మొదలగు లక్షణములు ఈ వ్యాధికి కనబడును. మలములో బంకయు, రక్తమును, పుండ్లు ఉండినయెడల, చీముకూడ పడును. వ్యాధి ముదిరినకొలది, రోగి కృశించును. రక్తహీనత, అస్థైర్యము కలుగును.

[1] Entameba histolytica. [2] Cirrhosis of the liver. [3] Nephritis.

**చికిత్సయు, పరిచర్యయు:**—కారణమునుబట్టి చికిత్సయుండును. దీర్ఘ కాలము విశ్రాంతియు జాగ్రత్తగలిగిన పరిచర్యయు అవసరము. ప్రేగులలో శేషము నిలువనట్టి మెత్తని యాహారము, హెచ్చు కలోరిస్ గల ఆహారము రోగికియ్యవలెనని వైద్యుడు ఉత్తర్వుచేయును. ఆహారకోశమును కాపడమువలనను, దానికి చలిగాలి తగలకుండ చేయుటవలనను నొప్పి తగ్గును. పెద్దప్రేగుయొక్క పైభాగమును గడుగుటవలనను కొంత లాభముండును. రక్తము నెక్కించుటవలన పలుమారు మేలు కనబడును. మంచిగాలి, సూర్యునివెలుగు, పాషాణము, ఇనుము—వీనివలన టానిక్ వంటి ఔషధ ఫలితముండును. రోగి చాల కృశించియున్నయెడల, అతని చర్మమును జాగ్రత్తగా గమనించవలెను; లేనియెడల ఒత్తిడిపుండ్లు వచ్చును. అల్సరేటివ్ కొలైటిస్ అనునది పెద్దప్రేగు కందుట. ఈ ఇన్ఫెక్షన్ తరుచుగా ఎంట్ అమీబ హిస్టొలిటికవలన కలిగి, పెద్దప్రేగుకంది పుండ్లుపడుటకు కారణమగును. రోగి కృశించిపోవుట, రక్తహీనత, ఆహారకోశములో నొప్పి, కడుపు ఉబ్బుట, రక్తమును, బంకయు, చీమును కలిగిన విరేచనము తరుచుగానగుట ఈ వ్యాధిలక్షణములు. దీర్ఘకాలము ప్రేగుకందుటకు చేసిన చికిత్సయే దీనికిని చేయవలెనుగాని రోగి పథ్యమునుగూర్చి ప్రత్యేకజాగ్రత్త తీసికొనవలెను. అమీబిక్ లేక బాసిలరి రక్తవిరేచనమువలన ప్రేగుకందినపుడు ఏ చికిత్స చేయుదురో 23-వ అధ్యాయములో వ్రాయబడియున్నది.

### [1]కాలేయమునకు, [2]పిత్తాశయమునకు గలుగు వ్యాధులు, వానిస్థితులు

[3]పచ్చకామెరలు: — ఈ యవస్థయందు దేహముయొక్క చర్మము, [4]కంటిగ్రుడ్డు పైనున్న తెల్లపొర, శరీరమునందలి ద్రవములు, పిత్తమునందలి పసుపు రంగువలన పసుపు పచ్చరంగుగ నుండును. మూడురకములైన కామెరలు గలవు. అవేవనగా, అడ్డుపడుటవలన గలిగిన కామెరలు, [5]హిమొలిటిక్ కామెరలు, ఇన్ఫెక్టివ్ కామెరలు.

**అడ్డుపడుటవలన గలిగిన కామెరలు:**—పిత్తనాళములో ఏదైన నడ్డుపడుటవలన నెక్కువసారులు ఈ యవస్థ యేర్పడును. పిత్తాశయము నందలి రాళ్లు, పిత్తాశయ మార్గము సన్నదగుట, కణుతులుండుట, కందుట

[1] Liver. [2] Gall bladder. [3] Jaundice. [4] Sclera. [5] Hemolytic.



వీనివలన గలిగిన యొత్తిడి ఈ వ్యాధికి కారణములు. ఇవి పైత్యరసమును రక్తములోనికి ఇంకునట్లుచేయును.

**లక్షణములు:**—చర్మము, కంటి తెల్లపొర, అమత్వచలు, దేహమునుండి స్రవించు ద్రవములు ఇవి పసుపు పచ్చగానగును. మూత్రము పసుపు పచ్చ, నల్లని దేవదారు రంగు ఈ రెంటిమధ్య వివిధములుగా మారుచుండును. అధికమైన దురద, అప్పుడప్పుడు చర్మముక్రింద రక్తముకారుట కనబడును. కాల్సియం తక్కువైనందున, రక్తము ఆలస్యముగా గడ్డకట్టును. సాధారణముగా నాడి గతి నిదానముగను, దేహోష్ణము మామూలు కంటె తక్కువగనుండును. మలములో పిత్తపురంగు తగ్గినందున నది బంకమట్టి వర్ణముగానుండును. జీర్ణము కానట్టి క్రొవ్వువస్తువులు అధికముగా నుండును. తరుచుగా మలబద్ధకము, ఆకలి లేమి, డోకు, ఆహారకోశములో వాయువు చేరియుండుట మొదలగు లక్షణములుండును. దీనివలన మనోవ్యాకులత, తలనొప్పి, మాంద్యము, కలవరింతలు, గాఢమూర్ఛ రావచ్చును.

**చికిత్స:**—ఈ స్థితి కారణమునకు తగిన చికిత్సచేయవలెను. పిత్తాశయములో రాళ్లుండెనేని, సాధారణముగా శస్త్ర చికిత్సచేయుదురు. కాని వీలైనంతమట్టుకు పసిరికలు బాగవునంతవరకు శస్త్రచికిత్స చేయరు.

[1]**హిమొలిటిక్ జాండిస్:**—[2]ప్లీహమునకు సంబంధించిన యేదో ఒక వ్యాధివలన, ఈ హిమొలిటిక్ జాండిస్ కలుగుచున్నదని వైద్యులు తలంచుచున్నారు. తీక్షణమైన అంటురోగముల తరువాత అనగా, మలేరియా, క్షయ, సవామేహరోగము మొదలగువాని తరువాత ఈ వ్యాధివచ్చును. దీనివలన ఎఱ్ఱని రక్తకణములు చాల నాశనమగును.

**లక్షణములు:**—ప్లీహము పెరిగి పెద్దదగును. చర్మము, కంటి తెల్లపొరలు పచ్చగనగును. పైత్యరసము నిరాటంకముగా స్రవించుటవలన, మలము బంకమట్టి రంగుగానుండదు; మూత్రమైనను రంగునందు అసాధారణముగానుండదు; చర్మముమీద దురదయునుండదు. ఈ స్థితికి కారణమైన వ్యాధిని కనుగొని చికిత్సచేయవలెను. [3]స్ప్లీనెక్టమి (ప్లీహమును తీసివేయుట) వలన కొన్నిసార్లు సంపూర్ణ నెమ్మదికలుగును. [4]ఆర్స్ఫెన

[1] Hemolytic jaundice. [2] Spleen. [3] Splenectomy. [4] Arsphenamine.

మిన్, క్లోరోఫారమ్, సర్పవిషము, మొదలగు విషములవలనగాని, న్యుమోనియ, సెప్టిసీమియ, సవామేహవ్యాధి మున్నగు అంటు వ్యాధులవలనగాని కాలేయముయొక్క సూక్ష్మాణువులకు చెఱుపుకలుగుటవలనగాని [1]ఇన్ఫెక్షన్ కామెరలు సంభవించవచ్చును. వంశ పారంపర్యముగావచ్చు కామెరలును, క్రొత్తగా పుట్టిన బిడ్డలకువచ్చెడి కామెరలును ఈ రకమైనవే; కాని యివి సాధారణముగా కొన్ని దినములైన తరువాత కనబడకుండ పోవును.

**చికిత్సయు, పరిచర్యయు:**—ఆర్స్ఫెనమిన్ విషప్రయోగమైనయెడల చికిత్సకొరకు 14-వ అధ్యాయములో చూడుము.

కామెరలకు చాల ఓపికతోను జాగ్రత్తతోను చికిత్సచేయవలెను. పిండిపదార్థములు ఎక్కువగానున్న ఆహారమును, ముఖ్యముగా గ్లూకోసును నియ్యవలెను. అయితే వీటిలో క్రొవ్వుపదార్థములు చేరకుండ చూడవలెను. మాంసకృత్తులు మితముగా నియ్యవలెను. ద్రవములను ముఖ్యముగా పండ్లరసమును విస్తారముగానిచ్చి, మృదువైన ఉప్పుమందులను వాడి విరేచనమగునట్లు చేయవలెను. చెమటపోయుమందును ఇచ్చినవెంటనే వేడి స్పంజ్ స్నానము చేయించుటవలనగాని, ఘాటు తక్కువైన కార్బాలిక్ సొల్యూషన్ను పట్టించుటవలనగాని, దురద తగ్గవచ్చును. ప్రతి దానియందు కామెరలకు కారణమైన ఇన్ఫెక్షన్సుకు చికిత్సచేయవలెను.

**కాలేయముయొక్క క్షీణత:**—ఇది మధ్యవయస్సులో నున్నవారికి వచ్చెడు దీర్ఘకాలపు వ్యాధి. ఇందులో కాలేయపు టిష్యూలు క్షీణించి, వాని స్థానమున మచ్చలుగల నారవంటి టిష్యూలు పుట్టును. మధ్యసారము వలన కలిగెడు విషము దీనికి ముఖ్యకారణము. సంబారములు ఎక్కువగా వేసిన ఘాటైన ఆహారము తినుటవలనను ఈ వ్యాధి వచ్చునని నమ్ముచున్నారు. దీర్ఘకాలమునుండి యేదైన లోహపు విషమున్నను, సవామేహమువంటి అంటు వ్యాధులున్నను ఈ వ్యాధి రావచ్చుననుటకు కొంత ఆధారమున్నది. కాలేయపుకణములు కందుటవలని దుర్బలత్వమును బట్టియు, ఆ కణములకు బదులు పుట్టెడు మచ్చలు గల టిష్యూలు ముడుచుకొనుటనుబట్టియు, సాధారణముగా కాలేయము చిన్నది అవును

[1] Infectious jaundice.



గాని, కాలేయమునందు క్రొవ్వుపదార్థములు నిలిచియుండుటవలన అది పెద్దదికానవచ్చును. కాలేయపు [1]రక్తప్రవాహద్వారమునకు ఆటంకము కలుగుటవలన, ప్రవహించు రక్తము అధికముగాతగ్గి, జీర్ణావయవ మార్గమునందలి నాళములును, బొడ్డుచుట్టు నాళములును ఉబ్బును.

**లక్షణములు:**—ఆరంభలక్షణములు కొద్దిపాటివిగానే యుండవచ్చును. కాలేయపు రక్తప్రవాహమునకు ఆటంకము కలుగుటవలన, జీర్ణముతో సంబంధించిన అవలక్షణములు కలుగును. అవి ఆకలి లేమి, డోకు, వాంతియగుట, మలబద్ధకము, కడుపులో వాయు వధికమగుట, నాలుకకు పూతయుండుట, శ్వాస దుర్వాసనగొట్టుట మామూలు. ఒత్తిడి యెక్కువ అగుటవలన, ఆహారకోశము, పురీషనాళ భాగమునందలి రక్తనాళములు ఉబ్బియుండును. [2]జలోదరమునకును, పాదములకుగలుగు [3]వాపునకును ఇవియే కారణములగును. ఆహారకోశమునుండి రక్తము విస్తారముగా కారవచ్చును. కొంతకాలమునకు విషచిహ్నములు అనగా, తలనొప్పి, మనస్సు క్రుంగియుండుట, గాఢమూర్ఛ మొదలగు అవలక్షణములు కనబడవచ్చును. ఈ స్థితియందు రోగి తీక్షణమైన అంటువ్యాధులకు లొంగిపోయి మరణించవచ్చును. అసలు వ్యాధివలన కొన్ని మాసములలోనే మరణము సంభవించవచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు:**—వ్యాధిలక్షణములు ముదరకముందే రోగియొక్క ఆహారమును, జీవితమును చక్కబడవలెను. మధ్యసారమును విసర్జించవలెను. ద్రవాహారములను విస్తారముగా ఇయ్యవలెను; విరేచనమగునట్లు ప్రేగులను క్రమపర్చవలెను. ఆహారములో అధిక సంబారములు, ఇతర రుచిగల పదార్థములు లెస్సగా వేయకుండ స్వల్పమైనదిగా నుండవలెను. గ్రుడ్లు, మాంసము, క్రొవ్వులు, వీనిని సాధారణముగా తగ్గించవలెను. సిఫిలిస్ రోగమున్నయెడల, దానికి చికిత్సచేయవలెను. జలోదరమునకు ఉప్పుమందు ఇచ్చి విరేచనములు చేయించవలెను. ఉప్పు ద్రవములు తగ్గించి యియ్యవలెను. మూత్రము పుట్టించుమందులు వైద్యుని యుత్తర్వునుబట్టి వాడుచుండవలెను. కడుపునందలి నీరుతీయుట తుదకు అవసరమై యుండవచ్చును. దీని విధానము 10-వ అధ్యాయములో వ్రాయబడియున్నది.

[1] Portal circulation. [2] Ascites. [3] Edema.

కాలేయములో మరి మూడు అసాధారణ రోగస్థితులుండును. అవేవనగా, [1]చీముగడ్డ, [2]కార్సినోమ, [3]తీక్షణమైన యెలో అట్రొఫి. ఇన్ఫెక్షన్ వలననే కాలేయమునందు గడ్డలేచును. ఉష్ణదేశములలో అమీబిక్ రక్తవిరేచనమువలనను ఇది సంభవించవచ్చును. 23-వ అధ్యాయము చూడుము. ఈ గడ్డలేచినప్పుడు క్రమముతప్పిన అహిక జ్వరము, చలియు, చెమటపోయుట, నొప్పిపుట్టుట, కాలేయము మీాద తాకిన నొప్పి పుట్టుటయు దీనిలక్షణములే. దీనికి శస్త్రచికిత్స చేయవలెను.

కార్సినోమ:— లేక కాలేయపు కాన్సర్. సాధారణమైన జీర్ణావయవములలోగాని, రొమ్మునగాని లేచిన కాన్సర్ వెంబడి ఈ పుండు పుట్టును.

**తీక్షణమైన** యెలో అట్రొఫి:— ఇది సాధారణ వ్యాధికాదు. దేహములో విషముండుటవలననో ఇన్ఫెక్షన్ వలననో ఇది సంభవించును. కాలేయపు అణువులు నాశనమై, దాని పరిమాణము తగ్గిపోవును. ఈ స్థితి కొన్నిసార్లు గర్భము ధరించియుండగా సంభవించి, రానురాను అధికమగును.

లక్షణములు:— ఆరంభమున కామెరలు ఉండును. తరువాత భరించలేని తలనొప్పి, వాంతియగుట, చర్మమునుండియు, అమత్వచనుండియు రక్తముకారుట, ఆయాసము, ఈడ్పు ఉండును. రోగి మూడువారములలో చనిపోవచ్చును. లక్షణములనుబట్టి యీా వ్యాధికి చికిత్సచేయవలెను.

పిత్తాశయముయొక్క సాధారణ వ్యాధులేవనగా, [4]కోలెసిస్టైటిస్ [5]కోలెలిథైయెసిస్ (పిత్తాశయమునందు రాళ్లుండుట) యనునవి.

**తీక్షణమైన కోలెసిస్టైటిస్**:— పిత్తాశయము తీక్షణముగా కందుటయే [4]కోలెసిస్టైటిస్ అను వ్యాధి. ఇది కోలన్ లేక టైఫాయిడ్ క్రిములవలన సాధారణముగా కలుగును. కొన్నిసారులు స్టాఫిలొకాకస్, న్యుమొకాకస్, స్ట్రెప్టొకాకస్ అను పురుగులును ఈ వ్యాధికి కారణములు కావచ్చును.

[1] Abscess. [2] Carcinoma. [3] Acute yellow atrophy. [4] Cholecystitis. [5] Cholelithiasis.



దీనికిని అపెండిసైటిస్‌కును కొంత సంబంధమున్నట్టున్నది. ఇట్లుండినప్పుడు పిత్తాశయము కొంచెము కందియుండవచ్చును; చీముకూడ పట్టియుండవచ్చును.

లక్షణములు:— వ్యాధి కొద్దిపాటిదిగానుండినప్పుడు అజీర్ణము కొద్దిగా మాత్రముండునుగాని, ముమ్మరముగా నున్నప్పుడు పిత్తాశయ భాగములో తీక్షణమైన నొప్పి, తాకినచో నొప్పియు ఉండును. దీనికి తోడు ఆ భాగము బిగిసి యుండుట, డోకు, వాంతి, జ్వరము, [1]రక్తములోని తెల్లని కణములు విస్తరించుట ఉండును. చీముకూడినప్పుడు పై జెప్పినవానికి తోడు కడుపు నొప్పియుండును. కుడిభుజమున రిఫర్డ్ నొప్పియుండును. మూత్రములో ఆల్బ్యుమిన్ (శ్వేతధాతువు పోవుట) కనబడును; ప్లీహము కూడ పెరిగి పెద్దదికావచ్చును. కొన్ని సమయములలో పిత్తాశయము [2]చిల్లులు పడవచ్చును. రోగము బలముగా లేకుండిన నది ఒక వారము, పదిరోజు లుండునుగాని పిమ్మట సంపూర్ణ స్వస్థతకలుగును. కొన్నిసారులు ఈ వ్యాధి ముదిరి దీర్ఘకాలపు వ్యాధి కావచ్చును. వ్యాధి ముమ్మరముగా నున్నప్పుడు శస్త్రచికిత్స చేసిననేకాని, మరణము సంభవించవచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు**:— రోగము కొద్దిదిగా నున్నప్పుడు రోగిని పడకలో పరుండబెట్టి విశ్రాంతి తీసికొననిమ్ము. స్వల్పాహారములుమాత్ర మిమ్ము. ద్రవాహారములను జాస్తిగా నిమ్ము. కాపడములు, పట్లు వేయుట (పౌల్టిసెస్), మంచుసంచి—వీనిని కాలేయమున్న భాగమున పెట్టుము. కొందరు రోగులకు డుఒడీనల్ ట్యూబ్ మూలమున ద్రవము తీయుటచేత చాల నెమ్మది కలిగినదిగాని, చీమున్నయెడల తప్పక శస్త్రచికిత్స చేయవలసివచ్చును.

దీర్ఘకాలపు కోలెసిస్టైటిస్:— మధ్యవయస్సులో ఏదేని అంటువ్యాధివలన పిత్తాశయము దీర్ఘకాలమునుండి కందియుండుట. సాధారణముగా పిత్తాశయములో రాళ్లుండుటను బట్టిగాని, తీక్షణమైన కోలెసిస్టైటిస్ తరువాతగాని యీా వ్యాధి వచ్చును. పిత్తాశయములో రాళ్లున్నప్పుడు కనబడు

[1] Leucocytosis. [2] Perforation.

చిహ్నములే యీ వ్యాధియందును కనబడును. [1]కోలెసిస్టొగ్రఫి అనగా ఎక్స్‌రే అనునది చేసి వ్యాధిని కనుగొందురు.

లక్షణము:—దీర్ఘకాలపు అజీర్ణము, ప్రేగులలో గాలి చేరియుండుట, [2]గాలిని నోటినుండి పైకివిడుచుట, ఆహారకోశపు మీదిభాగమున వికారముగానుండుట మొదలైనవి. ఆహారము తినినమీదట యీ వికారము హెచ్చును. ఈ చిహ్నములు ఆయా సమయములలోనే కనబడును. దీని తరువాత చలియు, కొద్దిపాటి జ్వరమును పిత్తాశయ భాగములో ముమ్మరమైన నొప్పియు నుండును.

చికిత్సయు, పరిచర్యయు:—ఇన్‌ఫెక్షన్ చేరియున్న కేంద్రములను తొలగించవలెను. ఈ వ్యాధిని వైద్యచికిత్స అనగా మందులిచ్చి బాగుచేయవచ్చునుగాని, పిత్తాశయమునకు వ్యాధియున్నయెడల, దానిని తీసివేయవలెను. రోగికి చప్పిడియన్నము పెట్టవలెను. చక్కెర, రుచికరమైన ఆహారములు, క్రొవ్వులు రోగికి పెట్టకూడదు. ఆహారములమధ్య ద్రవాహారములను జాస్తిగా నియ్యవలెను. ఘాటులేని భేదిమందులిచ్చి క్రమముగా విరేచనమగునట్లు చూడవలెను. అవిసెపిండిపట్టు బాధను తగ్గించవచ్చునుగాని బాధ ముమ్మరముగా నుండినయెడల, మార్ఫిను నియ్యవలెను. డుఒడీనల్ డ్రెయినేజ్ వలనను కొంత నెమ్మది కలుగునుగాని తీక్షణమైన వ్యాధిచిహ్నము లున్నప్పుడు శస్త్రచికిత్స చేయవలసియుండును.

[3]కోలిలిథైయసిస్:—ఈ స్థితిలో పిత్తాశయమునందు ఱాళ్లేర్పడును. మధ్యవయస్సు వారికి ఈ వ్యాధివచ్చును. పురుషులకంటె స్త్రీలకు ఇది తరుచుగా సంభవించుచుండును. పిత్తాశయములోని ఱాళ్ల పరిమాణము చిన్నఱాయి రేణువునుండి, [4]వాల్నట్ పరిమాణమువరకు నుండును. ఏదేని ఇన్‌ఫెక్షన్ ఫలితముగానైనను, పిత్తములో [5]కొలెస్టెరాల్ అను పదార్థము ఎక్కువ పడుటవలననైనను, లేక పైత్యరసము నిలిచియుండుటవలననైనను ఱాళ్లు ఏర్పడును.

లక్షణములు:—వివిధములుగా భేదించును. సాధారణముగా అజీర్ణముండును; ఆహారకోశము మీదిభాగము నిండియుండును; త్రేన్పు, నోటి

[1] Cholecystography. [2] Eructations of gas. [3] Cholelithiasis.
[4] Walnut. [5] Cholesterol in the bile.



గుండ గాలి, పులితేపులు (ఆసిడ్) విడువబడుచుండును. ఆయా సమయములలో పిత్తాశయ భాగమంతయు ఫుండై నొప్పిగా నుండును. పిత్తాశయములోని ఱాళ్లుండు పరిమాణమునుబట్టి ఇతర లక్షణములుండును. ఱాళ్లు చిన్నవిగానుండిన నవి పిత్తనాళముగుండ బయటికిపోవును. అప్పుడు కాలిక్ అను నొప్పి పుట్టును. పెద్దవయినయెడల కాలిక్ అను నొప్పి ముమ్మరముగా నుండును. పైత్యనాళమునకు అడ్డుపడి జాండిస్ (కామెరలు) సంభవించును. ఆహారకోశము మీదిభాగమున నుండియు, పిత్తాశయము భాగమంతటినుండియు ముమ్మరమైన నొప్పి యారంభమై, కడుపు ఇరు పార్శ్వములకును, వీపునకును, కుడిభుజమునకును ప్రాకవచ్చును. రోగికి చెమట విస్తారముగాపోసి బాధకలుగును. దీనికి తరువాత తరుచుగా జాండిస్ సంభవించును. మూత్రము నలుపురంగును, మలము బంకమట్టి రంగును గలిగియుండును. పైపైన అనగా ఒకదానివెంబడి ఒకటి యీ నొప్పి కలుగుచుండును. ఇట్లు పలుమారు వచ్చుచు, ప్రతిసారి రోగము హెచ్చుచుండును. దీనివలన ఒనకూడెడి యితర సంకరవ్యాధు లేవనగా, [1]సంధివ్రణము పిత్తాశయమునకు చిల్లులుపడుట, ప్రేగులలో అడ్డుపడుట, ఒక భాగము ఇంకొక భాగముతో నంటుకొనుట మొదలైనవి. వీనివలన అసలువ్యాధి యెట్లు పరిణమించునో చెప్ప వీలుకాదు. కాని యీ స్థితివలన మరణము కలుగుట అరుదు.

చికిత్సయు, పరిచర్యయు:—తీక్షణమైన కోలిసిస్టైటిస్ వచ్చినవారికి, రోగనివారణార్థము, ఆహారపుకొలతను తగ్గించవలెను. గ్రుడ్లు, క్రొవ్వు, ఆయా వస్తువులు తాలింపులువేసిన అన్నమును రోగికి పెట్టకూడదు. అంటుకేంద్రములున్న, వానిని తొలిగించవలెను. విరేచనము క్రమముగా జరుగునట్లు చూడవలెను. ద్రవాహారములను జాస్తిగనియ్యవలెను. దేహపరిశ్రమ క్రమముగచేయవలెను. కాలిక్ అను నొప్పి పలుమారు వచ్చుచుండినయెడల, బాధ తగ్గించుటకు కడుపుమీద పోల్టీస్ (పిండిపట్టు) వేయుట; కాపడము నిచ్చుట ఈ వ్యాధికి మామూలుగచేయు చికిత్సలు. చర్మము క్రింద సూదిమూలమున మార్ఫినిచ్చుట, ఆహారకోశమును గడుగుటవలనను, ఎనెమవలనను కొంత నెమ్మదికలుగును. కొంతకాలము పాలను

[1] Fistulae.

ఆహారముగా నియ్యవచ్చును. రోగము కుదురుటకు శస్త్రము చేయించు కొనుట మంచిది.

వృక్వకమునకు సంభవించెడు వ్యాధులు అరుదు. తీక్షణమైన వృక్వకము పాంక్రియాటైటిస్ పిత్తాశయమునకు కలిగెడి వ్యాధిమూలముననే సంభవించును.

## అధ్యాయము 19

# మూత్రావయవ మండలమునకు కలిగెడు వ్యాధులును, వ్యాధిస్థితులును

మూత్రమార్గమునకు సంభవించు వ్యాధులకు చికిత్సచేయవలెనన్న, కొన్ని విషయములను ముఖ్యముగా కనుగొనుట చాల ప్రాముఖ్యమైన సంగతి. ముఖ్యముగా ఈ స్థితిలో రోగి పుచ్చుకొను పథ్యము (పథ్యాహారము) చాల ప్రాముఖ్యమైన విషయముగాన, దానిని జాగ్రత్తగా గమనించి, హానికరమైన లక్షణములున్నయెడల వానిని వ్రాసి యుంచవలెను. ఈ సమయములో రోగి యెంత ద్రవమును పుచ్చుకొను చున్నాడో, ఎంత ద్రవమును బయటికి విడుచుచున్నాడో తప్పలేకుండ గమనించి, నమ్మకముగా వ్రాసియుంచవలెను. వైద్యుడు దీనిని చాలించు మనువరకు ఇట్లు వ్రాయుచుండవలెను. మలవిసర్జనముతోకూడ పోయు మూత్రమెంతో పరిమాణముచూచి చార్టులో వ్రాసియుంచవలెను. మూత్రపిండములు చేయు కొన్ని పనులను పరీక్షించవలెను. ఈ పరీక్షల ఫలితములను జాగ్రత్తగా వ్రాసియుంచవలెను. 32-వ అధ్యాయము చూడుము. మూత్రకోశమునకు చికిత్సచేయవలెనని యుత్తరువైనప్పుడు, దానికి ఉపయోగించెడు పరికరములన్నియు సూక్ష్మజీవిరహితములై యుండుట ప్రాముఖ్యమైన విషయమని నర్సు జ్ఞాపకము పెట్టుకొనవలెను.

[1]**అన్యూరియ:**—అనగా, మూత్రపిండములు మూత్రమును అణిచి వేయుట. అందువలన రోగి దినమునకు 50 cc. ల కంటె తక్కువ మూత్రము పోయును. తీక్షణమైన నెఫ్రైటిస్ అను మూత్రవ్యాధిలోవలె

[1] Anuria.



మూత్రపిండములు నలిగియుండుటయో, పాదరసమువంటి రసాయనపు విషప్రయోగమో, మూత్రపిండములోని రాళ్లు మూత్రనాళములను అడ్డగించుటయో, మూత్రనాళములలో కొరుకుడు పుండువలని ఒత్తిడియో ఈ వ్యాధికి కారణములై యుండును.

**లక్షణములు:**—లక్షణములు ప్రాముఖ్యముగా కనబడకపోవచ్చును. తలనొప్పి, వాంతి, నడుముల ప్రాంతమున నొప్పి యుండవచ్చును. ఈ స్థితి కొన్ని గంటలో, దినములో ఉండును. అన్యూరియ పూర్ణముగా తటస్థించెనేని మరణము సంభవించవచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు:**—మొదటి రెండు కారణములవలన కలిగిన అన్యూరియకు చికిత్సగా, నడుములకు వేడికాపడము నియ్యవలెను. ఉప్పుమందు నిచ్చి ధారాళముగా విరేచనమగునట్లు చేయవలెను. వేడి నీటితో పెద్ద ప్రేగులను కడుగవలెను. గ్లూకోసును రక్తనాళములద్వారా నెక్కించిన వ్యాధినివారణకు తోడ్పడును. రాళ్లు, పుండ్లు, మూత్రనాళములను అడ్డగించినప్పుడు శస్త్రచికిత్సచేయుట అవసరమైయుండును.

**పాలియూరియ:**—దినమునకు 3000 cc. లకు పైన మూత్రము పోయుటను పాలియూరియ అందురు. డయబెటిస్ యిన్సిపిడస్, డయబెటిస్ మెలిటస్, తీక్షణమైన నెఫ్రైటిస్ తీక్షణమైన జ్వరము తరువాతను ఈ విపరీతమైన స్థితి సంభవించును.

**మూత్రము రాకుండ నిలిచిపోవుట:**—నరములజబ్బు, కడుపుకు ఆపరేషన్ చేయుట, ప్రసవము, దేహమంత మొద్దుబారుట, షాక్ (అదరుట) నొప్పి, ముఖ్యముగా యూరిత్రైటిస్, సిస్టైటిస్ అను వ్యాధులలో మూత్రకోశములో మూత్రము నిలిచిపోవును. అనీమియ (రక్తహీనత), ముసలితనము, పురుషాంగముకొనన గ్రంథిలేచి యుబ్బియుండుట, మెదడునకుగాని, వెనుబాముకుగాని గాయముతగులుట, మూత్రకోశము మెడమీద ట్యూమర్ అను కణితిలేచి అదుముట, మూత్రద్వారము ముడుచుకొనిపోవుట—ఈ స్థితులలోకూడ మూత్రము నిలిచిపోవును.

**చికిత్సయు, పరిచర్యయు:**—పెక్కుస్థితులలో మూత్రము విడుచుటకు గల సహజమైన వాంఛయే అణిచివేయబడును. అనగా మూత్రము విడుచుటకు ఇష్టముండదు. రోగికి వేడి, చల్లని పానీయములనిచ్చుట,

పడకలో పరుండెడు తీరు అప్పుడప్పుడు మార్చుట, వైద్యుని యుత్తరువు మీద రోగిని పడకలో కూర్చుండబెట్టుట, పడకచేట్టిలో వేడినీళ్లుగాని, స్పిరిట్స్ ఆఫ్ అమ్మోనియాగాని పోయుట (నీటిని తగిన పరిమాణముగా కొలిచి పోయవలెను). భగముమీద వేడినీటిధారకారనిచ్చుట, మూత్రకోశపు ప్రాంతమున వేడి కాపడమునిచ్చుట, పారుచున్న నీటిధ్వనిని రోగి వినునట్లు చేయుట, వేడి ఎనెమానిచ్చుట—ఈ మొదలగు పరిచర్యలవలన మూత్రము పోయుటకు వాంఛ పుట్టించవచ్చును. క్యాతిటరైజేషన్ చేయుమని వైద్యుడు ఖచ్చితముగా చెప్పిననేకాని, క్యాతిటర్ చేయక ముందు ప్రతిసారి పైజెప్పిన సదుపాయములన్నిటిని, ఇంక యేవైన సదుపాయములనైననుచేసి, రోగిమూత్రము పోయునేమో చూడవలెను. క్యాతిటరైజేషన్ చేయుటకు తప్పక వైద్యుని యుత్తరువుపొందవలెను.

**మూత్రము తరుచుగా పోయుట:**—మూత్రమార్గమునందు ఏదో వ్యాధి యుండుటవలన నీ స్థితి యేర్పడవచ్చును. [1]పాలియూరియ లేక సులభముగ మంటకలిగించు మూత్రమువలనను ఈ స్థితి కలుగును. [2]పైలైటిస్, [3]సిస్టైటిస్, [4]యురిత్రైటిస్ అను వ్యాధులవలనను ఇది కలుగును. కారణమునుబట్టి వ్యాధికి చికిత్సచేయవలెను. మూత్రమును అణచుకొనలేక పోవుట అనగా, అప్రయత్నముగా మూత్రమువిడుచుట. ఇక్కడ ఒక [5]స్ఫింక్టర్ అను కండరము వదులగుట లేక సడలుటవలన మూత్రకోశము ఖాళీయగును. జ్వరము ముమ్మరముగా నున్నప్పుడును, మతి తప్పియున్నప్పుడును ఇట్లు మూత్రము విడువబడును. ఒక్కొక్కప్పుడు మూత్రము మూత్రకోశమునందే నిలిచిపోవునుగాని బొట్లుబొట్లుగా కారుచుండును. అప్పుడు మూత్రకోశము ఉబ్బును. యూరిత్రల్ స్ఫింకర్ట్ అనునది ముడుచుకొనుటవలన నిది కలుగును. మెదడునకుగాని, వెన్నుబామునకుగాని దెబ్బతగిలినప్పుడును, ప్రసవము, ఆపరేషన్ అయిన తరువాతను ఈ స్థితి సంభవించును. స్ఫింక్టర్ (ముద్రణి) అను కండరమును స్వయముగా వశపరుచుకొను శక్తి సంపూర్ణముగా లేనప్పుడు, మూత్రము అప్రయత్నముగా విడువబడును. ఈ స్థితి బిడ్డలయందు సంభవించును. ఈ స్థితికి [6]ఎన్యూరీసిస్ అని పేరు. పురుగులుండుట, మూత్రములో ఎక్కువ

[1] Polyuria. [2] Pyelitis. [3] Cystitis. [4] Urethritis. [5] Sphincter. [6] Enuresis.



ఆసిడ్ ఉండుట, అడినాయిడ్స్, టాన్సిల్స్ పెద్దవైనప్పుడు బిడ్డ మాగన్నుగ మాత్రమే నిద్రించుట మొదలగునవి పై స్థితికి కారణమై యుండవచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు:**—పగటిపూట తరుచుగా మూత్రము విడువనిచ్చుట, సాయంకాలము ద్రవములను తక్కువగా పుచ్చుకొననిచ్చుట దీనికి మంచి చికిత్స. రోగి మనోస్థితిని గమనించి, వానిని మెచ్చుకొనుట, ఆ పని చేయవద్దని ఖండించుట మరి మంచి చికిత్సయగును.

**మూత్రాశయము కందుట (సిస్టైటిస్):**—మూత్రమార్గమున ఏదో యొక భాగమున అంటు ఉండుటవలన ఈ స్థితి దానికి రెండవదిగా నేర్పడవచ్చును. ఇంకను మూత్రకోశమునకు పక్షవాతముండుటవలనను, మూత్రకోశములో ఱాయిగాని, ట్యూమర్‌గాని యుండుటవలనను ఈ స్థితి యేర్పడును. గనొకాకస్ అను వ్యాధి క్రిములు యూరిత్రగుండ ప్రవేశించి పైవరకు ప్రాకుటవలనను, అజాగ్రత్తగా క్యాతిటరైజేషన్ చేయుటవలనను అంటుచేరవచ్చును.

**లక్షణములు:**—బాధయు, మూత్రము విడిచిన తరువాత ఇంకా మూత్రము వచ్చినట్టుండుట, (టెనెస్‌మస్) దీని లక్షణములు. పొత్తికడుపుమీద నొప్పి యుండును. మూత్రము పలుమారు విడువబడుచుండును. మూత్రములో చీము, ఒక్కొకసారి మూత్రముపోసిన పిమ్మట రక్తముకూడ పడుచుండును.

**చికిత్సయు, పరిచర్యయు:**—ఈ వ్యాధి రాకుండచేయుటకు క్యాతిటరైజేషన్ చేయునప్పుడు విషక్రిమి రహితముగా చేయుటకును, మూత్రకోశమునకు చికిత్సచేయుటకు గాని, దానిని పరీక్షించుటకుగాని ఉపయోగించెడు పరికరములనుగూడ బాగుగా స్టెరలైజ్ చేయుటకును నర్సు మరచిపోకూడదు. వ్యాధికి కారణము కనుగొని వీలైన, తొలిగించవలెను. ఈ వ్యాధినిగూర్చి బాగుగా తెలిసినవారు, దీనికి చికిత్సగా రోగిని, పడకలో పరుండబెట్టి విశ్రాంతి తీసికొననిచ్చుటయు, గంటకొక గ్లాసు ద్రవాహారమును ధారాళముగా ఇచ్చుటయు శ్రేష్ఠమని సిఫారసు చేయుచున్నారు. రోగికి నెమ్మది కలిగించు మందుల నిచ్చుటయు, పొత్తికడుపు ప్రాంతముమీద కాపడము లిచ్చుటయు, నొప్పిని తగ్గించును. మూత్రకోశమును గడుగుటయు, 10% ఆర్జిరాల్ అను మందునెక్కించు

టయు అవసరమని వైద్యుడు ఉత్తరు వియ్యవచ్చును. ఆహారములో మంటపుట్టించు వస్తువులేకుండ మృదువైన స్వల్పాహార మియ్యవలెను. మూత్రము ఆమ్లగుణమువదలి క్షారగుణము పొందునట్లు మందులియ్య వలెను. ప్రేగులను క్రమపరచి, సరిగా విరేచనమగునట్లు చేయవలెను. ఈ స్థితికి సల్ఫోథయొజోల్ అను మందు త్వరగా బాగుచేయును. ఈ స్థితి క్రానిక్ (దీర్ఘకాలవ్యాధి) యైనప్పుడు యురోట్రోపిన్ తదితర మందులిచ్చి, మూత్రము ఒకసారి ఆమ్లము, ఇంకొకసారి క్షారము గుణముగలదిగా మారుచుండునట్లు చేయవలెను. ఎక్కువ బలములేని ఆంటిసెప్టిక్‌తో మూత్రకోశమును గడుగుటకు ఉత్తరు వియ్యబడును.

**మూత్రపిండము కందుట (నెఫ్రైటిస్):**—ఈ యవస్థలో మూత్రపిండ ములు కందును. ఈ వ్యాధిస్థితి తీక్ష్ణమైనదిగానైనను, దీర్ఘకాలమైనది గానైనను నుండవచ్చును. వ్యాధి స్థితినిబట్టి మూత్రపిండములు ఎంతవరకు కందినవో నిర్ణయమగును.

**మూత్రపిండము కందుట:** — అంటువ్యాధులవలనను, శ్వాసనాళము యొక్క పైభాగమునందలి తీక్ష్ణమైన అంటువలనను ముఖ్యముగా [1]టాన్సిలైటిస్‌వలనను కలుగును. చల్లగాలి తగులుటవలన ఈ వ్యాధి వచ్చుటకు కారణమగును. ఈ స్థితి స్త్రీ గర్భవతిగా నున్నప్పుడును, పాదరసమువంటి రసాయన మందులు పుచ్చుకొని నప్పుడును కలుగవచ్చును.

**లక్షణములు:**—ఆరంభము హఠాత్తుగాగాని క్రమేణగాని రావచ్చును. ఆరంభములో తలనొప్పి తలదిమ్ము, వాంతి, డోకు, నడుమునొప్పి, కను రెప్పలు వాచియుండుట, మూత్రము తక్కువగా విడచుట దీని లక్షణ ములు. వ్యాధి ముదురుకొలది వాపు దేహమంతట ప్రాకును. అప్పుడు జలోదరము ఆరంభమగును. రక్తపు ఒత్తిడి కొంత హెచ్చునుగాని అధిక ముగా హెచ్చుట అరుదు. సాధారణముగా మూత్రములో రక్తము, ఆల్బ్యుమిన్, కుదపలుండును. మూత్రము పొగకలిగిన గోదుమరంగుగా నుండును. యురీమియ యను మూత్రవ్యాధి చిహ్నములు దీనికి తరువాత కనబడును. రోగి బాగుగనున్నట్టు కనబడవచ్చునుగాని కొన్నికొన్నిసార్లు మరణము సంభవించవచ్చును.

[1] Tonsillitis.



**చికిత్సయు, పరిచర్యయు:**—అంటుచేరియున్న కేంద్రములను దొలగిం చుట, ఇకముందు అంటుతగలకుండ జాగ్రత్తగా నుండుట, ముఖ్యముగా శ్వాసమార్గము పైభాగమునకు అంటుతగలకుండ చూచుట, వేడిగల పడ కలో రోగిని చాలకాలము పరుండనిచ్చి, ప్రతిదినము స్నానము. మర్దన చేయుట, మంచిగాలి, వేడిమి, నొప్పితగ్గుటకు వేడికాపడములు—ఇవన్నియు చికిత్సలో చేయవలసినపనులు. వేడిమిపుట్టించగల చాలినన్ని పదార్థము లున్న స్వల్పాహారము నియ్యవలెను. ఉప్పు, [1]ప్రొటీన్ వస్తువులు తగ్గించ వలెను. లోపలికిపుచ్చుకొను ద్రవములు, దినమునకు 1200—1500 cc. ల వరకు తగ్గించవలెను. లోపలికి పుచ్చుకొనుద్రవమును, బయటికివచ్చు ద్రవమును గొలిచి చార్టులో లెక్క వ్రాయవలెను. ఎక్కువ బలములేని భేదిమందులిచ్చి విరేచనము క్రమముగానగునట్లు చూడవలెను. వ్యాధి ముమ్మరముగా నున్నప్పుడు దినమునకు 800 cc. ల పాలు, పండ్లరసము కలిపిన ఆహారము ఒకవారము రోజులు ఇయ్యవచ్చును. ఇంతకంటె ఎక్కువ కాల మియ్యకూడదు. రోగము బాగుపడిన తరువాత, ఎల్లప్పుడు అన్ని టిలో మితముగానుండవలెను.

**క్రానిక్ నెఫ్రైటిస్:** — ఇది వాపుతోగాని, వాపులేకగాని రావచ్చును. వాపుతో వచ్చెడు క్రానిక్ నెఫ్రైటిస్, మూత్రపిండనాళములు క్షీణించుట వలన, లక్షణము లేవియు కనబడకుండనే నిదానముగా వచ్చుచుండును. ఇట్టి స్థితిని [2]నెఫ్రోసిస్ అందురు. దీనియందు క్రమేణ కనబడు ప్రధానమైన లక్ష ణము వాపు. ఈ వాపు దేహమంతటగాని, దేహములో ఏవో కొన్ని గుంటల (గుహల) లో గాని చేరియుండవచ్చును. దీనివలన పాలుమాలిక, అజీర్ణము, తలనొప్పియు నుండవచ్చును. రక్తపు ఒత్తిడి హెచ్చును. గుండె, రక్తనాళములలోను తొందరకలుగును. రక్తహీనత (అనీమియ) కూడ నుండును. మూత్రము తగ్గిపోవును. మూత్రములో ఆల్బ్యుమిన్ (శ్వేత ధాతువు) కుదపలు, క్రొవ్వుబిందువులు నుండును. మూత్రములోని [3]సోడియమ్ క్లోరైడ్ అను పదార్థము ఉండవలసినదానికంటె తక్కువై యుండును. రోగము బాగుపడుననన్న నమ్మకముండదు. వాపుతగ్గినను మూత్రము అసాధారణముగా వచ్చుచుండును. వ్యాధి హెచ్చుచు, సాధారణముగా మరణము సంభవించును.

[1] Protein. [2] Nephrosis. [3] Sodium chloride.

**చికిత్సయు, పరిచర్యయు:**—రోగికి విస్తారమైన వెలుగు, మంచి గాలి చాల అవసరముగాని వేడికలుగునట్లు పడకలోనే యుండవలెను. ద్రవములను దినమునకు 1,000—1,200 cc. ల వరకు యియ్యవలెను. రోగి యాశను దీర్చునట్టి యాహారము పెట్టవచ్చునుగాని, దానిలో కొద్దిగా సోడియమ్ క్లోరైడ్ (ఉప్పుపిండి) ఎక్కువవేడినిచ్చు పదార్థములు, మాంసకృత్తులు (ప్రొటీన్సు) ఉండవలెను. మూత్రము విడుచుటకు మందు లియ్యవలెనని వైద్యుడు ఉత్తర్వుచేయును. మరి యే విధముగానైనను వాపుతగ్గనప్పుడు, నీళ్లవిరేచనములగునట్లు మందియ్యవలెను. భేదిమందు లిచ్చినయెడల, వానిలో నెక్కువ సోడియం క్లోరైడ్ (ఉప్పు) లేకుండ నుండవలెను. దేహములోని క్యావిటీలలో చేరిన నీరును [1]ఆస్పిరేషన్ మూలమునను, కాళ్లయందుచేరిన నీరును గుచ్చిగాని, కోసిగాని బయటికి తీయవచ్చును. రక్తహీనతయున్నయెడల, కాలేయము, ఇనుము నియ్యవలెను. ఏ విధమైన అంటుసోకకుండ అతిజాగ్రత్తగా నుండవలెను.

[2]**వాపులేని క్రానిక్ నెఫ్రైటిస్:**—దీనికి క్రానిక్ ఇంటర్‌స్టిషల్ నెఫ్రైటిస్ అనియు పేరు. ఇది చాల తరుచుగాను ముమ్మరముగాను వచ్చును. కొన్నిసారులు ఈ వ్యాధి పెద్దవారగుచున్న యౌవనులలో కనబడును. కాని సాధారణముగా ఇది మధ్యవయస్సు, వృద్ధాప్యదశలో వచ్చును. ఇది తెలియనిరీతిగా ఆరంభము కావచ్చును. మూత్ర పిండములయందలి లక్షణములతోపాటు, గుండెయందును, రక్తనాళములయందును క్రమక్రమముగా వ్యాధి పుట్టును.

**లక్షణములు:**—బరువు తగ్గుట, బలహీనత, పాలుమాలిక, కోపము విసుగు, తరుచుగా మూత్రము విడుచుట మొదలగు లక్షణములుండును. మూత్రము కొలత హెచ్చును; మూత్రము పాండువర్ణముగానుండి, స్పెసిఫిక్ గ్రావిటి తగ్గియుండును. మూత్రములో కొద్దిగా [3]ఆల్‌బ్యుమిన్, కొన్ని [4]కుదపలు, సాధారణముకంటె ఎక్కువ [5]ఆసిడ్ ఉండును. దీనిలో ఎల్లప్పుడు [6]రక్తపు ఒత్తిడి హెచ్చుగానుండును. ముక్కు, ఆహారకోశము, రెటిన మెదడు వీనినుండి రక్తము కారవచ్చును. [7]మూత్రమునందును రక్తముండ వచ్చును. జీర్ణమునందలి తొందరలు, తలనొప్పి, తల తిరుగుట, ధ్యానము

[1] Aspiration. [2] Chronic nephritis without edema. [3] Albumen.
[4] Casts. [5] Acid. [6] Blood pressure. [7] Hematuria.



నిలుపుటకు శక్తిలేకపోవుట—ఇవి దీనియందు కనబడు సాధారణమైన ఇతర లక్షణములు. దృష్టిలోపము, [1]యురీమియ కలుగవచ్చును. ఈ వ్యాధి కొన్ని నెలలుగాని సంవత్సరములుగాని యుండవచ్చును. రక్తహీనత, బరువుతగ్గుట—ఇవి క్రమముగా హెచ్చుట చెడులక్షణములు. రక్తప్రసరణశక్తియు క్షీణించుట చూడగా, వ్యాధి బాగుపడుట దుర్లభమను గుర్తులు కనబడును.

**చికిత్సయు, పరిచర్యయు:**—అంటున్న కేంద్రములను దొలగించవలెను. బాగుగా పరీక్షచేసినమీదటనే శస్త్రచికిత్సచేయుటకు పూనుకొనవలయును. రోగిజీవితములో ఆయాసముగాని, తటాలునకలిగెడి మార్పులుగాని లేక నెమ్మదిగా జీవించవలెను. ఎక్కువ శ్రమలేని దేహపరిశ్రమ బయట చేయుట మంచిది. చాల తేలికయైన భోజనము పుచ్చుకొనవలెను. దానిలో మాంసకృత్తులు తగ్గించవలెను; బహు కొద్దిగా ఉప్పువేయవలెను. దినమునకు 1,500—1,800 cc. ల ద్రవములిచ్చిన చాలును. వాపున్నయెడల ద్రవములను ఇంకను తగ్గించి యియ్యవలెను. మసాలదినుసులను, సారాయములను, కాఫీ, టీలను నివారించవలెను. క్రమముగా విరేచనమగునట్లు చేయవలెను.

[1]**యురీమియ:**—మూత్రపిండములలో రాళ్లుండుట, మూత్రపిండములు తమ పనిని సరిగాచేయకుండ బలహీనపరచెడి యితర అవస్థలవలన, విషము కలిగినస్థితికి యురీమియ అని పేరు.

**లక్షణములు:**—ఈ విషమువలన ముమ్మరమైన తలనొప్పి, వాంతియగుట, వెక్కిళ్లు, అతిసారము, ముఖమున జిలపుట్టుట మున్నగు లక్షణములుండును. కొన్ని మానసికతొందరలుకూడ కనపడును. అవేవనగా, [2]విభ్రమము, ఆయాసము, భ్రమలు, స్మారకముతప్పుట, గాఢమూర్ఛ మొదలగునవి. ఏదో ఒకవిధమైన అసాధారణపు [3]మెటాబాలిజం (జీవపదార్థము) వలన [4]కాకిసోమాలు రావచ్చునని కొందరి యభిప్రాయము. రక్తము పరీక్షించినయెడల, నత్రజని పదార్థము ఎక్కువయున్నట్టు తేలును. దీనికి పిమ్మట శ్వాస [5]షెయిన్—స్టోక్స్‌రకముగా మారి, గుడ్డితనము, తుదకు మరణముకూడ సంభవించవచ్చును.

[1] Uremia. [2] Delirium. [3] Metabolism. [4] Epileptiform convulsions.
[5] Cheyne-Stokes.

చికిత్సయు, పరిచర్యయు:—రోగి పడకలో నెమ్మదిగాను వేడిగాను పరుండవలెను. ఎక్కువ పిండిపదార్థములు చేరిన తేలికయైన ఆహారమునే రోగికియ్యవలెను. దినమునకు 3,000 cc. ల ద్రవమును కచ్చితముగ ఇయ్యవలెను. రోగికి ఆయాసమును నిద్రలేమియు నున్నప్పుడు క్లోరల్ హైడ్రేట్ ఇయ్యవలెనని వైద్యు డుత్తర్వు చేయవచ్చును. వాంతి యధికముగనుండిన చర్మము క్రిందనుంచిగాని, పురీషనాళముద్వారాగాని గ్లూకోసునీళ్లు ఎక్కించవలెను. రక్తనాళములను గోసి, రక్తమును తీయవచ్చును. పుర్రెయందు ఒత్తిడియున్నట్టు చిహ్నములు కనబడినప్పుడు, వెన్నెముకలోని నీరు 1, 2 ఔన్సులు తీయుటవలన రోగికి నెమ్మది కలుగవచ్చును. ఈడ్పు ఉన్నప్పుడు మార్ఫిన్, క్లోరల్ హైడ్రేట్ అను మందులను వాడుదురు. రోగికి ఏవిధమైన గాయములు తగులకుండ కాపాడవలెను. నాలుకను కరుచుకొనకుండ, గుడ్డతో చుట్టిన నోటిబద్దను బెట్టవలెను.

## అధ్యాయము 20

# విటమినుల లోపములవలన కలిగిన వ్యాధులు, నాళరహిత గ్రంధులకును మెటాబొలిజమ్‌నకు సంబంధించిన వ్యాధులును, వ్యాధిస్థితులును

### విటమినులు లోపించుటవలన గలిగిన వ్యాధులు

ఏవైన ఒకటి రెండు విటమినులు తక్కువగుటవలన కలుగు వ్యాధులకు, లోపమువలన గలిగిన వ్యాధులని పేరు. [1]అన్ని సరిగానున్న పరిపూర్ణాహారమును పుచ్చుకొనుటయే ఈ వ్యాధిరాకుండ చేయగల మంచి చికిత్స. ఆహారమునుగూర్చి నేడు మనకు గల జ్ఞానమువలన సంపూర్ణాహారమనగా నేమో గ్రహించగలము. 13-వ అధ్యాయము చూడుము.

[1] Well balanced diet.



**విటమిన్ A లేని లోపమువలన కలుగు స్థితులును, వాని చికిత్సయు:—**

విటమిన్ A లోపించుటవలన చర్మము, అమత్వచలమీది పొర క్షీణించి, అసలు సాధారణకణసమితికి బదులు, పెంకువంటి గట్టి టిష్యూలు ఏర్పడును. కంటిలో ఏదో వ్యాధిస్థితి యేర్పడుటవలన, కార్నియ పుండు పుట్టును. [1]కన్నీటిని తయారుచేయు గ్రంధినుండి కన్నీరుకూడ కారదు. దీని ఫలితముగా గ్రుడ్డితనము ఏర్పడును. చర్మము ఎండి, మోటుగానుండును. పండ్లు సరిగా ఏర్పడవు సరేగదా, ఏర్పడినవైనను సులభముగా పుచ్చిపోవును. విటమిను A లోపించుటవలననే మూత్రపిండమునందు, మూత్రాశయమునందు ఱాళ్లు ఏర్పడవచ్చును. విటమిను A లేనందువలన కలుగు ప్రాముఖ్యమైన లోపము, [2]రేజీకటి గ్రుడ్డితనము. ఇంకను మబ్బుగానుండు వెలుగులో చదువుటకు శక్తిహీనతగాని, కష్టముగాని కలుగును.

విటమిన్ A ని ఇంజెక్షన్‌ద్వారా నియ్యకూడదు. ఎందుకనగా, ఇది నూనెతో సిద్ధముచేసినదిగాన సూదివేసిన ప్రాంతమున నొప్పి కలుగవచ్చును. పిమ్మట ఫైబ్రోసిస్ సంభవించును. [3]కారోటీన్‌తో బలపరచబడిన మందులను నోటిద్వారా నియ్యవచ్చును. విటమిన్ A కి సంబంధించినట్టిదియు, సులభముగా లభించగలిగినట్టిదియు నేదనగా, చేపకాలేయపునూనె. విటమిన్ A ను, కారోటీనును జీర్ణముచేసికొనుటకు ఆహారములో క్రొవ్వుండవలెను. చర్మముమీదలేచిన పుండ్లకును, అంటునకును 5—25% బలముగల హాలిబట్ లేక కాడ్లివర్ నూనెను అంజనముగాచేసి పూయవచ్చును.

**విటమిన్ $B_1$ లోపించుటవలన గలిగిన స్థితులును, వాని చికిత్సయు:—**

విటమిన్ $B_1$ లోపించుటవలన పెద్దవారికి [4]బెరిబెరి యను వాపు రోగము కలుగును. ఈ వ్యాధి యారంభములో బలహీనత, ఆకలిలేమి, అలత, దేహమంతట నొప్పులుండును. ఈ వ్యాధిగల రోగి నరముల బలహీనత గలిగి తలనొప్పితో బాధపడును. కండరములు మెత్తగను నొప్పిగనుండును. గుండె త్వరితముగా కొట్టుకొనుచుండును. కొంతకాలమునకు [5]పెరిఫరల్ న్యూరైటిస్ అనగా, చర్మము పైభాగమున

[1] Lacrimal gland. [2] Night blindness. [3] Carotene. [4] Beriberi.
[5] Peripheral neuritis.

నున్న నరముకందుటవలన కండరములు ముడుచుకొని బలహీనపడును. ముఖ్యముగా కాళ్లు ఇట్లు బలహీనపడును. పాదములలో ఒకవిధమైన మంటపుట్టును. క్రింది అవయవములలో కొన్ని భాగములందు పోటు, తిమ్మిరి యధికమగును. అప్పుడు అవయవము అప్రయత్నముగా చేయవలసిన పనులు చేయలేక పోవును. పిదవ పాదములు పడిపోవును. ఇట్టి చిహ్నములు చేతులయందును తరుచుగా కనబడును. మొత్తముమీద చర్మమునకు సమీపముననుండు నరములన్నిటికి ఈ వ్యాధి సంభవించును. కావున కండరములన్ని క్షీణించును. కాళ్లు చేతుల వ్రేళ్లకు వాపు ఆరంభమై పైకి ప్రాకుచు మొదట [1]జలోదరము [2]రొమ్ముకు నీరు ఎక్కుట ఆఖరికి టిష్యూలులన్నిటికిని వ్యాపించును. శీఘ్రముగా గుండెయందు కొన్ని చిహ్నములు కనబడును. గుండె త్వరితముగా కొట్టుకొనుచుండుట వలన, అకస్మాత్తుగా [3]గుండె నిలిచిపోయినను పోవచ్చును. కాలేయము పెరిగి పెద్దదై నొప్పిగానుండును. ఈ వ్యాధిననుసరించి రక్తహీనత యేర్పడును. ఈ వ్యాధి పలువిధములుగా కనబడును. నీరుచేరియున్నప్పుడు వాపు ప్రాముఖ్యముగా కనబడును. వాపు లేనిదానిలో నరముల చిహ్నములు ప్రాముఖ్యముగా కనబడును. ఈ రెండు రకములుగా వ్యాధి యున్నప్పుడు పైచెప్పిన రెండువిధములైన చిహ్నములుండును. దీనికి చికిత్సగా నోటిద్వారాగాని, పెరంటరల్ (ఇంజెక్షన్) ద్వారాగాని తయమిన్ ఇయ్యవలెను.

తయమిన్ లోపించుటవలననే గుండెకు బెరిబెరి యను వాపు తగులును. దీనివలన గుండె పెరిగి పెద్దదగును; నాడి వడిగా కొట్టుకొనును; శ్వాసావరోధము ఉండును. గుండెయున్న ప్రాంతములో నొప్పియుండును. రోగి నీలముగామారి, రక్తనాళములలో నెక్కువరక్తపు ఒత్తిడియుండును. గుండె బలహీనత ఎక్కువగనుండనియెడల, తయమిన్ ఇచ్చుటవలన ఈ వ్యాధి ఆశ్చర్యముగా బాగుకాగలదు.

**త్రాగుబోతులకువచ్చు పాలిన్యూరైటిస్ (అనేకనరములు కందుట).**— దేహమునకు అవసరమైన ఆహారపదార్థములకు బదులు ఆల్కహాలిక్ మద్యపానీయము లిచ్చుటవలన ఈ స్థితి యేర్పడును. దీని చిహ్నములు

[1] Ascites. [2] Hydrothorax. [3] Heart failure.



బెరిబెరి వ్యాధిచిహ్నములేగాన, ఆ వ్యాధికి చేసెడి చికిత్సయే దీనికిని చేయవలెను.

గర్భము ధరించినకాలమున వచ్చెడు పాలిన్యూరైటిస్:—ఇది యొక విధమైన వ్యాధి స్థితి. గర్భము ధరించినకాలములో మితిమీరి వాంతులగుటవలన, దేహమునందు లోపమేర్పడి; బెరిబెరి సంబంధమైన స్థితి యేర్పడును. వాంతులు మితిమీరి యగునప్పుడు ఆహారపోషణ సరిగా నుండదను సంగతి చాల ప్రాముఖ్యముగా గ్రహించవలెను. మెటాబొలిజమ్ హెచ్చినందువలన, తల్లికిని పిండమునకును కావలసిన హెచ్చు ఆహారమును క్రమముగాను, చాలినంతయు నిచ్చుట చాల ప్రాముఖ్యమైన సంగతి. ఈ సంర్భములో ఇంజెక్షన్ మూలముననైనను ఆహారము నెక్కించవలెను. తల్లి దేహమునుండి పోయెడు, ద్రవములకు లవణములకు బదులుగా, చర్మముక్రిందగాని, నాళములలోనికిగాని సేలైను నెక్కించవలెను. నోటిద్వారా కేసిన్ (పాలలోని ప్రోటీన్ పదార్థము) కాలేయము నిచ్చుటవలనను, బ్లడ్‌ట్రాన్స్‌ఫ్యూషన్ ఇచ్చుటవలనను మాంసకృత్తులు తిరిగి చేకూరుకొనును. నష్టమైపోయిన పిండిపదార్థములకు బదులు 5% గ్లూకోస్ సొల్యూషను నియ్యవలెను. వివిధమైన విటమినులును ఇతర పదార్థములునుగూడ ఇయ్యవలెను.

[1]హైపర్ థైరాయిడిజమ్‌లోనలె [2]బేసల్ మెటాబొలిజమ్ హెచ్చుగా నున్న స్థితులలో తయమిన్ నిచ్చుట చాల సహాయకరముగా నుండునని తలంచి, శస్త్రచికిత్సకు ముందు ఉపయోగించుచున్నారు.

అతిసారపు స్థితి చాలకాలమునుండి ముమ్మరముగా నున్నయెడల, అనేక ఆహారపదార్థములు జీర్ణముకాకయే నష్టమైపోవునని తలంచుట కారణ సహితమైయుండును. ఈ స్థితిలో విటమినులు సహాయకరముగా నుండుటకు వానిని ఇంజెక్షనుద్వారా ఇచ్చుట మంచిది.

విటమిన్ $B_2$ లేక $G_1$ తక్కువగుటయు, వానికి చికిత్సయు:—

విటమిన్ $B_2$ యొక్క ధాతువులలో నొకటియగు [3]రైబొఫ్లేవిన్ అనునది తక్కువైనట్లయిన రెండు వ్యాధి స్థితులేర్పడును. ఒకటి [4]కైలైటిస్ అను స్థితి. దీనిలో పెదవులు పొక్కును. మొదట అవి మెత్తనగును;

[1] Hyperthyroidism. [2] Basal metabolism. [3] Riboflavin. [4] Cheilitis.

పైతోలు లేచిపోవును. పిమ్మట పుండ్లగును. వీని ఫలితముగా పగుళ్లు, కొన్నిసారులు, ఎల్లకాలముండు మచ్చలుపడును. ముక్కుచుట్టును, చెవులు మీదను నూనెతోగూడిన పొలుసులుండును. దీనివలన ఒకటిగాక, పెక్కు ధాతుపదార్థములు తక్కువైనవని గ్రహించవచ్చును. ఎందుకనగా, $B_6$. విటమిన్‌వలన ఈ వ్యాధి కుదురును. రెండవది, కంటిబాధ. దీని ఫలితముగా కాచబింబముమీద తెరవేసినట్టు కనబడును. ఈ రెంటికి రైబొఫ్లేవిన్ యిచ్చుటవలన బాగుకాగలవు. కనురెప్పల లోపలి పొర కందుట కంటివ్యాధులకును, [1]పెంఫిగస్, [2]బట్ట తల మొదలగు చర్మవ్యాధులకును పై చెప్పిన విటమినును వాడుదురు. విటమిన్ $B_2$ లోని రెండవ భాగము నికోటినిక్ ఆసిడ్ అనునది. 1922-వ సం॥ గోల్డ్‌బర్గెర్ అనునతడును అతనితోడి పనివారును పెల్లగ్ర అను వ్యాధి ఏవో కొన్ని ధాతువులు లోపించుటవలన కలుగుచున్నదనియు, ఆ ధాతువులలో ముఖ్యమైనది [3]నికోటినిక్ ఆసిడ్ అనియు నిర్ధారణచేసిరి. ఇది కొంత సత్యమే యైనను, ఇప్పుడు పెక్కు ధాతువులు లోపించుట మూలమున, ఈ వ్యాధి కలుగుచున్నదని తెలిసినది.

పెల్లగ్ర అనునది బెరిబెరితో సంబంధించి తరుచుగా వచ్చుటవలన దీని లక్షణముల నిక్కడ క్లుప్తముగా పేర్కొందుము. జీర్ణావయవముల తొందరలు కొన్ని యుండును; నాలుక, నోరు, అమత్వచ—ఇవి తరుచుగా పూసి, పుండగును. రోగికి ఆకలి కొద్దిగానుండును. డోకు, వాంతి, కడుపునందు నొప్పి, కొన్నిసారులు అతి విరేచనములు నుండును. నరములు, మనోసంబంధమైన అవలక్షణములు హెచ్చుకొలది, రోగి బరువునందును, బలమునందును క్రమేణ తగ్గుచుండును. చర్మము మొదట జిలపుట్టి, తరువాత పగిలి, పుండై, ఆఖరికి రక్తము కారును. జాఠరీయరసము స్రవించుట సంపూర్ణముగా నిలిచిపోవుట మామూలు. దీనికి చికిత్సగా, నికోటినిక్ ఆసిడ్ తదితర B కాంప్లెక్స్ ధాతువులు, వీనితో A, C విటమినులను చేర్చి యిచ్చినయెడల, వ్యాధి దీర్ఘకాలమునుండి యున్నది గాకపోయిన, నది సంపూర్ణముగా కుదురును. పెల్లెగ్ర అను వ్యాధి ముమ్మరముగా నుండెనేని దినమునకు 500 mg. మోతాదుల మందును చిన్న ప్రమాణములుగా భాగించి, ఒకవారమువరకు ఇచ్చి, పిమ్మట తగ్గించవలెను.

[1] Pemphigus. [2] Baldness. [3] Nicotinic Acid.



దీనిని ఇంజెక్షన్ మూలమునగాని, నోటిమూలమునగాని ఇయ్యవచ్చును. రోగికి ముమ్మరముగా డోకు, వాంతి, అతిసారము మొదలైనవి యున్నప్పుడు ఇట్లు చేయుట ఆవసరము. వ్యాధి ఒకసారి కుదిరినతరువాత, రోగికి తగిన యాహారము నేది నియ్యవలెనో తీర్మానించవలెను.

[1]స్ప్రు (గ్రహిణి):—ఇది జీర్ణావయవముల మార్గమునంతట తగిలెడు ఒక విధమైన దీర్ఘకాలపు వ్యాధి. ఈ వ్యాధి ఇండియా, సిలోను, చీనాదేశములలో సాధారణముగానుండును. అక్కడి దేశప్రజలకంటె, ఇక్కడి యూరోపియనులకు ఇది యెక్కువగ తగులును. తరుచుగ ఇది క్రానిక్ డిసెంటరి (దీర్ఘకాలపు రక్తవిరేచనములు) అను వ్యాధికి తరువాతవచ్చును. ఈ వ్యాధి ఫంగస్ (కుక్కగొడుగు) అను ఉద్భిజ్జమువలన కలుగుచున్నదని మొదట తలంచిరి. ఈ దినములలో ఇది విటమినుల లోపమువలన కలిగిన వ్యాధియనియు అపాయకరమైన రక్తహీనతకు (పర్నిషస్ అనీమియ)కు సంబంధించినదనియు పెక్కుమంది గ్రహించియున్నారు. ఇది మాంసము, [2]కాడి, గ్రుడ్లు—వీనిలో లభించెడు విటమిన్ $B_2$ తో సంబంధించియున్నది. ఆరంభమున నిది నిదానముగా వచ్చునుగాని తరుచుగా నిది తిరిగితిరిగి వచ్చుచుండును.

దీని ముఖ్యలక్షణము లేవనగా: — జీర్ణసంబంధమైన తొందరలు, నాలుకపూత పూయుట, కడుపు ఉబ్బుట, రక్తహీనత, ఉదయముననే పాండువర్ణమున, నురుగుగల పెద్ద భేదులు (అతి విరేచనములు) అగుట. దీనివలన రోగి బలహీనుడగును; కృశించును; విసుగు, అధైర్యము కలుగును. తుదకు పోషణ లేక చనిపోవచ్చును.

**చికిత్స**:—రోగిని పడకలోనే పరుండనియ్యవలెను. అతనికిచ్చెడు పథ్యము చాల ప్రాముఖ్యమైనది. రోగి యాహారమునందు క్రొవ్వు పదార్థము లుండరాదు; పిండిపదార్థములు తక్కువగానుండవలెను. తరగిన గొడ్డు పచ్చిమాంసము, తరచినపాలు, ఆరెంజిపండ్ల రసము, జలటిన్—వీనిని ధారాళముగా నియ్యవచ్చును. కొన్ని తాజాపండ్లును నియ్యవచ్చును. ప్రతిసారి యాహారము భుజించినమీదట రోగి నోటిని శుభ్రము చేయవలెను. రక్తహీనతను ఎదుర్కొనుటకు కాలేయమును వివిధరకము

[1] Sprue. [2] Yeast.

లుగా తయారుచేసి యియ్యవచ్చును. [1]రక్తము నెక్కించుటకూడ చాల విలువైన చికిత్సయగును. చర్మముక్రింద సూదిమూలమున, తయమిన్ నియ్యవచ్చును.

[2]పర్నిషస్ అనీమియ (అపాయకరమైన రక్తహీనత) కును, [3]మల్టిపుల్ స్క్లెరోసిస్, [4]సయాటిక, [5]ఆర్‌త్రైటిస్ (సంధివాతము), నరముల సంబంధమైన చెవుడుకును తయమిన్ నీయవచ్చును.

విటమిన్ C లోపించుటవలన గలుగు వ్యాధులును వాని చికిత్సయు:—

తల్లిపాలుత్రాగు బిడ్డలకంటె పోతపాలుత్రాగు బిడ్డలలో [6]స్కర్వి యను వ్యాధి తరుచుగా నుండును. స్కర్వి యను వ్యాధిగల బిడ్డలు విపరీతముగా పరుండుదురు. కాళ్లు ముడుచుకొని, వెడల్పుగా తెరచుకొని పరుండుదురు. ఎముకలమీద కప్పుకొనియుండు పొర (అస్థిత్వచ) క్రింద రక్తస్రావమువలన పుట్టు ముమ్మరమైన నొప్పివలన నీ తీరున బిడ్డలు పరుండవచ్చును. బిడ్డను ఏమాత్రము కదిలించినను, ఎత్తినను, పడకను కదిలించినను బిడ్డకు గొప్పనొప్పి పుట్టి యేడ్చును. చిగుళ్లువాచి మెత్తగానుండును. ఏ అమత్వచనుండియైనను రక్తము కారవచ్చును. ఈ వ్యాధితోబాటు రక్తహీనతకూడ కనబడును. హిమొగ్లోబిన్ ఉండవలసిన దానికంటె నూటికి 30—40 తక్కువగానుండును.

పెద్దవారికి ఈ వ్యాధి యున్నయెడల, ఏ అమత్వచనుండియైనను తుదకు కండరములోనికి, చర్మములోనికి రక్తము కారుట, రక్తముతోగూడిన అతి విరేచనములు, వీనితో బాటు అనీమియ మొదలైనవి ఈ వ్యాధి యొక్క సాధారణ లక్షణములుగా కనబడును. పెద్దవారికి ఎముకలమీద కప్పబడిన పొర (అస్థిత్వచ) క్రిందనుండి రక్తము కారదు. పెద్దవారియందేమి, పిల్లలయందేమి రక్తములోను [7]ఏస్కార్బిక్ ఆసిడ్ మట్టము చాల తక్కువగా నుండును. ఏస్కార్బిక్ ఆసిడ్‌తో ఈ వ్యాధికి చికిత్స చేసినయెడల, మంచి ఫలితము కలుగును. జఠరరసములో చాలినంత హైడ్రోక్లోరిక్ ఆసిడ్ లేనప్పుడు ఏస్కార్బిక్ ఆసిడ్ అంతయు త్వరగా పీల్చబడక పోవుటచేత, నష్టమగుచున్నది. దీర్ఘకాలమునుండి ముమ్మరమైన అతివిరేచనము లున్నప్పుడు కూడ ఇటులనే జరుగును. పెప్టిక్ అల్సర్

[1] Blood transfusions. [2] Pernicious anemia. [3] Multiple sclerosis. [4] Sciatica. [5] Arthritis. [6] Scurvy. [7] Ascorbic acid level.



(ఆమవ్రణము) అను పుండునకు చికిత్సగా, తక్కువ ఏస్కార్బిక్ ఆసిడ్ ఉన్నందున ఆరెంజిపండ్ల రసమును రోగి పథ్యముతో చేర్చి యిచ్చుట యిప్పుడు వాడుకయైనది. క్షయ, [1]ఆస్టియోమయెలైటిస్ అను అంటువ్యాధులకు విరుగుడుగాను చికిత్సగాను ఈ విటమినుల నిచ్చినయెడల ఈ వ్యాధులను నిరోధించు శక్తి హెచ్చును. [2]రూమటాయిడ్ ఆర్‌త్రైటిస్ (సంధివాతము), [3]రూమాటిక్ ఫీవర్ (వాతజ్వరము) [4]అక్నివల్గారిస్ (ముఖముమీది ఒకవిధమైన చిన్నమొటిమ), సాధారణమైన జలుబు, [5]క్రానిక్ సైనసైటిస్ అన్నిరకములైన [6]ఆలెర్జి, మొదలగు వానికిని, శస్త్రగాయములు మాన్పుటకును దీనిని చికిత్సగా నుపయోగింతురు. ఈ వ్యాధిస్థితులు ఏస్కార్బిక్ ఆసిడ్ దేహములో లోపించుటవలన గలిగినప్పుడు, ఈ విటమిను ఉపచరించును. ఏస్కార్బిక్ ఆసిడ్‌ను నోటిద్వారా యియ్య లేనప్పుడు [7]సూదిద్వారా ఇయ్యవలెను.

విటమిన్ D తక్కువగుటవలన గలుగు వ్యాధులు, వాని చికిత్సలు:—

విటమిన్ D తగ్గుటవలన రికెట్స్ అను వ్యాధి పిల్లలలో సంభవించును. దీనివలన పొడుగు యెముకలలోని పెరుగుచున్న భాగములు విస్తరించి, కురూప మేర్పడుటయు, [8]కాండము చివరన వంకర టింకరలు తిరుగుటయు, లేదా ఎముక అసలే పెరుగుట నిలిచిపోవుటయు సంభవించును. ఇట్టి వికృతములు ప్రక్కటెముకలమీద నేర్పడినప్పుడు, అవి పూసల ఆకారమును బోలియుండును. బలహీనముగానున్న కాళ్లయెముకలమీద భారము హెచ్చినప్పుడు అవి విల్లువలె వంగును. పుఱ్ఱెయెముకలు తరుచుగా సన్నమగును. కడుపు ఎక్కువగ ముందుకు సాగును. రక్తములో కాల్సియమ్, భాస్వరపు మట్టము తగ్గియుండును. దీనితోపాటు రక్తహీనతయు నుండును. జీర్ణశక్తి మొత్తముమీద తగ్గిపోవును. ఈ రికెట్స్ వ్యాధి చికిత్సకై కాడ్‌లివర్ ఆయిల్‌గాని, విటమిన్ D పుష్కలముగానున్న [9]హాలిబట్ లివరాయిల్‌గాని, సూర్యరశ్మి కలిగినటువంటి రెడ్‌పామ్ ఆయిల్, సొరచేప నూనెగాని, రోగికియ్యవలెను. ఈ రెంటిలోను విటమిన్ A హెచ్చుగా నుండును. [10]వియాస్టరల్ అను మరియొక

[1] Osteomyelitis. [2] Rheumatoid arthritis. [3] Rheumatic fever. [4] Acne vulgaris. [5] Chronic sinusitis. [6] Allergy. [7] Parenterally. [8] Shaft. [9] Halibut liver oil. [10] Viosterol.

నూనెను సిద్ధము చేసియున్నారు. దీనిలో విటమిన్ D హెచ్చుగా నున్నది గాని, విటమిన్ A బొత్తుగా లేదు. ఒక్కొక్క బొట్టులో 222 యూనిటుల విటమిన్ D యున్నది. రికెట్స్ చికిత్సకు దినమునకు 10,000–20,000 యూనిటులు అవసరము. గర్భిణీ స్త్రీలు బయట తిరుగనందునను, సూర్యరశ్మి తగులనందునను [1]ఆస్టియొమెలేష అను వ్యాధి కలిగినప్పుడు దానికి విటమిన్ D చికిత్స చేయుదురు.

విటమిన్ K తగ్గుటవలన గలుగు వ్యాధులును, వాని చికిత్సయు:—

విటమిన్ K తగ్గుటవలన [2]ప్రోత్రాంబిన్ లోపము గలుగును. దీని వలన రక్తము గడ్డకట్టు శక్తి తగ్గిపోవును. (గ్రహిణి) స్ప్రు అను వ్యాధిలో ప్రేగులలోనికి పోయిన ఏ పదార్థమైనను ఇమడని లోపమువలన ఈ స్థితి సంభవించును. కాలేయము క్రమముగా పనిచేయక పోవుటవలనను ప్రోత్రాంబిన్ కొద్దిగా లభించుటకు కారణము కావచ్చును. [3]సిరోసిస్, కాలేయము కందుట, [4]యెల్లో అట్రోఫి, కందుట యందలి ఇతర స్థితుల లోను, టూమర్లు వచ్చుటవలనను కాలేయపు టిష్యూలు చాలవరకు క్షీణించుటచేతను ప్రోత్రాంబిన్ తక్కువ కావచ్చును.

ఒక బిడ్డపుట్టిన తరువాత 48 నుండి 72 గంటలలోపల ప్రోత్రాంబిన్ చాలమట్టుకు తగ్గిపోవుటవలన, పుట్టిన కొన్నిదినములలోనే బిడ్డకు రక్తము కారుచుండవచ్చును. ఇట్టి స్థితికి విటమిన్ K నిచ్చిన, చక్కబడిపోవును. తల్లి ప్రసవించుటకు ముందు, ఆమెకు ప్రోత్రాంబిన్ ఇచ్చుటవలనను విటమిన్ K లోపమును బిడ్డయందు నివారించవచ్చునని కొందరి యభిప్రాయము. ఈ లోపమువలననే ప్రసవసమయమున పెక్కుసారులు మెదటిలోపల రక్తస్రావము కలుగవచ్చును. ఈ స్రావము బిడ్డపుట్టి ఒకటి లేక ఒకటిన్నరవారమునకు నిలిచిపోవును.

ఈ వ్యాధిస్థితికి ఇప్పుడు రెండు మందులున్నవి:—

1. [5]సెరోఫిల్:—ఇది లేత ఓట్, గోదుమ మొలకల పొడితో సిద్ధము చేయబడినది. దినమునకు 10—15 గ్రాములమందును భాగించి, పాలు, లేక పండ్లరసముతో చేర్చి యియ్యవలెను.

[1] Osteomalacia. [2] Prothrombin. [3] Cirrhosis. [4] Yellow atrophy. [5] Cerophyl.



2. [1]క్లాటొజన్:—దీనిని [2]ఆల్ఫాల్ఫ (ఒక విధమైనగడ్డి)తో సిద్ధము చేయుదురు. దినమునకు 1—3 గ్రాముల మోతాదు మందియ్యవలెను. 1940 సం॥ నుండి లెబొరటొరిలోనే తయారుచేసిన మందులు లభించుచున్నవి. పై రెండు మందులను తరుచుగా పైత్యరస లవణములతో చేర్చి యిచ్చుట వాడుక. ఎందుకనగా, విటమిన్ K లోపించిన రోగులలో కాలేయమునకు, పిత్తకోశమునకు సంబంధించిన యేదో ఒక వ్యాధియుండుట వలన, వారియందుండు పిత్తము రోగి పుచ్చుకొను విటమినును వినియోగించుకొనుటకు లక్ష్యము చేయదు. రక్తనాళములలోనికి సూదిమూలమున ప్రవేశపెట్టినప్పుడు త్వరగాను, ఫలప్రదాయముగను పనిచేసి ప్రోత్రాంబిన్‌ను హెచ్చింపజేసి, రక్తము శీఘ్రముగ గడ్డకట్టునట్లుచేయు మందును గనిపెట్టి దానిని పరిశీలించి, ప్రయోగించుచున్నారు. శస్త్రవైద్యమునకు ఇది యెక్కువ సహకారిగనున్నది. కాలేయములో, పిత్తమార్గమునందు వ్యాధియున్న [3]పసిరికలు (జాండిస్) గల రోగులకు శస్త్రచికిత్స చేయుచున్నప్పుడును చేసినపిమ్మటను రక్తస్రావము సంభవించెడు అపాయము దీని వలన తొలిగిపోయినది.

[4]వాహికరహితమైన గ్రంథులయొక్క వ్యాధులును, వ్యాధిస్థితులును:—

వాహికరహితమైన లేక [5]ఎండొక్రెయిన్ గ్రంథులనుగూర్చి వైద్య పరిశీలన చాల ప్రాముఖ్యమైనది. గ్రంథులమూలమున స్రవించెడు వివిధపదార్థములు దేహమంతటిమీద ఎట్లు పనిచేయుచున్నవో తెలిసికొనుటద్వారా, కొందరు రోగులకు చికిత్సచేయుట అవసరమైయుండును. మానసిక వ్యాధిగ్రస్థులకు చేయు చికిత్సవలెనే వీరికిని జాగ్రత్తగ చికిత్స చేయవలెను. ఎందుకనగా, తరుచుగా భావోద్రేకములవలన గలుగు వ్యాధులకు చికిత్సచేయుట చాల కష్టము.

[6]థైరాయిడ్ గ్రంథి (కాకళము) కి సంబంధించిన వ్యాధులు:—థైరాయిడ్ గ్రంథినుండి [7]ఐయొడీన్ (అదము) స్వీకరించబడును. దీనినుండి లభించు ఐయొడీనుగల పదార్థములు, పెరుగుటకును, మెటబాలిజమ్‌కు తోడ్పడును. ఇది యితర వాహికరహితమైన గ్రంథులమీదను పనిచేయును. ఎచ్చటనైతే నీరు, ఆహారములలో ఐయొడీను (అదము) తక్కువగునో, ఆ ప్రాంత

[1] Klotogen. [2] Alfalfa. [3] Jaundiced patients. [4] Ductless glands. [5] Endocrine. [6] Thyroid gland. [7] Iodine.

ములలో ఈ గ్రంధియం దెక్కువ వ్యాధి సహజముగానుండును. కాని యీ విపరీతస్థితులు ఏ ప్రాంతమునందైనను కనబడవచ్చును.

[1]కొలాయిడ్ గాయిటర్ (గలగండము):—ఈ స్థితిలో తైరాయిడ్ గ్రంధి (కాకళము) పెరిగి పెద్దదగును. దీనివలన శ్వాసనాళముమీద ఒత్తిడియున్నట్లు రోగి అనుభవించును. ఇంతకంటె వేరు రోగముల చిహ్నములు సాధారణముగానుండవు. [2]బేసల్ మెటాబొలిజేమ్ మామూలుగా నుండును. యౌవనదశ ముగియగనే ఈ గలగండములలో అనేకములు కనబడకుండపోవును.

చికిత్సయు, పరిచర్యయు:—[3]ఉప్పకును త్రాగెడు నీటికిని ఐయోడీను చేర్చి పుచ్చుకొనుటవలన ఈ రోగము రాకుండ చేయవచ్చును. యౌవనదశకు పెరుగుచుండు బాలికలలో ఈ గలగండములున్నట్లు చిహ్నములుండినను, లేక యిట్టి బాలికలు గర్భము ధరించినప్పుడును వారికి పై చెప్పిన చికిత్సచేయవలెను. సంవత్సరమునకు రెండుమూడు సారులైనను ఈ చికిత్సచేయవలెను.

[4]అడినోమా:—ఐయొడీను తక్కువైనందువలన గ్రంధి పెరిగి ముద్దగనగును. ఈ అడినోమాలు క్షీణించి, స్నాయువులయందు నీరు చేరును.

లక్షణములు:—మెడమీద ఒకటిగాని చాలగానిచేరి ముద్దలు, ముద్దలుగ ఏర్పడును. సాధారణముగా, దేహస్థితిని మార్చు గుర్తులేవియు నుండవు. కొన్ని సందర్భములలో మాత్రము ఈ స్థితి [5]హైపర్ తైరాయిడిజేమ్‌తో సంబంధించియుండును.

చికిత్సయు, పరిచర్యయు:—కొన్నిసారులు దీనికి తైరాయిడ్ ఎక్స్‌ట్రాక్ట్ నిచ్చెదరు. హైపర్ తైరాయిడిజేమ్‌యొక్క అపాయమును దొలగించుటకు దీనికి సాధారణముగా శస్త్రచికిత్సచేయుదురు.

[6]ఎక్సాఫ్తాల్మిక్ గాయిటర్ లేక గ్రేవ్స్ డిసీజ్:—తైరాయిడ్ స్రవించుట హెచ్చుగను విపరీతముగనుండి తైరాయిడ్ గ్రంధి పరిమాణములో విస్తరించినట్లయిన ఈ వ్యాధి యేర్పడును. నిరంతరము ఏదో ఒక పనిలో నిమగ్నులై చురుకుతనము కలిగిన యౌవనస్త్రీలకు తరుచుగా ఈ వ్యాధి కలుగును.

[1] Colloid goiter. [2] Basal metabolism. [3] Table salt. [4] Adenoma. [5] Hyperthyroidism. [6] Exophthalmic goiter or Grave's disease.



లక్షణములు:—తైరాయిడ్ గ్రంధి పెరిగి పెద్దదగుట, పోటు హెచ్చుట, చేతులు సూక్ష్మముగా వణుకుట, గ్రుడ్లు ఉరిమినట్లు కండ్లు విస్తరించియుండుట, ఎక్కువ ఆయాసము, అలసట, గుండెదడ, మితిమీరి చెమటపోయుట ఈ వ్యాధిలక్షణములు. ఆకలి యెక్కువైనను రోగి బరువు తగ్గును. రోగికి ఆయాసము, విపరీతమైన కోపముండును. కొన్నిసార్లు [1]బేసల్ మెటాబొలిజేమ్ 25-125% మామూలుకంటె పైన హెచ్చును. చాల అపాయకరమైనట్టియు సాధారణమైనట్టియు ఈ వ్యాధిలక్షణమేదనగా, గుండెయొక్క కండరము క్షీణించుటయే. ఈ వ్యాధి అనేక సంవత్సరములుండునుగాని, జాగ్రత్తతో చికిత్స చేసినయెడల, రోగులు చాలవరకు బాగుపడవచ్చును. శస్త్రచికిత్సవలన మరి తృప్తికరమైన ఫలితములు కనబడును. 29-వ అధ్యాయము చూడుము.

చికిత్సయు, పరిచర్యయు:—చాలకాలము శరీరవిశ్రాంతియు, మనోవిశ్రాంతియు రోగికి అవసరమై యుండును. మామూలుకంటె రెండింతలు ఉష్ణగుణమున్న ఆహారము ధారాళముగా నిచ్చినయెడల, శరీరముయొక్క బరువు తగ్గక నిలకడగనుండును. ఉపశాంతిని గలిగించు మందులును, [2]హైడ్రోతెరపి (జలచికిత్స) యు నుపయోగించిన, రోగికి విశ్రాంతియు, నెమ్మదియు కలుగును. మనోభారమునకు ఏదైన కారణమున్నయెడల, దానిని తొలగించవలెను. రోగికి విశ్రాంతియు, ఐయొడీన్ చికిత్సయు నిచ్చిన తరువాత గ్రంధిని శస్త్రముచేసి తీసివేయవలెను.

[3]మిక్సెడీమ:—40 సంవత్సరములకు పైబడిన స్త్రీలలో తైరాయిడ్ స్రావము తగ్గుటయో, బొత్తుగా లేకుండుటయో తరుచుగా సంభవించును. ఈ వ్యాధి ముమ్మరముగావచ్చు సామాన్యవ్యాధి కాదు. తైరాయిడ్ టిష్యూలను సంపూర్ణముగా తీసివేసినను, లేక అవే క్షీణించినను మిక్సెడీమ అను వ్యాధి సంభవించును.

లక్షణములు:—ఈ వ్యాధి లక్షణములు క్రమక్రమముగా కనబడును. ఆకలి తగ్గునుగాని, దేహముయొక్క బరువు హెచ్చును. శరీరమునందు జరుగవలసిన ప్రతిక్రియలన్నియు (రియాక్షన్స్) మెల్లగను, ఆలస్యముగను జరిగినట్టుండును. చర్మము లావుగను, ఎండియునుండును. వెండ్రుకలు

[1] Basal metabolism. [2] Hydrotherapy. [3] Myxedema.

ఊడిపోయి కొద్దిగానుండును. ముఖము మొద్దుగా కనబడును. సాధారణముగా రోగి చలనము లేకయుండును. బేసల్ మెటాబొలిజమ్ మామూలుకంటె 40% తక్కువగును. వ్యాధి ముదిరినకొలది రోగి కేవలము బుద్ధి మాంద్యము గలవాడగును. ఇట్టిస్థితికి థైరాయిడ్ ఎక్స్‌ట్రాక్ట్ సిద్ధౌషధము.

[1]క్రెటినిజమ్:—ఈ వ్యాధి శిశువునందుగాని, పిండమునందుగాని యారంభమగును. థైరాయిడ్ స్రావము లేకుండుటయో, ఇతర గ్రంధుల చేరికయో ఈ వ్యాధికి కారణములు. గలగండమున్న ప్రాంతములలో ఈ వ్యాధి వంశపారంపర్యముగా వచ్చినను రావచ్చును.

లక్షణములు:—శరీరమునందును, మనస్సునందును బిడ్డ వృద్ధిపొందకయు, పెరుగకయు నుండును. లేతవయస్సులోనే చర్మము లావుకా వచ్చును. ముఖము మొద్దుబారి వర్చస్సు మోటుగాను, పొంగినట్టును గన్పించును. మనోవృద్ధియు, శరీరవృద్ధియు మందగించును. కడుపు ముందుకు వచ్చును. జననేంద్రియములు పెరుగకయుండును.

చికిత్సయు, పరిచర్యయు:—అసలు వ్యాధి రాకుండ చేయు పద్ధతులను గమనించుట ప్రాముఖ్యము. గర్భిణి స్త్రీలకు గలగండములున్న ప్రాంతమున ఐయొడీన్‌తో చికిత్స చేయవలెను. పసితనమునుండియే థైరాయిడ్ ఎక్స్‌ట్రాక్ట్ యిచ్చుటకు ఆరంభించి, జీవితకాలమంతయు నియ్యవలెను.

[2]పెరాథైరాయిడ్ గ్రంధులవ్యాధి—ఈ గ్రంధులు సాధారణముగ నాలుగు లేచును. ఒక్కొక్కటి చిక్కుడుగింజంత పరిమాణమున థైరాయిడ్ గ్రంధులవెనుక లేచును. ఈ పెరాథైరాయిడ్ గ్రంధులమూలమున పెరథార్మోన్ యను పదార్థము స్రవించును. ఈ పదార్థము రక్తములోను, మూత్రములోను గల కాల్సియమ్ తక్కువగాకుండ కాపాడును.

[3]హైపొపెరథైరాయిడిజమ్:—పెరథైరాయిడ్ గ్రంధులు తక్కువగా నుండినప్పుడు టెటని యను వ్యాధియేర్పడును.

లక్షణములు:—మోచేతులు, మణికట్లు, వ్రేళ్లకండరములు ముడుచుకొనుటవలన, దేహములో ఒకవిధమైన తిమ్మిరి, వణకుపుట్టును. పాదముల వ్రేళ్లు ముడుచుకొనును, పాదములు విల్లువలె వంగును. ఇట్లే యితర కండరములు ముడుచుకొని, తుదకు ఈడ్పులు రావచ్చును. పెరుగుచున్న వయస్సులో టెటనియున్నయెడల, రోగియొక్క పండ్లు బలహీనముగా నుండును; ఎముకలు సరిగా పెరుగవు; రక్తములో కాల్సియమ్ తక్కువగానుండును.

[1] Cretinism. [2] Parathyroid glands. [3] Hypoparathyroidism.



చికిత్సయు, పరిచర్యయు:—దీనికి కారణము కనుగొని తొలగించవలెను. టెటని యేవిధముగానున్నను, ఆసిడ్ కలుగజేయు లవణములను వాడుదురు. ఆహారముతో పాలను జేర్చియిచ్చుట ముఖ్యము; కాల్సియమ్ లాక్టేట్ లేక గ్లూకొనేట్ ఇచ్చినయెడల, చాల మంచి ఫలితము కలుగును. పెరథైరాయిడ్ ఎక్స్‌ట్రాక్ట్ నిచ్చినయెడల, వ్యాధి లక్షణములు త్వరలో నంతరించును. విటమిన్ D తో అల్ట్రవైయొలెట్ రేస్ చికిత్స చేయించినయెడల మరి సహాయకరముగా నుండును. ఎక్కువ మాంసకృత్తులున్న ఆహారము రోగికియ్యకూడదు.

[1]హైపర్‌పెరథైరాయిడ్‌జమ్:—పెరథైరాయిడ్ గ్రంధులమీద ట్యూమర్స్ లేచినయెడల రక్తములో నధికముగా కాల్సియముండునుగాని, ఎముకల టిష్యూలలో లేకుండును. అందువలన నెముకలు పెళుసై, సులభముగా విరుగును.

లక్షణములు:—బలహీనత, ఆకలిలేకపోవుట, డోకు ఉండును. దేహమునందెట్టి కదిలికలున్నను నొప్పితో గూడియుండును. మూత్రమార్గమున కొన్ని తొందరలుండును. అవి యెవ్వియనగా, ఎక్కువ కాల్సియము స్రావము, మూత్రపిండములలో రాళ్లుండుట, దీర్ఘకాలము మూత్రపిండములుకందుట మొదలైనవి. పెరథైరాయిడ్ గ్రంధులను కొన్నిటిని శస్త్రముచేసి తీసివేయుటయే సరియైన చికిత్స. వీనిని తీసివేసినతరువాత ఎముకలు బలమును, బరువునుగలవగును; నొప్పి, బలహీనత కనబడకుండపోవును. ఆపరేషన్ అయినతరువాత ఎక్కువ కాల్సియమ్, ఫాస్ఫరస్ కలిసియున్న ఆహారము నియ్యవలెను. చికిత్సచేయనియెడల, వ్యాధి క్రమేణ హెచ్చి, ఎముకలు సాధారణముగా విరుగుచుండును. మూత్రపిండముల పనియొక్క లోపమువలన సాధారణముగా మరణము సంభవించును.

[1] Hyperparathyroidism.

[1]పిట్యూవాయిటరి గ్రంథి (పోషణికా గ్రంథి) యొక్క వ్యాధులు:—పిట్యూవాయిటరి బాడీయనునది యొక చెర్రిపండంత చిన్న గ్రంథి. ఇది కండ్ల వెనుక స్ఫీనాయిడ్ ఎముకలో నుండును. దేహాము పెరుగుట, పోషణ, పునరుత్పత్తి యీ పనులకు అనుకూలించు పెక్కుస్రావములు ఈ గ్రంథి మూలమున స్రవించును. వెనుకభాగమునుండి తీసిన రసికి పిట్యూవాయిట్రిన్ అని పేరు. ఈ గ్రంథియందుగాని, దాని పనులయందుగాని యే లోపము కలిగినను, పెక్కు వ్యాధిస్థితు లేర్పడును. సాధారణమైన వాటినే ఈ క్రింద పేర్కొనుచున్నాము:—

[2]అతికాయము, అక్రోమెగలి—ఈ స్థితులలో గ్రంథియందు తొందరలు కలుగును. ముఖ్యముగా గుల్మములులేచి దేహామంతయు విపరీతముగా పెరుగునట్లు చేయును. దీనికే అతికాయమందురు. ఇది శరీరము పెరుగుకాలముననే సంభవించును. అక్రోమెగలియనగా, కాళ్లు చేతులు పెద్దవగుట; ముక్కు వెడల్పగును. ముఖవైఖరి మొద్దుబారి యుండును. దవుడయు, చెంపయందలి యెముకలును పెరిగి పెద్దవగును; నాలుక దళసరియగును. కావున మాటలుదొర్లినట్లు తడబడచుండును. ఆకలి దప్పులు అధికమగును. బేసల్ మెటాబాలిజమ్ క్రమముకూడ సాధారణముగా హెచ్చియుండును. జననేంద్రియ వ్యాపారము ఆగిపోవును. ఒత్తిడివలన తలనొప్పిపుట్టి దృష్టికి అపాయము కలుగవచ్చును. కొన్ని సమయములలో ఈ వ్యాధికి ఎక్సరే చికిత్సచేయగా మంచి ఫలితము కనబడినది. శస్త్రముకూడ చేయవచ్చునుగాని, యది కష్టమైనపని.

మరుగుజ్జుతనము—[3]హార్మోనులలో ఏదైన నొకదానినుండి స్రావము లోపించుటవలన మరుగుజ్జుతనము సంభవించును. శరీర, మనోవృద్ధులు నిలిచిపోయి, తలలో నీరు చేరును. దృష్టిమాంద్యముండును; ముసలితన మేర్పడినట్టు ముఖము కనబడును. శరీరము స్థూలమై దాహాము హెచ్చును. దీనికి శస్త్రమే సరియైన చికిత్సగాని, చాల కష్టమైనది.

[4]సుప్రరీనల్ గ్రంథుల వ్యాధులు:—ఈ గ్రంథులు మూత్రపిండములదగ్గర నున్నవి. ఈ గ్రంథుల [5]మెడల్లా (అనగా లోపలిభాగము) నుండి [6]ఆడ్రెనలిన్‌ను, [7]కార్టెక్స్ (అనగా పైభాగము) అను దానినుండి

[1]Pituitary gland. [2]Gigantism and Acromegally. [3]Hormones. [4]Suprarenal. [5]Medulla. [6]Adrenalin. [7]Cortex.



కార్టిన్‌ను వేరుచేసి తీయుచున్నారు. ఈ గ్రంథులు ప్రాణమునకు ప్రాముఖ్యమైనవి. వీనిని తీసివేసినయెడల కొన్ని గంటలలోగాని, మూడు దినములలోపలగాని మరణము సంభవించును.

[2]ఆడిసన్స్ వ్యాధి:—ఆడిసన్స్‌వ్యాధియను నది తరుచుగా [3]సుప్రరీనల్ గ్రంథులకు సంభవించును. కావున నా గ్రంథులు క్షీణించిపోవును. కాని యీ వ్యాధి సాధారణమైనదికాదు. క్షయవలనను ఈ స్థితి యేర్పడవచ్చును. ఇది సాధారణముగా మధ్య వయస్సులో రావచ్చును.

లక్షణములు:—రోగి మిక్కిలి బలహీనముగానుండును. ఇది సాధారణముగా శ్వాసనాళము పైభాగము కందుటవలన వచ్చును. చర్మమునకును, నోటియొక్క అమత్వచకును రంగు చుక్క లేర్పడును. ముఖ్యముగా బైటకనబడు భాగములందిట్లు కలుగును. రోగికి ఆకలిలేమి, డోకు, వాంతి, తూనికతగ్గుట మొదలగునవి యుండును. రక్తపోటు తగ్గును; నాడి బలహీనముగా కొట్టుకొనును; తలతిరుగుట, స్మారకముతప్పుట ఉండవచ్చును. చలిపుట్టినట్టు రోగి అనుభవించును. ఈ వ్యాధి వృద్ధిపొంది, తగిన చికిత్సలేనియెడల, తరుచుగా రెండు మూడు సంవత్సరములలో రోగి చనిపోవచ్చును.

చికిత్సయు, పరిచర్యయు:—క్షయవ్యాధికి చేయు చికిత్సయే దీనికిని చేయవలెనుగాని, రోగికి విశ్రాంతికలుగునట్టును, చలిగాలి తగలకుండనుండునట్టును చూడవలెను. చర్మముక్రిందగాని, రక్తనాళములలోనికిగాని కార్టిన్ ఇంజెక్షన్ ఇచ్చినయెడల, రోగము నివారణయగును.

దేహామునకు చెమ్మకలిగించుటకు ద్రవములను చర్మము క్రిందుగాగాని, రక్తనాళములలోనికిగాని యెక్కించవలెను. దేహాముయొక్క తూనిక తగ్గకయుండునట్లు, మంచి యాహారమునిచ్చుట అవసరము. [4]కార్టికల్ హార్మోన్ యను మందును తగిన పరిమాణములుగా, సరియైన వేళలయందు ఇచ్చినయెడల, మంచి ఫలితము లేర్పడును.

[5]థైమస్ గ్రంథి (తిలకము) యొక్క స్థితులు:—ఉరంఫలకము ([6]స్టర్నమ్) క్రింద శోషవాహికల (లింఫాటిక్ టిష్యూల) కూడికకు థైమస్ (తిలకము) అని పేరు. రజస్వలయగువరకు ఇది పరిమాణములో పెరుగుచు, అప్పటి

[1]Cortin. [2]Addison's disease [3]Suprarenal glands. [4]Cortical hormone. [5]Thymus. [6]Sternum.

నుండి నిదానముగా తగ్గిపోవుచు, తుదకు దాని జాడలుమాత్రము నిలుచును. ఈ థైమస్ అనునది [1]కాల్సియం మెటాబొలిజమ్‌ను తయారుచేయుటకును, దేహము పెరుగుటకును తోడ్పడుచున్నదని శాస్త్రపరిశోధనవలన తెలిసినది. ఈ థైమస్ అప్పుడప్పుడు పిల్లలయందు పెరిగి, శ్వాసమార్గమున ఒత్తిడి కలిగించుటవలన శ్వాసావరోధము కలుగును. దీనికి ఎక్స్‌రేచికిత్స చేయవలెను.

మెటాబొలిజమ్‌యొక్క వ్యాధులు

డయబీటీస్ మెల్లిటస్ (మధుమేహము) అతి మూత్రవ్యాధి. దేహస్థితిని బట్టి కలుగు వ్యాధి. ఇది వంశ పారంపర్యముగానైనను రావచ్చును. దీని ముఖ్యలక్షణము కార్బొహైడ్రేట్ మెటాబొలిజంలో తొందరకలుగుట. ఎందుకనగా, వృక్కకమునందు [2]లాంగర్‌హాన్స్ అను ఒక టిష్యూ, దేహమునందలి టిష్యూలు గ్లూకోస్ ప్రయోగమునకు కావలసిన [3]ఇన్‌సులిన్ తయారుచేయకపోవుటవలన కలుగును. ఏదైన తొందరయున్నప్పుడు గ్లూకోసు ఉపయోగపరచబడనందున, అది రక్తములో నధికముగా నిలిచిపోవును. ఇట్లు అధికమైనది, మూత్రపిండములద్వారా బయటికి విసర్జింపబడును. పిండిపదార్థముల మెటాబొలిజమ్ నందు కలుగు లోపముల (తొందరల) వలన, క్రొవ్వు, మాంసకృత్తుల మెటాబొలిజమ్‌నందును లోపములు కలుగును. తీవ్రమైన అంటురోగములును, ఇన్‌ఫెక్షన్ కేంద్రస్థానములును, నరములకును, మనస్సునకును అదరు (షాక్) పుట్టించునంతటి గాయములును—కలుగుటవలన పై వ్యాధిస్థితి యేర్పడవచ్చును.

లక్షణములు:—ఈ వ్యాధి యారంభమున నిదానముగానుండి క్రమేణ వృద్ధియగుచు, మూత్రములో చక్కెర, గ్లైకోసురియ (అనగా మూత్రములో చెక్కెరయుండుట) యనునవి యేర్పడువరకు దీనిని గ్రహించి నిర్ధారణచేయుటకు వీలుకాదు. కొందరు రోగులు అకారణముగాను త్వరగాను బరువుతగ్గుదురు. నరముల తొందరవలన కోపము, విసుగు, క్రుంగియుండుట తదితర లక్షణములును గనపడును. మొదట కనబడు లక్షణములేవనగా, [4]అతిమూత్రము దినమునకు 3000—4000 cc. ల మూత్రము పోయుట, పలుమారు మూత్రము పోయుట, అతి దాహము, ఎక్కువ నీరుత్రాగినను నాలుక యెండి యెఱ్ఱగానుండుట మొద

[1] Calcium metabolism. [2] Langerhans. [3] Insulin. [4] Polyuria.



లైనవి. ఆకలి మితిమీరి పుట్టుటవలన రోగి మితిమీరి తినునుగాని, బరువు తగ్గుచునేయుండును. మొత్తముమీద బలహీనత హెచ్చుచుండును. సాధారణముగా [1]చర్మము దురదపుట్టుట, తీట, మలబద్ధకముండును; దృష్టి మందగించును. కండరములు నొప్పిపుట్టును; రోగికి మత్తుగానుండును. మూత్రము తెలుపు, ఆకుపచ్చ, పసుపురంగులు గలిగి, 1025—1045 వరకు అధిక స్పెసిఫిక్ గ్రావిటి గలిగియుండును—ఆహారమునుబట్టి మూత్రమునందుండు చెక్కెర పరిమాణము మారుచుండును.

సంకరవ్యాధులు:—సాధారణముగా దీనివలన [2]రాచపుండు పుట్టును. చర్మమునకు ఇతర ఇన్‌ఫెక్షన్లు కలుగవచ్చును; కాలి చేతివ్రేళ్లు లేక ఒక అవయవమంత పుండై కుళ్లిపోవచ్చును. [3]నరముల వ్యాధి, కనుబింబము మందమగుట [4](క్యాటరాక్ట్) ఇతర తీవ్రమైన అంటువ్యాధులు తగులుటకు అవకాశముండును. ఆసిడోసిస్ (దేహములో క్షారము తక్కువగు స్థితి) మూలమున గాఢమూర్ఛ కలుగవచ్చును. దీనివలన మరణమైనను కలుగవచ్చును. రక్తములో డయసిటిక్ ఆసిడ్ ఉన్నను ఆసెటోన్ ఉన్నను అతి మూత్రసంబంధమైన గాఢమూర్ఛ క్రమేణగాని, అకస్మాత్తుగాగాని కలుగవచ్చును. రోగియందు నర్సు గమనించవలసిన మొదటి లక్షణము లేవనగా—బలహీనత హెచ్చుట, దప్పి, ఆకలిలేమి, తలనొప్పి, తలతిరుగుట, డోకు, వాంతి మొదలైనవి. లక్షణములు హెచ్చుకొలది, శ్వాసయందు తీపివాసనగొట్టును. శ్వాసవేగముకూడ హెచ్చును. అనగా, త్వరత్వరగా శ్వాస విడువబడును. గాలికొరకు ఎగ ఊపిరి పీల్చును. ఇప్పుడు రోగి మత్తుగా నుండును; గాఢమూర్ఛ ఆరంభమగును. ఈ యవస్థకు విరుగుడుగా, శరీరభారముయొక్క ప్రతి కిలోగ్రామునకు రెండు యూనిటులచొప్పున, అధికపక్షము మోతాదు ఇన్‌సులిన్ అను సిద్ధౌషధమును వెంటనే యిచ్చి, మూడు గంటలయిన తరువాత పూర్తిప్రమాణము మోతాదు తిరిగి యియ్యవలెను. రోగిని వేడి కంబళ్లలోచుట్టి, కొంత కాలమైన తరువాత పురీషనాళముద్వారా, ఆహారము నెక్కించుటకుగాను ముందుగా ఎనెమ నియ్యవలెను. నాలుగు గంటల కొకసారి 1600 cc. ల వరకు ద్రవమును రోగికి నోటిద్వారాగాని, పురీషనాళముద్వారాగాని ఇయ్యవలెను. ఈ మార్గములద్వారా యిచ్చుటకు వీలుకానప్పుడు చర్మము

[1] Pruritus. [2] Carbuncle. [3] Neuralgia. [4] Cataract.

క్రిందగాని, రక్తనాళములలోనికిగాని సూదిమూలమున చాల నిదానముగా ఇంజెక్షను చేయవలెను. చురుకుదనము పుట్టించుటకుగాను [1]కాఫిన్, [2]కాంఫర్ ఇన్ ఆయిల్ అవసరమై యుండవచ్చును. [3]డిజిటాలిన్ కూడ మంచి పనిచేయును.

**సామాన్య చికిత్సయు, పరిచర్యయు:**—చికిత్స చాలవరకు పథ్యమే. రోగికి మితిమీరి తిండిపెట్టుటకంటె కొంచెము ఆకలితో నుంచుటయే మేలు. అతి మూత్రవ్యాధిగల రోగి, బాగుపడి యింటికిపోయినను, చాలకాలమువరకు మేరలేకుండ తనకుతానే చికిత్స చేసికొనవలసి యుండునుగాన, వైద్యశాలలోనే స్వయంచికిత్సయందు అతనికి కొంత తర్బీతు నియ్యవలెను. రోగియొక్క వయస్సు, అతడు చేయుపని, అతని తూనికను గమనించి, అతని యాహారమునందు అవసరమునుబట్టి తగినన్ని మాంసకృత్తులును, క్రొవ్వు పదార్థములును పిండి పదార్థములును ఉండునట్లు వీలైనంతవరకు భోజనమును క్రమపరచవలెను. సాధ్యమైనంతవరకు అతనికి అలవాటైన భోజనమును పోలియుండవలెను. మొత్తముమీద ఎన్ని కాలొరీలు (వేడిపుట్టించు పదార్థములు) అవసరమో, ముందే నిర్ణయించవలెను. ఇట్లే రోగి యాహారమునం దుండవలసిన మాంసకృత్తుల పరిమాణమునుగూడ నిర్ణయించి, మిగత ద్దానిని క్రొవ్వుపదార్థములు, పిండి పదార్థములుగా విభజించవలెను. కొన్నిదినములు ఉపవాసముండుటతో ఈ చికిత్స నారంభించవలెను. ఉపవాసకాలములో ఏదైన ఒక నియమిత కొలత ననుసరించి, మాంసకృత్తులు, క్రొవ్వు, పిండిపదార్థములు, మూత్రములో చెక్కెర లేకుండునంతవరకు పుచ్చుకొనుచుండవలెను. పిమ్మట రోగికి అవసరమైన పోషణను బేసల్ మెటాబొలిజం రేట్ ననుసరించి నిర్ణయింతురు. రోగిమూత్రములో చక్కెర లేకుండుటకు ఇన్సులిన్ అను మందునిత్తురు. ఇన్సులిన్ మోతాదును నిర్ణయించుటకు పెక్కు పద్ధతులను ప్రయత్నించిరి. సామాన్య నియమమేదనగా, దినమును కొన్ని నియమితకాలములుగా విభజించుదురు. ప్రతి నియమితకాలమునందు ఇయ్యబడిన ఆహారపరిమాణమును జాగ్రత్తగాకొలిచి, దానితోపాటు ఆ కాలమునందు రోగి విసర్జించిన మూత్రమునుకూడ పట్టి, పరీక్షించుదురు. ఈ మూత్రములోనున్న చెక్కెరనుబట్టి, ఆ సమయమునకు రోగికి

[1] Caffein. [2] Camphor in oil. [3] Digitalis.



ఎంత ఇన్సులిన్ అవసరమో నిర్ణయించబడును. ఈ నియమిత ప్రమాణముగల ఇన్సులినును ఆహారము నిచ్చుటకు 20 నిమిషములు ముందుగా నిచ్చెదరు. రోగి తన కియ్యబడిన భోజనములో కొంత తినలేకపోయినను, లేక అది మరియొకరీతిగా నష్టమైనను, ఆ సంగతి వైద్యునికి తెలుపవలెను. ఎందుకనగా, ఇచ్చిన ఇన్సులిన్ ఎక్కువైనందున రక్తములోని చెక్కెర చాల తక్కువకావచ్చును. తమ స్వంతభోజనమునే తెప్పించుకొని తిను రోగులకు, వారి భోజనపు మోతాదు చూచువరకు నర్సు ఇన్సులిన్ ఇయ్యకూడదు. ఇన్సులిన్ నిచ్చెడి విధమును, దాని మోతాదులను, మూత్రమును పరీక్షించి, ఫలితమును వ్రాయుటకు సాధ్యమైనంతవరకు రోగికి నేర్పవలయును. రోగి తన యాహారమును నియమిత కొలత ప్రకారము తినునట్లును, తన యాహారమును నియమితకాలములో నియమిత పరిమాణము ననుసరించి తినునట్లును అతనికి నేర్పవలెను. సామాన్య ఆరోగ్యసూత్రములను రోగి పాటించునట్లు చేయవలెను. అతి మూత్రవ్యాధి సంబంధమైన గాఢమూర్ఛకు ముందు కనబడు అసిడోసిస్ లక్షణములును అధిక మోతాదుగానిచ్చిన ఇన్సులిన్‌యొక్క ఫలితముగా కలుగు [1]హైపొగ్లైసీమియ అనుదాని లక్షణములును, వీని కొక్కొక్కదానికి చేయవలసిన చికిత్సయును రోగికి నేర్పవలయును.

ఇన్సులిన్ ఇచ్చిన నాలుగుగంటల తరువాత సాధారణముగా అధిక మోతాదుయొక్క లక్షణములు కనబడును. లక్షణము లేవనగా, బలహీనత, నాడి వడిగాకొట్టుకొనుట, సొమ్మసిల్లుట, వణకు, భయము, చెమటపోయుట, మానసికతొందరలు, అపస్మారకము, గాఢమూర్ఛ మొదలైనవి. హైపొగ్లైసీమియ యనుదానికి చికిత్సగా, రోగి తెలివితో నున్నయెడల నోటిద్వారా చక్కెర లేక నారంజపండ్లరసము నియ్యవచ్చును. లేక స్మృతి తిరిగివచ్చుటకు [2]అడ్రెనలిన్ క్లోరైడ్ 1 cc. ఇచ్చి, రోగికి తెలివి వచ్చినపిమ్మట, నోటిద్వారా పిండిపదార్థములు ఇయ్యవచ్చును. అట్లు కానియెడల, గ్లూకోన్‌ను రక్తనాళములలోనికి ఎక్కించవలెను. క్రొత్తగా కనిపెట్టబడిన [3]జింక్ ప్రొటమిన్ ఇన్సులిన్‌మందు, సామాన్యమైన ఇన్సులిన్‌కంటె చాల నిదానముగా దేహమునందు ఇమిడినను 24 గంటల

[1] Hypoglycemia. [2] Adrenalin chloride.
[3] Zinc protamine insulin.

కంటె నెక్కువకాలము పనిచేయును. కావున దీనిని దినమునకు ఒక్కసారి యెక్కించిన చాలును.

[1]డయబీటీస్ ఇన్‌సిప్పిడస్:—ఇది పాలియూరియ యను వ్యాధి లక్షణములుగల దీర్ఘకాలపు వ్యాధి. మూత్రము చాల పలుచని స్పెసిఫిక్ గ్రావిటి గలిగి 1,002 — 1,005 ఉండును. ఇది అసాధారణమైనను, తరుచుగా యౌవనపురుషులలో కనబడుచుండును. ఇది పుట్టుకతోనే రావచ్చును. గాయములు తగులుట, ఉద్రేకమువలన కలుగు అదురు (షాక్), తీక్షణమైన అంటురోగములు, సవామేహరోగము దీనికి కారణము కావచ్చును.

లక్షణములు:—24 గంటలలో 1,000-12,000 cc. ల పాండువర్ణముగల మూత్రము విడువబడును. దీనిలో అసాధారణమైన పదార్థములేవి యుండవు. అతిదాహము, దేహమునందు అధిక ద్రవనష్టము, చర్మము ఎండియుండుట, మలబద్ధకము దీని లక్షణములు. నిద్రలేమివలన రోగికి ఆయాసము, అలసట కలుగును.

చికిత్సయు, పరిచర్యయు:—సవామేహము కారణమైనచో దానికి చికిత్సచేయుటవలన రోగికి నెమ్మదికలుగును అప్పుడప్పుడు [2]లంబర్ పంక్చర్ చేయుటవలన దాహమును, పాలియూరియయును తగ్గును. ఆహారములో ఉప్పువస్తువులు తగ్గించివేయవలెను. [3]పిటూయిటెరి గ్రంధి వెనుకభాగమునుండి వచ్చురసమును, అనగా, [4]పిటూయిట్రిన్ తగినంత ప్రమాణములు, చర్మము క్రిందికి ఎక్కించుటవలన, దాహము తగ్గుటయేకాక, మూత్రముకూడ, దాదాపు యథాస్థితికి వచ్చును.

## అధ్యాయము 21

# కండరములకు, అస్థి పంజరమునకు సంబంధించిన వ్యాధులు

[5]ఫైబ్రొసైటిస్ అనునది కండరముల వాతము. లేక కండరములను నరములను సంబంధపరిచెడు [6](కనెక్టివ్) టిష్యూలను గప్పియుండు నారవంటి

[1] Diabetes insipidus. [2] Lumbar puncture. [3] Pituitary lobe. [4] Pituitrin. [5] Fibrositis. [6] Connective.



నరములు కందుటవలన ఈ వ్యాధి సంభవించును. ఇందువలన టిష్యూలు మందమై ఉండలుగా నేర్పడును. ఏదైన అంటువలన ఈ రీతిగా కలుగవచ్చునుగాని, గాయములు, కండరములు ఎక్కువసాగుట, చలిగాలి తగులుట, తడియుట మొదలగువాని తరువాత రావచ్చును.

లక్షణములు:—ముఖ్యలక్షణము నొప్పి—ఇది దేహములో నేదేనియొక స్థలమున అకస్మాత్తుగాగాని, క్రమేణగాని పుట్టవచ్చును. ఈ నొప్పి, యెల్లప్పుడుండవచ్చును; మొద్దుబారినట్టుగానైన నుండవచ్చును. లేక ఆ భాగమును కదిలించినప్పుడు నొప్పి అధికముగను గ్రుచ్చినట్టుగ నుండవచ్చును. ఈ నొప్పి కొన్ని గంటలు, వారములు, నెలలుకూడ నుండును. కీళ్లు బిగుసుకొనును; కండరములు అలసియుండును. సాధారణముగా మెడ కండరములకు ఇట్లు సంభవించుటవలన అది బిగుసుకొనిపోవును. దీనినే మెడపట్టుకొనుట లేక వంకర మెడ అందురు. ఇదే నడుమునకు సంభవించినప్పుడు నడుములు నొప్పి (లంబెగో) అందురు.

చికిత్సయు, పరిచర్యయు:—ఏదైన అంటుచేరియున్న స్థలములు కనుగొని, సాధ్యమైతే, వానిని తొలిగించవలెను. వ్యాధియున్న భాగమునకు విశ్రాంతినిచ్చుటయు, వేడి తగలనిచ్చుటయు అవసరము. వేడిని ప్రసరింపచేయుట, ఎలెక్ట్రిక్ కరెంట్ ద్వారా వేడిని కలిగించుట మారుమంట కలిగించుట, మర్దనచేయుట పరిచర్యలో చేయవలసిన పనులు. సేలిసిలేట్స్ ఇచ్చిన నొప్పి తగ్గును; దీర్ఘకాలము నుంచియున్న స్థితులలో పొటాసియం ఐయొడైడ్ వాడుదురు. నడుములనొప్పి యున్నప్పుడు కొన్నిసార్లు అడిహీసివ్ ప్లాస్టరు వేసి బిగింతురు.

[1]ఆర్‌త్రైటిస్ (సంధివాతము):—అనగా కీళ్లుకందుట. ఇది దీర్ఘకాలము నుంచి ఉండినదైనను అంటు సంబంధముగానైనను లేక అంటుసంబంధము కాకుండనైన నుండవచ్చును.

తీవ్రమైన (అక్యూట్) ఆర్‌త్రైటిస్:—ఈ స్థితిలో కీళ్లు అధికముగా కందియుండును. దీనితోపాటు, కీళ్లలో తరుచుగా నీరు ఎక్కువచేరును. క్షయ, సెగరోగము, స్టాఫిలోకాకస్, స్ట్రెప్టోకాకస్ అను రోగ బీజములవలనైన అంటు రోగములవలన 'అక్యూట్ ఆర్‌త్రైటిస్' కలుగును.

[1] Arthritis.

లక్షణములు:—దేహమునకు గాయము తగులుటవలన ఆర్‌త్రైటిస్ కలుగవచ్చును. లేదా, దేహమునందు అంటుచేరియున్నప్పుడు దానితోపాటు, ఈ జబ్బు ఏర్పడవచ్చును. అప్పుడిది సాధారణముగా [1]సినోవియల్ మెంబ్రేనులో ఆరంభమగును. కీళ్లయందు నొప్పి, వాపు, కందుట, కీలు గుంటలోనికి నీరుచేరుట సహజము. రోగికి చలి, ప్రమాణముగా జ్వరముండును. కీలు చాల కంది దానిలోని ద్రవము సహితము కనబడును. ఈ ద్రవములో చేరియున్న సూక్ష్మజీవులనుబట్టి, అది సీరస్ (రసి) గానో, కొంత రసి, కొంత చీముగానో, లేక సంపూర్ణము చీముగానో యుండును. చీమున్నపక్షమున శస్త్రమే తగినచికిత్స. అట్లుకాక, మామూలు గాయము తగిలి, దానికి సంబంధించిన అంటుచేరియుండక పోయినను, అవయవము విరుగకను స్థానము తప్పకయుండినను, ఆ భాగముకు విశ్రాంతి, నెమ్మది కలిగించి, వేడికాపడము లిచ్చిన చాలును. అడ్‌హీసివ్ నాడాలు అంటించుటవలన ద్రవముచేరకుండ చేయవచ్చును.

[2]కీళ్లవాత జ్వరము:—ఇది తీవ్రమైన ఆర్‌త్రైటిస్‌కు సంబంధించిన ఒక విధమైన జ్వరము. ఇది స్ట్రెప్టొకాకస్ హీమొలిటికస్ అను విషప్రాణివల్ల కలుగుచున్నది. సమశీతోష్ణమండలములలో ఈ వ్యాధి చాల తరుచుగా కలుగునుగాని, ఉష్ణమండలములలోకూడ కనబడుచుండును. ఈ వ్యాధి వలన కలుగు ఇతర సంకరవ్యాధులు సమశీతోష్ణమండలమందైనను, ఉష్ణమండలమందైనను హానికరమైనవే. ఈ వ్యాధి చిన్న పిల్లలకును, యౌవనులకును బాధ కలిగించుచుండును.

లక్షణములు:—ఆరంభదశలో ఈ వ్యాధి అకస్మాత్తుగాగాని, క్రమేణ గాని రావచ్చును. అప్పుడు జ్వరము, చలి, తలనొప్పి, గొంతురాచుట, ఒకటి లేక యెక్కువ కీళ్లలో ముమ్మరమైన నొప్పిపుట్టుట ఈ వ్యాధి యొక్క ముఖ్యలక్షణములు. సాధారణముగా మోకాళ్లు, మోచేతులు, మణికట్లు, చీలమండలములలో ఈ నొప్పి కలుగును. నొప్పులున్న కీళ్లు కంది, వాచి, చాల మృదువుగానుండుటచేత, పడకను తాకినను ప్రాణము పోవునంత బాధయుండును. జ్వరము సాధారణముగా 102°—104° F. ఉండును. దీనితోకూడ చెమట విస్తారముగాపోయును. ఈ చెమట స్వాభావికముగా ఆమ్లముగానుండును. మూత్రపరిమాణము తగ్గును.

[1] Synovial membrane. [2] Rheumatic fever.



ఈ మూత్రమునందు చాల ఆసిడ్ ఉండును. దీనిలో యూరేట్స్‌కూడ ఎక్కువగానుండును. రోగికి సాధారణముగా మలబద్ధకము ఏర్పడును. ఈ వ్యాధి ఒకటి రెండువారము లుండును. తరుచుగా మరల మరల ఈ వ్యాధి వచ్చుచుండును. ఈ సంధివాతజ్వరమువలన ముఖ్యముగా గుండె జబ్బులు కలుగుచుండును. ఈ వ్యాధివచ్చిన రోగులలో నూటికి 50 మందికి అపాయకరమైన గుండెజబ్బువచ్చినట్లు అంచనావేయబడినది. మరల మరల వచ్చుటవలన ఈ వాతము హెచ్చుచుండును.

చికిత్సయు, పరిచర్యయు:—గుండెజబ్బులు రాకుండుటకుగాను రోగి, వాతజ్వరమురాగానే పడకలోపరుండి సంపూర్ణ విశ్రాంతి తీసికొనవలెను. రోగచిహ్నములు అంతరించిన తరువాతకూడ ఆరువారములు పడకలోనే పరుండియుండి పూర్ణవిశ్రాంతి తీసికొనవలెను. టాన్సిల్స్ తీసివేయుట వలన చాలాసార్లు రోగము కుదురును. కంబళ్లలోనే రోగికి చికిత్స చేయుచు, చలిపుట్టకుండ కాపాడవలెను. పడకగుడ్డల భారము రోగికి గలుగకుండ ([1]బెడ్ క్రేడిల్) పడకచట్టము నుపయోగించుట మంచిది. రోగి తనకుతాను ఏ పనియు చేయకూడదుగాని, నర్సు బహు సున్నితముగా రోగిని కదిలించవలెను. ఎట్టి చలనముకలిగినను రోగికి అధిక నొప్పి పుట్టునని నర్సు గ్రహించి పనిచేయవలెను. వేడినీటిలో కొంచెము మెథిలేటెడ్ స్పిరిట్‌పోసి, ప్రతిదినము స్పంజ్‌స్నానము చేయించిన యెడల, రోగికి హాయిగానుండును; చెమటవాసనకూడ పోవును. జ్వరముండగా, రోగికి ద్రవాహారమును పాలు, నిమ్మరసముతోగాని టీతోగాని, కాఫీతోగాని కలిపి రుచికొరకు ఇచ్చుట మంచిది. నీళ్లు విస్తారముగా త్రాగించవలెను. నొప్పిని తగ్గించుటకు గంట కొకసారి 15–20 grs. [2]సోడియం సలిసిలేట్‌ను పెద్దప్రమాణములుగా నిచ్చుచుండవలెను. విషము కలిగించునంత పరిమాణము నిచ్చితిమని తెలిసినప్పుడు, క్రమేణ ప్రమాణమును తగ్గించుచుండవలెను. కడుపులో మంట పుట్టకుండునట్లు సలిసిలేట్‌తో [3]సోడియం బైకార్బొనేట్ సమభాగముగల ప్రమాణములుగా చేర్చి యిచ్చెదరు. సలిసిలేట్ చిన్నప్రమాణములుగ నిచ్చినయెడల ఫలితము కలుగదు. విరేచనములగునట్లు ప్రతిదినము భేదిమందు లిచ్చు

[1] Bed cradle. [2] Sodium salicylate. [3] Sodium bicarbonate.

చుందురు. నొప్పియున్న కీళ్లను [1]వింటర్ గ్రీన్ అను నూనెతో మెల్లగా మర్దనచేసి, ఉన్నిగుడ్డలతో చుట్టి, తలదిండ్లమీద పెట్టవలెను. వేడిలేక చల్లని నీటికాపడముల నియ్యవచ్చును. అవయములు చాల కదలకుండు నట్లు బద్దలువేసి కట్టవచ్చును.

[2]క్రానిక్ ఆర్త్రైటిస్:-ఇది ఇన్ఫెక్షన్ గగాని, అట్లు కాకగాని యుండ వచ్చును. ఏదో ఒక సాధారణమైన కారణముచేత ఒక గుంపు కీళ్లు కొన్ని, ఒకేవిధమైన లక్షణములుగల వ్యాధి స్థితిగలిగి యున్నయెడల, దానికి ఈ పేరుపెట్టబడును. ఇక్కడ ఒక్క రకమునుగూర్చి మాత్రము వివరించెదము. [3]రూమెటాయిడ్ ఆర్త్రైటిస్ అనునది ఒక విధమైన దీర్ఘకాలపు వ్యాధి. దీనివలన కీళ్లువాయును, బిగుసుకొని లేక పట్టుకొని పోవును. అందువలన ఆ భాగము కురూపము చెందుటయో, కీలు, ఎముక, కండరము, ఆ భాగపు చర్మము నాశనమగుటయో, లేక ఆ యవయవము కదలక యుండుటయో సంభవించును. తరుచుగా ఒకటి కంటె నెక్కువ కీళ్లు వ్యాధికి లోనగును. వీనినుండి విషము ఇతర అవ యవములకు ఎక్కుచుండును. ఏదో ఒక కేంద్రమున విషము చేరి యున్నందున ఈ వ్యాధి కలుగుచున్నదని తలంచుచున్నారు. ఈ యంటు టాన్సిల్, పండ్లు, పిత్తాశయము, ప్రేగులు—వీనిలో దేనియందైనను చేరి యుండవచ్చును. మనస్సుగాని శరీరముగాని అదరుటవలనను, అలసి పోవుటవలనను, గాయము తగులుటవలనను, తడి, చలి తగులుటవలనను, దేహస్థితి బలహీనముగా నున్నందువలనను వాని తరువాత ఇది రావచ్చును.

చికిత్సయు, పరిచర్యయు:—క్రానిక్ (దీర్ఘకాలపు) ఆర్త్రైటిస్‌కు చికి త్సగా విషముచేరియున్న కేంద్రమును సాధ్యమైనచో తొలగించవలెను. అంటుచేరియున్న పండ్లు లేక టాన్సిల్స్ వీనిని తీసివేయగనే వ్యాధి చాల వరకు బాగైనట్లు కనబడును. ఏదో ఒక విధముగా వేడిమిపట్టించుట మంచిది. వేడిమగ్నీషియం సల్ఫేట్‌తో కాపడమిచ్చుట శ్రేయస్కరము. కీళ్లదగ్గర కండరములను మర్దనచేయుటవలన, ఆ భాగము క్షీణించకుండ చేయవచ్చును. మర్దనవలన కండరము బలపడును. కొన్నిసారులు సల్ఫొనమెడ్స ఉపయోగకరము. బాధ తగ్గించుటకు 'సలిసిలేట్స' అను

[1] Wintergreen. [2] Chronic arthritis. [3] Rheumatoid arthritis.



మందు నిచ్చెదరు. పొటాసియం ఐయొడైడ్, పాషాణము, [1]వియోస్టరల్ ఇచ్చుటవలన లాభముండును. నొప్పి తగ్గించుటకు వ్యాధియున్న కీళ్లకు బద్దలువేసి కట్టుటవలన కదలకుండ బిగించవచ్చును. ఎక్కువ విటమిన్ పదార్థములున్న కూరగాయలు, పండ్లు విస్తారముగా ఆహారముగా నియ్య వలెను.

అధ్యాయము 22

# నాడీమండలముల వ్యాధులును, వ్యాధి స్థితులును

మోటర్ సెంటర్స్ (చలననాడుల కేంద్రముల) తొందర

మోటర్ పక్షవాతమనగా, చలనశక్తిపోవుట. [2]మనొప్లీజియ అను నదియు పక్షవాతమే. దీనివలన దేహమునందలి యేదైన నొక అవ యవముయొక్క చలనశక్తిపోవును. ఇది తరుచుగా న్యూరైటిస్ అను వ్యాధివలన కలుగును. ఇంకను ఇది ట్యూమర్ లేక ఇతరకష్టములు మొదటిలో చలననాడులను నడుపుచున్న భాగములో పుట్టుటవలనను కలుగ వచ్చును. [3]హెమిప్లీజియ అను పక్షవాతమువలన దేహముయొక్క ఒక పక్షముననున్న చెయ్యి, కాలు కూడ పడిపోవును. రక్తస్రావము [4]త్రంబోసిస్ (రక్తనాళములో రక్తపు గడ్డకట్టుట), [5]ఎంబోలిజం (రక్తములోని ఆ గడ్డ ప్రవాహములో కొట్టుకొనిపోవుట) అనునవి మొదటిలో ఒక ప్రక్క జరిగిన, ఎదుటిప్రక్క పడిపోవును. [6]పారప్లీజియ యనునది కాళ్లు, దేహము యొక్క క్రిందిభాగమునకు కలుగు పక్షవాతము. గాయము తగులుట, నడుముక్రిందనున్న వెన్నుపాముకు కలిగినవ్యాధి, [7]మల్టిపుల్ న్యూరైటిస్ (క్రింది అవయవములలోని అనేకనరములు కందుట) అను వ్యాధులవలన నిది కలుగును. [8]పరెసిస్ అనునది ఒక భాగమునకు చెందిన పక్షవాతము.

ఈడ్పులు:—సాధారణముగా దేహమంతటనున్న కండరములు స్వతంత్రముగా ముడుచుకొనుట, లాగుకొనుట అను వ్యాధికి ఈడ్పులు

[1] Viosterol. [2] Monoplegia. [3] Hemiplegia. [4] Thrombosis. [5] Embolism. [6] Paraplegia. [7] Multiple neuritis. [8] Paresis.

లేక ఈడ్పురోగమని పేరు. మెదటి చలననాడుల కేంద్రములను రేపుట వలన ఈ వ్యాధి కలుగును. ఈ వ్యాధికిముందు సాధారణముగా మతితప్పి పోవును. తరువాత అలసట, లేక మత్తు కలుగును. దీనికి పెక్కు కారణములున్నవి. ఈ వ్యాధి అన్ని వయస్సులలోను రావచ్చును. మెదడునకు కలుగు వ్యాధి, కాకిసోమాల, జాస్తి ఆల్కొహాల్ త్రాగుట, యురీమియ, పండ్లు మొలచుట, ప్రేగులలో పురుగులుండుట, పిల్లలలో కలుగు జాఠరీయ తొందరులు, మెదటికి సంబంధించిన రక్తహీనత—ఇవి యీడ్పులకు కారణములు కావచ్చును. గర్భముతోనున్నప్పుడు రక్తములో విషముచేరినయెడల, [1]ఎక్లాంప్షియ యను వ్యాధి కలుగును. ఒకేసారి కండరములు ముడుచుకొనుట నిజమైన ఈడ్పు. వణకు అనగా, అప్రయత్నముగ కండరములు ఒకొకప్పుడు ముడుచుకొని, యింకొకప్పుడు సళ్లుపడుచుండుట. మత్తు పదార్థములవలన కలిగిన మత్తు, అలత, ముసలితనము, కొన్ని నరముల స్థితులు, హైపర్‌తైరాయిడిజం అను వ్యాధి—ఇవియు ఈడ్పునకు కారణములు కావచ్చును.

**చిన్నపిల్లల ఈడ్పులు:** — పండ్లు కష్టముతో వచ్చుట, ప్రేగులలో పురుగులుండుట, జాఠరీయ తొందరులు—ఈ మూడు చిన్నపిల్లల ఈడ్పులకు సాధారణమైన కారణములు. ఆరంభదశలోనే అంటు తీవ్రముగా నున్నదనుటకు ఇది సూచనగా నుండును.

**లక్షణములు:**—దేహము విరామము లేక యీడ్చుకొనుచుండవచ్చును. కాళ్లు చేతులు తన్నుకొనుచు, బొటనవ్రేలుచుట్టు ఇతర వ్రేళ్లను చుట్టుకొనుచు, తలను వెనుకకో, ప్రక్కకో త్రిప్పుకొనియుండును. లేక కొంతసేపు బాగుండి తిరిగి యీడ్పు రావచ్చును. తటాలున వచ్చి నిలువక యుండవచ్చును. ఒక దీర్ఘశ్వాసవిడిచి ఊపిరి త్రిప్పుకొనలేక పోయిన, మరణము తటస్థించవచ్చును.

పన్నెండు గంటలకంటె నెక్కువకాలము ఈడ్పుండినయెడల, అపాయము జరుగును. క్రొత్తగాబుట్టిన బిడ్డలలో నిట్టి యీడ్పులు ఎల్లప్పుడు అపాయమునే సూచించును. ప్రసవకాలములో తగిలిన ఏదో ఒక గాయమువలననో, లేక పిండముగానుండినప్పుడు తల్లిమూలమున చేరిన విషమువలననో బిడ్డల కిట్టి యీడ్పులు కలుగును.

[1] Eclampsia.



**చికిత్సయు, పరిచర్యయు:**—బిడ్డకు ఈడ్పు వచ్చినప్పుడు ఆవాలపొడి చేర్చిన వేడినీటిస్నానము, వెన్నుకు, కడుపుకు, కాళ్లకు ఆవాలపట్టు వేయుట వలన బాధ తగ్గును. ప్రేగులలో జాఠరీయతొందరవలన కలిగిన ఈడ్పులైనయెడల, ఎనెమ యిచ్చి ప్రేగులు శుభ్రముచేయవలెను. మార్ఫిన్ లేక [1]కోడిన్ అను మందులను చిన్నచిన్న మోతాదులుగగాని, [2]క్లోరల్ హైడ్రేట్ అను దానిని పురీషనాళముద్వారాగాని యిచ్చుటవలన కండరములు లాగుకొనుట తొలగించవచ్చును. వాంతిచేయు మందు లేవియు నియ్యకూడదు. ఒకసారి వచ్చిపోయిన తరువాత బ్రోమైడ్స్, క్లోరల్ హైడ్రేట్ లేక [3]లూమినల్ అను మందు లిచ్చుటవలన మరల ఈడ్పు రాకుండ చేయవచ్చును. రోగి స్వస్థతపొందుచుండగా, ఈడ్పులకు కారణమేమో తెలిసికొని దానిని తొలగించవలెను. ప్రసవసంబంధమైన ఎక్లాంప్షియనుగూర్చి ప్రసవశాస్త్రభాగములో చర్చింపబడును.

**కాకిసోమాలు** [4](ఎపిలెప్సి):—ఇది నరముల వ్యాపారములకు సంబంధించిన రోగము. దీనివలన రోగి అప్పుడప్పుడు స్మారకము తప్పినవాడగును. దీనిలో ఈడ్పులుండిన నుండవచ్చును; లేక ఉండకపోవచ్చును. కాని దీనికి ముందు ఏదో ఒక హెచ్చరిక రోగికి కలుగును. తరువాత అతడు పడిపోవును. అతడు ఏదో ఒక శబ్దముచేసిగాని, కేకవేసిగాని పడిపోవును. నేలమీద గట్టిగా పడుటవలన అతనికి గాయము తగులవచ్చును. ఈ సందర్భములోనే పారపోయి, శ్వాసకండరములు పనిచేయనందున రోగికి ఊపిరియాడక నల్లగా రంగు మారిపోవచ్చును. ఈడ్పులు మొదట దేహము కదులుటతో ఆరంభించి, చివరను అతి బలముగా చలనము పుట్టవచ్చును. అప్పుడు దేహమంతయు తీవ్రముగా కదులుచుండును. రోగి నాలుక కరుచుకొని, అప్రయత్నముగనే మలమూత్రాదులను విడువవచ్చును. ఈడ్పునుండి తేరుకొనుచుండగా, రోగి అలిసిపోయి, నిద్రపోవును. అంత అయినతరువాత జరిగినసంగతి సాధారణముగా రోగికి ఏమి తెలియక పోవును. ఈ వ్యాధిస్థితి హెచ్చుకొలది, రోగి మనోస్థితి క్షీణించుచుండును.

**చికిత్సయు, పరిచర్యయు:**—శ్వాస నిరాటంకముగా జరుగునట్లు రోగి దుస్తులు వదలుచేయవలెను. నాలుకను కొరుకుకొనకుండ కాపాడుటకు పండ్లమధ్య ఏదైన ఒక వస్తువు పెట్టవలెను. ఈడ్పులు మరల కలిగించు

[1] Codein. [2] Chloral hydrate. [3] Luminal. [4] Epileps,

స్థితులురాకుండ చూడవలెను. ప్రతివిషయములో క్రమముగాను, మితముగానుండుటవలన ఈ వ్యాధిరాకుండ చేయుటకు సహాయపడును. కూరగాయలు, పండ్లు ఉన్న ఆహారమును రోగికి ముఖ్యముగా నియ్యవలెను. బ్రొమైడ్స్, [1]ఫీనొబార్బిటల్ అను మందులను రోగికి ఉపశాంతికలుగుటకిచ్చెదరు. [2]పెటిట్‌మాల్ అనునది ఒక రకపు ఈడ్పు. అది ఆరంభమున కొద్దిగా కనబడునుగాని, రానురాను తీవ్రత హెచ్చును. ఈ వ్యాధి కారణములను రేపక ఉపశమనము గలిగించు మందులిచ్చుటయే తగిన చికిత్స.

తీవ్రమైన కొరియ అనగా ఒకవిధమైన కొంకరలు పుట్టించు రోగము. లేక [3]సెయింట్ వైటస్‌డాన్స్:—ఇది నరములసంబంధమైన వ్యాధి. దీనివలన దేహములో అప్రయత్నమైనట్టియు క్రమములేనట్టియు చలనము పుట్టుచుండును. సాధారణముగా ఈ వ్యాధి 5—15 సం॥ల వయస్సుగల ఆడుపిల్లలకు వచ్చుచుండును. ఎక్కువ తరుచుగా బాలికలలో కనబడుచుండును. కొన్నిసారులు గర్భముతోనున్న స్త్రీలకును ఈ వ్యాధి సంభవించవచ్చును. ఏదో ఒక అంటురోగ క్రిమి మెదడుమీద పనిచేయుటవలన ఇది కలుగును. దీనికిని తీవ్రమైన కీళ్లవాతము, [4]టాన్సిలైటిస్ [5]ఎండొకార్డైటిస్ [6]ఆర్‌త్రైటిస్ మొదలగు వ్యాధులకును దగ్గర సంబంధమున్నది. భయము, గాయము తగులుట, ఉద్రేకపూరితమైన అదరు—ఇవి యీ వ్యాధికి అనుకూలపరిస్థితులు.

లక్షణములు:—ఆరంభము వేగముగగాని క్రమేణగాని వచ్చునదైయుండును. దీనిలక్షణము లేవనగా, కండరములు స్వతంత్రముగా కదులును. ఒకొక్కప్పుడు ఇవి అమిత తీవ్రముగా కదలుటవలన రోగి పడకలో తన్నుతాను అణచి యుంచుకొనలేక యుండును. అప్పుడు అతనిని బలవంతముగా అణచిపెట్టవలసివచ్చును. వ్యాధి తీవ్రముగానున్నప్పుడు నిద్రలోకూడ చలనముండును. ఈ చలనము మొదట అరచేతులలో, రెక్కలలోపుట్టి, తరువాత ముఖమునకు కాళ్లకు ప్రాకును. మాటలాడుట ఈ యవస్థలో కష్టము. ఈ రీతి తీవ్రముగా వచ్చు వ్యాధి ఒకటినుండి ఆరునెలలవరకుండును. లక్షణములు క్రమేణ అంతరించ

[1] Phenobarbital. [2] Petit mal. [3] St. Vitus's Dance. [4] Tonsillitis. [5] Endocarditis. [6] Arthritis.



వచ్చునుగాని, మరలమరల కనబడుట సహజము. ఇతర లక్షణములు తలనొప్పి, ఆకలిలేమి, వాంతి, మలబద్ధకము మొదలైనవి.

చికిత్సయు, పరిచర్యయు:—రోగి మూడునుండి ఆరునెలలవరకు పడకలో పరుండి విశ్రమింపవలెను. గుండెమీద ఏ భారముండకూడదు. దినమునకు ఒకటి రెండుసారులు కోల్డ్‌పాక్‌గాని, రాత్రిసమయమున వేడినీటిస్నానముగాని యిచ్చిన, రోగికి నెమ్మదికలుగును. రోగి పడకమీదనుండి దొర్లిపడి గాయపరచుకొనకుండునట్లు పడకకు ఇరుప్రక్కల మెత్తలుపెట్టిన పలకచెక్కల నుపయోగించవలెను. రోగికి వీలైనంతవరకు బలము నిచ్చెడు పోషణకరమైన భోజనము పెట్టవలెను. మొద్దుబారిన అంచులుగల గరిటెతోగాని, లోహముతోచేసిన గిన్నెతోగాని రోగికి అన్నము తినిపించవలెను. లేనియెడల రోగి తన్ను తాను గాయపర్చుకొనవచ్చును. రోగికి చాలినంత ద్రవము ఉన్నదని తెలిసికొనుటకై, త్రాగిన ద్రవమును, విసర్జించిన మూత్రమును చార్టుపై వ్రాయవలెను. చర్మమును శుచిగా నుంచి, పడక పుండ్లు లేవకుండ జాగ్రత్త తీసికొనవలెను. క్రమముగా వేళకు పడకచట్టి నిచ్చి, రోగిని విరేచనము చేయించవలెను. క్రమముగా విరేచనమగునట్లు చూడవలెను. వ్యాధి ముమ్మరముగా నున్నప్పుడు శాంతి నిచ్చుటకు [1]హాయొసిన్, [2]లూమినల్ లేక [3]క్లోరల్ అను మందు లిమ్మని వైద్యుడు ఉత్తరు వియ్యవచ్చును. ఆర్సెనిక్ (పాషాణము) అను మందును, ఫౌలర్స్ సొల్యూషన్ రీతిలో సాధారణముగా నుపయోగింతురు. [4]ఫారిన్ ప్రోటీన్ (ఇతర మాంసకృత్తులు) [5]ఆటొజెనస్ వాక్సీన్ (స్వయంవాక్సీను) అను మందులను వాడిరిగాని, వాటివలన ఎక్కువ ఫలితము కనబడలేదు. సాధ్యమైనంత త్వరగా అంటుగల కేంద్రములను తీసివేయవలెను. ఇనుము, కాడ్‌లివర్ ఆయిల్, మర్దనచేయుట, రోగి అప్పుడప్పుడు కదలించబడుటవలన కొంత మేలు కలుగును. వ్యాధి ముమ్మరముగా నుండగను, రోగి తెప్పరిల్లుకొనుచుండగను అతనికి బహు ఓపికతోను, ఉపాయముతోను పరిచర్య చేయవలెను. గర్భిణీ స్త్రీలకు ఈ వ్యాధి ప్రాప్తించినయెడల, తల్లిప్రాణమును కాపాడుటకు ప్రసవమగునట్లు చేయుటయో, అకాలముగా గర్భము పోవునట్లు చేయుటయో, అవసరమగును.

[1] Hyoscine. [2] Luminal. [3] Chloral. [4] Foreign protein. [5] Autogenous vaccine.

జ్ఞానేంద్రియ నాడికేంద్రములలో తొందరలు

1. స్పర్శజ్ఞానము లేకపోవుటకు '[1]అనెస్తీజియ' అని పేరు. 2. అధిక స్పర్శజ్ఞానము కలిగియుండుటకు '[2]హైపర్ ఎస్తీజియ' యని పేరు. 3. దేహములోని తిమ్మిరి, పోట్లు, చురుకు పుట్టుటవలన కలుగు వికారమునకు '[3]పారెస్తీజియ' యని పేరు. హిస్టీరియ, న్యూరైటిస్, ఆర్టీరియోస్క్లెరోసిస్ అను వ్యాధులయందువలె జ్ఞానేంద్రియమార్గములో ఏదేని కొంచెము చురుకుపుట్టుటవలన పారెస్తీజియ అను వ్యాధికలుగును. నొప్పిని గ్రహించలేకపోవుటకు '[4]అనల్జీజియ' అని పేరు. చలిని, వేడిని గ్రహించలేకపోవుటకు 'థర్మో-అనెస్తీజియ' యని పేరు.

న్యూరైటిస్:—అనగా నరములు కందుట. ఇది తీవ్రమైనదిగగాని, దీర్ఘకాలమునుండి యున్నదిగగాని అయియుండవచ్చును. ఒకటి లేక ఎక్కువ నరములకు ఈ తొందర కలుగవచ్చును. చలిగాలితగులుట, గాయము తగులుట, దగ్గరనున్న మరేదైన అవయవము కందుటవలన న్యూరైటిస్ అను వ్యాధి రావచ్చును. ఈ నరముగుండ రక్తముపారు కండరములుకూడ కంది, క్షీణించి, పారెస్తీజియ అను వ్యాధులవలన బాధపడవచ్చును.

లక్షణములు:—నొప్పి తీవ్రముగను, తెంపులేకనుండును. చర్మము పొంగి నిగనిగలాడుచుండును. గోళ్లు పెళుసుగానుండును. కండరముల లావు తగ్గును. కోసినట్టును మండినట్టును చుర్రుమన్నట్టును, ఆ భాగమంత అధిక బాధగానుండును. నరమునకు ఏ మాత్రము బరువు, ఏ మాత్రము ఒత్తిడితగిలినను సహించలేని బాధయుండును.

వాతశూల (న్యూరాల్జియ):—లోపలి అవయవములు కందుటవలననో మరి యితర కారణమువలననో కీళ్లువాయును. ఇట్లు వాచిన కీళ్లనుండి నరముల పొడుగున ముమ్మరమైన నొప్పి వ్యాపించుచుండును. ఇట్టి వ్యాధిని 'వాతశూల' అందురు. ఇది అప్పుడప్పుడు కనబడి అంతరించును గాని మరల కొంతకాలమునకు తిరిగివచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు:**—న్యూరైటిస్ వ్యాధిగాని న్యూరాల్జియ వ్యాధిగాని తగులకుండునట్లు ఎక్కడైన అంటుచేరియున్న స్థలముండిన, దానిని సాధ్యమైతే తొలగించవలెను. ఈ వ్యాధి యేభాగమునకైన సంభ

[1] Anesthesia. [2] Hyperesthesia. [3] Paresthesia. [4] Analgesia.



వించినచో, ఆ భాగమునకు వీలైనయెడల వేడికాపడమిచ్చి, విశ్రాంతి పొందనిచ్చినయెడల సహాయకరముగ నుండవచ్చును. సలిసిలేట్స్‌గాని, హిప్‌నాటిక్స్‌గాని నొప్పిని తగ్గించుటకు ఇయ్యవలసివచ్చును. న్యూరాల్జియా వ్యాధికి 60% బలముగల ఆల్కహాల్‌ను సూదిద్వారా, వ్యాధియున్న నరములోనికి ఎక్కించవచ్చును. లేక ఈ నరమును సాగదీయవచ్చును; లేక కోయవచ్చును. దీని సంబంధమైన అనేక అంటువ్యాధులకు ఇటీవల కనుగొనబడిన నవీన చికిత్స, '[1]సల్ఫోనమైడ్స్' నిచ్చుటయే.

'[2]టిక్ డులురో (అర్దితవాతము):— ఇది ముఖమునకు వచ్చెడు వాతశూల. కపాలమునందు ఐదవనరము గాంగ్లి అన్ (అనగా, నాడీకణములు కూడుకొను స్థలము)నకు కలుగు వ్యాధివలన నిది సంభవించును. ముఖమునకుగాని, తలకుగాని యేదైన చురుకుతగులుటవలన ఈ వ్యాధి కలుగవచ్చును. మధ్య వయస్సులో ఈ వ్యాధి తరుచుగా సంభవించును. దీని లక్షణములను, చికిత్సనుగూర్చి (న్యూరోసర్జరి యను నంశముపైన వ్రాసిన 31-వ అధ్యాయము చూడుము).

[3]న్యూరోసిస్, [4]సైకోన్యూరోసిస్

నరముల వ్యాపార సంబంధమైన వ్యాధులకు న్యూరోసిస్ అని పేరు. పారంపర్యముగనో, దేహస్థితినిబట్టియో యిది వచ్చును. దీనికి నిజమైన కారణమేమో నిర్ణయించ వీలుకాదు. ఈ స్థితివలన రోగి తన వ్యాధిని గూర్చిన ఆంతరంగిక చింత అధికమగుటవలన, కనబడుచున్న చిన్నచిన్న చిహ్నములను పెద్దవిచేసి తలంచుటకును, తనలో లేని చిహ్నములను ఊహించుటకును, ఆరంభించును. రోగికి భయముపుట్టి మనోస్థితి చెడును. దీనివలన వాంతి, డోకు, అజీర్ణవ్యాధి, అతి విరేచనములు, మలబద్ధకము మొదలగు జబ్బులేర్పడును. రోగినిపట్టి బాధించుచుండిన ఈ భయమును, చింతయు శరీరములోని, మనస్సులోని నరములు అలసిపోవునట్లుచేసి రోగిని కృంగజేయును.

**చికిత్సయు, పరిచర్యయు:**—దేహస్థితిని సరిగా పరీక్షించి, వ్యాధికి కారణము నిర్ణయించి, ఏవైన తొందరలున్నయెడల వానిని సవరించవలెను. రోగికి సరియైన సంగతులను తెలియచేసి, భయమును తొలగించవలెను.

[1] Sulphonamides. [2] Tic douloureux. [3] Neuroses. [4] Psychoneuroses.

[1]సైకస్తీనియ:—ఇది శరీరతత్త్వమునందు కనబడు విపరీతలక్షణము. ఇది అనేక సంవత్సరములనుండి అదృశ్యమై యుండియుండవచ్చును. రోగి యందు ఏవో కొన్ని భయములుండును. చీకటినిగూర్చి, వ్యాధినిగూర్చి, కొన్ని విధములైన ఆహారములనుగూర్చి, భయముండవచ్చును. తుదకు ఈ భయమే అతనిని లొంగదీయును. కొందరికి కొన్ని దురభ్యాసములు అనగా వస్తువులను తాకుట, దొంగిలించుట మొదలగు వాడుకలుండును. ఇట్టి రోగులకు బహునేర్పుతోను గ్రహింపుతోను ఓర్పుతోను చికిత్సచేయ వలెను.

ఎండదెబ్బ

మెదటిలో వేడిని క్రమపరచు భాగము క్రుంగుటచేత ఎండదెబ్బతగులును. అధికోష్ణము చాలకాలము తగిలినప్పుడు ఇది సూర్యుని తాపము వలన కలిగినట్లయిన, దీనిని ఎండదెబ్బ యందురు. ఇది క్రమేణగాని, అకస్మాత్తుగగాని కలుగవచ్చును.

లక్షణములు:—ముఖ్యలక్షణము లేవనగా ముష్కరమైన తలనొప్పి, తలదిమ్ము, అలత, డోకు, వాంతి, అతివిరేచనములు, దేహోష్ణము 103°—110°F. లేక యెక్కువ యుండవచ్చును. దీని తరువాత కొన్ని సారులు కొలాప్స్, గాఢమూర్ఛ కలుగవచ్చును. చర్మము ఎండి పొడిగా నుండును; నాడినిండుగను వడిగనుండును.

చికిత్సయు, పరిచర్యయు:—ఉష్ణోగ్రత తగ్గించుటకు తలకు మంచుకట్ట వలెను; మంచునీళ్లస్నానము లేక [2]కోల్డ్‌పాక్ చేయించవలెను. ఇట్లు చేయుచుండగా, రక్తప్రసరణము ప్రేరేపించబడునట్లు తీవ్రముగా రాపిడి కలుగునట్లు రుద్దవలెను. విసరుటవలన మంచి చల్లదనము కలుగును. కొన్నిసారులు మంచు, ఎనెమల నిచ్చుటవలన చాల మేలుకలుగును.

ఉష్ణోగ్రత 103°F. క్రిందికి దిగువరకు ఈ చికిత్స చేయుచునే యుండవలెను. నాడి బలహీనముగ నున్నట్లైన, చురుకుదనము పుట్టించు మందు లియ్యవలెను. ద్రవములను జాస్తిగ నియ్యవలెను. రోగి మ్రింగలేనప్పుడు సేలైనును రక్తనాళములలోనికి సూదిద్వారా యెక్కించవలెను. శ్వాసకార్యము సరిగ జరుగనప్పుడు కల్పితరీతిగా శ్వాసించునట్లు చేయవలెను. రోగిచుట్టు గాలి బాగుగ ప్రసరించునట్లు నర్సు చూడవలెను.

[1] Psychasthenia. [2] Cold pack.



ఎండవలని అలత:—ఇది యెండదెబ్బ తేలికగ తగులుటవలన కలుగును. దీని ముఖ్యలక్షణము, ఉష్ణము ఉండవలసిన దానికంటె తక్కువగ నుండును. ఇట్టిస్థితిలో దేహమునకు వేడి తగలనిచ్చి, ఉడుకుద్రవము లియ్యవలెను.

## అధ్యాయము 23

# అంటువ్యాధులు

ఒకరినుండి మరియొకరికి వ్యాపించు రోగములకు అంటువ్యాధులని పేరు. జంతువర్గమునకుగాని, ఉద్భిజ్జవర్గమునకుగాని చేరిన అతి సూక్ష్మ జీవులు మన దేహములో ప్రవేశించును. ఈ జీవులు దేహములో పెరిగి విస్తరించును. ఇవి టిష్యూలను పాడుచేయు టాక్సిన్స్ అను విషములను బుట్టించును. ఈ విషములు రక్తములోచేరి, దేహముయొక్క పలుభాగములకు కొనిపోబడి, కొన్ని అవయవములకు మిక్కిలి హానికలిగించును. ఉదాహరణముగా ధనుర్వాతము (టెటనస్) అను వ్యాధిలో నాడీమండలమునకును, డిఫ్తీరియ యను వ్యాధిలో గుండెకును జబ్బు కలుగ చేయును.

ఒకరినుండి యింకొకరికి వ్యాపించెడు వ్యాధులయొక్క సూక్ష్మజీవుల శాస్త్రము—సంగ్రహింపబడినది.

ఈ సూక్ష్మజీవులు మూడు తరగతులుగ విభజింపబడినవి.

1. ఉద్భిజ్జములు:
   - *a.* బాక్టీరియ (అనగా, విషజ్వరము, బొబ్బల రోగము లేక ప్లేగు, కుష్ఠరోగము, క్షయరోగము వీనిని బుట్టించు క్రిములు).
   - *b.* ఫంగై—కుక్కగొడుగు (తామర, మైసిటోమ యను చర్మవ్యాధులను కలిగించు క్రిములు).
2. జంతువర్గములు:
   - *a.* [1]ప్రొటొజోఅ, ఏకాణువుగల జంతువులు (అమీబిక్ రక్తవిరేచనములు, మలేరియా, కాల అజార్ అను వ్యాధులను కలిగించు క్రిములు).

[1] Protozoa.

b. పురుగులు (కొంకిపురుగులు, నారిపురుగులు మొదలగునవి).

c. కీటకములు (గజ్జిపురుగులు, పేలు మొదలైనవి).

3. వైరసెస్ అను విషక్రిములు:

ఇవి సాధారణమైన భూతదర్పణము ద్వారాకూడ చూడలేనంత చిన్నవిగాన, వీని స్వభావము సరిగా గుర్తించజాలము. వీనివలన వ్యాపించు ముఖ్యమైన వ్యాధులేవనగా, మశూచి, యెల్లోఫీవర్, డెంగెజ్వరము, ఇన్‌ఫ్లుయెంజె జ్వరము.

రోగక్రిమి దేహములో ప్రవేశించినది మొదలు, వ్యాధి లక్షణము లగుపడువరకు పట్టుకాలమును ఇంక్యుబేషన్ కాలమందురు. ఒక్కొక్క వ్యాధినిబట్టి ఈ కాలపరిమితి మారును ఒకే స్థలములో అనేకులకు ఒకే రోగము తగిలినయెడల దానిని [1]ఎపిడెమిక్ (అంటువ్యాధి) యందురు. ఏదైన ఒక వ్యాధి ఒక సంఘపు జనులకు ఎడతెగకుండ తగిలినయెడల, దానిని [2]ఎండెమిక్ వ్యాధి యందురు. ఏదైన ఒక వ్యాధి ఒక స్థలములోని కొద్దిమంది ప్రజలకు అప్పుడప్పుడు తగులుచుండిన, దాని [3]స్పొరాడిక్ వ్యాధి యందురు. ఏదైన ఒక ఎపిడెమిక్ వ్యాధి భూమిమీద చాలదూరము వ్యాపించెనేని దానిని పాండెమిక్ అందురు. ఈ క్రింది యుదాహరణములు చూడుడు. ఇండియా దేశములో అనేకభాగములందు విషజ్వరము 'ఎండెమిక్'గ నున్నది. కాలర కొన్నిస్థలములలో 'స్పొరాడిక్'గ నుండునుగాని, ఎప్పుడో ఒకప్పుడు 'ఎపిడెమిక్'గ నుండును. 1918-వ సం॥లో 'ఇన్‌ఫ్లుయెంజ' అను జ్వరము [4]'పాండెమిక్'గ వచ్చెను.

ఒకడు తనకు తగిలిన వ్యాధి నెదిరించి, నిరోధించగలిగినయెడల, వానియందు [5]రక్షణశక్తి యున్నదని చెప్పుదురు. ఈ రక్షణశక్తి రెండు విధములైనది. స్వభావసిద్ధమైనది; కల్పితమైనది. వంశ పారంపర్యముగను, జాతీయముగను, వయస్సునుబట్టియు వచ్చినచో దానిని 'స్వభావ సిద్ధమైనది' యని యందురు. వాక్సీన్స్, ఆంటిసీరమ్స్ వలనను, ఏదైన ఒక రోగము వచ్చుటవలనను, సంపాదించుకొనిన దానిని 'కల్పిత రక్షణ శక్తి' యని యందురు. సూక్ష్మజీవులవలన సంభవించిన ఏదైన ఒక రోగమునుండి

[1] Epidemic. [2] Endemic. [3] Sporadic. [4] Pandemic.
[5] Immunity.



యొకడు స్వస్థతపడుచుండగా, వాని రక్తములో [1]ఆంటిబాడీస్ అను పదార్థములు కొన్ని పుట్టుచుండును. ఈ ఆంటిబాడీస్ విషక్రిములనుగాని, వానివలన పుట్టిన విషములనుగాని యెదుర్కొనును. ఒకసారి వ్యాధి వచ్చినప్పుడు కావలసినన్ని ఆంటిబాడీస్ పుట్టినందున రెండవసారి ఆ వ్యాధిరాదు. కొందరికి పుట్టినప్పుడే వారి రక్తములో ఒకానొక వ్యాధి ఆంటిబాడీస్ ఉండును. ఉదాహరణముగా కొందరికి దద్దు (తట్టమ్మ) పోయనే పోయదు. ఎందుకనగా ఈ రోగక్రిములు దేహములో ప్రవేశించగనే, వాని నెదుర్కొని నాశనముచేయగల ఆంటిబాడీస్ పుట్టినప్పుడే యిట్టివారి రక్తమునందున్నవి. ఆంటిబాడీస్‌ను ఉద్భవింపజేయుటకు మనుష్యులకుగాని, జంతువులకుగాని మృతక్రిములనైనను జీవించిన క్రిములనైనను బాక్టీరియాయొక్క టాక్సిన్స్‌నైనను సూదిద్వారా వారి దేహములోనికి ఎక్కింతురు. బాగుగానున్నవారికి ఇట్లు చేయుటవలన వారికిది రోగనివారణోపయోగముగ నుండును. వ్యాధి తగిలినతరువాత వేసినయెడల, వారి దేహములో ఆంటిబాడీస్ వృద్ధియగుటకు సహాయపడును. 14-వ అధ్యాయము చూడుడు.

ఒకరినుండి మరియొకరికి వ్యాపించెడు వ్యాధులు వ్యాపించకుండ చేయుటకు, రోగక్రిము లెట్లు దేహములో ప్రవేశించి యెట్లు బయటికి పోవునో యను విషయములను మనము గ్రహించవలెను. క్రిములు లోపలికి ప్రవేశించుమార్గములను [2]ప్రవేశద్వారములు అనియు, బయటికి పోవు మార్గములను [3]బహిష్కార్యద్వారములు అనియు చెప్పెదరు. క్రిములు లోపలికి వెలుపలికి పోవువానిలో ముఖ్యమైన దారులేవనగా, శ్వాసమార్గము, అన్నవాహికమార్గము, జననేంద్రియమార్గము, మూత్రావయవముల మార్గము చర్మపుమార్గము. అంటు వ్యాధులలో నూటికి తొంబై (90%) శ్వాస, జీర్ణావయవముల మార్గమున కలుగుచున్నవని అంచనావేయబడినది. ఒక్కొక్కరకము రోగక్రిములు వాని కిష్టమైన ఒక్కొక్క అనుకూలమార్గమున పోవగోరును. ఉదాహరణముగా, టైఫాయిడ్ విషక్రిములను చర్మము మీదవేసి రుద్దినను దానివలన కీడేమియు కలుగదుగాని మ్రింగినట్లయిన, ఎంటరిక్ జ్వరము రావచ్చును. అంటు వ్యాధిగల రోగి దేహమునుండి క్రిములు విశేషముగా బయలుదేరి, ఆరోగ్యముగానున్న వారిలో ప్రవే

[1] Antibodies. [2] Portal of entry. [3] Portal of exit.

శించవచ్చును. అవి రోగులదేహమునుండి విసర్జింపబడును. (1) మల మూత్రాదులు, కళ్లె, గాయములనుండి కారు చీము, దద్దురు మొదలగు వానిద్వారా లేక (2) పురుగులు మొదలైనవి కుట్టుటద్వారా బయటికి రావచ్చును. రెండవ విధమునుబట్టి, పురుగులకు మాత్రము అంటు వచ్చునుగాని—మనుష్యులకు ఆ విషప్రాణులను ఇచ్చుటకు ఆ పురుగులకు శక్తియున్నది.

క్రిములుచేరి అంటుగలిగియున్న రోగులును, [1]క్రిమివాహకులును అంటువ్యాపించుటకు సాధారణముగా ముఖ్య కారకులైయున్నారు. సాధారణముగా క్రిమివాహకులు క్రిములకు తావిచ్చుదురుగాని రోగరహితులై యుందురు.

ఒండొరులు తాకుటవలననో, మరేరీతిగానైన వారికి సంబంధము కలుగుటవలననో, ఆహార పానీయములవలననో, కీటకములవలననో, చర్మము మీది గాయములవలననో ఒకరినుండి మరియొకరిలోనికి అవి ప్రవేశించును.

ఒకడు మరియొకనిని తాకుట అనగా, ముద్దుపెట్టుకొనుట, కరస్పర్శ చేయుట, రోగక్రిములున్న రోగి మాటలాడినప్పుడును, దగ్గినప్పుడును, తుమ్మినప్పుడును అతనినుండి బయటికివచ్చు క్రిములను పీల్చుకొనుట మొదలైన కార్యములని గ్రహించవలెను. దీనినే '[2]డైరెక్ట్ కాంటాక్ట్' అందురు. ఇట్లు నేరుగా రోగిని తాకకపోయినను రోగి తాకినవస్తువులను ఆరోగ్యవంతుడు తాకవచ్చును. ఉదాహరణముగా రోగి చుట్టుకొనిన పుస్తకము, ఆటవస్తువు, పాత్ర, త్రాగెడుగిన్నె, పడక, దుస్తులు మొదలగువాటిని మరియొకడు తాకవచ్చును. దీనివలన అతనికిని రోగము తగలవచ్చును. దీనిని [3]'ఇన్‌డైరెక్ట్ కాంటాక్ట్' అందురు.

ఆహారము, నీళ్లు, ముఖ్యముగా పాలు—మొదలగునవి ఈగలవలననైనను క్రిమివాహకములవలననైనను అంటుపడవచ్చును. బజారులో మూతలేకుండ గాలికి తెరచియుంచు తీపివస్తువులు ఈగలమూలమున నంటుపడును. మురుగు దొడ్లుగ వాడినస్థలములలో పండింపబడిన తాజా పండ్లు, కూరగాయలు ఆ భూసారమువలన అంటుపడును.

తాకుడువలనగాని, కుట్టుటవలనగాని పురుగులు విషక్రిములను ఒకరినుండి మరియొకరిలో ప్రవేశింపజేయును. ప్లేగునందు మిన్నల్లులు, మలే

[1] Carriers. [2] Direct contact. [3] Indirect contact.



రియా జ్వరమునందు దోమలు, రిలాప్సింగ్ జ్వరమునందు పేలు కుట్టి ఈ రోగములను వ్యాపింపచేయును. ఆంత్రాక్స్, ధనుర్వాతము (టెటనస్) ఎరిసిపలస్, సిఫిలిస్ మొదలగు వ్యాధులక్రిములు చర్మమునందలి పగుళ్ల మూలమున లోపల ప్రవేశించును.

ఒకరినుండి మరియొకరికి వచ్చు వ్యాధులను నివారించు విధము.

మొదట క్రిములెట్లు వ్యాపించుచున్నవో మనము నేర్చుకొనినతరువాత, అవి వ్యాపింపకుండ చేయువిధమునుగూడ తెలిసికొనవలెను. దీనిని చేయుటకు నాలుగు పద్ధతులుగలవు. అవేవనగా (1) తెలియజేయుట (2) అంటురోగములనుండి రక్షణశక్తిని కలిగించుట (3) రోగిని ప్రత్యేకించుట (4) డిస్‌యిన్‌ఫెక్ట్ (అనగా క్రిమినాశనము) చేయుట.

(1) తెలియచేయుట అనగా, అంటువ్యాధి ప్రబలియున్న సంగతి ఆరోగ్య శాఖాధికారులకు వెంటనే తెలుపుట. మన దేశములో నిట్టి అంటువ్యాధులనుగూర్చి తెలియజేయకుండ దాచియుంచుటకు జనులు అలవడియున్నారు. ఇది అజ్ఞానము, అజాగ్రత్త, స్వార్థాపేక్షవలన కలిగిన బుద్ధి. దీనివలన ఆరోగ్యవంతులు తీవ్రమైన అంటువ్యాధులనుండి రక్షణోపాయములను పొందకుండ వానికి లొంగిపోవుచున్నారు. సంఘమునకు తానొక ఆరోగ్య శాఖోద్యోగినియని నర్సు భావించుకొని, తెలిసిన అంటు వ్యాధులనుగూర్చి వెంటనే అధికారులకు రిపోర్టు చేయవలెను. ఇతరులు నిట్లు చేయులాగున వారిని తర్ఫీతు చేయవలెను. ఇట్లు చేయుట వలన సంవత్సరమునకు వేలకొలది జనుల ప్రాణములను సంరక్షించవచ్చును.

(2) రోగమునుండి రక్షించుశక్తిని కలిగించుట మరియొక పద్ధతి. వాక్సీన్స్, ఆంటిసీరమ్, మూలమున ఈ శక్తిని గలిగించవచ్చును. ముఖ్యముగా, మశూచి, వాంతిభేది, విషజ్వరము, డిఫ్తీరియ, కాలర మొదలగు అంటువ్యాధులను పైజెప్పినవాని మూలమున ప్రత్యేకముగా నివారించవచ్చును.

(3) రోగులను ప్రత్యేకించుట అనగా, ఏదైన ఒక అంటువ్యాధి తగిలిన రోగులను, వారికి ఉపయోగించిన వస్తువులను, కొద్దికాలము క్రిందటనే యిట్టి వ్యాధికి లొంగినవారిని ప్రత్యేకించవలెను. క్రొత్తరోగుల మూలమునకూడ రోగక్రిములు ఇతరులకు వ్యాపించవచ్చును.

అంటురోగులను ఇండ్లలోనైనను, వైద్యశాలలోనైనను ప్రత్యేకించి యుంచవచ్చును. అంటురోగములుగలవారిని పరామర్శించు నియమములను తర్ఫీతు పొందుచున్న నర్సు జాగ్రత్తగా నేర్చుకొని, నేర్చుకొనిన విషయములను మనస్సాక్షి పూర్వకముగా ననుసరించినయెడల, ఇండ్లలో సులభముగ ఇట్టి రోగులవిషయమై జాగ్రత్త తీసికొనగలదు. లేదా కుటుంబములో బాధ్యతగలిగిన ఒకరికి అట్లు చేయుటకు నేర్పవచ్చును.

ఎక్కువ అంటుగలిగిన వ్యాధులు అనగా మశూచి, ఆట్లమ్మ, తట్టమ్మ, ఇన్ఫ్లుయెంజ మొదలగు వ్యాధులుగల రోగులను ప్రత్యేకమైన గదులలో నుంచవలెను. కాని ఒకేరకపు వ్యాధిగల వారినందరిని ఒకేగదిలో పెట్టినను పెట్టవచ్చును. ఉదాహరణముగా ఆట్లమ్మ పోసినవారిని ఒక గదిలోను, తట్టమ్మ పోసినవారిని మరియొక గదిలోను నుంచవచ్చును. ఈ పద్ధతిప్రకారము ఒకే నర్సు అనేకమంది రోగులకు పరిచర్య చేయవచ్చును. ఈ సందర్భములో [1]మెడికల్ అసెప్సిస్ గమనించవలెను. ఇది [2]సర్జికల్ అసెప్సిస్‌కు వ్యతిరేకమైనది. రెండవదానియందు రోగులకు అంటుతగలకుండ కాపాడుదురుగాని, మొదటిదానియందు రోగినుండి మరియొకరికి అంటు వ్యాపించకుండ ఆపుటకు ప్రయత్నించుదురు. శస్త్రము చేయునప్పుడు నర్సు తన్నుతాను శుభ్రముగా నుంచుకొనునట్లే అంటువ్యాధిగల రోగులను పరామర్శించుచుండగా, ఆ వ్యాధి తనకు తగలకుండ తన్నుతాను కాపాడుకొనవలెను. మెడికల్ అసెప్సిస్ ప్రకారము నర్సు తానొక రోగినిగాని, అంటుతగిలిన వస్తువులనుగాని తాకిన వెంటనే తన చేతులను అతిజాగ్రత్తగా కడుగుకొనవలెను. ఇట్లే అంటుపడిన వస్తువులన్నిటిని తిరిగి యితర రోగులకు ఉపయోగించక ముందు వానిని వాడినవెంటనే డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవలెను. నర్సు తన



41-వ పటము

గౌను వేసికొను విధము

[1] Medical asepsis. [2] Surgical asepsis.



పనిని చేయుచుండగా రోగిని చాలకాలము తాకవలసి వచ్చినప్పుడు అనగా స్నానముచేయించుట, ఎనెమనిచ్చుట మొదలగు పనులు చేయునప్పుడు ఒక గౌను వేసికొనును. ఆ గౌనును వేసికొనుటకును, తీసివేయుటకును ఒక ప్రత్యేకమైన నేర్పుకలదు. నర్సు దాని ననుసరించి గౌను ధరించవలెను. అదే అంటువ్యాధిగల రోగులకు పరిచర్య చేయుచుండగా, నర్సు అదే గౌనును ధరించవచ్చును. లేక ఒక్కొక్క రోగికి ఒక్కొక్క క్రొత్త గౌను వేసికొనవచ్చును. ఈ గౌనును రోగుల గదిలో ఏదైన ఒక చీలకుగాని, వంకెకుగాని తగిలించి యుంచవలెను. అప్పుడు అంటుపడిన భాగము వెలుపలికి ఉంచవలెను. గది వెలుపలనైనను దానిని తగిలించవచ్చునుగాని, అప్పుడు శుభ్రమైన భాగమునే బయటనుంచవలెను. ఒక్కొక్క గదిలో ఒక బేసినునిండ డిస్‌యిన్‌ఫెక్టెంట్ లోషను, చేతులు శుభ్రము చేసికొనుటకై సబ్బు, నీళ్లు, బ్రష్ ఉండవలెను.

గౌను వేసికొను విధము:—గౌను వేసికొనుటకు నర్సు తన శుభ్రమైన రెండు అరచేతులను ఒకటిగచేర్చి పటములో చూపబడిన రీతిగా, గౌను మడతలలో పెట్టి తగిలించిన వంకెనుండి తీసి, చేతులను మొదట దూర్చును. (41-వ పటము చూడుము) పిమ్మట మెడపట్టెడను బిగించుకొనును. ఇది క్రిములు లేకుండ నుండునని మనము తలంచవలెను. వెనుకభాగమున సర్దుకొని నడుము పట్టి (బెల్టును) కట్టుకొనును. ఇక గౌనును తీసివేయుటకై, మొదట బెల్టును ఊడదీయును. ఇప్పుడిది అంటుతగిలియుండునని మనము గ్రహించవలెను. కావున దీని నంటుకొనిన తరువాత నర్సు తన చేతులను గడుగుకొని మెడపట్టి వదులుచేసి, గౌనును చిన్నగా విప్పివేయును. ఇట్లు చేయుచుండగా, దాని లోపలిభాగము అంటుపడకుండ జాగ్రత్తగానుండును. తరువాత భుజములమీఁది మడతలను ఒకటిగా మడిచి, అంటుపడిన భాగమును వెలుపలనుంచి, గౌనును గదిలో వంకెకు తగిలించవలెను. నర్సు దీనికితరువాత ఏదైన వస్తువునుగాని, ఎవరినైననుగాని తాకకముందు తన చేతులను శుభ్రముగా కడుగుకొనవలసినది. గది వెలుపల శుభ్రముచేయు స్థలము తప్ప, తక్కిన స్థలమంతయు శుభ్రమైనదని యెంచవలెను.

తామర, గజ్జి, ఎంటరిక్ జ్వరము, రక్తవిరేచనములు, టెటనస్ (ధనుర్వాతము) మొదలగు అంటువ్యాధులున్న రోగులను జనరలు వార్డుల

లోనే ప్రత్యేకించవలెను. వారి పాత్రలను వారిపడకల ప్రక్కననే ప్రత్యేకముగా నుంచవలెను. వారికి పరిచర్య చేయు నర్సు గౌను వేసికొనవలెను. ఇతరవిషయములలో ప్రత్యేకమైన గదులలో ప్రత్యేకించిన రోగులవలెనే వీరినిగూడ పరామర్శించవలెను.

(4) అంటువ్యాధులు వ్యాపించకుండ చేయుటకు డిస్‌యిన్‌ఫెక్షన్ నాల్గవపద్ధతి. ఇక్కడ డిస్‌యిన్‌ఫెక్ష ననగా, వ్యాధి బీజములను నాశనము చేయుట యని యర్థము. వేడిమి, సూర్యుని వెలుగు, డిస్‌యిన్‌ఫెక్టెంట్స్, వీని మూలమున ఈ పనిని చేయవచ్చును. డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవలసిన వస్తువేదో దానినిబట్టి వాడవలసిన పద్ధతియుండును.

పాత్రలు, పింగాణిపాత్రలు, పడకగుడ్డలు, తువాళ్లు మొదలైనవానిని 10 నిమిషములు ఉడికించి లేక 5% బలముగల కార్బాలిక్ సొల్యూషనులోగాని, 2% బలమైన [1]లైసాల్‌లో 1 గంటసేపుగాని యుంచి డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవచ్చును.

మలము, కళ్లె, మూత్రము—వీనిని వీని సమభాగములుగల 5% క్లోరైడ్ ఆఫ్ లైమ్, లేక 5% కార్బాలిక్ లేక 2% లైసాల్ పోసి, ఒక గంటసేపు మూసియుంచిన చాలును. ఈ మిశ్రమమును పలుమారు కలియబెట్టుచుండవలెను. అప్పుడు డిస్‌యిన్‌ఫెక్టెంట్‌తో ఈ విషక్రిములు కలిసినందున నాశనము కాగలవు.

ముక్కు, నోరు, గొంతు—వీనినుండి స్రవించుద్రవములను కాగితములలోగాని గుడ్డలలోగాని చుట్టిపెట్టి వెంటనే కాల్చివేయవలెను. కాగితముతో చేసిన ఒక సంచిని పడకప్రక్కన పిన్నుతో గ్రుచ్చి, పై చెప్పిన ద్రవములనుబట్టిన కాగితములను, గుడ్డ ముక్కలను చేర్చియుంచి, తరువాత ఆ సంచినట్లే తీసికొనిపోయి కాల్చివేయుట మంచిది. మురికియైన కట్టుగుడ్డలను, మిగిలిన మెతుకులనుగూడ కాల్చివేయవలెను.

పడక మెత్తలు, దిండ్లు మొదలైనవానిని బాగుగా బ్రష్‌చేసి విదిలించి, ఒక దినమంత ఎండలోవేయవలెను. కంబళ్లను ఒక దినమంత ఎండలో వేసి, ఉదకవలెను. వేడినీటి బుడ్లు, మంచుతిత్తులు, స్టెతెస్కోపు, రబ్బరు ఉంగరములు, రబ్బరు దుప్పట్లు—వీనిని సబ్బునీటితో బాగుగా రుద్ది కడిగి, ఏదైన తగిన ఆంటిసెప్టిక్ లోషనులో ముంచి పిండవలెను.

---



మంచపుచట్రము, మంచము, ప్రక్క వేయు బల్లలు, కొయ్యసామానులు, కిటికీలు—వీనిని సబ్బు, వేడినీటితో కడుగవలెను. గోడలకు సున్నము కొట్టవచ్చును. నేలను 5% కార్బాలిక్ లేక 2% లైసాలుతో కడుగవలెను. రోగుల గదిని 24 గంటలవరకు బాగుగా గాలి వీచునట్లు తెరచియుంచవలెను.

పడకచట్లను 10 నిమిషముల సేపు పొంగించి, 5% కార్బాలిక్ లేక దీనికి సమానమైన యితర డిస్‌యిన్‌ఫెక్టెంట్ మందు నీళ్లలో ముంచవలెను. మూతవేసి యుంచిన లోహపుపాత్రలను కళ్లెకొరకు ఉపయోగించునప్పుడు వానిలో 5% కార్బాలిక్ లేక 2% లైసాల్ మందు నీళ్లుండవలెను. వానిని ప్రతిదినము ఖాళీచేసి పొంగించవలెను. పాత్రలలోని తడిని పీల్చుకొనునట్లు కాగితపు ముక్కలనుగాని, రంపపు పొట్టునుగాని వాని యడుగున పోయుట మంచిది. పిమ్మట పాత్రలలోని కళ్లెను, ఎంగిలిని ఒక కాగితముమీద కుమ్మరించి, ఆ కాగితమును మడిచి కాల్చివేయవలెను. కళ్లెను, ఎంగిలిని ఉమియుటకు కాగితపు గిన్నెలను చేసి వానిని ఆ యెంగిలితోనే కాల్చివేయుట మరి శ్రేష్ఠమైన పద్ధతి.

ఒక రోగిని డిశ్చార్జిచేసి, వైద్యశాలనుండి యింటికి పంపుటకుముందు, స్నానముచేయించి, తల శుభ్రముగ దువ్వి, శుభ్రమైన గుడ్డలు తొడిగి పంపుట మంచిది.

ముఖ్యమైన సలహాలు, హెచ్చరికలు

1. రోగిని అంటుకొనిన తరువాత ప్రతిసారి చేతులు కడుగుకొనవలెను.

2. ఒక్కొక్క వ్యాధి బీజము ప్రవేశించుమార్గమును, వెలుపలికి వచ్చు మార్గమును నిశ్చయముగా తెలిసికొని యుండవలెను.

3. రోగక్రిములు శ్వాసనాళమార్గముద్వారాను జీర్ణావయవమార్గములద్వారాను వెలుపలికి వచ్చునట్టి రోగములతో జాస్తిగ బాధపడుచుండు రోగులను పరామర్శించుచుండగా, నర్సు నోటికి, ముక్కుకు [1]మాస్కు వేసికొనవలెను.

4. నర్సు తనచేతులతో ముఖము తాకకుండనుండుటకును, భోజనము చేయకముందు చేతులు తప్పక కడుగుకొనుటకును జ్ఞాపక ముంచుకొనవలెను.

## బాక్టీరియవలన కలుగు వ్యాధులు

ఆంత్రక్స్ ఇది పెంపుడు జంతువులయొక్క వ్యాధి. [1]ఆంత్రక్స్ బసిల్లస్ వలన కలుగుచున్నది. ఈ వ్యాధివలన చనిపోయిన జంతువుల ఉన్నిని, చర్మమును తాకుటమూలమున ఈ రోగము మానవునికిని సంభవించును. అంటుపడిన క్షౌరపు బ్రష్షులుకూడ వ్యాధికి కారణములగును. దీని ఇంక్యుబేషన్ కాలము 7 దినములు. చర్మము, శ్వాసనాళములు, జీర్ణావయవములు—వీనిమూలమున రోగక్రిములు లోపలికి ప్రవేశించును.

లక్షణములు:—రోగక్రిములు ప్రవేశించు ద్వారములనుబట్టి, వ్యాధి మూడువిధములుగా నుండును. చర్మముద్వారా అంటు లోపలకిపోవునప్పుడు, ఏ స్థలమునపోయినదో ఆ స్థలమున చర్మము పొక్కి త్వరగా బొబ్బయై చీముపట్టును. అంటుకు తోడుగా జ్వరము, వాపు వచ్చును. అటుతరువాత శోషవాహికలవెంబడి వాపుచూపును. అంటు ముమ్మరముగానున్నయెడల [2]సెప్టిసీమియ అను వ్యాధి ప్రబలమైనందున రోగి కొన్ని దినములలోనే మరణించును. శ్వాసనాళములగుండ అంటు లోపలికి పోవు, వ్యాధికలిగిన, దానిని '[3]ఉల్ సార్టర్స్' వ్యాధియందురు. ఇది బ్రాంకైటిస్‌ను పోలియుండును. చనిపోవుటకుముందు కొన్ని గంటలవరకు రోగి బాగుగానేయున్నట్లుండును. జీర్ణావయవములమార్గమున వ్యాధి బీజములు లోపలికి పోవునప్పుడు ముమ్మరమైన ఎంటరైటిస్ (ప్రేగులు కందుట) ఆరంభమై, దానితోకూడ డోకు, కడుపులో నొప్పి, అతివిరేచనములు కలుగును. ఈ యాఖరి రెండు రకములు దాదాపుగా ఎల్లప్పుడు మరణకరమైనవే.

చికిత్సయు, పరిచర్యయు:—[4]ఆంత్రక్స్ ఆంటిసీరమ్ అను దానిని పెద్ద మోతాదులుగా రక్తనాళములలోనికిని, చీము చేరియున్న బొబ్బచుట్టును ఆరంభదశలో నిచ్చుటయే చర్మసంబంధమైన వ్యాధికితగిన చికిత్స. వాపు తగ్గువరకు సల్ఫొతయొజోల్ మందునిచ్చిన ఫలితము కలుగును. దీని సంబంధమైన యితరవ్యాధులకు తృప్తికరమైన చికిత్సలేదు.

నివారణము:—రోగిని ప్రత్యేకమైన గదిలోగాని, వైద్యశాల జనరలు వార్డులోగాని దూరముగా ప్రత్యేకించి యుంచవలెను. చీముకారిన గుడ్డ

[1] Anthrax [2] Septicemia. [3] Wool sorter's disease.
[4] Anthrax antiserum.



లన్నిటిని కాల్చివేయవలెను. ఉపయోగించు సామానులన్నిటిని డిస్ యిన్ఫెక్ట్ చేయవలెను.

[1]గాస్‌గాంగ్రీన్:—ఎరువువేసి సారవంతముచేసిన నేలవలన అంటుపడిన గాయములకు సంబంధించిన అంటువ్యాధిని 'గాస్‌గాంగ్రీన్' అందురు. [2]వెల్చ్ బసిల్లస్ అను క్రిములు ఈ రోగమునకు కారణము. ఈ వ్యాధి యెంతకాలము అంతర్గతముగానుండి బయటపడునో తెలియదుగాని, దీని ఇంక్యుబేషన్ కాలము కొన్ని గంటలుమాత్రమై యుండవచ్చును. గాయములద్వారా కండరము, టిష్యూ ఈ వ్యాధికి మూలస్థానములు. ఈ వ్యాధి క్రిములు, గాయములనుండి స్రవించు చీమునందును, రక్తమునందును, మనుష్య, జంతుమలమూత్రాదులందును, ఎరువువేసిన నేలలయందును కనబడును. ఇది సాధారణమైన వ్యాధికాదు. ఇది తరుచుగా, వీధులలో తగులు గాయములవలనను, ప్రేలెడు వస్తువులవలన తగులు గాయముల మూలముననను కలుగును. ఇట్టి గాయములు తగిలినప్పుడు టిష్యూలు నలిగిపోయినందున, రక్తము సరిగా ప్రసరించకుండుటవలన, హానికలుగును.

లక్షణములు:—సాధారణముగా జ్వరమువచ్చును; దానితోబాటు అసాధారణమైన వేగముతో నాడికొట్టుకొనును. గాయమున్న చర్మము చుట్టు రంగులురంగులుగా కనబడును. మాంసము కుళ్లినట్లు దుర్వాసన కొట్టును. గాయపడిన టిష్యూలు గోధుమవర్ణము గలిగియుండును. ఆ చోట ఒత్తినయెడల కరకరమను శబ్దముండును. గాయమునుండి చెడు గాలి బుడగలుగా బయటికి వచ్చుట చూడవచ్చును. [3]కాబట్, [4]గైల్స్ అను శాస్త్రజ్ఞులు కనిపెట్టిన రోగలక్షణములేవనగా:—దేహోష్ణతనుబట్టి నాడిగతి వేగముగానుండుట; నొప్పిలేకుండుట; మరణమాసన్నమగువరకు తెలివి అధికముగానుండుట.

చికిత్సయు, పరిచర్యయు:—గాయముచుట్టు చాలలోతుగ కోసి తీసివేయవలెను; లేదా, పుండుపడిన అవయవమును సాంతముగా కోసి తీసివేసి, [5]డేకిన్ సొల్యూషనుతో కడుగుట సాధారణముగా చేయుచికిత్సలు. ద్రవాహారములను నోటిద్వారాను, కండరములలోనికిని రక్తనాళములలోనికిని విశేషముగా నియ్యవలెను. సల్ఫొతయొజోల్ వాడుట ప్రయోజనకరము.

[1] Gas gangrene. [2] Welch bacillus. [3] Cabot. [4] Giles.
[5] Dakins solution.

రోగనివారణ:—రోగిని జనరలు వార్డులో ప్రత్యేకించి పరుండబెట్ట వలెను. నర్సు గాయములను గడిగి కట్టునప్పుడు గ్లౌస్ వేసికొనవలెను.

టెటనస్ (ధనుర్వాతము):—ఇది జంతువులయొక్క అంటువ్యాధి. కండరములు ఈడ్చుకొనుటవలన దీనికి ఈడ్పువాతము అను పేరుకలిగినది. ఇది ఇండియాలో సాధారణమైనవ్యాధి; దీనివలన అనేకులు చనిపోవుచుందురు. ఈ రోగక్రిములును, వాటి అండములును మనుష్యుల యొక్కయు, జంతువులయొక్కయు మలమునందును భూమియందును ఉండును. అన్నవాహికలోనున్నపుడు దీనివలన అపాయమేమియులేదుగాని, లోతైనగాయములో చాల ఘోరమైనవిషముపుట్టి, వ్యాధికి కారణమగును. ప్రసవమునకుతరువాత ఈ రోగముతరుచుగా వచ్చును. క్రొత్తగా జన్మించిన శిశువులలో బొడ్డునందలి మురికివలన కలిగిన అంటుమూలమున ఈ వ్యాధి వృద్ధియగును. [1]కాట్‌గట్ దారము మూలమునను ఈ వ్యాధి విస్తరించునని తెలిసికొనబడినది. సాధారణముగా పశువులమూలమున ఈ అంటువ్యాధి వ్యాపించును. వ్యాధిగ్రస్థులనుండి, క్రిమివాహకులనుండికూడ ఈ వ్యాధి వ్యాపించును. చర్మములోని పగుళ్లద్వారా ఈ క్రిములు దేహములో ప్రవేశించును. ఇంక్యుబేషన్ కాలము మూడు దినములుమొదలు, మూడువారములవరకు నుండును. ఇంక్యుబేషన్ కాలము ఎంత తక్కువగనుండునో, వ్యాధి అంతముమ్మరముగా నుండును.

లక్షణములు:—వ్యాధి క్రమేణ ఆరంభమగును. మొదట తలనొప్పి, కొద్దిపాటి జ్వరము, నిద్రలేమి, అవయవములన్ని బిగుసుకొని పోవుట—ఇవి ప్రాముఖ్యమైన లక్షణములు. పిమ్మట దవుడలు పట్టుకొనుట, మ్రింగినప్పుడు నొప్పియుండుట మొదలగు లక్షణములు కనబడును. సూక్ష్మజీవులవలన కలిగిన విషము దేహములోని చలననాడులకు కొనిపోబడును. వ్యాధి ముదురుకొలది, ఈడ్పులు అధికమగును. ఈడ్పు ముమ్మరముగా నున్నప్పుడు రోగి మడమలమీదను, తలమీదను విల్లువలె వంగిపోయి, కదులుటకుగాని, శ్వాసించుటకుగాని అశక్తుడై యుండును; ఈ సమయములో నతడు చనిపోయినను చనిపోవచ్చును; శబ్దములు, బలమైనవెలుగు, తాకిడి వీనివలన ఈడ్పులు రావచ్చును. ముఖమునందలి కండరములు ముడుచుకొనుటవలన రోగిముఖములో ఒకవిధమైన నవ్వు

[1] Catgu' sutures.



కనబడును. ఈ సమయములో చెమట విస్తారముగా పోయును. వేదనను తగ్గించి శాంతి కలుగజేయు మందుల నిచ్చినప్పుడు తప్పగ మనస్సు తేటగ నుండును.

చికిత్సయు, పరిచర్యయు:—రోగిని ప్రత్యేకించ నవసరములేదు; మెడికల్ వార్డులో నుంచవచ్చును. సగము చీకటిగా నున్నగదిలో రోగి నుంచుట శ్రేయస్కరము. అవసరమైననేకాని, రోగిని తొందరగచేయ కూడదు. పురీషనాళముద్వారా దేహోష్ణము తీయవలెను. గాయమున్నచోటు నిర్ధారణమైనయెడల, దానిని కోసివేసి టెటనస్ ఆంటిటాక్సినును పెద్దపెద్ద మోతాదులుగా వెన్నెముకలోనికిని, రక్తనాళములలోనికిని, కండరములలోనికిని సూదిద్వారా యియ్యవలెను. పై మూడు మార్గముల మూలమున ఒక్కొక్కమార్గమున దినమునకు కనీసము 10,000 యూనిట్లు ఆంటిటాక్సిను మూడుదినములవరకు ప్రతిరోజు ఇయ్యవలెను. తరువాత మోతాదులు తగ్గించి యియ్యవచ్చును. ఈడ్పులు తగ్గుటకు ఆవర్టిన్, [1]క్లోరల్, లేక [2]పెరాల్డిహైడ్ అనువానిని పురీషనాళముద్వారా నియ్యవలెను. ఈడ్పులు అధికముగా నుండిన, క్లోరోఫారమ్ నియ్యవచ్చును. మెగ్నీషియం సల్ఫేట్‌ను కండరములోకి సూదిద్వారా ఇంజెక్షన్ వేయుటవలన మేలుకలుగును. [3]సల్ఫపిరిడిన్ కూడ ఇచ్చినయెడల కొంత ఫలితము గలుగును. [4]వెన్నుపామును కప్పుచున్న పొరకును, వెన్నుపామునకును నడుమనుండు నీరు తీసివేయుదురు. మూత్రము నిలిచిపోవుటవలనను, మలబద్ధకము మూలమునను తొందరలు కలుగకుండ మలమూత్రాదుల విసర్జన క్రమముగా జరుగునట్లు చూడవలెను. నోటినిగూర్చిన జాగ్రత్త యీ సమయములో చాల ప్రాముఖ్యమైనది. పోషణకరమైనట్టియు, అధిక కలోరిక్ విలువగలిగినట్టియు ద్రవాహారము నియ్యవలెను. వ్యాధి ముమ్మరముగా నున్న రోగికి ముక్కుద్వారాను, పురీషనాళముద్వారాను ఈ పోషణ ద్రవముల నియ్యవలెను. పడకచట్రమునకు ప్రక్కన చెక్కలుపెట్టి అవసరమునుబట్టి రోగిని పడకుండ నుంచవచ్చును.

నివారణ:—లోతుగ పొడిచినట్టి గాయములు తగిలినప్పుడునుగాని, మన్నుగాయములు తగిలినప్పుడుగాని, వెంటనే ఆంటిటెటనిక్ సీరంను

[1] Chloral. [2] Paraldehyde. [3] Sulphapyridine. [4] Spinal fluid.

ఇంజెక్షన్ చేసి, రోగమును నివారించవచ్చును. గాయమునుండి తీసిన కట్టు గుడ్డలనుగాల్చి వేయవలెను.

[1]కోరింతదగ్గు:—ఇది అపాయకరమైనదియు చాల అంటుగలదియు నైన వ్యాధి. ముఖ్యముగా పిల్లలకు వచ్చును. ప్రపంచమంతట వ్యాపించి, తరుచుగా శీతకాలములో వచ్చుచుండును. ఈ వ్యాధి ప్రారంభదశలో రోగి కళ్లెయందు [2]బసిలస్ పెర్టసిస్ అను రోగక్రిముల మూలమున కలుగుచున్నదని తలంతురు. రోగిని నేరుగా తాకుటవలనగాని, రోగి చీమిడి, కళ్లె, వాంతి మున్నగువానిని తాకుటవలనగాని యీ వ్యాధి రావచ్చును. దగ్గినప్పుడు బయటకిపోవు ఉమ్మితుంపరుల మూలమున ఈ క్రిములు సులభముగా వ్యాపించును. దీని ఇంక్యుబేషన్ కాలము దాదాపు రెండు వారములు. ఈ రోగలక్షణములు కనబడి కోరింత దగ్గుగా నిర్ణయ మైన తరువాత రెండు వారములవరకు ఈ రోగము చాల తీవ్రముగా ఇతరులకు వ్యాపించును. సాధారణముగా ఒక్కసారి తగిలినవారికి వారి జీవితములో మరల ఈ వ్యాధి రాకుండ రక్షణశక్తి యేర్పడును.

లక్షణములు:—కోరింత దగ్గు సాధారణ దగ్గువలె జలుబుచేసి కొద్ది పాటి జ్వరముతో ఆరంభమగును. తుమ్ములు, దగ్గుండును. ఒక వార మైన తరువాత, కోరింత లక్షణములుగల కక్కు-వాయి దగ్గు ఆరంభమగును. ఈ దగ్గు మీదమీద ఊపిరి యాడకుండవచ్చును. తిరిగి యూపిరి విడిచే టప్పటికి ఒక విధమైన కోడికూత దగ్గుపుట్టును. ఇట్లు తెరలు తెరలుగా వచ్చెడి దగ్గువలన బిడ్డ చాల బాధపడును; ముఖము నల్లబడును; నరము లుబ్బును; కండ్లు ఉబ్బరించును. ఆఖరున ఊపిరి తిరిగిరాగా, దానితోపాటు కళ్లె, తెమడ, వాంతి బయటికి వచ్చును. ఇట్లు ఈ దగ్గు తెరలు దినమునకు నూరు సార్లయినను రావచ్చును. పగటికంటె రాత్రులలో ఈ దగ్గు అధికముగా నుండును. ఏదైన మ్రింగినను, గొంతులో మంట, జిలపుట్టి నను, నవ్వినను, ఏడ్చినను, ఉద్రేకముకలిగినను, ఈ దగ్గు రావచ్చును. ఈ దగ్గు ముమ్మరముగా తగ్గుడు లేక నాలుగువారము లుండును. పిమ్మట దాని బలముతగ్గి, క్రమేణ అంతరించును.

[1] Whooping-cough. [2] Bacillus pertussis.



ఈ కోరింత దగ్గువలన కలుగు ముఖ్యమైన కీడేమనగా, ఇది రోగిని బలహీనపరచి, [1]బ్రాంకోన్యుమోనియ, క్షయ, మున్నగు కఠినమైన వ్యాధులకు సులభముగా లొంగునట్లు చేయును.

చికిత్సయు, పరిచర్యయు:—జ్వరము తగ్గునంతవరకు బిడ్డను పడకలో పరుండబెట్టుము; పిమ్మట సాధ్యమైనంతవరకు ఇతర బిడ్డలతో చేరనీయక బయట ప్రత్యేకముగా నుండనిమ్ము. ఆహారమును గమనించి పెట్టవలెను. దగ్గు తెరలువచ్చి, తరుచుగా వాంతి యగుచుండినయెడల, పొర్లు ఆగినతరు వాత ఏదైన ఆహారము నియ్యవలెను. ఆహారములో కారము, ఘాటులేక కొంచెము చప్పగా నుండవలెను. అతి వేడిగాగాని, అతి చల్లగాగాని యుండకూడదు. ద్రవాహారములకంటె, మెత్తని యాహారము లిచ్చిన నవి అంతత్వరగ వాంతికావు. కడుపుచుట్టు పట్టీవేసి కట్టుటవలన ఒఋ బీజము రాకుండ సహాయపడును. దగ్గు తెరలు తగ్గించుటకు వైద్యుడుచెప్పిన ఉప శాంతిమందులు వాడవచ్చును. టింక్చర్ బెన్జాయిన్ ఆవిరి లోపలికి పీల్చుకొనునట్లు చేయుదురు. క్రొత్తగా సిద్ధముచేసిన [2]పెర్టసిస్ వాక్సీన్ రోగకాల పరిమాణములు తగ్గించును. కోరింతదగ్గువలన కలుగు సంకర వ్యాధులేవనగా, బ్రాంకోన్యుమోనియ, గుండె విస్తరించుట, ఈడ్పులు, ఒఋబీజము.

నివారణము:—జనరల్ వార్డులో రోగిని ప్రత్యేకించుము. రోగి విసర్జించు చీమిడి, కళ్లె, వాంతి మొదలగు వానిని డిస్ఇన్ఫెక్ట్ చేయ వలెను. పాత్రలు, పడకగుడ్డలు, పడక, రోగియుండుగది—వీనిని నియ మించబడిన ప్రకారము డిస్ఇన్ఫెక్ట్ చేయవలెను.

డిఫ్తీరియ:—ఇది అంటువ్యాధి. గొంతురాచుట, ఒకవిధమైన గోదుమరంగు తెలుపురంగుగల అమత్వచ గొంతులో నేర్పడుట ఈ వ్యాధి గుర్తులు. ఈ వ్యాధి [3]క్లెబ్స్‌లెఫ్లర్ బసిలస్ అను సూక్ష్మజీవులవలన కలుగును. ఇది యీ దేశములో సాధారణమైన రోగముకాదు. 2—5 సం॥ల వయస్సుగల చిన్నపిల్లలు ఈ వ్యాధికి సులభముగా లొంగిపోదురు. [4]షిక్ పరీక్షవలన పిల్లలు ఈ వ్యాధికి లొంగిపోదురో లేదో యను విషయమును తేల్చవచ్చును.

[1] Bronchopneumonia. [2] Pertussis vaccine. [3] Klebs-Loeffler bacillus.
[4] Schick test.

సీమపందికొక్కును చంపగలుగు నటువంటి డిఫ్తీరియ టాక్సిను, [1]మినిమల్ మోతాదులో 1/50 వంతున తీసికొని డైల్యూట్ చేసి, ఈ డైల్యూట్ చేయబడిన టాక్సినులో 0·2 cc. ల మోతాదును కొంచెము క్రిందుగనున్న ముంజేతి చర్మములోనికి ఇంజెక్ట్ చేసి పై పరీక్ష చేయుదురు. బిడ్డ యీ వ్యాధికి లొంగునదైనయెడల, 24 – 48 గంటలలో ఆ చోట నొక యెఱ్ఱని మచ్చ కనబడును. కనబడినచో [2]టాక్సాయిడ్ లేక టాక్సిన్ - ఆంటిటాక్సిన్ చికిత్స చేయవలెనని సూచించును.

ఈ వ్యాధి ఇంక్యుబేషన్ కాలము 2 – 5 దినములు. గొంతునుండి తీసిన రసి, వరుసగ మూడురోజులు నెగెటివ్, అనగా, విషప్రాణులు లేకుండయుండునంతవరకు, అంటుకలదని తలంచవలెను. రోగి విసర్జించు చీమిడి మూలమునను, కళ్లెమూలమునను, క్రిమివాహకుల మూలమునను, రోగక్రిముల మూలమునను అంటుపడిన పాలవలనను ఈ రోగము వ్యాపించును. రోగక్రిములు శ్వాసమార్గమున లోపలికి ప్రవేశించును.

లక్షణములు:—దీనిలో మూడు రకములున్నవి. (1) నాసికకు సంబంధించినది (2) [3]గళమునకు సంబంధించినది (3) [4]స్వరపేటికకు సంబంధించినది. గళమునకు సంబంధించిన వ్యాధియే సాధారణమైనది. ఇది కొద్దిపాటి 101 – 102°F. జ్వరముతో ఆరంభమగును. తరువాత తలనొప్పి, గొంతు రాచుటయుండును. నాడి త్వరితముగను క్రమముతప్పియు కొట్టుకొనును; సాధారణమైన నొప్పులు దేహమంతట నుండును. సూక్ష్మజీవులు గొంతులోని అమత్వచమీద స్థిరముగా నిలిచిపోవును. మలినమైనట్టియు, గోధుమరంగు తెలుపు నురుగు గలిగినట్టియు చర్మపు అమత్వచ గొంతులో వేర్పడును. ఇది గట్టిబారి తీసివేయుటకు కష్టమైనదగును. సూక్ష్మజీవులు బలమైనవిషమునుగూడ కలిగించును. అందుమూలమున గుండెకు, నరములకు, మూత్రపిండములకుగూడ చాల కీడు కలుగవచ్చును. రోగికి సకాలములో ఆంటిటాక్సిను చికిత్స చేయనియెడల, ఊపిరాడుట కష్టమగును; ముమ్మరమైన టాక్సీమియ విషప్రయోగము కలుగవచ్చును.

చికిత్సయు, పరిచర్యయు:—రోగిని పడకలో పరుండబెట్టి సంపూర్ణ విశ్రాంతి తీసికొననియ్యవలెను. ఆరంభదశలోనే ఆంటిటాక్సిను ఇంజెక్షన్ ఇచ్చినయెడల, వ్యాధి చిహ్నములు అంతరించవచ్చును. వ్యాధి ముమ్మర

[1] Minimal lethal. [2] Toxoid or toxin-antitoxin. [3] Pharynx. [4] Larynx.



ముగానున్నవారి రక్తనాళములలోనికి డిఫ్తీరియ ఆంటిటాక్సిను ఎక్కించవలెను. వ్యాధి స్వరపేటికకు ప్రాకినప్పుడు ఊపిరివిడుచుట కష్టమగును గాన [1]సక్షన్, [2]ఇంటుబేషన్ అను సాధనములద్వారా ఫలితము కనబడనప్పుడు [3]ట్రేకియాటమియను ఆపరేషన్ చేయవలెను. గొంతుకు తరుచుగా ఆంటిసెప్టిక్ స్ప్రేయుచు, మెడకు మంచుతిత్తి పెట్టినయెడల, గ్రంధులవాపు తగ్గును. జాస్తి పండ్లరసము, గంజినీళ్లు మొదలగు ద్రవాహారములను ఇయ్యవలెను. ఒక కెటిల్ నిండ పొంగుచున్న నీటిని గదిలో నుంచినట్లయిన, గాలి తడియగును; అప్పుడు ఊపిరి పీల్చుకొనుట కొంచెము సులభమగును.

నివారణము:—రోగిని ప్రత్యేకమైనగదిలోగాని, వార్డులోగాని దూరముగా నుంచుము. బిడ్డలకు డిఫ్తీరియ టాక్సాయిడ్ లేక టాక్సిన్ ఆంటిటాక్సిను చికిత్సచేసి, జీవితకాలమంతయు ఈ వ్యాధినుండి రక్షణశక్తి కలుగునట్లు చేయవలెను. పరిచర్య చేయుచుండగా, నర్సు మాస్కు వేసికొనవలెను; రక్షణశక్తికొరకు చికిత్సపొందవలెను. ముక్కు, గొంతు, కండ్లు —ఈ భాగములనుండివచ్చు స్రావములను డిస్ యిన్ ఫెక్ట్ చేయవలెను. పాత్రలు, సామానులు, పడకగుడ్డలు ఎప్పటివలె డిస్ యిన్ ఫెక్ట్ చేయవలెను. పడకను 24 గంటలు ఎండలో వేయవలెను; గదిని సబ్బునీటితో బాగుగ కడుగవలెను.

క్షయరోగము:—ఇది అంటు వ్యాధి. ఇది దేహములోని యేభాగమునకైనను రావచ్చును. శోషరసగ్రంధులు, ఎముకలు, జీర్ణవాహికలు మూత్రకోశమార్గము మొదలగువానికి ఈ వ్యాధిరావచ్చునుగాని ముఖ్యముగా ఊపిరితిత్తులకు ఇది కలుగును. దీనిని పల్మనరి ట్యుబర్ క్యులోసిస్ అందురు. ఈ వ్యాధి తెలియకుండ ఆరంభమై, చాలకాలము రోగిని బాధించును. దీనివలన చనిపోవువారిసంఖ్య చాల హెచ్చు. ఈ వ్యాధి ప్రపంచమంతట వ్యాపించియున్నదిగాని యిండియాలో విస్తారముగా నున్నది. ఈ వ్యాధివలన బ్రిటిష్ యిండియాలో ప్రతిసంవత్సరము 10,00,000 మందికి తక్కువకాకుండ మరణించెదరు.

సూక్ష్మజీవి:—క్షయరోగ బసిలస్ అను సూక్ష్మజీవివలన 'ట్యుబర్ క్యులోసిస్' (క్షయ) రోగము కలుగును. ఈ వ్యాధిబీజములకు మంచి యెండ

[1] Suction. [2] Intubation. [3] Tracheotomy.

తగులనిచ్చి, వానిని కొద్దికాలములోనే చంపివేయవచ్చునుగాని, తడిగానున్న మెంగిలిలోను, ఇండ్లలోని దుమ్ములోను ముఖ్యముగా చీకటిమూలలలోను, ఈ క్రిములు కొన్ని వారములు బ్రతికియుండవచ్చును. పొంగెడినీటిలో ఈ జీవులను మూడునిమిషములలో చంపివేయవచ్చును. రెండు రకములైన టుబర్‌కల్ సూక్ష్మజీవులు, మానవులనుపట్టి పీడించును. మనుష్యులయందుండు రోగబీజము లొకరకము, పశువులయందుండు రోగక్రిములు రెండవరకము. పశువులయందుండు క్రిములు మనుష్యులకు తక్కువ బలముగల వ్యాధిని కలుగచేయును. ఎముకలు, కీళ్లు, చర్మము శోషరస గ్రంధులు మొదలగువానికి పశుసంబంధమైన క్రిములవలన వ్యాధి కలుగును. ఊపిరితిత్తులకు తగులు ఎక్కువ హానికరమైనవ్యాధి మానవ సంబంధమైన బసిల్లస్‌వలననే కలుగును. టుబర్‌కల్ సూక్ష్మజీవులను భూతదర్పణముక్రింద సులభముగా కనుగొనవచ్చును. క్షయరోగి కళ్లెను పరీక్షించిన, దానిలో లెక్కలేని క్రిములుండవచ్చును.

ఈ వ్యాధికి ముందుండు కారణములు:—సరియైన పోషణలేకపోవుట, క్షీణింపచేయు వ్యాధులు, కొంకిపురుగుల వ్యాధి మొదలైనవి. ఒకే యింటిలో ఎక్కువమంది చేరియుండుట, ఆ యింటిలోనికి చాలినంత వెలుగు, గాలి ప్రసరించుటకు వీలులేకపోవుట. ఈ కారణములు, ఇట్టి పరిస్థితులు తరుచుగా బీదలమధ్యనే యుండునుగాన పేదరికమే యీ వ్యాధికి మూలకారణమనిన న్యాయమే. ప్రజలయొక్క అజ్ఞానము, ఈ రోగముయొక్క అంటునుగూర్చిన నిర్లక్ష్యభావముకూడ ఈ వ్యాధికి మూలకారణము లనవచ్చును.

వ్యాధి వ్యాపించుట:—ఏ వయస్సులోనైనను జనులు ఈ వ్యాధికి లొంగిపోదురు. కాని సాధారణముగా మంచి యౌవనదశలో అనగా 15–35 సం॥ ల లోపల ఈ వ్యాధి సంభవించును. దీని ఇంక్యుబేషన్ కాలము కొన్నివారములు మొదలుకొని కొన్ని సంవత్సరములవరకుండ వచ్చును. క్షయరోగియొక్క మెంగిలి తుంపరులును అంటుపడిన దుమ్మును లోపలికి పీల్చుకొనుట మూలమున క్షయవ్యాధి వ్యాపించును. అనగా, సాధారణముగా శ్వాసమార్గము మూలముననే అంటులోపలికి పోవును గాని, కొన్నిసార్లు రోగి మెంగిలి తగులుట మూలముననో, ఈగల మూలముననో అంటుపడిన ఆహారమును మ్రింగుటవలన జీర్ణావయవములగుండ



ఆ యంటులోపలికి ప్రవేశించవచ్చును. ఊపిరితిత్తులకు క్షయయున్న రోగిద్వారా అతనిచెంతనున్న ప్రతియొకరికిని అంటువ్యాపించగలదని చక్కగ గ్రహించవలెను.

అధిక అంటువ్యాధులు బాల్యదశలోనే వచ్చును. ఇట్లు బాల్యదశలో వచ్చునవి చాల నెమ్మదిగానున్నట్టుండి, మనము గమనించకుండనే నయమవును. ఇవి కేవలము అపాయకరములుకావని మనము తలంచకూడదు. వీనితరువాత ముమ్మరమైనట్టియు, మరణకరమైనట్టియు వ్యాధులు యౌవనములోను, మధ్య వయస్సు ఆరంభములోను కనబడును. కావున చిన్న పిల్లలను క్షయరోగులవద్ద చేరకుండను, వారికి అంటుతగులకుండను చేయుట చాల ముఖ్యమైనవిషయము.

ఆరోగ్యముగానున్న ఊపిరితిత్తిలోనికి టుబర్‌కల్ సూక్ష్మజీవులు ప్రవేశించినప్పుడు తెల్లని రక్తకణములు వానిని ఎదుర్కొని నాశనముచేయుటకు త్వరగ జేరుకొనును. టుబర్‌కల్ బసిలైచుట్టునుండు టిష్యూ రియాక్షన్ (ప్రతిచర్య) ఫలితముగా, గుండుసూదియంత లేక యింక చిన్నదగు ట్యూమర్ పుట్టును. దీనినే 'టుబర్‌కల్' అందురు. అదృష్టవశాన దేహమునకు రక్షణశక్తి సాధారణముగా రోగక్రిములను జయించగలిగినంతగా నుండును. దీనివలన కొంతవరకు రక్షణశక్తి యేర్పడును. ఇట్లే చిన్నతనములో లోపలప్రవేశించిన క్షయరోగపు అంటు అణిచివేయబడును. కాని పెద్దవారగుకొలది, యీ వ్యాధికి అనుకూలమైన కారణములు (ఇంతకుముందు చెప్పినవి) ఉన్నయెడల, రోగక్రిములు తిరిగి పనిచేయనారంభించి, టిష్యూ రియాక్షనువలన నేర్పడిన ట్యూమర్ గుండ బయటికివచ్చి, పెద్దవారిలో కనబడు ముమ్మరమైన క్షయరోగమునకు కారణమగును.

లక్షణములు:—ఊపిరితిత్తుల క్షయ (పల్మనరీ టుబర్‌కులోసిస్) వెవ్వేరువిధములుగా వచ్చును. (1) తీక్షణమైన న్యుమోనియవలె వచ్చును. ఇది న్యుమోనియవలెనే యుండునుగాని, కొన్నివారములలోనే మరణము సంభవించవచ్చును. (2) రెండవరకములో చిన్నగింజలాటి టుబర్‌కల్స్ అనునవి రెండు ఊపిరితిత్తులలో అక్కడక్కడ విస్తరించియుండును. ఈ రకముకూడ నధిక అపాయకరమైనదే. (3) మూడవది, సాధారణముగా వచ్చునట్టియు, దీర్ఘకాలముండునట్టియు వ్యాధి. ఈ రోగము అనేకనెలలు లేక సంవత్సరములు రోగిని బాధించి చంపును.

రోగికి దగ్గు అధికముగానుండుట, కళ్లెపడుట, జ్వరముండుట, చిక్కిపోయి తూనికతగ్గుట—ఈ చిహ్నములున్నప్పుడు వ్యాధి ఆరంభించినదని తలంచుట పొరపాటు; వ్యాధి ముదిరినదనియు, ఇక అది కుదురుట దుర్లభమనియు గ్రహించవలెను. క్షయవ్యాధిని అరికట్టవలెననిన, దాని ప్రారంభలక్షణములను జాగ్రత్తగ గుర్తించవలెను. ఆరంభచిహ్నములు కనిపెట్టుట పలుమారు కష్టతరము. అవేవనగా, జలుబుచేసి చాలకాలము నిలిచి యుండుట, కొంచెము పనిచేసినను అలతిగా నుండుట, సాయంకాలములో కొద్దిగా జ్వరముండుట, పొడిదగ్గు, గుండెలో నొప్పి, ఉమ్మిలో రక్తము పడుట. వ్యాధి ముదిరేకొలది, వ్యాధియున్న ఊపిరితిత్తుల భాగములు మెత్తనై, ద్రవముగమారి గుంటలేర్పడిన తరువాత వాటినుండి యెక్కువ కళ్లెపడును. రోగికి ఈ సమయములో జ్వరముండును, రాత్రులలో చెమట పోయును. రోగి బలహీనపడి, బరువు తగ్గిపోవును. అజీర్ణము, ఆకలి లేకపోవుట సాధారణమైయుండును; రక్తస్రావముకూడ నుండవచ్చును; వీటివలన ఒకప్పుడప్పుడు మరణము హఠాత్తుగా సంభవించవచ్చును. సాధారణముగా బలహీనతవలనను అలతవలనను మరణము కలుగును.

రోగమును గుర్తించుటకు రోగిదేహమును బాగుగా పరీక్షించవలెను. లెబొరిటరిలో కళ్లెను పరీక్షించి, ఎక్స్ - రే పరీక్ష, టుబర్కులిన్ పరీక్ష మొదలయినవి వేయవలెను.

**చికిత్సయు, పరిచర్యయు:**—విశ్రాంతివలన క్షయరోగము చాలవరకు నివారణయగునని చాలకాలమునుండి యెరిగిన విషయమే. నవీనపద్ధతుల వలన, రోగమున్న ఊపిరితిత్తి పనిచేయకుండ విశ్రాంతి నిచ్చెదరు. కాని దేహమంతటికిని విశ్రాంతి యవసరమని ఎల్లప్పుడు గ్రహించి ఈ విశ్రాంతి జయకరమైన చికిత్సకు ఆధారముగ చేయుదురు. విశ్రాంతియన కొన్ని వారములు లేక నెలలు పడకలోపరుండి సంపూర్ణముగా విశ్రాంతిపొందుటయే. ఈ సందర్భములో మనశ్శాంతి అత్యావసరమని తలంచుచున్నారుగాన, రోగికి ఏవిధమైన చింతలుగాని, దిగులుగాని లేకుండ చేయుట ఉత్తమము.

చికిత్సలో గమనించవలసిన యితర ముఖ్యవిషయము లేవనగా:—

**(1) మంచి యాహారము పుష్కలముగా నియ్యవలెను.** క్షయరోగులకు ఆకలి మాంద్యముండునని మనము గ్రహించవలెను. కావున వారు పోషణకరమైన ఆహార మెక్కువగా భుజించునట్లు (*a*) రుచిగలిగి నట్టియు, ఆకలిని పుట్టించునట్టియు ఆహారము నిప్పించవలెను. (*b*) మితముగా అనేకసారులు ఆహారము పెట్టవలెను. (*c*) చూచుట కెక్కువగా నున్నదియు, పోషణ విలువలేనిదియునైన భోజనము పెట్టకూడదు. వీరికిచ్చు ఆహారములో పలువిధమైన ఆహారపదార్థము లుండవలెను. వీనిలో పండ్లు, కూరగాయలు, మాంసము, చేపలు, గుడ్లు, పాలు, కాయదినుసులు, నెయ్యి, పెరుగు, మజ్జిగ, వరియన్నము, గోదుమ, రాగిగంజి చేరియుండవలెను. పై యాహారపదార్థములలో అవసరమైన లవణపదార్థములును, విటమినులును సమకూడియున్నవి.

**(2) మంచిగాలి, సూర్యునివెలుగు:**—రోగికి రాత్రింబగళ్లు మంచి గాలి తగులునట్లు అతని పడకను ఏదైన పంచెలో వేయుటమంచిది. రోగికి సూర్యునివెలుగు తగులుట మంచిది. ముఖ్యముగా కీళ్లలోను, ఎముకలలోను క్షయరోగమున్నప్పుడు వెలుగు తగులుట అవసరమును, చాల ప్రయోజనకరమునై యుండును.

**(3) క్రమముగ హెచ్చించు దేహాభ్యాసము:**—పైన రోగి పడకలో సంపూర్ణముగా విశ్రాంతిపొందవలెనని చెప్పితిమిగదా. వ్యాధి విస్తరించి, రోగికి జ్వరముగానున్న అవస్థలో అట్లు సంపూర్ణ విశ్రాంతిపొందుట అవసరము. జ్వరమున్నదో లేదో కనుగొనుటకు ప్రతిసారి దేహోష్ణమును పురీషనాళముద్వారానే తీయవలెను. జ్వరము బొత్తుగా విడిచిన రెండు వారముల తరువాత రోగి కూర్చుండవచ్చును. ఒక్కొక్కదిన మెక్కువ కాలము కూర్చుండునట్లు, కాలమును క్రమక్రమముగా హెచ్చించుచుండవలెను. ఇంకను జ్వరము లేకుండినయెడల, రోగిచేత తేలికయైన దేహాభ్యాసము క్రమేణ హెచ్చింపుచు చేయించవలెను. ఇట్టి యభ్యాసముల మూలమున చిన్నచిన్న పరిమాణములుగల టాక్సినులు స్వేచ్ఛనొంది పని చేయుటకు వీలగునుగాన, టుబర్కల్ బసిలై సరికట్టి, రక్షించుకొను శక్తియు దేహమున హెచ్చును. మందులవలన విశేష లాభములేదు. ముమ్మరమైన నొప్పిని, బాధకరమైన దగ్గును తగ్గించుటకే యీ మందులను వాడవలెను.

రక్తస్రావము (హిమాప్టిసిస్) ఏ భాగమునమున్నదో తెలిసినయెడల, రోగి నాప్రక్కను పరుండబెట్టవలెను. అట్లు చేసినచో రోగి శ్రమలేకుండ దగ్గగలుగుటయేకాక, కఫము, శ్లేష్మము సులభముగా బయటకు విసర్జించ

గలడు. ఈ సమయములో రోగిని సాధ్యమైనంతవరకు శాంతముగా నుంచుము. తడిపిన చల్లనిగుడ్డలుగాని, మంచుసంచిగాని యెదురురొమ్ము మీద పెట్టుము. నోటిలోను మంచుముక్కలు వేసి మ్రింగించుము. పడక కాళ్లప్రక్క ఎత్తిపెట్టి, రోగిని శాంతిపరచుటకును, దగ్గు నాపుటకును మార్ఫిన్ ఇయ్యవలెను. కాల్సియం ఇంజెక్షన్ వలనను బ్లడ్ ట్రాన్స్ఫ్యూషన్ వలనను రోగి రక్తము గడ్డకట్టుకొనుశక్తి అధికమగును. ఈ సమయములో నర్సు రోగిని విడిచిపోక, దగ్గరనేయుండి, వీలైనన్నివిధములుగా అతనిని ధైర్యపర్చుచుండవలెను. రోగి చాల భయపడి ఆయాస పడుచుండిన, వెనుక ఆనుకొనునట్లు పరుండచేసినయెడల, శ్వాసించుట తేలికయగును. రక్తము అతి విస్తారముగా పడుచున్నపక్షమున, ఆఖరి ప్రయత్నముగా రోగికి [1]న్యుమొతోరెక్స్ నియ్యవలెను. రక్తము చాల యెఱ్ఱగను, నురుగు గట్టినట్టును కనబడినయెడల, అది యూపిరితిత్తులలో నుండి పడినదని సులభముగా గ్రహించవచ్చును.

గత కొన్ని సంవత్సరములలో వ్యాధిగ్రస్థమైన ఊపిరితిత్తికి మాత్రము విశ్రాంతి కలిగించుపద్ధతి నమలుకు తెచ్చియున్నారు. సూత్రము పాతదే కాని ఆ పాతసూత్రమును క్రొత్తవిధానములోను, క్రొత్తరూపములోను ప్రయోగించుచున్నారు. ముఖ్యమైన పద్ధతులు మూడే; యేవనగా, [2]ఫ్రెనిక్ నర్వ్ ఇంటరప్షన్ (విభాజకపు నరమును దొలగించుట); [3]ఆర్టిఫిషల్ న్యుమొతోరెక్స్; [4]తోరకొప్లాస్టి (10-వ, 29-వ అధ్యాయములు చూడుము).

నివారణము:—క్షయరోగిని ఒక ప్రత్యేకమైనవార్డులో పెట్టవలెను. సానటోరియమ్ (క్షయరోగుల ఆస్పత్రి)లో నుంచుట మరిమంచిది. ఇంటిలోనే అట్టి రోగికి చికిత్స చేయవలసియుంటే, ఇతర కుటుంబికులనుండి రోగిని ప్రత్యేకించవలెను. రోగి కళ్లె, చీమిడి—వీనిని కాల్చివేయవలెను. కళ్లెను మూతవేసిన గిన్నెలోపట్టి యుంచవలెను. ఈ గిన్నెలో కాగితపు ముక్కలు, రంపపుపొట్టు, ఇతరపొట్టు ఏదైనవేసి, డిస్‌యిన్‌ఫెక్టెంట్‌లో ఊరనీయవలెను. ఇట్టి గిన్నెలోపట్టిన కళ్లెను కాగితములోపోసి, ఆ కాగితము నట్లే కాల్చివేయవలెను. పిమ్మట కళ్లెగిన్నెనుకడిగి శుభ్రము చేయ

[1] Pneumothorax. [2] Phrenic nerve interruption.
[3] Artificial pneumothorax. [4] Thoracoplasty.



వచ్చును. లేక కాగితముతోగాని, అట్టలతోగాని చేసిన గిన్నెలనువాడి, వానిలోని కళ్లెను తీసివేయకుండనే కాల్చివేయవచ్చును. తుమ్మునప్పుడును, దగ్గునప్పుడును నోటికి, ముక్కుకడ్డముగా గుడ్డపెట్టుకొనవలెనని రోగికి నేర్పవలెను. రోగిని పరీక్షించుచుండగను, చికిత్సచేయుచుండగను, రోగి ముసుకువేసికొనుట (అనగా మూతికి, ముక్కుకు అడ్డముగా గుడ్డకప్పుకొనుట) వలన ఇతరులను కాపాడువాడగును. కాగితములతో చేసిన సంచిని మంచముప్రక్కను గుండుసూదితో గ్రుచ్చి దానిలో అతడు వాడిన గుడ్డలను వేయుటమంచిది. రోగి భుజించు పాత్రలను పొంగించవలెను; అతడు విడిచిపెట్టిన మెతుకులను గాల్చివేయవలెను. రోగి పడకగుడ్డలను, ధరించిన దుస్తులను 15 నిమిషములు పొంగించవలెను; లేదా 5% కార్బాలిక్ లేక 2% లైసాల్ లోషనులోగాని, మరేదైన డిస్‌యిన్‌ఫెక్టెంట్ లోషనులోగాని ఒక గంటసేపు బాగుగా నానబెట్టవలెను. రోగిని ఆస్పత్రి నుండి పంపివేసినతరువాత, అతని పడకను ఒక దినమంతయు ఎండలో వేయవలెను. రోగియున్నగదిని, ఆ గదిలోని సామానులను సబ్బునీళ్లతో కడిగి వాటికి మంచిగాలి, యెండతగులునట్లు చూడవలెను. గచ్చుచేసిన గోడలకు సున్నము కొట్టించవచ్చును.

క్షయరోగము నాపుటకు ముఖ్యముగా చేయవలసినపని యేమనగా, ప్రజలకును, ముఖ్యముగా విద్యార్థులకును అంటునుగూర్చి నేర్పించవలెను. ఈ వ్యాధి సులభముగా వ్యాపించు స్వభావముగలదనియు, బహిరంగ స్థలములలో ఊయుటవలన కీడు కలుగుననియు, శుభ్రమైనగాలి, సూర్యుని వెలుగు, చాలినంత మంచియాహారములు విలువగలవనియు ప్రచారము చేసి నేర్పించుట చాల ముఖ్యమైనసంగతి.

సన్నిపాత జ్వరము (టైఫాయిడ్ ఫీవర్):—ఇది టైఫోసస్ బసిలస్ అను విషక్రిమివలన కలుగు అంటువ్యాధి. ఇది ప్రపంచమంతట వ్యాపించియున్నదిగాని యిండియాలో సర్వసాధారణమైనది. ఇది చిన్న ప్రేగులవ్యాధి; ఎక్కువ విషముతో నిండినస్థితి. నాడి తక్కువగ కొట్టుకొనుట, ప్లీహము విస్తరించుట, గులాబీమచ్చలు దీనికి లక్షణములు. ఇది తరచుగా తిరగబెట్టుచుండుట సహజము.

ఈ వ్యాధి ఇంక్యుబేషన్ కాలము 7-21 దినములు. ఈ వ్యాధి, రోగిని నేరుగా తాకుటవలనగాని, క్రిమివాహకుల మూలమునగాని

రావచ్చును. లేదా, రోగి విసర్జించిన మలమూత్రములతో అంటుతగిలిన భోజనపానీయములను తాకుటవలనను అతడు ముట్టిన ఇతర వస్తువులను దాకుట మూలముననను రావచ్చును. విషక్రిములు రక్తప్రవాహములోను, మలమూత్రాదులలోను, ప్లీహములో నుండును. ఈ క్రిములు నోటి మూలమున లోపలికి ప్రవేశించి, మలమూత్రములగుండ దేహమునుండి బయటపడి, దగ్గరిబావులు, చెరువులు, నదులు, భూసారము—వీనిలో చేరి చాలకాలము జీవించియుండగలవు. ఈ వ్యాధిని [1]'వీడాల్ పరీక్ష'చేసి నిర్ణయింతురు. వ్యాధివచ్చిన పది రోజులకు ఈ పరీక్ష ఫలితము ఖాయముగ తెలియును.

లక్షణములు:—ఆరంభములో ఈ వ్యాధిక్రమేణ హెచ్చును; అలత, తలనొప్పి, ఆకలిలేమి, జ్వరము—ఇవి యారంభ లక్షణములు. జ్వరము ప్రతిదినము హెచ్చుచు, 10-వ దినమున 104°—105° F. కు ఎక్కి, అట్లు రెండు వారములవరకుగాని ఇంకా ఎక్కువరోజులవరకుగాని దిగక యుండును. పిమ్మట [2]'లైసిస్' ప్రకారము ప్రతిదినము క్రమేణ తగ్గుచువచ్చును. ఇట్లు ఒక వారమువరకు తగ్గుచు, తుదకు నార్మలుకు వచ్చును. కొందరు రోగులలో జ్వరము ఎల్లప్పుడు హెచ్చుచు తగ్గుచు నుండును. మరి కొందరిలో జ్వరము 101° F. ల కంటె ఎన్నడు హెచ్చుగా నుండదు. ముమ్మరమైన తలనొప్పి, కడుపులో నొప్పి యుండవచ్చును. అంటుచేరియున్న ప్రేగుభాగ ముక్కంది, పుండుకావచ్చును. ఈ పుండ్లు పగిలి యెక్కువరక్తము కారవచ్చును; లేదా ప్రేగు చిల్లులుపడవచ్చును. కడుపు ఉబ్బి, అతిసారమైన మలబద్ధకమైన కలుగవచ్చును. అతిసారములలో భేది పప్పుచారువలెనుండును. మొదటివారములో నాడిగతి మెల్లగనుండును. తరుచుగా నిది ద్విత్వనాడి స్వభావము గలిగియుండును. కాని రెండవవారములో టాక్సీమియ (అనగా రక్తము విషమయమగుట) ముమ్మరముగానుండెనేని, నాడి చాలవడిగా కొట్టుకొనవచ్చును. రెండవ, మూడవవారములలో కడుపుమీదను, వీపుమీదను గులాబీమచ్చలు కనబడును. నల్లని శరీరము మీద ఈ మచ్చలను గుర్తించుట కష్టము. మూడవవారములో వ్యాధి ముమ్మరమైనయెడల కలవరింతలు సంధిగుణము పుట్టవచ్చును. రోగి కండ్లు తెరచి పరుండియున్నను, తనచుట్టు జరుగుచున్న దానిని గ్రహించ

[1] Widal test. [2] Lysis.



లేని స్థితిలోనుండును. అతడు చెవిటివానివలె వినలేక తనలోతానే గొణుగుకొనుచు నుండును; కొన్నిసారులు పెద్దగ కేకలువేయును; మరి కొన్నిసారులు వణుకుచున్న వ్రేళ్లతో పడకగుడ్డలు గిల్లుచుండును. ఈ సమయములోనే రక్తముకారుట ప్రేగు చిల్లులుపడుట సంభవించునుగాన, నర్సు బహు మెలకువగ నుండవలెను. రోగి పడకలోనే మలమూత్రాదులను విడువవచ్చును. అతని నోరు ఈ రోగస్వభావము చొప్పున కనబడును. నాలుక యెండి పూత పూసియుండును. ఈ పూత గోదుమ వర్ణముగానుండును. ఇక్లే పండ్లను పాచిపట్టియుండును. ఈ టైఫాయిడ్ జ్వరము 3 నుండి 8 వారములవర కుండవచ్చును. జ్వరము ఎక్కువ ముమ్మరముగ లేకుండిన, సాధారణముగా 3, 4 వారములుండును. జ్వరము తగ్గినప్పుడు రోగి చాల బలహీనముగను, చిక్కిపోయియుండును. అయినను నర్సు అన్నివిషయములలో మంచి పరామరికచేసినయెడల, రోగి త్వరలో మంచిబలము పొందును. అతనికి అమితమైన ఆకలి పుట్టుట వలన, దొంగతనముగనైనను అన్నము సంపాదించుకొని తినగోరును.

సంకరవ్యాధులు: – రక్తస్రావమగుట, ప్రేగులు [1]చిల్లులుపడుట, బ్రాంకైటిస్, న్యుమోనియ, [2]పరోటైటిస్, [3]ఒటైటిస్ మీడియ, [4]ఫ్లెబైటిస్ మొదలైనవి.

చికిత్సయు, పరిచర్యయు—తలనొప్పి, జ్వరము, టాక్సీమియ, కడుపునొప్పి, కడుపుబ్బరము, కలవరింతలు—ఈ లక్షణములకు తగిన చికిత్సచేయవలెను. జ్వరము తగ్గించుటకును, ఆయాసము, కలవరింతలు పోగొట్టుటకును చన్నీటి స్పాంజ్ స్నానము చేయుటతోను, తలమీద మంచుసంచి పెట్టుటతోను సాటియైన చికిత్సలేదు. టాక్సీమియను తగ్గించుటకు విస్తారముగా నీళ్లియ్యవలెను, అనగా దినమునకు కనీసము 3,000 cc. లైన నియ్యవలెను. మలవిసర్జనము జరుగుటకును, [5]కడుపుబ్బరము రాకుండచేయుటకును జాగ్రత్తగా ఎనెమల నిచ్చుట మంచిది. కర్పూరతైలములో కాపడమువలనను పురీషనాళములో గొట్టము పెట్టుట మూలమునను కడుపుబ్బరమును తొలగించవచ్చును. ప్రతిదినము స్నానముచేసి దేహము బాగుగ పలుమారు రుద్దవలెను. ఇట్లు చేయుటమూలమున పడకపుండ్లు

[1] Perforation. [2] Parotitis. [3] Otitis media. [4] Phlebitis. [5] Tympanites.

లేవకుండును. రెండు గంటలకొకసారి రోగి పరుండినతీరు మార్చుచుండ వలెను. ఇట్లు చేయుటవలన రోగికి సౌఖ్యము కలుగుటయేకాక, రక్తము సరిగా ప్రవహించుటకు సహాయమగును. ఆహారము నియ్యకముందును, ఇచ్చినతరువాతను రోగి నోటిని కడుగవలెను; పెదవులకు నూనెరాయ వలెను. రోగియందు ఏమైన విపరీతమైన చిహ్నములు కనబడునా యని నర్సు గమనించుచుండవలెను. ఎందుకనగా, కడుపునందు అకస్మాత్తుగా పుట్టిన నొప్పిగాని, ప్రేగులు చిల్లులుపడినట్లు ఇతర సూచనలుగాని కన బడునేమో యని నర్సు గమనించుచుండవలెను. దీనికి వెంటనే శస్త్రచికిత్స చేయుట అవసరము. నాడిగతి అకస్మాత్తుగా హెచ్చుట, రోగి ఆయాస ముతోనుండుట, ముఖము తెల్లబడుట—ఇవి రక్తస్రావమునకు గుర్తులుగా నెంచి చికిత్సచేయవలెను. ఈ స్థితిలో రోగి కడుపుమీద మంచుపెట్టి, అతడు కదలకుండ నెమ్మదిగా పరుండునట్లు చేయవలెను. నోటితో ఆహార మిచ్చుట చాలించి, రోగిని శాంతిపరచుటకు మార్ఫిన్ ఇయ్యవలెను. కాల్సియం లాక్టేట్ ఇంజెక్షన్ లిచ్చినయెడల, రక్తము గడ్డకట్టుటకు సహాయపడును.

రోగికి చాల జాగ్రత్తగ ఆలోచించి ఏర్పాటుచేసిన ఆహారము నియ్య వలెను. ఎక్కువ కలోరిక్ ఆహార ద్రవములను, మెత్తని యాహారము లను రెండుగంటల కొకసారి యిచ్చుచు, మధ్య మధ్య నీళ్లు విస్తారముగా త్రాగనిచ్చుచుండవలెను. 24 గంటలలో 5,000 cc. ల ద్రవములనిచ్చుట మన గురిగానుండవలెను. విటమిను B & C గల ఆహారపదార్థముల నిచ్చు టకు మనము జ్ఞాపక ముంచుకొనవలెను. పాలు, మజ్జిగ, పెరుగు, రక రకములైన గంజి, పండ్లరసము, ఆల్బ్యూమెన్ నీళ్లు, మాంసరసము, ఎగ్‌ఫ్లిప్స్, కస్టర్డ్స్ మొదలైన ఆహారపదార్థములను ఇయ్యవచ్చును; రెండు సారు లుడికించిన అన్నము మెత్తగా ఉడికించిన గ్రుడ్లు, తురిమిన పశు మాంసమును వైద్యుని సెలవైనయెడల, వ్యాధియున్న కాలమంతయుకూడ నియ్యవచ్చును. ముఖ్యముగ విటమిన్ B కాంప్లెక్స్, విటమిన్ C ఇయ్య వలెను. వ్యాధి ముమ్మరముగానున్నప్పుడు ముక్కుద్వారా ఆహారము నియ్యవలసివచ్చును.

నివారణము:—జనరల్ వార్డులో రోగిని ప్రత్యేకముగానుంచి అతని కుపయోగించు పరికరములనుగూడ ప్రత్యేకించవలెను. రోగి మలమూత్ర



ములను మూతయున్న పాత్రలలోపెట్టి డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవలెను. పాత్రలను నీటిలో పొంగించవలెను. గుడ్డలను, పడకను, రోగియున్న గదిని యింతకుముందు చెప్పిన సాధారణరీతిగానే శుభ్రము చేయుచుండ వలెను. రోగికి సంబంధించినవారును, పరిచర్య చేయు నర్సులును టీకాలు వేయించుకొనవలెను.

ఇండియాలో ఈ యొకటే వ్యాధివలన దాదాపు పదిలక్షల జనులు ప్రతిసంవత్సరము చనిపోవుచున్నారు. కావున నేలను మరుగుదొడ్డిగా నుపయోగించుటవలన నెట్టి కీడులు కలుగునో అందరికి తెలియజేయవలెను. మలముమీద ఈగలు ముసిరి, కోట్లకొలది క్రిములను మోసికొనిపోవును. అంతేకాదు, దగ్గరనున్న నదులు, బావులు అంటుపడునట్లు చేయును. టైఫాయిడ్ నుండి బాగుపడినతరువాత రోగి అంటు క్రిములవాహకుడు కావచ్చును గాన, ఇతరులకు తన వ్యాధి తగలనీయకుండ యెట్లుండ వలెనో అతనికి నేర్పవలెను. అంటువ్యాధులు ప్రబలియుండునప్పుడు జనులకందరికి, ఈ వ్యాధి రాకుండుటకై వాక్సినేషన్ చేయించవలెను.

<u>మాల్టా జ్వరము [1](అండులెంట్ ఫీవర్):</u>— ఇదియు నొక అంటు వ్యాధియే. ఇది వరుసజ్వరము క్రమముననుసరించి అనేకవారము లుండును. ఇది టైఫాయిడ్ జ్వరమును బోలియుండును.

ఇది [2]బ్రూసెల్లా మెలిటెన్సిస్ అను క్రిమివలన గలుగుచున్నది. మేకలు, పశువులు, ఈ వ్యాధికి మూలస్థానములు. వీనివలనను, తగిలిన మనుష్యులవలనను యిది వ్యాపించును. అంటు గలిగినటువంటి జంతువుల యొక్కయు, మనుష్యులయొక్కయు పాలలోను, మలమూత్రములలోను ఈ విషక్రిము లిమిడియుండును. మేకపాలవలన ఈ యంటు ముఖ్య ముగా వ్యాపించును. శ్వాసనాళముద్వారాను, జీర్ణావయవమార్గము ద్వారాను చర్మముమీద లేచు పొక్కులద్వారాను ఈ క్రిములు లోపల ప్రవేశించును. ఇంక్యుబేషన్ కాలము 4 నుండి 17 దినములు.

లక్షణములు:—వ్యాధి తెలియనిరీతిగ ఆరంభమగును. మొదట సరిగా గ్రహించలేని నొప్పులు, ఆకలిలేమి, తలనొప్పి, టైఫాయిడ్‌ను బోలిన జ్వరముండును. రెండువారములైనతరువాత ఇది తగ్గిపోయి తిరిగి

[1] Undulant fever (Malta fever). [2] Brucella Melitensis.

రావచ్చును. ఇదేవిధముగా అనేకవారములు హెచ్చుచు తగ్గుచు నుండును. దప్పి, మలబద్ధకము, కీళ్లసంధులలో ముమ్మరమైన నొప్పి, చెమటపోయుట—ఈ వ్యాధియొక్క సాధారణమైన లక్షణములు.

**చికిత్సయు, పరిచర్యయు:**—రోగిని పడకలో పరుండబెట్టి టైఫాయిడ్ రోగికివలెనే చికిత్సచేయుముగాని, ఆహారము ధారాళముగ నిమ్ము. దీనివలన కలుగు సంకరవ్యాధు లేవనగా:— ప్రేగులలో రక్తస్రావము, అనీమియ (రక్తహీనత) [1]ఆర్కైటిస్, [2]పారొటైటిస్, మనస్సు క్రుంగిపోవుట, నిద్రా నాశము.

**నివారణము:**—రోగిని జనరలు వార్డులో ప్రత్యేకముగానుంచి టైఫాయిడ్ జ్వరమునకువలెనే నివారణోపాయముల ననుసరించుము. చేతుల మీద పొక్కులున్నవా రెవరు నిట్టిరోగికి పరిచర్య చేయకూడదు.

**బసిలరి డిసెంటరి:**— ఈ రకపు రక్తవిరేచనము అంటువ్యాధిగా (ఎపిడెమిక్) వచ్చును. ఇది తీక్షణముగనైనను దీర్ఘమైనదిగనైనను, హానికరమైనదిగనైనను, లేక బలము తక్కువగానైన నుండవచ్చును. ఇది 'డిసెంటరి బసిలై'వలన కలుగుచున్నది. ఈ క్రిములలో అనేక రకము లున్నవి. కాని వానిలో [3]షీగ, [4]ఫ్లెక్స్‌నర్ అను రెండు ముఖ్యమైనవి. ఇండియాలో ఈ వ్యాధి సాధారణమైనదై అనేక మరణములకు హేతుభూతమగుచున్నది. ఇంక్యుబేషన్ కాలము కొన్నిగంటలు మొదలు 7 దినముల వరకుండును. నేరుగ తాకుట మూలముననను, ఇతర మార్గముల మూలముననను ఈ వ్యాధి వ్యాపించును. ఆహార పానీయముల మూలముననను ఈగల మూలముననను ఈ వ్యాధి వ్యాపించును. అంటు రోగక్రిములు అన్నవాహికగుండనే లోపలికి ప్రవేశించి బయటికి పోవును.

**లక్షణములు:**—ఈ వ్యాధి ఆకస్మికముగగాని, క్రమేణగాని ఆరంభించ వచ్చును. ఈ వ్యాధి సహజలక్షణము లేవనగా.—అధిక జ్వరము, వాంతి, దాహము, కడుపునొప్పి, పలుమారు విరేచనమగుట; అయినప్పుడెల్ల ముక్కుట. కొన్నిసార్లు ఈ వ్యాధి వాంతిభేదిని బోలియుండును. ముమ్మరమైన వ్యాధియున్నప్పుడు మలములో రక్తమును, బంకయుపడును. రక్త మెక్కువగా విషమయమైనట్టుండును. కావున రోగి నిస్త్రాణజెంది శరీరములో

[1] Orchitis. [2] Parotitis. [3] Shiga. [4] Flexner.



ద్రవములేనివాడగును. ఈ వ్యాధివలన లేచు పుండ్లు అమీబిక్ డిసెంటరిలో నున్నంత లోతుగా నుండవుగాని అవి మరి యెక్కువ విశాలముగా వ్యాపించి యుండును. వ్యాధి తగ్గుకొలది, భేదులు తగ్గును; విరేచనము మలరూపముగా కొంచెము గట్టిపడును. దీనివలన కలుగు ఇతర సంకర వ్యాధులు—ఆర్త్రైటిస్, (సంధివాతము), [1]మూత్రము అణిచివేయబడుట, రాపిడిపుండ్లు, జలోదరము మొదలైనవి.

**చికిత్సయు, పరిచర్యయు:**—పడకలో రోగి పరుండి సంపూర్ణవిశ్రాంతి తీసికొనుట అవసరము. [2]సల్ఫగ్వానడిన్ తగినంత మోతాదు లిచ్చిన యెడల, చురుకైన ఫలితమిచ్చును; లేనియెడల వ్యాధి యారంభములో ఒక మోతాదు ఆముదమునిచ్చి, దానితరువాత నాలుగుగంటల కొకసారి చిన్న మోతాదులుగ సోడియం సల్ఫేట్ ఇయ్యవలెను. ఆంటి డిసెంటరిక్ సీరం (రక్తభేదికి విరుగుడైన సీరం) ఇచ్చుటవలనను మేలుకలుగును. మొదటి సారి సీరం చికిత్స నిచ్చునప్పుడు షాక్ (అదురు) సంభవించవచ్చునుగాన, అడ్రెనలిన్ అను మందు దగ్గరనే యుండవలెను. కందుటను దగ్గించుటకు గాను, టానిక్ ఆసిడ్‌తోగాని సిల్వర్ నైట్రేట్‌తోగాని లేక సేలైన్‌తో గాని పురీషనాళమును గడుగుటకు ఉత్తరువు ఇయ్యవచ్చును. రోగి యెక్కువ సారులు విరేచనము చేయుచుండినయెడల, పడకచట్టి (బెడ్‌పాన్) వాడ కూడదు. మెత్తనిగుడ్డ లేక దూది మెత్తనుచేసి, దానిని సులభముగా తీసి వేయవచ్చును. ఆసన భాగమును బాగుగా కడిగినతరువాత, చర్మముమీద పొక్కులు, పుండ్లు లేవకుండ, ములామును పట్టించవచ్చును. వేడికాపడము మూలమున కడుపులోని నొప్పితగ్గును. స్టార్చ్ ఓపియం ఎనెమల నిచ్చినయెడల, విరేచనము చేయునప్పుడుండు ముక్కుట తొలిగి పోవును. వ్యాధి మొండికి తిరిగినప్పుడు [3]సీకాస్టొమి యను చికిత్సచేయుదురు. దీని మూలమున ప్రేగునకు విశ్రాంతి కలుగును; దానిని బాగుగా కడుగుటకును వీలగును. ఆహారము నిచ్చినతరువాత నోటిని బాగుగా కడుగవలెను. విరేచనములు తరుచుగా నగుచుండునంతకాలము రోగికి ద్రవాహారములనే పథ్యముగా నియ్యవలెను. గంజి, బార్లినీళ్లు, టీ, ఆల్బ్యుమెన్‌నీళ్లు, మాంసపురసములు మొదలగువాని నిచ్చుచుండవలెను. రోగికి 24 గంటలలో కనీసము 4,000 cc. ల ద్రవమునైన నియ్యవలెను.

[1] Suppression. [2] Sulphaguanadine. [3] Cecostomy.

వాంతియున్నప్పుడు నార్మల్ సేలైన్, గ్లూకోస్ చర్మముక్రిందగాని రక్తనాళముల లోనికిగాని ఇయ్యవచ్చును.

నివారణము:—వార్డులోగాని, ప్రత్యేకగదిలోగాని రోగిని ప్రత్యేకించవలెను. మలమూత్రాదులను పడకను రోగిదుస్తులను డిస్ఇన్‌ఫెక్ట్ చేయవలెను. చేతులను డిస్ఇన్‌ఫెక్ట్ చేయుటకు మరి యెక్కువజాగ్రత తీసికొనవలెను. ఈగలను నాశనముచేసి, త్రాగునీటిని పొంగించవలెను.

కాలర (వాంతిభేది):—కాలరవ్యాధి యిండియాలోనే ఆరంభమై, ఉష్ణమండలమంతట వ్యాపించునట్టి అంటువ్యాధి. ఇది కాలర బసిలస్ లేక [1]విబ్రియ యను క్రిమివలన పుట్టుచున్నది. విస్తారముగా భేదియు, వాంతియు ఈ వ్యాధి సహజలక్షణములు. సాధారణముగా ఈ వ్యాధి ఎపిడెమిక్‌గ సంభవించును. దీని ఇంక్యుబేషన్ కాలము కొన్నిగంటలు మొదలు 5 దినములవరకుండును. రోగక్రిములు నోటిద్వారా లోపలికి ప్రవేశించి, మలమూత్రముల మూలమున బయటపడును. ఈ వ్యాధి రోగిని నేరుగా తాకుటవలనగాని, ఆహార పానీయములవలనగాని, ఈగల మూలమునగాని ఇతరులకు తగులుచుండును.

లక్షణములు:—ఈ రోగము తగిలి బాగుపడువారిలో నిది మూడు దశలుగానుండును. (1) ఆరంభదశ (2) నిస్త్రాణదశ (3) తిరుగు ముఖదశ.

1. రోగము హఠాత్తుగా అతిసారవిరేచనములతో ప్రారంభించును. భేదులు పెద్దవిగను నీళ్లుగను అగును. వీనిలో బంక కుదపలు కుదపలుగా పడుటవలన కాలర భేదికి లక్షణమైన బియ్యపు గంజినీటి ఆకారము ఏర్పడును. రోగి త్వరలోనే నిస్త్రాణజెందును. శరీరములోని ద్రవము పోయినందున కడుపు, కాళ్లుచేతుల కండరములు పట్టుకొనిపోవును. చేతుల చర్మము ముడుచుకొనిపోవును; దవుడలు గుంటలుపడును; కండ్లు లోపలికిపోవును. రోగికి అధిక దాహమగును. వాంతివలన బాధ యధికమగును. 2. నిస్త్రాణదశలో రోగికి శీతలమును చెమటలును కమ్మును. అతడు ప్రాణములేనట్టే నిశ్చలముగ పండుకొనియుండును. నాడి బలహీనముగ నుండును; అనేకసారులు కనబడకుండును. మూత్రము చాల కొద్దిగ విడువబడును; మాటలు పడిపోవును. ఈ దశలో రోగి,

[1] Vibria.



టాక్సిమియ అనగా సూక్ష్మవిషప్రాణులనుండి వచ్చు విషమువలననో, రక్తప్రసరణము నిలిచిపోవుటవలననో చనిపోవచ్చును. 3. తిరుగు ముఖదశలో రెండవదశలోని లక్షణములు క్రమేణ అంతరించి, నాడికొట్టుకొనుట తెలియబడును. మూత్రపిండములు పనిచేయును; రోగి దేహములో వేడి పుట్టును.

చికిత్సయు, పరిచర్యయు:—వేడినీటి బుడ్లు, కంబళ్లు ఉపయోగించి రోగిని వెచ్చగానుంచవలెను. వేడినీటితో స్పంజ్ చేయుటయు, వేడి తువాళ్లతో తుడుచుటయు కొంచెము సహాయకరముగా నుండును. శరీరమునుండి పోయిన ద్రవములు తిరిగి చేకూరుటకు, పెద్దమోతాదుల హైపర్‌టానిక్ సేలైనును రక్తనాళములలోనికి ఎక్కించవలెను. వేడి సేలైను కావలసిన సామానును నర్సు సిద్ధముగా నుంచుకొనవలెను. [1]బాక్టీరియోపేజ్, (ఇవి అతి సూక్ష్మమైన జీవప్రాణులు—బాక్టీరియాను చంపశక్తిగలవి.) [2]ఎస్సెన్షియల్స్ ఆఫ్ ఆయిల్స్ ఈ సమయములో వాడుదురు. ప్రేగులను శుద్ధి (డిస్ఇన్‌ఫెక్ట్) చేయుటకుగాను పొటాసియం పర్మాంగనేట్ బిళ్లల నిచ్చెదరు. ఆసిడోసిస్ అనుదానికి విరుగుడుగా మూత్రపిండమునకు చురుకుదనము పుట్టించుటకు దినమునకు 90 గ్రయినులవరకు పెద్ద మోతాదుల సోడియం బైకార్బొనేట్ నిచ్చుచుందురు.

రోగివిడుచు మూత్రముయొక్క పరిమాణము చార్టులో వ్రాయవలెను. బాగుపడుకాలము ఆరంభించినప్పుడు వేడి బార్లినీళ్లు, గంజి, టీ, మొదలగునవి త్రాగించవలెను.

నివారణము:—రోగిని ఒక ప్రత్యేకమైన గదిలో నుంచవలెను. రోగి వాంతి, మలము, మూత్రము, పడక గుడ్డలు, పాత్రలు, రోగికి సంబంధించిన ప్రతి యొకవస్తువును డిస్ఇన్‌పెక్ట్ చేయవలెను. రోగక్రిమివాహకులను, దగ్గరనున్నవారినిగూడ రోగము వ్యాపించకుండ ప్రత్యేకించవలెను. ఆ ప్రాంతపు జనులందరికి టీకాలువేయించవలెను. బావులు, చెరువులు డిస్ఇన్‌ఫెక్ట్ చేయవలెను. అనగా పొటాసియం పర్మాంగనేట్, క్లోరిన్ మొదలైన మందులుపోసి, వానిలోని రోగక్రిములు చనిపోవునట్లు చేయవలెను. త్రాగెడునీటిని పొంగించవలెను. ఏదైన ఒక అంటువ్యాధి ప్రబలి

[1] Bacteriopage. [2] Essentials of oils.

యున్న సమయములో పండనికాయలు, పచ్చి కూరగాయలు తినుట మానవలెను; అప్పుడే వండిన తాజా ఆహారమునే భుజించవలెను.

**ఎపిడెమిక్ లేక బిడ్డల వేసవికాలపు అతిసారము:**—అనారోగ్యజీవితము, అశుభ్రత, సరియైనభోజనము లేకపోవుట—ఇవి పై వ్యాధికి దారితీయును. శరీరతత్త్వమునకు సరిపడని, లేక అంటుపడిన ఆహారము, అందు ముఖ్యముగా పాలు దీనికి కారణము. అశుభ్రమైన పాలబుడ్లును, వాటి అశుభ్రమైన మొనలును ఈ వ్యాధికి కారణములగును.

**లక్షణములు:**—వేసవికాలపు అతిసారముయొక్క లక్షణములేవనగా, వాంతి, భేదులగుట, జ్వర మెక్కువగానుండుట, నాడి బలహీనముగను, వడిగను కొట్టుకొనుట, దేహములో ద్రవము లేకపోవుట, అధిక దాహము, నిస్త్రాణ మొదలైనవి. వాంతిభేది వ్యాధికిగల రోగలక్షణములే ఈ వ్యాధియందును గనబడును. విరేచనము పలుమారు అగుచుండును; దీనిలో బంక పడుచుండును. వాంతిభేదిలోవలె ఇందును భేది, బియ్యపునీళ్ల ఆకారమున నుండును. సరియైన చికిత్స చేయనియెడల, రెండుమూడు దినములలోనే రోగి చనిపోవచ్చును. దీని సాధారణ సంకరవ్యాధి: బ్రాంకోన్యుమోనియ.

**చికిత్సయు, పరిచర్యయు:**—మొదట చేయవలసిన చికిత్స యేదనగా, బిడ్డకు అన్నముపెట్టుట మానివేసి, ద్రవాహారముల నిచ్చుచు, వేడిగా నుండునట్లు చేయవలెను. సాధారణముగా 24 గంటలవరకు నోటిద్వారా ఆహారమిచ్చుట చాలించి, నార్మల్ సేలైనులో గలిపిన గ్లూకోసు, చర్మము క్రిందగాని ఇంట్రపెరిటోనియమ్‌గగాని సూదిద్వారా నెక్కించవలెను. కడుపుచుట్టు మెత్తని గుడ్డను చుట్టినట్టయిన, శరీరమునకు వేడిపుట్టును; నొప్పియు తగ్గుటకు సహాయపడును. ఆరంభములో ఆముదమునిచ్చి, మూడు లేక నాలుగుగంటల కొకసారి ఆముదపు ఎమల్షన్ లేక సోడియం సల్ఫేట్ చిన్న మోతాదులుగా నియ్యవలెను. చాలసార్లు సల్ఫోనమైడ్ మందులతో చికిత్స గుణము నిచ్చును. 1% బలముగల సిల్వర్‌నైట్రేట్‌తో పెద్దప్రేగు క్రిందిభాగమును గడుగుటయు కొంత సహాయకరముగా నుండును. డోకులు, వాంతులు తగ్గిపోయిన తరువాత బార్లి నీళ్లు, ఆల్బ్యుమిన్ నీళ్లు, పాలను విరిచితీసిన నీరు ([1]వే)—వీనిని చిన్నచిన్న

[1] Whey.



మోతాదులుగా, చాల నిదానముగా నియ్యవలెను. జాస్తిగ ద్రవములు త్రాగించి దేహములోనికి పోవు మొత్తపు ద్రవమును, దేహమునుండి బయటికివచ్చు మొత్తపు ద్రవమును వ్రాసియుంచవలెను.

**నివారణము:**—రోగముతోనున్న పిల్లల మలమును వాంతియు అంటు వ్యాపింపచేయునవిగాన, రోగులను ప్రత్యేకించుట మంచిది. ఈ వ్యాధిగల పిల్లలకు ప్రత్యేకమైన నర్సులు పరిచర్యచేయుటయు మంచిది.

**ప్లేగు (మహమ్మారి):**—ఇది ముఖ్యముగా ఎలుక, ఎలుకజాతికిచేరిన జంతువులకును సంబంధించిన వ్యాధి. కాని యిది మనుష్యులకును తగల వచ్చును. ఈ వ్యాధి అరేబియా, ఆఫ్రికా, చీనా దేశములలోను, ఇండియాలోని కొన్ని భాగములయందును కనబడుచుండును. ప్లేగు బసిల్లస్ అను క్రిమి యీ వ్యాధికి కారణము. ఇంక్యుబేషన్ కాలము 1—7 దినములుండును. ఒక్కసారి యీ వ్యాధి తగిలినవారికి వారి మిగత జీవితకాలమంతయు రక్షణశక్తి కలుగును. ప్లేగు రోగముగల [1]ఎలుకయందుండు మిన్నల్లులు కుట్టుటవలన ఈ వ్యాధి సంభవించును. న్యుమానిక్ ప్లేగు ఊపిరి పీల్చుకొనుటవలనను కలుగును. అంటుక్రిములు వాచిన (ఉబ్బిన) గ్రంథులలోను రక్తప్రవాహములో నుండును. ఈ వ్యాధి న్యుమానియ రకమైనయెడల, ముక్కునుండియు, నోటినుండియు కారు చీమిడిలోను, కళ్లెలోను ఈ క్రిములు ఇమిడియుండును. లెబారటారి పరీక్షవలన రక్తము, చీము, కళ్లె—వీనిని పరీక్షించి రోగమును నిర్ణయించనగును.

**లక్షణములు:**—ఈ వ్యాధిలో మూడు రకములున్నవి:—1. [2]బ్యుబోనిక్ ప్లేగ్ (బొబ్బల రోగము)—ఇది సాధారణమైనది. 2. [3]సెప్టిసీమిక్ ప్లేగ్—దీనివలన దాదాపు రోగులందరు చనిపోదురు. 3. న్యుమానిక్ ప్లేగ్—ఇది ముమ్మరమైన న్యుమోనియ వ్యాధిని బోలియుండును. ఇది కూడ సాధారణముగ మరణకరమైనదే.

1. బ్యుబోనిక్ ప్లేగ్:—సాధారణముగ ఇది అకస్మాత్తుగా ఆరంభమగును. చలి, అధికమైన జ్వరము 102°-106°F. ఉండును. నాడి వడిగా కొట్టుకొనును. ముమ్మరమైన తలనొప్పి, తలదిమ్ము, దేహమంతట ఒక విధమైన

[1] Rat flea. [2] Bubonic. [3] Septicemic.

బద్ధకముండును. డోకు, అతిసారముకూడ నుండవచ్చును. రోగి శరీరమంతట విషము చేరుటవలన నతడు ఆయాసముగలిగి కలవరించుచుండును; లేక ఒకవిధమగు గాఢమూర్ఛయందుండును. వ్యాధి ఆరంభదశలో రోగక్రిమి కుట్టినచోటునకు దగ్గరగానున్న శోషగ్రంథులు వాచి, నొప్పిగనుండును. ఇట్లు వాచినగ్రంథులను బ్యుబోస్ అందురు. ఇవి యణిగిన అణిగిపోవచ్చును; లేక చీముపట్టి పుండుకావచ్చును.

2. సెప్టిసీమిక్ రకము:—రోగియందు రక్షణశక్తి యెక్కువ లేనప్పుడును, శరీరములో ప్రవేశించిన క్రిమి బలముచెందినను బ్యుబోనిక్ (బొబ్బలు) ఏర్పడవుగాని, క్రిములు రక్తప్రవాహములో ప్రవేశించి తరుచుగా రోగిని 24 గంటలలో చంపును.

3. న్యుమోనియ రకము:—ఇది బ్యుబోనిక్ రకమునకువచ్చు సంకర వ్యాధి. ఇది ముమ్మరమైన బ్రాంకోన్యుమోనియను బోలియుండును. సైయనోసిస్ వలననో, (దేహము నల్లబారుటవలననో) గుండెయొక్క పనికి కష్టము కలుగుటవలననో రోగి సాధారణముగా చనిపోవును.

**చికిత్సయు, పరిచర్యయు:**—జ్వరమును తగ్గించుటకును, రోగి నెమ్మది కలిగించుటకును, నులివెచ్చని నీటితో స్నానము చేయించుట మిక్కిలి ఉపయోగకరము. బ్యుబోస్ అను బొబ్బలు చీముపట్టి పుండ్లుపడినయెడల వానికి జాగ్రత్తగా కాపడమిచ్చి, ఆంటిసెప్టిక్ మందులతో కట్టుకట్టవలెను. ప్లేగ్ సీర నెక్కించవలెను. జాస్తిగ ద్రవములు త్రాగించవలెను.

**నివారణము:**—ప్లేగ్ తగిలిన రోగులందరిని ప్రత్యేకమైన వార్డులలో గాని, ఆస్పత్రులలోగాని యుంచవలెను. ఈ యంటు తగిలినవారినందరిని 7 దినములవరకు క్వారెంటీన్ లో పెట్టి, జనులందరికి ప్లేగ్ టీకాలు వేయవలెను. ఎలుకలన్నిటిని చంపివేయవలెను. చచ్చిన యెలుకలను కెరోసీన్ ఆయిలులో బాగుగాముంచి కాల్చివేయవలెను. వ్యాధి న్యుమోనియ రకమైనప్పుడు నర్సులు, వైద్యులు మాస్కులు వేసికొని పనిచేయవలెను. బొబ్బలకు కట్టుకట్టునప్పుడు, చేతులకు గ్లవ్స్ వేసికొనవలెను. ముక్కునుండి, గొంతునుండి కారెడు చీమిడి, కళ్లె, ఎంగిలి మొదలైన వానిని, కట్టుగుడ్డలను గాల్చివేయవలెను. రోగులకు వాడుపాత్రలను, ఇతర పరికరములను ఎప్పటివలెనే డిస్ యిన్ ఫెక్ట్ చేయవలెను.



కుష్ఠరోగము:—ఇది దీర్ఘకాలపు అంటువ్యాధి; ఇది బసిల్లస్ లెప్రే యను సూక్ష్మజీవివలన కలుగుచున్నది. ఈ సూక్ష్మజీవి బసిల్లస్ టుబర్క్యులోసిస్ (క్షయరోగక్రిమిని) చాలవరకు పోలియుండును. ఈ వ్యాధి పాతనిబంధన కాలమునుండియున్న పురాతనరోగము. ఆరోగ్యపద్ధతులు బాగుగ అనుసరించి, అమలులోపెట్టు దేశములలో కుష్ఠరోగము దాదాపుగా అంతరించిపోయినది. కుష్ఠరోగము వృద్ధిచెందుటకు మిక్కిలి అనుకూలమైన పరిస్థితులలోనైనను అది పెద్దవారికి తగులుట అరుదు; గాని చిన్నవారు అట్టి పరిస్థితులలో నున్నయెడల నూటికి ఇరువదిమంది మాత్రము యీ వ్యాధినుండి తప్పించుకొందురు. కుష్ఠు ఉన్నవారితో చాలకాలము సంబంధము కలిగి వారిని తాకుచుండుటవలన ఈ వ్యాధి వచ్చును. కుష్ఠరోగమునకు ఇంక్యుబేషన్ కాలము లేదు కాని క్షయవ్యాధిలోనున్నట్టు రోగలక్షణములు చాలకాలము పైకి కనబడకయుండును. ఆరంభదశలో ఈ కుష్ఠు అంతరించిపోవచ్చును; కొన్ని రకములుమాత్రమే చాల ముమ్మరమైన వ్యాధులుగా పరిణమించును. చర్మముగుండ వ్యాధిక్రిములు దూరుటవలననో, నాసికా రంధ్రమార్గమునందలి అమత్వచవలననో యీ వ్యాధి యంటు ఇతరులకు వ్యాపించునని తలంచుచున్నారు. ఈ ప్రాణులను వ్యాధిగ్రస్తునికి లేచిన గణుపులలోను, రక్తములోను, పుండ్లరసిలోను, మలమూత్రములలోను కనుగొన్నారు.

లక్షణములు:—ఈ వ్యాధిలో రెండు ముఖ్యమైన రకములున్నవి.
1. న్యూరల్ రకము (నరములకు సంబంధించినది). ఇది అపాయములేనిది.
2. లెప్రామటస్ (ఇది చాల మోసకరమును, అంటు వ్యాపించునదియునై యున్నది).

న్యూరల్ రకము అనేకవిధములుగా కనబడుచుండును. వీనిలో ననేకములు హానిచేయనివి. ఇందు ఒకరకములో రంగుపోయినటువంటి మచ్చలు కనబడుచుండును. అంతేకాక, ఆ భాగమున ఇంద్రియజ్ఞానము లేకుండును. నరములుబ్బి, మెత్తనివైనందున రోగికి కురూపమేర్పడును.

లెప్రామటస్ కుష్ఠు ఎప్పుడును ముమ్మరముగను, అంటుగలదిగను ఉండును. వ్యాధి బాగుగా ముదిరిపోయినదశలో, దీనిని గణుపులుకట్టిన కుష్ఠు అందురు. కుష్ఠు ఏ రకమునకు చేరినదో కనుగొనుట కష్టము.

నిపుణులుమాత్రమే నిర్ణయించగలరు. ఈ కష్టమునుబట్టి యీ వ్యాధి జనసామాన్యమునకు మిక్కిలి అపాయకరమగుచున్నది. ఆరంభదశలోనే చికిత్స చేయుటచేత అనేకమందిరోగులను అంటులేనివారినిగా చేయవచ్చును. కుష్ఠుగణుపులు సాధారణముగా ముఖము, చెవులు, వీపు పిరుదులమీద పుట్టుచుండును. ఇవి అగపడినప్పుడు క్రమముతప్పివచ్చు జ్వరముండును. ఈ వ్యాధి ముదురుచుండగా, నరములకుకూడ ఈ వ్యాధి తగిలినందున పక్షవాతము రావచ్చును; గణుపులు పగిలి అంటు క్రిమి సహితమైన పుండ్లు ఏర్పడును. ఈ వ్యాధికి సకాలములో చికిత్సచేయని యెడల కాలిచేతివ్రేళ్లు ఊడిపోవచ్చును. ముఖచర్మము, చెవుల మీదిచర్మము మందమగుటవలన, కురూపమేర్పడుట బాగుగ కనబడును. ముక్కువిభజన పుండ్లగుటవలన రోగికి చాల బాధకలుగును; ఇక కండ్లకుకూడ ఈ వ్యాధి సంభవించినయెడల, దాని ఫలితముగా చూపు పోవుటయు సాధారణమే. నూటికి నలువదికి తక్కువమంది కుష్ఠరోగులు ఈ దశకు వచ్చెదరని మనము జ్ఞాపకము పెట్టుకొనవలెను. కుష్ఠువెంట క్షయ, న్యుమోనియ సంకరవ్యాధులుగ రావచ్చును.

చికిత్సయు, పరిచర్యయు:—మొత్తముమీద రోగి ఆరోగ్యము వృద్ధి పొందజేయుట, ఆరోగ్య పారిశుద్ధ్య సూత్రములను రోగి యనుసరించి యమలులో పెట్టునట్లుచేయుట, ఏదైన ఉపయోగకరమైన చిన్నపనిని చేయుచు కాలముగడుపుటను నేర్పుట—ఇవి చికిత్సచేయుటయందుగల ముఖ్యోద్దేశములు. హిడ్నోకార్పస్ నూనెనుగాని, దానితోచేసిన యితర మందులనుగాని వాడవలెను. రెండు ముఖ్యమైన మందులేవనగా, (1) 1% క్రియొసోట్ కలిసిన సాధారణమైన హిడ్నోకార్పస్ నూనె (2) ఎతల్ ఎస్టర్స్ గలిసిన హిడ్నోకార్పస్‌ను 25% ఆలివ్ నూనెతో కలిపి, దానికి 1% క్రియొసోటును చేర్చిన మిశ్రమ నూనె. మందును చర్మముక్రిందగాని, [1]చర్మములోకిగాని సూదిద్వారా ఎక్కించెదరు. ముదిరిన వ్యాధులకు, ముఖ్యముగా అంటురకములకు ఈ రెండవ పద్ధతిప్రకారము తీవ్రమైన చికిత్సచేయుట శ్రేయస్కరము. పొటాసియం ఐయొడైడ్ అను దానిని యీ వ్యాధికి వాడనే కూడదు. దగ్గుమందులలో కలిసియున్న చిన్నమోతాదుల పొటాసియం ఐయొడైడ్ నిచ్చినను లెప్రా

[1] Intradermally.



మటస్ కుష్ఠు కొన్నిసారులు పొంగును. వ్యాధి యధికమగును. కుష్ఠరోగికి కట్టు కట్టుచుండగా నర్సు గ్లవ్స్ వేసికొనవలెను. పుండ్లనుండి కారు చీము, ముక్కునుండికారు చీమిడి, రక్తము—వీనిలో వ్యాధి క్రిములుండవచ్చుననునది జ్ఞాపకముంచుకొని వానిని కాల్చి వేయవలెను.

నివారణము:—సాధారణముగా పెద్దవారికి కుష్ఠు తగలదని మనము జ్ఞాపకము పెట్టుకొనవలెను. అట్లయిన పిల్లలు కుష్ఠరోగముతో, ముఖ్యముగా, అంటుసంబంధమైన కుష్ఠరోగముతో బాధపడుచున్నవారిదగ్గరకు పోకుండ నిర్బంధించుటవలన ఈ వ్యాధి పిల్లలకు తగలకుండ నివారించవచ్చును. బిడ్డ యెవరైనను కుష్ఠరోగిని దాకుట అపాయకరముగాన అట్టి బిడ్డను కుష్ఠరోగి ఎత్తుకొనకను తాకకను నుండుట ఎంతో ముఖ్యమైన సంగతి యని తల్లులు జ్ఞాపకముంచుకొన గలిగినయెడల, ఇతర సదుపాయములకంటె ఈయొక్క యుపాయము మూలమున కుష్ఠు నెక్కువగా వశపరచుకొని వ్యాపించకుండ చేయవచ్చును. కుష్ఠరోగము వంశపారంపర్యముగా వచ్చు వ్యాధి కానేకాదు గాన, బిడ్డలను ఈ వ్యాధిగ్రస్థులనుండి దూరపర్చినయెడల వారికి యీ వ్యాధిరాకుండును.

[1]ఎరిసిపలస్:— ఇది స్ట్రెప్టోకాకస్ క్రిములవలన కలుగు వ్యాధి. జ్వరమువచ్చుట, చర్మముకంది ఆ కందుడు వ్యాపించుట దీని సహజలక్షణములు. ప్రపంచమంతటను ఈ వ్యాధియున్నను, ఇండియాలో పలుమారు కనబడును. రోగులువాడిన వస్తువులను ముట్టుకొనుటవలనగాని రోగులనే తాకుటవలనగాని యీ వ్యాధి యితరులకు సాధారణముగ వ్యాపించును. దీని ఇంక్యుబేషన్ కాలము—3 దినములు. చర్మము మీది పగుళ్లమూలమున అంటు లోపలికిపోవును; వ్యాధియున్న భాగములో ఈ సూక్ష్మప్రాణి యుండును.

లక్షణములు:—చలి, జ్వరముతో ఈ వ్యాధి అకస్మాత్తుగా రావచ్చును. అంటుకలిగిన స్థలము ఎఱ్ఱనై, నిగనిగలాడుచు వాచియుండును. దాని చుట్టు స్పష్టమైన అంచు ఏర్పడును; దీనినుండియే అంటు వ్యాపించును. కొన్నిసారులు దేహములో ఎక్కువభాగమునకు ఇది వ్యాపించును. బొబ్బలు లేచునుగాని చీముకూడుట అరుదు. కందినభాగము మధ్య

[1] Erysipelas.

నుండి పుండు మానుచువచ్చును. దానంతట అదే ఒక హద్దు ఏర్పరుచుకొనును. 4 లేక 5 రోజులలో సాధారణముగా జ్వరము తగ్గిపోవును.

చికిత్సయు, పరిచర్యయు:—రోగిని పడకలోపరుండబెట్టి ఆంటిస్ట్రెప్టో కాకస్ సీరం ఇయ్యవలెను. ఆ భాగమునకు తడిపిన మగ్నీషియమ్ సల్ఫేట్ కట్టుగాని, ఇక్తియాల్ కట్టు గాని కట్టవలెను. సల్ఫనిలమైడ్ ఈ వ్యాధికి మంచి పనిచేయును. రోగికి జ్వరమును ఆయాసమును తగ్గుటకుగాను నులివెచ్చని నీటితో స్పంజ్ స్నానముచేయించుట మంచిది. జ్వరముండిన సమయములో ఎక్కువ కలోరిక్ ద్రవాహారములను అనగా, పాలు, గ్రుడ్డుసొన, కోకో, గంజి, పెరుగు, మజ్జిగను ద్రాగించవలెను. జాస్తినీళ్లు త్రాగించవలెను.

నివారణము:—మెడికల్ వార్డులో రోగిని ప్రత్యేకించవలెను. అంటు పడిన పరికరము లన్నింటిని డిస్ ఇన్ ఫెక్ట్ చేయవలెను.

[1]ఎపిడెమిక్ సెరిబ్రొస్పైనల్ మెనింజైటిస్:—మెనింజైటిస్‌లో మూడు రకములున్నవి. అవి ఏవనగా (1) సెప్టిక్ (2) టుబర్క్యులస్ (3) సెరిబ్రొ స్పైనల్ ఫీవర్. మూడవదిమాత్రమే అంటు వ్యాధి. మెనింగోకాకస్ వలన నిది కలుగుచున్నది. ఒకసారి యీ వ్యాధి వచ్చుటవలన జీవితాంతమువరకును ఈ వ్యాధినుండి రక్షణశక్తి కలుగును. ఇది తరుచుగా బాల్యమందును, యౌవనమందును వచ్చు వ్యాధి. దీని ఇంక్యుబేషన్ కాలము 2—10 దినములు. ఈ వ్యాధి క్రిములు శ్వాసమార్గమున లోనికిపోయి, త్వరగా మెదడు, వెన్నుబాముయొక్క మెనింజీస్ అను పొరలోనికి దూరును. సాధారణముగా ఈ వ్యాధి, క్రిమివాహకుల మూలమున ఒకరినుండి మరియొకరికి వ్యాపించును. కాని ఆరంభదశలో ముక్కునుండియు, గొంతునుండియు వచ్చు చీమిడి మూలమునను, కళ్లె మూలమునను వ్యాపించవచ్చును.

లక్షణములు: — ఇది సాధారణముగ అకస్మాత్తుగా ఆరంభించును. అప్పుడు ముమ్మరమైన తలనొప్పి, [2]పైకి ఉబికివచ్చెడు వాంతి, ముమ్మరమైన వీపునొప్పి, జ్వరమువచ్చును. వ్యాధి తీవ్రముగనున్న వారికి కలవరింతలు, గాఢమూర్ఛ మారిమారి వచ్చుచుండును. కొన్నిసారులు బొబ్బలుగాని

[1] Epidemic cerebro-spinal meningitis. [2] Projectile.



పొక్కులుగాని లేవవచ్చును. తరుచుగ చిన్న రక్తపుడాగులున్న దద్దురులు చర్మముమీద కనబడును. చిన్నబిడ్డలకు తరుచుగ ఈడ్పులువచ్చును. తలవెనుకకు తిరుగును. మెడయు, వీపుభాగమును గట్టిగ బిగిసికొనును. కాళ్ల కండరములు పట్టుకొనిపోవును. కాళ్లను తుంటికిని, మోకాళ్లకును సమకోణములుగ వంచినయెడల, కండరములు పట్టుకొనునుగాని మోకాటిని చక్కచేయుట అసాధ్యము. రోగిని అంటుకొనినను, అతడు వెలుగు చూచినను, శబ్దము వినినను సహించలేకుండును. సాధారణముగ చూపులో మెల్లయుండును. గుడ్లు ఉరిమిచూచినట్లుండును. కనుపాపలు అసమానముగా నుండవచ్చును. జ్వరము హెచ్చుచూ, తగ్గుచూ, క్రమము తప్పి వచ్చుచుండును. [1]స్పైనల్ ఫ్లూయిడ్ మడ్డిగనుండును; దానిలో చీము అణువులుండును.

చికిత్సయు, పరిచర్యయు: నిశ్శబ్దముగానున్న చీకటిగదిలో రోగి నుంచవలెను. రోగికి తలనొప్పి, కలవరింతలునున్నప్పుడు, మార్ఫియ, తదితర ఉపశాంతినిచ్చెడు మందులియ్యవలెను. తలకును, మెడకును మంచు తిత్తిని పెట్టవచ్చును. కపాలమందున్న ఒత్తిడిని తగ్గించుటకుగాను, స్పైనల్ పంక్చర్‌చేసి, ద్రవము మామూలుగ కారువరకు, దానిని తీయుదురు. వెన్నులోబొడుచు సూదిమూలమున స్పెసిఫిక్ సీరం (సిద్ధసీరం) నెక్కించెదరు. ఈ చికిత్స 6 లేక 8 గంటలకొకసారి చేయుదురు. ఈ చికిత్స నెంతత్వరగా ఆరంభించిన, రోగము బాగుపడునన్న నమ్మకము అంత అధికముగానుండును. ఈ వ్యాధికి సల్ఫాడయొజీన్ శ్రేష్ఠమైన మందు. తరుచుగ [2]నోటిని పుక్కిలించు మందులతోను, గొంతులో మందు చల్లుట వలనను నోటిని శుభ్రముగ నుంచవలెను. కండ్లు ఎఱ్ఱబారినయెడల, వానిని వేడిబోరిక్ సొల్యూషన్‌తో కడుగవలెను. మూత్రకోశమును, ప్రేగులను బహుజాగ్రత్తగా గమనించుచుండవలెను; ఎందుకనగా ఈ సమయములో మూత్రము బంధించిపోయి, మలబద్ధకము కలుగుట సాధారణము. హై కలోరిక్‌గల ద్రవాహారములను, మెత్తగనుండు ఆహారములను రోగి కిచ్చుచుండవలెను. వాంతి పలుమారు అగుచున్నయెడల, పురీషనాళముద్వారా ఆహారము నియ్యవలసివచ్చును. గ్లూకోసును రక్తనాళములలోనికి సూదిద్వారా యెక్కించవచ్చును. రాపిడిపుండ్లు లేవకుండ

[1] Spinal fluid. [2] Mouth washes.

చర్మమునుగూర్చి అధిక జాగ్రత్త పుచ్చుకొనవలెను. సెరిబ్రో-స్పైనల్ జ్వరమునకు, [1]ఎన్‌సెఫెలైటిస్ (మెదడుకందుట), గ్రుడ్డితనము; చెవుడు సంకరవ్యాధులుగ రావచ్చును.

నివారణము:—రోగినుండి వచ్చు స్రావమునందున్న కల్చర్స్ క్రిమి రహితమైనవని తెలియునంతవరకు రోగిని ప్రత్యేకగదిలోగాని, వార్డులోగాని ఖచ్చితముగా వేరుపర్చవలెను. గుడ్డలు, పాత్రలు, పడక, గది—వీనిని సాధారణరీతిగా డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవలెను. ముక్కు, గొంతునుండివచ్చు స్రావములనుగూడ నిట్లే డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవలెను.

లోబర్ న్యుమోనియ:—అనగా, ఊపిరితిత్తులయొక్క [2]దళములు కందుట. ఈ వ్యాధి నూటికి 90 పాళ్లు న్యూమొకొకస్ మూలమున కలుగుచున్నది. ఈ వ్యాధి క్రిములు శ్వాసమార్గమున లోపలికి ప్రవేశించును. నోటి, ముక్కు స్రావములందును, కళ్లెయందును ఈ రోగసంబంధమైన క్రిములుండును. దగ్గుట, తుమ్ముట, ముద్దుపెట్టుకొనుట మూలమునను, రోగి శ్వాసమార్గమునుండి వచ్చు స్రావములను ఏదో యొక విధమున తాకుటవలనను ఇతరులకు ఈ వ్యాధి యంటుకొనును. దీని ఇంక్యుబేషన్ కాలము 2—3 దినములు.

లక్షణములు:—ఇది సాధారణముగ ఆకస్మికముగా చలితో ఆరంభించి చలి, అధికజ్వరము, నొప్పితోకూడిన దగ్గు, వక్షములో అధిక నొప్పి యుండును. జ్వరము 104—106°F. వరకైనను హెచ్చవచ్చును. జ్వరమిట్లు హెచ్చుస్థితినుండి 7—9 దినములలో ఆకస్మికముగ క్రైసిస్ వచ్చునప్పుడు తగ్గును. ఉచ్ఛ్వాసనిశ్వాసములు చిన్నగను త్వరితముగను జరుగును. నిమిషమునకు 40—50 సారులైనను రోగి శ్వాసించును. శ్వాసావరోధముండును. నాడి వడిగను, దుమికినట్టునుండును. ఊపిరివిడిచి పీల్చుకొన్నప్పుడెల్లను ముక్కు పుటములు విస్తరించును; శ్వాసకు సంబంధించిన స్వాభావికగురకయు (గ్రంట్) పుట్టును. కళ్లె జిగటగను, త్రుప్పుపట్టిన రంగుగనుండును. పెదవులు పగిలి యెండియుండును. నాలుక పాచిపట్టియుండును. ముఖము ఎఱ్ఱబారును. దేహము ఎండి, వేడిగనుండును. రోగి ఆయాసములో తరుచుగ కలవరించుచుండును. సూక్ష్మ విషప్రాణుల

[1] Encephalitis. [2] Lobes.



నుండి వచ్చినవిషము ఊపిరితిత్తులనుండి దేహములో ప్రవేశించినందున, విషము ముమ్మరముగనుండును. సాధారణముగ కడుపుబ్బును. ఇట్లు రోగము హెచ్చుస్థితిలోనుండగా 'క్రైసిస్' వచ్చును. క్రైసిస్ వచ్చువరకు రోగి యెక్కువ వ్యాధిలోనుండును. తరువాత జ్వరము హఠాత్తుగ దిగిపోవును. వ్యాధి నయమగుట కారంభించును. దీని సంకరవ్యాధులేవనగా:—ప్లూరసి, ఎంపయిమ, గుండె బలహీనమగుట.

చికిత్సయు, పరిచర్యయు:—రోగికి ఒగర్పులేనియెడల వీపుపై పరుండనియ్యవలెను; ఒగర్పుండినయెడల, ఫౌలర్స్ పొజిషనులో నుంచవలెను. గుండెకు ఉపద్రవము కలుగకుండ అతనికి విశ్రాంతియు, నెమ్మదియు అవసరము. రోగి తనంతట తాను ఏ పనియు చేయకూడదు. అతడు పరుండిన తీరు పలుమారు మార్చుచుండవలెను. రోగికి ద్రవాహారములను అనగా, బార్లినీళ్లు, నిమ్మరసము, ఆరెంజిపండ్లరసము, పాలు, టీ, కాఫీ, బియ్యపు గంజి, పెరుగు, మజ్జిగ, గ్రుడ్డుసొన మొదలగువానిని విస్తారముగా నియ్యవలెను. దగ్గున్నయెడల [1]కోడిన్, [2]మార్ఫియ అను మందులను వాడవచ్చును. ఎదురొమ్ములో నొప్పియున్నయెడల [3]ఆంటిఫ్లొజిస్‌టీన్, మార్ఫియ, ఆవాలపట్టీ—వీనివలన చాల మేలు కలుగును. చన్నీటి స్పంజ్ స్నానమువలన జ్వరము తగ్గును. రోగి నెమ్మదియు, విశ్రాంతియు పొందును. రక్తవ్యాపకమునకు చురుకు పుట్టించును. కడుపుబ్బరము తగ్గించుటకుగాను ఎనెమలు, కర్పూరతైలపు స్టూపులు, రెక్టల్‌ట్యూబ్ (పురీషనాళగొట్టము)ను ఉపయోగపడును. కళ్లె చిక్కగను, బంకగను ఉన్నందున నాలుక అంటుకొని యుండునుగాన, నోటివిషయమైన జాగ్రత్త ముఖ్యము. బోరోగ్లిసిరిన్ అనుదానిని పెదవులకు పూసినయెడల, రోగికి చాల హాయియు, సుఖమును గలుగును. వ్యాధి వచ్చిన 4-వ దినమునకు ముందే ఆంటిన్యూమోకొకస్ సీరం ఇచ్చినట్లయిన చాల సహాయకరముగా నుండును. [4]సల్ఫడయజీన్ న్యుమోనియ వ్యాధికి చాల ఉపయోగకరమైనది. దీనిని వాడినప్పుడు జ్వరము 24—48 గంటలలో తగ్గును. వ్యాధి కుదురుటకు ఆరంభమగును. క్రైసిస్ వచ్చినప్పుడు రోగి నాడినిగూర్చియు వేడిమినిగూర్చియు నర్సు అతిజాగ్రత్తగ గమనించుచుండవలెను. వేడినీటి బుడ్లు, వేడికంబళ్లు అవసరమునకు సిద్ధముగ నుండవలెను. గుండెకు చురుకు

[1] Codein. [2] Morphia. [3] Antiphlogistine. [4] Sulphadiazine.

దనము పుట్టించు మందులు అనగా, [1]కాఫిన్, [2]స్ట్రిక్‌నీన్ అవసరముండ వచ్చును. రోగి నల్లబారిపోయినప్పుడు అతనికి ప్రాణవాయువు నిచ్చెదరు.

నివారణము:—మెడికల్ వార్డులో రోగిని ప్రత్యేకముగ నుంచవచ్చును. శ్వాసమార్గమునుండివచ్చు స్రావములను, రోగి ఉపయోగించు పాత్రలను డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవలెను.

[3]బ్రాంకో న్యుమోనియ: — ఆరంభము క్రమేణవచ్చును. వాయు నాళములమార్గమున వచ్చి, అచ్చటచ్చట కనబడును. మిక్కిలి చిన్న వారికిని, ముసలివారికిని, బలహీనులకును ఈ వ్యాధి సాధారణముగా తగులును. తట్టమ్మ (చిన్నమ్మ), కోరింతదగ్గు, ఇన్‌ఫ్లుయంజే, టైఫాయిడ్ బ్రాంకైటిస్ మొదలగు వ్యాధులవెంట సంకరవ్యాధిగ వచ్చును. పలువిధ మైన సూక్ష్మజీవులవలన ఈ వ్యాధి కలుగుచున్నది.

లక్షణములు:—లోబర్ న్యుమోనియ లక్షణములే దీని లక్షణములు గాని, జ్వరముమాత్రము రెండు మూడు నాలుగువారములు విడువకుండ ఉండి క్రమేణ తగ్గును. [4]ఈ వ్యాధి వెంటనే తిరిగి సంభవించవచ్చును.

చికిత్స:—లోబర్ న్యుమోనియకు చేసిన చికిత్సనే దీనికిని చేయవలెను.

నివారణము:—లోబర్ న్యుమోనియ విషయములో ననుసరించిన నియమములనే దీనియందు ననుసరించవలెను.

[5]స్కార్లెట్ ఫీవర్:—ఇది తీక్షణమైన అంటువ్యాధి; [6]స్ట్రెప్టొకాకస్ స్కార్లెటీనె క్రిమిమూలమున గలుగుచున్నది. ఈ వ్యాధి ముఖ్యముగా శీత కాలములో వ్యాపించునదైనందునను, తెల్లని చర్మముగలవారికంటె నల్లని చర్మముగలవారు తక్కువగా ఈ రోగమునకు లోబడుటవలనను, ఇండియా దేశములో, మరి ముఖ్యముగా దక్షిణ ఇండియాలో ఈ జ్వరము అసాధారణమైయున్నది. కావున దీనినిగూర్చి క్లుప్తముగ మాత్రము చెప్పబడును.

రోగి ముక్కునుండి, గొంతునుండి వెలువడు స్రావములయందు ఈ వ్యాధి క్రిములుండును. రోగిని తాకుటవలన ఈ వ్యాధి సంభవించును. శ్వాసమార్గముననే యీ క్రిములు లోపల ప్రవేశించును.

---

[1] Caffein. [2] Strychnine. [3] Bronchopneumonia.
[4] Relapses. [5] Scarlet fever. [6] Streptococcus scarlatinae.



ఇంక్యుబేషన్ కాలము 1—7 దినములు. ఆరంభము హఠాత్తుగ వచ్చును. అప్పుడు గొంతురాయును; అధిక జ్వరముండును; వాంతియు నగును. ముఖముకందును. నాడి వడిగకొట్టుకొనును. రెండవ దినమున మచ్చలు అనగా అక్కడక్కడ ఎక్కువగా కందినచోట్ల ఎఱ్ఱని మచ్చలగపడును. మొదట మెడమీద, వక్షముమీద ఈ మచ్చలు పుట్టి క్రమేణ శరీరమంతయు వ్యాపించును. ఇట్టి మచ్చలు అంగిలిమీదను, సప్తపథ మీదను కనబడును. నాలుక ఎక్కువ పాచిపట్టినను, ఆ పాచిగుండ ఎఱ్ఱని గుల్లలు కనబడును. దీనికి [1]'స్ట్రాబెర్రి నాలుక' యందురు, రెండు మూడు దినములైన తరువాత మచ్చలును, జ్వరమును తగ్గ నారంభించును. కాని యెండిన చర్మపు పొలుసులు కొన్నివారములవరకు ఊడిపడుచునేయుండును.

దీని వెంటవచ్చు సంకరవ్యాధులలో కొన్ని అసలు వ్యాధికంటె ముమ్మరమైనవి. అవి యేవనగా—[2]సెర్వైకల్ అడినైటిస్, [3]ఓటైటిస్ మీడియ, [4]మస్టాయిడైటిస్, [5]నెఫ్రైటిస్, [6]ఎండోకార్డైటిస్, [7]పెరికార్డైటిస్, [8]బ్రాంకో న్యుమోనియ.

చికిత్సయు, పరిచర్యయు:—జ్వరము తగ్గుటకుగాను నులివెచ్చని నీటితో స్పంజ్ స్నానముచేయించుట, గొంతురాచియున్నప్పుడు ఆంటిసెప్టిక్. లోషన్‌తో పుక్కిలించుట, కడుగుట మంచిది. జ్వరమున్నప్పుడు ద్రవాహారములను ఇయ్యవలెను. జాస్తిద్రవములను త్రాగించవలెను. మూత్రమును ఆల్‌బ్యుమిన్‌కొఱకు తరుచుగా పరీక్షించవలెను. చర్మముయొక్క దురదను, లేక మంటలను తగ్గించుటకు 2% సోడియంబైకార్బొనేట్ సొల్యూషన్‌తో కడుగుట మంచిది. ఆరంభదశలోనే స్పెసిఫిక్ సీరం ఇచ్చినట్లయిన మేలుకలుగును. దీనికి సల్ఫొనమైడ్స ఇచ్చిన లాభము ఉన్నది.

నివారణము:—పక్కులు, పొలుసులూడిపోవుట నిలుచువరకును, ఇతర స్రావములు స్రవించుట నిలుచువరకును రోగిని ప్రత్యేకించియే యుంచవలెను. పడకగుడ్డలను, పాత్రలను పొంగించవలెను; కట్టుగుడ్డలను కాల్చివేయవలెను.

---

[1] Strawberry tongue. [2] Cervical adenitis. [3] Otitis media.
[4] Mastoiditis. [5] Nephritis. [6] Endocarditis.
[7] Pericarditis. [8] Bronchopneumonia.

స్కార్లెట్ ఫీవర్ ప్రబలియుండు దేశములలో [1]డిక్ టెస్టు అను పరీక్ష చేసి ఒక బిడ్డకు ఈ రోగమును నిరోధించుటకు స్వాభావికరక్షణ శక్తి గలదా, లేక బిడ్డ దీనికి లొంగిపోవునా అని తెలిసికొని, లొంగిపోవునని తెలిసెనేని స్ట్రెప్టొకాకస్ టాక్సిన్ ఇంజెక్షన్, ఆ బిడ్డకు రక్షణశక్తి కలిగించ ఇయ్యవలెను.

[2]ఇంపెటైగొ కంటేజియోసః—చర్మవ్యాధులనుగూర్చిన అధ్యాయము చూడుము.

[3]పెంఫిగస్ కంటేజియోసస్:—చర్మవ్యాధులనుగూర్చిన అధ్యాయము చూడుము.

కాటుక జ్వరము:—([4]రిలాప్సింగ్ ఫీవర్) ఇది యుష్ణమండలములలో వ్యాపించెడు తీక్షణమైన అంటువ్యాధి. ఇది పలువిధములైన స్పైరొకీట్స్ అను సూక్ష్మజీవులవలన కలుగుచున్నది. 1923—24 సంవత్సరములలో నీ యంటువ్యాధి దక్షిణయిండియాలో వ్యాపించినది. దీని ఇంక్యుబేషన్ కాలము 2 నుండి 10 దినములు. ఈ రోగక్రిమి పేలు, పిడుదులు, నల్లులు కుట్టుటమూలమున మనుష్యులలోనికి దూరి రక్త ప్రవాహములోచేరి జీవించును. చర్మమునందున్న పగుళ్ల మూలమునకూడ ఇవి దేహములో ప్రవేశించును. ఒకసారి తగిలినవారికి ఈ వ్యాధినుండి రక్షణ శక్తి యేర్పడును.

లక్షణములు:—జ్వరము హఠాత్తుగావచ్చి 3 నుండి 7 దినములవరకు హెచ్చుగనుండి, క్రైసిస్ అను నియమము ననుసరించి ఆకస్మికముగ తగ్గును. 4 నుండి 8 దినములైనతరువాత జ్వరము, దానికి సంబంధించిన యితర లక్షణములు మరలమరల వచ్చును. తలనొప్పియు, వీపునందును, కాళ్ల యందును అధిక నొప్పియు, పైత్యముతోకూడిన వాంతియు ఈ రోగము యొక్క యితర లక్షణములు. కాలేయము, ప్లీహము పెద్దవగును. ఇట్లు పెక్కుసారులు జ్వరము వచ్చుటవలన రోగి అలసిపోయి చనిపోవచ్చును.

చికిత్సయు, పరిచర్యయు:—[5]ఆర్స్ఫెనమిన్ అను మందును రక్తనాళములలోనికి ఎక్కించుటవలన తత్క్షణమే శాంతికలుగునుగాన, దీని కిది ఒక సిద్ధౌషధమనవచ్చును. ఇతర చికిత్సలు తక్కిన జ్వరములకు చేయునట్టివే.

[1] Dick test. [2] Impetigo contagiosa. [3] Pemphigus contagiosus.
[4] Relapsing fever. [5] Arsphenamine.



నివారణము:—రోగికి పేలులేకుండ చేయుము; వెండ్రుకలు కత్తిరించి, రోగిబట్టలు కాల్చివేయుము లేక డిస్ యిన్ఫెక్ట్ చేయుము. డిస్ యిన్ఫెక్టెంటులను పుర్రెకు పట్టించుము.

[1]ఎలుక కరచుటవలన కలుగు జ్వరము:—[2]స్పైరొకీట్ వలన అంటుపడిన ఎలుక కరచుటవలన ఈ వ్యాధి కలుగును. ఇది యిండియాలో సాధారణమైన వ్యాధి. దీని ఇంక్యుబేషన్ కాలము 4 నుండి 40 దినములు.

లక్షణములు:—ఆరంభము హఠాత్తుగను, చలి, జ్వరము, తలనొప్పి, కీళ్లలో ముమ్మరమైన నొప్పి, వీనితోవచ్చును. జ్వరము 103°—104°F. వరకు హెచ్చును. 3, 4 దినములైన తరువాత కరచినచోటను, దాని సమీపమునసుండు గ్రంధులయందును వాపును ఎరుపును కనబడును. సాధారణముగా మొటిమలవంటి గుల్లలుపుట్టును. కొన్నిదినములైన తరువాత జ్వరము క్రైసిస్ నియమమున (ఆకస్మికముగ) తగ్గును. వారము, పదిరోజులైనతరువాత మరల జ్వరమువచ్చి కొన్ని వారములుగాని, నెలలుగాని అట్టే తిరుగబెట్టుచు, వచ్చుచుండును. ఈ వ్యాధితగిలిన వారిలో నూటికి 10 మంది చనిపోదురు.

దీని సంకరవ్యాధులేవనగా:—రక్తహీనత, [3]నెఫ్రైటిస్, (మూత్రపిండము కందుట,) [4]హెపటైటిస్, (కార్జముకందుట,) గాఢమూర్ఛ (కోమ).

చికిత్సయు, పరిచర్యయు:—గాయమును కాటరైజ్ చేసి (కాల్చి) ఆర్స్ఫెనమిన్ ఇంజెక్షనులు కొంతకాల మియ్యవలెను.

[5]యాస్:— ఇది యుష్ణమండలములలో సవామేహమును బోలి వ్యాపించు అతి తీవ్రమైన అంటువ్యాధి. ఇటీవలనే యిండియాలో ఈ వ్యాధి కనబడుచున్నది. ఇది సముద్రమట్టమునకు తక్కువ ఎత్తున్న ప్రదేశములలోవచ్చును. ఇది [6]స్పైరొకీట ట్రెపొనీమ యను క్రిమివలన కలుగును. ఇంక్యుబేషన్ కాలము 2 నుండి 3 వారములు. రోగక్రిములు చర్మమునందలి పగుళ్లమూలమున దేహములోనికి ప్రవేశించును. ముఖ్యముగా పిల్లలు ఈ వ్యాధికి సులభముగ లొంగిపోదురు.

[1] Rat-bite fever. [2] Spirochete. [3] Nephritis.
[4] Hepatitis. [5] Yaws. [6] Spirocheta treponema.

లక్షణములు:—సిఫిలిస్ వలెయాస్ అను వ్యాధికిని మూడు దశలున్నవి. ప్రయిమరి, సెకెండరి, టర్షియరి అనునవి. ప్రయిమరి దశలో మొటిమ వంటి గుల్ల ఇనాక్యులేషన్ (సూక్ష్మప్రాణి జొరబడిన)చోట లేచును. ఇది యొక్కటిగనైనను పెక్కు గుల్లలుగనైన నుండవచ్చును. సిఫిలిస్ వలెగాక ఇది అరుదుగ జననావయవములలో కనబడును. ఈ గుల్లచుట్టు నున్న భాగముకంది, పుండై, పసుపు పచ్చని రసికారును. ఇది యెండి పక్కుకట్టును. ఈ పక్కును దీసివేయగా, దీనిక్రింద చుక్కల చుక్కల (రోపణము) మచ్చలుగల పుండు కనబడును. ప్రథమపుండు ఏర్పడిన 4—10 వారములైనతరువాత సెకండరి దశవచ్చును. అప్పటికి స్పైరోకీట్స్ అను సూక్ష్మజీవులు రక్తప్రవాహములోనికి చేరును. ఈ దశలో రోగికి తలనొప్పి, జ్వరము, కీళ్ల వాతనొప్పులునుండును. ప్రథమదశలో అగపడిన మొటిమలవంటి గుల్లలు దేహముమీద వేర్వేరుభాగములలో ముఖ్యముగా, నోరు, ముక్కు, ఆసనము—వీని చుట్టు లేచును. టర్షియరి (మూడవ)దశ రోగులందరకును రాదు; నచ్చినను ఆరంభమైన అనేక సంవత్సరముల తరువాత వచ్చును. కీళ్లువాచి, చర్మముమీద లోతైన పుండ్లు పడును. ఎముకలమీద బొప్పికట్టి నొప్పిపుట్టును.

చికిత్సయు, పరిచర్యయు:—[1]నియోఆర్స్ఫెనమిన్ అను మందు ఇంజెక్షన్లకు ఈ రోగము సులభముగ లొంగిపోవును. ఆంటిసెప్టిక్ మందులతో పుండ్లకు కట్టుకట్టవలెను.

నివారణము:—రోగిని ప్రత్యేకించి, కట్టులన్నిటిని కాల్చివేయవలెను; రోగికి వాడిన గుడ్డలను, పాత్రలను డిస్ఇన్ఫెక్ట్ చేయవలెను.

[2]విన్సెంట్స్ అంజైన (ట్రెంచ్ మౌత్):—ఇది నోటికి, గొంతుకు తగిలెడు అంటువ్యాధి; యెక్కువ బలమైనదికాదు. ఇది [3]విన్సెంట్ స్పిరిల్లం, ఒకానొక బసిలస్—ఈ రెండు సూక్ష్మజీవులవలన కలుగుచున్నది. యుద్ధభటులలోను (సోల్జర్స్), బలహీనముగా నున్నవారియందును ఈ రోగము సాధారణముగా నుండును.

అంటుక్రిములు నోటిలోనుండును. రోగితో నేరుగా సంబంధపడుట మూలమున ఇతరులకు వ్యాపించును.

---

[1] Arsphenamine. [2] Vincent's angina. [3] Vincent's spirillum.



లక్షణములు:—ఆరంభము క్రమేణవచ్చును. దీనితో ఒకటి రెండు పుండ్లు పుట్టి వానిమీద పసుపు పచ్చని అమత్వచ కమ్ముకొనియుండును. చిగుళ్లువాచి, రక్తముకారును. నోరు అశుభ్రముగానుండుట, పండ్లు పుచ్చిపోవుట, మొత్తముమీద అనారోగ్యముగానుండుట ఈ వ్యాధివచ్చుటకు తోడ్పడు కారణములు.

చికిత్సయు, పరిచర్యయు:—[1]సోడియం పెర్బోరేట్, [2]మెర్క్యురోకోమ్ లేక [3]మెతిలెన్బ్లూ అను మందులు పూయుటవలన ఈ వ్యాధి తరుచుగా తగ్గిపోవును. నియోఆర్స్ఫెనమిన్ ఇంజెక్షన్లుకూడ యియ్యవచ్చును.

నివారణము:—రోగి త్రాగుగిన్నెను, స్నానముచేయునప్పుడు వాడెడు వస్తువులను ప్రత్యేకపరచవలెను.

**ఫంగై (బూజు) మూలమున కలుగువ్యాధులు (మోల్డ్స్)**

మైసిటోమా:—(మధుర కాలు) ఈ వ్యాధి ఫంగస్ (బూజు) మూలమున కలుగును. సాధారణముగా ఇది కాలుకే సంభవించునుగాని, కొన్ని సందర్భములలో చేతులకును కలుగును. ఇండియాలో కొన్ని ప్రాంతములయందు ముఖ్యముగా, గ్రామాదులలో ఈ వ్యాధి సర్వసాధారణమే. ఇంకా, ఆఫ్రికా, చీనా, ఇటలీ, అమెరికాలలోకూడ ఈ వ్యాధి కనబడుచుండును. సూక్ష్మప్రాణులు గాయముగుండ పాదములోనికి ప్రవేశించును. దీని ఇంక్యుబేషన్ కాల మింతయని తెలియదు. మొదట అర అంగుళము వ్యాసముగల వాపు కనబడును. దీనికి నొప్పియుండదు. కొన్ని వారములైనతరువాత యిది మెత్తబడి పగులును. అప్పుడు దీనిలోనుండి ఒకవిధమగు చీము కారును. అది మర్బత్తువలె దళసరి బంకగనుండును; రక్తము, చీము కలిసియుండును. దీనిలో తెలుపు, నలుపు, ఎరుపుగల గింజలు ఉండును. ఈ గింజలే ఫంగై. దీనిలో ఏ రంగుగల ఫంగస్ చేరియుండునో, గింజలుకూడ ఆ రంగులోనే కనబడును. నలుపురంగు సర్వసాధారణమైనది. ఈ వ్యాధి విస్తరించుకొలది, క్రొత్త గ్రంధులు పుట్టి, కాలంతయు ముద్దగా పుండై పై చెప్పినట్టి స్రావములు కారును; ఒక్కొక్కప్పుడు ఈ జబ్బు ఎముకకును వ్యాపించవచ్చును.

---

[1] Sodium perborate. [2] Mercurochrome. [3] Methyleneblue.

చికిత్సయు, పరిచర్యయు: — ఆరంభములోనే చికిత్సచేసినయెడల పొటాసియం ఐయొడైడ్ ఇచ్చుటవలననో [1]క్యూరటాజ్ చేయుటవలననో రోగము లొంగవచ్చునుగాని సాధారణముగా పుండును కోసి తీసివేయుటయో, కాలునుగోసి తీసివేయుటయో, దీనికి సరియైన చికిత్సయగును.

నివారణము: — చెప్పులు వేసికొని నడువుము; అంటువడిన కట్టులనన్నిటిని కాల్చివేయుము.

[2]త్రష్:—ఇది చిన్నపిల్లల నోళ్లకువచ్చెడి వ్యాధి. (పిల్లలనోటి తెల్లపూత) ఇదియు ఫంగస్ మూలముననే కలుగును. మొదట తెల్లని పక్కులు నాలుకమీదలేచి, నోరంతయు అల్లుకొనును. బిడ్డనోటిని శుభ్రముగ నుంచినట్లయిన ఈ వ్యాధిరాదు. ప్రతిసారి పాలుత్రాగిన తరువాత బిడ్డకు కొంచెము నీళ్లు త్రాగించి నోటిని శుభ్రముచేయవలెను; తెల్లని పొక్కులకు బొరొగ్లిసరిన్ రాయవలెను. చేనుమొనలను, పాలు త్రాగించుబుడ్లను, అతి శుభ్రముగా నుంచవలెను.

తామర:—చర్మవ్యాధుల అధ్యాయము చూడుము.

నోమ:—ఇది చాలత్వరగా వ్యాపించెడు నోటివ్రణము. ఈ వ్రణము కుళ్లనారంభించి నోటియొక్కయు, దౌడలయొక్కయు టిష్యూలను పాడు చేయును; ఈ వ్యాధి తరుచుగా, బుగ్గలు చిల్లులుపడునట్టు చేయును. ఒక వారములోపల మరణము సంభవించవచ్చును. దీర్ఘకాలపు లేక తీక్షణమైన వ్యాధివలన కృశించి బలహీనపడిన పిల్లలకు 'నోమ' యను జబ్బు వచ్చును. [3]ఈస్ట్ ఫంగస్ అను సూక్ష్మజీవివలన ఈ వ్యాధికలుగును. రోగము కనబడిన వెంటనే ఆ భాగమును కాల్చవలెను. లేదా, కత్తితో కోసివేయవచ్చును. మౌత్ వాషెస్ అను మందులతో నోటిని కడిగి శుభ్రము చేయుచుండవలెను.

**వైరసెస్ అను విషప్రాణులవలన కలుగు వ్యాధులు:—**

ఆటలమ్మ:—ఇది తీవ్రమైన అంటురోగము. కాని దీనివలన తక్కువ మందిమాత్రమే చనిపోదురు. స్పష్టమైన గుల్లలు వరుసగా కొన్నిసారులు పోయుట దీని సహజలక్షణము. సాధారణముగా చిన్నపిల్లలకే యీ వ్యాధి

[1] Curettage. [2] Thrush. [3] Yeast fungus.



తగులునుగాని పెద్దవారికికూడ తగలవచ్చును. ఒకసారి తగిలినవారికి జీవితాంతమువరకు ఈ వ్యాధినుండి రక్షణశక్తి యేర్పడును.

ఇంక్యుబేషన్ కాలము 10 నుండి 21 దినములు. అంటును వ్యాపించెడు క్రిమి, ఫిల్టరబుల్ వైరస్ అనునది. రోగియొక్క ముక్కునుండి, గొంతునుండి వెడలు స్రావములందును, అంటుగల గుల్లలయందును ఈ క్రిములుండును. రోగిని తాకుటవల్లగాని, ప్రత్యక్షముగగాని, పరోక్షముగగాని, యీ వ్యాధి వ్యాపించును. దీని లక్షణములు ఆరంభించినప్పటి నుండి, ఆఖరి పొలుసు ఊడిపోవునంతవరకును ఇది అంటుగలదిగ నుండును.

లక్షణములు:—ఆరంభమున సాధారణముగ చలి, జ్వరము, వీపునందు, కాళ్లయందు నొప్పులతో వ్యాధి అకస్మాత్తుగవచ్చును. గుల్లలు లేచును. ఇవి ఈ వ్యాధి వచ్చుననుటకు ప్రథమసూచనగా నుండవచ్చును. లేక 24 గంటలుతాళి వ్యాధి కనబడవచ్చును. మొదట మొండెముమీద ఆరంభించి, తరువాత ముఖమునకు, కాళ్లుచేతులకు ప్రాకును. మొండెము మీదనే దట్టముగాపోయును. మొదట యెఱ్ఱనిగుల్లలుగపుట్టి, త్వరలోనే ఈ గుల్లలు స్వచ్ఛమగు ద్రవముతో నిండియుండును. ఇవి యెండినప్పుడు, చదునై పక్కులుకట్టును. ఇవి 1—3 వారములలో రాలిపోవును. సాధారణముగా పక్కు లూడిపోయినచోట మచ్చలుండవు. 3, 4 దినముల వరకు క్రొత్తగుల్లలు పుట్టుచుండును. కావున, గుల్లలు, బొబ్బలు పక్కులు—వీని మూటి నొకేసారి చూడవచ్చును. అరకాళ్లలోను, అరచేతులలోను దద్దుపోయుట అరుదు.

ఆటలమ్మ, మశూచిని బోలియుండునుగాని ఈ దిగువ భేదము లుండును:—ఆటలమ్మ వ్యాధిలో ముఖ్యముగా (1) మొండెము మీదనే అధికముగా గుల్లలు లేచుట (2) చర్మముమీద ఒకదానితరువాత మరియొకటి వరుస వరుసగా పోయుట (3) అరకాళ్లకు చేతులకు పోయకుండ రక్షణశక్తి కలిగియుండుట (4) గుల్లలు ఆరంభములోనే యగపడుట.

చికిత్సయు, పరిచర్యయు —దీనికి ప్రత్యేకమైన చికిత్సలేదు. రోగిని పడకలో పరుండబెట్టి తేలికయైన ఆహారమునిచ్చి ద్రవములు విస్తారముగ త్రాగించవలెను. వేడినీటి స్నానములవలన రోగికి హాయికలుగును.

జిలపుట్టుచున్నట్లయిన, కార్బాలిక్ మందుకలిపిన నూనె రుద్దుటమంచిది. బిడ్డ గీరుకొనకుండ చేతికి అట్టతోచేసిన గొట్టములను తగిలించవలెను.

నివారణము:—రోగిని ప్రత్యేకించి, ముక్కునుండి, గొంతునుండి, చర్మమునుండి స్రవించు స్రావములను డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవలెను; లేదా, కాల్చివేయవలెను. గదిని, గదిలోని వస్తువులను సాధారణరీతిని శుభ్రము చేయవలెను.

మశూచి:—ఇది యన్నిటికంటె అతితీవ్రమైన అంటురోగము. టీకాలు వేయించుకొనని ప్రజలు ప్రపంచమం దెక్కడనుందురో అక్కడనెల్ల యీ వ్యాధియుండును. ఇండియాలో నిది సర్వసాధారణము.

ఈ వ్యాధియొక్క అంటుక్రిమి, ఫిల్ట్రబుల్ వైరస్. ఇది ముక్కునుండి, గొంతునుండి స్రవించు స్రావములందును, రోగి చర్మమందుండిన గుల్లలలోను, పొక్కులందును కనబడును. ఇది ప్రత్యక్షముగగాని, పరోక్షముగగాని ఒకరినుండి మరియొకరికి వ్యాపించును. దీని ఇంక్యుబేషన్ కాలము 10 నుండి 14 దినములు. వ్యాధి ఆరంభమయినది మొదలు, పుండ్లు మాని పొలుసు అంతయు ఊడిపోవువరకును అంటుతగిలెడు అపాయముండును.

లక్షణములు:—ఆరంభమున అకస్మాత్తుగ చలి, అధిక జ్వరము, తలనొప్పి, తీవ్రమైన వీపునొప్పి వచ్చును. గుల్లలు మూడునాలుగు దినములవరకు కనబడవు. మొదట గుడ్డలు లేనిభాగములకు అనగా, ముఖము, చేతులు, మణికట్లకుపోసి, పిమ్మట దేహమంతయు, అరచేతులు, అరపాదములకుకూడ అల్లుకొనును. ఈ వ్యాధి ఒకే పోతపోయును. దీనిలోనే వరుసగా, గుల్లలు, పొక్కులు, చీముకూడిన బొబ్బలు, పక్కులుకట్టిన పుండ్లు ఏర్పడును. ఆటలమ్మలోవలెకాక మశూచికములో ఈ బొబ్బల మధ్య గుంటపడును. చీముపట్టిన బొబ్బలు పదియవనాటికి ఎండిపోవును. ఇక పక్కులు రాలిపోవుటకు పెక్కువారములు పట్టును. పక్కులు రాలిపోగా, ఆ చోట్ల లోతైన గుంటలుగల మచ్చలేర్పడును. ఆరంభ దినములలోనుండిన తీవ్రమైన జ్వరము గుల్లలులేచినమీదట తగ్గిపోవును. కాని యీ గుల్లలలో చీముకూడగనే మరల జ్వరము హెచ్చును. పుండ్లు ఎండిపోవుచుండగా, రెండవసారి జ్వరము తగ్గును.



ముమ్మరముగా మశూచి పోతపోసినప్పుడు బొబ్బలు దగ్గరగలేచి, ఒకదానితో ఒకటి కలిసిపోయి, గడ్డలు ఏర్పడవచ్చును. చర్మమునుండి రక్తము కారవచ్చును. నోటినుండిగాని, ఊపిరితిత్తులనుండిగాని, మూత్రపిండములనుండిగాని పురీషనాళమునుండిగాని రక్తము కారవచ్చును. ఈ వ్యాధికి సంకరవ్యాధిగ కండ్లకలక రావచ్చును; దానితరువాత కంటిలోని నల్లగ్రుడ్డు పాడగును. ఇందుమూలమున దృష్టిపోవుట యిండియాలో సర్వసాధారణమైన ఫలితము.

వ్యాధిని నిర్ణయించుట:—గుల్లలు పొంగకముందు మశూచి యేదేని తీవ్రమైన అంటువ్యాధిని, ముఖ్యముగా, మలేరియాను బోలియుండును. కాని గుల్లలు కనబడినట్లయిన, ఈ వ్యాధిని నిర్ణయించుటకు సందేహించ కూడదు. ఒకవేళ, దీనిని ఆటలమ్మగ పొరపాటున భావించవచ్చును. ఈ రెంటికినిగల భేదములు ఆయా భాగములలో చర్చించబడినవి.

చికిత్సయు, పరిచర్యయు:—మశూచికి ప్రత్యేకమైన చికిత్స యేమి లేదుగాని, సరియైన పరిచర్యచేయుటయే ప్రాముఖ్యమైన సంగతి. జ్వరమున్న సమయములలో తలకు చల్లని కాంప్రెస్‌లు వేయుటవలనను, నులివెచ్చని నీటితో స్నానము చేయించుటవలనను రోగికి హాయిగనుండును. నొప్పికి ఉపశాంతినిచ్చు మందులను వాడవలెను. జిలను తగ్గించుటకు 1% చల్లని కార్బాలిక్ లోషన్‌లో గాజ్‌గుడ్డను నానవేసి పట్టించినయెడల చాల ఫలితము కనబడును. ఇట్లే 2% సోడియం బైకార్బొనేట్ సొల్యూషన్ కూడ పనిచేయును. వాజిలీన్ లేక కొబ్బెరనూనె పూసి పక్కులు మెత్తబడునట్లు చేయవచ్చును. ప్రతిసారి భోజనమైన తరువాత రోగియొక్క నోరుకడిగి శుభ్రము చేయుచుండవలెను. కండ్లనుగూర్చి ప్రత్యేకమైన శ్రద్ధతీసికొని చికిత్సచేయించవలెను. వేడి బోరిక్ లోషన్‌తోగాని, నార్మల్ సెలైన్‌తోగాని కండ్లను దినమునకు అనేకసార్లు కడుగుచుండవలెను. జ్వరమున్నప్పుడు విస్తారమైన ద్రవాహారములను, అనగా, పాలు, నీళ్లు, పండ్లరసము, గంజి మొదలగు వానిని ద్రాగించవలెను. కొంతకాలమైన తరువాత కొంచెము మెత్తగను, కొంచెము గట్టిగనునుండు ఆహారమును, అనగా పెరుగు అన్నము, మిరియాలచారు అన్నము, [1]కస్టర్డ్స ఇయ్యవచ్చును.

[1] Custards.

**నివారణము:**--రోగిని ఖచ్చితముగా ప్రత్యేకించి తీరవలెను. రోగి విసర్జించు, ప్రతి స్రావమును వెంటనే కాల్చివేయవలెను; లేదా, డిస్ యిన్‌ఫెక్ట్ చేయవలెను. ఈగలు ముసరకుండ చూడవలెను. రోగి యున్నగదిని, రోగికి ఉపయోగించిన వస్తువులన్నిటిని సాధారణరీతిగ డిస్ యిన్‌ఫెక్ట్ చేయవలెను.

మశూచి టీకాలు వేయించుకొనుటవలన, అధిక రక్షణశక్తి కలుగును. ఇండియాలోని జనులందరికి టీకాలు వేయగలిగినయెడల, ఈ దేశములో మశూచి యంతరించిపోవును. చిన్నపిల్లలుకూడ ఈ వ్యాధికి లొంగిపోదురుగాన, వారికి పసితనములోనే టీకాలు వేయించవలెను. ఒకసారి టీకాలు వేయించుకొన్నవారికి 7 సం॥లు రక్షణశక్తి కలుగును; తిరిగి మరల వేయించుకొనవలెను. అనేక సంవత్సరములక్రిందట గోమశూచి యొకటి యున్నదనియు, అది చాల శాంతికరమైన వ్యాధియైనందున దానిని సరకు చేయనక్కరలేనిదనియు, ఈ వ్యాధినే మనుష్యులలో ప్రవేశపెట్టినయెడల, వారికి మశూచినుండి రక్షణశక్తి యేర్పడుననియు కనిపెట్టిరి. కావున టీకాలు వేయుటయనగా, గోమశూచి వ్యాధిని బుద్ధిపూర్వకముగా, మనుష్యులలోనికి టీకాల మూలమున నెక్కించుట. ఈ స్వల్పశ్రమవలన ముష్కరమైన వ్యాధియొక్క అపాయము తప్పును. మనిషి చేతిమీది చర్మము నొకచోట కడిగి, తుడిచి యెండనిచ్చి, తేలికగ ముండ్లకత్తితో గీరి, గోమశూచి తగిలిన దూడనుండి తీసిన రసి కొన్నిబొట్లు రాయుదురు. దీనికి కట్టుకట్టుట అవసరములేదుగాని, ఈ భాగము శుభ్రముగను, ఎండియు నుండవలెను. నాల్గవదినమున ఒక గుల్లపుట్టును. ఇది కొంతకాలమునకు చీముకూడి యెండి, పక్కుకట్టును. ఈ పక్కు మాని యూడినప్పుడు, అక్కడ ఒక మచ్చ స్థిరముగ నిలిచిపోవును. టీకాలు వేయించుకొనని యొకడు తనకు మశూచి విషక్రిములు సోకిన 7 దినములలోగా టీకాలు వేయించుకొనినయెడల, అతనికి ఆ వ్యాధినుండి రక్షణశక్తి కలుగును. ఈ వ్యాధి తగిలినవారికి చికిత్సచేయుటకంటె, దీనికి లొంగెడు వారందరికి టీకాలువేయుట ప్రాముఖ్యమైన సంగతి. ఇట్లు టీకాలు వేయుటవలననే యెక్కువమందిని కాపాడవచ్చును.



<u>తట్టమ్మ (తడపర) లేక [1]మోర్బిలి:</u>—ఈ వ్యాధి యింతకుముందు ఎవరికి తగులలేదో వారందరికి ఇది తగులవచ్చునుగాని, 6 నెలల లోపలనున్న చంటిపిల్లలకు మాత్రము తగులదు. ఫిల్ట్రబుల్ వైరస్ అను జీవియె దీనికి కారణము.

ఇంక్యుబేషన్ కాలము 10 నుండి 14 దినములు. వ్యాధి యారంభమైనది మొదలు దద్దుపోసిన 5 దినములవరకు అది అధిక అంటువ్యాధిగ నుండును. వ్యాధి క్రిములు శ్వాసమార్గముననే లోపలికి ప్రవేశించి బైటికి వచ్చుచుండును. రోగిముక్కు, కండ్లు, గొంతు వీనినుండివచ్చు స్రావములలో అంటుక్రిములుండును. ముద్దుపెట్టుకొనుట, తుమ్ముట, దగ్గుట మూలమునను, రోగినుండి వెడలు స్రావము నంటుకొనుట మూలమునను ఈ రోగము రావచ్చును.

లక్షణములు:—ఆరంభము క్రమేణయుండును. జలుబు, జ్వరము, కండ్లనుండియు, ముక్కునుండియు నీరు కారుట, తలనొప్పి, వెలుతురును సహించలేకపోవుట అను రోగలక్షణములు మొదటనుండి యుండును. సాధారణముగ డోకు, వాంతి కొన్నిసారులు అతి విరేచనము లుండును. జ్వరము $102^\circ$—$103^\circ$F. ఉండును. దద్దు తగ్గువరకు జ్వరము అట్లే నిలిచి యుండును. రెండవ లేక మూడవదినమున నోటిలో దద్దుపోయును. ఈ దద్దు చిన్న యెఱ్ఱని మచ్చలుగ నుండును. ఈ మచ్చలమధ్య నీలిరంగు తెలుపురంగులు గలిసినచుక్క ఉండును. వీనిని [2]కొప్లిక్సె మచ్చలందురు. వీనినిబట్టియే వ్యాధిని నిర్ణయించవచ్చును. రోగలక్షణములు కనబడిన 4-వ లేక 5-వ దినమున తలమీద ఎఱ్ఱని దద్దుపోసి, శరీరమంతట అల్లుకొనును. కాని యిది యెల్లప్పుడు ముఖముమీద స్పష్టముగ కనబడును. మొదట ఒక చిన్న యెఱ్ఱని గుల్ల ఏర్పడి, క్రమేణ పెద్దదియై, పిమ్మట కొన్ని గుల్లలు ఒకటిగచేరి అర్థచంద్రాకారమున గనపడును. నల్లని దేహముమీద దద్దును గుర్తించుట కష్టము. ఈ కాలములో తరుచుగ వాయునాళములలో (డ్రై బ్రాంకియల్ కాఫ్) పొడిదగ్గుండును. దీనితో జ్వరముకూడ ఒక వారముకంటె ఎక్కువకాలముండినయెడల, బ్రాంకో న్యుమోనియ వచ్చునని సందేహించవచ్చును. దద్దు మానిపోగనే గోధుమవర్ణముగల సన్నని పొట్టు రాలిపోవును.

[1] Morbilli. [2] Koplik's.

తడపర లేక తట్టమ్మ అను వ్యాధికంటె సంకరవ్యాధులను గూర్చియే ఎక్కువగ భయపడవలసియుండును. ఇవి యేవనగా, బ్రాంకో న్యూమోనియ, ఒటైటిస్ మీడియ, లారింజైటిస్, అతిసార విరేచనములు.

**చికిత్సయు, పరిచర్యయు:**—రోగిని చీకటిగదియందు పడకపైన పరుండబెట్టి జ్వరము తగ్గువరకు అచటనేయుంచి, మంచిగాలి విస్తారముగ తగులనియ్యవలెను. కండ్లను జాగ్రత్తగ కాపాడుచు, పలుమారు వేడి బోరిక్ సొల్యూషనుతో కడుగుచుండవలెను. పారోటైటిస్, మధ్యచెవి జబ్బు రాకుండ నోటిని పలుమారు శుభ్రము చేయుచుండవలెను. నులివెచ్చని నీటితో స్నానము చేయించుటవలన మంచిబలము వచ్చును; జ్వరముకూడ తగ్గును. దగ్గువలని బాధతగ్గుటకు ఉపశాంతినిచ్చు మందులు వాడుటయు, ఆవిరి పట్టించుటయు మంచిది. 2% సోడియం బైకార్బొనేట్ సొల్యూషన్‌తో గాని, కార్బొలైజ్‌డ్ నూనెతోగాని స్నానము చేయించుటవలన, జిల తగ్గును. జ్వరమున్నప్పుడు పండ్లరసము, పాలు, గంజి, విస్తారముగ నీళ్లు రోగికి ఆహారముగ నిచ్చుచుండవలెను. జ్వరము తగ్గినప్పుడు మెత్తని ఆహారమును, సులభముగ జీర్ణముకాగల ఆహారము నియ్యవలెను.

**నివారణము:**—రోగిని 12 నుండి 14 దినములవరకు ప్రత్యేకమైన గదిలోగాని, ప్రత్యేకమైన వార్డులోగాని యుంచవలెను. నోటినుండి, గొంతునుండి, కండ్లనుండి వచ్చు స్రావములను డిస్‌యిన్‌ఫెక్ట్‌చేసి, కట్టు గుడ్డలను గాల్చి వేయవలెను. రోగము పోయినతరువాత ఆఖరిస్నానము చేయించవలెను. రోగి గుడ్డలు, పాత్రలు, గది—వీనిని ఉచితరీతిని డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవలెను.

[1]**జర్మన్ మీజెల్స్:**—ఇది సాధారణమైన తడపరను అనేకవిధముల పోలియున్నను, కేవలము ప్రత్యేకమైన రోగము. దీనికి హేతుభూతమైన క్రిమి యేదో తెలియదుగాని, శ్వాసమార్గమున స్రవించు స్రావములయందు అది యుండును. ఇది చాలతీవ్రమైన అంటుగలది. దీని ఇంక్యుబేషన్ కాలము 7 నుండి 22 దినములు. సాధారణమైన తడపరవలెనిదియు నొకేవిధముగ ఉత్పత్తియై, ఇతరులకు వ్యాపించును.

**లక్షణములు:**—ఇది చాలబలహీనమైన వ్యాధి. దీని ఆరంభ లక్షణములును స్వల్పమైనవే. అవేవనగా, తలనొప్పి, జలుబు, వీపున నొప్పి,

[1] German measles.



తరుచుగా దద్దు—ఇవి మొదటకనబడు లక్షణములు. మొదట ఇది ముఖమునకు పోసి కొన్నిగంటలలోనే దేహమంతట వ్యాపించును. 2 లేక 3 దినములలో నిది తగ్గిపోవును. లక్షణములనుబట్టి వ్యాధికి చికిత్సచేయవలెను. రోగిని ప్రత్యేకించుట అవసరములేదు.

**గవదబిళ్లలు:**—ఫిల్ట్రబుల్ వైరస్ అను సూక్ష్మజీవివలననే యీ వ్యాధి కలుగును. ఇదియు నంటువ్యాధియే. సాధారణముగ చిన్నపిల్లలకు ఈ వ్యాధి తగులును. ఇది ప్రపంచమంతట వ్యాపించియున్నది. ఈ వ్యాధియున్న రోగియొక్క ఉమ్మిని, యెంగిలిని తాకుటవలన నీ జబ్బువచ్చును. ఇంక్యుబేషన్ కాలము 2 నుండి 3 వారములు.

**లక్షణములు:**—జ్వరముతోను, తలనొప్పితోను వ్యాధి యారంభించవచ్చును. కాని తరుచుగా, చెవిదగ్గరనున్న గ్రంధి వాయుట దీని ప్రథమ లక్షణముగ కనబడును. నోటిని బహు కష్టముతో తెరువవలసివచ్చును. మ్రింగునప్పుడును నొప్పియుండును. 102°—103° F. డిగ్రీల మధ్య జ్వరము మారుచు నుండవచ్చును. బిడ్డలకు ఈ వ్యాధి వచ్చినను స్వల్పమైనదిగనే యుండును. 10-వ నాడు వాపుతగ్గిపోవును. చిన్నపిల్లలలో సంకరవ్యాధు లుండవుగాని, పెద్దవారిలో నుండుట సాధారణమే. రోగులు పురుషులైనయెడల వారి వృషణములు వాయును. స్త్రీలైనయెడల, అండాశయములు, రొమ్ములు, కందును. పృక్వాకము, (పాంక్రియటైటిస్) మధ్య చెవియు కందును.

**చికిత్సయు, పరిచర్యయు:**—రోగి పడకలో పరుండి సంపూర్ణముగా విశ్రమింపవలెను. వాచిన గ్రంధులకు వేడికాపడము నియ్యవలెను; లేదా మంచుసంచులు పెట్టవలెను. నోటిని పలుమారు శుభ్రము చేయుట ఎంతో ప్రాముఖ్యమైన సంగతి. ద్రవములును, మెత్తని యాహారములును మాత్రమే రోగికియ్యవలెను.

**నివారణము:**—రోగిని ప్రత్యేకమైన గదిలోనో వార్డులోనో యుంచవలెను. ముక్కునుండి, నోటినుండి స్రవించు స్రావములను డిస్‌ఇన్‌ఫెక్ట్ చేయవలెను లేక కాల్చివేయవలెను. రోగిగుడ్డలు, పాత్రలు, గది, పడక—వీనిని యుచితరీతిని డిస్‌ఇన్‌ఫెక్ట్ చేయవలెను.

**ఇన్‌ఫ్లుయంజె** (విషపడిశము):—ఇది యతితీవ్రమైన అంటువ్యాధి. అకస్మాత్తుగ జ్వరమువచ్చుట, కృంగిపోవుట, శ్వాసనాళములలో అంటు చేరుట—ఇవి ఈ రోగలక్షణములు. ఇది ఎపిడెమిక్‌గ వచ్చును. అనగా, ఒకే కాలమందు అనేకులకువచ్చు అంటువ్యాధి; ప్రపంచమంతట వ్యాపించి యున్నది. ఇదియు ఫిల్ట్రబుల్ వైరస్ అను క్రిమిమూలమువనే కలుగుచున్న దని తలంచుచున్నారు. ముక్కునుండి, గొంతునుండి స్రవించు స్రావము లందే అంటుక్రిమియుండును. రోగులను తాకుటవలనను, రోగి తాకి నందువలన అంటుపడిన వస్తువులను తాకుటవలనను ఈ వ్యాధి యితరులకు వ్యాపించును. ఇంక్యుబేషన్ కాలము 1 నుండి 3 దినములు.

ఈ రోగము మూడురకములు. (1) జ్వరముతోకూడినది. (2) శ్వాస నాళములకు సంబంధించినది. (3) ఆహార సంబంధావయవములకు సంబం ధించినది.

**లక్షణములు**:—ఇది అకస్మాత్తుగ ఆరంభమగును. జ్వరముతోకూడిన రోగమైనయెడల, తీవ్రమైన తలనొప్పియు, వీపునను, అవయవములలోను ముమ్మరమైన నొప్పియునుండును. జ్వరమధికముగ నుండును. మొత్తము మీద రోగి కృంగిపోవును. నాల్గవదినమున జ్వరము సాధారణముగ దిగి పోవును; అప్పటినుండి రోగి త్వరగ స్వస్థతనొందును. శ్వాసనాళములతో సంబంధించిన రోగమునకును పై లక్షణములన్ని యుండునుగాని, వీనితో పాటు జలుబుగూడ ఉండును. ఈ స్థితి న్యుమోనియకును, ముమ్మర మైన విపత్స్థితికిని దారితీయును. ఆహార సంబంధావయవములకు సంబంధించిన రోగమునకు జ్వరముకాక, ముమ్మరమైన కడుపునొప్పి, వాంతి, అతివిరే చనములు, శరీరములో నీరులేకపోవుట, విషముచేరిన యవస్థయేర్పడును.

**చికిత్సయు, పరిచర్యయు**:—రోగిని ఖచ్చితముగా పడకలో పరుండ బెట్టవలెను. నులివెచ్చని నీటితో స్నానము చేయించుటవలన, జ్వరము తగ్గి, రోగికి శాంతికలుగును. ఒంటి నొప్పులకును తలనొప్పికి ఫెనాసిటిన్, ఆస్పి రిన్, సలిసిలేట్స్ అను మందులిచ్చుట మంచిది. ఆవిరిపట్టుట, దగ్గుమందు లిచ్చుటవలన, దగ్గు తగ్గును. ఆహార సంబంధావయవములకు సంబంధించిన వ్యాధియైనయెడల, ఆహారకోశమును కడుగుట మూలమునగాని, నేసల్ సక్షన్ వాడుట మూలమునగాని, వాంతిని తగ్గించవచ్చును. వ్యాధి ముమ్మర ముగనున్నప్పుడు పురీషనాళముగుండ ఆహారము నియ్యవలసివచ్చును.



తరుచుగా, గ్లూకోసును రక్తనాళములలోకి ఎక్కించుదురు. మలవిసర్జనము సరిగా జరుగుచుండునట్లు చూడవలెను. జ్వరము కావలసినప్పుడు పండ్ల రసము, బార్లినీళ్లు [1]ఇంపీరియల్ డ్రింక్ అను పానీయము దినమునకు కనీసము 3000—5000 c.c. లనైన నియ్యవలెను. రోగి బాగుపడ నారం భించగా, ఇంతకంటె ధారాళముగ ఆహారము నిచ్చుటకు ఆరంభించ వలెను.

**నివారణము**:—రోగిని ప్రత్యేకించి, ముక్కునుండియు, నోటినుండియు కారు స్రావములను డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవలెను.

**జలుబు**:—ఇది చాల యెక్కువ అంటుగల వ్యాధి. నాసికాద్వార మున ఫిల్ట్రబుల్ వైరస్ అను క్రిములుచేయు వ్యాపారమువలన, ఆ మార్గము కంది జలుబుచేయును. ముక్కునుండి కారు చీమిడియందును, గొంతు నుండి వచ్చు కళ్లెయందును అంటుక్రిములుండును. జలుబుచేసినవారు తుమ్ముటవలనను, దగ్గుటవలనను, క్రిమివాహకులవలనను ఈ వ్యాధి వ్యాపిం చును. ఈ వ్యాధి ఇంక్యుబేషన్ కాలము ఇంచుమించు 36 గంటలు.

**లక్షణములు**:—మొదట ఇది అకస్మాత్తుగ ఆరంభించును. అప్పుడు తలనొప్పి, చలి, నాసికారంధ్రములు కందుట, కొంచెము జ్వరముండును. జలుబుచేసిన కొన్ని గంటలకు ముక్కునుండి నీరు కారుచుండును. ఒకటి రెండు దినములకు ఇది చీమువలె మారును. ఈ స్థితి కొన్ని దినములుండి, నిదానముగ బాగవును, లేక వ్యాధిముదిరి, [2]సైనసైటిస్‌గాను బ్రాంకో న్యుమోనియగాను మారవచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు**:—ఆరంభదశలో రోగిని పడకలో పరుండ బెట్టుము. రోగ లక్షణములనుబట్టి చికిత్సచేయుము. తలనొప్పికి, యితర సామాన్య నొప్పులకు, బాధలకు ఆస్పిరిన్ యిచ్చెదరు. మందులువేసిన ఆవిరి పట్టించుటవలనను, అడ్రినలిన్ యిచ్చుట మూలమునను, ముక్కులో అడ్డులేకుండపోవును, శ్వాసించుటయు సులభమగును. కొంత బహిష్కార మునకు వేడిపానీయము సహాయపడును. [3]భేదిమందు లిచ్చి విరేచన మగునట్లు చేయవలెను. ద్రవములను జాస్తిగ నియ్యవలెను. నీళ్లు, నిమ్మ, ఆరెంజి పండ్లరసము, కాఫీ, టీ, బియ్యపుగంజి, బార్లిగంజి—ఇవన్నియు మంచి యాహారములగును.

---

[1] Imperial drink. [2] Sinusitis. [3] Laxatives.

సంకరవ్యాధులు:—సైనస్ ఇన్ఫెక్షన్, బ్రాంకోన్యుమోనియ, [1]లారింజైటిస్, [2]మధ్యచెవి కందుట, [3]సంధివాతజ్వరము.

నివారణము:—రోగిని ప్రత్యేకమైన వార్డులోనుంచి చికిత్సచేయుము. రోగి దగ్గునప్పుడును, తుమ్మునప్పుడును ముక్కు, నోరు మూసికొనవలెను.

[4]రేబీస్:—కుక్కలు, పిల్లులు, నక్కలు తదితరజంతువులు కరచుటవలన, మనుష్యులకు వ్యాపించెడు తీవ్రమైన అంటువ్యాధిని రేబీస్ యందురు. ఈ వ్యాధి ప్రపంచమంతట వ్యాపించియున్నను, ఉష్ణదేశములలో వృద్ధిచెందుటకు అనుకూలములుగలవు. అంటుచేరియున్న జంతువుల సొంగలో ఫిల్ట్రబుల్ వైరస్ అను ఈ వ్యాధిక్రిములుండును. జంతువులు మనుష్యులను కరచుటవలనను, చర్మములో పగుళ్లుండుటవలనను, ఈ వ్యాధి వ్యాపించును. [5]ఇంక్యుబేషన్ కాలము 2 వారములనుండి 9 నెలల వరకుండును. మెదడునుండి కాటు ఎంతదూరముండునో దానినిబట్టి ఇంక్యుబేషన్ కాలము హెచ్చియుండును.

లక్షణములు:—ఈ వ్యాధికి మూడుదశలున్నవి. [6]మొదటిదశలో తలనొప్పి, రోగి కృంగియుండుట, విసుకు, చింత, గాయములో నొప్పి మున్నగు లక్షణములుండును. రెండవదశలో రోగి ఉద్రేక పూరితుడై యుండును. అప్పుడు మ్రింగుటకు కష్టమగును; మ్రింగుటవలన శ్వాసయు, కండరములు ఈడ్చుకొనుటయు నెక్కువగును గనుక రోగి నీళ్లు త్రాగనొల్లడు. నీళ్లను చూచినంతమాత్రాన, రోగికి [7]పారరావచ్చును. [8]మూడవదశలో రోగికి పక్షవాతము నచ్చును.

ఇతర లక్షణములేవనగా, జ్వరము, ఈడ్పులు. ఈ వ్యాధి యెప్పటికైన మరణకరమైనదే. దీనికి చికిత్సలేదుగాని, రోగిని సాధ్యమైనంత శాంతముగను, సౌఖ్యముగను పరుండనియ్యవలెను. పొర్లువచ్చినప్పుడు [9]క్లోరోఫారమిచ్చి, రోగిని శాంతింపచేయుదురు.

నివారణము:—వెఱ్ఱికుక్క ఎవరినైన కరిచినట్లుగాని, నాకినట్లుగాని సందేహముండినయెడల, వెంటనే గాయమున్నస్థలమును స్వచ్ఛమైన కార్బాలిక్‌తోగాని, [10]కాటరి యను లోహసాధనముతోగాని కాల్చివేయ

[1] Laryngitis. [2] Otitis media. [3] Rheumatic fever. [4] Rabies. [5] Period of incubation. [6] Prodromal stage. [7] Paroxysm. [8] Paralysis. [9] Chloroform. [10] Cautery.



వలెను. రోగికి [1]ఆంటిరేబిక్ సీరం ఎక్కించవలెను. రోగి ముక్కునుండియు గొంతునుండియు వచ్చు స్రావములను డిస్ఇన్ఫెక్ట్ చేయవలెను. రోగికి వాడిన పాత్రలను స్టెరిల్ చేయవలెను. వెఱ్ఱిపట్టియున్నట్లు సందేహమున్న యే జంతువునైనను 10 దినములవరకు భద్రముగ మూసియుంచవలెను. అది బ్రతికియున్నచో రేబీస్ కాదు. అది చనిపోయినయెడల, దాని మెదడుతీసి, రేబీస్ చిహ్నములున్నవా యని పరీక్షించవచ్చును. వెఱ్ఱికుక్క కరచిన మరియొక కుక్క ఏదైననుసరే, దానిని 3 మాసములు మూసి యుంచవలెను.

పాస్టర్ చికిత్స యీ వ్యాధికి చేయుదురు. అనగా, ప్రతిదినము 14 దినములవరకు ఆంటిరేబిక్ సీరం ఇంజెక్షనులు చేయుదురు. కడుపు గోడలోనికి ఎక్కించెదరు. రేబీస్‌వలన చచ్చిన కుందేళ్ల యెండిన [2]వెన్నుబాములనుండి వాక్సీనును (రసిని) సిద్ధముచేయుదురు. ఇండియాదేశములో గొఱ్ఱె మెదడును ఈ పనికి ఉపయోగించెదరు.

డెంగ:—ఇది యుష్ణదేశములలో వచ్చు అంటువ్యాధి. జ్వరము రెండుసార్లుగావచ్చుట, జ్వరముతో కీళ్లయందును, కండరములయందును బాధకరమైన నొప్పియుండుట ఈ రోగలక్షణములు. ఏదో యొక ఫిల్ట్రబుల్ వైరస్ అను క్రిమివలన ఈ వ్యాధి కలుగునని తలంచుచున్నారుగాని, పగటిపూట యెగురు దోమలవలన ఈ వ్యాధి వ్యాపించుచున్నది. దీని ఇంక్యుబేషన్ కాలము 3 నుండి 10 దినములు. అంటుచేరియున్న దోమ కుట్టుటవలన ఇది మనిషికి వ్యాపించును. ఒకసారి రోగము వచ్చినవారికైనను ఈ వ్యాధినుండి శాశ్వతమైన రక్షణశక్తి యేర్పడదు.

లక్షణములు:—ఆరంభము అకస్మాత్తుగను, అధిక జ్వరముతోను వచ్చును. ముమ్మరమైన తలనొప్పి, కండ్లనొప్పి, కీళ్లలోను, కండరములలోను పోట్లుపుట్టు నొప్పులుండును. ఏమాత్రము కదిలినను ఈ నొప్పులు ఎక్కువగును. వ్యాధి యున్నంతకాలము రోగి చాల కృంగియుండును. మూడుదినములైన తరువాత జ్వరము త్వరగా తగ్గిపోవును. విస్తారముగ చెమటపోసి, రోగలక్షణములు తగ్గును. 5-వ దినమున జ్వరము తెలియనిరీతిగా 103°F. వరకు హెచ్చును. దీనివెంటనే ఒకవిధమైనతట్టు (దద్దురు) పోయును. నల్లనిశరీరముమీద దీనిని గుర్తుపట్టుట కష్టము. ఈ

[1] Antirabic serum. [2] Spinal cords of rabbits.

దద్దురు త్వరలోనే వాడిపోయి, పొట్టు ఊడిపోసాగును. ఈ రోగస్థితి యున్నప్పుడు, రోగికి నిర్నిద్రయు; తరుచుగ విసుగును ఉండును. జ్వరము పోయినను, కీళ్లనొప్పి, చాలకాలమువరకు నిలిచియుండవచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు**:—మొదటి కొన్నిదినములకు నర్సు రోగిని సాధ్యమైనంతవరకు కదిలించకుండ నుంచవలెను. స్పంజ్ స్నానముచేయించుటవలనను, జ్వరము తగ్గుటకు తలకు మంచుత్తిత్తి పెట్టుటవలనను రోగికి ఉపశాంతి కలుగును. నొప్పియు, ఆయాసము నున్నప్పుడు ఆస్పిరిన్, మార్ఫియ ఉపయోగపడును. ప్రతిదినము 4000—000 cc. ల ద్రవము నిచ్చుచుండవలెను.

**నివారణము**:—దోమలురాకుండ సన్నని తీగలు వేసిన గదిలో రోగి నుంచవలెను; లేదా, అతని పడకచుట్టు వలనైన వేయవలెను.

[1]**నిద్రరోగము**:—మెదడు కందుటవలన ఈ వ్యాధి కలుగును. నిద్రమత్తు, తలనొప్పి, [2]ద్వంద్వదృష్టి దీని స్వాభావిక లక్షణములు. కారణము ఫిల్ట్రబుల్ వైరస్ అని తలంచెదరు. అంటుగల వ్యాధిగ్రస్థులును, క్రిమివాహకులును ఈ వ్యాధి వ్యాపనకు కారకులు. అంటుకలిగించు సూక్ష్మప్రాణి—ముక్కునుండి, గొంతునుండి వచ్చు స్రావములందిమిడియుండును. ఇది ఇన్‌ఫ్లుయంజ ఉండినప్పుడు తరుచుగవచ్చును. 1918-వ సం॥ వచ్చిన ఇన్‌ఫ్లుయంజ ఎపిడెమిక్ వరకు ఎవరును దీనిని తెలిసికొనలేదు.

**లక్షణములు**:—ఆరంభము క్రమేణగాని లేక అకస్మాత్తుగాగాని రావచ్చును. సాధారణ లక్షణములు, కొద్దిపాటి జ్వరము, తలనొప్పి, ద్వంద్వదృష్టి, నిద్రవలన కలిగిన మైకములోనుండుట. దానినుండి లేపుట దుస్తరము. ఈ స్థితి కొన్నివారములుగాని, నెలలుగాని ఉండును. సంపూర్ణ స్వస్థతకలుగుట అరుదు. తరుచుగా వెనుకచెప్పిన లక్షణములు నిలిచియుండును కావున, రోగి రూపము సంపూర్ణముగ మారిపోవును. కొందరికి మానసికస్థితియు చెడిపోవును; మరికొందరికి చలననాడులు చెడిపోవును. కండరములు ఎల్లప్పుడు ఈడ్చుకొనును; ఒక్కొక్కప్పుడు హఠాత్తుగా వెనుకకు లాగుకొనుచుండును. ముఖము ముద్దగానుండును. మాట్లాడుట కష్టమగును. నోటిదగ్గర జొల్లుకారుచుండును; నడక నిలకడ

[1] Encephalitis lethargica. [2] Double vision.



లేనిదైయుండును. ఈ స్థితిలో అనేకమంది రోగులు తమకు తాము ఎట్టి సహాయము చేసికొనలేక యుందురు.

**చికిత్సయు, పరిచర్యయు**:—ఫలితము కలుగునని తెలిసిన చికిత్స ఒక్కటే కలదు. అది యేదనగా, వెన్నుబాములోనుండి ద్రవము తీయుట. జాస్తి ద్రవాహారముల నియ్యవలెను. ఆహారమిచ్చు విషయములోను రోగిని బహుజాగ్రత్తగ గమనించుచుండవలెను.

**నివారణము**:—రోగిని వార్డులో ప్రత్యేకముగ నుంచవలెను. శ్వాసనాళములనుండి వచ్చిన స్రావములను గాల్చివేయవలెను. సాధారణముగా చేయురీతి ననుసరించి, రోగిపడక, పరికరములు డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవలెను.

[1]**శిశు పక్షవాతము**:—ఇది కేంద్రనాడీమండలమునకు చేరిన అంటువ్యాధి. సాధారణముగా 5 సం॥లు లేక తక్కువ వయసుగల పిల్లలకు ఈ వ్యాధివచ్చును; పెద్దవారికిని రావచ్చును. ఇది ప్రపంచమంతట వ్యాపించియున్నది. ఇది ఫిల్ట్రబుల్ వైరస్ అను క్రిమిమూలమున గలుగుచున్నది. ఈ క్రిమి ముక్కునుండి, గొంతునుండివచ్చు స్రావములలోను, వెన్నునుండి తీయు ద్రవములోను, కొన్నిసారులు మలములోను నుండును. రోగిని నేరుగ తాకుటవలనగాని, లేక రోగి శ్వాసనాళముల నుండి వచ్చు స్రావములను మలమును దాకుటవలనగాని, క్రిమివాహకులవలనగాని యీ వ్యాధి తరుచుగా ఇతరులకు వ్యాపించును. ఈ రోగముయొక్క ఇంక్యుబేషన్ కాలము 1 నుండి 18 దినములు. రోగము ఆరంభించినది మొదలు మూడు వారములవరకు ఈ వ్యాధి అంటుతగులునదై యుండును.

**లక్షణములు**:—పక్షవాత చిహ్నములుతప్ప, తక్కిన లక్షణములు మెనిన్‌జైటిస్ వ్యాధి లక్షణములే. ఆరంభము అకస్మాత్తుగ వచ్చును. దానితో తలనొప్పి, జ్వరము, మొత్తముమీద ఆయాసము, వీపునొప్పి యుండును. అప్పుడప్పుడు వాంతియగుటయు, అతి విరేచనములు నుండ వచ్చును. వ్యాధి ముదురుకొలది మెడయు వీపును బిగుసుకొని పోవ నారంభించును. రోగము తగిలిన నాలుగు దినములలో పక్షవాతము వచ్చును. ఇది కాళ్లకు చేతులకు రెంటికిని తగులవచ్చునుగాని, సాధారణముగ కాళ్లకు

[1] Acute anterior poliomyelitis (infantile paralysis.)

మాత్రమే తగులుట మామూలు. ఒక్కొక్కప్పుడు పక్షవాతము పైకి ఎగబ్రాకి మ్రింగుట, శ్వాసించుట అను రెండు వ్యాపారముల నాపును. అనేకమంది రోగులకు పక్షవాతమే రాకపోవచ్చును. పక్షవాతము పోగలిగినంతదూరము పోయినతరువాత, వ్యాధి బాగుపడ నారంభమగును. గాయపడిన అణువులు బాగుపడునుగాని, నాశనమైనవి పునర్జీవించవు. అవయవములు సరిగ పెరుగక పోవుటవలనను రోగము నెదిరించు శక్తిలేని కండరములు జాస్తిగ ముడుచుకొనుటవలనను వికృతమేర్పడును.

**చికిత్సయు, పరిచర్యయు:**—తీవ్రమైన వ్యాధిలక్షణము లంతరించువరకు రోగిని ఖచ్చితముగ పడకలో పరుండబెట్టవలెను. పక్షవాతము తగిలిన అవయవములకు సంపూర్ణ విశ్రాంతి కలుగవలెను. కల్పితజ్వరము కలిగించుట, విటమిన్ B, E ల నిచ్చుట సహాయకరము. ఈ వ్యాధినుండి బాగుపడినవానిలోనుండి [1]సీరముతీసి, వ్యాధితో బాధపడువానికి ఆరంభదశలోనే యిచ్చినయెడల, రోగము ముదిరిపోకుండ నిలిచిపోవుటకు సహాయపడును. రోగమును నిర్ణయించుటకుగాను [2]వెన్నునుండి ద్రవము తీయుదురు. దీనివలన ఒత్తిడియు తగ్గును. తీవ్రమైన రోగలక్షణములు తగ్గినప్పుడు, పక్షవాతము తగిలిన అవయవములను మర్దనచేయుటవలన అవి తిరిగి పనిచేయ నారంభించును. [3]బ్రేసెస్, టెండన్‌ట్రాన్స్ ప్లాంటేషన్ ఆపరేషన్ అనువానివలనకూడ చాల మంచి ఫలితము కలుగును. అవయవములకు వేడి తగులుచుండవలెను గాని, రోగికి కప్పెడు పడకగుడ్డలు బరువైనవిగా నుండకూడదు. ద్రవములను జాస్తిగా నియ్యవలెను. మలమూత్రాదులు విడుచుటను చాల జాగ్రత్తగ గమనించుచుండవలెను. ఎందుకనగా, రోగి కొంత మలమూత్రమును విడువక ఆపుకొనవచ్చును. లేక ఆపుకొనుశక్తిలేక పలుమారు వీనిని విడుచుచుండవచ్చును. శ్వాసకేంద్రమునకు, పక్షవాతము తగిలినయెడల, రోగిని మెకానికల్ రెస్పిరేటర్ అను సాధనములో నుంచవలెను; దీనివలన శ్వాస నిశ్వాసములు జరుగును.

[4]సిస్టర్ కెన్ని అను నాస్ట్రేలియాదేశపు సిస్టర్ ఒకతె మరియొక చికిత్స చేసెను. ఇది పైన చెప్పినదానికంటె చాలభేదముగ నున్నను మంచి

[1] Convalescent serum. [2] Spinal tapping. [3] Braces and tendon transplantation. [4] Sister Kenny.



ఫలితము కలిగినది. కావున పెక్కుమంది వైద్యులు దీనిని ఆమోదించియున్నారు. సంగ్రహముగా ఆ చికిత్స నిట్లు వివరించవచ్చును:—రోగిని సహజరీతిగా విశ్రాంతి కలుగు తీరులో నుంచుము. కండరములకు కలిగిన ఈడ్పు తగ్గగానే వానిని కదిలించుమని రోగిని ప్రోత్సహించుము. [1]బద్దలు వేసికట్టనక్కరలేదు. నొప్పిని, కండరముల ఈడ్పును తగ్గించుటకుగాను [2]వేడినీటి పాక్స్ పగటికాలములో 2 గంటల కొకసారి యిచ్చుచుండవలెను. [3]పని కల్పించనట్టియు, కల్పించునట్టియు అభ్యాసములను రోగము ఆరంభదశలో నుండగనే చేయించుము. అప్పుడు కండరములు ఒకదానితో నొకటి సంబంధపడి పనిచేయుటవలన, అవయవ వికృతము నివారణమగును. దినమునకు రెండుపర్యాయములు రోగిని బోర్లపరుండబెట్టవలెను. దేహమర్దనగాని, [4]నీటిక్రింది పరిశ్రమలుగాని చేయించ నక్కరలేదు.

**నివారణము:**—రోగిని ప్రత్యేకమైన వార్డులో నుంచుము. ముక్కునుండి, నోటినుండి, ప్రేగులనుండివచ్చు మలినములను డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవలెను. గుడ్డలు, పాత్రలు, పరుపు, రోగియున్న గది వీనిని యింతకు ముందే చెప్పియున్న రీతిగా శుద్ధిచేయవలెను.

[5]**యెల్లోఫీవర్ (పసుపు జ్వరము):**—ఇది తీవ్రమైన అంటువ్యాధి. ఒకటి రెండు సారులు జ్వరమువచ్చుట, పసిరికలు కలుగుట, ఆహారకోశము నుండి రక్తస్రావము, మూత్రమందు ఆల్బ్యుమిన్ ఉండుట ఈ వ్యాధి సహజలక్షణములు. ఈ వ్యాధి ఆఫ్రికా పశ్చిమ, మధ్యప్రాంతములలోను, ఉత్తర దక్షిణ అమెరికాలలోని ఉష్ణప్రాంతములయందును వ్యాపించియుండును. ఫిల్టరుబుల్ వైరస్ అను క్రిమి యీ వ్యాధికి కారణము. అంటుకలిగిన [6]'స్టెగోమెయియ' అను దోమకాటువలన యీ వ్యాధి వ్యాపించుచున్నది. ఈ దోమ రోగమారంభమైన 4 రోజులలోపల వ్యాధిగ్రస్థుని కుట్టవలెను. ఒకసారి కుట్టినదోమ 12 దినములు గడిచిపోవువరకు మరి యెవరికికూడ అంటు వ్యాపింపచేయు శక్తిలేనిదై యుండును. ఇప్పుడు ఇండియా, ఆఫ్రికా దేశములకు వాయువిమాన మార్గములున్నందున, ఈ వ్యాధి యిండియాకును వ్యాపించుటకు వీలున్నది.

[1] Splints. [2] Hot packs. [3] Passive and active. [4] Under water exercises. [5] Yellow fever. [6] Stegomyia.

లక్షణములు:—పసుపుజ్వరము అకస్మాత్తుగ ఆరంభించును. మొదట 103°—104° F. జ్వరముండును. ముమ్మరమైన తలనొప్పి, నడుములలో నొప్పియుండుట ఈ వ్యాధియొక్క మొదటి లక్షణములు. నాడి నిదానముగ నుండును. నాలుకకు పాచిపట్టియుండును. వాంతియు, మలబద్ధకమును ఉండును. [1]మూత్రము తక్కువ విడుచును; దాదాపు మూడవదినమున [2]కంటి తెల్లపొర పసుపురంగుకు తిరుగును. చర్మముక్రింద చిన్న రక్తపు డాగులుండును. మూడవదినము జ్వరముతగ్గి రోగి బాగుపడ నారంభించవచ్చును. తరుచుగా రెండవదశ రావచ్చును; కామెరలు అధికమగును. రక్తము కక్కును. దీని తరువాత మూత్రము పోయుట ఆగిపోవచ్చును. కార్జముయొక్క టిష్యూలు జాస్తిగ నాశనమగుటవలన టాక్సీమియ ఎక్కువగును. ఇతర లక్షణములు: అధికదాహము, ఎక్కిళ్లు, ముక్కునుండి జాస్తిగా రక్తముకారుట, విరేచనము నల్లగనగుట మొదలైనవి. [3]యురీమియవలనగాని, [4]కొలాప్సువలనగాని మరణము సంభవించవచ్చును.

చికిత్సయు, పరిచర్యయు:—రోగిని గాలి ధారాళముగా వీచు గదిలో పెట్టి చికిత్సచేయవలెను. ఈ గదిలోనికి దోమలు రాకుండ దానిని కాపాడవలెను. నులివెచ్చని నీటితో స్పంజ్ స్నానము చేయించుటవలన రోగికి మొత్తముమీద సౌఖ్యముకలిగి జ్వరము తగ్గవచ్చును. మలమూత్రాదులు ధారాళముగ జరుగునట్లును, విషమునకు విరుగుడుగను నీళ్లు విస్తారముగా త్రాగించవలెను. రోగి పుచ్చుకొను ద్రవమును, విడుచు ద్రవమును కొలిచి చార్టులో వ్రాయుచుండవలెను. మూత్రములో శ్వేతధాతువు (ఆల్బ్యుమిన్) ఉన్నదాయని ప్రతిదినము పరీక్షించుచుండవలెను. వాంతిని తగ్గించుటకుగాను మంచునీటినిగాని, మంచు పలుకులనుగాని యియ్యవచ్చును. మంచుతిత్తిని ఆహారకోశముమీద పెట్టవచ్చును; లేదా, ఆవాల పట్టువేయవచ్చును. మొదటి రెండు మూడు దినములవరకు రోగికి నోటిద్వారా ఆహారమియ్య కూడదనియు, రోగిని పోషించుటకు గ్లూకోసును రక్తనాళములలోనికి యెక్కించవలెననియు కొందరి వైద్యుల అభిప్రాయము. డోకు తగ్గినతరువాత తక్కువరుచిగల యాహారపదార్థములు—అనగా, బార్లి, జావ, బియ్యపుగంజి, పాలు మొదలైనవి కొద్ది పరిమాణములుగ నియ్యవచ్చును. కండ్లకు వెలుగు తగులకుండ వానిని

[1] Oliguria. [2] Sclera. [3] Uremia. [4] Collapse.



కాపాడవలెను. నోటిని పలుమారు క్షారము (ఆల్కలైన్) కలిసిన మందు నీటితో కడిగి శుభ్రము చేయుచుండవలెను.

నివారణము:—దోమలను జంపుము; రోగులచుట్టు వలవేయుము; వ్యాధినుండి రక్షణశక్తి వృద్ధియగుటకు టీకాలు వేయించుము.

[1]టైఫస్ జ్వరము:—ఇదియు అంటువ్యాధియే. [2]రికెట్సియ ప్రొవజెకి యను సూక్ష్మజీవివంటి యొక ప్రాణివలన నిది కలుగుచున్నదని యందురుగాని, దీనినిగూర్చి యింకను బాగుగా తెలియదు. ఈ వ్యాధి ఎండెమిక్‌గగాని, ఎపిడెమిక్‌గగాని రావచ్చును. మొదటిరకము వ్యాధి సముద్రపు రేవు స్థలములలోను, యూరోపు తూర్పు ప్రాంతములందును, ఆసియా ఖండమందును ఉండును. ఈ వ్యాధి ఉత్తరయిండియాలోను, చలికాలములలో మైదాన ప్రాంతములందును వ్యాపించుచున్నట్లు తెలిసికొనిరి. రెండవరకము, యుద్ధ, క్షామకాలములలో వ్యాపించును. ఇక్కాలములో యుద్ధముచేత పాడైన దేశములలో నిది బలముగనున్నది. ఈ వ్యాధియొక్క సహజమైన లక్షణములు:—ముమ్మరమైన నరముల సంబంధమైన లక్షణములుండును. జ్వరము 14 దినములుండును. మచ్చలవంటి దద్దుర్లుపుట్టును. ఒకసారి యీ జ్వరము తగిలినవారికి సాధారణముగ దీనినుండి జీవితకాలమంతయు రక్షణశక్తి యేర్పడును. పై రెండురకముల వ్యాధులకు ఒకే రకమైన లక్షణము లుండునుగాని యెండెమిక్ అనగా స్థానిక రకమునందు బలముతక్కువ. ఈ రకములో ఈ వ్యాధివలన అంటుతగిలిన ఎలుక, మిణ్ణల్లి కారణమై యుండును; గాని, ఎపిడెమిక్ రకములో దేహముపై నుండు చీరపేను ఈ వ్యాధికి కారణమైయుండును. ఈ వ్యాధి ఇంక్యుబేషన్ కాలము 4—12 దినములు. జ్వరము తగ్గిపోయిన 36 గంటలవరకును ఈ వ్యాధి యితరులకు తగిలెడుశక్తి దీనికి ఉండును. [3]వైల్ ఫెలిక్స్ అను రక్తపరీక్షమూలమున ఈ వ్యాధిని నిర్ణయింతురు.

లక్షణములు:—ఆరంభము అకస్మాత్తుగవచ్చి, చలి, జ్వరము, తలనొప్పి, దేహమంతట నొప్పులు మొదటి చిహ్నములుగ కనబడును. జ్వరము 104°—105° F. ఉండును. ఇట్లు 10—12 దినములు అధికముగా నిలిచి

[1] Typhus fever. [2] Rickettsia prowazeki.
[3] Weil-Felix blood test.

యుండి పిమ్మట [1]లైసిస్ వరుసన క్రమేణ తగ్గును. కొన్నిసార్లు క్రయిసిస్ వరుసన (ఆకస్మికముగ) తగ్గవచ్చును. ఐదవదినమున మచ్చలవంటి దద్దురు కనబడును. ఇది ముఖము, తలతప్ప, దేహమంతట పోయవచ్చును. ముఖము కంది, రోగము వృద్ధిచెందుకొలది, రోగి కలవరింతలు పెట్టుచు, పడకగుడ్డలు లాగుచు, తనకు తాను గొణుగుకొనుచునుండును. ఆయాసము, కండరముల యీడ్పు, [2]ముమ్మరమైన టాక్సీనిమియు ఈ వ్యాధియొక్క యితరమైన ముఖ్యలక్షణములు. జ్వరము తగ్గినప్పుడు, రోగి బలహీనపడి అలసిపోవును. టైఫాయిడ్ (సన్నిపాత) జ్వరమునకు చేసినట్టే చికిత్సయు, పరిచర్యయు చేయవలెను.

నివారణము:—రోగికి పరిచర్యచేయుచుండగా, పేలను, మిణ్ణల్లులను జంపుట ప్రధానకార్యము. ఈ పనిచేయుటకు నర్సు ఎత్తుమెడయు, పొడుగు చేతులునున్న గౌను వేసికొనవలెను. ఈ గౌను చేతులు, షర్టుచేతులవలె మణికట్టుదగ్గర బాగుగ మూసికొనియుండవలెను. వెండ్రుకలమీద వదులులేకుండ సరిపోవునట్టి టోపి పెట్టుకొనవలెను. పేలను జంపుటకు గాను, రోగి దేహమునకు కిరోసినాయిలు, కొబ్బరనూనె చెరిసగము కలిపి బాగుగ పట్టించవలెను. వెండ్రుకలున్నభాగమున క్షౌరము చేయ వచ్చును. పేలను నుక్కకుండ చంపవలెను. ఎందుకనగా, ఈ అంటు క్రిములు [3]అన్నవాహికలో చేరియుండును. రోగిని బాగుగ (సంపూర్ణముగ) శుద్ధిచేసినతరువాత, వానిని శుద్ధిమైన పడకమీద పరుండబెట్టి, అతడు ధరించినగుడ్డలను, నర్సు వేసికొనినగుడ్డలను ఏదైన ఒక సంచిలో బాగుగ కట్టియుంచి, ఆవిరివలనగాని, ఉడికించుటవలనగాని, ఏదైన క్రిమినాశనిమందులో ముంచుటవలనగాని డిస్‌ఇన్‌ఫెక్ట్ చేయవలెను. పేలను, ఎలుకలను చంపుట, రోగులను ప్రత్యేకించుట, టైఫస్‌వాక్సీన్ (రసి)తో టీకాలు వేయించుట—ఇవి మామూలు నివారణోపాయములు.

**ప్రోటోజోఅ జంతుసంబంధమైన సూక్ష్మజీవులవలన కలుగువ్యాధులు**

**[4]అమీబిక్ డిసెంటరి (రక్తభేది)**: — ఇది యుష్ణమండలములలోను, [5]ఉపోష్ణమండలములలోను వ్యాపించెడు అంటురోగము. మలములో బంక, రక్తము, అతివిరేచనములగుట ఈ రోగలక్షణములు. [6]ఎంటమీబ

[1] Lysis. [2] Toxemia. [3] Alimentary tract.
[4] Amebic dysentery. [5] Subtropics. [6] Entameba histolytica.



హిస్టొలిటిక యను సూక్ష్మజీవివలన కలుగుచున్నది. ఇది యేక అణువుగల జీవి. మానవుని టిష్యూలమీద, ఎఱ్ఱని రక్తాణువులమీద జీవించును. ఇంక్యుబేషన్ కాలము 3 నుండి 4 వారములు. [1]రక్తభేదితో అంటుతగిలినటువంటి నీళ్లవలన, ఆహారమువలన ఈ క్రిమి అండాణువుతీరున శరీరములో ప్రవేశించును. అంటుపడిన మలముపై వ్రాలిన ఈగలవలనను, మలినహస్తములతో ఆహారము సిద్ధముచేయుటవలన వ్యాపించు క్రిమివాహకులవలనను, ఆహారమునకు అంటు కలుగుచున్నది. నేలనుండి ఊరు మురికినీటివలన, త్రాగెడు నీరుకూడ అంటుబడును. నేలమీద మలమూత్రములు చేయునప్పుడు మలముద్వారా దేహములోని క్రిములు బయటికిపోవును.

మలమును భూతదర్పణముతో పరీక్షించి రోగమును నిర్ధారణచేయుదురు. రోగి మలవిసర్జనము చేసినవెంటనే దానిని పరీక్షించవలెనన్నసంగతి నర్సు జ్ఞాపకముంచుకొనవలెను. మలము నేపాత్రలో విసర్జించెనో ఆ పాత్రలోనే అది ఉడుకుగానున్నప్పుడే పరిశోధనాలయమునకు తీసికొనిపోవలెను. ఇట్లు తీసికొనిపోయెడు మలముతో నీటినిగాని, మూత్రమునుగాని కలుపకూడదు.

లక్షణములు:—మ్రింగినటువంటి రోగ అండాణువు పెద్దప్రేగులో చేరినప్పుడు అది పిగిలి 'అమిబ' అను జీవక్రిమి తయారై, అమత్వచను తొలుచుకొనిపోవును. ఇందువలన పెద్దప్రేగు గోడలో పెద్దవియు, లోతైనవియునైన పుండ్లు లేచును. సాధారణముగా ఈ స్థితిలో ప్రేగు పట్టుకొన్నట్టు నొప్పియుండును. బంక, రక్తము, చెడువాసనగల భేదులు పలుమారగుచుండును. జ్వర మెక్కువ ఉండదు. ఇట్లు ఇవి మలబద్ధకముగాను మాటిమాటి వచ్చుచుండును. క్రమక్రమముగా రోగి రక్తహీనుడును, బలహీనుడునై కృశించిపోవును. [2]అమిబ యను క్రిములు తరుచుగా రక్తనాళములలో ప్రవేశించి, కాలేయమునందు చీము గడ్డలు లేచునట్లు చేయును.

చికిత్సయు, పరిచర్యయు:—రోగిని పడకలో పరుండనిమ్ము. ఆరంభదశలో సేలైన్ విరేచనపుమందు లిచ్చెదరు. ఇంకను ఎక్కువ మాంసకృత్తులున్న ద్రవాహారముల నియ్యవలెను. కడుపునకు వేడికాపడముల

[1] The cystic form of the parasite. [2] Amebae.

నిచ్చుటవలన నొప్పితగ్గును. పిండి, నల్లమందుతోగూడిన ఎనెమలు టెనెస్మస్సు ముక్కుటను తగ్గించును. $\frac{1}{2}$—1 గ్రెయిను ఎమిటిన్ అను మందును 6 దినములు లేక ఎక్కువకాలము ప్రతిదినము కండరముల లోనికి యిచ్చుటయే దీనికి తగిన వైద్యచికిత్స. ఇంక [1]యాట్రెన్ అను దానిని నోటిద్వారాగాని ప్రేగులద్వారాగాని యియ్యవచ్చును. [2]స్టోవార్సన్, [3]కార్బార్సన్, వైమొఫారం, అను మందులనుగూడ వాడెదరు. ఈ వ్యాధి దీర్ఘకాలమునుండి యున్నదైన, [4]ఎమిటిన్ బిస్మత్ ఐయొడైడ్ అను మందును నోటిద్వారా ఇయ్యవచ్చును. ఇంకా [5]క్వినాక్సల్ (లోపల ఉంచుకొను) ఎనెమలనుకూడ ఇయ్యవచ్చును. చికిత్సవలన ఈ వ్యాధి తగ్గునుగాని, తిరిగివచ్చుట సాధారణము.

నివారణము:—టైఫాయిడ్ (సన్నిపాత) జ్వరమునకుచేయు నివారణోపాయములే చేయవలెను.

మలేరియ (చలిజ్వరము):—ఇదియు అంటువ్యాధియే. ఇది యెఱ్ఱని రక్తకణములకు సంభవించును. ఒక్కొక్క సమయములో చలిజ్వరము వచ్చుట; ప్లీహము విస్తరించుట, రోగికి రక్తహీనతకలుగుట ఈ రోగ సహజ **లక్షణములు.**

[6]అనాఫెలీన్ అను ఆడుదోమ మానవదేహమును కుట్టినప్పుడు ఒకవిధమగు జంతు పరాశయక్రిమి దేహములోనికి ప్రవేశించుటయే యీ వ్యాధికి కారణము. దీని ఇంక్యుబేషన్ కాలము 10 నుండి 20 దినములు. ఇండియాదేశములో మలేరియజ్వరము సర్వసాధారణమైన వ్యాధి. బ్రిటిష్ ఇండియాలోనే ప్రతిసంవత్సరము 100,000,000 మంది ఈ వ్యాధి బాధితులగుచుందురని లెక్కవేయబడినది. మూడువిధములైన పరాశయక్రిములున్నవి. ఇవి కొద్దిగా భేదించు జ్వరములను కలుగజేయును. ఈ భేదము జ్వరమువచ్చు కాలమందుండును. ఈ మూడురకము లేవనగా:—(1) [7]బినైన్ టెర్షియన్ పారసైట్ (పరాశయము) (2) [8]మలిగ్నెంట్ లేక సబ్ టెర్షియన్ పారసైట్ (3) [9]క్వార్టన్ పారసైట్. మొదటి రకములో జ్వరము ప్రతి

[1] Yatren. [2] Stovarsone. [3] Carbarsone. [4] Emetine Bismuth Iodide.
[5] Quinoxyl retention enemas. [6] Female anopheline mosquito.
[7] Benign tertian parasite. [8] Malignant or subterian parasite.
[9] Quartan parasite.



మూడవ దినము వచ్చును. మూడవరకము (క్వార్టన్ పారసైట్) రకములో ప్రతి నాల్గవదినమున జ్వరము హెచ్చుచుండును. మలిగ్నెంట్ టెర్షియన్ రకములో జ్వరము విడువకుండ ఉండును; క్రమము తప్పి వచ్చుచుండును.

దోమ కుట్టుటవలన పరాశయక్రిమి దేహములో ప్రవేశించి రక్తకణముములోనికి దూరుటకు యత్నించును. ఇక్కడ యిది కణమునిండునట్లు పెరిగి విభాగములై పదినుండి యిరువది క్రొత్త పరాశయక్రిములగును. ఈ సమయమున రక్తకణము పిగులుటచేత, ఈ క్రిములు రక్తప్రవాహములోబడి విచ్చలవిడిగ సంచరించును. ఈ క్రొత్త క్రిములు క్రొత్త రక్తకణములలో ప్రవేశించి, వానిజాతి నధికము చేయుచుపోవును. ఎఱ్ఱనికణములు విస్తారముగ (ఎక్కువ సంఖ్యలుగా) పిగిలినప్పుడు రక్తహీనత యేర్పడును. కొన్నిక్రిములు ఏ మార్పులేకయుండి ఏదైన ఒక దోమ కుట్టి రక్తము పీల్చుకొనువరకు ఆ రక్తములో చేరియుండును. ఈ పరాశయక్రిములు సంపర్క ధర్మముగలిగి దోమయందు వందలాది అండాణువులుగ వర్ధిల్లును. ఇక ఆ దోమ తిరిగి యెవరిని కుట్టునో వానిలోనికి యీ క్రిములన్నియు ఎక్కించబడును.

**లక్షణములు**:—ఈ వ్యాధి మూడుదశలుగ వచ్చును. ఈ దశలు సూత్రప్రాయములైనవి. మొదటిది శీతలదశ. వణకు, తలనొప్పి, దేహమంతట నొప్పులు నుండును. రోగికి డోకు, వాంతియు నుండవచ్చును. నాడి త్వరితముగను, కొద్దిగను కొట్టుకొనుచుండును. రెండవది వేడిదశ. ఈ దశలో జ్వరము అధికముగనుండును. జ్వరము $103^\circ$—$106^\circ$ F. వరకు హెచ్చును. ముఖము ఎఱ్ఱబడును; రోగికి అధికదాహము, తలనొప్పి యుండును. నాడి నిండుగను, దుమికినట్లు నుండును. చర్మమెండి వేడిగ నుండును. మూత్రము కొద్దిగను అధికరంగుగను విడువబడును. దీని తరువాత మూడవదశవచ్చును. దానిలో ముఖ్యలక్షణము చెమట విస్తారముగ పోయుట. జ్వరము త్వరగ తగ్గి సబ్‌నార్మల్‌కు దిగుట. ఈ లక్షణములన్ని తుదకు తగ్గిపోవును; రోగియు సుఖముగ నుండును గాని, చాలబలహీనముగ నుండును.

భూతదర్పణ సహాయముతో రక్తమును పరీక్షించి దానిలో పరాశయ క్రిములున్నవో లేవో కనుగొని రోగమును నిర్ణయింతురు.

**చికిత్సయు, పరిచర్యయు:**—శీతలదశలో రోగికి కంబళ్లు కప్పి వెచ్చగ నుంచుము. వేడినీటిబుడ్లు పెట్టుటవలనను, వేడిపానీయము లిచ్చుటవలనను రోగికి వేడికలిగించవచ్చును. జ్వరము హెచ్చ నారంభించినప్పుడు తలకు చల్లని కాంప్రెస్‌లుగాని మంచుసంచిగాని పెట్టి చల్లనిద్రవములు త్రాగించవలెను. మూడవదశలో అనగా, చెమటపోయుచుండగా, రోగినాడిని, అతని రంగును జాగ్రత్తగ గమనించి, ఆఖరున చెమటతుడిచి పడకగుడ్డలు మార్చివేయుము.

మలేరియ జ్వరమునకు వాడెడు మందుదినుసులేవనగా:—క్వినీన్, సింకోన. [1]ప్లాస్మొక్వీన్, అటెబ్రిన్ మొదలైనవి.

**నివారణము:**—1. రోగిని తీగవేసిన గదిలో నుంచుము లేదా, పడక చుట్టు దోమతెర వేయుము.

2. ఈ క్రిములు చేరినవారికి క్వినీన్ ప్లాస్మొక్వీన్ మందుల నిచ్చి వారిని డిస్‌యిన్‌ఫెక్ట్ చేయుము.

3. నిలిచియున్న నీటిమడుగులను దోమలు పెరుగుటకు అనుకూలమైన యితరస్థలములను నిర్మూలము చేయుము.

[2]**నల్లనీటి జ్వరము** (బ్లాక్ వాటర్ ఫీవర్):—ఈ వ్యాధియొక్క ముఖ్యలక్షణ మేదనగా, రక్తపుమూత్రము విడుచుట. దీనినే [3]హీమొగ్లొబిన్యూరియ అందురు. నల్లనిమూత్రము విడుచుటనుబట్టి యీ వ్యాధికి నల్లనీటి జ్వరమని పేరుగలిగినది. కొందరు అనుభవముగలవారు ఇది మలేరియ జ్వరముయొక్క సంకర వ్యాధియని తలంచిరి. మలిగ్నెంట్ టెర్షిన్ రకము మలేరియ వచ్చినవారికిని క్రమముతప్పి, కొద్దిమోతాదులుగ క్వినీన్ పుచ్చుకొనుచుండువారికిని, ఎప్పుడో మలేరియ వచ్చినప్పుడు ఉండి ఉండి పెద్దమోతాదుగ క్వినీన్ పుచ్చుకొనువారికిని నల్లనీటిజ్వరము వచ్చును.

**లక్షణములు:**—ఆరంభము అకస్మాత్తుగవచ్చును. అప్పుడు తలనొప్పి, జ్వరము, దేహము మంట, వీనివలన అసౌఖ్యము నుండును. రోగికి డోకు, వాంతియగును; వెక్కిళ్లును, అమితముగ దాహమునుండును. ఎఱ్ఱ రక్తకణములు ఎక్కువ నాశనమగుటవలన హిమొగ్లొబిన్యూరియ, రక్త

[1] Plasmoquine. [2] Black water fever [3] Hemoglobinuria.



హీనత, కామెరలుండును. కొన్నిసారులు సగము (½) అణువులు 24 గంటలలో నాశనమగును. కొన్నిసారులు హిమొగ్లొబిన్ (రక్తగోళకము) మూత్రపిండములకు అడ్డముపడి మూత్రము నణిచివేయును. మూత్రము అణిచివేయబడుట, అలసట, గుండెయొక్క పనికి కష్టముకలుగుట ఇవి మరణమునకు పలుమారు కారణములగుచుండును.

**చికిత్సయు, పరిచర్యయు:**—ఈ వ్యాధికి సంకరవ్యాధులు రాకుండ చికిత్స చేయవలెను. క్షార (ఆల్కలైన్) పదార్థముల నిచ్చి మూత్రపిండములకుండెడు అడ్డు తొలిగించవలెను. వాంతియున్నప్పుడు గ్లూకోసును రక్తనాళములలోనికి ఎక్కించవలెను. రక్తనాళములకు మందు నెక్కించుటకు ఉపయోగించెడు సాధనములన్నిటిని నర్సు సిద్ధముగ నుంచుకొనవలెను. రక్తహీనతను పోగొట్టుటకు [1]పరరక్త ప్రవేశము తరుచుగ చేయవలెను. రోగిని కంబళ్లమధ్య రికంబెంట్ తీరులోనుంచి, చలిపుట్టకుండ చేయవలెను. రోగిని హఠాత్తుగ కదిలించకూడదు. ఎందుకనగా, గుండె నిలిచిపోవచ్చును. చెమట విస్తారముగ పోయుచున్నయెడల, దేహమును తుడిచి, గుడ్డలు మార్చివేయవలెను. [2]ఎనూర్యరియ అను వ్యాధి యున్నప్పుడు నడుములమీద వేడికాపడములు, ఉప్పు ద్రావకము (సొల్యూషన్) పెద్ద పరిమాణములుగ నియ్యవలెనని వైద్యుడనవచ్చును. బార్లినీళ్లు, పండ్లరసము, పాలు, వివిధములైన గంజి—యివి రోగికిచ్చెడు ఆహారములోని ముఖ్యమైన పదార్థములు.

[3]**కాల-అజర్ లేక నలుపురోగము:**—ఇది యుష్ణప్రదేశములలో వ్యాపించు అంటురోగము. ఇది చీనా, ఇండియా, ఈజిప్టు మొదలగు వేడిప్రదేశములలో ఎండెమిక్‌గా వ్యాపించును. రక్తమునందుండు ఒక క్రిమివలన ఈ వ్యాధి పుట్టుచున్నది. ఈ క్రిమిపేరు [4]లైష్మన్ డానవాని. [5]స్యాండ్‌ఫ్లై అను ఒకవిధమైన చిన్న ఈగకాటు మూలమున ఈ వ్యాధి క్రిములు ఒకరినుండి యింకొకరికి వ్యాపించును. ఇంక్యుబేషన్ కాలము సాధారణముగ 10 నుండి 20 దినములు; లేక కొన్ని నెలలవరకు నుండవచ్చును. దీని క్రిములు ప్లీహము, కాలేయము, ఎముకలోని మజ్జయందుండును.

[1] Blood transfusion. [2] Anuria. [3] Kala-azar.
[4] Leishmani Donovani. [5] Sandfly.

లక్షణములు:—కాల అజర్ అను వ్యాధియున్నప్పుడు దీర్ఘముగను, విడువక ఎల్లప్పుడు నుండునట్టియు, క్రమములేనట్టియు జ్వరముండును. మధ్యమధ్య జ్వరము యథాస్థితికి దిగుచుండును. ప్లీహమును, కాలేయమును పెరుగుట, రక్తహీనత, తెల్లని రక్తకణములు చాల తగ్గుట, రక్తస్రావములు, జలోదరము, కాళ్లవాపు, రోగి మిక్కిలి బలహీనపడి క్షీణించిపోవుట—ఇవి యీ రోగముయొక్క యితర లక్షణములు. [1]కాన్‌క్రమ్ ఓరిస్, నుమోనియ, [2]బసిలెరి రక్తభేది—వీనివలన తరుచుగ మరణము సంభవించును.

[3]రోగనిర్ణయము:—దీనిని పరిశోధనాలయము (లెబొరటోరిలో) పరిపరి విధములుగ పరీక్షించుదురు. లేదా, ప్లీహమునుగాని కాలేయమునుగాని గ్రుచ్చి రసితీసి పరీక్షింతురు. ఇట్లు గ్రుచ్చవలసివచ్చినప్పుడు నర్సు శుభ్రమైన స్లైడులను (గాజుముక్కలను), తడిలేని సూదులను, సిరింజ్‌ని, చర్మమును శస్త్రముచేయుటకు అవసరమైన వస్తువులను సిద్ధముచేసి యుంచవలెను. గ్రుచ్చకముందు రోగి క్రింద బైండర్ అను కట్టుగుడ్డ నుంచవలెను. గ్రుచ్చినతరువాత ఈ బైండర్‌గుడ్డను పైకెడుపుచుట్టు గట్టిగ బిగించి, రోగిని నెమ్మదిగ నుండనియ్యవలెను. ఇట్లు చేసినయెడల, రక్తస్రావము కలుగుటకు ఎక్కువ అవకాశముండదు.

చికిత్సయు, పరిచర్యయు:—ఈ చికిత్సకు వాడెడిమందు లేవనగా: [4]ఆంటిమొని టార్‌ట్రేట్, [5]యురియ స్టిబమిన్, [6]నియోస్టిబోసన్ అనువానిని ఇంజెక్షన్‌మూలమున నియ్యవలెను. రోగికి కాన్‌క్రమ్ ఓరిస్‌గాని, సెప్టిక్ నుమోనియగాని రాకుండ రోగినోటినిగూర్చి నర్సు అధిక జాగ్రత్త గలిగి యుండవలెను.

నివారణము:—ఈ రోగమున్నదని తెలిసినవారికందరికి చికిత్సచేయుము.

ప్రాచ్యదేశములలో పుట్టు పుండు (డిల్లీగడ్డ). 25 అధ్యాయము చూడుము.

### [7]పురుగులవలన కలుగు వ్యాధులు

[8]ఫిలరైయెసిస్. ఇది ఉష్ణ, సమశీతోష్ణమండలములలో వ్యాపించు అంటు రోగము. ఇండియాలో కొన్ని ప్రాంతములందు ముఖ్యముగా బెంగాలు,

[1] Cancrum oris. [2] Bacillary dysentery. [3] Diagnosis. [4] Antimony tartrate. [5] Urea stibamine. [6] Neostibosan. [7] Worms. [8] Filariasis.



మద్రాసు రాష్ట్రములలో ఈ వ్యాధి సాధారణమైనది. [1]ఫిలేరియ-బన్‌క్రాఫ్టి యను సన్నని, గుండ్రని పురుగు ఈ వ్యాధికి హేతుభూతమై యున్నది. ఈ పురుగు 2-3 అంగుళములు పొడుగుండును. దోమలమూలమున ఈ పురుగు మనుష్యులలో ప్రవేశించును.

ఈ పురుగు జీవిత చరిత్ర:—పెద్దపురుగులు [2]శోషవాహిక గ్రంథులలో జీవించును. ఆడుపురుగులు పిండములను వృద్ధిజేయును. ఈ పిండములు రక్తప్రవాహములోనికి పోవును. పగటిపూట అవి యూపిరితిత్తులలోని రక్తనాళములలో నుండునుగాని, రాత్రిసమయమున నవి ఒంటి యుపరిభాగమునకు పోవును. కావున దోమలు రోగిని కుట్టినప్పుడు సులభముగా ఈ క్రిములనుగూడ రక్తముతోపాటు పీల్చుకొనగలవు. దోమయందు ఈ క్రిములు కొన్ని మార్పులుచెంది, తుదకు దాని తొండము దగ్గర చేరియుండి, అదియొక మనిషిని కుట్టినప్పుడు బైటికివచ్చును. దోమ యెక్కడకుట్టునో ఆ స్థలములోనే చర్మములో ప్రవేశించి, శోషవాహికలకు చేరి అక్కడ సంపూర్ణముగ పెరుగును. ఇట్టి క్రిమిపిండములను రాత్రిపూట తీసిన [3]రక్తపూతయందు చూడవచ్చును.

లక్షణములు:—ఫిలేరియ వ్యాధిగ్రస్తులు తరుచుగా ఆ రోగ చిహ్నములు లేనట్టుగనే యుండవచ్చును. కాని జ్వరము, [4]లిమ్‌ఫెంజైటిస్—ఉండవచ్చును. ఇట్లున్నదని శోషనాళముల మీదనున్న యెఱ్ఱని చారను జూచి గ్రహించవచ్చును. ఈ వ్యాధియున్న భాగమున వాపుండవచ్చును. లిమ్‌ఫెంజైటిస్ అనునది పెక్కుసారులు వచ్చుటవలన రక్తనాళములు అడ్డుపడి [5]ఇన్‌ఫెక్‌షన్ ఏర్పడవచ్చును. దీనివలన వాపు కనబడి టిష్యూలు లావయి ఏనుగుకాలు ([6]ఎలిఫెంటైయసిస్) లేక బోదెకాలు అను రోగము వచ్చును. కాళ్లును వృషణకోశములును సులభముగ ఈ వ్యాధికి లొంగెడు అవయవములు.

చికిత్సయు, పరిచర్యయు:—వృషణములకు తగిలినయెడల లావయిన చర్మమును తీసివేయుటవలన కొంతవరకు నయమగును. ఇంతేకాని, దీనికి ప్రత్యేకమైన చికిత్సయేదియులేదు. కాళ్లను పైకెత్తిపెట్టుట, కట్లుకట్టుట,

[1] Filaria-bancrofti. [2] Lymphatic vessels and glands. [3] Blood smears. [4] Lymphangitis. [5] Secondary infection. [6] Elephantiasis.

ఆంటిమొని టార్ట్రేట్ మందును ఇంజెక్షను చేయుట—వీనివలన కొంత లాభము కలుగును.

నివారణము:—రోగిని తీగవేసినటువంటి గదిలోపెట్టి దోమలను నాశనము చేయుము.

[1]ఆస్కరిస్ లంబ్రికాయిడిస్ లేక ఏలికపాము. ఇది మనిషియొక్క చిన్న ప్రేగున చేరియుండు సర్వసాధారణమైన పరాశయక్రిమి. ఇది ముఖ్యముగ చిన్న పిల్లలలో కనబడును; ప్రపంచమంతటను ఈ వ్యాధి వ్యాపించియున్నది.

ఈ క్రిములు నోటిద్వారా ప్రవేశించి, పురీషనాళముద్వారా బయటికి పోవును. ఈ పురుగు కొంచెము ఎఱ్ఱని రంగుగలిగి వానపామును బోలి 12 అంగుళములు పొడుగుండును. ఇది ప్రేగుగోడను అంటుకొని యుండదు. ఇది యనేక గ్రుడ్లనుబెట్టును. ఈ గ్రుడ్లు మలముతో కలిసి బయటికిపోయి, వేడియు చెమ్మయునున్న భూమిలో బాగుగ విస్తరించును. పిమ్మట వానిని ఆహారపానీయముతో మ్రింగుదుము లేదా, అంటుపడిన చేతులను నోటికి తగిలించుట మూలమున, నోటిద్వారా యీ క్రిములు శరీరములోనికి పోవును. తుదకు చిన్న ప్రేగులోచేరి పిగులును. పిండమురీతిగనున్న పురుగు వరుసగా కాలేయము, ఊపిరితిత్తులు, గొంతువరకు పోయి, తిరిగి ప్రేగులోచేరి పెద్దదగును. ఒకనియందు 200 పురుగులున్నట్టు లెక్కచేయబడినది.

లక్షణములు:—ఈ వ్యాధికి ఏవిధమైన లక్షణములు నుండకపోవచ్చును. కాని సాధారణముగా, డోకు, శూలనొప్పి, చీకాకు మొదలగు దుర్లక్షణములుండవచ్చును. అతివిరేచనములును, రక్తభేదియునుండును. ఒక్కొక్కప్పుడు వాంతియందును పురుగులు పడవచ్చును. శ్వాసనాళములో పురుగులు చేరియున్నప్పుడు బ్రాంకైటిస్ లేక నుమోనియ వ్యాధులు రావచ్చును. చిన్నపిల్లలకు పురుగులున్నప్పుడు ఈడ్పులు రావచ్చును; ప్రేగులలో అడ్డు చేరియుండవచ్చును.

రోగనిర్ణయము:—రోగి మలమును భూతదర్పణములో పరీక్షించవచ్చును. ఒక్కొక్క మలమునందు ఊరకయే యీ పురుగులను చూడవచ్చును.

[1] Ascaris lumbricoides or round worm.



చికిత్సయు, పరిచర్యయు:—పురుగులను దీసివేయుటకు శ్రేష్ఠమైన మందు లేవనగా—[1]చెనుపోడియంనూనె, [2]కార్బన్ టెట్రక్లోరైడ్, [3]హెక్సిల్ రిసార్సినల్, [4]సాంటొనిన్ అనునవి. ఈ మందు లియ్యకముందును, ఇచ్చిన వెనుకను ఉప్పుమందు లియ్యవలెను. ఈ మందులవలన విషప్రయోగము కావచ్చునుగాన, వైద్యుని యుత్తర్వులేనిదే ఇయ్యకూడదు. ఈ చికిత్స చేయుచుండగా, రోగి సారాయి, (ఆల్కహాల్) క్రొవ్వులు, నూనె పదార్థములు పుచ్చుకొనకుండ జాగ్రత్తగ చూడవలెను.

నివారణము:—1. మరుగుదొడ్ల నుపయోగించుము.

2. శుభ్రమైన ఆహారపానీయములను పుచ్చుకొనుము.

3. మలవిసర్జనమయిన పిమ్మట హస్తములను బాగుగ కడుగుకొనుము.

[5]ఆంకిలోస్టొమయొసిస్ లేక కొంకిపురుగులు:—బూడిదరంగుగల రెండు విధములైన పురుగులవలన అంటుకలుగును. ఈ పురుగులు 1/3 అంగుళము పొడుగుండును; ఒకదానినొకటి చాలవరకు పోలియుండును. ఉష్ణమండలము, ఉపోష్ణమండలముల గ్రామాదులలో ఈ వ్యాధి సంభవించుచుండును. దక్షిణ యిండియాలో ఇది సర్వసాధారణమైన వ్యాధి. నూటికి తొంబదిమంది (90%) ఈ వ్యాధిచేత బాధపడుచుందురు.

మామూలుగా ఈ క్రిములు పాదముల చర్మము (ముఖ్యముగ వ్రేళ్లమధ్యనుండు చర్మము) మూలముగా దేహములోనికి ప్రవేశించును. నోటిద్వారా ప్రవేశించుట అరుదు.

మలములో పురుగులుపెట్టిన గ్రుడ్లు బయటికి విడువబడును. ఇవి పిగిలి పురుగులగును. ఈ పురుగులు బురద, తడిమన్ను, గడ్డి, మొదలగువానియందు కొన్నివారములు జీవించును. చెప్పులులేని కాళ్లతో ఒకడు వాని సమీపమునకుపోయినప్పుడు, త్వరగా పాదములో రంధ్రము చేసికొని దూరును. తరువాత అవి రక్తప్రవాహములోచేరి, గుండెకు, ఊపిరితిత్తులకు, గొంతుకు, తరువాత చిన్న ప్రేగునకుచేరును. ఇక్కడ

[1] Oil of chenopodium. [2] Carbon tetrachloride. [3] Hexylresorcinol. [4] Santonin. [5] Ankylostomiasis.

తమకున్న చిన్న కొక్కెములవంటి పండ్లతో ప్రేగుగోడను పట్టుకొని రక్తము పీల్చుకొనును. అవి ప్రేగునకు అంటుకొనియున్న స్థలమును పలుమారు మార్చుచుండుటవలన రక్తము ప్రేగులో పడునట్టుచేయును. పురుగులున్నయెడల త్వరలోనే రక్తహీనత (అనీమియ) అను రోగమారంభమగును. ఒక్కొక్క రోగియందు కొన్నిసారులు 5,000 పురుగులవరకైన నుండవచ్చును. పురుగులుచేరిన ఒక నెలకు మలములో గ్రుడ్లుండుట చూడవచ్చును.

లక్షణములు:—సాధారణ లక్షణములేవనగా—పురుగులు చర్మములో ప్రవేశించినచోట కందుట, జిల, అలత, రక్తహీనత, ఊపిరి యాడకుండుట, గుండె విస్తరించుట, అతివిరేచనములు, నల్లనిరంగుగల భేదులగుట, వాపు, మొత్తమున బలహీనముగ నుండుట మొదలైనవి. ఈ వ్యాధి అపాయకరమైనది.

చికిత్సయు, పరిచర్యయు:—ఏటికపాములకువలెనే దీనికిని చికిత్స చేయవలెనుగాని సాంటొనిన్ ఇయ్యరు. హిమొగ్లోబిన్ (రక్తగోళకము) జాస్తి అగుటకు వెంటనే యేదో ఒకవిధముగ ఇనుమునియ్యవలెను. రక్తహీనత ముమ్మరముగ నున్నప్పుడు పరరక్తప్రవేశము చేయుటయు చాల లాభకరము. ఎక్కువ ఇనుము చేరియున్న ఆహారపదార్థముల నియ్యవలెను. రోగిమలమును ఏదైన జల్లెడలో జల్లించికడిగి, పురుగులనులెక్కించి, వైద్యుని పరీక్షార్థము ఎత్తి పెట్టవచ్చును.

నివారణము:—1. మలమును సరియైనరీతిగా పారవేయవలెను. నేల మీద మలవిసర్జనము చేయకూడదు.

2. చెప్పులు తొడుగుకొని బయటికిపోవలెను.

3. పురుగులున్న రోగులకు వెంటనే చికిత్సచేయవలెను.

**నట్టువుపురుగు**

నట్టువుపురుగులు పెక్కురకములు గలవు. ఈ వ్యాధిగల రోగి మలమును దాకుటవలనగాని, ఈ పురుగులుచేరియున్న గొడ్డుమాంసము, పందిమాంసము, లేక చేపలు - వీనిని సరిగా ఉడికించక తినుటవలనగాని యీ వ్యాధివచ్చును.



ఈ పురుగులు నోటిద్వారా ప్రవేశించి, పురీషనాళముద్వారా బయటికి పోవును.

నట్టువుపురుగు బల్లపరువుగా నుండును. ఇది బద్దలు బద్దలుగ విభజింపబడియుండు తెల్లనిపురుగు. తరుచుగ ఇది 20—50 అడుగుల పొడుగుండును. ఈ పురుగుల రకమునుబట్టి వాని పొడుగు భేదించుచుండును. దీనికి ఒక తలయు కొన్ని శరీర భాగములుండును. ప్రతి యొక్క భాగమునకు పునరుత్పత్తియగు రెండు జననేంద్రియము లుండును. ఈ పురుగునకు జీర్ణకోశమేమియు లేదుగాని, 4 [1]పీల్చెడుగొట్టములు మాత్రముండును. వీనితో చిన్నప్రేగు గోడనుబట్టుకొని పెరుగనారంభించును. శరీర భాగములు పరిమాణమునందును, సంఖ్యయందును హెచ్చినకొలది అన్నిటికంటె మొదట పుట్టినవియు, పెద్దవియునైన భాగములు అండములతోనిండి, తల్లి శరీరమునుండి యూడిపోయి, మలముద్వారా బయటికిపోవును. ఇట్లు ప్రత్యేకమైన పురుగు భాగములు పడుట ఒక్కటిమాత్రమే, యీ వ్యాధి యున్నదనుటకు గుర్తుకావచ్చును. ఈ మలములోని యండములను పందులుగాని, పశువులుగాని తినినట్లయిన, ఇవి వృద్ధిచెంది, కండరముల టిష్యూలకుచేరి, అక్కడ [2]గూళ్లు (తిత్తులు) కట్టుకొనును. మనుష్యుడు ఇట్టి పురుగులు చేరినవాని మాంసము తిన్నప్పుడు, పురుగుపిండము చిన్నప్రేగుగోడకు కరుచుకొని, బద్దలుగ విభజింపబడుట కారంభించును.

లక్షణములు:—ఈ వ్యాధి లక్షణములు సాధారణముగా కొద్దిపాటివి; నిర్ణయించుటకు వీలుకానట్టివి.

చికిత్సయు, పరిచర్యయు:— హెక్సిల్ రిసార్సినల్, కార్బన్ టెట్రక్లోరైడ్, ఓలియోరిసిన్ ఆస్పిడియమ్ (మేల్ ఫరన్)—ఈ మందులను సాధారణముగా వైద్యుని ఉత్తర్వుప్రకారము వాడుచుందురు. ఈ పురుగును పడకచేట్టిలోని వేడినీటిలో పడునట్టు చూడవలెను. తరువాత ఇది తలతో కూడ పడినదాయని చూడవలెను; లేనియెడల, ఇది మరల పెరుగును.

నివారణము:—1. బాగుగ ఉడికించిన మాంసము, చేపలు మాత్రమే తినుము. మాంసమును [3]పరిశోధించినమీదట ప్రజలు దానిని వాడవచ్చును.

[1] Suckers. [2] Encysted. [3] Meat should be inspected.

2. వ్యాధిగ్రస్తులకు చికిత్సచేయుము.
3. మలమును డిస్‌యిన్‌ఫెక్ట్ చేయుము.
4. మరుగుదొడ్లయందు మలమూత్రాదులు విడువుము.

[1]హైడాటిడ్‌వ్యాధి (టీనియ ఇకైనొకొకస్).

నట్టువుపురుగుల రకములన్నిటిలో నిది మిక్కిలి అపాయకరమైనది. కుక్కలు, పిల్లులు, నక్కలలోనుండు నట్టువుపురుగులవలన మనుష్యులకీ వ్యాధివచ్చును. ఈ పురుగు 1/5 అంగుళము మాత్రము పొడుగుండును. ఈ పురుగు గ్రుడ్డును మానవుడు మ్రింగినప్పుడు అది కడుపులోచేరి ఏదో ఒక అవయవమునకు పోవును. కాలేయమునకు తరుచుగా పోవును. అప్పుడప్పుడు ఊపిరితిత్తులలోను, మూత్రపిండములలోను చేరి అక్కడ [2]తిత్తి యేర్పర్చుకొనును. ఈ తిత్తి వృద్ధిచెంది మొగ్గవేయును. ఒక్కొక్క మొగ్గ ఒక క్రొత్త తిత్తి నేర్పర్చుకొనును. ఒక్కొక్క తిత్తి దాని స్వంత మొగ్గలు వేయును. మొదటి (తల్లి) తిత్తి తగినంత పెద్దదగువరకు ఈ పని యిట్లు జరుగుచు, తల్లియు, పిల్లతిత్తులును పెరుగుచుండును. ఏదైన ఒక తిత్తికి దెబ్బతగిలి పిగిలినయెడల, దానిలోని ద్రవము బయటికిపోయి, దగ్గరనున్న టిష్యూలు అంటుబడజేయును. కావున అక్కడ క్రొత్త తిత్తులేర్పడును. శస్త్రమే దీనికి సరియైన చికిత్స.

[3]నులిపురుగు. ఇది చిన్న తెల్లనిపురుగు. నూలువలె అర్ధయంగుళము కంటె తక్కువ పొడుగుండును. ఇది పెద్దప్రేగునందును; పురీషనాళమునందు నుండును. నోటిద్వారా అంటు లోపలికిపోవును. ఇంక్యుబేషన్ కాలము 2 వారములనుండి 2 నెలలుండును.

లక్షణములు: రాత్రులలో ఆడుపురుగు బయటికివచ్చి గ్రుడ్లు పెట్టునప్పుడు ఆసనముచుట్టు జిలపుట్టును. గీరుటవలన చర్మము ఇన్‌ఫెక్షన్ కావచ్చును. నిద్రలేమివలన ఆయాసమును, నరముల బలహీనతయు నుండవచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు:**—ఈ పురుగునకు చికిత్సచేయుట మిక్కిలి కష్టము. హెక్సిల్‌రిసార్సినల్ అను మందును నోటిద్వారా యియ్యవచ్చును. 20% ఘాటుగల సెలైన్ సొల్యూషన్‌తోగాని, [4]క్వాషియ కషా

[1] Hydatid disease (taenia echinococcus). [2] Cyst. [3] Pin worm.
[4] Infusions of quassia.



యముతోగాని పురీషనాళమును గడుగుటయే దీనికి చేయు సాధారణమైన చికిత్స. పురీషనాళమును కడుగకముందు సాధారణ ఎనెమ నియ్యవలెను. ఆసనముచుట్టు [1]పాదరసపు అంజనము పూసినయెడల, పురుగు పెట్టిన గ్రుడ్లు నాశనమగును.

నివారణము:—మలవిసర్జనమైన తరువాత రోగి తన చేతులను బాగుగ కడుగుకొని, తిరిగి అంటుపడనియ్యకుండ నుండవలెను. రోగికి పడకచేట్టి నిచ్చి మలవిసర్జనము చేయించినపిమ్మట, నర్సు తన చేతులను బాగుగ శుద్ధి (డిస్‌యిన్‌ఫెక్ట్) చేసికొనవలెను. పిల్లలు గీరుకొనకుండ వారి చేతులకు సంచులు తగిలించవలెను. వారి వ్రేలిగోళ్లు కత్తిరించి, వానిక్రింద ఏ విధమైన అంటుపదార్థము చేరియుండకుండ చూడవలెను. రోగి దేహమును శుద్ధిచేయుము. అతని గుడ్డలనుగూడ చాకలికి వేయకముందు డిస్‌యిన్‌ఫెక్ట్ చేయుము. పచ్చిపండ్లను, కూరగాయలను తినకముందు కడుగుము. శుభ్రమైన నీళ్లు మాత్రమే త్రాగుము.

నారికురుపు

[2]నూలుపోగువంటి యొక పురుగు ఈ నారికురుపునకు కారణము. సాధారణముగా కాళ్లమీదలేచెడు ఒకటి రెండు పుండ్లు ఈ వ్యాధికి సహజగుర్తుగనుండును. ఇది యిండియాలో కొన్ని ప్రదేశములయందు ముఖ్యముగా దక్కన్‌లో సర్వసాధారణమైనది. ఒకవిధమైన మిణ్ణల్లులు డింభదశలోనున్న నారిపురుగులను మ్రింగి నీటియందుండును. అట్టి నీటిని త్రాగుటవలన నారికురుపులు వచ్చును. ఈ నీరు త్రాగినపిదప, సంపూర్ణదశ పొందనట్టి పురుగులు అన్నవాహికలో విడువబడును. గర్భముతోనున్న ఆడుపురుగులు చర్మముక్రిందనున్న కనెక్టివ్ టిష్యూలలో చేరి, పరిపూర్ణదశకువచ్చువరకు అక్కడ నిలిచియుండును. అప్పుడవి 2½ నుండి 3½ అడుగులు పొడుగుండును. అండములతో నిండియుండిన గర్భకోశము పెరిగి పెరిగి శరీరమునంత ఆవరించి, గొంతులోనికి తెరచుకొనియుండును. పిండములను బయటికి త్రోయుటకు సిద్ధముగనున్నప్పుడు 85% (నూటికి 85 పాళ్లు), ఈ పురుగు శరీరముయొక్క క్రిందిభాగమునకు దారిచేసికొని పోవును. ఇక్కడ చర్మముయొక్క లోపలిపొరను తొల్ల (రంధ్రము) చేసి

[1] Mercury ointment. [2] Nematode.

కొనిపోవును. ఇదేసమయమున శరీరము పైభాగమున ఒక బొబ్బ లేచును. త్వరలోనే యీ బొబ్బ పగులును. పుండు మధ్యభాగమున [1]శోధన సాధనము పట్టగలిగినంత రంధ్రముగుండ నారిపురుగుయొక్క గర్భాశయమందొక చిన్నభాగము బయటికి త్రోయబడును. ఇది పగిలినప్పుడు డింభములతో నిండిన తెల్లని ద్రవము కారును. ఒక గంట లేక కొంచెము ఎక్కువకాలమైన తరువాత గర్భాశయముయొక్క మరియొక భాగము బైటికి నెట్టబడును. ఈ పని 15—20 దినములవరకు జరిగిన పిదప, ఖాళీగానున్న పురుగు ముడుచుకొని. టిష్యూలలో ఇమిడిపోవును. ఇట్లు బయటపడిన పురుగులను నీటిలోని మిణ్ణల్లులు మ్రింగినట్లయిన, అవి వానికడుపులోచేరి, ఇతర మార్పులుచెంది, వృద్ధిపొందును. ఈ నీటిపురుగులను మానవులు త్రాగినప్పుడు, అసంపూర్ణమైన నారికురుపు పురుగులు లోపలికిపోయి, పైచెప్పినరీతిగా వృద్ధిపొంది పెద్దవగును.

పురుగు, చర్మమునందు దారిచేసికొనుచుండగా, ముమ్మరమైన జిల పుట్టును. దీనితో జ్వరము, నొప్పి, [2]ఒకవిధమైన దద్దురు ఉండును. ఈ పుండు కీలుదగ్గరయైనట్లయిన నొప్పి మరియెక్కువగ నుండును. ఇట్లు రోగపీడితమైన కీళ్లు తరుచుగ బిగుసుకొనిపోవును. పెక్కురోగులలో చర్మముక్రింద తడివిచూచి, పురుగున్నతీరును గనుగొనవచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు:**—ఇంజెక్షనులుచేసి ఈ పురుగును చంపుటకుచేసిన ప్రయత్నములును, పద్ధతులును జయకరముకాలేదు. పాతకాలములో ఒక అగ్గిపుల్లకు పురుగుయొక్క కొనను చుట్టి దినమునకు రెండు మూడు చుట్లు చుట్టుచు, పురుగంతయు బయటికివచ్చువరకు నట్లేచేయుట యిప్పటికిని మిక్కిలి సాధారణమైన చికిత్సయైయున్నది. ఇట్లు చేయుచుండగా, పురుగు తెగినట్లయిన, పురుగులు టిష్యూలలో నిలిచిపోయి ముమ్మరముగ కంది, వాపును, తరువాత [3]చీమును పట్టును. శ్రేష్ఠమైన చికిత్సయేదనగా, కాలికి విశ్రాంతినిచ్చి దినమునకు పలుమారు పుండులోనికి నీరు పోయుచుండవలెను. అప్పుడు పురుగు ఖాళీయగును. ఈ సమయమున నిది టిష్యూలలో ఇమిడిపోవును; లేదా సులభముగా దీనిని బైటికి లాగివేయవచ్చును. స్టైరల్ డ్రెసింగ్ గుడ్డను పుండుమీాద వేసి యుంచవలెను.

[1] Probe. [2] Urticaria. [3] Suppuration.



**నివారణము:**—1. పురుగుయొక్క డింభములు మంచినీటిలో పడకుండ నివారించవలెను.

2. నారికురుపులున్నవారిని బావిదగ్గర నీళ్లు చేదనీయరాదు. దిగుడు బావులలోనికిగాని, చెరువులలోనికిగాని దిగనీయరాదు.

3. నీటిని పొంగించి త్రాగవలెను.

4. చేదుడు బావులు, దిగుడు బావులు, చెరువులు—వీనికి బదులు నీటిని పంపుచేయు సదుపాయములు చేయవలెను.

అధ్యాయము 24

# సుఖవ్యాధులు

సుఖవ్యాధులు సాధారణముగా స్త్రీ పురుష సంపర్కమువలన వ్యాపించును. గాని అప్పుడప్పుడు యితరమార్గములవలనను రావచ్చును. ఈ వ్యాధులు కలుగు రీతినిబట్టి విభజనచేసినట్లయిన, ఇవి కలుగుటకు కారణమైన సూక్ష్మజీవులు, వీటి ఇంక్యుబేషన్ కాలము, లక్షణములు, గుర్తులు, వ్యాధియుండుకాలము, వ్యాధి ముందుకు కుదురువిధము, చికిత్స—ఈ విషయము లన్నిటిలో భేదములుండినను ఈ రోగములను సంపాదించుకొను పద్ధతిలోమాత్రము రెండు ఒకటిగనుండును. ఈ వ్యాధి యారంభస్థితిగాని, బాహ్యలక్షణములుగాని యెక్కువ అపాయకరమైనవి కాకపోయినను, అంటుచేరినదని, తెలియచేయుటకు అవి ముఖ్యమైన విషయములని భావించవలెను. అనగా ఈ లక్షణములు అపాయమును తెలియజేయు [1]ఎఱ్ఱజెండాలవంటివి. నిజముగా అపాయకరమైన దశలు భావికాలములో వృద్ధియగును. అవియే ప్రాణాపాయకరమైనవి. ఈ దేశప్రజనులు వివిధములైన సుఖవ్యాధులను భేదించి తెలిసికొనజాలరు. అంతేకాక, ఆరంభలక్షణములు కనబడనందున వెంటనే రోగము బాగైనదని భావింతురు. ఇది మరియెక్కువ మోసకరమైనసంగతి. ఈ కారణములనుబట్టి యీ వ్యాధులనుగూర్చి తగిన హెచ్చరికచేయుట చాల అవసరము.

[1] Danger signals.

ఈ వ్యాధి విభజనలు సాధారణముగ నాలుగు గలవు; అవి యేవనగా:

1. [1]సెగరోగము, 2. [2]సవామేహము లేక కొరుకు, 3. [3]మెత్తని మేహవ్రణము, (శాంక్రాయిడ్) 4. [4]వెనీరియల్ గ్రాన్యులోమ (లింఫో గ్రాన్యులోమ ఇంగ్యునాలె).

సెగరోగము

గనొకాకస్ అను జీవి యీ వ్యాధికి కారణము. రోగముతగిలిన అవయవమునుండి కారు చీమునుబట్టి దీనిని సులభముగా తెలిసికొన వచ్చును. సాధారణముగా, [5]మూత్రద్వారమునకు, [6]గర్భకోశకంఠభాగమునకు [7]కంటియొక్క అమత్వచకు ఈ వ్యాధి తగులును. ఎండబెట్టుటవలనను, వేడివలనను ఈ వ్యాధి క్రిమిని చంపవచ్చును. 120° F. వేడిలో పెక్కు క్రిములను ఒకటి రెండు గంటలలో చంపవచ్చును. దీనికంటె నధిక ఉష్ణోగ్రతయందును, ఆంటిసెప్టిక్ మందులయందును రోగక్రిములను ఇంక త్వరగ చంపగలము. ఇంక్యుబేషన్ కాలము తీవ్రమైన కంటివ్యాధులలో కొన్ని గంటలును, సాధారణరకమైన ఇన్ ఫెక్షన్ అయిన పక్షమున కొన్ని దినములును ఉండును.

చిన్నపిల్లలు అంటుపడిన పరికరములను వస్తువులను అనగా, గుడ్డలు తువాళ్లు మొదలగు వానిని అంటుకొనుటవలన వారికిని అంటుసోకును.

కండ్లు బహుసులభముగ అంటుకు లొంగిపోవును. సెగరోగపు చీముపడిన తువాళ్లు నుపయోగించుట మూలమున, రోగులు తమ స్వంత కండ్లకు అంటుతగులునట్లు చేయుదురు. లేక యీ తువాళ్లును ఇతరుల కిచ్చుట మూలమున వారికండ్లు అంటు పడచేయుదురు. నర్సులు, వైద్యులు సెగరోగులను పరీక్షించిన వెనుకను, చికిత్స చేసినవెనుకను తమ చేతులను జాగ్రత్తగ కడుగుకొనుటకు మరచినయెడల, వారు తమ కండ్లకు అంటు తగిలించుకొందురు. ఒక్కొక్కప్పుడు వీరి యజాగ్రత్తవలన చీము వారి కండ్లలో చింది పడవచ్చును. క్రొత్తగబుట్టిన బిడ్డలు పుట్టుకముందు కాని, పుట్టినప్పుడుగాని యీ యంటు తగిలినవారగుదురు. పెద్దవారి జననావయవములు సాధారణముగ (ఎల్లప్పుడు) సంపర్క దోషమువలన

[1] Gonorrhea. [2] Syphilis. [3] Soft chancre or chancroid. [4] Venereal granuloma. [5] Urethra. [6] Cervix. [7] Conjunctiva.



ఈ యంటుకు లొంగిపోవును. ఒక్కొక్కప్పుడు క్రొత్త చీముపడియున్న గుడ్డలను బదులడిగి వేసికొనుటవలన ఈ వ్యాధి రావచ్చును.

లక్షణములు:—తీవ్రమైన యూరిత్రైటిస్ [1](మూత్రద్వారము కందుట) యందు, మూత్రము విడుచుటకు కష్టముగను, విడుచునప్పుడు మంటయు పుట్టును. దీనితో మూత్రమునందు చీముపడును. ఒక్కొక్కప్పుడు రక్తముకూడ పడును. చికిత్సచేసినను చేయకపోయినను ఈ దశ కొన్ని దినములనుండి, కొన్ని వారములవరకు ఉండును. అటుపిమ్మట ఏదో ఒక స్థానమున ఈ యంటు కుదురుగ నిలిచిపోవుట సహజము. పురుషులలో మూత్రాశయ లోపలిభాగపు లోతైన గ్రంధులలోను [2]ప్రాస్టేట్ లోను, స్త్రీలలో [3]గర్భకోశ కంఠభాగమునను దీర్ఘకాలపు అంటుగ కొన్ని నెలలు లేక సంవత్సరములు నిలిచిపోవును. ఈ కేంద్రములనుండి, దగ్గర లేక దూరముగనున్న యితర అవయవములకుకూడ ఈ యంటు ప్రాకవచ్చును.

మూత్రము పోయునప్పుడు మంటయు, చీము అధికముగ పడుటయు తగ్గిపోయినప్పుడు రోగము బాగైపోయినదిగదా యని తలంచి, రోగి యీ వ్యాధియొక్క దీర్ఘకాల దశనుగూర్చి నిర్లక్ష్యము చేయవచ్చును. ఈ వ్యాధికి తగిన చికిత్సచేసి, అంటును సంపూర్ణముగ తొలిగించనియెడల, రోగి యితరులకేకాక, తనకు తానే అపాయకరమైనవాడుగ నుండును. కొన్ని నెలలును సంవత్సరములును గడచిన తరువాత మరి ముమ్మరమైన సంకరవ్యాధులు కలుగవచ్చును. పది, పదిహేను సంవత్సరములైన పిదప మగవారికి యూరిత్రల్ స్ట్రిక్చర్ కలుగుట సర్వసాధారణము.

ఒక స్త్రీకి [4]సర్విసైటిస్ (గర్భకోశ కంఠభాగము కందుట) మాత్రమారంభమై యూరిత్రైటిస్, (మూత్రద్వారము కందుట) రానియెడల, ఏదో కొద్దిగ తెల్లబట్ట (తెల్లని ద్రవపదార్థము) అగును. కొంతకాలమైన తరువాత, అకస్మాత్తుగ తీవ్రమైన [5]సాల్పింజైటిస్, ఇంకను [6]పెల్విక్ పెరిటొనైటిస్ అను వ్యాధులు సంభవించవచ్చును. సాధారణముగా ఈ వ్యాధులు ప్రసవమునకు తరువాత వచ్చును.

[7]సంకరవ్యాధులు:—గనొకాకస్ అనురోగక్రిములు రక్తప్రవాహమున బడి, కీళ్లవరకు కొనిపోబడవచ్చును. అప్పుడు కీళు ముమ్మరముగ కందును.

[1] Urethritis. [2] Prostate. [3] Cervix. [4] Cervicitis. [5] Salpingitis. [6] Pelvic peritonitis. [7] Complications.

ఈ క్రిములు గుండెకు చేరినయెడల, [1]ఎండోకార్డైటిస్ అను హృదయ రోగము కలుగవచ్చును. స్త్రీలలో [2]బార్థొలిన్స్ లేక స్కీన్స్ గ్రంధుల లోను, కూపకములోను చీముగడ్డలు లేచుటకు కారణము కావచ్చును. గర్భకోశ కంఠభాగపు కాలువయు, [3]ఫలోపియన్ గొట్టములును మూసి కొనిపోవచ్చును. మగవారిలో మూత్రద్వారము ముడుచుకొనిపోవచ్చును. పురీషనాళమును, కండ్లుకూడ అంటుపడుటకు కారణము కావచ్చును. స్త్రీ పురుషులలో నిది గర్భహీనతకు కారణమగుట మామూలు. సెగరోగము వలన కలిగెడు ముఖ్య లక్షణమేదనగా, ఒక్క బిడ్డపుట్టినతరువాత గర్భ హీనత కలుగును.

చికిత్సయు, పరిచర్యయు:—ఏదో ఒకప్పుడు సంభవించు సెగరోగము చికిత్సలేకయే స్వాభావికరక్షణ యేర్పడి దినములపేరట బాగవును. సెగ రోగమునకు పెక్కుమందులు వాడిరికాని, వానిలో నొకటైనను సంపూర్ణ ముగ తృప్తికరమైన ఫలితము నియ్యలేదు. కాని పెనిసిలిన్, సల్ఫోన మైడ్ రకమునకు చేరిన మందులు కనుగొనినతరువాత సెగరోగ చికిత్స చాలవరకు సులభమైనది. అట్లయినను కొన్ని వ్యాధులలో శాశ్వత స్వస్థత కలుగదు, కావున ఈ వ్యాధి మరల సంభవించవచ్చును. సెగరోగమున్న ప్రతిరోగి, వ్యాధి సంపూర్ణముగపోవువరకు ఎవరో ప్రవీణతజెందిన ఒక వైద్యుని విచారణక్రిందనుండి, చికిత్స పొందుచుండవలెను.

కొన్నిసారులు మందువలన రోగము కుదురదు. అట్టి రోగులకు ఏదో ఒకవిధముగ వేడి నియ్యవలెను. ఏదైన నొక స్థలములో వేడి చేయుట, వేడిస్నానములు చేయించుట, దూషులిచ్చుట, జ్వరమునకు చేయుచికిత్సలు—వీనివలన చాల ప్రయోజనముండును. మూత్రద్వారము, గర్భకోశ కంఠభాగములలోనుండి తీసిన స్రావము అద్దమునకు పూసి, పరీక్షించి కొన్నిసార్లవరకు నెగటివ్ (క్రిమిరహితము) అని వైద్యులు చెప్పువరకు రోగము బాగైనదని తలంచకూడదు.

పరీక్షలు:—తీవ్రమైన వ్యాధులను పరీక్షించుటకు మూత్రద్వారము, గర్భకోశ కంఠభాగము, భగము (చిన్న బాలికలైన), కండ్లనుండి తీసిన స్రావము అద్దమునకు పూసి పరీక్షించుదురు. మగవారిలో దీర్ఘకాలము

[1] Endocarditis. [2] Bartholin's or Skene's glands [3] Fallopian tubes.



వ్యాధియైనయెడల, మూత్రపు మడ్డినిగాని, [1]జననాంగము దగ్గరి గ్రంధు లలోనుండి తీసిన పూతలనుగాని పరీక్షించుట యవసరము. పురీషనాళము నకుకూడ అంటుతగిలినదా యని తెలిసికొనుటకుగాను, పురీషనాళము నుండి తీసినపూతను పరీక్షించుదురు. ఏదైన ఒక స్థలమునుండి పూతను తీయవలసివచ్చినప్పుడు అంటువడజేయు క్రిములను దొలగించుటకు ఆ భాగమును మొదట శుభ్రముచేయవలెను. అట్లు శుభ్రముచేయుటకు అవసరమైన సబ్బు, నీళ్లు, బైక్లోరైడ్ లోషన్ మొదలైనవి పరీక్షకాలమున సిద్ధముగ నుండవలెను.

ప్రత్యేకమైన స్థానిక చికిత్స లేవనగా:—

1. వేడిదూషులు. వీని నియ్యవలసిన విధము 9-వ అధ్యా. లో వివరించబడినది.

2. [2]మూత్రద్వారమును గడుగుట:—దీనికి ఒక ప్రత్యేకమైన యూరిత్రల్ సిరింజ్ (మూత్రద్వారపు పిచికారు) స్టెరల్ సెలైన్ సొల్యూషన్, ఎక్కువ ఘాటులేని ఆంటిసెప్టిక్ మందులు అనగా, మెర్క్యురోక్రోము ½%, ఆర్జరాల్ లేక ప్రొటార్గల్ 15—20% అవసరమైయుండును. పురు షాంగమునుగాని, యోనినిగాని ఇరిగేషన్ చేయకముందును, చేసిన వెనుకను మృదువుగాను, సంపూర్ణముగాను సబ్బు నీళ్లతో కడుగవలెను. తీవ్రమైన వ్యాధులకు బహు జాగ్రత్తగ ఇరిగేషన్ చేయవలెను; దీనిని సాధారణముగ వైద్యులే చేయుదురు. లేనియెడల ఇన్‌ఫెక్షన్ ఎక్కువగ వ్యాపించును.

[3]గనోరీయల్ ఆఫ్తాల్మియ అను వ్యాధినిగూర్చిన వివరమును, చికి త్సను 35-వ అధ్యాయము చూడుము.

స్త్రీలలో భగమునకు గనోకాకస్ అను క్రిమిపోయి చేరలేదు. కాని చిన్నపిల్లలలో పక్వముకానివారి భగముయొక్క అమత్వచ అంటుచేరి యుండుటకు అనుకూలమైన స్థలము. కావున దీనిని [4]గనోరీయల్ వల్వో వాజినైటిస్ అందురు. దీనికి ఎక్కువ ఫలితము నిచ్చు చికిత్సయేదనగా, సల్ఫాడైయజీన్. బాలికల భగముయొక్క అమత్వచను పెద్దవారి తత్వ మునకు మార్చవలెను. దీనికిగాను ఈస్ట్రజెన్ అను మందును అంటు

[1] Prostatic smears. [2] Urethral irrigations. [3] Gonorrheal ophthalmia.
[4] Gonorrheal vulvo.vaginitis.

సాంతముగా తొలిగిపోవువరకు సపాజిటరీలరీతిగా నుపయోగించవలెను. అప్పుడప్పుడు కాతిటరుమూలమున శుభ్రపరచెడు డూష్‌లనుగూడ జాగ్రత్తగ నిచ్చెదరు. హెచ్చరిక: కాతిటరు నుపయోగించినయెడల, లోపలికిపోయిన ద్రవము మరల బయటికి వచ్చుటకుగాను, కాతిటరు చుట్టు చాలినంత స్థలముండునట్లు చూడవలెను. కాతిటరునకు తగిలించిన వీకెను ఎత్తునకు ఎత్తకూడదు. అట్లు ఎత్తినయెడల, ద్రవముయొక్క ఒత్తిడి అధికమగును.

సవాయిమేహము

ఇది [1]స్పైరోకీట్ అను ఒక విధమైన క్రిమివలన కలుగుచున్నది, ఈ క్రిమి ఎండకు, తీవ్రమైన శీతోష్ణములకు తాళజాలదు. తడిగానుండు ఒక భాగమునుండి మరియొకభాగమునకు మాత్రమే యిది వ్యాపించ గలదు. ఈ రోగముయొక్క అంటు తరుచుగా సంభోగమువలన వచ్చునదే యైనను ముద్దుపెట్టుకొనుట, సవామేహముతో పుట్టిన బిడ్డకు ఈ రోగము లేని స్త్రీ పాలిచ్చుట లేక సవామేహమున్న స్త్రీ ఆ రోగములేని బిడ్డకు పాలిచ్చుట, పగుళ్లు, పుండ్లున్న నర్సులు, వైద్యులు సవామేహరోగులను అంటు ఎక్కువగనున్న దశలో చికిత్సచేయుట—ఈ మొదలగు కారణ ములవల్లనను ఈ రోగము రావచ్చును.

[2]సంపాదించుకొనినది, [3]పుట్టుకతోనె వచ్చినది యని సవామేహమును రెండుభాగములుగ విభాగించవచ్చును. సంపాదించుకొనిన రోగము మూడుదశలుగ వృద్ధిపొందును.

1. ఆరంభదశ. దీనిలో మొదటిపుండు లేక శాంకర్ (మేహ వ్రణము) పుట్టును.

2. రెండవ (సెకెండరి) దశలో రోగము శరీరమంతట ప్రాకును. అప్పుడు దేహమునం దేభాగముననైనను తీవ్రమైన రోగలక్షణములు అగు పడవచ్చును.

3. మూడవ (టర్షరి) దశలో రోగము ముదిరి దీర్ఘకాలపు [4](క్రానిక్) రోగమగును. అప్పుడు దేహములో ఏవో కొన్ని అవయవము లలోగాని, అంగ సముదాయములలోగాని క్రమ క్రమముగా మార్పులు

[1] Spirochete. [2] Acquired. [3] Congenital. [4] Chronic.



కనబడుచుండును. ఏ భాగములో రోగమున్నదో, దానిబట్టి రోగలక్షణ ములు త్వరగనో, ఆలస్యముగనో బైటపడుచుండును.

పుట్టుకతోనే కలిగిన రోగముయొక్క లక్షణములు పైన వివరించిన రెండు మూడు తరగతుల లక్షణములను బోలియుండును. ఈ లక్షణ ములు బిడ్డపుట్టిన తరువాత కనబడును.

[1]ఆరంభదశలోని సవామేహము. ప్రైమరి సిఫిలిస్ అంటు చేరిన తరు వాత ఇంక్యుబేషన్ కాలము రెండు వారములనుండి రెండు మాసములవరకు భేదించుచుండును. అటుపిమ్మట మొదటిపుండు లేక శాంకర్ అనునది లేచును. ఇది నొప్పిలేని గట్టిపుండు. అంటుచేరినచోట లేచును. సాధా రణముగ ఒకే పుండుండును. కొన్నిసార్లు ఒకటికంటె ఎక్కువ పుట్ట వచ్చును. సవామేహపు పుండు మిక్కిలి అంటుగలది. ఈ పుండుమీద నుండి కారు రసిలో జీవముగల అనేకమైన స్పైరోకీట్ క్రిములుండును.

పురుషులలో పురుషాంగమే ఈ పుండుపుట్టుటకు మామూలైన స్థలము. భగములోగాని, గర్భకోశ కంఠభాగములోగాని లేచిన యీ మొదటి పుండును సాధారణముగ చూడలేము. ఈ రకము (శాంకర్) మేహపు పుండు పెదవులమీదను నోటిమీదను, ఱొమ్ముమీదను లేవవచ్చును. ఇతరపుండ్లువలె ఇది కనబడును.

ఏ చికిత్సయు చేయకున్నను, మేహవ్రణము కొన్ని వారములలో దానంతట అదే మానిపోవును. కొంతకాలముక్రిందట వైద్యులీ శాంకర్‌ను కోసివేయుచుండిరి. ఇట్లు చేయుట వ్యర్థమే. ఎందుకనగా, దీనిని కోయక ముందే అంటు [2]శోషగ్రంథులకు చేరియుండును. సవామేహమున్న రక్తము యొక్క రియాక్షన్ [3]వాసర్‌మన్, ఖాన్, క్లైన్ మొదలగు పరీక్షలుచేసి చూడగా, శాంకర్ పుట్టిన 2, 3 వారములైన తరువాతనే [4]పాజిటివ్ అయినట్టు కనుగొనిరి. పుండుపుట్టినతోడనే తీవ్రమైన చికిత్స నారంభించి చేసినట్లయిన రక్తపరీక్షలో పాజిటివ్ ఫలితముండదు. ఆర్సెనిక్, బిస్మత్ లేక మెర్క్యూరి (పాదరసము)—వీనితో సంబంధించిన ఇంజెక్షనులిచ్చి, పుండుకు పాదరసము పట్టించినట్లయిన, పుండు అంటులేనిదగును.

[1] Primary syphilis. [2] Lymph nodes. [3] Wasserman, Kahn and Klein. [4] Positive.

**రెండవదశలోని సవామేహము (సెకండరీ సిఫిలిస్):**—ఇంతకుముందే చెప్పినట్టు పుండుపుట్టునప్పటికి దానిదగ్గరనున్న శోషగ్రంధులు అంటు పడియుండును. ఈ గ్రంధులు వాచినప్పుడు రెండవదశ యారంభమును సూచించును. ఇట్లు వాచినవానిని [1]వడిసెగడ్డలు అందురు. ఈ శోష వాహికలనుండి రక్తప్రవాహములోనికి, అక్కడనుండి దేహముయొక్క ఇతరభాగములకు ఈ యంటు శీఘ్రముగ వ్యాపించును. ఈ దశలో చర్మముమీదను, అమత్వచమీదను మిక్కిలి అంటుగల పుండ్లులేచును. చర్మముమీద చూపెడు దద్దు ఇతరదేశములలో కనబడునంత సామాన్య ముగ ఈ దేశములో కనబడదుగాని, కొందరి రోగులలో నెట్లయినను కనబడును. చర్మముమీద కనబడు ఈ దద్దులో పెక్కురకములున్నవిగాని, వీటి యన్నిటియందును స్పైరోకీట్సు అను క్రిములుండును. కొరుకుడు పుండ్లు, పెదవులమీదను, నోటిమీదను, భగము, ఆసనము, మూత్ర ద్వారములయందును లేవవచ్చును. దీనికి తరుచుగ వెంట్రుక లూడి పోవుట, ఐరైటిస్, వాత నొప్పులు, జ్వరమును ఉండును.

ఈ రెండవదశ కొన్నిమాసములు మొదలు మూడు సంవత్సరముల వరకుండవచ్చును. చికిత్సచేయ నారంభించినతరువాత పుండ్లు మాని పోయినట్లుండవచ్చును. కాని చాలినంత చికిత్సచేయనందున చికిత్స ఆపిన తరువాత తిరిగి యీ పుండ్లు కనబడవచ్చును. ఈ దశలో చర్మముమీదను, అమత్వచలమీదనేకాక, కాలేయము, గుండె, మెదడు, వెన్నుబాము తదితర అవయవములకు వ్యాధి రావచ్చును.

**మూడవదశలోని రోగము (టర్షరి సిఫిలిస్):**—రెండవదశలోని పుండ్లు మాని, మూడవదశలోని లక్షణములు అగుపడకముందు 'ఆఖరి' దశ యనునది యొకటి యుండును. రోగములేనట్టు కనబడు సంవత్సరములలో నిజముగా రోగము పనిచేయకుండినదని భావించుట తప్పు. బహుశ యిది పనిచేయుచునే యుండవచ్చును. స్పైరోకీట్సు అను క్రిములు రక్తనాళములు, మెదడు, నరములు, వెన్నుబాము, తదితర అవయవములలో మార్పులు కలుగజేయుటకు కొన్నిసంవత్సరములైనను పట్టును. ఈ లోపల, మూడవదశలోని యనేక లక్షణములు కనబడును. వీనిని ఎంత తీవ్రమైన చికిత్సచేసినను సంపూర్ణముగ తొలగించుటకు వీలుకాకపోవును.

[1] Buboes.



దీనికి పెక్కు ఉదాహరణములు గలవు. కాలేయమునకు సంబంధించిన [1]సిఫిలిటిక్ సిరోసిస్; బృహద్ధమనికి సంబంధించిన [2]ఆన్యూరిజమ్, శుద్ధ రక్త నాళములకు సహజమగు పొరుదల శక్తి నశించుట [3](ఆర్టీరియొస్క్లిరోసిస్). ఇది ముఖ్యముగ గుండె, మూత్రపిండములు, మెదడుయొక్క నాడులకు సంబంధించి యుండును. కావున ఆరంభదశలోనే చాలినంత చికిత్స సవామేహమునకు చేయుట మిక్కిలి యవసరము.

మూడవదశలో లేచెడు పుండ్లన్ని శరీరములోపలనే యుండును గాన, ఈ దశలో వ్యాధి సాధారణముగ అంటుగలదికాదు.

మూడవదశలో చర్మముమీద కనబడు [4]పుండ్లుగాని, చర్మముక్రింద టిష్యూలలో నిమిడియుండి, చర్మముమీదికి కనబడు కురుపులుగాని యెక్కువ అంటుగలవిగావు. ఎందుకనగా, స్పైరోకీట్సు అను క్రిములు, పుండుతట్టుకు వచ్చు రక్తనాళముల ఆయా పొరలలో ఇమిడి యుండునే కాని, [5]గమ్మ అను టిష్యూభాగములో నుండవు. గమ్మ యనునది నిజ ముగా టిష్యూలో నొక భాగమేమైనను దానికి సంబంధించిన శుద్ధరక్త నాళము, వ్యాధి ఫలితముగ మూసికొనిపోయినందున ఈ టిష్యూకు రక్తముచేరకపోవుటచే యిది చచ్చుపడును. చికిత్సచేసినను ఈ టిష్యూను మరల పునర్జీవింప వలనుపడదుగాని, రక్తనాళపు వ్యాధినిమాత్రము కుదుర్చుటకు సహాయపడును.

**[6]పుట్టుకతోడనే వచ్చిన సవామేహము:**—సవామేహమున్న తల్లి తన బిడ్డకు [7]మావిద్వారా అంటుతగిలించును. పిండముయొక్క రక్తప్రవా హము తిన్నగా అంటుపడును. ఈ కారణమునుబట్టి బిడ్డకు మొదటి దశలేదు. బిడ్డ గర్భాశయములో నుండగనే రెండవదశ యారంభిం చును. కావున దీని ఫలితముగ అనేక పిండములు గర్భములోనే చని పోవును. పుట్టుటకుముందే చనిపోవని బిడ్డ, పుట్టినప్పుడుగాని కొంతకాల మైన తరువాతగాని చర్మముమీదను, అమత్వచలమీదను రెండవదశలో పోసెడు దద్దు కలిగియుండును. ఇట్టి బిడ్డలు అధిక అంటుగలిగియుందురు. కొన్నిసారులు బిడ్డయొక్క అంతరేంద్రియములలో (కాలేయము, మెదడు

[1] Syphilitic cirrhosis of the liver. [2] Aneurysm of the Aorta. [3] Arteriosclerosis. [4] Gummata. [5] Gumma. [6] Congenital syphilis. [7] Placenta.

మొదలైన వానిలో) ఈ యంటు చేరియుండవచ్చునుగాన బిడ్డపుట్టిన కొన్ని నెలలోగాని సంవత్సరములలోగాని చనిపోవచ్చును. పుట్టుకతోడి సవామేహవ్యాధియొక్క మూడవదశ సాధారణముగా జీవితములోని మొదటి యిరువది సంవత్సరములలో వృద్ధియగును. సంపాదించుకొనిన వ్యాధిమైనట్లయిన ముప్పది, నలుబది, ఏబది సంవత్సరములలో కనబడును. సంపాదించుకొన్న రోగములలో కానరానట్టియు, పుట్టుకతోనే వచ్చు రోగములలో కనబడునట్టియు కొన్ని రోగలక్షణములు గలవు. అవియేవనగా, [1]ఇంటర్‌స్టిషల్ కెరటైటిస్, [2]హచ్చిన్‌సన్స్‌టీత్ (పండ్లు). ఇవి శాశ్వతముగ నుండునట్టి మధ్య కత్తెరపండ్లు. ఇవి మేకువంటి ఆకారము, అక్కడక్కడ గాట్లు గలిగియుండును.

పుట్టుకతోనే వచ్చెడు సవామేహమునకు చికిత్సచేయుటకైన శ్రేష్ఠమైన సమయము బిడ్డపుట్టకముందే. ఈ కారణమునుబట్టియే తల్లులు కాబోవువారి రక్తమును వైద్యశాలలో వరుసక్రమము ననుసరించి పరీక్షించుచుందురు. సవామేహవ్యాధియున్న స్త్రీ, పైకి అంతయు బాగున్నట్టు కనబడినను ప్రతిసారి గర్భముతో నున్నంతకాలము చికిత్స పొందుచుండవలెను. ఇట్లు చికిత్స పొందినయెడల, నూటికి తొంబైపాళ్లు (90%) సవామేహరహితమైన బిడ్డలు పుట్టుదురు. అట్లు కానిపక్షమున, గర్భస్రావములు, పుట్టకముందే చనిపోవు బిడ్డలసంఖ్య, సవామేహవ్యాధితో పుట్టెడు బిడ్డలసంఖ్య అధికముగనుండును.

అనేకమంది తల్లులును, స్త్రీపురుషులును ఈ వ్యాధి లక్షణములు తమలో పనిచేయుటలేదని చికిత్స పొందుటకు ఇష్టములేక యుందురు. చికిత్స పొందుటయొక్క ప్రాముఖ్యత రోగలక్షణములను పోగొట్టుటయందు లేదుగాని, యీ వ్యాధి వ్యాపించకుండ చేయుటయందు గలదు అను ముఖ్యమైన సంగతిని ప్రజలు గ్రహించునంతవరకు ఈ భయంకరమైన వ్యాధి వ్యాపించకుండ ఆపుటకు తృప్తికరమైన మార్గము ఇంకొకటిలేదు.

[3]రోగమును నిర్ణయించుట: — రోగినిగూర్చిన చరిత్ర, దేహపరీక్ష, రక్తపరీక్షలు—వీని నాధారముచేసికొని వైద్యుడు వ్యాధిని నిర్ణయించును. రక్తపరీక్షలు అనేక మున్నవిగాని, తెలిసినంతమట్టుకు వాసర్‌మన్, ఖాన్ పరీక్షలు శ్రేష్ఠమైనవి. కేంద్ర నాడీమండలమునకు సవామేహవ్యాధి

[1] Interstitial keratitis. [2] Hutchinson's teeth. Diagnosis.



తగిలినట్టు అనుమానముండినయెడల, వెన్నుబామునుండి తీసిన ద్రవమును పరీక్షింతురు.

చికిత్సయు, పరిచర్యయు:—వ్యాధియున్న దశనుబట్టి చికిత్సచేయుట భేదించుచుండును. ఈ సవామేహమునకు ఇచ్చెడు మందులలోని ముఖ్యమైన దినుసులేవనగా:—

1. [1]ఆర్సెనిక్ (పాషాణము) [2]సాల్వర్సన్, [3]నియోసాల్వర్సన్, [4]ఆర్స్‌ఫెనమిన్ మొదలైనవి.
2. బిస్మత్.
3. మెర్క్యూరి (పాదరసము)
4. పొటాసియం అయొడైడ్.

ఇవన్నియు అపాయకరమైన మందులుగాన బహుజాగ్రత్తగ నియ్యవలెను. ఇంజెక్షన్ మూలమున నిచ్చినప్పుడు మందులు ఎక్కువ బలము గలిగి పనిచేయును. సవామేహమునకు తగిన చికిత్సచేయుటకు అనేక మాసములు పట్టును. బిస్మత్, మెర్క్యూరి (పాదరసము)—వీనితోచేసిన ఇంజెక్షన్లను దినములో ఏ గంటయందైనను ఇయ్యవచ్చును. దీనికిగాను రోగిని ప్రత్యేకముగ సిద్ధముచేయ నవసరమేమియులేదు. ఇంజెక్షన్ నియ్యబోవు స్థలమునుమాత్రము స్పిరిట్ (సారాయము)తో రుద్ది శుభ్రముచేసిన చాలును. కాని, ఆర్సెనిక్‌తోచేసిన ఏదేని మందుగల ఇంజెక్షన్ నియ్యుటకు ముందు, రోగి ఆహారము తినకుండ చూడవలెను. ఇంజెక్షన్ చేసిన తరువాత ఏదైన తేలికయైన ఆహారమును పుచ్చుకొనవచ్చును. సూది మందిచ్చిన వెంటనే కనీసము అర్ధగంట సేపైనను రోగి పండుకొనుట మంచిది.

ఆర్సెనిక్ (పాషాణము)తో సిద్ధముచేసి సాధారణముగా ఉపయోగించెడు మందు, నియోఆర్స్‌ఫెనమిన్ అనునది. దీనిని సాధారణముగా చేతి రక్తనాళములలోనికి నెక్కింతురు. ఈ మందొక గొట్టములో నుండును. ఈ గొట్టమును ఆంటిసెప్టిక్ మందులో మొదట ముంచి, స్టెరల్ నీటిలో కడిగి, ఆరనిచ్చిన పిదప తెరిచెదరు. వైద్యుడు గొట్టమును స్టెరల్ రంపముతో కోసి, స్టెరల్ గాజుపాత్రలో పోయును. ఈ పాత్రలో 5—10 cc. ల స్టెరల్ చేసినట్టియు, క్రొత్తగ బట్టీ పెట్టినట్టియు నీరుండును. పాత్రలోని మందును స్టెరల్ సిరింజిలోనికి తీసికొనుచుండగా, సూది గ్రుచ్చబోవు

[1] Arsenic. [2] Salvarsan. [3] Neosalvarsan. [4] Arsphenamine.

నాళము కనబడునట్లు నర్సు రోగిచేతికి టూర్నికెట్‌ను గట్టి, ఆ భాగమును ఏదైన ఆంటిసెప్టిక్ సొల్యూషనుతో శుభ్రముచేయును. ఇప్పుడు వైద్యుడు మందును నిదానముగ ఎక్కించును.

బిస్మత్‌తో సిద్ధముచేసిన ఇంజెక్షనులను కండరములోనికి ఎక్కించెదరు గాన పొడుగైన సూది అవసరము. ఈ రకము ఇంజెక్షనులను సాధారణముగా [1]తుంటికండరములోని కిచ్చెదరు.

పాదరసముతోచేసిన మందులను నోటిద్వారాగాని, కండరములలోనికి ఇంజెక్షన్‌గాని ఇయ్యవచ్చును; (చర్మముమీద బాగుగపూసి రుద్దవచ్చును.) ఆఖరి పద్ధతి ననుసరించునప్పుడు నర్సు ఈ దిగువ సంగతులు జ్ఞాపకముంచుకొనవలెను: — మందును రుద్దునప్పుడు రుద్దెడుస్థలము ఒక రూపాయకంటె నెక్కువ వ్యాపించకూడదు; మందు ఒంటికి పట్టునట్లు బాగుగ రుద్దవలెను. ఆ చోటున వెండ్రుకలేమియు నుండకూడదు. ఒకేస్థలమును వరుసగా రెండుసారులు ఈ పనికొరకు వాడకూడదు. రోగి చిన్న పిల్లయైనయెడల, నర్సు గ్లవ్స్‌వేసికొని మందు రుద్దవలెను. రోగులు పెద్దవారైనయెడల, మందును తామే రుద్దుకొనవచ్చును.

ముందు జాగ్రత్తలు (హెచ్చరికలు): — సవామేహమునకు కారణమైన స్పైరోకీట్స్ అను క్రిములు వేడి తగిలినంతమాత్రాన చనిపోవునని చదివితిమిగదా. ఈ సంగతి జ్ఞాపకముంచుకొనినయెడల, వ్యాధియున్న రోగులను, స్నేహితులను, తదితరులను సాధారణరీతిగా తాకినను అపాయముండదను సంగతి మనము సులభముగా గ్రహించగలము. రోగులతో కలిసి పనిచేయునప్పుడు వారి శరీరముమీద కురుపులులేని స్థలమును తాకినను పట్టుకొనినను, మన కా వ్యాధి సాధారణముగ రాదు. కాని, రోగి యొంటిమీద దద్దున్నప్పుడు ఈ వ్యాధి మనకును రావచ్చును. ఒక్కొక్క రోగిని ముట్టుకొనినతరువాత, సబ్బుతోను, నీటితోను చేతులు కడుగుకొను అభ్యాసము చాల మంచిది. రోగి ఒంటిమీద సవామేహసంబంధమైన దద్దున్నట్లు కనబడినప్పుడు, మొదట మెతిలేటెడ్ స్పిరిట్‌తోకడిగి, తరువాత సబ్బు, నీటితో కడుగుము. చేతులమీద పగుళ్లుండెనేని, వానిగూర్చి నర్సు జాగ్రత్త గలిగియుండవలెను.

[1] Gluteal muscle.



తడిగానున్న చర్మపుభాగములను, ముఖ్యముగా, నోటిని, ఆసనమున్న ప్రాంతమును, జననేంద్రియములను తాకి పనిచేయుచుండగా మరి యెక్కువ జాగ్రత్తగలిగియుండవలెను. నర్సు చేతులకు క్రొత్తగా ఏర్పడిన గాయములుగాని, కురుపులుగాని యుండినయెడల, ఆమె గ్లవ్స్‌వేసికొని పనిచేయవలెను. నట్టిచేతులతో పనిచేసినమీదట వానిని బాగుగ కడుగుకొనినయెడల, రోగియొక్క అంటు నర్సుకు తగులుటగాని, ఆమె మూలమున ఇతరులకు వ్యాపించుటగాని అరుదు. నోటిమీద ముద్దు పెట్టుకొనుటమాత్రము మానవలెను.

ఇట్లు అంటుతగులకుండ ముందు జాగ్రత్తగలిగియుండవలెనన్న నెపము మీద, నర్సు రోగిని తాకకుండ దూరముగ నిలుచుండుటగాని, ఇట్టి రోగులు చెడ్డవారని తీర్మానించుటగాని మంచిది కాదు. క్రీస్తుకు ఇట్టివారియెడల గల శ్రద్ధనుగూర్చియు, అందరికిని సహాయము చేయవలెననెడి ఆయన మనస్సునుగూర్చియు నర్సు జ్ఞాపకముంచుకొనవలెను. నిజముగా ఈ సుఖరోగులనేకులు వారికి తెలియకుండనే, యీ వ్యాధులకు లొంగిపోదురు. అనగా ఈ వ్యాధులువచ్చుట వారి తప్పుకాదు. నర్సు ఈ తరుణమును సద్వినియోగపర్చుకొని వ్యాధిగ్రస్థులను అంతకంటె మంచి ఆత్మీయజీవితమునందు నడిపించి, వారి నైతికజీవితమును హెచ్చించగలిగినయెడల, చాల శ్రేష్ఠమైన పని చేసినదగును. రోగులయొక్క బాధను దొలగించి, వారివలన ఇతరులకు అపాయమేమియు లేనిస్థితిలో వారిని తిరిగి యింటికి పంపుటకు మన శక్తికొలది ప్రయత్నించుట వైద్యులయొక్కయు నర్సులమైన మనయొక్కయు విధ్యుక్త ధర్మమైయున్నది.

ఒక యువకుడును, యువతియు పెండ్లిచేసికొనక ముందు వైద్యునిచేత పరీక్షచేయించుకొనుట యను విషయమును ప్రోత్సహించవలెను. ఒక పురుషుడుగాని, స్త్రీగాని సవామేహ రోగముచేత బాధపడుచున్నను, తమ బిడ్డలు అట్టి వ్యాధి బాధగలవారైయుండుటకు ఇష్టపడరు. వివాహమునకు ముందు పరీక్షచేయించుకొనుటవలన కలుగులాభమును స్వయముగా చూచిన నర్సు దానినిగూర్చి మనసాక్షి పూర్వకముగ ఇతరులకు బోధించి, సవామేహవ్యాధి వ్యాపించకుండ చేయుటకు ఎక్కువ ప్రయాసపడగలదు.

**మెత్తని మేహవ్రణపుగడ్డ ([1]శాంక్రాయిడ్)**

ఇది సెగరోగము, సవామేహరోగముకంటె అసాధారణమైనది. ఇది [2]డుక్రెస్‌బసిలస్ అను క్రిమివలన కలుగుచున్నది. దీనివలన నేర్పడు పుండు సవామేహమునందు లేచు మొదటి పుండువలె నుండునుగాని, ఇది కొంచెము మెత్తగనుండును. ఇందుచేత దీనిని కొన్నిసారులు [3]మెత్తని మేహవ్రణమందురు. మొదటలేచెడు పుండు కొరుకుడు పుండ్ల వలె ఒకటిగాకాక తరుచుగ దీనియందు అనేక పుండ్లు ఒకేసారి లేచును. జననేంద్రియములమీదగాని, లేక వాని సమీపముననుండు శోషగ్రంధుల మీదగాని లేచెడు పుండుకు లేక పుండ్లకుమాత్రమే యీ వ్యాధి సంబంధించియుండును. అదృష్టవశాన, సల్ఫొనమైడ్ మందు దీనికి సంబంధించిన అనేక వ్యాధులకు తగిన యౌషధములని కనుగొనబడినది.

**గ్రాన్యులోమా ఇంగ్వినాలె**

గ్రాన్యులోమా ఇంగ్వినాలె యను వ్యాధియు, దీనికి సంబంధించిన యితర వ్యాధులును జననేంద్రియములకును వాని ప్రాంతములకును సంభవించుచుండును. గజ్జలభాగపు శోషగ్రంధులకు ఆరంభములోనే యీ వ్యాధి సంభవించును. వ్యాధి దీర్ఘకాలరకమునకు తిరిగినప్పుడు [4]జననేంద్రియములకును, పెరినియం, పురీషనాళము, గజ్జలభాగమునకు ఈ వ్యాధి వ్యాపించును. అప్పుడీ భాగమంతయు కందును. దీనితరువాత పుండ్లు లేచును. ఈ పుండ్లవెంట కనెక్టివ్‌టిష్యూ, చర్మము నేర్పరచు పాలిపాయిడ్ కండలు, ఫిషర్స్ (సందులు) ఏర్పడును. వీనివలన భగము, పురీషనాళము కొంతభాగము మూసికొనును. పురుషాంగము, వృషణములు కూడ చాలవరకు కురూపము చెందును.

అదృష్టవశాన యీ వ్యాధులు సాధారణమైనవి కాకపోయినను, వానికి చికిత్సచేయుట చాలకష్టము; చాలకాలముకూడ పట్టును. ఆంటిమని యను మందుతో సిద్ధముచేసిన ఇంజెక్షనులు అనగా [5]టార్‌టర్ ఇమెటిక్, నియోస్టిబొసన్ మొదలగు వానిని, వీనితోకూడ ఆర్సెనిక్ ఇంజెక్షనులు ఇచ్చుచు, పుండ్లున్నచోట మెర్క్యురి (పాదరసపు) పూతలు పూయుచు

[1] Chancroid. [2] Ducrey's bacillus. [3] Soft chancre. [4] Genitalia, the perineum, anal and inguinal regions. [5] Tartar emetic, neostibosan, etc.



చికిత్సచేయుచుండినయెడల, అంటును చాలవరకు తొలిగించవచ్చును. అనవసరముగ పెరిగిన టిష్యూలను తీసివేయుటకును, వికృత ఆకారముగల యంగములను సరిచేయుటకును శస్త్రచికిత్స అవసరమైయుండును. స్ట్రిక్చర్ రాకముందే సల్ఫొనమైడ్ మందులు వాడినయెడల ఫలితము కలుగును.

**సుఖరోగములను వశపరుచుకొనుట:—**

ఇతరరోగములవలెనే యీ రోగములను వశపర్చుకొనుటకుగాను, మొదట ఈ రోగములున్న సంగతిగ్రహించి, యివి యెంతవరకు వ్యాపించినవో గుర్తించవలెను. ఆస్పత్రికిగాని, డిస్పెన్సరికిగాని వచ్చెడి రోగులలో ఎక్కువమంది ఈ వ్యాధుల ఫలితమువలన ఏదో ఒకవిధముగా బాధపడుచుందురని నర్సు తన తర్ఫీతు చాలకాలము కాకముందే తెలిసికొనును. కాని వీరిలో నూటికి బహు కొద్దిమందిమాత్రమే యీ వ్యాధులకు తగిన చికిత్సపొందుచుందురు. ఈ వ్యాధులను వశపర్చుకొనుటకుగాను వ్యాధిలక్షణములు ముమ్మరముగనున్నవని తెలిసినవారిని మాత్రమే చికిత్సకొరకు వైద్యశాలకుగాని, ప్రయివేటు వైద్యుల యొద్దకుగాని తీసికొనిపోవుట చాలదు. లక్షణములు ముమ్మరముగ కనబడనివారిని, ఇటీవల తెలిపిన వ్యాధిగ్రస్థులను, వీరిలో వ్యాధిలక్షణములు కనబడకపోయినను, కనుగొని చికిత్సచేయవలెను. కొన్నిదేశములలో దొరతనమువారును, పబ్లిక్ హెల్త్ ఉద్యోగస్థులును, ఇండ్లనుదర్శించెడు పబ్లిక్ హెల్త్ నర్సులును, వైద్య, నర్సింగ్ ఉద్యోగములలో చేరిన వారందరును, ఏకీభవించి పనిచేయుటవలన, ఈ వ్యాధులను లోబరుచుకొని నిర్మూలము చేయుటలో నెక్కువ జయము పొందియున్నారు. బీదల రక్తమును ఉచితముగా పరీక్షించుటకును, అవసరమైనప్పుడు ఉచితముగా ఇంజెక్షనులు చేయుటకును తగిన సదుపాయములుండవలెను. ఈ దేశములో నిప్పటివరకు అందరు ఏకీభవించి పనిచేసినట్టు లేకపోయినను, కొన్ని ప్రాంతములలో మంచి పనిచేయుచున్నారు. రోగములను నిర్ణయించి, రోగులకు చికిత్స చేయుటయే చాలదు. సుఖవ్యాధులు ఎంత చెడ్డవియో వానివలన కలుగు కీడు ఎట్టిదో జనులు గ్రహించునట్లు వారికీ విషయములనుగూర్చి తగిన బోధచేసి, విషయపరిజ్ఞానము కలిగించవలెను.

జనులకు ఈ విషయమునుగూర్చి నేర్పు ఉద్యమములో ప్రతి నర్సు పాల్గొనగలదు. మొదట ఆమె లేక ఆయన సంగతులు తానే గ్రహించి

నేర్చుకొని, కరపత్రముల మూలమునను, చార్టుల మూలమునను, స్వయముగా స్నేహితులతోను ఇతరులతోను మాట్లాడుట మూలమునను నేర్చుకొనిన సంగతులను తెలియజేయగలరు. ఇట్లు నేర్పుపొందువారి సంఖ్య దినదినాభివృద్ధి కాగలదు.

## అధ్యాయము 25

# చర్మవ్యాధులు

చర్మముమీద లేచెడు పుండ్లు పలువిధములుగ నుండును. వీనిలో ముఖ్యమైన రకము లేవనగా:—

[1]మచ్చలు: చర్మములో కొద్దిగా రంగుమారి మచ్చలు ఏర్పడును. సాధారణముగ ఈ మచ్చలు ఎఱ్ఱగనుండునుగాని చర్మముమీదికి పొంగియుండవు. దృష్టాం॥ దద్దు,

[2]గుల్లలు: ఇవి కొద్దిగా రంగుమారి మొటిమలవలె చర్మముమీదికి లేచియుండును.

[3]వీల్స్ (పొడలు): ఇవి చర్మముమీద పొంగిన పొడలు. ఇవి సాధారణముగా అక్కడక్కడ పొడలుగాగాని, గీతలుగాగాని కన్పించును. దీనికి మంచి యుదాహరణము. [4]పైత్యపుదద్దు.

[5]నీటితోకూడిన గుల్లలు: ఇవి పొంగి నీరు చేరియుండును. ఆట్లమ్మ బొబ్బవలె వీనిలోని పెద్దబొబ్బను ఇంగ్లీషులో [6]బుల్ల అందురు.

[7]చీము బొబ్బలు: మశూచిబొబ్బలవలె వీనిలో చీము చేరియుండును.

[8]పొలుసులు: ఇవి యెండిన చర్మపు పొలుసులు.

[9]పక్కులు: రక్తము, రసి, చీముతోనిండిన పక్కులు.

### చర్మవ్యాధులకు చికిత్సచేయునప్పుడు గమనించవలసిన సామాన్యసంగతులు

చర్మవ్యాధులుగలవారు ఎక్కువ విసుగు గలిగియుండురుగాన వారికి బహు నెమ్మదిగను, ఉపాయముతోను ఉపచారముచేయవలెను. మందు పూయకముందు పక్కులన్నిటిని, పొలుసులన్నిటిని తీసివేయుట చాల

[1] Macules. [2] Papules. [3] Wheals. [4] Urticaria. [5] Vesicles. [6] Bulla. [7] Pustules. [8] Scales. [9] Crusts.



ప్రాముఖ్యమైన సంగతి. వేడి బోరిక్‌నీటితో స్నానముచేయించుట మూలమునగాని, నూనెపూసిన గాజ్‌గుడ్డలను వేయుటవలనగాని, పిండికట్లు కట్టుట మూలమునగాని పై పనిని చేయవచ్చును.

కంది మంటపుట్టుచున్న కురుపులను చల్లనిమందులతో కడుగవలెను. ఇట్టి పుండ్లకు అంజనములను పూయకూడదు. ఎందుకనగా, వానిలోని క్రొవ్వుపదార్థముల మూలమున పుండ్లు ఆరిపోవుటకు వీలులేక, చర్మముమీద జిల అధికముగాపుట్టి, ముందున్నస్థితికంటె ఎక్కువబాధను గలిగించును. ఇట్టి యనేకపుండ్లకు చూర్ణములనుగాని పేస్టులను (బంకవంటి మందులను) గాని పూయుదురు. వైద్యుడు ఉత్తరువిచ్చిననేతప్ప, పుండ్లను కడుగుటకు నీళ్లు వాడకూడదు. ఎందుకనగా, సాధారణముగ నీటివలన మంటయు, జిలయుపుట్టును. ద్రవములను రోగికి జాస్తిగ త్రాగనిచ్చి, మలమూత్రములు సరిగా విడుచునట్లు చూడవలెను. అధికముగ సంభారములను వేసిన ఆహారములను మానివేసి, ఏవైన ఆహారములవలన రోగికి ప్రతికారము కలిగినట్టు కనబడినయెడల, ఆ సంగతి వ్రాసిపెట్టవలెను.

కర్పాణి. — దీనివలన చర్మముకంది వాయునుగాని, యిది అంటులేని వ్యాధి. సాధారణముగా చేతులకును, ముఖమునకును ఈ వ్యాధి కలుగును. చిన్నపిల్లలకు మామూలుగా ఈ రోగము దేహమంతట వచ్చుచుండును. కొన్ని ప్రేరేపణకరమైన కార్యములకు రోగి చర్మము అధికతీవ్రముగ లొంగిపోవునట్టి యింద్రియజ్ఞానము గలిగి యుండును. అనగా, జీర్ణవ్యాపార తొందరలు, తెరిపిలేకుండ సూర్యునివెలుగు తగులుట, గాలితగులుట, పిండి, చెక్కెరలవంటి పదార్థములను చేతులతో పట్టుకొనుట, భావోద్రేకములు—వీనికి రోగిచర్మము చలించును.

కర్పాణి అకస్మాత్తుగకాని, క్రమేణకాని ఆరంభము కావచ్చును. మొదట చర్మము ఎఱ్ఱగకంది, మంట, జిల పుట్టును. కొంతకాలమునకు నీటితో నిండిన గుల్లలు పుట్టును. ఇవి పగిలినప్పుడు ఒకవిధమైన రసి కారి, యెండి పక్కులుకట్టును. ఈ పక్కులయంచులలో నీటితో నిండిన క్రొత్త గుల్లలు పుట్టుచుండును. ఇట్లు ఈ వ్యాధి కొన్ని వారములు లేక మాసములుండును; ఇది తిరిగివచ్చెడు సూచనలుగూడ కనబడుచుండును.

**చికిత్సయు, పరిచర్యయు:**—కందుటకు కారణము తెలిసిన, దానిని తొలగించుము. పథ్యము, మలవిసర్జనముల విషయము గమనించుము. శుభ్రము చేయుటకు నూనెలు, గాజుగుడ్డ నుపయోగించుము. శుభ్రము చేసిన పిదప నెమ్మదియు హాయియు పుట్టించునట్టి జింక్ లేక బోరిక్ అంజనములనుగాని, [1]కాలమైన్ లేక బోరిక్ లోషన్‌లుగాని వాడుము. జిలయు, మంటయు ముమ్మరముగా నున్నప్పుడు శాంతినిచ్చెడు మందులియ్యవలెను. చిన్నపిల్లలకు దేహమంతట నున్న కర్పాణికి [2]టార్ అంజనము మంచి ఫలితమునిచ్చును. బిడ్డలు పలుమారు గీరుకొనకుండ, చేతులుకట్టి యుంచవలెను.

[3]**హెర్‌పిస్ సింప్లెక్స్** (చలి లేక నంజుపుండు).—ఇది జ్వరము, జాతీయ తొందరలతో సంబంధించిన నీటిగుల్ల. ఇది పలుమారు పెదవుల మీదగాని, ముక్కుమీదగాని లేచును. మొదట మంటయు, గుచ్చినట్టు నొప్పియుపుట్టి, ఒకటిగాని, ఒక గుంపు నీటిగుల్లలుగాని పుట్టును. ఇవి కొన్నాళ్లైనతరువాత యెండి పక్కులుకట్టును.

**చికిత్సయు, పరిచర్యయు:**—[4]స్పిరిట్స్ ఆఫ్ కాంఫర్ లేక ఆల్కహాల్ పూయుము.

[5]**హెర్‌పిస్ జోస్టర్** (అగ్గిచప్పి).—ఈ వ్యాధివలన ఒక జ్ఞాననాడి ముడి కందును. ఇక ఈ నాడి వ్యాపించిన పొడుగున బొబ్బలుపుట్టును.

బొబ్బ పుట్టకముందు, వ్యాధియున్న భాగమున ఎక్కువ ముమ్మరమైన నరములవ్యాధి పుట్టవచ్చును. ఈ వ్యాధి ఒకేపక్షమున నుండును. శరీరముయొక్క మధ్యగీతను ఈ వ్యాధి దాటిపోవుట అరుదు. మొదట చర్మముకంది యెఱ్ఱగనగును. తరువాత గుల్లలును, బొబ్బలును పుట్టును. ఇవి కొన్నిదినములలో యెండిపోవునుగాని మరల తెరలుతెరలుగా బొబ్బలు పుట్టి వ్యాధి 3 మొదలు 6 వారము లుండుటకు కారణమగును.

**చికిత్సయు, పరిచర్యయు:**—వ్యాధి ముమ్మరముగ నున్నవారిని పడకలోనే పరుండబెట్టవలెను. కొలోడియన్ అను మందుతో బొబ్బలమీద పూతపూయవచ్చును. అవి పగిలినయెడల, [6]జింకాక్సైడ్ అంజనము పూయవచ్చును. నొప్పి అధికముగ నున్నప్పుడు శాంతి నిచ్చెడుమందు లియ్యవచ్చును. [7]అడ్రెనలిన్ ఇంజెక్షను లిచ్చినట్లయిన తరుచుగా బాధతగ్గును.

---

[1] Calamine. [2] Tar. [3] Herpes simplex (cold sore).
[4] Spirits of camphor. [5] Herpes zoster. [6] Zinc oxide. [7] Adrenalin.



**చెమటగుల్లలు** (ప్రేలుట).—ఇది యెండాకాలమున వచ్చు వ్యాధి. చెమటగొట్టములలో ఏదో అడ్డుపడుటవలన నీ వ్యాధి కలుగును. ఎక్కువ చెమట పోయునప్పుడే యీ గుల్లలు మొటిమలవలె లేచును. ఈ గుల్లలు లేచినప్పుడు సాధారణముగా అధిక జిల, మంటపుట్టును. వీనికి తాళ జాలక గీరినప్పుడు క్రొత్త అంటుకలుగును.

**చికిత్సయు, పరిచర్యయు:**—దుస్తులు తేలికగాను, వదులుగాను ధరించుకొనుము. స్నానమైన తరువాత కాలమైన్‌లోషన్ పూయుము; లేదా, బోరిక్ ఆసిడ్ జింకాక్సైడ్, పిండి—యివి సమానభాగములుగ చేర్చిన చూర్ణము పూయుము. అప్పుడు శాంతికలుగును.

**ఒరుపు పిరుదులు.**—మలములో పులుసు చేరియుండుటవలనను, మూత్రములో అమోనియ (నవాసార సంబంధమైన) పదార్థములు చేరియుండుట వలనను, బిడ్డ క్రిందిభాగము చాలకాలము తడిసియుండనిచ్చుటవలనను ఈ యవస్థ యేర్పడును.

పిరుదులు కంది చిన్న బొబ్బలు పుట్టును. బిడ్డ మలమూత్రాదులు విడిచినతరువాత శుభ్రముచేయక చాలకాలమట్లే తడిగా నుండనియ్యక, నూనెపూసి, పిరుదులను శుభ్రము చేయుచుండినయెడల, ఈ వ్యాధి రాకుండ చేయవచ్చును. పిరుదులు కందినప్పుడు జింకాక్సైడ్ లేక ఆముదపుటాంజనము పూయుము. లేదా, బాగుగ గాలితగులనిమ్ము. 1-5000 ఘాటుగల మెర్క్యురీ బైక్లోరైడ్‌లోగాని, సాచురేటెడ్ బోరిక్ సొలూషనులోగాని పిండి, ఆరబెట్టిన [1]నప్కినులు కట్టుటవలన మేలు కలుగును.

[2]**పైత్యపుదద్దురు.**—దీనినే హైవ్స్ అని ఇంగ్లీషులో చెప్పుదురు. ఇది చర్మమునందలి నరములకు కలిగెడు దురవస్థ. ఎరుపు, తెలుపు గలిసిన బొటిమకట్టుటగాని లేక ఎఱ్ఱని [3]గుల్లలు లేచుటగాని దీనిలక్షణము. ఇది ఏదైన ఒక చోటగాని, చర్మమంతట మచ్చలు మచ్చలుగాగాని కనబడవచ్చును. అప్పుడు అధికమైన మంటయుండును. వ్యాధియున్న భాగములలో కుట్టినట్టును గులగుల మన్నట్టు నుండును. రోగికి గిట్టనట్టి కొన్ని యాహారములు, మందులు, మొక్కలు, తినుటవలనను, కీటకములు కరచుట మొదలగు వానివలనను ఈ యవస్థకలుగును.

---

[1] Napkins. [2] Urticaria. [3] Wheals.

చికిత్సయు, పరిచర్యయు:—దీనికి తెలిసిన కారణములను దొలగించుము. వ్యాధివచ్చినప్పుడు ఇంజెక్షనుల మూలమున అడ్రెనలిన్ మందునిమ్ము. కాలమైన్ లోషన్, సోడియం బైకార్బొనేట్ స్నానములు సహాయపడును. మలమూత్రాదులు బాగుగ విడుచునట్లు చూడుము.

గడ్డలు, రాచపుండ్లు 26 అధ్యాయము చూడుము.

[1]ఇంపెటైగో కంటేజియోస.—ఇది స్ట్రెప్టోకాకస్ లేక స్టాఫిలకాకస్ అను క్రిములమూలమున బుట్టునట్టి చర్మసంబంధమైన అంటువ్యాధి. చర్మములోని పగుళ్లలో అంటుచేరియుండును. అంటుచేరిన రోగిని తాకుట వలనగాని, అతడు వాడుటచేత అంటుపడిన వస్తువులను తాకుటవలనగాని అంటు ఇతరులకు తగులును. ఈ వ్యాధి ఇంక్యుబేషన్ కాలము 2 నుండి 5 దినములు. పుండ్లన్నియు మానువరకు అంటుతగిలెడు అపాయముండును.

గాలితగిలెడు ముఖముయొక్కయు చేతులయొక్కయు భాగములకు బొబ్బలు పుట్టును. ఇవి త్వరలో చీము పుండ్లగును, పసుపు పచ్చని పక్కులు కట్టును. ఈ పక్కులు పైననే కట్టియుండుటవలన అవి కొన్ని దినములలో రాలిపోగా, చర్మముమీద మచ్చలేర్పడును.

చికిత్సయు, పరిచర్యయు:—సల్ఫడైయజీన్ ఇమ్ము. పక్కులను మెత్తనచేసి తరువాత వానిని ఊడదీయుము. పుండ్లకు [2]నవాసార పాదరసములతో చేసిన అంజనము పూయుము. [3]బొబ్బలను చిదిపి పై అంజనమే పూయవచ్చును. ఈ గుల్లలకు 3% సల్ఫోతయోజోల్ అంజనము ఒక్కసారే పూసినందువలన మానిపోవచ్చును. రోగి మొత్తముమీద శుద్ధిగ నుండునట్లు చూడవలెను.

నివారణము:—వైద్యశాలలోగాని, పాఠశాలలోగానియైన యెడల, బిడ్డను ప్రత్యేకించవలెను. సల్ఫోనమైడ్ మందులను ఆరంభములోనే వాడవలెను.

[4]పెంఫిగస్ కంటేజియొసస్.—ఇది యుష్ణదేశములలో ప్రబలెడు అతితీవ్రమైన అంటు చర్మవ్యాధి. స్ట్రెప్టోకాకస్ లేక స్టాఫిలకాకస్ అను

[1] Impetigo contagiosa. [2] Ammoniated mercury ointment.
[3] Blebs. [4] Pemphigus contagiosus.



క్రిములు దీనికి కారణమైనట్లు వైద్యుల అభిప్రాయము. ఇది పాఠశాలలో మామూలుగా అగుపడుచుండును. కొన్నిసార్లు [1]ఎపిడెమిక్‌గ వైద్యశాలయందలి [2]శిశుశాలలకును వ్యాపించును. పెద్దవారికికూడ కలుగవచ్చును.

లక్షణములు:—ఈ వ్యాధి ఇంపెటైగో కంటేజియోసను చాలవరకు పోలియుండును. మొదట యిది యెఱ్ఱని చిన్న మచ్చలుగా ఆరంభమై త్వరలో పెద్ద బొబ్బలుగ మారును. కాని యీ బొబ్బల చుట్టు మాత్రము కందదు. మూడుదినములైన తరువాత బొబ్బలు మష్టుతో నిండినట్లు కనబడును. ఈ బొబ్బలమీది తోలుపొర సన్నముగనుండి గీరినప్పుడుగాని, రుద్దినప్పుడుగాని చితికిపోవును. ఇట్లు చితికిపోయిన బొబ్బలు ఎఱ్ఱగ నిగనిగలాడుచున్నట్టి పుండ్లగును. తరువాత యీ పుండ్లు పొలుసులుగ మారును. బొబ్బలు పగిలినను, అంచులయొద్ద క్రొత్తవి లేచును. ముఖము, చేతులు, చంకలు, గజ్జలు, మొదలగు అవయవములకు సాధారణముగ వచ్చును. బిడ్డలకు దేహమంతటను లేవవచ్చును.

చికిత్సయు, పరిచర్యయు:—సల్ఫడైయజీన్ మందు లోపలికిచ్చి, వ్యాధియున్న భాగములను 1—2000 ఘాటుగల బైక్లోరైడ్ లోషన్‌తోగాని, పొటాసియం పర్మాంగనేట్ సొల్యూషన్‌తోగాని కడుగుము. ఇప్పుడు బొబ్బలను చిదిపి, [3]నవాసార, పాదరసపు అంజనము పూయుము. లేదా, పిండి, బోరిక్ చూర్ణము, జింకాక్సైడ్ అను మూడును సమభాగములుగ చేర్చిన చూర్ణము కొట్టుము. వైద్యశాలలో నిట్టి రోగులను ప్రత్యేకించి, అంటుపడిన వస్తువు లన్నిటిని డిస్‌యిన్‌ఫెక్ట్ చేయుము.

[4]గజ్జి:—ఇది చర్మసంబంధమైన అంటువ్యాధి. ఇది యున్నప్పుడు అధిక జిలపుట్టును. చర్మముక్రింద రంధ్రములు పడును. ఇది [5]ఆకరస్ స్కేబిఐ అను [6]జంతుపరాశయ క్రిమివలస కలుగుచున్నది. గర్భము ధరించిన ఆడుపురుగు చర్మముక్రింద రంధ్రముచేసికొని దినమునకు ఒకటి రెండు చొప్పున, మొత్తము 50 గ్రుడ్లవరకు పెట్టుచుండును. వీనిని మూడుదినములలో పొదిగి పిల్లలు చేయును. ఈ పిల్లలు మూడు వారములలో పెద్దవై చర్మము పైభాగమునకు ప్రాకివచ్చి, గర్భముతోనిండి,

[1] Epidemic. [2] Nurseries. [3] Ammoniated mercury ointment.
[4] Scabies (itch). [5] Acarus scabiei. [6] Animal parasite.

క్రొత్త రంధ్రములు చేయును. వ్రేలిప్రక్కలు, మణికట్టు ముందుభాగము, పిరుదులు, జననేంద్రియములు, చంకలు, గజ్జలు, నడుము—ఇవి వీనికి అనుకూలమైన తావులు. క్రిములు రంధ్రములు చేయుటవలనను గ్రుడ్లుపెట్టుటవలనను మలవిసర్జనము చేయుటవలనను మంటపుట్టి, అధిక జిల కలుగజేయును. గీరుట వలన అంటుచేరి బొబ్బలు, కురుపులు, పక్కులు ఏర్పడును.

**చికిత్సయు, పరిచర్యయు:**—మొదట బాగుగ సబ్బు, ఉడుకునీటితో స్నానము చేయుము. రంధ్రములు బాగుగ తెరుచుకొనులాగున పుండ్లున్న భాగమును బ్రష్‌తోగాని, టెంకాయ పీచుతోగాని రుద్ది కడుగుము. పిమ్మట గంధకపు టంజనము పూసి శుభ్రమైన గుడ్డలు వేయుము. ఇట్లు 3 దినములు వరుసగ చేయుము. చీము కూడితే, మరియొకరీతిగా చికిత్సచేయవలసి వచ్చును.

**నివారణము:**—ఒకడు శుభ్రతనుగూర్చిన సాధారణ నియమములను గమనించినయెడల వానికి సాధారణముగ గజ్జి పట్టదు. రోగిని ప్రత్యేకించవలసినంత అవసరమేమియులేదు. కాని అంటుపడిన పరికరములన్నిటిని డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవలెను. మరల ఈ గజ్జి రాకుండ, రోగిగుడ్డలను బాగుగ పొంగించి ఉదుకవలెను.

**పేలు (పెడిక్యులోసిస్):** — పేలు కుట్టుటవలన రోగము వచ్చుటయేకాక, [1]కాటకజ్వరమును [2]టైఫస్‌జ్వరమును ఇతర రోగములనుగూడ ఇవి వ్యాపింపచేయును. మూడువిధములైన పేలు దేహముమీద నుండును. ఏవనగా (1) తలమీద (2) దేహముమీద (3) పొత్తికడుపు క్రింది వెండ్రుకలలో నుండునవి. ఒక్కొక్క రకము—అవి ఆక్రమించు స్థలమునుబట్టి పేర్కొనబడినవి.

**తలలోని పేను.**—బూడిదెరంగుగల చిన్నజీవి. తల వెండ్రుకలలో జీవించును. ఇది దాదాపు 50 గ్రుడ్లుపెట్టును. ఈ గ్రుడ్లను 'ఈపి' అందుము. ఇవి పుఱ్ఱెకు సమీపముననున్న వెండ్రుకభాగములకు గరచుకొనియుండును. ఈ గ్రుడ్లు ఒక్కవారములో పిల్లలగును. ఈ పిల్ల

[1] Relapsing fever. [2] Typhus.



పేలు కుట్టుటవలన తీవ్రమైన జిలపుట్టును. గీరుటవలన పుఱ్ఱెకు అంటు కలుగును. దీనినిబట్టి మెడగ్రంధులు వాయును.

**చికిత్సయు, పరిచర్యయు:**—రాత్రికాలములో తలవెండ్రుకలకు కిరొసినాయిలు లేక 1—2000 ఘాటుగల బైక్లోరైడ్ లోషను బాగుగపూసి, వెండ్రుకలు నానునట్లు ఒక తువాలులో చుట్టిపెట్టుము. ఉదయముననే సబ్బుతోను, నీటితోను వెండ్రుకలను బాగుగ పులుముము. డైల్యూట్ అసిటిక్ ఆసిడ్‌గాని, వినిగర్ (కాడి)గాని పూసి యీపి యూడిపోవునట్లు చేయుము. అటుతరువాత సన్నని పండ్లుగల దువ్వెనతో పేలన్నియు దువ్వివేయును. పైరీత్రమ్ ములామును పుఱ్ఱెకును వెండ్రుకలకును పట్టించినయెడల, అది పేలను ఈపిని త్వరగా చంపును.

**దేహముమీది పేను (చీరపోతు)**—ఇది తలలోని పేనుకంటె పెద్దది. పోషణకరమైన ఆహారము పుచ్చుకొనునప్పుడు మాత్రమే యిది దేహముమీద కనబడును. సాధారణముగా లోపలవేసికొను గుడ్డ మడతలలో ఇవి చేరియుండును. అక్కడ ఇవి గ్రుడ్లుపెట్టును.

**చికిత్సయు, పరిచర్యయు:**—పడకగుడ్డలు, ఒంటిమీది గుడ్డలను బాగుగ ఉడికించి యుతుకవలెను. రోగికి 1—2000 ఘాటుగల బైక్లోరైడ్‌లోషన్‌తో స్నానముచేయించి పేలుకుట్టినచోట్లకు ములాము పట్టించవలెను.

**పొత్తికడుపు క్రింది వెండ్రుకలలోని పేను.**—ఇది పై రెంటికంటె చిన్నది. ఇదియు బూడిదెరంగు గలిగిన జీవియే. దీనికి పక్షిగోళ్లువంటి గోళ్లుగల కాళ్లు 8 గలవు. ఈ కాళ్లతో [1]శష్పములను కరుచుకొని, వెండ్రుకపాదిలో తన తలదూర్చును. ఒక్కొక్కప్పుడు ఈ రకము పేలు కనుబొమ్మలు లేక రెప్పలమీదను కనబడవచ్చును.

**చికిత్సయు, పరిచర్యయు:**—పేలున్నభాగముమీది వెండ్రుకలు గొరిగివేయుము. తరువాత ఆ భాగమునకు పాదరసపుటంజనము పూయుము. లేదా 1—2000 ఘాటుగల బైక్లోరైడ్ లోషనుతో ఆ భాగములను గడిగి, రోగి గుడ్డలను డిస్‌యిన్‌ఫెక్ట్ చేయవలెను.

**తామరగజ్జి.** ఇది వెండ్రుకలున్న స్థలమునకును గడ్డపు చర్మమునకును వచ్చు అంటువ్యాధి. ఇది ఫంగస్ (ఉద్భిజ) జాతికిచేరిన క్రిమి

[1] Pubes.

# INDEX

# అకారాది సూచిక

## అ



## ఆ



## ఇ



## ఈ



## ఉ, ఊ



## ఎ, ఏ, ఐ

ఒ, ఓ, ఔ



క



గ



చ, చే, జ



ట



డ



త

3549

